# శ్రీ మలయాళ సద్గురు గ్రంథావలి

## నాలుగవ సంపుటము

# శ్రీ ధర్మసేతువు

ప్రకాశకులు :

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవ సంఘము

శ్రీవ్యాసాశ్రమము

చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్

2001

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం ప్రచురిస్తున్న ఆధ్యాత్మిక గ్రంథాలు పాఠకలోకానికి సుపరిచితాలే. ఈ గ్రంథాలను భక్తులు మిక్కిలి శ్రద్ధతో పఠిస్తున్నారు. ఆధ్యాత్మిక సారస్వత ప్రచారం ద్వారా సాటి లేని సేవ చేసే సంస్థగా ఆశ్రమం ప్రసిద్ధి వహించింది.

మహర్షి - సద్గురు శ్రీ మలయాళస్వాములవారు స్వయంగా రచించిన గ్రంథాలు ఆశ్రమప్రచురణలలో అత్యంత విశిష్టమైనవి. అవి పలు సార్లు ముద్రణ పొంది అనన్య సామాన్యమైన ప్రచారం పొందాయి. జిజ్ఞాసు జనానీకంలో జడత్వాన్ని తొలగించి చైతన్యం కల్గించడంలో విజయం సాధించాయి.

శ్రీవారి రచనలు ప్రస్తుతం వివిధ పరిమాణాలలో నానాగ్రంథాలుగా ముద్రింపబడివున్నాయి. వీటినన్నింటిని ఒకే పరిమాణం కల గ్రంథ రాశిగా ''శ్రీమలయాళసద్గురు గ్రంథావళి'' అన్న పేరుతో ముద్రించడం మంచిదని అభిజ్ఞులు సూచించారు. ఈ సూచనను పూజ్యశ్రీ విద్యానందగిరి స్వాములవారు ఆమోదించారు.

శ్రీవారు గోగర్భములో తపస్సు చేసే సమయం 1919లో రచించిన శుష్కవేదాంత తమోభాస్కరం ఇందులో మొదటి సంపుటమవుతుంది. ఇంచుమించు ఆగ్రంథాన్ని పోలిన పరిమాణంలోనే తక్కిన సంపుటా

లుంటాయి. ఇలా ప్రచురిస్తే ఒక్కొక్కటీ సుమారు నాలుగువందల పుటలు గల సంపుటాలు ఇరువదికి పైగా సిద్ధమవుతాయి.

2001వ సంవత్సరంలో జరుగనున్న శ్రీవ్యాసాశ్రమవజ్రోత్సవ శుభసందర్భంలో పై సంపుటాలను విడుదల చేయాలని శ్రీస్వాములవారి సమ్మతితో వజ్రోత్సవ నిర్వాహక సంఘం వారు నిర్ణయించారు. ఈ సంపుటాల క్రోడీకరణ, ముద్రణ **శ్రీ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంపాదకత్వం క్రింద జరుగుతున్నది.

భగవదనుగ్రహంతో, శ్రీసద్గురుదేవుల ఆశీర్వాదంతో, భక్తుల ప్రోత్సాహంతో ఈ గ్రంథ ప్రచురణ ప్రణాళిక విజయవంతం కాగలదని ఆశిస్తున్నాము.

శ్రీ వ్యాసాశ్రమం

ప్రకాశకులు





# తొలిపలుకు

శ్రీ మలయాళ సద్గురు గ్రంథావళిలో ఇది నాలుగవ సంపుటం.

'శ్రీధర్మసేతువు' అన్న పేరుతో పూర్వం ముద్రింపబడిన గ్రంథమే ఈ సంపుటంగా రూపొందింది. 'శుష్క వేదాంత తమో భాస్కరం', 'స్వబోధ సుధాకరం' మరియు 'ఓంకార' మనే గ్రంథాలు ప్రథమ, ద్వితీయ, తృతీయ సంపుటాలుగా వెలువడ్డాయి.

1933 నుండి 1937 వరకు 'యధార్థ భారతి' మాసపత్రికలో వెలువడిన శ్రీ సద్గురు దేవుల వ్యాసావళి 1937లో 'శ్రీ ధర్మసేతువు' అన్న పేరుతో తొలి సారిగా ప్రకటించ బడింది. తదుపరి పలుసార్లు ముద్రణ పొందింది. మొదట ఈ గ్రంథములో 'భావశుద్ధియే జ్ఞానసిద్ధి' అన్న శ్రీవారి రచన కూడా అంతర్భాగంగా వుండేది. 1976లో శ్రీ వ్యాసాశ్రమ స్వర్ణోత్సవాల సందర్భంలో ఆ భాగం అందలి ప్రాముఖ్యం కారణంగా విడి పుస్తకంగా ప్రచురింపబడింది. ఇప్పుడు ఈ గ్రంథావళి ప్రణాళికలో దానిని 'ప్రశ్నోత్తర మాణిక్యమాల'తో కలిపి అయిదవ సంపుటంలో క్రోడీకరించడమైనది.

శ్రీ సద్గురు స్వాముల వారి రచనలను 20 సంపుటాలుగా క్రోడీకరించడంలో అనుసరించిన విధానం, ఇతరాంశాలు చివరిదైన 20వ సంపుటం తొలిపలుకులో నిర్దేశించడం జరుగుతుంది.

ఈ సంపుటంలో 'ఆత్మయొక్క అనంతత్వము', 'గృహస్థ సన్న్యాసాశ్రమాల భేదం', 'బీజాంకుర న్యాయం' మొదలైన పలు ఆధ్యాత్మిక అంశాలు విస్తృతంగా వివరించబడ్డాయి. 'పునర్వివాహసమస్య'ను ఇందులో చర్చించి శ్రీ గురుదేవులు పరిష్కార మార్గం చూపారు. శ్రీవారి సంఘ సంస్కరణ విధానం ఇందులో చక్కగా ప్రస్ఫుటమైనది.

'గురువు అవసరమా - అనవసరమా' అన్న శీర్షిక క్రింద గురువు యొక్క ప్రాముఖ్యం, 'కర్మరహస్యం' అన్న శీర్షిక క్రింద కర్మతత్త్వం ఈ గ్రంథంలో చాలా విపులంగానూ అర్థవంతంగానూ వివరించబడ్డాయి. పదునెనిమిదవ సంపుటంలో క్రోడీకరింపబడిన 'గురుభక్తి ప్రభావము' అన్న విషయాన్నీ, పదునారవ సంపుటములో చేర్చబడిన 'కర్మసిద్ధాంతము' అన్న అంశాన్నీ ఈ గ్రంథములో పైన పేర్కొనబడిన రెండు శీర్షికల క్రింద గల విషయాలతో సమన్వయించి చదువుకోవడం సముచితంగా వుంటుంది.

శ్రీవ్యాసాశ్రమ వజ్రోత్సవాల సందర్భంలో శ్రీమలయాళ సద్గురు స్వాముల వారి రచనల నన్నింటినీ క్రోడీకరించి "శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి" అన్న పేరుతో ఇరువది సంపుటాలుగా ప్రచురించే సదవకాశం లభించడం శుభావహం. ఆత్మోన్నతిని ప్రసాదించే ఈ గ్రంథావళిని భక్తులు ఆదరంతో పఠించి కృతకృత్యులై శ్రీ సద్గురు దేవుని అనుగ్రహానికి పాత్రు లగుదురుగాక!

శ్రీవ్యాసాశ్రమము

- సముద్రాల లక్ష్మణయ్య

**10-01-2001.**

ఓమ్

# విషయసూచిక



# పీఠిక

**తమేవైకం జానథాత్మాన**
**మన్యా వాచో విముంచథ అమృతస్యైష సేతుః ।**

**---- ముండకోపనిషత్తు.**

ఏకం = అద్వితీయుడగు, తం ఏవ = ఆ యక్షర స్వరూపునే, ఆత్మానం = ఆత్మనుగా, జానథ = తెలిసికొనుడు, అన్యాః =ఇతరములగు, వాచః = మాటలను, విముంచథ = వదలిపెట్టుడు, ఏషః = ఈ యాత్మజ్ఞానము, అమృతస్య = అమృతమునకు, (మోక్షమునకు) సేతుః = సేతువువంటిది.

**వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్యవర్ణం తమసస్తు పారే ।**
**తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ ॥**

**---- పురుష సూక్తము.**

మహాన్తం = సర్వోత్కృష్టుడయినట్టియు, ఆదిత్యవర్ణం = ఆదిత్యుని యొక్క కాంతివంటి కాంతి గలిగినట్టియు, తమసః = ప్రకృతిమండలము కంటె, పారే = అంతమందున్నటువంటి, ఏతం పురుషం = ఈ పరమేశ్వరుని, అహం = నేను, వేద = (ధ్యానముచే) తెలిసికొనుచున్నాను, తం = ఆ పరమేశ్వరుని, ఏవం = ఈ ప్రకారముగ, విద్వాన్ = తెలిసికొన్నవాడు, ఇహ = ఈ జన్మమునందు, అమృతః = మరణరహితుడు, భవతి = అగుచున్నాడు, అయనాయ = మోక్షప్రాప్తికొఱకు, అన్యః = ఇతరమైనటువంటి, పన్థాః = మార్గము, న విద్యతే = లేదు.

ఈ గ్రంథము సంసార సాగరమును తరింపజేయున దగుటచే దీనికి "శ్రీధర్మసేతువు" అని నామధేయ మిడబడినది. సముద్రమును దాటుటకు సేతు వెటువంటిదో, యిదియు నాలాగున జనన మరణ రూపమగు భవసాగర మును దాటుటకు వంతెనవంటిదే. ఇచ్చట 'ధర్మ' మనియు 'సేతు' వనియు రెండు పదములు గలవు. అనగా, ధర్మమే సేతువనెడు అర్థమును గలుగ

జేయుచున్నది. కనుకనే "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీకృష్ణభగవానుడు గీతయం దుపదేశించెను. పురుషార్థ చతుష్టయము నకు ధర్మము మొదటి దగుటచే దానిని స్థాపించుటకొఱకు శ్రీ భగవానుడు భూలోకములో నప్పుడప్పు డవతరించుచుండును. వృక్షముయొక్క మొదలును సంరక్షించిన స్కంధ, శాఖా, పల్లవ, పుష్ప, ఫలాదు లేలాగున స్వయముగా వృద్ధి నొందునో, ఆలాగుననే ధర్మార్థకామ మోక్షముల కాధారమగు ధర్మమునే అందరు సంరక్షింప జూడవలయును. అట్లుగానివారి పైపై ప్రయత్నము లన్నియు వృక్షముయొక్క సంరక్షణకొరకు శాఖా పత్రములను పోషించినట్లే యుండును.

ప్రపంచములో నవతరించిన మహాపురుషు లందరును, ప్రవక్తలందరును, తత్త్వబోధకు లందరును ధర్మసంరక్షణముకొఱకై యవతరించిరి. ముముక్షువులు ఏ ధర్మము నాచరించి తరించవలసియున్నారో, అట్టి ధర్మములన్నియు దీనియందు సంగ్రహముగా తెలుపబడియున్నవి. వంతెన లేనిచో నది నెటుల దాటజాలమో, ఆలాగుననే వారు వారు ఏ యే స్థితులలో నుందురో తదనుకూలములగు ధర్మముల నాచరణలో నుంచుటయే కర్తవ్యమగును. అట్లు గానివారికి తరణోపాయము లేదని గ్రహించుకొనవలయును. అయితే నదిగాని, సముద్రముగాని దాటుటకు వంతెన లేకపోయిన పోనీ, ఓడగాని, విమానముగాని యుండిన చాలదా? యని తలంచవచ్చును. అదిన్ని ఒక యాశ్రయభూతమే యగును, అప్పుడు ధర్మమను నోడగాని, ధర్మమను విమానము గాని లేనిచో తరింప సాధ్యముగా దను అర్థమును గ్రహించుకొనవలయును. అపుడుగూడ "ధర్మసేతు" వనుపదము సార్థకమే యగును.

శాస్త్రమున కొన్ని స్థలములలో 'జ్ఞానప్లవేనైవ' అని కనుపించుచున్నది. అన్నిటియొక్క సారమొకటియే. అయితే ఓడపైగాని, విమానముపైగాని వంతెనపై బోవునంత యపాయ రాహిత్యముగాని, సౌఖ్యముగాని గలుగదు. అంతేగాక బహుజనములును ప్రయాణము చేయజాలరు. కావుననే దనికి

"ధర్మసేతు"వని నామకరణము జేయబడినది.

దీనిలో లోపములేవైన నుండినచో విజ్ఞులు తెలిపిన వినయ విధేయత లతో గ్రహించి మరుముద్రణములో సవరణ చేయుదును. ఈ యుపాధి యొక్క పేరువల్లనే ఆంధ్రదేశస్థుడు గాడని చదువరులు తెలిసికొనగలరు. అందువలన భాషావిషయములో కొంత లోపము గలిగిన పండితులు మన్నింతురుగాక! గంగానద్యాది పుణ్యనదులు వక్రగామినులైనను పావనత్వమునకు హాని గలుగదని తలంచి యీ విషయములో మనశ్శాంతి గలుగజేసికొని సంతసించుచున్నాను. ఇంతవరకు "యధార్థభారతి"లో ప్రకటించుచు వచ్చిన విషయము లన్నిటిని క్రోడీకరించి యచ్చొత్తించిన ముముక్షువులకు చాల యనుకూలపడునని భక్తులు చెప్పుచు వచ్చినందుచే వారి పుణ్యసంకల్పము లన్నియు మూర్తీభవించి యీ గ్రంధరూపముగా బయలుపడినవని తలంచెదను.

లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.

ఓం తత్ సత్.

మీ చరాచరసుఖాభిలాషి

**మలయాళస్వామి.**

# విజ్ఞప్తి

**శ్రీ భర్తృహరి చెప్పిన లాగున**

**బోద్ధారో మత్సర గ్రస్తాః ప్రభవః స్మయదూషితాః ।**
**అబోధోపహతాశ్చాన్యే జీర్ణమంగే సుభాషితమ్ ॥**

బోద్ధారః = (ధర్మబోధకులై యుండవలసిన) తెలిసినవారు, మత్సర గ్రస్తాః = మాత్సర్యముచే (అసూయచే) ఆవరింపబడినవారు, (ఒకరి క్షేమము నోర్వ జాలక భంగపరచుటకు కావలసినంత పన్నాగము పన్ని పైకి రానివ్వక యణగ ద్రొక్కువారలైరి, అనగా విద్వాంసులున్ను, మతబోధకులున్ను ఈలా గున పరిణమించిరి) ప్రభవః = ప్రభువులు, (దొరలు = శ్రీ మంతులు), స్మయదూషితాః, స్మయ = గర్వముచేత (తిరస్కార భావముచే) దూషితాః = చెడిన హృదయము గలవారు, (గర్వాంధులై యొడలు తెలియని వారైరి), అన్యే చ = మరి తక్కిన యితరులో, (విద్యయు, ధనము, లేనివారలని భావము) అబోధోపహతాః, అబోధ = అజ్ఞానముచే (ధర్మమును బోధించువారు లేకుండుటచేతను, జ్ఞానము లేకపోవుటచేతను) ఉపహతాః = అణగగొట్ట బడినవారలు (స్వబోధరహితులు), (ఇందువల్ల మహాపురుషుల, పుణ్యాత్ముల, జ్ఞానుల) సుభాషితం = శుద్ధమైన వాక్యము, (ధర్మతత్త్వము) అంగే = దేహమునందు (మనస్సునందే), జీర్ణం = క్షయించినది (లయించి పోయినది).

ఇప్పుడు మనయొక్క దేశస్థితి యీలాగుననే పరిణమించినది. ఎవరైన సాధుపురుషులు ధర్మములను బోధించుటకు ప్రారంభించిన శుష్క హృదయులగు పండితులలో కొందరున్ను, వాచావేదాంతులగు శుష్క వేదాం తులలో కొందరున్ను వారిపై కక్ష్యగట్టి పైకి రానివ్వక యణగద్రొక్క జూచు చున్నారు. ప్రభువులు, ఉద్యోగస్థులు పాశ్చాత్య సంప్రదాయములచే జగత్సత్యత్వబుద్ధి గల్గి ఆత్మసంస్కారము లేనివారైపోయిరి. ధర్మబోధకుల యొక్కయు, ధనవంతులయొక్కయు సహాయము లేనిచో ఆత్మజ్ఞానమును, దయాధర్మాదులను ఏలాగున లోకములో బోధింపగల్గుదురు? ఈ కారణము వల్ల విద్యయు, జ్ఞానమున్ను లేని బీదజనులు విజ్ఞానమునకు దూరులైరి. ఇతర

సహాయము లేనందున పుణ్యపురుషులు, జ్ఞానవేత్తలు తమ ధర్మమును లోకములో బోధింపజాలక గ్రంథముల ముద్రింపనొల్లక పోవుటచేత వారి జ్ఞానము వారి దేహముతోగూడ జీర్ణమైపోవుచున్నదని భర్తృహరి లోకమును చక్కగ గమనించి తెలిసికొనియే యిట్లు చెప్పిరి.

ఇది యేల ఇచ్చట గమనించవలసి వచ్చెననగా? నిప్పు డీలాగుననే కొందరు చెప్పుచున్నారు. "తనకు గ్రంథము వ్రాయు శక్తి యుండిన సొంతముగా శ్లోకములుగాని, పద్యములు గాని చేసికొనరాదా?"అని యందురు. ఒకవేళ దైవకృపచే గలిగిన జ్ఞానమువలన గద్యపద్యములుగా వ్రాసినచో, "దీనికేదైన ప్రమాణము గలదా? ఇది వారి యిష్టానుసారముగా వ్రాసిరి. వేదప్రమాణము లేని దెవరంగీకరింతు"రనియు జెప్పుదురు. న్యాయస్థానములో సాక్ష్యము లేని ఫిర్యాదు నేలాగున నంగీకరింపరో, అటులనే యుత్కృష్ట ప్రమాణములేని వాక్యము నంగీకరింప జాలరు. సాక్షులెంత బలవంతులో వారి వాక్యమునకు గూడ నంత విలువగలదు. కనుకనే భాష్య కారులు మొదలుకొని నేటివరకుండు సర్వగ్రంథకర్త లున్ను శ్రుతి, స్మృతులను సాక్ష్యమిచ్చుచు వచ్చిరి. ఇది శిష్టాచార పద్ధతియేగాని మరియొకటి గాదు.

**మౌనాన్మూకః ప్రవచనపటుర్వాచకో జల్పకో వా**
**ధృష్టః పార్శ్వే భవతి చ వసన్ దూరతోఽప్యప్రగల్భః ।**
**క్షాన్త్యా భీరుర్యది న సహతే ప్రాయశో నాభిజాతః**
**సేవాధర్మః పరమగహనో యోగినామప్యగమ్యః ॥**

లోకమును మెప్పించుటకు ఎవరిచేతను తరముగాదని యీ శ్లోకముచే తెలియజేయుచున్నారు.

మౌనాత్ = మాట్లాడకుండుటవలన, మూకః = మూగవాడనియు, ప్రవచన పటుః = బాగుగా మాట్లాడుటయందు నేర్పుగలవాడైన, వాచకః = వ్రేలుడువాడనియు, వా = లేక, జల్పకః = అసంబద్ధ ప్రలాపియనియు, (కల్పిత వచన కారుడనియు) పార్శ్వే = ప్రక్కను, వసన్ చ = ఉండువాడైన,

ధృష్టః = భయభక్తులులేనివాడనియు, దూరతః = దూరముగా, వసన్ అపి = ఉండు వాడైనచో, అప్రగల్భః = చేతగానివాడనియు, క్షాంత్యా = ఓర్పుగల్గి శాంతము వహించియుండిన, భీరుః = పిరికివాడు, భవతి = అగుననియు, (చెప్పుదురు), న సహతే యది = సహనశక్తి లేకపోయెనేని, ప్రాయశః = తఱచుగా, అభిజాతః = మంచికులమున బుట్టిన (పుణ్యావంశములో జన్మించిన) వాడు, న = కాడనియు చెప్పుదురు, (కాబట్టి) పరమగహనః = మిక్కిలి తెలిసికొనరాని, సేవాధర్మః = లోకసేవయొక్క ధర్మము, యోగినాం అపి = భూతభవిష్యద్వర్తమాన కాలముల మూటి నెఱింగి అతీంద్రియములగు పదార్థములనుగూడ గనిపెట్టు యోగులకు సైతము, అగమ్యః = తెలియ శక్యము గానిది.

సాధకుడగువాడుగాని, బోధకుడగువాడుగాని, మౌనిగానుండునేని మూగవాడనియు, ధర్మములను బోధించుచుండునేని వదరుబోతనియు, సమీపములో నుండిన భక్తి విశ్వాసము లేని వాడనియు, దూరమున (ఏకాంతమున) నుండిన దేనికిన్ని చేతగానివాడనియు, జనులయొక్క మానావమానములను దూషణ, భూషణములను సహించువాడేని పిఱికివాడనియు, ఓర్పులేని యెడల శమదమాది గుణములు లేనివాడనియు, సద్వంశజాతుడు గాడనియు లోకము చెప్పుచుండును. కావున లోకమును మెప్పించి యే కార్యమున్ను చేయుటకు అతీంద్రియ జ్ఞానులగు యోగీశ్వరులకైన నలవి కాదు. కావున ప్రతివారున్ను సద్గురు వాక్యములో నమ్మకము గల్గి సజ్జను లాచరించే లాగున మనోనిర్మలత గలిగి వర్తించవలెనేగాని మరియొక మార్గము లేదు.

**మృగమీన సజ్జనానాం తృణజల సన్తోష విహితవృత్తీనామ్ ।**
**లుబ్ధక ధీవర పిశునా నిష్కారణమేవ వైరిణో జగతి ॥**

ఈ శ్లోకమున సజ్జనులు గ్రహించవలసిన ముఖ్యధర్మము గలదు. ఎవరికిన్ని ఏ కీడున్ను చేయక సదా పరోపకారము చేయుచు పరమేశ్వరనిష్ఠ

గల వారికిగూడ నిష్కారణముగ విరోధులు గలుగవచ్చునని గ్రహించు కొనవలయును.

తృణ..... వృత్తీనాం, తృణ = పచ్చికచేతను, జల = నీటిచేతను, సంతోష = ఆనందముచేతను, విహిత = చేయబడిన వృత్తీనాం = దేహయాత్ర (బ్రదుకు) గల, మృగమీనసజ్జనానాం, మృగ = లేళ్ళకు, మీన = చేపలకు, సజ్జనానాం = సత్పురుషులకును, లుబ్ధక ధీవర పిశునాః, లుబ్ధక = వేటగాం డ్రును, ధీవర =జాలరులును, పిశునాః=చాడీలుచెప్పువాండ్రు (దుర్జనులు)ను, జగతి = లోకములో, నిష్కారణం - ఏవ = కారణము లేకయే, వైరిణః = విరో ధులు.

పరులను బీడింపయే గడ్డిచేత కాలయాత్రను గడుపుకొను జింకలు మొదలైన మృగములకు కిరాతకులును, నీటిలోగల పాచి మొదలైనవి తిని జీవించు మీనంబులకు జాలరులును, దొరికినదానిచే సంతుష్టి గల్గి బ్రహ్మనిష్ఠ భగవద్భక్తి, పుణ్యకార్యములు చేయు సజ్జనులకు కొండెగాండ్రును, (దుష్ట గుణముగల క్రూరజనులు) అకారణముగ వైరులై లోకమున గనబడు చున్నారు.

ఇదంతయు గ్రహించి లోకములో సత్యధర్మములను బోధించెడు నిర్మలజ్ఞాననిష్ఠులు భయము గలుగక స్వధర్మమును నిర్వహించి ఋషుల యొక్కయు, సర్వేశ్వరునియొక్కయు కృపకు పాత్రులై తరింప గల్గుదురు గాక! ఈ గ్రంథములో ఇంతవరకు వ్రాయబడియుండు పుస్తకములలో గల ముఖ్య ప్రమాణములను కొన్నిటి నచ్చటచ్చట నిరూపణ చేయవలసి వచ్చినది. మరియు నొకానొకప్పుడు ఒకానొక స్థలమున, నిరూపించిన ప్రమాణమును మరల నిర్ణయించవలసి వచ్చియున్నది. అది అచ్చటికి సందర్భానుగుణ మగుటచేతను, సర్వోత్కృష్ట ప్రమాణ మగుటచేతను చేర్చవలసి వచ్చినదేగాని మఱియొకటి గాదు. ఈ న్యాయము శ్రుతిస్మృతి పురాణేతిహాసములలో కన్పట్టుచున్నది. అట్లు గానిచో కార్యనిర్ధారణ చేయుటకు శక్యము గాదు.

జ్ఞానవాసిష్ఠములో మహోపనిషత్తు మొదలగు కొన్ని యుపనిషత్తుల శ్లోకములను, అమృతబిందూపనిషత్తు శ్లోకములను ప్రతిపాదించియున్నారు. కైవల్యోపనిషత్తులోగల వాక్యములు అమృతబిందూపనిషత్తు మొదలగు నితరోపనిషత్తులలోను, ఇతరోపనిషత్తులలో గల వాక్యములు కైవల్యోపనిషదాదులలోను గన్పట్టుచున్నవి. ఆలాగున యోగచూడామణ్యుపనిషత్తులోగల వాక్యములు సూతసంహితాదులయందును, సూతసంహితాదుల విషయము యోగకుండల్యాద్యుపనిషత్తులలోను గలవు. ఆలాగున నీ యుపనిషత్తులోగల శ్లోకములు హఠయోగ ప్రదీపికాదులలో గూడ గానుపించుచున్నవి. మనుస్మృతిలోగల ప్రమాణ వాక్యములు పరాశర స్మృత్యాదులలో గూడ గలవు. భారతములో గల వాక్యములు స్మృతులలో ననేకములున్నవి. ఆలాగున కఠోపనిషత్తులోను, సూతసంహితలోను గల శ్లోకములు శ్రీమద్భగవద్గీతలో గలవు. భగవద్గీతలోగల శ్లోకములు శివగీత మొదలైన వానిలో గానుపించుచున్నవి. అపరోక్షానుభూతిలోగల యెక్కువ శ్లోకములున్ను ఉపనిషత్తులలోనివే.

జగద్గురువులగు శ్రీ శంకరులుగూడ నాలాగే చేసియున్నారు. అపరోక్షానుభూతి దృష్టాంతము. బ్రహ్మసూత్ర భాష్యమునకు సమస్త శ్రుతిస్మృతులనే సాక్ష్యమిచ్చియున్నారు. ఉత్తరగీతయందు శ్రీకృష్ణభగవాను లుపదేశించిన యెక్కువ శ్లోకములున్ను ఉపనిషత్తులలోనివిగా నున్నవి. శ్రీవిద్యారణ్యస్వాములు నిర్మించిన పంచదశి గ్రంథములో నెక్కువ శ్లోకములున్ను ఉపనిషత్తులలోనివే.

ఆలాగున అట్టి మహాపురుషులు చేయుట వారికి స్వయముగా జ్ఞానము లేక చేసినది గాదు. భాష్యాదులు వ్రాయునప్పుడు లోకోత్తరములగు శ్రుతిస్మృతులను సాక్ష్యముగా దృష్టాంతము నిరూపించుటకు మాత్రమే చేర్చిరి. మరియు ఋషులు తాము చేయదలంచు గ్రంథమున కనుగుణమగు నుత్కృష్ట శ్లోకము లుండిన వానిని తీసికొన్నచో ప్రయాస లేకపోవునని తలంచి చేసిరేగాని, వారికి చేయుటకు జ్ఞానము లేకగాని, శక్తి లేకగాని చేసినది గాదు.

ఆలాగున అవధూత గీతలో శ్రీదత్తాత్రేయులవారు పూర్వాధ్యాయము లలో తెలిపిన శ్లోకములనే ఉత్తరాధ్యాయములలో గూడ నచ్చటచ్చట తెలిపి యున్నారు. ఇది ఋషి పద్ధతి ననుసరించిన శిష్టాచారమేగాని మరియొకటి గాదు, అందువల్లనే యీ గ్రంథమునగల అనివార్య స్థలములలో పరమఋషుల వాక్యములను సముద్ధరించుకొనవలసివచ్చినది. ఎందుకనగా? నట్టి పరమప్రమాణములగు ఋషివాక్యములను దృష్టాంత మిచ్చినంత మాత్రముననే జనుల కంగీకారము గలుగును. మహర్షి వాక్యము లలంఘనీయ ములు గదా! తాము ఏకార్యము చేయునప్పుడున్ను, నిష్కళంకహృదయము గల్గి నిర్మల జ్ఞానముతో సత్యమందును, గురువాక్యమునందును, సర్వేశ్వరుని యందును నిష్ఠ గల్గి ప్రవర్తించిన చాలును. వాని కెచ్చటను విజయమే గలుగును.

**లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

**ఓం తత్ సత్.**



ఓం తత్సత్ ఓమ్.

# దైవప్రార్థన

1. ఓ దయామయుడవగు సర్వేశ్వరా! మా వాక్కుచేతను, మనస్సుచేతను, కాయముచేతను, ఏ విధమైన క్లేశము ఇతరప్రాణికి సదా గలుగక యుండే లాగున అనుగ్రహింపుము!

2. ఓ కారుణ్యైకసింధూ! మా వాక్కుచేతను, మనస్సుచేతను, కాయిక క్రియలచేతను, సర్వకాల సర్వావస్థలయందు ప్రపంచములో గల సకల ప్రాణికోట్లకు ఉపకారము చేసే లాగున ఆశీర్వదింపుము!

3. ఓ జ్ఞానైకమూర్తీ! పరమేశ్వరా! మాయందు జాగ్రదవస్థ యందుగాని, స్వప్నావస్థయందుగాని, సుషుప్త్యవస్థయందుగాని, ఈ మూడింటికి హేతువులైన స్థూల సూక్ష్మ కారణ శరీరములలోను, మనోవాక్కాయములలోను ఏలాటి విషయదోషములు, చెడు సంకల్పములు గలుగకుండునట్లు ఆశీర్వాదము చేయుము!

4. ఓ శాంతినిలయా! పరమపావనమూర్తీ! మాపై ఎవరైన నిందలు మోపినను, అపకారము చేసినను, నిరుత్సాహము గలుగజేసినను, అవి యన్నియు సహించుకొని, వారి దుష్కృత్యమునకు వగచుచు మా నిశ్చయ దైవకార్యమునుండియు, దైవలక్ష్యమునుండియు మనస్సు కొంచమైనను చలింపకయుండే లాగున ననుగ్రహింపుము! అనుగ్రహింపుము!

న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నాపునర్భవమ్ ।
కామయే దుఃఖతప్తానాం ప్రాణినామార్తినాశనమ్ ॥

ఓమ్.

ఓం

# శ్రీధర్మసేతువు

## ఆత్మయొక్క అనంతత్వము

**వివిక్తదేశ ఆసీనో విరాగో విజితేంద్రియః ।**
**భావయేదేకమాత్మానం తమనంతమనన్యధీః ॥**

వివిక్తదేశే = ఏకాంతప్రదేశమున, అనగా బ్రహ్మచింతనకు ప్రతిబంధము గలుగజేయని స్థలమున, ఆసీనః = సానుకూలమైన ఆసనములో కూర్చున్నవాడై, విరాగః = సర్వవిషయములలోను వైరాగ్యము గల్గినవాడై, విజితేంద్రియః = ఇంద్రియములను జయించినవాడై, అనన్యధీః = ఆత్మవ్యతిరిక్త వస్తువునందు బుద్ధిని పోనివ్వనివాడై, ఏకం = ఒక్కడైనటువంటి, అనంతం = దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యుడైన, తం = అటువంటి, ఆత్మానం = తన్ను (సత్యజ్ఞానానంద స్వరూపునిగా), భావయేత్ = ధ్యానము చేయవలసినది. అనగా, తన స్వరూప మిటువంటిదని భావన చేయవలసినది అని ఆత్మ బోధము.

దైవాత్మ స్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరీ సోదరులారా! మీలో మీ స్వరూపమై యుండు ఆత్మయొక్క అనంతత్వమును, వ్యాపకత్వమును, దివ్యత్వమును తెలుసుకొనుటలో ప్రవేశించెదము. ఇట్టి దానినే హృదయ వైశాల్యమనియు, హృదయశుద్ధి యనిగూడ మతాంతరమున చెప్పెదరు. దీనికే అంతఃకరణముయొక్క మల, విక్షేప, ఆవరణములయొక్క నివృత్తి యని గూడ వేదాంత గ్రంథములలో వ్యవహారము గలదు. మల మనగా? చిత్తగత పాపసంస్కారమనియు,విక్షేపమనగా మనస్సునకు దృశ్యవిషయములలో గల చంచల స్వభావమనియు, ఆవరణమనగా స్వరూపజ్ఞానమును కనుపడ కుండ జేయు అజ్ఞానమనియు శాస్త్రకర్తల యభిప్రాయము. నిష్కామపుణ్య

కర్మలచే మల నివృత్తియు; దైవోపాసనచే విక్షేపనివృత్తియు; శ్రవణ, మనన, నిదిధ్యాసనలచే ఆవరణ నివృత్తియు జీవునికి గలుగవలసియుండును. అప్పుడు నిర్మలాకాశమునందు వసంత కాలములోగల మధ్యాహ్నపు భాస్కరునివలె హృదయాకాశమునందు దైవసాక్షాత్కార జ్ఞానము గలుగుచుండును. యోగశాస్త్రములో చెప్పబడిన యమాద్యష్టాంగ యోగములున్ను; ఉపాసనమార్గములలో చెప్పి యుండు భజన, కీర్తన, స్మరణ, అర్చనాదులున్ను; నిష్కామకర్మయోగములో చెప్పబడినట్లు కర్తృత్వ రహితముగాను, ఫలాసక్తి లేకుండునట్లున్ను దైవబుద్ధితోగాని, లోకహితబుద్ధితోగాని, లేక సర్వప్రాణికోట్ల కుపయోగకరముగా జీవితమును వినియోగపరచుటయే యీశ్వరనియతి యని తెలుసుకొనిగాని చేయు కర్మయోగము - వీటియొక్క రహస్యమున్ను, శమదమాదులు గల్గి చేయు వేదాంత శ్రవణ, మనన, నిదిధ్యాసములయొక్క ప్రయోజనమున్ను ఈ అంతఃకరణ శుద్ధి గల్గుటయే యని మనము బాగుగ హృదయములో నుంచుకొని సాధనలో జీవితమును వినియోగ పరచేలాగున నిశ్చయించుకొనవలయును. ఇట్టి భావము లేక చేసెడు తపస్సుగాని, యోగముగాని, భక్తిగాని, కర్మయోగముగాని వట్టి బూటకమే గాని, మరి యేమియు గాదని ప్రతివ్యక్తియున్ను జ్ఞాపకములో నుంచవలయును. అంతే గాక అట్టిది ఒకవిధమగు ఆత్మవంచనమే యగును. ఇది దుర్గతిని గలగ జేయునేగాని, సద్గతి కవకాశము గలుగజేయదు.

ఇప్పుడు ఆత్మయొక్క వైశాల్యమును గ్రహించుకొనుటకు లోభాగమునకు ప్రవేశించుటకు ముందుగా నీ చెప్పబోవు విషయమును సదా జ్ఞప్తిలో నుంచవలెను. లేనిచో ఇక చెప్పబోయెడు విషయము చక్కగా గోచరము గాదు. ఇది అంకురార్పణమువంటిది, లేక ఇక చెప్పబోవు దైవకల్పవృక్షమునకు ఇది బీజమువంటిదని తెలుసుకొనవలయును. ఇప్పుడు పంజరమునుండి పక్షి లేచి ఆకాశమున కెగయునట్లు మీ భావమును, మీ దేహముయొక్క వర్ణము గాని, ఆశ్రమముగాని, స్త్రీత్వముగాని, పురుషత్వముగాని, వెయ్యేల, నామ రూపములుగాని తగులనీయక దైవభావములోనికి మనస్సును తీసుకొని

పోవలయును. అనగా పై జెప్పిన వేవియు లేని అవస్థలో నుండవలెను. అప్పుడే యీ·విషయమును సుఖముగా అవగాహన చేయగలుగుదుము. ఒక పాత్రము చిన్నదిగాని, పెద్దదిగాని యుండినను అది నిండుగా జలముగాని యితర వస్తువులుగాని గల్గియుండిన మరల ఏలాగున ఒక బిందుజలముగాని, ఒక్క అణువువస్తువుగాని దానిలో నిలువక క్రిందికి జారిపోవుచుండునో, ఆలాగున ఆత్మకు పరిమితి యను ఒక యవస్థ గలిగియుండిన ఇప్పుడు మనము గ్రహించియుండు శ్లోకములుగాని, యితరవస్తు విషయజ్ఞానముకన్న అధికముగాని ఆత్మలో నిలుచుటకు అవకాశము గలుగదు. అనగా, మీరు ఇంతవరకెన్ని శాస్త్రములుగాని, పద్యములుగాని, శ్లోకములుగాని జ్ఞాపకములో నుంచుకొనియున్నారో, అవి యట్లుండగా నూతన శ్లోకములుగాని, పద్యములు గాని, శాస్త్రములుగాని చదివినను వానినిగూడ మీ హృదయములో వ్రాయుటకు స్థలముండును గదా! ఇది వ్రాయుటకున్ను పత్రమచ్చట ఏలా గున ఏర్పడుచుండును? ఈలాగున మీ జన్మము కడవరకు ప్రతిదినము ఎన్నియో శ్లోకములుగాని, పద్యములుగాని చదువుచుండినను వానికన్నిటికిన్ని నిలుచుటకు హృదయము అవకాశము కలుగజేసుకొనుట లేదా?

ఆలాగున, ఒక చిత్రకారుడు ఇంతవరకు ఎన్ని చిత్రములు వ్రాసి యున్నాడో అవి యన్నియును గాక క్రొత్తక్రొత్త చిత్రములను లిఖించుటకు గూడ అతని హృదయ మవకాశ మిచ్చుచున్నది. ఈలాగున జీవితాంతము వరకు అతడెన్నియో నూతన నూతన చిత్రములను చిత్రించుచుండినను అతని హృదయము అవకాశము గలుగజేసుకొనుట లేదా? అట్లే ఒక యంత్ర నిర్మాత యింతవరకు ఎన్ని యంత్రములను నిర్మించి యున్నాడో అవి యన్ని యును గాక నవీనములగు యంత్రములను నిర్మించుటకున్ను వాని అన్నిటి యొక్క స్వరూపమును హృదయములో అవగాహనము చేసికొనుటకున్ను అంతఃకరణములో అవకాశము కల్గుచున్నదిగదా! అదేరీతిగా ఒక్క గృహ నిర్మాతయు ఎన్నియో రకములగు గృహములున్ను, వాటిలో అనేక రకములు గల విచిత్రములగు చిత్రములను, ఆకృతులను నిర్మించినను క్రొత్తగా ఒక

చిత్రగృహమును జూచిన ఆలాగున చేయుటకున్ను అతని హృదయాంత రాళము స్థలము నిచ్చుట లేదా? మరియు, ఒక ధీమంతుడగు శిల్పి అనేక విగ్రహములతోను, ప్రాకారములతోను, గోపురములతోను గూడిన దేవాలయ ములను నిర్మించినను మరియొక్క క్రొత్తదానిని చూచిన అట్లే చేయుటకున్ను అతని చిదాకాశము స్థానమిచ్చుచునే యున్నది. దీనివల్ల ఆత్మ అపరిమిత శక్తి గలదని మనము తెలిసికొనవచ్చును.

ఒక్క బిలములో ఎన్ని రాళ్లుగాని, మట్టిగాని, కొయ్యలుగాని వేయు చుండినను నిండకపోవుచుండిన మరల ఎంతో వేసినను అవకాశము గలుగ జేసుకొనుచుండిన దానికి మనమేమి చెప్పుదుము? అయ్యో! దీనికి అంతము లేదు. ఇది అగాధమైన పాతాళము అని చెప్పుట లేదా? దీనివల్లను ఆత్మ యొక్క వ్యాపకత్వము తెలుసుకొనవచ్చును.

ఇక మరియొక యుదాహరణమును జెప్పెదను. మనము స్కూలులో చదువునప్పుడు దేశచిత్రముయొక్క పటమును చూచియున్నాము గదా! దానిలో ఎంతవరకు దేశములు చిత్రింపబడియున్నవో వానికన్న క్రొత్తదేశము లను చిత్రించుటకు ఆ చిత్రపటములో స్థలముండదు. అట్లు గాక నూతన నూతన దేశములను చిత్రించుటకు అది స్థలము నిచ్చుచుండిన ఆ పటము మడతగల్గినదిగాను, ఎంత విస్తరింప జేసినను దానియంతము గనుపడనిచో అది అనంతముగాను నుండవలయును.

ఇచ్చుట శ్రీద్రౌపదీదేవియొక్క వస్త్రాపహరణము జ్ఞాపకమునకు వచ్చు చున్నది. శ్రీకృష్ణభగవానులు ద్రౌపదికి అనంతవస్త్రము గలిగేలాగున అను గ్రహము గలుగజేసియుండిరి. మరియు, శ్రీకృష్ణభగవానులు చిన్నతనములో చాల దుడుకుతనము గల్గి తుంటరివారలలో అగ్రగణ్యులై యుండి గోపికాస్త్రీ లకు బాధ గలుగ జేయుచుండగా, ఆ నారీమణు లందరున్ను యశోదాదేవితో చెప్పుకొనగా శ్రీబాలకృష్ణుని తల్లి కొట్టినదట! ఆ మాయామానుష విగ్రహుడు,

నేత్రములనుండి బాష్పములు ధారధారగా ప్రవహింపజేసుకొని మహాదుఃఖము గల పిల్లవానివలె నోరు తెరచుకొని అరచినాడట! అత్తరి నోరు మూయుటకు తల్లి పట్టిచూచునప్పుడు ఓహెూ! భూర్భువాది సప్తలోకములున్ను, అతల వితల పాతాళాది అధోలోకము లేడున్ను ఆ కృష్ణభగవంతుని నోటిలో చూచి విస్మయ మొందెనట!

దీనివల్ల నేమి తేలుచుండుననగా, ఆత్మ బ్రహ్మాండ మంతటను వ్యాపించి లోభాగములోను, వెలిభాగములోను వెలుగుచుండునని గ్రహించు కొనవలయును. మరియు, గీతోపదేశకాలమున అర్జునునకు విశ్వరూపదర్శ నము ననుగ్రహించినప్పుడు గూడ ఈలాటి బ్రహ్మాండము లన్నిటిని అర్జు నుడు చూచినట్లు ఏకాదశాధ్యాయమున గన్పట్టుచున్నది. అట్టి భగవానుడు గదా ఆత్మస్వరూపుడై అందరి హృదయములలోను వెలుగుచున్నాడు! మరియు, దీనికి ముందు చెప్పిన రీతిగా, దేశచిత్రపటములో తలంచినంత దేశములను, చిత్రించుటకు ఆపట్ట స్థలమిచ్చుచుండిన దానికి అపరమితత్వ ముండవలయును గదా! అనగా, ఆంధ్రదేశముగాని, కర్నాటకదేశముగాని, మహారాష్ట్రదేశముగాని, వెయ్యేల హిందూదేశమంతయుగాని చిత్రింప ప్రారం భించినను మరల మరల ఆపట్ట అవకాశమిచ్చుచు దానియందు, ఆసియా ఖండమంతయు, ఆఫ్రికాఖండము, అమెరికా ఖండము, ఇంగ్లాండు పూర్తిగాను ఆలాగున ఆస్ట్రేలియా, జపాను మొదలగు భూగోళమంతయు చిత్రించినను, మరల స్థలము మిగిలియుండిన ఆపట్ట పరిమితిలేని స్థితి గల్గియుండును గదా!

అట్లే మీరు కాశినుండి రామేశ్వరమువరకు చూచియున్నట్లు ఊహించు కొనుడు. ఆ దేశము మీరు జ్ఞాపకముంచిన మీ హృదయపటములో గోచరిం చుటలేదా? బాగుగ చిత్తమును ఏకాగ్రపరచుకొనుడు. అట్టి మీరే రేపటి దినము బదరికాశ్రమ, కాశ్మీర, నేపాళములు మొదలగు భరతఖండమం తయు సంచరించి ఒక్క స్థలములో చిత్తైకాగ్రతతో యోచించి కూర్చొనిన

అవన్నియు మీ హృదయములో దర్పణమునందువలె గనుపించుట లేదా? ఇచ్చటనుండే పురుషులలోగాని, పుణ్యాత్ములగు స్త్రీలలోగాని తీర్థయాత్ర చేసిన వారుండిన పై జెప్పినలాగున చూచుకొనుడు. తప్పక మీకు గోచరమగును.

అట్టి మీరే పాశ్చాత్యదేశమున సంచారము చేసి వచ్చిన ఆదేశము గూడ మీ హృదయపటములో గనుపించును. అట్టివారే తూర్పుఖండమగు చైనా, జపాను మొదలగు సర్వదేశములను చూచివచ్చిన అవన్నియు, వారి మనోవీథియందు స్పష్టముగ గోచరించును. ఆలాగున నీ భూగోళమండల మును ప్రదక్షిణముచేసి వచ్చిన వారుండిన లెస్సగ మనస్సంయమము చేసి చూచిననది వారి హృదయములలో గనుపించును. ఇట్టి మహిమ మనోవీధి యందు గల్గియుండునది అందరికిన్ని విదితము గదా! మరల మీరు దూరదర్శన యంత్రసహాయముచే చంద్రగోళముయొక్క పరిమితియు, గమనమున్ను, చంద్రగ్రహములో గల వస్తువులయొక్క నిర్ణయమున్ను దెలుసుకొనిన, అవి యన్నియు ఇచ్చట కూర్చుండి చింతించిన మీ మనో విలాసములో గోచరించునుగదా! ఆలాగున, సూర్యగోళముయొక్క విస్తీర్ణ మున్ను, శక్తియున్ను, వస్తువిజ్ఞానమున్ను గ్రహించిన అదిన్ని మీ హృదయ ములో గోచరించుచుండును. అట్లే శనిగ్రహము, బుధగ్రహము, బృహస్పతి గ్రహము, శుక్రగ్రహము మొదలగు గ్రహము లన్నిటిని గణితముచేసిన అవన్నియు మీ హృదయములో గోచరమగుచునే యుండును. అప్పుడు మీరు, నిశ్చింతగానుండి మనస్సునుగూడ దృశ్యముగావించి ఆత్మభావములో నుండిన ఇంతవరకు చెప్పియుండు భూగోళాది సమస్త నక్షత్ర గోళము లన్నియు, మీ ఆత్మయగు ఆకాశములో ఒక్కొక్కటి చిన్న చిన్న చెండ్లు మాదిరిగా గోచరించును. అప్పుడు ఆత్మ యను సాగరములో ఆ సూర్యచంద్రాది గోళములన్నియు, చెరువులో కొన్ని నిమ్మకాయలు పడవేసిన నెట్లుండునో అట్లే మీ యాత్మలో నుండును. అప్పుడు ఇంతవరకు చూచిన బుధాదిగోళము లన్నిటికిన్ని ఆవలవరకున్ను వ్యాపించిన మీ ఆత్మవిషయమై ఆశ్చర్యము గల్గును. ఇది అత్యద్భుత మహి మాతిశయమని మీలో మీరే

కనుగొనగలరు.

అపుడు ఆకాశము సమస్తములోను వ్యాపించియుండినను, ఆ వస్తువులచే అది యేలాగున లిప్తముగాక యున్నదో ఆలాగున ఆత్మయొక్క స్థితి యనిగూడ మనము కనుగొనగల్గుదుము. ఇదే అద్వైతము బోధించెడు అమానుష మహిమయొక్క ఫలితము. అప్పుడే బంధము లన్నియు దొలగి పోవును. ఇవన్నియు స్వప్నలోకము వంటివని తెలుసుకొన గల్గుదుము. ఇదే అఖండజ్ఞానముయొక్క గురుతు. అప్పుడు ఈ ఆత్మకు రాకడ, పోకడ లేక యుండు స్థితి కల్గును. దీనికి హృదయ గ్రంధులన్నియు వీడిపోవలయును. ఆవరణము లన్నియు నశించవలయును. అప్పుడు సంకల్పము లన్నియు అస్తమించును. ఇదే విదేహముక్తి యనియు, తుర్యాతీతమనియు మహనీ యులు చెప్పుచుండు మనస్సమాధి, పరమపదము, ఆత్మసాక్షాత్కారము, విష్ణు పదము, శివపదము.

అయితే అందరి యాత్మయు ఆలాగున నుండినను, మహనీయులగు కొందరికి గోచరించుటకున్ను, కొందరికి గోచరము గాకపోవుటకున్ను కారణమేమని సంశయము గలుగవచ్చును. దానికి కారణము గలదు. ఏమన సంపూర్ణముగా వికసించిన తామరపువ్వులతోను, విశాలమైన పత్రములతోను గూడి ఒక సరోవర ముండునని యూహించుకొనుడు. అయితే హేమంత కాలము వచ్చునప్పుడు మంచు కురియుటచే, ఆ సరస్సులో గల పుష్పము లన్నియు, పత్రము లన్నియు శుష్కించి, ద్రవించిపోయి వట్టి యెండిపోయిన కాడలు మాత్రముగా నుండును గదా! మంచు పద్మమునకు శత్రువుగా నుండును. ఆలాగున ఎవరి హృదయములో విషయవాసన యను మంచు గురియుచుండునో వారి హృదయము సంకుచితమై పోవును. అట్టివారికి ఇంద్రియాతీత జ్ఞానము గలుగదు. దైవత్వమున్ను గోచరింపదు. ప్రసన్న భావమున్ను, ప్రశాంత మైన సుఖమున్ను గలుగవు. అయితే విషయవాసనచే కృశించిన హృదయము గలిగియుండు వారికి గతి యేమని కొందరు

తలంచవచ్చును. ఆలాగున సందేహపడనక్కరలేదు. ఏలన? మంచు కాలములో కమలముయొక్క పత్రములున్ను, పుష్పములున్ను క్షయించి పోయినను, దానియొక్క మూలము (అనగా కందము) లేక గడ్డ నశించుట లేదు. అది నీటియొక్క అడుగున బురదలో ఉండియున్నది.

ఆలాగున, జిజ్ఞాసువులారా! విషయదోషముచే హృదయ వికాసమున్ను, విశుద్ధతయున్ను నశించి పోయినవేగాని, మీయాత్మ హృదయమునకు మూల మగు బుద్ధిగుహయందున్నది. ఆత్మ నశించు వస్తువు గాదు. అది అవినాశి. సంకోచ వికాసములున్ను, పుణ్యాపాపములున్ను, బంధముక్తులున్ను, జ్ఞానా జ్ఞానములున్ను, హర్షశోకములున్ను, మంచిచెడుగులున్ను, శుద్ధాశుద్ధము లున్ను మనస్సులోనే గలుగునుగాని సాక్షియైన ఆత్మయందు గలుగవు. అయితే అవిద్యయొక్క శక్తిచే పై చెప్పినవన్నియు ఆత్మలో గల్గియున్నట్లు తోచుచున్నవి. స్ఫటికపాత్రలో పెట్టిన యెరుపు, పసుపు మొదలైన వర్ణములు గల వస్తువులు స్ఫటికపాత్రమునకు ఆ రంగులు గల్గించునట్లు అవి వేకముచే తోచుచున్నది. ఆత్మబోధము చూడుడు.

**పంచకోశాదియోగేన తత్తన్మయ ఇవ స్థితః ।**
**శుద్ధాత్మా నీల వస్త్రాది యోగేన స్ఫటికో యథా ॥**

స్వచ్ఛమైన స్ఫటికము నలుపు, ఎఱుపు, పసుపు వస్త్రములయొక్క సన్నికృష్ట సంబంధముచేత ఆ యా స్వరూపములను వ్యవహారమందు పొందిన లాగుననే యీ పరిశుద్ధమైన ఆత్మయు అన్నమయాది కోశములయొక్క, తాదాత్మ్యధ్యాసములవల్ల ఆ యా స్వరూపములను బొందినట్లు తోచుచున్న ప్ఫటికిన్ని గురుశాస్త్రానుభవములచేత విచారించినట్లయితే ఆ పంచకోశము లకు విలక్షణమై యుండు ఆత్మ వీటితో సంబంధింపక, సాక్షిగా నుండునని చక్కగా తెలుసుకొనవచ్చును.

భక్తులారా! అయ్యో! ఆత్మ విషయాది దోషములచే క్షయించి పోయిన దని భయపడకుడు. మంచుకాలము వెళ్ళిపోయిన తర్వాత వర్షఋతువు వచ్చు

నప్పుడు బురదనుండి పద్మమేలాగున బుట్టుటకు ప్రారంభమై పూర్వ ప్రకారము క్రమక్రమముగా గొప్పగొప్ప పత్రములతోను, పుష్పములతోను కోమలమై శోభాయమానమై సరస్సు ప్రకాశించుచుండునో, ఆలాగున మీ హృదయ సరోవరములో, విషయాసక్తి యను మంచు కురువక వైరాగ్య బోధమనెడు గ్రీష్మఋతువు గల్గి క్రమ క్రమముగా కరుణ, భక్తి, శాంతమనెడు వర్షము కురియుటకెపుడు ప్రారంభమగునో, అప్పటినుండి హృదయవికాస మున్ను, విశాలత్వమున్ను, నిర్మలత్వమున్ను గలిగి అతీంద్రియజ్ఞానము గలుగును. అప్పుడు జీవన్ముక్తియు, విదేహముక్తియు, తురీయజ్ఞానమున్ను, తురీయాతీత జ్ఞానమున్ను మనకందరికిన్ని గల్గును. అప్పుడు బంధము లన్నియు తెగిపోవును, అవరోధములన్నియు వదలిపోవును. దైవపదవియు గలుగును. పూర్ణప్రజ్ఞయున్ను సిద్ధించును. అదే కడపటి జన్మము. అంతవరకు జన్మపరంపరలు కర్మానుగుణములుగా వచ్చుచునే యుండును. అప్పుడు జ్ఞానాగ్ని ప్రజ్వలించి కర్మబీజములన్నిటిని కాల్చివేయును. అగ్నిలో వేయించిన గింజ లేలాగున మొలకెత్త లేవో, ఆలాగున వీనికర్మ బీజము లన్నియు భస్మములై పోవును. అదే శివపదము - శుభకరము - భగవత్స్థానము, - మోక్షము. దీనికి బాహ్యవిద్యగాని, బాహ్యచిహ్నములుగాని, బాహ్యస్థలములు గాని, కారణములుగావు. పై జెప్పినవన్నియు నుండినను లేకపోయినను ఆత్మవిద్యయున్ను, అంతరంగ విరక్తియున్ను, ఆత్మలో నిలకడగలిగెడు ఏకాంతస్థలమున్ను నుండిన చాలును. అప్పుడు మీరేదేశీయులైనను, ఏ మతస్థులైనను, ఏ జాతి వారైనను, ఏ యాశ్రమములతో గూడినవారైనను, స్త్రీలైనను, పురుషులైనను, పిల్లవారైనను, పెద్దవారైనను విరోధము లేదు. ముక్తాత్ములగుదురు; సందేహము లేదు.

పాత్రలు భిన్న లోహములతో గూడినను, ఏ యే యాకృతులతో నుండి నను, ఏయే రంగులు గల్గియుండినను, ప్రాతవైనను, క్రొత్తవైనను, చిన్నవైనను, పెద్దవైనను విరోధము లేదు. అపాత్రములలోగల జలము నిశ్చలముగాను నిర్మలముగా నుండిన చాలును. అప్పుడవి యెచ్చట పెట్టినను సూర్యప్రతి

బింబము వానిలో గనుగొనవచ్చును. అదేమాదిరి మీలో వెల్గుచుండు దైవమును దర్శించు కొనవచ్చును. దీనికి రెండు సాధనలు చాలును. అవి యేవన మీ హృదయక్షేత్రమున దైవస్మరణ (లేక దైవచింతన, లేక దైవభావము) యనుబీజమును పెట్టి కరుణ (లేక ప్రేమ, లేక భక్తి) యను జలముతో పోషించిన చాలును. అప్పుడదియే స్వయముగా, జ్ఞానముగా అంకురించి శమదమాది గుణములుగా జిగురించి ఏకాంతభక్తియను (లేక హృదయవికాసమను) పుష్పముగా పరిణమించి ముక్తియను పండునిచ్చును. విత్తనము పెట్టి నీటితో తడుపుచుండిన తక్కిన అంకురము చిగిరించడము, పుష్పించడము, ఫలించడము అను క్రియలన్నియు దైవశక్తిచే స్వయముగానే గల్గుచుండును. అట్టి దానిలో మనుష్యప్రయత్న మేమియు అక్కరలేదు. సంరక్షణమాత్ర మొక్కటియే మానవప్రయత్నమై యుండిన చాలును. ఇదే యీశ్వరుని యొక్క మహిమ. సృష్టియొక్క అచింత్యశక్తి; సర్వేశ్వరునియొక్క అత్యంత మహిమాతిశయ మాహాత్మ్యము!

భక్తులారా! ఆత్మసోదరులారా! ఇంతవరకు చెప్పిన విషయము కొద్దిగ ఉండినను మనము గ్రహించవలసిన విషయములో నిది ముఖ్య సారమై యున్నది. ఇది వేదాంతశాస్త్ర క్షీరసాగరముయొక్క సారమగు రసమని గ్రహింపుడు.



# గృహస్థసన్న్యాసాశ్రమములయొక్క భేదము

## శుష్కవేదాంతియొక్క ప్రశ్న

ప్రశ్న :- సాధువులకున్ను, (అనగా సన్న్యాసులకున్ను) గృహస్థులకున్ను ఏమి భేదము గలదు? గృహస్థుల కిల్లు గలదు. సన్న్యాసులకు మఠము అనగా ఆశ్రమము గలదు. గృహస్థులకు పుత్రమిత్రులు గలరు. సన్న్యాసులకు శిష్యులును, భక్తులును గలరు. పశువులున్ను, భూములున్ను, ఉభయులకు సమానముగానే యుండును. ఇక ఏ విషయములో వీరికిని వారికిని వ్యత్యాసము గల్గుచుండును?

సమాధానము :- అయ్యా! మీరు ఈలాటి ప్రశ్నలడిగితిరి. ఈ కాలమున కిది తగిన ప్రశ్నగానే యున్నది. (ఇతరులగు) జనులారా! ఈ ప్రశ్న అడిగినవారు వేదాంతశాస్త్రములో మంచి పరిశ్రమ చేసినవారు. వీరు చాలా సూక్ష్మబుద్ధియున్ను గల్గినవారు. ప్రస్తుత ప్రపంచముయొక్క పరిణామస్థితి చక్కగా ఎరింగిన వారగుటచేతనే యీ ప్రశ్న నడిగియున్నారు. వీరికి గల్గిన సందేహము ఇప్పుడు ప్రపంచములో చాల మందికిని గల్గియున్నది. దీనియొక్క తత్త్వము వారికి గోచరపడే లాగున దెల్పుట యుచితము. అయితే పాపము వీరు చాల మంచివారు. అట్లు గానిచో మరియొక ప్రశ్నగూడ అడిగియుందురు. ఆ ప్రశ్న యేమనగా, గృహస్థునికి భార్య గలదు, అట్లే సన్న్యాసికిన్ని ఒక్కతెను చెప్పియుండవలసినవారే! దైవకృపచే, అట్టి పాపవచనము వినబడక తప్పిపోయినది. కొందరు కఠినులు అదిన్ని అడిగియుందురు. ప్రస్తుతస్థితిలోగల కొందరు సన్న్యాసుల అనగా సాధువుల స్థితిని జూచియే వీరు ఇట్లడిగినారు.

ఇది యెటువంటిదనగా, బ్రాహ్మణులలో ఎవరైన కొందరు బ్రాహ్మత్వమునకు సరియైన ఆచరణ లేనివారై అనాచారులై ప్రవర్తించుచో, అట్టివారిని జూచి బ్రాహ్మణేతరులలో ఎవరో కొందరు, బ్రాహ్మణులకున్ను బ్రాహ్మణేతరులకున్ను ఏమి భేదమని అడుగునట్లుండును. ఇదిన్ని మంచి ప్రశ్నయేగాని, నింద్యమైనది గాదు. అయితే, ఈ ప్రశ్నకున్ను, సాధువుల

నుద్దేశించి చేసిన ప్రశ్నకున్ను చాల భేదము గలదు.

పూర్వికులగు బ్రాహ్మణులకు సరియైన సత్యము, ధర్మము, ధ్యానము, జ్ఞానము, తపస్సు మొదలైన దైవిక గుణములు గల్గియుండుటచే అట్టి నిష్ఠలేని బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులపై భయభక్తులు గల్గియుండిరి. ఆలాగున సన్న్యాసులలో గూడ పూర్వముండువారు శమదమాది సత్యధర్మాదులగు దైవగుణములు గల్గి దైవజ్ఞానులై, ప్రజలక్షేమముకొరకు ప్రయత్నించి యుండినందుచే ఇతర ఆశ్రమస్థులు వారిని పూజించి గౌరవబుద్ధితో చూచుచుండిరి. బ్రాహ్మణులకున్ను పూర్వము పూజ్యత గల్గుట కిదే కారణము. పూర్వికులు బుద్ధిహీనులై సాధువులను, బ్రాహ్మణులను, దైవభావముతో జూచినవారు కారు. అప్పటివారి బుద్ధియు, యోగ్యతయు ఇప్పుడుండు వారికి లేదు. దానికొక ముఖ్యకారణము చెప్పెద. తనయొక్క కుటుంబమును సంరక్షింప శక్తిలేనివారికి ఇతరుల కుటుంబ సంరక్షణ విషయమై సలహా చెప్పుటకు ఎట్లు అర్హత లేదో, ఆలాగున తన రాజ్యమును రక్షించుకొనుటకు తగినబుద్ధి శక్తి లేనివారు ఇతర రాజ్యముల వారికన్న బుద్ధిలేనివారే. పూర్వికులగు వారు రాజ్యమును చక్కగా సంరక్షింప శక్తి గల్గి యుండిరి. ఇప్పుడు అది లేనివారు పూర్వికులకన్న, బుద్ధి యెక్కువ తమకు గలదని చెప్పుట బుద్ధిలేనితనమే యగును.

అయితే ఇప్పుడుండెడు స్వాతంత్ర్యము సర్వజనులకు అప్పుడుండెనా? యని అనేకు లడిగెదరు. మరియు ఈ కాలమున నుండేలాగున యంత్ర సామగ్రులు అప్పుడుండలేదు గదా? యని గూడ ప్రశ్నింతురు. అయితే, అప్పుడుండిన జనులయొక్క స్థితి గతులెట్లుండినవో యిప్పుడు మన మూహింపజాలము. ఏవిధమైనను ప్రపంచములోగల సర్వదేశములకన్న, పూర్వము భారతదేశము అతిమనోహరముగను, శోభాయమానముగను ఉండినదని సర్వజను లంగీకరించియున్నారు. మరియు మనయొక్క విజ్ఞానగ్రంథము లన్నియు అప్పుడేర్పడినవే. లోకము జ్ఞానవంతముగా లేనిచో

ఇట్టి యమోఘములగు శాస్త్రము లేర్పడియుండవు.

అయితే స్త్రీలకున్ను ఇంత జ్ఞానమప్పటికాలములో నుండెనా? అని అనేకులు తలంపవచ్చును. అది శాస్త్రపరిచయము లేనందుచే నేర్పడిన సందియమేగాని మరియొకటి గాదు. మైత్రేయి, చూడాల, గార్గి మొదలైన వారివంటి స్త్రీలు ప్రపంచములో ఇప్పుడు గలరా? బ్రాహ్మణేతరుడగు సూత మహర్షికి సమానులు వర్తమానయుగములో మరియొకరున్నారా! అయితే, కొన్ని శాస్త్రములలో స్త్రీలకున్ను, శూద్రులకున్ను స్వాతంత్ర్యము లేదనియు, వారు సేవకవృత్తిలో ఉండవలెననియు, ఎవరో అసూయాపరులు చెప్పియుండ వచ్చును. దానిని ఎవరును విధివాక్యమని అంగీకరించుట లేదు. అట్లుండిన, మైత్రేయ్యాది నారీమణులున్ను, సూతాది మహర్షులున్ను ఉండియుండరు. ఒకవేళ ఉండినచో వారిని ఎవరున్ను అంగీకరించి యుండరు.

నైమిశారణ్యములో బ్రాహ్మణాది బ్రహ్మర్షుల మండలమందే వ్యాఖ్యాన సింహాసనారూఢుడై శ్రీ సూతమహర్షి పుంగవుండు అష్టాదశపురాణముల నుపదేశించెను. ఆలాగున జనకమహారాజను మహనీయునిచే చేయంబడిన మహాసత్రమున బ్రాహ్మణాది బ్రహ్మర్షులయొక్కయు, పండితోత్తముల యొక్కయు మధ్యమున గదా గార్గి యాజ్ఞవల్క్య మహామునితో శాస్త్రార్థము చేసెను! ఈ రెండు పనులున్ను క్షత్రియరాజులచే పరిపాలింపబడెడు కాలముననేగాక రాజుల సమక్షముననే జరిగియున్నవి. దీనివల్ల స్త్రీ శూద్రులకు స్వాతంత్ర్యము లేదనియు, బ్రహ్మవిద్యయం దధికారము లేదనియు చెప్పుటకు ఎవరికిని నోరాడదు. కాని, మధ్యకాలములో నెవరో పరమ క్రూర స్వభావము గలవారు వ్రాసిన గ్రంథములలో మాత్రము పై జెప్పిన వారికి స్వాతంత్ర్యము లేకుండ జేసియున్నారు. దానియొక్క ఫలమే వీరు పరులకు సర్వవిధములను స్వాతంత్ర్యహీనులై, బానిసలై దుఃఖము ననుభవించు చుండుట. తాను పెట్టిన విత్తనముయొక్క ఫలమును తాననుభవించుట యీశ్వర నియతిగదా! మనుష్యుల ఆత్మాభివృద్ధికి అడ్డుపోవుటకన్న మరియొక

మహాఘోరమగు బ్రహ్మహత్యాదోషమెద్ది గలదు? అట్టివాడు ఏ ప్రపంచము లోను ఉండదగినవాడు కాడు. వానిని ద్వీపాంతరమునకు బంపివేయుటయే లోకమునకు శ్రేయస్కరము.

అయితే మనము ప్రారంభించిన విషయమునుండి లోకము లోనికి దిగివచ్చుటకు కారణమేమని కొందరు తలంచవచ్చును. ఈ విషయమున్ను మనము గ్రహించవలసినదియే. ఇచ్చట యోగ్యత ననుసరించి స్వాతంత్ర్యము లేనివారికి పరములో బంధవిముక్తిపరమగు స్వాతంత్ర్యమును సంపాదించు కొనుటకున్ను యోగ్యత గల్గియుండదు. మొదట ప్రశ్న చేసిన వారి మాటలను వినిన హృదయము చాల పరితాపము నొందుచున్నది. ఏలన సాధువుల యొక్కయు, సన్న్యాసులయొక్కయు, భక్తులయొక్కయు, స్థితి యింత హీనా వస్థకు వచ్చినది గదా! అయ్యయో! ఇది యెంత కష్టము! సాధువుల దర్శనముచేమాత్రమే జనులు పాపములనుండి విముక్తులై పుణ్యాత్ములు గాగలరని చెప్పుచుండు మనదేశమునకు ఇటువంటి హీన దుఃస్థితి వచ్చినదే! సాధువుల ఆశ్రమదర్శనముచే దోషములన్నియు నశించి, ధన్యాత్ములు గాగలరని బోధించెడు మన దేశమునకు ఎంత హీనావస్థ గల్గినది! సాధువుల మాటలు విన్నంత మాత్రముచే మనదుఃఖములన్నియు శమించి, ఆత్మశాంతి గల్గునని యుపదేశించెడు మన రాజ్యమెంత అంధకారమునకు వచ్చిజేరినది! సాధువులకు కొంచెమైన దానమిచ్చిన అది మేరువంత ఫలమును గలుగ జేయునని బోధించెడు మనవారి జీవితము ఎంత అడుగునకు వచ్చి చేరినది! సాధువులకు దాహమునకైన వట్టి మంచినీళ్లిచ్చినను, అది అమృతసాగరము వలె వృద్ధినొందునని తెలుపు మనవారి బుద్ధి యెంత మందమై పోయినది! సాధువులు మనయింటికి వచ్చినమాత్రముననే తరతరములుగా ప్రేత లోకములో గల పితరు లుద్ధరింపబడుదురనియు, పుణ్యలోక ప్రాప్తిగల్గు ననియు చెప్పెడు మనశాస్త్ర మెచ్చట బోయినది! ఓహో! శుష్కవేదాంతి చేసిన ప్రశ్న స్మరించునప్పుడు మనస్సు నీరుగా కరుగుచున్నది. అయ్యో! ఇట్టి దురవస్థ మనదేశమునకు గల్గినదా! యని హృదయము తపించు చున్నది.

అయితే ఆయన వేసిన ప్రశ్న ఇప్పుడు వ్యర్థముగా దిరుగుచుండు సాధువులైన కొందఱు సోమరులను జూచి చెప్పినదేగాని, మరియొకవిధముగా కాదని జ్ఞాపకమునకు తెచ్చుకొనునప్పుడు హృదయములో కొంచెము హాయి గల్గుచున్నది. వారు చెప్పునది నిజము. చాలమంది సాధువులు అట్టి స్థితికి వచ్చిరి.

అయితే అందరున్ను అట్లే యున్నారని తలంచుట పాతకము. వంశనాశకరము. ఎందరో మహాత్ములు దైవాత్మస్వరూపులై లోకమున కనుగ్రహము చేయుచున్నారు. ఎందరో సన్న్యాసులు తమయొక్క సమస్త సౌఖ్యములను పరిత్యజించి తపస్సు చేయుచున్నారు. ఎందరో పుణ్యపురుషులు తమ జీవితమంతయు లోకోపకారములో వినియోగపరచుచున్నారు. ఎందరో జ్ఞానము నార్జించి ప్రజలకుపదేశించుచున్నారు. ఎందరో దయాస్వరూపులు జనుల హృదయములలోగల అజ్ఞాన మాలిన్యమును తొలగించి వారిని ధన్యులుగా జేయుటకు ప్రయత్నించుచున్నారు. ఎందరో మహాత్ములు ప్రాణికోట్లలో కరుణగల్గి హింసను నిలుపుదల చేయుటకై యత్నించుచున్నారు. ఎందరో జనులదుఃఖనివృత్తికొరకు ఆత్మజ్ఞానము నుపదేశించుచున్నారు. ఎందరో ధీమంతులు జనులకు దైవభక్త్యాదులను బోధించి వారిని తరింపజేయుచున్నారు. ఎందరో సాధుపురుషులు జనుల నజ్ఞానమార్గమునుండి నివృత్తిపరచుకొని, పరమార్థజీవితములో కాలము గడిపేలాగున నుపదేశించుచున్నారు. ఎందరో కరుణాస్వరూపులు లోకములో ప్రేమతత్త్వము నుద్బోధించుచున్నారు. ఎందరో సుఖపురుషులు సర్వసుఖములను పరిత్యజించి జనుల నజ్ఞానమను అస్వాతంత్ర్య శృంఖలములనుండి విముక్తులను చేయుటకు ప్రయత్నించుచున్నారు. అట్టివారికి మనము కడుపునకు అంత అన్నమున్ను, కట్టుటకు కొంచెము వస్త్రము గదా ఇచ్చుచున్నాము! వారంత మాత్రమైన సంపాదించుకొనుటకు సామర్థ్యము లేనివారా? లేక అట్టివారు అంత మాత్రమైన కుటుంబములో ధనము లేనివారా? అయ్యో! అట్టి పుణ్యపురుషులను హీనులనుగా దలంచుట చాల పొరబాటు.

అట్టివారు లేనిచో మన జీవితము మృగప్రాయము గదా! శ్రీయేసు క్రీస్తు లేనిచో క్రైస్తవులే యుండియుండరు గదా! శ్రీ మహమ్మదునబి లేనిచో మహమ్మదీయులే యుండరు గదా! శ్రీబుద్ధదేవుడు లేనిచో బౌద్ధులే యుండక పోదురుగదా! ఆలాగున శ్రీ శంకరులు లేనిచో అద్వైతరసామృతమును పానము చేయకపోవుటయే గాక, పరమాద్వైత మతముగూడ లేకపోవును గదా! అట్లే శ్రీరామానుజు లుండనిచో భక్తిరసమను పీయూషమును జనులు పానము చేయకపోవుటయే గాక, విశిష్టాద్వైతమతమున్ను ఉండకపోవునుగదా! అదే రీతిగా శ్రీమధ్వాలుద్భవించనిచో ద్వైతమతము నెరుంగజాలము గదా!

అట్లే శ్రీదయానందులు లేనిచో, అర్యమత ముద్భవించి యుండదు గదా! అదే ప్రకారము, శ్రీగురునానక్ లేనిచో సిక్కుమత మేర్పడియుండదు గదా! శ్రీరామమోహనరాయ్ లేనిచో బ్రాహ్మమతము తెలిసియుండజాలరు గదా! అట్లే శ్రీమహాత్మాగాంధీగారు లేనిచో స్వారాజ్యతత్త్వ మిటువంటిదని జనులందరును ఎరింగియుండరు గదా! ఈలాగున, శ్రీకృష్ణచైతన్యులు (గౌరాంగ్) లేనిచో శ్రీకృష్ణభక్తిప్రభావము మానవులందరును ఎరింగి యుండరు గదా! అట్లే శ్రీరామకృష్ణపరమహంస అవతరింపనిచో బ్రహ్మవిద్యకు సర్వజనులును అర్హత గలవారని తెలిసికొనియుండరు గదా! అంతేగాక నదీ నదము లన్నిటికిన్ని గమ్యస్థానమయి సముద్ర మొకటే యేలాగున నుండునో, ఆలాగున సర్వమతములయొక్క కేంద్రస్థానము ఒకే దైవస్థానమని ఆ మహాత్ములు లేనిచో మనము తెలుసుకొనజాలము గదా!

వీరందరును సన్న్యాసులు గారా! వీరిలో ఒకరుగాని, ఇద్దరుగాని సన్న్యాసాశ్రమము స్వీకరింపక పోయినను, సర్వత్యాగులుగారా! సాధుశబ్దమున కున్ను, సన్న్యాసశబ్దమునకున్ను అర్థము కాషాయము ధరించుటయని యెవరున్ను చెప్పరు. త్యాగమే సన్న్యాసము. దానికొక గురుతు మాత్రమే కాషాయధారణము. మరియు కొన్ని ప్రతిబంధములు తొలగుటకున్ను అది యొక హేతువగుచుండును. లేనిచో దేహ, కుల, మతముల కట్టుబాటుల

నుండి విముక్తి నొంది స్వాతంత్ర్యముతో తత్త్వమును బోధించుటకున్ను అను కూలము గలుగదు. దేహసంబంధులు వీరిని విడువరు. అట్లైన మతగురువులు వీరి జోలికి రారు. ఈ అవస్థ గల్గువరకున్ను కొంతబంధన ముండును. ఇది గల్గినప్పుడు, పంజరములో ఉండి బైటవచ్చిన సింహమునకువలె వీరికి శక్తి గల్గును.

పై జెప్పిన మహనీయు లందరున్ను, జీవనమునకు లేకనా సాధువు లైరి? అట్టి మహాపురుషుల ఆశ్రమములున్ను, సాధారణ జనుల గృహస్థాశ్ర మములున్ను ఒక విధముగానే యుండునా? ఆ మహనీయులు సర్వస్వమును త్యజించి లోకసేవ చేయనిచో, నీ జనులకున్ను, అడవి మృగములకున్ను ఏమి భేదము గల్గియుండును. అట్లయిన మతమే లేదుగదా? మతము లేనివారు మానవులు గాజాలరుగదా? శ్రీవివేకానంద, శ్రీరామతీర్థులు మొదలగు ఆధు నిక యతిపుంగవులు లేనిచో, మనదేశమున్ను, మతమున్ను ఇప్పటికి క్షయించియే యుండును గదా?

మరియు ఆత్మతత్త్వమును కనుగొనుట సామాన్యమని తలంచు చున్నారా! నిర్విషయము నొంది నిర్వికల్పసమాధిలో ప్రవేశింపక ఆత్మ తత్త్వము గోచరము గాగల్గునా? అట్టి దానికి ఎంత సాధన గల్గియుండ వలయును! ఎట్టి సత్యధర్మముల నాచరణలో పెట్టవలయును! ఎంత బ్రహ్మచర్యవ్రతము గలిగియుండవలయును! ఎంత యింద్రియ నిగ్రహము గల్గిన వారికది లభించును! ఇది సామాన్య గృహస్థులకు సాధ్యమగునా! గృహస్థాశ్రమములో నుండి యిట్టిస్థితి సాధింపగలరా? సముద్రములో గల ముత్యమును గ్రహించుటకు ఎంత ప్రయత్నముండవలయును? భూగర్భాంత ర్భాగమున గల రత్నములను సంగ్రహించుట కెంత ప్రయత్నముండవలెనో, యీ ఆత్మను సాక్షాత్కరింప జేయుటకున్ను అట్టి ప్రయత్నముండ వలయును. అందుచేతనే సాధువులకు యతులని నామము గల్గినది. యతులనగా? యత్న శీలురనియే శబ్దార్థము చెప్పుచున్నది. కావుననే గృహస్థా

శ్రమమునకన్న భిన్నముగా వానప్రస్థమున్ను, యత్యాశ్రమమున్ను ఏర్పడినవి.

అయితే గృహస్థాశ్రమములో నుండి యిది సాధింపరాదా? యని అడుగవచ్చును. సాధింపలేరని ఎవరున్ను చెప్పజాలరు. అయితే సాధించిన వారిని ఆ విషయమై అడుగవలయును. ప్రసవవేదన ప్రసవించని వారికెట్లు తెలియును? పాండిత్యమును సంపాదించుటలోగల శ్రమ పామరుండెట్లెరుంగ గలడు? ఆలాగున సత్యధర్మ నిరతులై, యింద్రియ నిగ్రహము గల్గియుండు వారి అనుభవమును అట్టివారినే సావధానముగ అడుగవలయును, ఒకవేళ గృహస్థాశ్రమములోనుండి సాధించిన వారొక్కరుగాని, యిద్దరుగాని, యుండినచో, వారు సన్న్యాసాశ్రమములో నుండువారికన్న అధికనిష్ఠ గలవారై యుండియుందురు. అదియును గాక వారు కారణజన్మము గలవారై యుందురు.

గృహస్థాశ్రమములో నుండి ముక్తి పొందలేదా? యని జనకమహా రాజును గురించి అందరున్ను వెంటనే అడుగుదురు. జనకుడు త్రేతాయుగ మందుండినవాడు. అప్పటినుండి నేటివరకును అట్టివారు కనుపించుట లేదు. అంతేగాక, జనకునియొక్క వైరాగ్య మెటువంటిదో సిద్ధగీతలో గనంద గును. మఱియు జనకునియొక్క ఆత్మప్రబోధ దార్ఢ్య మెటువంటిదో శుక బ్రహ్మ కైవల్యమున జూడందగును. ఎంతకాలము నిర్జనస్థలమగు ఉద్యానవనములో నిర్వికల్పసమాధి సిద్ధించుటకు తపస్సు చేసెనో సిద్ధగీతను చదివిన వారికి తెలియును. అంతేగాక జనకునికి అష్టావక్రమునీంద్రుడు, అమనస్క భావమును బోధించిన తత్త్వగ్రంథమగు అష్టావక్రగీతను జూడుడు. అప్పుడు జనకునియొక్క వైరాగ్యము, జ్ఞానము మీకు గోచరమగును.

మరియు జనకుడు వసిష్ఠయాజ్ఞవల్క్య పంచశిఖాది అనేక మహర్షుల సేవజేసి బ్రహ్మతత్త్వమును గ్రహించియున్నారు. అంతేగాక, త్రేతా యుగములో గల ధర్మ మెటువంటిదో, అట్టికాలమున నిమిత్తమాత్రముగ జనకుడు రాజ్యపరి పాలనము చేసెనేగాని, కార్యము లన్నియు మంత్రి

ప్రభృతులే జరుపుచుండిరి. జనకుని రాజధాని బ్రహ్మవిద్యా బోధకమేగాని మరియొకటి కాదు. అది రాజ్యపాలన కాదు. రాజయోగపాలనగా నుండెను. ఆలాగున ఆచరించు వారుండిన వారికి సన్న్యాసాశ్రమ మవసరము లేదు. గృహస్థాశ్రమములో నుండి బ్రహ్మవిద్యను సాధించుటలో ప్రతిబంధము గలవారు మాత్రమే సన్న్యాసాశ్రమము స్వీకరించిన చాలుననియే శాస్త్రము జెప్పుచున్నది. సన్న్యాసమనగా? వేషము గాదు సుమీ! త్యాగమనియే దాని యొక్క అర్థము.

ఆలాగున ధర్మవ్యాధుడు మాంసవిక్రయము చేసికొని గృహస్థాశ్రమములో నుండి జ్ఞాని కాలేదా? యని గూడ కొంద రడుగుదురు. అదిన్ని త్రేతా యుగములో జరిగిన జీవితముగా నుండెను. అప్పటినుండి యిప్పటివరకు ఎందరో ధర్మవ్యాధుని బాహ్యక్రియలు ఆచరించిన వ్యాధు లుండిరి. ఒకరికిన్ని అట్టి జ్ఞానము గలుగలేదు. ధర్మవ్యాధుని జన్మమున్ను కారణజన్మమే. అతడు బోయవాడై యుండియు జీవహింస చేయలేదనియు, మాంసభక్షణము చేయలేదనియు కౌశిక బ్రాహ్మణ సంవాదమున ధర్మవ్యాధుడే స్వయముగా చెప్పియున్నాడు. అదియునుగాక, ఆ దినముయొక్క జీవనమునకు మాత్రమే మాంసవిక్రయము చేయునుగాని, అంతమట్టుకు దొరికిన మరల ఆ పని చేయడు. అచ్చటినుండి వెళ్లి వృద్ధులగు తల్లిదండ్రులను స్నానము చేయించి వారలను దైవభావముతో పూజించి, భోజనము పెట్టి, మంచములో పరుండ పెట్టి కొంతసేపు వారిపాదములు ఒత్తును. తర్వాత తాను భోజనము చేయుచుండును. ఈలాగున వర్తించెడు ధర్మవ్యాధులు ఇప్పుడెంతమంది యున్నారు? జనకునియొక్కయు, ధర్మవ్యాధునియొక్కయు జ్ఞానము జన్మాంతర సంస్కారమహిమచే కాకతాళీయన్యాయముగా సిద్ధించినదేగాని, మరియొక్కటి కాదు. అట్టి వారుగూడ సాధువులను, మహర్షులను ఎంత భక్తి శ్రద్ధలతో పూజించుచుండిరో, జనకునియొక్కయు, ధర్మవ్యాధునియొక్కయు జీవితమును పరిశోధించిన గనందగును. పరమత్యాగులైన సాధు పురుషులు లేనిచో బ్రహ్మజ్ఞానామృత ప్రవాహమును లోకములోనికి ప్రవహింపజేయుట

ఎవరితరము? అట్టి భక్తిరసామృతవృష్టి లేనిచో ఈ మానవుల జీవితము వర్షములేని దేశమువలె నుండును గదా?

నిస్సంకల్పముగాను, నిర్విచారముగాను నుండి ధ్యానము చేయుటకు సర్వత్యాగము చేయనివారికి సాధ్యమగునా? త్రాటితో కట్టబడిన పశువు ఎంత దూరము సంచరింపగల్గును? ఆలాగున దృశ్యవాసనయను పగ్గముతో బంధింపబడిన జీవుడు గుణత్రయాతీతమగు జ్ఞానము నెట్లు పొందగల్గును? ఇట్లు చెప్పుటచే సన్న్యాసమున కాధిక్యమిచ్చి గృహస్థమును గౌణముగా చేసినట్లు తలంపరాదు. త్యాగము లేక బ్రహ్మజ్ఞానము పొంద సాధ్యము గాదని మాత్రమే తెలుసుకొనవలసి యుండును.

**త్యాగేనైకే అమృతత్వమానశుః ।**

త్యాగము ఒక్క దానిచేమాత్రమే అమృతత్వము గల్గునుగాని వేరు మార్గము లేదు. "నాన్యః పంథా విద్యతేఽయనాయ" ముక్తికి సర్వసంగ పరిత్యాగము తప్ప వేరుమార్గము లేదు. అట్టి విరక్తులు గృహస్థాశ్రమస్థులు గాని, సన్న్యాసులుగాని, బ్రాహ్మణులుగాని, అబ్రాహ్మణులుగాని, స్త్రీలుగాని, పురుషులుగాని అయినచో వారందరును సాధువులే, సన్న్యాసులే, పూజ్యులే, మహనీయులే. వ్యక్తిగతముగా గాని, వర్ణగతముగా గాని, ఆశ్రమగతముగా గాని శ్రేష్ఠత్వమును ఎప్పుడును జెప్పజాలము. దైవగుణము గలవారు మాకు దైవసదృశులే! ఏలాటి సందేహమున్ను మాకు లేదు.

**వనేఽపి దోషాః ప్రభవంతి రాగిణాం**
**గృహేఽపి పంచేంద్రియ నిగ్రహస్తపః ।**
**అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే**
**నివృత్తరాగస్య గృహం తపోవనమ్ ॥**

విషయేచ్ఛ గలవారు వనములో నుండినను దోషమే గల్గుచుండును. పంచేంద్రియనిగ్రహము గలవారై విరాగులైనవారు గృహస్థాశ్రమము నందుండి

నను వారు తాపసోత్తములే. నికృష్టకార్యము చేయనివాడు ఎచ్చట నుండినను వాడు శ్రేష్ఠుడే. విరక్తిగలవాని గృహము తపోవనమే యగును.

**నాశ్రమం కారణం ముక్తేర్దర్శనాని న కారణమ్ ।**
**తథైవ సర్వకర్మాణి జ్ఞానమేవ హి కారణమ్ ॥**

ముక్తికి ఆశ్రమము గాదు కారణము. ఆలాగున శాస్త్రములున్ను కారణములు గావు. అట్లే సర్వకర్మలు కారణములు గావు. జ్ఞాన మొక్కటియే కారణము. ఈ జ్ఞానము ఏ ఆశ్రమములో నుండు వారికిగాని, ఏ వర్ణములో నుండువారికిగాని కలిగినచో వారు ధన్యాత్ములే. జీవన్ముక్తులే. దీనికి సందేహము లేదు అని ఉపనిషద్వచనము. ఇప్పుడు సంసారము విడిచి త్యాగి కావలయునని చెప్పుట బాహ్యసంసారము విడుచుట గాదు.

**అహంకారసుతం విత్తభ్రాతరం మోహమందిరమ్ ।**
**ఆశాపత్నీం త్యజేద్యావత్తావన్ముక్తో న సంశయః ॥**

ఇచ్చట విడువందగిన సంసారముయొక్క నిజార్థము చెప్పబడుచున్నది. అహంకారమను పుత్రుని, విత్తమనెడు అన్నదమ్ములను, మోహమనెడు గృహమును, ఆశ యనెడు భార్యను విడుచుటయే యథార్థమైన సన్న్యాస మగును. ఇదే త్యాగ మనంబడును. ఇవి యెంతకాలమువరకు విడువబడలేదో అంతకాలమువరకు ముక్తి గలుగదు. వీటిని విడిచినవాడు ఏ ఆశ్రమములో నుండినను ముక్తుడే.

ఇక ఇంతవరకు అడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పుటలో ప్రవేశించెద. మఠమునకున్ను, గృహమునకున్ను ఇంత భేదము గలదు. మఠము నిర్విషయమగు యోగమును నేర్పుచుండును. గృహము విషయపూర్వకముగా భోగము నుపదేశించును. మఠము విరాగమును దెలుపును. గృహము రాగము నుపదేశించును. మఠము నిష్కామమును బోధించును. గృహము సకామము నుపదేశించును. మఠము విరక్తులైన ముముక్షువులను పోషించుచుండును.

గృహము పుత్రమిత్రాదుల రక్షించుచుండును. మఠము పరులకొరకు పని చేయును. గృహము స్వార్థముతో గూడియుండును. మఠము సర్వజనులకు సొంతముగ నుండును. గృహము సొంతజనులకు మాత్రమే హక్కు గలిగి యుండును. మఠము బ్రహ్మవిద్య నుపదేశించును. గృహము ప్రపంచవిద్య నేర్పును. మఠము ఈశ్వరమార్గము నుపదేశించును. గృహము ప్రకృతి మార్గములో నుండేలాగున దెల్పును. మఠము ఆత్మయొక్క బంధవిచ్ఛే దనము నుద్బోధించును. గృహము పుత్రమిత్రాదులతో గూడిన బంధమునే గలుగజేయును. మఠము దేహియే సత్యమని తెలుపును. గృహము దేహమే సత్యమని నమ్మును. మఠము దైవప్రాప్తియగు జ్ఞానమే శాశ్వతమని తెలుపును. గృహము ప్రపంచమే సత్యమని యుపదేశించును. మఠము వైరాగ్యమే మహా భాగ్యమని యుపదేశించును. గృహము దృశ్యసౌఖ్యమే పరమప్రాప్యమని తెల్పును.

దీనికి ఒక చిన్న దృష్టాంతము చెప్పెద. ఒకడు గృహములో భక్తి, వైరాగ్య ములు గల్గియుండిన అతని సంబంధులు ఈలాగున పల్కుదురు. "ఇది యేమి? ఎల్లప్పుడును జపమున్ను పూజలున్ను గల్గియున్నావు. ఉప్పు, పులుపు మొదలైనవి భుజింపవు. చప్పిడిగా తినుచున్నావు. అందరితోను మాట్లాడవు. మౌనముగా నున్నావు. సరిగా ఆహారనిద్రలు లేవు. ప్రపంచకార్యములు చేయవు. ఎల్లప్పుడున్ను ధ్యానములో కాలము గడుపుచున్నావు'' మొదలగు మాటలు చెప్పి ఆ పుణ్యాత్ముని బాధించుచుందురు.

మఠమో! పై జెప్పిన వాటి కన్నిటికిన్ని వ్యతిరిక్తముగా ఉపదేశించి, అతని ధన్యుని గావించును. "నాయనా! ఏల యెల్లప్పుడున్ను జపములు, పూజలు చేయుటలేదు! రాజస, తామసాహారములు తినకుము. ఎక్కువ మాట్లాడ కుము. మౌనముగా నుండుము. ఆహారనిద్రలలోమాత్రము కాలము గడుప కుము. వాటిని జయింపుము. ప్రపంచవృత్తులను అంతఃకరణములోనికి రానివ్వకుము. వానినుండి నివృత్తిని పొందుము. వైరాగ్యమవలంబింపుము.

నిస్సంగుడవై యుండుము. భూతదయ గల్గి జీవింపుము. సమత్వము గలిగి సంచరింపుము. శమదమాదుల నభ్యసింపుము. భోగవాంఛను విడిచి యోగ నిష్ఠుడవు గమ్ము. విషయవాంఛ విషమువంటి అపాయమును గలుగజేయును. నిర్విషయస్థితిని పొందుము. అది అమృతముకంటె ఎక్కువైనది.

బ్రహ్మచర్యవ్రతము చక్కగ అవలంబింపుము. అది ప్రాణమువంటిది. నీ జీవితములో అది యొకటియే సారమైనది. దీపమునకు తైలమెటువంటిదో, మీ దివ్యజ్ఞానజ్యోతికి అది అటువంటిది. అది యంత్రమునకు ఆయిల్ వంటిది. తైలము నశించిన యింజన్ నిలిచి పోయినట్లు అది లేనిచో, నీ జీవిత యాత్ర ఆగిపోవును. యంత్రము లోపల, తైలముండిన పని చేయునట్లు అస్థి లోపల నుండు మజ్జలోపలనుండి, అది యీ దేహయంత్రమును సర్వ కార్యములలో నియమించుచుండును. ఇది పురుషులకున్నట్లే, శుద్ధరక్తముగా నుండి, స్త్రీలకున్ను ఓజస్సు గలుగజేసి పనిచేయును. ఎప్పుడైనను విషయ భావములోనికి మనస్సును జారనీయకుము. అట్టి భావన యెప్పుడైన గల్గిన దైవభావములోనికి మనస్సును త్రిప్పుము. వైరాగ్యపురుషులగు యోగ పురుషులను స్మరింపుము. బ్రహ్మచర్య వ్రతములో నుండువారు స్త్రీలను పురుషులుగాని, పురుషులను స్త్రీలుగాని మితిమీరి ప్రేమింపరాదు. దానికి మోహమై పరిణమించెడు స్వభావము గలదు. అతీతజ్ఞానులు మాత్రమే మితి మీరిన ప్రేమ చూపందగును. మహాపురుషులు అట్టి ప్రేమను లోపలనే యుంచుదురు. అది అంతరంగభక్తులకే తెలియును.

విషయబుద్ధిచే గల్గిన ఒక్కొక్క గొప్పవారి పతనములను గురించియు, అపకీర్తినిగురించియు, బాధలనుగురించియు జ్ఞప్తికిదెచ్చుకొనుము. కొందరికి ఆత్మహానియు, కుటుంబహానియు, వంశనాశనమున్ను కల్గిన కథలను జ్ఞాపకమునకు దెచ్చుకొమ్ము. ఎంత గొప్పవారలైనను స్త్రీ పురుషులు ఒకే స్థలమున ఉండరాదు. ఇది ఉభయులకు పతనహేతువగును. అట్లుండ వలసియుండిన చాల యోగ్యత గలవారలై యుండవలయును.

ఎప్పుడైన మీ మనస్సు చెడుభావముతో స్త్రీలపై ప్రసరించిన వెంటనే మార్చు చేసికొని అట్టివారిని దైవభావముతో వారి పాదములకు మనస్సుతో పూజలు సలుపుడు. దైవబుద్ధితో కర్పూరహారతి చేయుడు. అప్పుడు మలినములో పడిన కాలు వెంటనే కడిగిన ఎట్లు శుద్ధపడునో, ఆలాగున మీ మనస్సు శుద్ధముగా గలదు. స్త్రీలున్ను, పై జెప్పిన ప్రకారము ఎప్పుడైన మనస్సు పురుషులపై పోయినచో నీశ్వరభావనగాను, గురుభావనగాను చేసుకొని మనస్సుతో పాదములను పూజించి, కర్పూరహారతి చేసి, ప్రదక్షిణ నమస్కారములు చేసిన ఆ దోషముండదు. ఇదే మీకు సులభమార్గము. ఆత్మయొక్క దైవత్వభావము తలంచ శక్తిగలవారికి అది మరింత మంచిది యగును. పురుషులైన శుకసనకాది ఋషులను భావనచేయవలెను. స్త్రీలైన సులభ, మైత్రేయి మొదలయిన వారిని జ్ఞాపకము చేసుకొనుట మంచిది. ఇప్పుడు చెప్పినవన్నియు సాధారణ జనులుగూడ పవిత్రులగుటకు మంచివి". ఈ లాటి బోధలను ఆశ్రమముగాని, మఠముగాని చేయుచుండును.

మరియు గృహము పుత్ర, మిత్ర, ధన, ఆరామాదులలో ఒక్కదాని కొకటిగా బంధనమును గల్గించును. మఠమైన బంధము లన్నిటిని ఛేదించి జీవన్ముక్తి నుపదేశించును. గృహము తనయొక్క బంధువులను మాత్రమే చూచును. మఠము అతిథులనందరను జాతిభేదము లేక తనవలెనే చూచును. ఇక పుత్రులయొక్కయు, శిష్యులయొక్కయు భేదమును చూచెదము. గృహము పుత్రులకు విషయసుఖము నిచ్చుచుండును. మఠము శిష్యులకు నిర్విషయ ముపదేశించి దైవమును చూపును. పుత్రులను స్వార్థసుఖము కొరకు గృహము పెంచును, మఠము శిష్యులను పరార్థముకొరకు పోషించును. గృహము ధనమును సొంతము కొఱకుపదేశించును. మఠము సర్వజనుల కున్ను, సర్వప్రాణులకొఱకున్ను ధనము నుపయోగపరచును. భూమియున్ను, ఆరామములున్ను ఈలాగే యుండును. చూచితిరా! ఎంత భేదము కలదు. విషామృతములకు గల భేదము లేదా? అంధకార ప్రకాశముల వలె వ్యత్యాసము లేదా?

అయితే యీలాటి మఠములు ఈ కాలమున అరుదై పోయినందు చేతను, సాధువులలో అనగా సన్యాసులలో చాలమందిన్ని సౌఖ్యపరులై యుండినందుచేతను, తపోధ్యాననిష్ఠా యోగాదులు చేయకపోవుటచేతను, శమ, దమ, శాంతి, కరుణ, విరక్తులు మొదలగునవి తగ్గిపోయినందుచేతను యీలాటి ప్రశ్నలు వచ్చుచుండును. మరియు లోకోపకారము చేయకపోవుట చేతను, సత్యధర్మములలోగల నిష్ఠ తగ్గిపోవుటచేతను, బ్రహ్మసాక్షాత్కార పర్యంతము నిష్ఠ సలుపకపోవుటచేతను, వైరాగ్యభాగ్యము గలుగకపోవుట చేతను, సదా గృహస్థులనే ఆశ్రయించి యుండుటచేతను, బాహ్యసుఖములలో మునిగిపోవుటచేతను, సోమరితన మెక్కువ గలవారగుటచేతను, విద్యాభ్యాస ములో విముఖులగుట చేతను, అసంస్కారముగల హృదయము గలవారగుట చేతను, ఆడంబరము లెక్కువగుట చేతను, అహంకారము మస్తిష్కమునకెక్కి సొంత దేహకృత్యముగూడ స్వయముగా నిర్వహించుటలో అభిమానము గల వారగుటచేతను, త్యాగము లేకపోవుటచేతను, జిహ్వేంద్రియ గుహ్యేంద్రియ ములయొక్క నిగ్రహము చక్కగ చేయకపోవుటచేతను, పరిశ్రమ చేయక పోవుటచేతను, ప్రబోధకులగు గురువులవల్ల శిక్ష పొందకపోవుటచేతను, స్వయముగా సాధువేషము వేసుకొనుటచేతను, సంసారులలో దురహంకారులై ధర్మబుద్ధిలేని వారిని అన్నిటికిన్ని శరణము పొందుటచేతను (సొంతముగా సాధువేషము అతీతజ్ఞానులు కొందరు వేసుకొనిరి. అయితే వారు జగద్గురువు లగు నంత యోగ్యతగల ధర్మమూర్తులై యుండిరి. అది అందరికిన్ని తగదు) ఈలాటి మాట వినవలసివచ్చినది. ఏమి చేయగలము? ఒక్కరిలోగల గుణదోషములు అందరికిన్ని వచ్చుచున్నవి గదా?

కావున సాధువులైన అనగా విరక్తులైన ప్రతిస్త్రీ, ప్రతిపురుషుడున్ను ఇట్టి దోషము రానట్లు చూడవలెను. నివృత్తిమార్గ మవలంబించిన ప్రతివారును ఇది యొక వ్రతముగ ధరించవలెను. అప్పుడే గృహస్థులకు సాధువులపై విశ్వాస మున్ను, భక్తియున్ను గల్గును. దానివల్ల వారు తరించుటయేకాక తరించుట కభిలాష గలవారికి కావలసిన సహాయము చేయగలరు. అన్నిటికిన్ని సదా

గృహస్థుల నాశ్రయించి యుండరాదు. మన పూర్వికులగు ఋషులున్ను, సన్న్యాసులున్ను ఈ తత్త్వము మనకు వారి జీవితములో ఆచరించి ఉపదేశించి యున్నారు. వారు కందపక్వఫలమూలములను భుజించువారున్ను, భిక్షాన్నముచే జీవించువారున్ను, నిరాడంబరముగ కాలము గడుపువారున్ను, జితేంద్రియులున్ను, దయాస్వరూపులున్ను, సమస్తశాస్త్ర పారంగతులునై దైవసాక్షాత్కారమువరకు శ్రమ అనక, ఎండ అనక, గాలి అనక, మంచు అనక తీవ్రప్రయత్నశీలురై యుండిరి. అనేకులు త్యాగులయ్యు చక్కని పరిశ్రమ చేయనందుచేతను, ద్రిమ్మరులై తిరుగుటచేతను, దొరికిన దానితో తృప్తి నొందక దాతలపై తిరుగబడుటచేతను గృహస్థులకు ఈలాటి అవిశ్వాసము సాధువులపై గల్గుచుండును. కావున ఈ కార్యము లన్నిటిలోను దృష్టి నుంచి వర్తించవలయును.

ఎట్లైనను సాధువులంత లోకసేవ చేయుటకు గృహస్థుల కవకాశము దొరకుట దుస్తరము. చూడుడు! ఎచ్చటైన ఒక సాధువుండినచో, అతనికి విద్యాసామర్థ్యములు లేకపోయినను భిక్షమెత్తిగాని అన్నకావడి వేసిగాని దినమునకు నలుగురికైనను అన్నము పెట్టుచుండును గదా! ఈలాటి కృత్యము ఏ ధనవంతుడు చేయుచున్నాడు? మరియు భగవద్భక్తియు పుణ్యకాలములోను, పర్వదినములలోను, జయంతి సమయములలోను, శక్తికొలది సమారాధనలున్ను, దైవకార్యములున్ను జరుపుచుండునుగదా! ఇంత మాత్రమైన పుణ్యకార్యము ఏ గృహస్థుడు చేయుచుండును? అంతియేగాక, గృహస్థులకు ఎన్నియో విధములగు కర్మలు గల్గుచుండును. అట్టి కర్మ విమోచనము ఇట్టి సాధువులకైన అన్నపానాదులు పెట్టకయు, ఉపకారము చేయకయు పోయినచో ఎట్లు కలుగును? భగవద్భక్తులు సాధుపురుషులు లేని గ్రామము శ్మశానభూమివంటిదని గదా మహర్షులు వచించియున్నారు. వీరిలో కొందరు ఎంతో మహనీయులుగా నుండి లోకోద్ధారకులై యున్నారు. హరిద్వారము, హృషీకేశము మొదలయిన స్థలములలోగల ధర్మకార్యము లన్నియు పరమసాధువైన "కాళీకంబల్" అను పేరుగల ఒక మహాత్ముని

జీవితముచే నేర్పడినవి. హరిద్వారమునుండి బదరీనాథమువరకు గల ధర్మశాల లన్నియు, అన్నసత్రము లన్నియు, వైద్యశాల లన్నియు ఆ మహాత్ముని కృపవల్లనే గల్గినవి గదా? ఇప్పుడు సర్వదేశములలోగల సాధువు లందరున్ను అచ్చోటికివెళ్లి గదా ఆత్మశాంతి గలుగజేసుకొనుచున్నారు!

ఆలాగున శ్రీగురునానక్ సంప్రదాయములో నెన్నియో గురుద్వారములున్ను, ధర్మపారశాలలున్ను, అన్నసత్రములున్ను, ధర్మవైద్యాలయములున్ను, దీనజనసంరక్షణ స్థలములున్ను, గోసంరక్షణశాలలున్ను, వితంతు శరణాలయములున్ను గలవు. ఇవి యన్నియు ఒక గృహస్థుడు నిర్వహింప గల్గునా? నిజముగా విచారించిన ఉత్తమసాధువు లందరును భగవత్స్వరూపు లేయని చెప్పవలసియుండును. కనుకనే శ్రీకృష్ణభగవానులు గీతలో "పరిత్రాణాయ సాధూనామ్" అని సెలవిచ్చియున్నారు. మరియు "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్" ఇవన్నియు భగవద్వచనములు. ఈలాగున నెన్నియో శాస్త్రములీ విషయమై యుద్ఘోషించుచున్నవి. అయితే యీదేశములో అట్టి సాధువులు ఎక్కువమంది లేనందుచేతను, ఉత్తరదేశములో సంచరించి అట్టి పుణ్యస్థలములు చూడనందుచేతను జనుల కీలాటి అభిప్రాయములు గల్గుచుండును. ఇందువల్ల గృహస్థాశ్రమములో నుండువారుగూడ జ్ఞానులయినచో, వారున్ను సాధువులలో చేరినవారే యగుదురు. ఇక విపులముగా శ్రుతిస్మృతి ప్రకారము సాధువులను గురించి తెలుసుకొన గోరువారు ఓంకార పుస్తకమును జూడుడు. దానియందు విస్తారముగా గనందగును.

యధార్థముగా పరిశీలించిన గృహస్థాశ్రమము మూడు విధములుగా నుండును. ఒకటి దేవతావాసముగాను, రెండవది పరిశుద్ధ మనుష్య నివాసముగాను, మూడవది దయ్యపు (లేక మృగ) స్వభావము గల్గినదిగ నుండును.

1. ఏ తల్లిదండ్రులు తమ సంతానములకు ప్రపంచ విషయ వాసనలు కల్గి యుండినను సంసారములోగల కష్టములున్ను, అస్వాతంత్ర్యమున్ను,

ప్రతి బంధమున్ను ఉపదేశించి వారి అంతఃకరణమును శుద్ధపఱచి, నిర్విషయులనుగా గావించి వారిని ఈశ్వరజ్ఞానములోను, బ్రహ్మనిష్ఠలోను, లోకసేవలోను వినియోగపరచేలాగున చేసి వారి యాత్మను భగవంతునికి సమర్పింతురో అట్టి తల్లిదండ్రులు దైవస్వరూపులు.

2. పుత్రులయొక్క మనోగతి ననుసరించి గృహస్థధర్మము నవలంబించుటకు వారికిష్టముండునట్లు తోచిన సత్యధర్మముల నుపదేశించి వారి యాత్మకు సౌఖ్యము గలిగేలాగున అనుకూలమగు దాంపత్యము గలుగజేసి దైవభక్తియు, అతిథిసేవయు చేసే లాగున బోధించి ధర్మబద్ధముగా జీవితమును గడిపేలాగున తెలిపెడు తల్లిదండ్రులు ఉత్తమమానవు లనంబడుదురు. వీరికి గృహస్థాశ్రమముగూడ శ్రేష్ఠమైనదే. దుఃఖము గలుగదు.

3. మూడవ తరగతివారు తమ సంతానమునకు భక్తివైరాగ్యములు, సత్యధర్మములు, భూతదయ గల్గియుండినను అట్టి దానిని తొలగించుటలో విశ్వప్రయత్నము చేసి యే ప్రకారమైనను ధనము నార్జించి, విషయసుఖ మనుభవించి సంసారమందుండులాగున నిర్బంధింతురు. దైవమో? దయ్యమో యెరుంగనీయరు. వీరి సంసారము దుఃఖకరము. ఇట్టి వారు అసుర స్వభావులే. ఇది తప్పక బంధము గలుగజేయును. ఇట్టి సంసారము తప్పక త్యాజ్యము. శాస్త్రము ఈ సంసారమునే దూషించుచుండును.

ఇక సాధువుల విషయమై శ్రీ సమర్థ రామదాసస్వాములవారు చెప్పినది క్రింద పొందుపరచెదను. వీరు మహానుభావులు. కావున వారేమి చెప్పెదరో జనులు వినందగియున్నది.

"పరమార్థమున కాశ్రయభూతులును, మనుజులలో నిమిడియున్న జ్ఞాన రహస్యమును వెల్లడిచేయువారును నగు సాధుసజ్జనులకు వందనము లాచరించెదను.

1. దుర్లభమగు వస్తుసముదాయమే గాక, పరమదుర్లభమగు బ్రహ్మము

గూడ సాధుసంగమున సులభసాధ్య మగుచున్నది.

2. బ్రహ్మము ప్రకటితముగానే యుండునుగాని, చూడదలంచిన వారి కెవ్వరికి నది కాన్పింపదు. బహువిధములగు సాధనముల నొనర్చినను పెక్కు తెరంగుల పరిశ్రమ మొనరించినను నది లభింపనేరదు.

3. బ్రహ్మము నెరుంగుటలో పరీక్షకులగు విమర్శకులు సైతము మోస పోయిరి. ఇంతియే గాదు. మీరుమిక్కిలి కన్నులుగలవారలు సైతము గ్రుడ్డి వారలైపోయిరి. మఱియు పరబ్రహ్మమును జూచుచు జూచుచు సాధకులు తాము స్వయముగ నంతర్హితులైరి.

4. పరబ్రహ్మమును దీపముతో వెదకి కనుగొనలేము. నానావిధము లగు ప్రకాశముల సహాయముతో గురుతింపనేరము. నేత్రములందంజనము బెట్టుకొని కాంచినను నయ్యది దృష్టిసమ్ముఖమున గోచరింపదు.

5. ఇంతయేల? షోడశకళాభిరాముడగు పూర్ణచంద్రుని సాయమున గాని, తీవ్రకళారాశియగు సూర్యుని తోడ్పాటునంగాని పరబ్రహ్మమును గుర్తింపజాలము.

6. సూర్యప్రకాశమునందు ఉన్నిలో నున్న రోమము లన్నిటిని గుర్తింప వచ్చును. అణువులు, రేణువులు మున్నగు సూక్ష్మవస్తు సముదాయమును గూడ గనుగొనవచ్చును.

7. సూర్యుని వెలుగున నడిమికి జీల్చబడిన వెంట్రుకయొక్క కొనను గూడ జూడవచ్చును. కాని పరమాత్మనిమాత్రము సందర్శింపజాలము. సాధుజనుల సత్కృప యొక్కటి సంపాదించితిమేని ఆ వస్తువు తనంతట గోచరించును.

8. పరబ్రహ్మ విషయమున సమస్తములగు నాక్షేపణలు సమాప్తి నొందు చున్నవి. తార్కికులు పరబ్రహ్మమునుగూర్చి తర్కించి, తర్కించి మంద మతులై పోవుచున్నారు.

9. పరబ్రహ్మమును గురుతించుటలో వివేకము సంకుచితమై పోవుచున్నది. కొనియాడుటలో శబ్దములు వెనుకడుగు వేయుచున్నవి. మనస్సునకుగల గమనశక్తియు దానిని చేరుటకు జాలకున్నది.

10. వేయిముఖములు గలవాడును, గొప్ప వాచాలుడునని పేరొందిన దిట్టయగు నాదిశేషుడుసైతము పరబ్రహ్మమును గొనియాడజాలక పూర్తిగా విసుగెత్తిపోవుచున్నాడు.

11. వేదరహితమైన దీప్రపంచమునం దేదియు లేదు. సమస్తమును వేదము ప్రకటిత మొనర్చి యున్నది. అట్టి వేదము సైతము ఇదమిత్థమని పరబ్రహ్మమును జూపనేరకున్నది.

12. దుర్లభమగు నా బ్రహ్మపదార్థము సాధుసాంగత్యముననను, వారల స్వానుభవ కారణముననను నెఱుకలోనికి వచ్చును. కాన నిట్టి యోగ్యత గల సాధుసజ్జనుల మహిమ వర్ణింప నాకు శక్యము గాదు.

13. మాయకు గలశక్తి మిగుల చిత్రమైనదేగాని, యదియు బ్రహ్మపదార్థము నెరుంగుటకు దోడ్పడనేఱదు. మాయాతీతమగు అనంత వస్తువును గూర్చిన మార్గమును సాధువులగు సజ్జనులే చూపదగినవారు.

14. వర్ణింప నలవిగాని, బ్రహ్మపదార్థము సాధుజన రూపమున ప్రత్యక్షమగుచున్నది. ఇందుచే బ్రహ్మమువలె సాధుజనులును ననిర్వచనీయులు.

15. సాధుజను లానందమునకు మందిరములు, సత్యసుఖ స్వరూపులు, నానావిధ ఆనందములకు వారలు మూలభూతులు.

16. వారు విశ్రాంతికి విశ్రాంతిభూతులును, తృప్తికి తృప్తిస్వరూపులునై యున్నారు. ఇంతయేల? భక్తియొక్క పరిణామములే సాధుజనులుగ గోచరించుచున్నవి.

17. ధర్మమునకు వారు ఉనికిపట్టులు. స్వరూపమునకు సత్పాత్ర

భూతులు. పుణ్యమునకు బవిత్రమగు దేశములు.

18. సాధుజనులు సమాధికి ఆటపట్టులు, వివేకమునకు భాండార స్వరూపులు. సాయుజ్యముక్తికి వారలు అధిష్ఠానులు.

19. ఇంతియేగాదు, సత్యమునకు నిశ్చయులుగను, సార్థకమునకు జయప్రదాతలుగను, ప్రాప్తికి సమన్వయ స్వరూపులుగను, సిద్ధరూపులుగను, సాధుజను లలరారుచున్నారు.

20. సాధువులన మోక్షలక్ష్మీ సమలంకృతులగు శ్రీమంతులు. అసంఖ్యాకులగు నజ్ఞాన జీవులను వారు ముక్తులుగ జేసిరి.

21. సమర్థులును, ఉదారులును (అత్యంత దానశూరులును) నగు నితరమానవులు సాధుజనులవలె జ్ఞానరూపమగు ధనమును బ్రసాదింప జాలరు.

22. ఎందరో చక్రవర్తులు, మహారాజులు గతించిరి. ఇంక నెందరో గతింపనున్నారు. కాని వీరలలో నెవ్వరును సాయుజ్యముక్తి నొసంగజాలరు.

23. మూడు లోకములలోని యే ప్రాణియు, జేయజాలని జ్ఞానదానమును సాధుజను లొక్కమొగి జేయుచున్నారు. ఇట్టి సాధుజనుల మహిమాతిశయము నెంత వర్ణింప నేర్తును?

24. మూడు లోకములకు నతీత మైనదియు, నెరుంగ శక్యము గానిదియునగు పరబ్రహ్మము సాధుజనులకు బ్రసన్నమై యుండుటచే సాధకుల కంతఃకరణములోనికి జేర నవకాశము గలుగుచున్నది.

25. సాధుజనుల మహిమ యీ విధముగ నుండునని కొంచెము తెలిపినాడ. వారి నెంతగ బ్రశంసించినను దక్కువయే. వారలవలననే ముఖ్య పరమాత్మ ప్రకటిత మగుచుండును.



# బీజాంకుర న్యాయము

**ఓమ్ నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।**
**దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥**

ఓ దైవాత్మస్వరూపులగు ప్రియమైన ఆత్మసోదరులారా! సోదరీమణులారా! మనము ప్రారంభించెడు విషయము బీజాంకుర న్యాయము. బీజాంకుర న్యాయమనగా బీజమెటువంటిదో, దానినుండి అంకురించెడు వృక్షమున్ను అటువంటిదే కాని మరియొకటి కాజాలదని భావము. కారణమున కన్యమై కార్యముండదనియు, కార్యకారణములు రెండును ఒకటే యనియు శాస్త్రాభిప్రాయము. కావున అట్టి వృక్షమునుండి యుద్భవించెడు బీజములున్ను అట్టి వృక్షమునకు సంబంధించినవే గాని మార్పు నొందవని తాత్పర్యము.

ఇచ్చటనే మతములయొక్కయు, కులములయొక్కయు, జంతుజాలములయొక్కయు చిక్కులన్నిటికిన్ని ముడి యున్నది. ఈ ముడి చిరకాలము నుండి బలపడి ఒకదానితో మరియొకటి పెనవేసుకొని చుట్టుకొని దుర్గమముగాను, దురవగాహముగాను ఉన్నది. ఈ చిక్కులు తీరనిచో మతవిషయమై, జాతివిషయమై గలుగుచుండు ఘోర దురాచారములున్ను, మూఢవిశ్వాసములున్నునశింపవు. నేను ఎక్కువవాడను, వాడు తక్కువవాడనియు, మేము మాత్రమే యన్నిటికిన్ని అర్హత గలవారముగాని, యితరులు అనర్హులుగానున్నారనియు, మాకే యీశ్వరుండు అధికారమిచ్చియున్నాడు గాని యితరుల కట్టి యధికారము గలుగజేయలేదనియు ఇవి మొదలుగాగల దుర్వాదముల కన్నిటికిన్ని, దుర్వ్యక్తుల కన్నిటికిన్ని, సమ్మోహముల కన్నిటికిన్ని, సాహసముల కన్నిటికిన్ని, అతిచారముల కన్నిటికిన్ని, అహంకార కృత్యముల కన్నిటికిన్ని ఇచ్చటనే మూలము గల్గియున్నది. అంతేగాక మనుష్యులను పశువులుగా చేయుటకున్ను, పాశవిమోచనము నొనర్చుకొనుటకున్ను, మానవులను దయ్యములనుగా మార్చుటకున్ను, దైవమయులనుగా చేయుటకున్ను, ఆత్మాభివృద్ధి గలుగజేయుటకున్ను, అధోగతిని పొందించుటకున్ను, అగాధము నుండి లేచి ఊర్ధ్వలోకమునకు వేగముగా వెళ్లుటకున్ను, అధఃపతనములోనే

యుండి మురిగిపోవుటకున్ను గల చిక్కులన్నియు నిచ్చటనే గలిగియున్నవి. మరియు మనుష్యుని తాపసోత్తమునిగా మార్చుటకున్ను, తమోగుణములోనే యుండి నశింపచేయుటకున్ను గల కారణమిచ్చటనే గల్గియున్నది. ఈ తత్త్వము నెరింగి కొందఱు దివ్యపురుషులు ఆకట్టుల నన్నిటిని విప్పిచేయు టకు ప్రయత్నించి వెళ్ళిరి.

అయినను వారిలో చాల ప్రయత్నించియు భేదింప శక్తిగలవారు కొందరు మాత్రమే యేర్పడిరి. అయితే అది త్వరలోనే జయించిన రాజ్యము పరరాజులచే బంధింపబడినట్లు బంధీకృత మొనర్చబడెను. అది అభేద్యము, కఠినము, దుర్గమము, మూలావిద్యయొక్క కేంద్రస్థానము. గొప్ప ప్రభుత్వము యొక్క కేంద్రస్థాన మేలాగున సాయుధపాణులై శూరత్వముగల ధీరులగు భటులచే రాత్రి పగలు అను భేదము లేక సంరక్షింపబడుచుండునో ఆలాగున ఈ మూలాజ్ఞానము కుతర్కశాస్త్రములనెడు బ్రహ్మాస్త్రశస్త్రధారులచేతను, కల్పితశాస్త్ర నిర్మాతలగు ఆగ్నేయాస్త్రధారులచేతను, కుయుక్తులనెడు క్రూర శరముల ధరించియుండు కర్కశహృదయులచేతను, స్వాభిమానములనెడు తీక్ష్ణబాణములను ధరించియుండు కృపణులచేతను, విద్యాగర్వములనెడు నాగపాశములను వహించి యుండు కృపాశూన్యులచేతను, దురభిమానము లనెడు శతఘ్నులను సమకూర్చిన కఠినమానవులచేతను చక్కగా పరివేష్టింప బడి యున్నది.

ఇట్టిదాని నుల్లంఘించి యే దయాళువు, ఏ కృపాకరుడు, ఏ తాపసోత్త ముడు, ఏ యోగిపుంగవుడు, ఏ భగవద్భక్తుడు, ఏ సాధుపురుషుడు, ఏ వైరాగ్య శీలుడు, ఏ జ్ఞానోత్తముడు వెళ్ళి ఆ చిక్కులన్నిటిని విడదీయగలుగునో అప్పుడే కారాగృహబంధమునుండి విడుదలబొందిన మానవులవలెను, పంజరము నుండి విడుదల గల్గిన పక్షులవలెను, బోనునుండి విముక్తి గల్గిన సింహము వలెను ఈ మానవులందరున్ను స్వాతంత్ర్యము గలవారై నిత్యశాంతియు, శాశ్వత సుఖమును నగు మోక్షమును బొందుటకు తగినవారగుటయే గాక

యిహసుఖమునుగూడ అనుభవింపదగినవారు గాగలరు. దేశమును బంధమునుండి విడిపింప గలుగుదురు. ఆత్మయొక్క దుఃఖము లన్నిటిని నివృత్తి చేసెదరు. ఇది భగవద్భక్తియు, భూతదయయు గల్గి ఆత్మజ్ఞానము లభించి సమబుద్ధి గల్గియుండిన వారిచేతనే సాధింపవీలగును.

అయితే ఆ దుర్ఘటగ్రంథులను సమూలముగ ఛేదింపకపోయిన తక్కిన ప్రయత్నము లన్నియు చెడిపోయిన రైలు ఇంజనును శుద్ధపరచుటకు చూడక ప్రయాణికులు కూర్చుండు పెట్టెలనుమాత్రము నడుపజూచినట్లు ఉపయోగపడవు. ఇంజనును జక్కబరచిన వేలకొలది ప్రయాణికులను ఆ యంత్రసహాయముచేత గమ్యస్థానము చేర్చునట్లు సమూలముగా ఆ గ్రంథులను ఛేదించిన ఈ జనులందరున్ను వారి వారి స్వస్థానము నొంద గలరు. దీనికి బోధనాశక్తియు, సత్యనిష్ఠయు, జ్ఞానశక్తియుగల వైరాగ్యవంతులైన తపోధనులు గావలసియున్నారు. అట్టివారి త్యాగపరమగు జ్ఞానఖడ్గముచే మాత్రమే యీ కట్టులన్నియు సులభముగ తెగిపోవును. లేక సాధుపుంగవులు ధ్యానమనెడు నిష్ఠలో నుండి యీ చిక్కులు చిక్కులుగా నుండెడు ముడులన్నిటిని చక్కగా విప్పవలసియుందురు.

పాపము పై జెప్పిన వారుగూడ యధార్థము నెరుంగక అట్టి దుష్టాయుధములతో దానిని రక్షించుకొనుచున్నారు. అది యొక పురాతనమగు మూఢవిశ్వాసమేగాని మరియేమియు గాదు. వారున్ను దుఃఖమును గోరువారు గారు. సుఖమునే కోరుచున్నారు. అయితే దిగ్భ్రమము నొందినవాడు తూర్పు దిక్కునకు పోవలెనను తలంపుతో పశ్చిమాభిముఖుడై నడచుచున్నాడు. కనుక ఆతని యాత్మకు తెలివి గలిగే లాగున ఒక్క ఆప్తుడు బోధించి తనయొక్క పొరబాటును సవరింపజేసుకొని ఋజుమార్గమున నడువవలయునని యుపదేశించిన మరల అతడే సత్యము నెరింగి నడువగలడు. అంతే దీనియందుగల రహస్యము.

బీజాంకుర న్యాయవిషయమై వారు ఈలాగున బహుకాలమునుండి

గట్టి నమ్మకము గల్గియున్నారు. ఎంతో చదువుకొన్న పండితులుగూడ దీని యందు మోహము నొందియున్నారు. సమబుద్ధితో సంచరించవలసిన సాధు వులున్ను, సన్న్యాసులును ఈ విషయములలో పొరబాటు నొందుచున్నారు. అటువంటి పండితులను, యతీశ్వరులనుగూడ ఈ మహామోహము మోసము చేయుచుండగా సామాన్య జనుల కార్యమును గురించి వేరే చెప్పబనిలేదు గదా! ఇట్టి వారి నుద్ధరించుటకు కేవలము భక్తిగాని, జ్ఞానముగాని గల్గి యుండిన చాలదు. మంచి విద్యానైపుణ్యముగూడ నుండవలెను. సత్యనిష్ఠ నుండి, జ్ఞానదృష్టినుండి, దైవదృష్టినుండి యెటువంటి కష్టములు వచ్చినను చలింపని దృష్టి గలవాడుగాను ఉండవలయును.

ఎటువంటి యోధుడైనను ఆయుధము లేనిచో శత్రువులతో పోరాడ సమర్థుడు కాడుగదా? అయితే అస్త్రశస్త్రములు మాత్రముండినను యుద్ధకౌశ లము తెలుసుకొనిన మంచియోధుడు గానిచో వైరుల నోడింప శక్తి గల్గి యుండడు. ఆలాగున తపశ్శక్తియు, ఆత్మజ్ఞానమున్ను గల్గి యుండవలెను. అట్టివారికే శాస్త్రముపయోగపడును. లేనివారికి ఆ శాస్త్రము తన ఆత్మకున్ను, లోకమునకున్ను అపకారమునే కలుగజేయును. యోగ్యతలేని వారికి ఆయుధములుండిన యోగ్యులకు హానికరము గదా? శాస్త్రమిప్పటి కీలాగున పరిణమించినది. శాస్త్రము తెలిసినవారిలో మిక్కిలి జనులకున్ను ఈలాటి అభిప్రాయము గల్గియున్నది. అది యేమన? బీజాంకురము మారుటకు సాధ్యము గాదనియే. అది యీశ్వర నియమమనియే వారి తలంపు. దానికి వారు ఈలాటి యుదాహరణములను జెప్పెదరు. వేప విత్తనము పంచదారపై పెట్టి పాలతో పోషించినను దాని చేదు పోయి తీపు గల్గునా? ఆలాగున -

**కర్పూరధూళీ కలితాలవాలః**
**కస్తూరికాకల్పిత దోహదశ్రీః ।**
**గంధోదపూరైః పరిషిచ్యమానః**
**ప్రాంచం గుణం ముంచతి కిం పలాండు ? ॥**

ఎట్టిగడ్డను పచ్చకర్పూరపు పాడిచేత నిర్మింపబడిన పాదునందుంచి కస్తూరిని ఎరువుగా జేసి, సుగంధజలము పోసి, ప్రతిదినము తడుపుచున్నను, సహజమగు దుర్వాసనను విడువదు గదా? అనునట్టి స్వకపోలకల్పిత శ్లోకముల నుదాహరణ మిచ్చెదరు.

మరియు అజమును గంగాస్నానము చేయించినను అది గజము గాగలదా? కాకిని కాశికి తీసుకొని పోయినను అది హంసము గాగల్గునా? బక మును బృందావనములో దర్శనము చేయించినను అది పికము గాగల్గునా? ఆలాగున దైవసృష్టిలోగల జాతులకు మార్పు గలుగదని నిర్ధారణ చేయు చున్నారు. చూడుడు! పందిని పన్నీరుతో అభిషేకముచేసినను నంది యగునా? పులికి పుట్టే పిల్లలు పులిపిల్లలుగానే యున్నవి. గోవుదూడలు గోవులు గానే యేర్పడుచున్నవి. అదే రీతిగా కాకి కాకిగాను, కొంగ కొంగగాను, కోవిల కోవిలగాను ఎట్లున్నవో మనుష్యులును ఆలాగుననే యుండియుందురు గాని మార్పు గలుగదు. అది యీశ్వరాజ్ఞగానే యున్నది.

పై జెప్పిన దృష్టాంతములు చాలవా? అట్లే ఆయా బీజములకు ఆలాటి చెట్లే పుట్టుచుండును. ఆయా జంతువులకు ఆలాటి జంతువులే జాతము లగుచుండును. అది యీశ్వరనియమము. ఇదే వారు చెప్పెడు యుక్తులు. వీనికి అన్నిటికిన్ని సమాధానము చెప్పి వారి సందేహనివృత్తి చేసి చీకటిలో నుండి వెలుతురు లోనికి తీసుకొని రావలయును.

జంతువులకున్ను, వృక్షములకున్ను సంబంధించిన వారి యుక్తి మనుష్యులకు చెప్పందగదు. ఏలన వారు చెప్పునది నిజమైనచో, పండితుని సంతానము పండితులుగాను, జ్ఞానిసంతానము జ్ఞానిగాను, పామరుని సంతానము పామరుడుగాను, అజ్ఞానిసంతానము అజ్ఞానిగాను, దరిద్రుని సంతానము దరిద్రుడుగాను, ధనవంతునిసంతానము ధనవంతుడుగాను, శాంతిగలవాని సంతానము శాంతముగాను, క్రూరునిసంతానము క్రూరుడు గాను, కురూపిసంతానము కురూపిగాను, సురూపిసంతానము సురూపిగాను

ఉండవలెను గదా! అట్లు గానుపించట లేదు. కనుక జడములగు వృక్షముల యొక్కయు, జంతువులయొక్కయు నుదాహరణము సరిగాదు. జీవుడు దేహమునకు భిన్నుడగుటచే పై జెప్పిన మార్పులన్నియు దేహమునకు సంబంధించినవి గావు. వారి సంస్కారము ననుసరించి యున్నవి. ఇచ్చటనే బీజాంకురములు తరతరములుగా వచ్చుచుండు అంధవిశ్వాసమనెడు మూలముయొక్క స్థితి గల్గియున్నవి. వారిని సందేహమనెడు పంజరము నుండి బయటకు దీయవలయును. అప్పుడు లోకోపకారమై చేయవలసిన పనులన్నిటిని వారే చేయగలరు.

ఎట్లన? కర్మకాండయను కారుచీకటిలో మునిగియుండిన మండన మిశ్రుని దయాళువగు శ్రీశంకర భగవత్పాదాచార్యులు ఉద్ధరించినట్లు వీరిని గూడ ఉద్ధరించవలయును. వారు చెప్పెడు యుక్తులన్నియు కేవలము పామరులు చెప్పవలసినవేగాని, కొంచెమైనను వివేకజ్ఞానము గలవారు చెప్పందగినవి గావు. ఇది కేవలము జడమతుల దృష్టిగాని, చైతన్యవంతులగు విజ్ఞుల దృష్టి కాదు. మరియు చరాచరమగు జగత్తంతయు దైవమయమని తలంచి ఆనందించుచుండు ఈ హిందూదేశములో జన్మించిన భారతీయు లకు తగినది కాదు. ప్రపంచమున కంతటికి దైవజ్ఞానమును చాటిన యీ పుణ్య భూమి యగు భరతఖండములో పుట్టిన మహనీయులందరున్ను, ఈశ్వర జ్ఞానము గలిగినవారలే. అట్టి సనాతన వంశములో పుట్టిన మనము ఇట్టి జడమతులమై, పామరుల మైపోయినందుకు చాలా దుఃఖము గల్గుచున్నది. కేవలము జడములుగా నుండు వృక్షములను, ఆత్మజ్ఞానము వికసించని జంతువులను దైవస్వరూపులగు మానవులకు సమానముగా చేసి దృష్టాంతము చెప్పుట అగ్నికిన్ని, జలమునకున్ను సామ్యము చెప్పినట్లుండును. అంధకారమునకున్ను ప్రకాశమునకున్ను, అమృతమునకున్ను విషమునకున్ను సామరస్యము చేయునట్లుండును.

వృక్షములకు వానియొక్క స్థూలముగా గానుపించు ఆకృతులకన్న

భిన్నములైన ఆత్మగుణము లను వేరు తీయుట గాని, వాటిని శాస్త్రములలో ప్రతిపాదించుటగాని గనుపించుటలేదు. మృగములును అదేరీతిగానే యుండును. వాటికిన్ని దేహవ్యతిరిక్త ఆత్మయు మంచి వికాసమునకు రాలేదు. అయితే, వృక్ష వర్గమునకన్న మృగవర్గములో గల ఆత్మ అధికవికాసము నొంది యున్నది. వృక్షములకు తమ మనస్సుతో ఏదైన ఒక అంగమును ఉండే స్థలమునుండి మార్చుకొనుటకు శక్తి లేదు.

జంతువుల కట్లు కాదు. తమ యిష్టానుసారముగా శరీరావయవము లన్ను త్రిప్పుటకున్ను, ఇష్టవస్తువులను గ్రహించుటకున్ను అనిష్టవస్తువులను త్యజించుటకున్ను, ఇష్టానుసారముగ సంచరించుటకున్ను సాధ్యమగును. అంతేగాక మనస్సుతో నూహించుకొని కొన్ని కార్యములు చేయుటకున్ను శక్తి గల్గియున్నవి. మనుష్యులవలె వాటియొక్క స్మృతిజ్ఞానముగూడ చాలకాలము వరకు నిలుచును. గజము, అశ్వము, గోవు, శ్వానము మొదలైన జంతువుల కున్ను, శుకము, కపోతము మొదలగు పక్షులకున్ను, చిరకాల పరిచయముగల, మనుష్యులతోగాని, స్థలముతోగాని సంబంధముగల జ్ఞానము నిలిచి యుండును. అవి బంధములను, అపాయములను తప్పించుకొని పోవుట కున్ను, అపాయములేని స్థలమును చేరుటకున్ను, ఊహాపోహలు గల్గియున్నవి. అయితే పుణ్యాపాపములున్ను, ఆత్మయొక్క బంధముక్తులున్ను, భక్తిజ్ఞానము లున్ను, దైవవిచారమున్ను వాటికి తెలియవు. అయితే వృక్షాదులకు, ఆత్మ లేదనిగాని, సుఖదుఃఖములు తెలియవనిగాని, వివేకు లెవరున్ను అంగీకరింప జాలరు. కాని మనుష్యులకు గల్గియుండు ఆత్మవికాసమున్ను, తెలివితేట లున్ను, భక్తిజ్ఞానవైరాగ్యములున్ను, ఈశ్వరుండు గలడను బుద్ధియును, పుణ్యా పాపముల ఫలమనుభవించవలెనను బుద్ధియును మాత్రము లేవు.

**ఆహారనిద్రాభయమైథునాని సమానమేతత్పశుభిర్నరాణామ్ ।**
**ఏకో వివేకో హ్యధికో మనుష్యే తేనైవ హీనః పశుభిస్సమానః ॥**

పశువులకున్ను, మనుష్యులకున్ను ఆహారము, నిద్ర, భయము, విషయ

సుఖము మొదలుగా గల సుఖము లన్నియు సమానములుగానే యున్నవి. మనుష్యునియందు వివేకజ్ఞాన మొకటి అధికముగా గలదు. అట్టి నిత్యానిత్య, పుణ్యాపాప, ఆత్మానాత్మ వివేకములేని మనుష్యుడు పశువులతో సమానుడని శాస్త్రసిద్ధాంతము.

మరియు, ప్రయత్నశీలురగు మానవులు ఒక వృక్షమునే మరియొక వృక్షముగా మార్పు చేయుచున్నారు. ఎట్లన? అత్తిచెట్టు మొక్కతోగాని, పాలచెట్టు మొక్కతోగాని సపోటచెట్టు నంటుకట్టి పాలచెట్టులోను అత్తిచెట్టు లోను ఫలమును పండించుచున్నారు. ఆలాగున నాటుమామిడిచెట్టును అంటుమామిడిచెట్టునకు గట్టిన శ్రేష్ఠములైన అంటుమామిడి ఫలములే పండు చున్నవి. ఈలాగున పలు రకముల వృక్షములను అంటుగట్టి మరియొక రకములగు వృక్షములుగా మార్పుచేసుకొనుచున్నారు. మఱియు ఎఱ్ఱనిబాడిశ చెట్టులో రంధ్రముచేసి మల్లిచెట్టుతీగెను దానిలో నెక్కించి ఆ రంధ్రము బిగించుకొను నంత వరకుంచి తర్వాత తీగెయొక్క మొదలు నరికివేసిన దానియందు ఎఱ్ఱని పువ్వులే పూయుచుండును. ప్రయత్నముచే ఈలాగున తెలుపును ఎరుపుగా మార్చ గల్గితిమి. ప్రయత్నముయొక్క శక్తియు అట్టి మహిమ గల్గినది. మరియు, రసాయనవేత్తలు తమ ప్రయోగశక్తిచేత వస్తువులను మార్పు చేసుకొనుచున్నారు.

జడపదార్థములనే యీలాగున మార్పుచేయునప్పుడు చేతనుడైన మనుష్యుని గుణములను ఏల మార్పుచేసుకొనగూడదు? అట్లు మనుష్యులలో మార్పు నొందిన వారనేకులు గలరు. వాల్మీక్యాది మహర్షులు దీనికి తార్కాణము. జడమతులు ఇంతవరకు వృక్ష, పక్షి, మృగాదులను గురించి చెప్పిన యుక్తులు మన కవసరము లేదు. ఏలన? పక్షివర్గములలో ఒక్కొక్క జాతియు వేరువేరు ఆకృతియున్ను, వర్ణమున్ను, స్వరమున్ను గల్గియున్నవి. జంతువులున్ను ఆలాగున ఆకారమున్ను, రంగున్ను, స్వరమున్ను స్వయ ముగా వేరు వేరు విధములతో గూడియున్నవి. ఒకదానిని మరియొక దానిలో

కలుపుటకు సాధ్యపడదు. ఐక్యపరచినను వేరుగానే గోచరించును. ఈ లక్షణ ములు పక్షులకున్ను, మృగములకున్ను, వృక్షములకున్ను వివిధములుగా గల్గి యున్న విషయ మందరికి గోచరమే. మనుష్యులలో ఆలాటి భేదము గలుగ జాలదు.

ఎందుకు భేదము గలుగదని కొందరడుగుదురు. "మహమ్మదీయుల శరీర ప్రకృతియు, క్రైస్తవుల దేహస్వభావమున్ను, శైవుల విభూతిధారణయు, వైష్ణవుల తిలకధారణయు చూచిన ఎందుకు తెలియదు? కనుక జాతిభేదము ఈశ్వరసృష్టిలోనే గలదు. ఆలాగున బ్రాహ్మణుల బ్రహ్మవర్చస్సున్ను, క్షత్రియుల శౌర్యమున్ను, వైశ్యుల వినయమున్ను, లేక భీరుత్వమున్ను, శూద్రుల దైన్యమున్ను, పంచముల భీకరత్వమున్ను గానుపించుట లేదా? ఆలాగున బ్రాహ్మణులు తెలుపుగాను, క్షత్రియులు ఎరుపుగాను, వైశ్యులు పసుపుగాను, శూద్రులు నల్లగాను, పంచములు ఘోరరూపముగాను గోచరించుట లేదా? ఇదే ఈశ్వరసృష్టిలోగల వ్యత్యాసము గనుక యీ జాతి భేదము ఈశ్వర నిర్మాణమేగాని మరియొకటి గాదు. దీనికి శ్రుతిస్మృతులు ఈశ్వర శాసనములు. వాని నతిక్రమించువారు రాజశాసనమును తిరస్కరిం చిన వారివలె దండనార్హులు. ఇదే మా యభిప్రాయ" మని చెప్పుదురు. దీనికి తగిన సమాధాన మిచ్చి వారిని సంశయ పిశాచమునుండి మంచి మాంత్రికుడు రక్షించునట్లు సంరక్షించవలయును.

సమాధానము :- అయ్యయో! ఈలాటి యుక్తులు ఏమియు తెలియని ఆడవారు గూడ చెప్పరే? ఇది యేమి వివేకము? ఇదియా వివేకజ్ఞానముయొక్క లక్షణము? అయితే మీరుదాహరించిన వానియొక్క యథార్థమును మీరు జాగరూకతతో విచారింపలేదు. మీమాట యెటువంటిదనగా? ఒకడు దున్న పోతు ఈనెనని గృహపతితో చెప్పినాడట. వెంటనే ఆ గృహస్థుడు ఏమి దూడ యని అడిగినట్లున్ను, పశువుల కాపరి పేయదూడయని చెప్పినట్లున్ను, తర్వాత గృహపతి గాటిలో కట్టివేయమని చెప్పినట్లున్నది. అయ్యో! ఈలాటి మూఢ

విశ్వాసములో జనులుండుటచేతనే గదా స్వర్గలోక సమానమైన భరతఖండము దారిద్ర్యబాధచేతను, స్వాతంత్ర్యరాహిత్యముచేతను నరకలోకసమాన మైనది. మీరు చెప్పిన యుదాహరణమును మీరే సావధానముగా యోచించిన మీకే సత్యము గోచరించును. ముసల్మానుని వేషమున్ను, క్రైస్తవుల చిహ్నమున్ను, శైవుల విభూతియు, వైష్ణవుల తిలకధారణయు వేషములే గాని మరియొకటి గాదు. స్త్రీ వేషము ధరించిన పురుషుడు స్త్రీ యగునా? ఆలాగున దేవతల వేషము ధరించిన మానవులు దేవత లగుదురా? రాక్షస వేషముల వేసుకొనిన మనుజులు రాక్షసులు గాగలరా? రాజు వేషము ధరించు మర్త్యుడు నరాధిపతి గాగలడా?

ఆలాగున మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, శైవ, వైష్ణవ, చిహ్నములన్నియు నిజమైనవి గావు. వారందరున్ను ఒకే రకము మనుష్యులే. హిందువు లనేకులు మహమ్మదీయులైరి. ఆలాగున క్రైస్తవమతములోను అనేకులు జేరిరి. మహమ్మదీయులలోని కొందరు హిందువులలో కలిసి పోయిరి. ఆలాగున క్రైస్తవులున్ను, బౌద్ధులున్ను, హిందువులున్ను పరస్పరము మతపరివర్తనము చేసుకొనియున్నారు. అట్లే శైవులు వైష్ణవులున్ను, వైష్ణవులు శైవులున్ను అగు చున్నారు. కావున ఇది మనుష్య వేషముయొక్క మార్పేగాని వృక్షపక్షి మృగాదు లకు కల్గినట్లు గల దైవనిర్మితమైన మార్పులు గావు. దైవనిర్మితము లైనచో మనుష్యులచే వస్తువుయొక్క మార్పు చేయుటకు సాధ్యము కాదు.

పురాతన కాలములో భరతఖండమున సనాతనమగు ఆర్యమత మొకటియే యుండెను. జినుడవతరించిన తర్వాత జైను లేర్పడిరి. బుద్ధుడు జన్మించిన పిమ్మట బౌద్ధు లేర్పడిరి. శ్రీశంకరాచార్యులు జాతమైన తర్వాత ప్రత్యేకముగా అద్వైత మతస్థులని కొందరేర్పడిరి. రామానుజులు ఏర్పడిన తర్వాత విశిష్టాద్వైతులనియు, శ్రీవైష్ణవులనియు ఒక సంఘ మేర్పడెను. వార లలో వేదాంతదేశికులు జన్మించిన తర్వాత తెంగల, వడగల అని ప్రత్యేక సంఘములు ఏర్పడెను. మధ్వాచార్యులు జన్మించిన పిమ్మట మాధ్వులు

ఏర్పడిరి. దయానందసరస్వతిస్వాములవారు జనన మొందిన తర్వాత ఆర్యు లేర్పడిరి. రాజారాంమోహనరాయిగారు పుట్టిన తర్వాత బ్రాహ్మసమాజస్థు లేర్పడిరి. గురునానక్ జన్మించిన తరువాత సిక్కు లేర్పడిరి. మహమ్మదు నబి యవతరించిన తర్వాత ముసల్మాను లేర్పడిరి. శ్రీ ఏసుక్రీస్తు జన్మించిన తర్వాత క్రైస్తవు లేర్పడిరి.

నాయనలారా! ఈ జాతులన్నిటిని ఈశ్వరుడు సృష్టించినాడా? లేక ఆ యా మతకర్తలు సృష్టించిరా! శరీరమునకు గల చిహ్నములు, వస్త్రధారణ గురుతులు మాత్రము మతకర్తలగు మనుష్యులు సృష్టించిరే గాని మనుష్యుల స్వభావమును సర్వేశ్వరుడు సృష్టించెను. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల సృష్టియు నీలాగుండునేగాని మరి యేలాటి యూహలు దీనియందు చేయవలసిన పనిలేదు. అయితే పై జెప్పిన వారివలె బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు శరీరపు గురుతులే లక్షణమని సచ్ఛాస్త్ర ముపదేశించి యుండ లేదు. వారియొక్క శమదమసత్యధర్మజ్ఞానాది గుణములే గురుతని సచ్ఛాస్త్ర సిద్ధాంతము. ఇక మీరు సూచించిన గుణములను బట్టి చూతము. బ్రహ్మ వర్చస్సు గలవారు బ్రాహ్మణులనియు, శూరత్వము గలవారు రాజులనియు, భీరుత్వము గలవారు వర్తకులనియు, దైన్యస్వభావము గలవారు శూద్రు లనియు, భయంకర స్వభావము గలవారు పంచములని గదా! అప్పుడిట్టి గుణములు గలవారు ఆయా జాతులలో చేరినవారని చెప్పినచో, ఆయా జాతు లలో ఆలాటి గుణములు లేక యితర జాతులలో ఆలాటి గుణములు గల్గియు, పై జెప్పినవారలలో ఇతర గుణములు గల్గియు నుండిన దానికి మీరేమి చెప్పగలరు! ఆలాగున అనేకు లున్నారు.

ఇది ప్రత్యక్ష ప్రమాణ మగుటచే దీనికి మరియొక సాక్ష్యమవసరము లేదు.మరియు శ్వేతవర్ణులు బ్రాహ్మణులనియు, రక్తవర్ణులు క్షత్రియులనియు, పీతవర్ణులు వైశ్యులనియు, కృష్ణవర్ణులు శూద్రులనియు, క్రూరకృత్యములు చేసుకొని భయంకర రూపులుగా నుండువారు పంచములనియు చెప్పితిరి.

ఇట్టి వర్ణములు మీరు చెప్పేలాగున నుండు జాతులలో గాక అన్ని జాతుల లోను తెల్లనివారున్ను, ఎఱ్ఱనివారున్ను, పచ్చనివారున్ను, నల్లనివారున్ను, భయంకర స్వరూపులున్ను ఉన్నారు. దీనికి మీరేమి చేయగలరు? ప్రత్యేకముగా పాశ్చాత్యు లందరును తెల్లనివారలే. అరబ్బీలున్ను, చైనాదేశస్థు లున్ను ఎఱ్ఱనివారుగాను, పచ్చనివారుగాను ఉన్నారు. దీనికేమి చెప్పెదరు? మీరు చెప్పినదంతయు అంధవిశ్వాసమేగాని మరియేమియు గాదు. ప్రత్యక్షముగ జూడుడు. బ్రహ్మవర్చస్సు గలవారన్ని వర్ణములలోను ఉన్నారు. ఆలాటి తేజస్సు లేనివారును సర్వజాతులలోను గలరు. ఆలాగున తెల్లని వారున్ను, పచ్చనివారున్ను, నల్లనివారున్ను సర్వజనములలో గలరు. వర్చస్సును గూర్చి చెప్పినదిమాత్రము విజ్ఞుల కందరికిని అంగీకారము. అది ఆత్మగుణమై యుండును. తక్కినవి దేహముయొక్క స్వభావములు. ఇది శీతోష్ణములకు సంబంధించియు, ఆహార స్వభావమును బట్టియు, కొందరికి బాల్యమునుండి గలిగెడు అభ్యాసమును బట్టియు, వారి వారి పనినిబట్టియు ఏర్పడినవేగాని మరి యేమియు గాదు. తేజస్సు, శూరత్వము జీవుని పరిణామమునకు సంబంధించి కలుగుచున్నవి. సత్త్వగుణము మంచి వర్చస్సుగాను, రజో గుణము శౌర్యస్వభావముగాను, మిశ్రగుణము దీన, నమ్ర, శౌర్యతేజస్సులు గాను, తమోగుణము దీనత్వముగాను నుండును. ఇది సత్యమైనది.

ఈ సత్యమును గనుగొని ప్రవర్తింపజేసెడి ప్రభుత్వ మొకటి యుండిన ఈ భారతదేశమునకు ఇంత కష్టము గలిగియుండదు. దేశముగూడ పరాధీనముగా నుండకపోయెడిది. అన్ని కళావిద్యలచే అలరారుచుండెడిది. బ్రహ్మవేత్తలచే లోకము పావనమై యుండెడిది. అట్లు చేయువారు లేనందుచే ఇట్టి కష్టములకు లోబడిపోయిన కార్యము విచారించిన యే మానవుని నేత్ర ములనుండి ధారలు ధారలుగా దుఃఖవారి గారకయుండును? ముందు గన పరచిన అవస్థ గల్గునప్పుడే స్వరాజ్యము వచ్చును. అంతవరకు వచ్చినను నిలువజాలదు. అంతేగాక రానే రాదు. తనకు లోబడి ఒకడు ఉండవలెనను తలంపు ఒకరి కెంతకాలమువరకుండున్ అంతకాలమువఱ కతడు మరి

యొక్కరికి లోబడియే యుండవలయును. ఇది ప్రకృతియొక్క అలంఘనీయ శాసనము. ఏలన? తా నేవిత్తును బెట్టునో, ఆ విత్తుగదా చెట్టై ఫలము నిచ్చును! ఇదే గుణకర్మలకు ఆధిక్య మియ్యవలెనని చెప్పెడు రహస్యము. అట్లైన క్రింది తరగతినుండి పై పై తరగతులలోనికి జనులు వెళ్లుటకున్ను, పై తరగతిలో ఉండేవాడు క్రిందికి జారక నిలుచుటకున్ను అవకాశము గల్గియుండును. నిజముగా పై జెప్పిన గుణములను గురించియే జాతి గలదు. ఇది సత్యము. ఈ సత్యము మాత్రమే సనాతనముగా నిల్చును. అసత్యమంతయు చేవలేని కొయ్యవంటిది. దానిని చెదలు తినిపోవును.

మరియు, మీరు శ్రుతిప్రమాణముల నుదాహరించితిరి. శ్రుతి స్మృతులు అనేక ముఖములై యున్నవి. వానిలో మీరు చెప్పఁదానికిన్ని, సత్యార్థి యైన జ్ఞాని చెప్పుదానికిన్ని వేలకొలది ప్రమాణములు గలవు. శాస్త్రములలో ప్రమాణములకు కొరతయేమి? సముద్రములో నీళ్లవలె నున్నవి. కనుకనే శాస్త్రమునకు సాగరమని పేరువచ్చినది. సముద్రము చెంతకు ఎవరెవరు ఎంతెంత పెద్దపాత్రను తీసుకొని వెళ్ళెదరో వారు వారు అంతంత యెక్కువ జలమును తీసుకొనివచ్చునట్లు, ఎక్కువ యెవరు చదువుదురో వారు అంత యెక్కువ శాస్త్రమును గ్రహించుకొనవచ్చును. దాని కంతమే లేదు. కనుకనే శాస్త్రమున కనంతమని పేరు వచ్చినది. కావున "తర్కోఽప్రతిష్ఠః"అని న్యాయశాస్త్రమున కప్రతిష్ఠాదోషము కలదని చెప్పడమైనది- మరియు ఆ శాస్త్రములు ఒకరిచే చేయబడినవి గావు. వాటికి కర్తలనేకులు. ఉత్తమ మధ్యమ కనిష్ఠాధికారుల గురించియు, బద్ధులను గురించియు, ముక్తులను గురించియు వాటిలో చెప్పబడియున్నవి. అంతేగాక కాలానుగుణముగా అవి మారుచుండును.

శ్రుతిస్మృతులలో గుణకర్మల కాధిక్యము నిచ్చు భావము లనేకములు గలవు. వేదము దైవసంకల్పమైనను అట్టి ఆశయము దెలుసుకొని వ్రాసినవా రనేకులు లేనిచో, ఒకే వేదమునకే అద్వైతపరముగాను, విశిష్టాద్వైతపరము

గాను, ద్వైతపరముగాను, విష్ణుపరముగాను, శివపరముగాను అర్థము వ్రాయుటకు కారణమేమి? వేదము నిత్యమను వాక్యమునకు ఒక్కొక్కరు వ్రాసియుండు శాస్త్రము నిత్యమని యర్థము గాదు.

వేదము అను శబ్దమునకు జ్ఞానమనియే అర్థము గలుగుచున్నది. జ్ఞానమునకున్ను, ఈశ్వరునికిన్ని పరస్పర సంబంధము గలదు. అగ్నికి ఉష్ణప్రకాశములకున్ను, జలములకు ద్రవశైత్యములకున్ను, పంచదారకు మధురమునకు ఎట్లు సంబంధము గలదో ఆలాగున ఈశ్వరునకు, ఈశ్వరసంబంధ జ్ఞానమునకున్ను నిత్యత్వము గలదని యర్థమేగాని మరియొక్క అర్థము గాదు. ఈ పుస్తకములున్ను ఈ లిపులున్ను, వ్రాయుచుండు ఈవ్రాతలున్ను నిత్యమైన వేదములని చెప్పినచో, ఇవన్నియు కాలాంతరములో నశించును. మహాప్రళయములో లేకపోవును. అప్పుడు గ్రంథములనే వేదమని చెప్పినచో, వీటికిగూడ నాశము గల్గును గదా? అయితే యీ గ్రంథములలో వేదసంబంధజ్ఞానము లేదని చెప్పుటలేదు. ఉండవచ్చును. ఉండిన మనుష్యుల శరీరము నశించినను, ఆత్మ యేలాగున నాశము లేక నిలుచునో ఆలాగుననే ఆ గ్రంథములు నశించినను, ఆ జ్ఞానము నిలుచును. అట్లు గానిచో ఒక్కొక్క మతాచార్యుడున్ను వారు వారు చెప్పినదే వేదమనియు, వేదార్థమనియు, ఈశ్వరాజ్ఞయనియు చెప్పుచున్నారు. ఇది యేలాగున అంగీకరింపదగును? దీనివల్ల ఇట్లు చెప్పువారికి ఈశ్వరభక్తి లేదనిగాని, శాస్త్రములపై నమ్మకము లేదనిగాని, వర్ణాశ్రమములపై విశ్వాసము లేదనిగాని, భగవద్భక్తులపై, ఆత్మజ్ఞానులపై, తాపసోత్తములపై, కరుణామూర్తులపై, విరక్తపురుషులపై, దయామూర్తులపై భక్తివిశ్వాసములు లేవని గాని తలంపరాదు. పూర్ణవిశ్వాసము గలవారే. ఆత్మసాక్షిగా వీరు ఆస్తికులే.

అయితే వీరు గుణకర్మలకు ఆధిక్య మివ్వవలెననియు, గుణములను బట్టి అన్నిటిలోను అధికారము జనులకుండవలెనని మాత్రమే చెప్పుచుందురు. వర్ణాశ్రమములను ధ్వంసమొనర్చి సంకరము చేయవలయునని తలంపరు.

అయితే వర్ణాశ్రమములను మీరు రక్షించినను పరిత్యజించినను, శాస్త్రములను నమ్మినను నమ్మకపోయినను జనులకు వారి వారి యోగ్యతలకు తగిన కార్యములలో ప్రవేశించుటకు అర్హత గల్గియుండిన చాలును.

ఇంతవరకు చెప్పిన విషయములలో అధికభాగమున్ను, స్థూలదేహ మును గురించియే మనము చర్చించియున్నారము. మనయొక్క బీజాంకుర న్యాయమును గురించిన విషయము ఆత్మకు సంబంధించి యుండును. ఆ విషయమై, శ్రుతిస్మృతులు ఏమి శాసించుచున్నవో కొంచెము లోతుగ దిగి విచారించెదము. మనము అవిద్యయొక్క ముడిని విప్పివేయకపోయిన, ఏ కార్యమును సరిపడదని ముందు తెలుసుకొనియున్నాము గదా! ఆ చిక్కులు చిక్కులుగా నుండు కట్టులేవియో, వానికి స్థల మెచ్చటనో యోచింతము. దీనికే హృదయగ్రంథి యని పేరు. ఇది తెలుపుటకుముందుగా, దైవజ్ఞానమగు, వేదార్థమునకున్ను, మతకర్తల హృదయ భావమునకున్ను గల సంబంధమును గురించి కొంచెము మనము గ్రహించవలసియుండును. వేదములను గురించియు, వేదజ్ఞానమును గురించియు, వేదార్థనిర్ధారకులగు మతకర్తల గూర్చియు కొంచెము చెప్పవలసియున్నది.

వేదములోగల జ్ఞానము, అనగా వేదాంతము, లేక యీశ్వరుడు, ఈశ్వరునికి సంబంధించిన జ్ఞానమును గురించి చెప్పెడు వచనము లన్నియు ఒకే అర్థమునే బోధించుచున్నవి. అది అమృతము వంటిది. దానిననుభవించు జీవులు జననమరణరహితమగు ముక్తిని బొందగలరని మతకర్త లందరును చెప్పియున్నారు. అయితే అంతఃకరణము సంపూర్ణముగా శుద్ధత గల్గిన మతకర్త లరుదు. అనగా హృదయములో నే భావమును గలుగనీయక సత్య మెద్ది గలదో, అది ప్రకాశించుగాక అనిభావించెడు ప్రవక్తలు అరుదని భావము. దీనివల్ల వారు ప్రకృతిదోషము గలవారని తలంపరాదు. మతభావములోగాని, ఈశ్వర నిర్ణయములోగాని యేలాటి భావము గల్గియుండునో, అదే వారికి గోచరించును. ఆ గోచరించిన దానిని వారు లోకమునకు బోధించుదురు. లేక

గ్రంథరూపముగా వ్రాయుదురు. అయితే ఒక్కొక్కరున్ను దైవముయొక్క అనంతశక్తిలో ఒక్కొక్క శక్తిని వ్యక్తపరచుచునే యుందురు. అట్లు గానిచో, వారు మతకర్తలు గాజాలరు. ఎవరికైన, యథార్థమైన సత్యము తెలుసుకొనుట దుస్తరము. దేవతలేగాక బ్రహ్మదేవుడుగూడ ఈ విషయములో నిర్ధారణ చేయజాలక యున్నాడని కఠోపనిషత్తున నాచికేతసునికొఱకు యమధర్మరాజు వచించియున్నాడు. అంతఃకరణములో అట్టి భావము లేనిచో మతకర్తలలో ఈలాటి మార్పు గలుగుట కవకాశము లేదు.

ఈశ్వరజ్ఞానము అనగా వేదార్థము ఆకాశమునుండి కురియుచుండు శుద్ధమైన మేఘజలమువంటిది. భూమిలోగల ధాతుభేదములనుబట్టి ఆ జలము ఉప్పుగాను, వగరుగాను, చేదుగాను, తీపుగాను; తెలుపుగాను, ఎరుపుగాను, నలుపుగాను, పసుపుగాను మారుచుండును. ఆలాగున మత కర్తల హృదయభావ మేలాగున నుండునో వారి మతమున్ను, ఆలాటి జ్ఞానము గల్గియుండును. ఇట్టి భావమునకే సంస్కారమని పేరు. ఇది జన్మాంతర ఆచరణానుష్ఠానాభ్యాసములను బట్టియుండును. అయితే వారందరున్ను ఈశ్వర జ్ఞానములో మగ్నులైన వారలే. లేనిచో ఇంత మహిమ గల్గియుండరు. తప్తాయఃకణము రీతిగా ఇనుములోగల వేడిమి అంతయు అగ్నివల్లనే గల్గియున్నది. మరియు ఈశ్వరజ్ఞానము ఒక ప్రకాశమువంటిది. ప్రకాశము చిమ్నీలయొక్క రంగుల ననుసరించి తెల్లగాను, ఎఱ్ఱగాను, పచ్చగాను, నీలముగాను ప్రకాశించునట్లు వీరి హృదయభావము ననుసరించి మతజ్ఞానముగూడ గల్గి యుండును. దీనియందు సందేహము లేదు. వారు ప్రకృతిగుణములనుండి విముక్తులే. ఆ ప్రకృతిగుణము గుణత్రయము. శుద్ధమైన భావనాగుణము దీనికిపైగా నుండును. మతకర్త లందరున్ను, అట్టి భావము గలవారై యుందురు. ఇప్పుడు హృదయగ్రంథియొక్క అవస్థను తెలుసు కొనెదము.

**యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యేహ గ్రంథయః ।**
**అథ మర్త్యోఽమృతో భవత్యేతావదనుశాసనమ్ ॥**

యదా = ఎప్పుడు; అనగా, బ్రహ్మనిష్ఠచే పరిపక్వకాలము ఎప్పుడు గల్గునో అప్పుడు; ఇహ = ఇచ్చట జీవించియుండగనే; హృదయస్య గ్రంథయః = హృదయ గ్రంథులు; అనగా కట్టులు. సర్వే = అన్నియు; ప్రభిద్యంతే= పూర్ణముగా నశించిపోవు చున్నవో; అనగా తెగిపోవుచున్నవో; అథ = పిమ్మట; మర్త్యః = మనుష్యుడు; అమృతః భవతి = మరణరహితు డగుచున్నాడు. అనగా ముక్తుడగుచున్నాడు. ఏతావత్ = ఇదియే; అనుశాసనం = సర్వ వేదాంతముల యొక్క ఉపదేశము (లేక ఆజ్ఞ) (లేక యీశ్వరాదేశము).

ఓ నచికేతుడా! ఈ శరీరము నేను. ఈ ధనాదికము నాది; నేను సుఖిని; దుఃఖిని; ప్రభువును; పండితుడను; బ్రాహ్మణాది జాతులతో గూడిన వాడను; సన్న్యాసాది ఆశ్రమములలో చేరినవాడను అని తలంచుట మున్నగునవి అవిద్యాగ్రంథు లనబడును. లేక అజ్ఞానముయొక్క కట్టులనంబడును. "నేను శరీరముగాను; పై జెప్పిన శరీరసంబంధ గుణములు దేనిచేతను కూడినవాడను కాను. బ్రహ్మాత్మభూతుడను. అఖండాత్మస్వరూపుడను. అసంసారిని" అను దృఢభావన గలుగుటతోడనే పూర్వోక్తములైన అజ్ఞాన గ్రంథులన్నియు ఈ శరీరమునందే జీవించి యుండగనే నశించిపోవును. అవిద్యాగ్రంథులు నశించిన వెంటనే అవిద్యాగ్రంథులే నిమిత్తములుగా గల సంకల్పములన్నియు సమూలముగా నశించును. కోరికలన్నియు నశించిన వెంటనే మరణధర్ముడయిన జీవుడు అమృతు డగుచున్నాడు. ఉపనిషత్తులు అనుశాసించునదియు, ఆజ్ఞాపించునదియు ఇంతియే, అనుశాసన మనగా అనుశిష్టి - ఉపదేశము. సర్వోపనిషత్తులందు ఉపదేశింపబడిన తత్త్వమిదియే యని భావము.

**యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః ।**
**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే ॥**

యదా= ఏ కాలమునందు, అస్య= యీ బ్రహ్మనిష్ఠునియొక్క, హృది= హృదయమునందు, శ్రితాః = ఆశ్రయించియున్న, యే = ఏ, కామాః సర్వే =

కోరికలన్నియు, (సంకల్పము లన్నియు) ప్రముచ్యంతే = వదలిపోవుచున్నవో, అథ = పిమ్మట, మర్త్యః = మనుష్యుడు, అమృతః భవతి = మరణ రహితు డగుచున్నాడు, అత్ర = ఇచ్చటనే, బ్రహ్మ = బ్రహ్మమును, సమశ్నుతే = పొందుచున్నాడు.

పరమార్థదర్శియగు బ్రహ్మనిష్ఠునియొక్క సమస్తమైన కోరికలు ఆత్మ ప్రబోధమునకు ముందు సాధకునియొక్క బుద్ధిని ఆశ్రయించియున్నవి. ఆత్మప్రబోధానంతరము కోరదగిన అన్యపదార్థము లేకపోవుటచేత స్వయముగా ఆ కామములు బుద్ధిని వదలిపోవుచున్నవి. "కామః, సంకల్పః" అను శ్రుత్యంతరమువలన కామాదికమునకు ఆశ్రయము హృదయముగాని, ఆత్మ కాదు. ఆత్మ విజ్ఞాన ప్రబోధముకంటె ముందు మరణధర్మము గలదయినను, అట్టి ఆత్మయే, విజ్ఞాన ప్రబోధానంతము అవిద్యాకామకర్మ లక్షణమగు మృత్యువు నశించుటచేత అమృతము = మరణరహితమగు చున్నది.

ఇప్పుడు మనము అవిద్యయొక్క ముడులనున్ను, వానియొక్క స్థానమునున్ను గ్రహించుకొన్నాము. ఇక ఆ కట్టులను, నిర్మూలముగా ఛేదించుటకు, సమర్థు డెవడో వానిని కనుగొనెదము.

**పరాఞ్చి ఖాని వ్యతృణత్స్వయంభూ**
**స్తస్మాత్పరాఙ్ పశ్యతి నాన్తరాత్మన్ ।**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష**
**దావృత్త చక్షురమృతత్వ మిచ్ఛన్ ॥**

స్వయంభూః = పరమేశ్వరుడు, ఖాని = ఇంద్రియములను, పరాఞ్చి = పరాగ్రూప విషయాభిముఖ స్వభావము గలవానినిగా, అనగా, దృశ్యవిషయాభి ముఖముగా, వ్యతృణత్ = హింసించెను (సృష్టించెను), తస్మాత్ = అందు వలన, (ఆ యింద్రియములు) పరాఙ్పశ్యతి = శబ్దాది విషయజాతమునే గాంచుచున్నవి. అంతరాత్మన్ = అంతరాత్మను, న = చూచుటలేదు. కశ్చిత్

ధీరః = ఒకానొక వైరాగ్యపరుడగు వివేకి, అమృతత్వం = మోక్షమును, ఇచ్ఛన్ = కోరుచున్నవాడై, ఆవృత్త చక్షుః = (విషయములనుండి మఱలింపబడిన ఇంద్రియ సమూహము గలవాడై) ప్రత్యగాత్మానం = పరమాత్మను, అనగా అంతరాత్మను, ఐక్షత్ = దర్శించుచున్నాడు.

శ్రోత్రాదీంద్రియసమూహము శబ్దాదివిషయములను ప్రకాశింపజేయుటకే ప్రవర్తించుచున్నది. ఈ శ్రోత్రాదీంద్రియములను పరమేశ్వరుడిట్టి స్వభావము గలవానినిగా నిర్మించెను. కావున వానిని హింసించినట్లే యగుచున్నది. అనగా సామాన్య జనులసృష్టి యీలాగున నుండును. ఆలాగున విషయాభి ముఖములుగా పోవు ఇంద్రియములు తమ్ము తాము చంపుకొనిన వగుచున్నవి. కాని వేఱుకాదు కదా? ఇట్టి నిర్ణయము నొనర్చినవాడు స్వయంభువు. ఆ యింద్రియములు అనాత్మభూతములగు శబ్దాదివిషయములనే పొందుచున్నవి. కాని అంతరాత్మను గాంచుట లేదు.

లోకమునందు ఇట్టి ప్రవర్తనము సామాన్యజనులకు సహజమైనను, యోగజ్ఞానములతో గూడిన సాధకుడైన ఒకానొక ధీరుడు నదీప్రవాహమునకు ఎదురీదినటుల వివేకి యగువాడు, గొప్ప ప్రయత్నముచేత, ఇంద్రియముల యొక్క స్వాభావిక ప్రవృత్తిని నిరోధించినవాడై అనగా ఆ యింద్రియ ప్రవృత్తిని ఆత్మాభిముఖముగా నొనర్చినవాడై ప్రత్యగాత్మను గాంచుచున్నాడు. దీనియందు ఈత దెలియనివారు నదీప్రవాహముచే కొట్టబడి మృత్యువు నొందునట్లున్ను, ఈత దెలిసిన వారు నదీప్రవాహమున కెదురీది గమ్యస్థానము చేరునట్లున్ను వర్ణించబడెను. ఇదే అనుష్ఠానము గలవానియొక్కయు లేనివానియొక్కయు గతియని మనము గ్రహించవలయును అని కఠోపనిషత్తు జలమునకు క్రిందికి పోవుట స్వభావముగా నుండినను, యంత్ర సహాయముచే ఏలాగున, పైభాగమునకు తీసుకొనిపోవుచుందురో, ఆలాగున సామాన్య జనుల మనోవృత్తులు బహిర్గతములై యుండినను సాధనానుష్ఠానము గలవారు ఊర్ధ్వగాములై బ్రహ్మమును బొందుచుందురు. ఇప్పుడు వివేకచూడా

మణియందు శ్రీశంకరులు బోధించిన వివేక జ్ఞానము చూడందగును.

**దేహేఽహమిత్యేవ జడస్య బుద్ధిర్దేహే చ జీవే విదుషస్త్వహంధీః ।**
**వివేకవిజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాహమిత్యేవ మతిస్సదాత్మని ॥**

జడస్య = జడునికి (ఆత్మజ్ఞానములేని మూఢునికి), దేహః = దేహము, అహం ఇతి ఏవ = నేననే, బుద్ధిః = తలంపు గల్గియుండును. విదుషః = శాస్త్రములు చదివిన వానికి, దేహే = దేహమునందు, జీవే చ = ప్రాణాదులతో గూడిన జీవునియందును, అహంధీః = నేనను బుద్ధి గల్గియుండును, వివేక విజ్ఞానవతః = ఆత్మానాత్మ వివేకజ్ఞానముగల, మహాత్మనః = పరమార్థ జ్ఞానము తెలిసిన మహాత్మునికి, సదాత్మని = నాశము లేని ఆత్మస్వరూపము నందు ఎల్లప్పుడున్ను, అహంబ్రహ్మ ఇతి ఏవ = నేను బ్రహ్మఅనియే, మతిః = బుద్ధి గలిగియుండును.

మూఢుడు తనువే తానని తలంచును. కొంచెము చదువుకొనిన పండితుడు దేహేంద్రియములతో గూడిన జీవుడే తానని తలంచును. ఆత్మ జ్ఞాననిష్ఠుడగు మహాత్ముడు శివజీవైక్యము కలుగజేసుకొని, బ్రహ్మాకారవృత్తి గలిగియుండును.

దీనివల్ల బీజాంకుర న్యాయము దేహమునకు కల్పించిన పామరుని బుద్ధి యెటువంటిదో తెలుసుకొనవచ్చును.

**ముంజాదిషీకా మివ దృశ్య వర్గా**
**త్ప్రత్యంచ మాత్మానమసంగమక్రియమ్ ।**
**వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం**
**తదాత్మనా తిష్ఠతి యస్స ముక్తః ॥**

ముంజాత్ = గడ్డిపరకనుండి, ఇషీకాం ఇవ = (లోపలి) గడ్డిపోచను వలె, దృశ్యవర్గాత్ = దేహేంద్రియ దృశ్యవర్గమునుండి, ప్రత్యంచం = ద్రష్ట (చూచునది) యు, అసంగం = దేహేంద్రియములతో సంబంధము

లేనిదియు, అక్రియం = వికారములు లేనిదియునగు, ఆత్మానం = తన యాత్మను, వివిచ్య = వేరుచేసి తెలుసుకొని, తత్ర = ఆ యాత్మవస్తువునందు, సర్వం = సమస్తమును (అనాత్మవర్గమును), ప్రవిలాప్య = లీనముచేసి, తత్ ఆత్మనా = ఆ బ్రహ్మస్వరూపముతోనే, యః = ఎవడు; తిష్ఠతి = ఉండునో; సః = వాడు, ముక్తః = ముక్తుడు.

ముంజయనగా తృణవిశేషము; మౌంజీబంధనమునకు ఆ ముంజ యొక్క పై భాగములో నుండు ఆకులతో గూడిన పట్టలను తీసివేసి లోపల నుండు కాడను తీసుకొన్నట్లు, ఆత్మనిష్ఠగలవాడు ఆత్మానాత్మ విచారణచే దేహేంద్రియాది దృశ్యముల నన్నిటిని ఆత్మనుండి తొలగించి స్వస్వరూపమైన బ్రహ్మమునందుండును. అరటిచెట్టుయొక్క పట్టలను తీసివేసి లోపలగల అరటిబొందెను ఎట్లు తీసుకొందురో ఆలాగున పంచభూతములకున్ను, తత్తద్ధర్మములకున్ను, పంచకోశములకున్ను, వారియొక్క గుణములకును సాక్షిగానుండు ఆత్మలో నిష్ఠ గల్గియుండవలయునని బోధించిరి. అంతేగాని, వివేకహీనులవలె దేహేంద్రియ ధర్మములు తానని తలంచి యుండరాదని భావము. ఈ శ్లోకములో నొక పరమరహస్యము గలదు. ముంజయొక్క పైపొరలున్ను, అరటిచెట్టుయొక్క పైపట్టలున్ను వానికన్యము లెట్లు గావో, అట్లు పూర్ణ బ్రహ్మభావములో దృశ్యమున్ను, దృక్కున్ను ఏకముగా చేసు కొనవలెను. యథార్థముగా అట్లుగానే యున్నది. అయితే స్వరూపజ్ఞానము దృఢముగా గలుగువరకు దేహేంద్రియములకు సాక్షిగా నుండు చిన్మయ స్వరూపుడే తానను బోధ గలిగేలాగున అభ్యసించుకొనవలెను.

**అత్రాత్మబుద్ధిం త్యజ మూఢబుద్ధే త్వఙ్మాంసమేదోఽస్థిపురీషరాశౌ ।**
**సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే కురుష్వ శాంతిం పరమాం భజస్వ ॥**

త్వక్ మాంసమేదః అస్థి పురీషరాశౌ = తోలు, మాంసము, మెదడు, ఎముకలు, మలముల (వీని) సమూహమగు, అత్ర = ఈ దేహమందు, ఆత్మ బుద్ధిం = తానను బుద్ధిని, మూఢ బుద్ధే! = ఓ బుద్ధిలేనివాడా!. త్యజ = వదలి

వేయుము, నిర్వికల్పే = విశేషములు (మార్పులు) లేని, సదాత్మని = నిత్యస్వ రూపుడగు, బ్రహ్మణి = పరబ్రహ్మయందు, ఆత్మబుద్ధి = నేనను బుద్ధిని, కురుష్వ = చేయుము. పరమాం = అత్యంతము గొప్పదైన, శాంతిం = శాంతిని, (సంతుష్టిని) భజస్వ = పొందుము. అనగా శరీరేంద్రియములకు సాక్షి యగు బ్రహ్మస్వరూపమగు ఆత్మయే తన ఆత్మయని తెలసికొని సుఖింపు మని భావము.

ఇక బీజాంకుర భావమునుగురించి విచారించుటలో, ముండకోపని షత్తు ఏమి చెప్పుచున్నదో బాగుగ చూచుకొనుడు.

**తదేతత్సత్యం -**
**యథా సుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః**
**సహస్రశః ప్రభవంతే సరూపాః ।**
**తథాఽక్షరాద్వివిధాస్సోమ్య భావాః**
**ప్రజాయంతే తత్ర చైవాపి యన్తి ॥**

తత్ ఏతత్ = ఆ యీ చెప్పబోవు అక్షరవిషయము, సత్యం = సత్యమైనది, (సత్యమనగా భూతభవిష్యద్వర్తమాన కాలములయం దేకరూప మున నుండుట) సుదీప్తాత్ = బాగుగా మండుచున్న, పావకాత్ = అగ్నినుండి, సహస్రశః = వేలకొలది, సరూపాః = సమానమైన రూపములుగల, విస్ఫు లింగాః = అగ్నికణములు, యథా = ఏ విధముగా, ప్రభవంతే = పుట్టు చున్నవో, 'తథా = ఆ ప్రకారమే, సోమ్య = సాధుస్వభావముగల ఓ శౌనకుడా! అక్షరాత్ =నాశరహితమగు పరబ్రహ్మమునుండి, వివిధాః = నానావిధములగు, భావాః = జీవులు, ప్రజాయంతే = పుట్టుచున్నవి, తత్ర చ ఏవ = అయక్షర మగు పరబ్రహ్మమునందే, అపి యంతి = లీనమగుచున్నవి.

బాగుగా మండుచున్న అగ్నినుండి అగ్నియొక్క అవయవములగు మిణుగురులు, అగ్నితో సమానమైన రూపములు గలవై, వేలకొలది యెటుల బైలు వెడలుచున్నవో, అదేవిధముగా ఆ యక్షరమువల్లనుండి నానావిధ

దేహోపాధి భేదముల ననుసరించుటచే వివిధములుగా జీవులుగూడ తోచు చున్నవి. నానావిధ దేహరూపములతోడ వివిధజీవులు పుట్టుచు ఆ యక్ష రమునందే లీనమగుచున్నవి.

ఇప్పుడు బీజాంకురమును గురించి గలిగెడు సందేహము లన్నియు దీనివల్ల నివృత్తి గాగలవు. ఇక ఈ విషయమై తైత్తిరీయోపనిషత్తు చెప్పినది గూడ చూడుడు.

**ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే । ఆనన్దేన జాతాని జీవంతి । ఆనన్దం ప్రయంత్యభిసంవిశంతీతి । సైషా భార్గవీ వారుణీ విద్యా పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా । య ఏవం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి । మహాన్ భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసేన । మహాన్కీర్త్యా ॥ ఇతి షష్ఠోఽనువాకః ॥**

ఆనందః = ఆనందము, బ్రహ్మేతి =బ్రహ్మస్వరూపమని, వ్యజానాత్ = తెలిసికొనెను, ఇమాని = ఈ, భూతాని = భూతములు, ఆనన్దాద్ధ్యేవ = ఆనందము నుండియే, జాయంతే ఖలు = పుట్టుచున్నవి గదా? జాతాని = పుట్టిన భూతములు, ఆనందేన = ఆనందముచేత, జీవన్తి = బ్రతుకుచున్నవి. ఆనందం = ఆనందమునుగూర్చి, ప్రయంతి = పోవుచున్నవి. అభిసం విశంతి = అంతట ఆనందస్వరూపమునే ప్రవేశించుచున్నవి. (ఆనందస్వరూ పమే యగుచున్నవి.) ఇతి = సమాప్తము.

వారుణీ = వరుణునిచేత చెప్పబడిన, భార్గవీ = భృగువుచేత తెలుసు కొనబడిన. సా = ఆ ప్రసిద్ధమగు, ఏషా = ఈ, విద్యా = పరబ్రహ్మవిద్య, పరమే = శ్రేష్ఠమగు, వ్యోమన్ = ఆకాశమునందు, అనగా హృదయాకాశ గుహయందు, (పరమానందాద్వైతమునందు), ప్రతిష్ఠితా = ఉంచబడి యున్నది, యః = ఎవడు, ఏవం = ఈ ప్రకారము, (ఈ పూర్వము చెప్పిన తపస్సాధనముచేత ఈ క్రమమునే అనుసరించి ఆనందస్వరూపమగు పర బ్రహ్మమును) వేద = తెలుసుకొనుచున్నాడో, సః = వాడు, (ఈ ప్రకారము

పరబ్రహ్మవిద్యా ప్రతిష్ఠాపనవుచువలన ఆనందమగు పరబ్రహ్మమునందు) ప్రతితిష్ఠతి = ఉండుచున్నాడు. అన్నవాన్ = అన్నముగలవాడును, అన్నాదః = అన్నమును భక్షించువాడును, (అన్నదాతయు) భవతి = అగుచున్నాడు. ప్రజయా = సంతానముచేతను, లేక శిష్యులచేతను, పశుభిః = గవాది పశువులచేతను, బ్రహ్మవర్చసేన = బ్రహ్మతేజస్సుచేతను, మహాన్ = గొప్ప వాడుగను, కీర్త్యా = యశస్సుచేత, మహాన్ = అధికుడును, లోకపూజ్యుడును, భవతి = అగుచున్నాడు.

ఆనందమునుండియే సమస్తభూతములు పుట్టి, ఆ పుట్టిన భూతములు ఆనందముచేతనే జీవించుచు, అంతమునందు ఆనందమును గూర్చి పోయి, తామంతటను ఆనందస్వరూపమై ప్రవేశించి, ఆనందమే యగుచున్నవి. కనుక ఆనందమే పరబ్రహ్మస్వరూపముగా దెలుసుకొనెను. ఇట్లు భృగువు తపస్సుచేత పరిశుద్ధాంతరంగుడై మెల్లమెల్లగా నంతరమునందు ప్రవేశించి ఆంతరమగు ఆనందస్వరూపమైన పరబ్రహ్మమును; తపస్సనెడి సాధనముచేతనే తెలుసుకొనెను. ఇట్లు భృగువుచేత తెలిసికొనబడిన వరుణునిచేత చెప్పబడిన ఆ ప్రసిద్ధమగు నీ పరబ్రహ్మవిద్య శ్రేష్ఠమగు నా హృదయగుహయందలి, పరమాకాశమనంబడు అద్వయబ్రహ్మము నందుంచ బడియున్నది. ఈ పరబ్రహ్మవిద్యను, ఈ పూర్వము చెప్పిన తపో ధ్యాన నిష్ఠలచేత నీ ప్రకారముగా తెలుసుకొనినవాడు శ్రేష్ఠమై ఆనందస్వరూపమగు బ్రహ్మమునందు స్థితిని జెంది పరబ్రహ్మ యగుచున్నాడు.

ఇట్టి బ్రహ్మవేత్తకు దృష్టఫల మేమియన ఆ బ్రహ్మవేత్త అన్న సమృద్ధి గలవాడును, అన్నమును దానముచేయువాడును, అన్నము భుజించుటకు కొరత గలుగనివాడును, తేజోవంతుడును, పుత్రాది లేక శిష్యాది సంతానము చేతను, గవాది పశుసంపత్తిచేతను, శమదమాదులవలన బుట్టిన తేజస్సు చేతను, లోకమునందలి ఖ్యాతిచేతను మిక్కిలి శ్రేష్ఠుడు నగుచున్నాడు.

ఈ శ్రుతివల్ల వివేకజ్ఞానములేని కొందరి హృదయములో బ్రహ్మ

నిష్ఠలో ప్రవేశించిన గృహసంబంధ భాగ్యభోగ్యములు తగ్గిపోవునను తలంపు లేకపోవును. బ్రహ్మవిద్య గలవానికి ఇహములో గలిగెడు సౌఖ్యములు ఈలాగుండునని వేదమాతయే చెప్పుచున్నది. ప్రత్యక్షముగా మహాపురుషుల మఠాధిపతుల స్థానములను, ఆశ్రమములను చూచినవారికి తెలియును. ప్రాకృతవిద్యలో ఉన్నతోద్యోగములవారికే అంత సౌభాగ్యము గల్గునప్పుడు పరబ్రహ్మవిద్య గలవారికి పై జెప్పినవి గలుగుటలో ఆశ్చర్య మేమున్నది? ఇక బీజాంకురమును గురించి ఆత్మబోధ ముపదేశించినది చూడుడు :

**ఉపాదానేఽఖిలాధారే జగంతి పరమేశ్వరే ।**
**సర్గస్థితిలయం యాంతి బుద్బుదా ఇవ వారిణి ॥**

ఉపాదానే = కారణభూతమైన, అఖిలాధారే = సర్వమునకు ఆధార భూతమైన, పరమేశ్వరే = సర్వనియంతయైన బ్రహ్మమునందు, జగంతి = బ్రహ్మాండములు, వారిణి = ఉదకమునందు; బుద్బుదా ఇవ = బుగ్గలవలె; సర్గస్థితిలయం = ఉత్పత్తిస్థితి వినాశములను, యాంతి = పొందుచున్నవి.

నీటియందు బుడగలు నీటియందే పుట్టి పెరిగి నశించుచు వేఱుగా కనబడుచున్నప్పటికిని ఎట్లు నీరుకంటే వేఱుగాక నీరే అయియున్నవో, ఆలాగే సర్వమునకు కారణభూతమై సమస్తమునకు ఆధారమై యున్న పరమాత్మ యందు అనేకకోటి బ్రహ్మాండములు ఉత్పత్తిస్థితివినాశములను పొందుచు వేఱు పదార్థములుగా కనబడుచున్నప్పటికిన్ని పరమాత్మకంటె వేఱు గావు. అనగా సముద్రమునుండి కలిగెడు అలలు, తుంపరలు, బుడగలు, జలబిందువులు మొదలైనవన్నియు సముద్రజలమున కేలాగున నన్యము గాకుండునో, ఆలాగున, కారణభూతుడగు సర్వేశ్వరునుండి గలిగెడు నీ జీవకోట్లన్నియు బీజాంకురన్యాయము ననుసరించి కారణమునకు భిన్నముగ కార్యమెట్లుండదో, ఆలాగున నీశ్వరునినుండి పుట్టిన కారణముచే నీశ్వరాంశములని తెలిసికొనవలయును. ఇక శ్రీభగవద్గీత చెప్పు విషయమును జూడుడు.

**సర్వయోనిషు కౌంతేయ! మూర్తయస్సంభవంతి యాః ।**
**తాసాం బ్రహ్మమహద్యోని రహం బీజప్రదః పితా ॥**

హే కౌన్తేయ! = ఓ యర్జునుడా!, సర్వయోనిషు = సమస్త జాతులయందును; యాః మూర్తయః = ఏ దేహములు, సంభవంతి = కలుగుచున్నవో; తాసాం = వానికి, మహద్బ్రహ్మ = మూలప్రకృతి (మాయ), యోనిః = కారణము (తల్లి) అహం = నేను, బీజప్రదః పితా = గర్భాధాన కర్తయగు తండ్రిని.

అర్జునా! దేవ, పితృ, మనుష్య, పశు, మృగ, పక్షి, కీటక, వృక్షాది సమస్త ప్రాణిజాతులయందు గలుగుచుండు స్థావర జంగమాత్మకములగు స్వరూపముల కన్నిటికి మాయ మాతృస్థానము, నేను పితృస్థానము అని యెఱుంగుము.

ఈ భగవద్వచనముచే, తండ్రికంటె వాని బిడ్డలు వేరుగానట్లు, సర్వేశ్వరుడే తండ్రియనియు, ఈ జీవకోట్లన్నియు వాని సంతానములనియు తెలియవచ్చుచున్నది. ఇచట దేహమునకు కారణము మాయయనియు, అనగా ప్రకృతి యనియు, జీవులకు కారణము నీశ్వరుడనియు స్పష్టముగా చెప్పబడినది. కాబట్టి దేహమునుగురించి జాతిని చెప్పువారు మాయచే మోహితులైన వారలని గ్రహించవలయును. ఇది శ్రీకృష్ణభగవానుని వచనము.

**బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ! సనాతనమ్ ॥**

హే పార్థ! = ఓ యర్జునుడా! సనాతనం = నిత్యుడనైన, మాం= నన్ను, సర్వభూతానాం = సమస్తభూతములకున్ను, బీజం = విత్తనమునుగా; (మూల భూతునిగా) (కారణపురుషునిగా) విద్ధి = ఎఱుంగుము.

సర్వభూతములకు నుత్పత్తికారణమగు విత్తనము నేనే.

ఈ బీజాంకుర న్యాయము వ్రాయుటకు కారణమేమనగా? జనులు తమయొక్క స్వరూపజ్ఞానము మరచిపోయి, కల్పితములై జడములగు

దేహములే తామని తలంచి స్వబోధరహితులై పశుప్రాయులై పోవుచున్నారు. వీరందరున్ను నిద్రించి యుండు సింహమువలె నుండువారు. వీరికి ఆత్మ ప్రబోధము గల్గినవారు సత్యధర్మనిష్ఠ గల్గి శుద్ధాత్ములై, యిహపరసౌఖ్యమును బొందుటకు సాధనమగు దైవజ్ఞానము నార్జింపగల్గి ధన్యాత్ములు గాగలరు. అట్టి భావమే యిది వ్రాసిన వారికి గలదుగాని, మరియేలాటి వైషమ్యభావము గల్గియుండలేదు. దీని కొక కథ గలదు :-

గంగాపుష్కరకాలమున ఒకరాజున్ను, తన పరివారములున్ను, ఏక పుత్రుడై ఒక సంవత్సరము వయస్సుగల శిశువున్ను, ఆ శిశువుయొక్క తల్లి యున్ను గూడి పడవలో ప్రయాణము చేయుచుండిరి, నదీమధ్యములో బోవు చుండగా పెద్దతుఫాను వచ్చి యోడ మునిగిపోయెను. రాజున్ను, రాణియున్ను, పరివారములలో పెక్కంద్రున్ను చనిపోయిరి. చిన్నశిశువుగూడ గనిపించలేదు. ఆ చిన్నబిడ్డను గంగాదేవి తన కడుపులో పెట్టి రక్షించినట్లు, ప్రవాహవేగముచే కొన్ని మైళ్ళదూరము పోయి, సజీవముగా నదియొడ్డున చేర్చియుండెను. అత్తరి ఒక జాలరివాడు కనుగొని గంగాపుష్కర జనబాహుళ్యములో నెవరి శిశువో, చేతినుండి పడిపోయెనని తలంచి తీసుకొనిపోయి పెంచుచుండెను. బాల్య కాలమునుండి ఆ జాలరివాని పనులు నేర్చుకొని ఆ బాలుడు తానున్ను జాలరి వాని వంశములో చేరినవాడనని తలంచి యుండెను. వలలు కట్టుట, చేపలు పట్టుట మొదలగు పనులు చేసి జీవనము జరుపుకొనుచుండెను. పడవలో మునిగిపోయిన వారియందరి కళేబరములు దొరికినవిగాని, చిన్నపాపయగు రాచకుమారుని శరీరము దొరకలేదు. అప్పటి నుండియే మంత్రులకు సందే హము గల్గి భటులచేత వెదకించుచుండిరి. సత్యధర్మనిష్ఠలు గల మంత్రిప్రభు తులు న్యాయముగ పరిపాలించుచుండిరేగాని రాజ్యమునకు తగినరాజును నేర్పాటు చేయుటగాని, పట్టాభిషేకముగాని చేసియుండలేదు.

బహుకాలము వెదకినను ఇరువది సంవత్సరముల వఱకును నేలాటి జాడయు తెలిసియుండలేదు. అంతకాలము పరిశ్రమ చేయుటకు కారణ

మేమనగా జ్యోతిష్కులున్ను భవిష్యత్ జ్ఞానముగల మహాపురుషులున్ను, రాచకొమరుడు చావలేదనియు, బ్రతికియున్నాడనియు చెప్పుచు వచ్చిరి. అప్పటికి రాజకుమారునికి ఇరువది సంవత్సరముల ప్రాయమాయెను. అంతవఱకతడు దుఃఖజీవితము గడపి, హీనజాతియని తలంచి బెస్తవారి వృత్తి గల్గియుండెను. దైవవశమున దేశమంతయు వెదకుచుండు రాజభటులు ఈ రాజపుత్రుడుండు గ్రామమునకు వచ్చిరి. అచ్చటంతయు విచారించగా ఫలానివానికి చాలాకాలముక్రింద ఏటియొడ్డున ఒక బిడ్డ దొరికెనని చెప్పినది విని అతని యింటికి వెళ్ళి యావద్వృత్తాంతము విచారించగా, అప్పటికి నీ శిశువుదొరికి 19 సంవత్సరములైనవని తెలియవచ్చినది. ముఖవర్చస్సు, దేహ సౌష్ఠవము, విశాలవక్షఃస్థలము అంతయును జూచిన ఆతడొక మహాపురు షుడుగా నుండేలాగున గనుపించెను. రాజసేవకులు వెంటనే పట్టరాని సంతోష ముతో పరుగెత్తివచ్చి మంత్రుల కెరింగించిరి. అప్పుడు ముఖ్యమంత్రులున్ను రాజకుటుంబమునకు దగ్గరగల బంధువులున్ను ఈ శిశువును పోషించు చుండిన దాసీజనులున్ను పినతల్లి మొదలగు కొందరు అంతఃపురస్త్రీలున్ను వచ్చి పరిశోధించుటయు, బిడ్డ బెస్తవానికి దొరికిన కాలమును నిర్ణీతము చేసినప్పుడు గంగాపుష్కరము జరిగిన కాలమును సరిగా నుండుటచే ఆ బెస్తవానికి కావలసిన ధనము నిచ్చి శిశువును దీసుకొనిపోయి సంస్కారాది క్రియలచే పుణ్యాహవాచనాది శుభకార్యములు సలిపి రాజ్యపట్టాభిషిక్తునిగా జేసిరి. ఇంతవఱకు చెంబడివాడనని తలంచి, దీనభావముతో నుండినవాడు, తాను గొప్ప క్షత్రియవంశములో జన్మించిన వాడననియు, రాష్ట్రములకు ప్రభువుననియు బోధ గలిగి నివురుచే కప్పబడియుండు నిప్పు పైగల బూడిద పోవునప్పుడు అగ్ని ప్రజ్వలించునట్లు గొప్పతేజోవంతుడై మహామేధావియై ప్రకాశించుచుండెను.

ఆత్మసోదరులారా! సోదరీమణులారా! మనయొక్క ప్రస్తుతస్థితియు నీలాగున్నది. కనుక సామాన్య జనులచే కల్పింపబడిన వాక్యములను వేదశాస్త్ర ప్రమాణములని నమ్మక దేహేంద్రియ మనోబుద్ధులకు సాక్షియై యుండు

చైతన్యస్వరూపమే మీ ఆత్మయనియు, అదే మీ స్వరూపమనియు తెలుసుకొని కృతకృత్యులై జీవింపుడు. అప్పుడు మీకు మహత్తైన దైవశక్తి కల్గును.

ఈ విషయమై కైవల్యోపనిషత్తులో మనము గ్రహించవలసిన విషయమును జూడుడు.

**జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।**
**తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే ॥**

జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి మొదలగు నీ జగత్తును నే యాత్మ ప్రకాశింపజేయుచున్నదో, అనగా నే యాత్మచే, నివన్నియు ప్రకాశించుచున్నవో, అది బ్రహ్మస్వరూపము; అదే తనయొక్క ఆత్మయని జ్ఞానముగలిగిన యెడల సకల సంబంధములనుండియు విముక్తి నొందును. అదే మోక్షమని గ్రహించవలయును. అనగా దేహాత్మభావమే అజ్ఞానమనియు, ఆత్మలో పరమాత్మభావము గల్గియుండుటే సుజ్ఞానమనియు తెలుసుకొనవలయును. అట్టి దేహబంధమునుండి యెట్లు విముక్తి గల్గునో, ఆ మార్గమును ఈ శ్లోకము చెప్పుచున్నది.

**ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।**
**జ్ఞాననిర్మథనాభ్యాసాత్పాశం దహతి పండితః ॥**

తనదేహమును అధరారణిగను, (యజ్ఞమునందు నిప్పును గలుగ చేయునట్టి యడుగు మ్రానుగను,) ఓంకారమును ఊర్ధ్వారణిగను (కవ్వముగను) చేసి జ్ఞానమనెడు తరచుటయను పరిశ్రమమువలన బ్రహ్మజ్ఞానియైన వాడు అజ్ఞానమనెడి పాశమును దహించుచున్నాడు. కట్టెలో నిమిడియుండు, నిప్పు మథించునప్పుడెట్లు ప్రజ్వలించునో ఆలాగున ఆత్మసాక్షాత్కారము గల్గుటకు ప్రణవానుసంధానపరుడై నిష్ఠచేయువానికి ఆత్మజ్ఞానమనెడి దైవత్వము ప్రకాశించును. అప్పుడు సమస్తకర్మపాశములు దహించిపోవును. కట్టెకెట్లు నిప్పు భిన్నముగా గనుపించునో, ఆలాగున దేహమున కన్యముగా

దేహియగు ఆత్మను కనుగొనవచ్చును.

**సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా ॥**

సకలభూతములయందు తనను, తనయందు సకలభూతములను జక్కగా చూచువాడు పరబ్రహ్మమును బొందుచున్నాడు. ఇతరకారణముచే, బొంద నలవిగాదు. (అనగా వేరుభావన గలవారికి దైవసాక్షాత్కార జ్ఞానము గల్గుటకు మార్గము లేదని భావము.) తనలోను, ఇతరులలోను వెలుగుచుండు ఆత్మవస్తువు ఒకే దైవస్వరూపమను జ్ఞానము గలవానికే గల్గునుగాని అట్టి ముక్తిజ్ఞానము గలుగనివానికి వేఱుపాయము లెన్ని యున్నను, మోక్షము లేదని తాత్పర్యము. తెలియక చెడువారు కొందరు, సమస్తము తెలుసునను గర్వముతో చెడువారు మఱికొందరు, తెలిసి తెలియక చెడువారు ఇక కొందరు, పై చెప్పిన వారలతో చేరి చెడువారు మఱికొందరు.

**కేచిదజ్ఞానతో నష్టాః కేచిన్నష్టాః ప్రమాదతః ।**
**కేచిత్ జ్ఞానావలేపేన కేచిన్నష్టాస్తదాశ్రితా : ॥**

దీని యర్థము పైని వివరించినదే.

**యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున**

హే అర్జున!=ఓ యర్జునా! సర్వభూతానాం=సమస్త భూతములకును, యత్ = ఏది, బీజం = విత్తనమైనదో, తదపి చ = అదియును, అహం (అస్మి) = నేను (అయియున్నాను) దీనివల్ల సమస్తజీవకోట్లకున్ను, భగవంతుడే మూలపురుషుడనియు, ఆ జీవకోట్లు భగవత్స్వరూపములనియు సుస్పష్టమగుచున్నది.

**మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ!**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥**

హే ధనంజయ! = ఓ యర్జునా! మత్తః = నా కంటె, పరతరమ్ = శ్రేష్ఠమగు, అన్యత్ = ఇతరమైనది, కించిత్ = కొంచెమైనను (ఏదియును) నాస్తి = లేదు, (నేనే జగత్కారణమనుట) సూత్రే = దారమునందు, మణి గణా ఇవ = రత్నములు మొదలగు వస్తుసమూహములవలె, మయి = నా యందు, ఇదం సర్వం = ఈ సమస్తము (ప్రపంచము), ప్రోతం = గ్రుచ్చ బడినది. (ఆశ్రయించు కొనియున్నది).

ఒకే దారములో అనేకరకములైన మణులు ఏలాగున గ్రుచ్చబడి యున్నవో, ఆలాగున నామరూపములతో కానుపించు స్థూలదేహాదులలోను, సత్త్వరజస్తమోగుణములతో గోచరించు స్థూలదేహాదులలోను, అంతర్యామియై వెల్గుచుండు చైతన్యస్వరూపము ఆత్మయని యెఱుంగుము. అదే భగవత్స్వ రూపము. మూఢాత్ములు నామరూపములతో గూడిన యీ దేహమునే ఆత్మ యని నమ్ముదురు. ఇది నశించిపోవునది. అవినాశి యగు జీవచైతన్యము ఈశ్వరచైతన్యమున కన్యము గాదని యెఱింగి ఆత్మయందు నిలకడగల వారు ముక్తు లగుదురు.

**అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ॥**

పరమం = ఉత్తమమైన, అక్షరం = నాశరహితమైనది, బ్రహ్మ = బ్రహ్మము (అనబడును). స్వభావః = జీవసంజ్ఞగల ప్రత్యగాత్మభావము, అధ్యాత్మం = ఆత్మ యని; ఉచ్యతే = మహర్షులచే చెప్పబడుచున్నది.

అనగా జీవసంజ్ఞ గలిగిన ప్రత్యగాత్మ పరమాత్మస్వరూపమునుండి గలిగినందుచే, అదిన్ని పరబ్రహ్మస్వరూప మగునని భావము.

**పితాఽహమస్య జగతో మాతా ధాతా పితామహః ।**
**వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవ చ ॥**

అస్య జగతః = ఈ ప్రపంచమునకు, అహమేవ = నేనే, పితా = తండ్రియు, మాతా = తల్లియు, పితామహః = తాతయు, ధాతా = కర్మఫల

మును గలుగజేయువాడును, వేద్యం = తెలుసుకొనవలసిన వస్తువును, పవిత్రం = పావన (పరిశుద్ధ) వస్తువును, ఓంకారః = ప్రణవస్వరూపుడను, ఋక్సామయజుః+చ = ఋగ్యజుస్సామవేదములలో బ్రతిపాదింపబడు వస్తుస్వరూపుడను, అస్మి = అగుచున్నాను. (అనగా సమస్తమును నా స్వరూపమే యనుట.)

దీనివల్ల బీజాంకురన్యాయము రీతిగా ప్రణవస్వరూపమై, సర్వప్రాణికోట్లకు మూలాధార స్వరూపముగా నుండునది భగవత్స్వరూపమని స్పష్టముగ గోచరించుట లేదా? అప్పుడు దానినుండి గల్గిన జీవకోట్లు ఎట్లు భగవత్స్వరూపములు గాకపోవును. ఇట్టి యుత్కృష్టభావమునుండి నికృష్టమగు, జడభావములోనికి జీవకోట్లు దిగివచ్చినందుచే గదా జ్ఞానహీనులైపోయిరి. అదెట్లనగా, శూద్రగ్రహముచే ఆవేశింపబడిన బ్రాహ్మణుడు ఏలాగున తాను శూద్రుడనని తలంచియుండునో, మాంత్రికుని సహాయముచే, గ్రహవిమోచనము గల్గినపిమ్మట నేలాగున తన బ్రాహ్మణత్వము బోధమునకు వచ్చునో; ఆలాగున ఆత్మబోధకులు లేనందుచేత, అనాత్మ బోధకులగు, అజ్ఞానుల బోధవలన లోకము ఇట్టి హీనస్థితికి వచ్చినది. మల ఆత్మబోధకుల వలన ఉత్తమ స్థితి నొందగలదు.

**గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్ ।**
**ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్ ॥**

గతిః = కర్మఫలమును, భర్తా = పోషకుడును, ప్రభుః = స్వామియును, (నియామకుడును) సాక్షీ = (ప్రాణికోట్ల యింద్రియవ్యాపారములకు) సాక్షియును, నివాసః = ప్రాణులకు నివాసస్థలంబును, శరణం = ఆశ్రయింపదగినవాడును, (శరణు పొందిన వారి దుఃఖములను పోగొట్టు వాడును) సుహృత్ = మిత్రుడును, (ప్రతిప్రయోజనము నపేక్షింపక ఉపకారము చేయువాడును) ప్రభవః - స్థానం - ప్రళయః = సృష్టిస్థితిలయకర్తయు, నిధానం = (కాలాంతరమందుపయోగించెడి వస్తువు గనుక) నిక్షేపమును,

అవ్యయం బీజం = నాశములేని విత్తనమును, అహమేవ + అస్మి = నేనే అయియున్నాను. ఈ శ్లోకములోను బీజస్వరూపుడు సర్వేశ్వరుడని ఉపదేశిం చుట లేదా?

**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత! ।**
**క్షేత్ర క్షేత్రజ్ఞ యోర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥**

హే భారత = ఓ యర్జునా! సర్వక్షేత్రేషు చాపి = సమస్త శరీరము లందును, మాం = నన్నే, క్షేత్రజ్ఞం = క్షేత్రజ్ఞునిగా (శరీరేంద్రియములకు సాక్షిగా నుండు ఆత్మనుగా), విద్ధి = తెలుసుకొనుము, క్షేత్రక్షేత్రజ్ఞయోః = శరీరముయొక్కయు ఆత్మయొక్కయు, యత్ జ్ఞానం = జ్ఞానమును (తెలుసు కొనుట యనునది ఏది గలదో), తత్ = అది, జ్ఞానమితి =యథార్థమైన జ్ఞాన మని, మమ = నా యొక్క, మతం = నిశ్చయము.

ఈ దేహేంద్రియములు ఆత్మ నివసించుటకు క్షేత్రములవంటి వనియు, నీ దేహత్రయమునకు సాక్షిగానుండి క్షేత్రముయొక్క స్వభావమును తెలుసుకొనుచుండు ఆత్మయే ఈశ్వరస్వరూప మనియు నెఱుంగుము. ఇదే యథార్థమైన జ్ఞానమగును.

**సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్ ।**
**వినశ్యత్స్వవినశ్యన్తం యః పశ్యతి స పశ్యతి ॥**

సర్వేషు భూతేషు = (బ్రహ్మాది స్తంబపర్యంతములైన) సమస్త ప్రాణుల యందును, సమం = సమముగా, తిష్ఠంతం = ఉండునట్టి, పరమేశ్వరం = దేహేంద్రియ మనోబుద్ధ్యవ్యక్తములకంటె విలక్షణుడుగను, సర్వనియంతగ నుండు పరమేశ్వరుని, వినశ్యత్సు = పైన జెప్పబడిన సమస్త భూతములును, (వాని గుణములును) నశించుచున్నను, అవినశ్యన్తం = నశింపనివానిగా, యః = ఎవ్వడు, పశ్యతి = చూచుచున్నాడో, (తెలుసుకొనుచున్నాడో), సః = వాడు, పశ్యతి = (నిజమును) తెలిసినవాడగుచున్నాడు.

ఓ యర్జునా! చరాచరములుగా ఈ కనుపించు ప్రాణికోట్లన్నిటిలోను ఆత్మచైతన్యముగా వెలుగుచుండు వస్తువును బ్రహ్మముగా తెలుసుకొనుము. ఈ కనుపించెడు దేహేంద్రియాది జగత్తంతయు నశించినను, ఆ దైవవస్తువు నశించునది కాదని యెవడు కనుగొనియున్నాడో వాడే కన్నులుగలవాడు. తక్కిన వారలు ఈ దృశ్యములను జూచు నేత్రము లుండినను, జ్ఞానదృష్టి లేనివారని గ్రహింపుము.

**సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్ ।**
**న హినస్త్యాత్మనాఽఽత్మానం తతో యాతి పరాం గతిమ్ ॥**

సర్వత్ర = సమస్తప్రాణులయందును, సమం = సమముగా, సమవస్థితం = ఒకే ప్రకారముగా నుండునట్టి, ఈశ్వరం = ఈశ్వరుని, పశ్యన్= జ్ఞానదృష్టిచే చూచినవాడు, ఆత్మనా = తనచేత, ఆత్మానం = తనను, న హినస్తి = హింసించు కొనడు, తతః = దానివలన, పరాం గతిం = సర్వోత్కృష్టగతిని (మోక్షమును), యాతి హి = పొందుచున్నాడు గదా?

ఓ యర్జునా! సర్వప్రాణికోట్లయందు ఒకేవిధముగా వెలుగుచుండు ఆత్మను పరమాత్మభావముతో చూడనివారలు తమ్ము తామే చంపుకొన్న వారలగుచున్నారు. ఆత్మలో పరమాత్మభావము గల్గి యుండువారలు తమ యాత్మను, తామే ఉద్ధరించుకొనుచున్నారు. అనగా రక్షించుకొనుచున్నారు. అందువల్ల వారు భగవత్సాయుజ్యమును పొందుచున్నారు. ఓహో! సాక్షాద్భగవంతు డీలాగున పరమదయతో ఉపదేశించియు, నిప్పుడు బీజాంకుర న్యాయముచెప్పి గుణకర్మములను చూడక దేహమున కేబీజాంకుర న్యాయము కల్పించెడివారి జ్ఞానమెటువంటిదో, వారెట్టి గతిని పొందగలరో చదువరులే యోచింపగలరు. ఇక ఈలాటి పరమతత్త్వమును బోధించిన శ్లోకము లెన్నియో గలవు. విస్తారమగునవి తలంచి సంగ్రహముగ చెప్పడమయినది. అయితే యింత చదువుకొన్న వారలకు ఈ జ్ఞానము ఏల కలుగకపోయెనని చాలా మందికి సందేహము గలగవచ్చును. దానికి కారణము శ్రీ భగవంతుడే తెలుపు

చున్నాడు.

**త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదం జగత్ ।**
**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥**

త్రిభిః=(సత్త్వరజస్తమస్సులనెడి) మూడు విధములైన; గుణమయైః = గుణవికారములుగల, ఏభిః భావైః = ఈ గుణత్రయ వస్తువులచేత, సర్వం ఇదం జగత్ = సమస్తమైన యీ ప్రపంచము, మోహితం (సత్) = అజ్ఞానమనెడు మోహముతో గూడినదై, ఏభ్యః = ఈ త్రిగుణములకంటె; పరం = విలక్షణునిగను; అవ్యయం = నాశరహితునిగను నున్న, మాం = నన్ను; నాభిజానాతి = ఎఱుంగజాలదు.

త్రిగుణములచేత సమ్మోహితము లైనందుచేత నీ ప్రాణికోట్లన్నియు గుణములకు విలక్షణముగా నుండు ఆత్మను పరమాత్మస్వరూపముగా తెలుసుకొనజాలక యున్నవి. త్రిగుణరహితులైన పుణ్యపురుషు లందరిలోను వెల్గుచుండు పరబ్రహ్మస్వరూపమగు పరమాత్మను చూడగలుగుదురు. నేత్ర వ్యాధి గలవాడు వస్తుతత్త్వము నేలాగున తెలయజాలడో ఆలాగున గుణత్రయ సంకల్పిత కల్మషసహితులైన వారికి పరతత్త్వమగు పరమాత్మ తనలో ఉన్నప్ప టికిన్ని గనుపింపదు. కనుకనే యీలాగున భగవంతుడుపదేశించినది.

**అజ్ఞానేనావృతం జ్ఞానం తేనముహ్యన్తి జంతవః ।**
**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**

అజ్ఞానేన =వివేకజ్ఞానము లేనందుచేత, (మాయచేత) జ్ఞానం = ఆత్మానాత్మ వివేకజ్ఞానము; ఆవృతం = మూయబడియున్నది, తేన = అందుచేత, జన్తవః = ప్రాణికోట్లు; ముహ్యన్తి = మోహమును జెందుచున్నవి, ఆత్మనః జ్ఞానేన తు = ఆత్మజ్ఞానముచే, యేషాం = ఎవ్వరియొక్క, తత్ అజ్ఞానమ్ = ఆయజ్ఞానము, నాశితం = నాశమును బొందింపబడినదో; తేషాం

జ్ఞానం=వారి యాత్మజ్ఞానము, ఆదిత్యవత్ = సూర్యప్రకాశమువలె, తత్పరం = ఆ బ్రహ్మస్వరూపమును, ప్రకాశయతి = ప్రకాశింపజేయును.

ఏ యజ్ఞానముచేత ప్రాణులు మోహమును బొందుచున్నారో, అట్టి యజ్ఞానము ఏ ప్రాణులకు వివేకజ్ఞానముచేత నాశమును బొందునో, అట్టి ప్రాణులయొక్క జ్ఞానము సూర్యుడు సమస్త పదార్థములను ప్రకాశింపజేయునట్లు సమస్త ప్రాణులలో వెల్గుచుండు పరబ్రహ్మస్వరూపమును కనుగొనజేయును. సూర్యోదయము లేనప్పుడేలాగున వస్తువులయొక్క జ్ఞానము జనులకు గలుగదో, సూర్యోదయమయిన వెంటనే అన్ని వస్తువులెట్లు కనపడునో, ఆలాగున, అజ్ఞానావస్థ కారుచీకటివంటి రాత్రియనియు జ్ఞానోదయ స్థితి చక్కగ సూర్యప్రకాశము గల పగలువంటిదనియు గ్రహించవలయును. ఇక నీ విషయమై అపరోక్షానుభూతియందు ఉపదేశించిన తత్త్వమును జూడుడు.

**దోషోఽపి విహితః శ్రుత్యా మృత్యోర్మృత్యుం స గచ్ఛతి ।**
**ఇహ పశ్యతి నానాత్వం మాయయా వంచితో నరః ॥**

మాయచే వంచింపబడినవాడు ఇచట నానాత్వమును జూచుచున్నాడు. వాడు మృత్యువునుండి మృత్యువును బొందుచున్నాడు అనెడి శ్రుతిచేత భేద దృష్టియొక్క దోషము వినబడుచున్నది.

ఎవడు జీవేశ్వరులను భిన్నరూపములనుగా చూచుచున్నాడో, వాడు జననమరణ చక్రములో తిరుగుచుండునే గాని, బంధవిముక్తి పరమగు ఆత్మ విశ్రాంతిని పొందజాలడు.

**బ్రహ్మణః సర్వభూతాని జాయన్తే పరమాత్మనః ।**
**తస్మాదేతాని బ్రహ్మైవ భవన్తీత్యవధారయేత్ ॥**

బ్రహ్మము (అపరిచ్ఛిన్నము) అయినట్టి పరమాత్మనుండి సకల భూతములును గలిగినవి. కావున ఇవి బ్రహ్మమే యగుచున్నవని నిశ్చయింపవలసినది. అదెట్లనగా?

**సువర్ణాజ్జాయమానస్య సువర్ణత్వం చ శాశ్వతమ్ ।**
**బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వం చ తథా భవేత్ ॥**

స్వర్ణమునుండి కలిగినదానికి స్వర్ణత్వము శాశ్వత మగునట్లు బ్రహ్మము నుండి గలిగినదానికి బ్రహ్మత్వము శాశ్వత మగును. అనగా ఒకే బంగారు నుండి గలిగిన ఆభరణములున్ను, అనేకరకములగు విగ్రహములున్ను, వివిధములుగా నుండినను, అవియన్నియు నేలాగున ఒకే బంగారుమయమై యుండునో, ఆలాగున పరమేశ్వరునుండి గల్గిన ప్రాణికోట్లన్నియు సర్వేశ్వర మయములై యున్నవి.

**స్వల్పమప్యన్తరం కృత్వా జీవాత్మపరమాత్మనోః ।**
**యః సంతిష్ఠతి మూఢాత్మా భయం తస్యాభిభాషితమ్ ॥**

ఏ మూఢుడు, జీవాత్మపరమాత్మలకు కొంచెమైనను భేదమును కల్పించుచున్నాడో, వానికి భయము చెప్పబడియున్నది. అనగా ఆత్మబుద్ధిని విడిచిపెట్టి బీజాంకురన్యాయమును దేహమునకు చెప్పువాడు జననమరణ దుఃఖమనెడు సంసారభయమునుండి తప్పించుకొనజాలడు.

**సర్పత్వేన యథా రజ్జూ రజతత్వేన శుక్తికా ।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥**

రజ్జువు (దారము) సర్పముగను, శుక్తి (ముత్తెపుచిప్ప) వెండిగను, నిర్ణయింపబడినట్లు, ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది.

**కనకం కుండలత్వేన తరంగత్వేన వై జలమ్ ।**
**వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాఽఽత్మతా ॥**

కనకము కుండలముగను, జలము అలలవలెను నిశ్చయింపబడు నట్లు ఆత్మ దేహముగా మూఢునిచే నిశ్చయింపబడుచున్నది.

సత్యాన్వేషులగు సోదరీ సోదరులారా! ఇప్పుడపరోక్షానుభూతిలో చెప్ప బడిన విషయము శ్రీశంకర భగవత్పాదాచార్యులు బోధించినది. సత్యము

ఈలాగున నుండుగా మీరేల సందేహపడెదరు? అయితే, యే జ్ఞానముచేత, నిజతత్త్వము తెలుసుకొనగల్గునో అద్దానిని క్రింది శ్లోకము చెప్పుచున్నది.

**దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్ ।**
**విద్వాన్ నిత్య సుఖే తిష్ఠేత్ ధియా చిద్రసపూర్ణయా ॥**

దృశ్యమును, అదృశ్యముగా భావించి బ్రహ్మాకారముగా (అపరిచ్ఛిన్నముగా) చింతింపవలయును. అందువలన విద్వాంసుడు జ్ఞానరసపూర్ణమైన బుద్ధితో, నిత్యసుఖము నందుండువాడగును. అనగా దృక్కైన ఆత్మయందు దృశ్యమును ఐక్యపరుపవలయును. అప్పుడు నీటిలో గలిపిన ఉప్పు, నీరుగా మారునట్లు చిన్మయానందరసైక పరిపూర్ణ పరబ్రహ్మబోధము మాత్రము మిగిలియుండు నవస్థ గల్గును. మఱియు నీ విషయమై ఆత్మబోధము ఉపదేశించినది జూడుడు.

**నానోపాధివశాదేవ జాతినామాశ్రమాదయః ।**
**ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాదిభేదవత్ ॥**

నానోపాధివశాదేవ = ఆత్మకు ఆవరణభూతములైన పలుదెఱగులైన శరీరములవలననే, తోయే = ఉదకమందు, రసవర్ణాదిభేదవత్, రస = రుచియు, వర్ణ = రంగును, ఆది = మొదలుగాగల (తీపి, పులుపు, చేదు, వగరు మొదలైన రుచులున్ను, ఎరుపు, నలుపు, పసుపు మొదలైన రంగులున్ను), భేదవత్ = భేదములవలెను, ఆత్మని = ఆత్మయందు, జాతినామాశ్రమాదయః - జాతి = కులము, నామ = పేరు, ఆశ్రమ = బ్రహ్మచర్యము మొదలైన ఆశ్రమములు, ఆదయః = మొదలుగాగలవి, ఆరోపితాః = కల్పింపబడినవి.

స్వభావముచేతనే మధురమై, స్వచ్ఛమై యుండు జలమునందు చేదు, పులుపు, తీపు, ఎఱుపు, పసుపు మొదలైన గుణములుగల పదార్థములయొక్క సంబంధములచేత ఆయా పదార్థములయొక్క రుచియును, రూపమును, ఏలాగున ఆరోపింపబడుచున్నవో, ఆలాగే ముందుచెప్పబడిన నానావిధము

లైన శరీరములవలన, పరిశుద్ధమైన ఆత్మయందు, బ్రాహ్మణత్వాది జాతులును, దేవదత్త యజ్ఞదత్తాది పేర్లున్ను, బ్రహ్మచర్యాద్యాశ్రమములున్ను, మఱియు విలోమాదిజాతులును, ఇవియన్నియు నవివేకముచే కల్పింపబడినవి గాని వాస్తవములు కావు.

**వపుస్తుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యవఘాతతః ।**
**ఆత్మానమాంతరం శుద్ధం వివిచ్యాత్తండులం యథా ॥**

కోశైః = అన్నమయ ప్రాణమయాది కోశములతో, యుక్తం = కూడుకొన్నవాడును, వపుః = దేహమువలెనే తోచువాడును, ఆంతరం = శరీరాంతర్గతుడైనవాడు, (అనగా శరీరమందు వ్యాపించియుండువాడగుట) శుద్ధం = నిర్మలుడైన, ఆత్మానం = సత్యజ్ఞానానంద స్వరూపుని, తుషాదిభిః = పొట్టు, తవుడు మొదలైన వానితో, యుక్తం = కూడుకొన్నటువంటి, తండులం = బియ్యమును, యధా = ఏ తీరుననో, (తధా = ఆ తీరుననే), యుక్త్యవఘాతతః, యుక్తి = శ్రవణమనన నిదిధ్యాసనములగు ధ్యానముచేతను, "నేతి నేతీతి" వాక్యములకు సాంఖ్యయోగపరమగు జ్ఞానముచేతను, అవఘాతతః = దంచుటవల్ల చర్చించి శోధించుటవల్ల, వివిచ్యాత్ = వేఱుపరచి తెలిసికొనవలసినది.

లోకములో జనులు ధాన్యముగా తోచెడి బియ్యమును, వడ్లనుండి పొందుటకై దంచడముచేత పొట్టు, తవుడు మొదలైన వానిని వేఱుపరచి, తెలిసికొనెడి ప్రకారముగానే, పంచకోశముల వలెనే తోచు ఆత్మను శ్రవణమనన నిదిధ్యాసనములచేతను, సాంఖ్యవిచారణచేతను శోధించి యీ సమస్త నామరూపాత్మకమైన ఉపాధులు అసత్యమును, మిథ్యయును నైనందున, వీనికంటె విలక్షణుడై, సత్యజ్ఞానానందస్వరూపుడై, పుణ్యాపాపరహితుడై యుండు ఆత్మ తన స్వరూపమని తెలుసుకొనవలసిన దనుట.

**ప్రకాశోఽర్కస్య తోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా ।**
**స్వభావస్సచ్చిదానంద నిత్యనిర్మలతాఽత్మనః ॥**

సూర్యునికి ప్రకాశమును, నీళ్ళకు చల్లదనమును, అగ్నికి ఉష్ణత్వమును, స్వతస్సిద్ధమైన స్వరూపమైనట్లు ఆత్మకును సచ్చిదానంద నిత్యనిర్మలతాదులే స్వరూపమని ముముక్షువు తెలిసికొనవలసిన దనుట. వీని కన్యమై కనుపించిన వన్నియు కల్పితములని దృఢముగ నమ్మవలయును.

**నిత్యశుద్ధ విముక్తైక మఖండానందమద్వయమ్ ।**
**సత్యం జ్ఞానమనంతం యత్పరం బ్రహ్మాహమేవ తత్ ॥**

నిత్యమై, కామక్రోధాది రహితమై, సర్వసంబంధశూన్యమై, అఖండమై, భేదరహితమై, సుఖస్వరూపమై, అద్వితీయమై, నిష్ప్రపంచస్వరూపమై, సత్యమై, చరాచరాదులయందు వ్యాపించియుండు స్వరూపమై, సర్వసమమై, శుద్ధమై, ద్వంద్వరహితమై, నిష్క్రియాస్వరూపమై, సంకల్పవికల్ప వర్జితమై, నిర్వికారమై యుండు సచ్చిదానందాత్మయే తన స్వరూపమని మననము చేయవలసిన దనుట.

**ఏవం నిరంతరం కృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥**

సర్వోత్తమమైన యౌషధమును సేవించుటవల్ల రోగములు నశించు నట్లు ఎల్లప్పుడును నేను బ్రహ్మస్వరూపమగు ఆత్మయే కాని బ్రహ్మస్వరూప మున కన్యము గానని నిరంతరము అభ్యాసము చేయుటవల్ల గల్గిన సంస్కార రూపమైన సద్వాసన ఆవరణవిక్షేప శక్త్యాత్మకమైన అవిద్యను బొత్తిగా పోగొట్టు నని దృఢముగా నమ్మవలయు ననుట.

**ఏవమాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే ।**
**ఉదితాఽవగతిర్జ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥**

ఏవం = ఈపైన జెప్పిన ప్రకారముగా, ఆత్మారణౌ, ఆత్మ = అంతఃకరణమనెడి, అరణౌ = కొయ్యయందు, ధ్యానమథనే, ధ్యాన = ధ్యాన మనెడి; మథనే = చిలకడము; సతతం = ఎల్లప్పుడును; కృతే (సతి) =

చేయబడుచుండగా, ఉదితా = ఉదయించిన; అవగతిజ్వాలా, అవగతి = జ్ఞానమనెడి, జ్వాలా = తేజస్సు; సర్వాజ్ఞానేంధనం - సర్వ = సమస్తమైన, అజ్ఞాన = మూలాజ్ఞాన మనెడు; ఇంధనం = కట్టెలను; దహేత్ = బొత్తిగా కాల్చి నశింపజేయును.

లోకమందు యజ్ఞముకొరకు, కొయ్యమీద కొయ్యను ఉంచి తరచిన మాత్రముచేత, అగ్నిహోత్రము పుట్టి ఆ కొయ్యలను దహించునట్లు, అంతః కరణమందు మనస్సునుంచి ప్రణవానుసంధానపరమగు పరబ్రహ్మధ్యానము చేత దృఢముగ భావించినచో, జ్ఞానాగ్ని గలిగి మూలాజ్ఞానమును బొత్తిగా నశింపజేసి సర్వపరిపూర్ణుని చేయుచున్న దనుట.

**జీవన్ముక్తిస్తు తద్విద్యాత్పూర్వోపాధి గుణాంస్త్యజేత్ ।**
**స సచ్చిదాది ధర్మత్వాద్భజే భ్రమరకీటవత్ ॥**

లోకమునందు పురుగును, తుమ్మెద తీసుకొనివచ్చి చేయవలసిన ప్రకారముగా చేసినమాత్రముచేతనే ఈ పురుగు తన్ను చంపుచున్నదను భయముగలదై తన తలంపును చలించకుండా దానియందుంచిన మాత్రము చేత తనయందు పూర్వమున్న పురుగుయొక్క ధర్మమును వదలి భ్రమరస్వ రూపమును పొందినట్లు మీద జెప్పిన శ్రవణాదులచేత ఆత్మను విచారింపగా జీవధర్మమును వదలి సచ్చిదానందరూపమైన బ్రహ్మస్వరూపమును బొంది వృత్తిరహితుడై యుండడమే జీవన్ముక్తి యని ముముక్షువు తెలుసుకోవలసిన దనుట.

**సర్వగం సచ్చిదాత్మానం జ్ఞానచక్షుర్నిరీక్షతే ।**
**అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వంతం భానుమంధవత్ ॥**

లోకమందు సర్వత్ర ప్రకాశించుచుండు సూర్యుని గ్రుడ్డివాడు తప్ప అందఱును చూచినట్లు సచ్చిదానందాత్మ సర్వత్ర వ్యాపించి యున్నప్పటికి శ్రవణాదులవల్ల విచారించి తెలుసుకొన్న ధ్యాననిష్ఠగల ఆత్మజ్ఞానియే ఆ యాత్మను తన్నుగా జూచుచున్నాడు గాని దేహేంద్రియాదులను ఆత్మగా

భ్రమించిన అజ్ఞాని చూడ నేరనందున అందరికిని ఆ యాత్మ అగపడ దనుట.

**శ్రవణాదిభిరుద్దీప్తజ్ఞానాగ్ని పరితాపితః ।**
**జీవస్సర్వమలాన్ముక్తస్స్వర్ణవద్ద్యోతతే స్వయమ్ ॥**

లోకమందు బంగారున రాగి, ఇత్తడి మొదలైన మలినలోహములు గలిసియుండిన, వాటికి చేయవలసిన పుటాది సంస్కారములచేత, వాటి యందుండు మాలిన్యము నివర్తింపబడి బంగారు తనకు తానే ప్రకాశించు చున్నట్లు జీవుడును, శ్రవణ మనన నిదిధ్యాసన ధ్యానయోగాదుల యభ్యాసమువల్ల వాడుకపడి, సంసారహేతుభూతమైన, మూలాజ్ఞానమువల్ల నివర్తింపబడిన వాడై, తనకు తానే ప్రకాశించుచున్నా డనుట.

దివ్యాత్మస్వరూపులారా! ఇంతవఱకు చెప్పిన విషయములచేత బీజాంకుర న్యాయముయొక్క యధార్థతత్త్వమును, పరిశోధించిన మీరు ఈశ్వరాంశ స్వరూపులని స్పష్టపడును కదా? అప్పుడు మాత్రమే మీకు పామరజనుల కల్పితవచనములచే గలిగిన మూఢవిశ్వాసము వదలిపోయి నిర్మలజీవితము గడుపుటకు శక్తిగలిగి నిత్యసుఖ స్వరూపులు గాగలుగుదురు. సత్యమై ప్రత్యక్షముగా, తన కన్నులార చూచిన వస్తువుగూడ అనేకజనుల మాటలచే భ్రమ గలుగచేసెడు ఒక కథ విచార సాగరాది గ్రంధములలో వ్రాయబడియున్నది. అది యెద్దియన,

మాళవ దేశమున ఒక రాజు ఒక గొప్ప యాగము చేయదలంచెను. ఆ యాగము నిర్విఘ్నముగ పూర్తియైన, ఇంద్రునికి ప్రీతిగల్గి ఆ రాజునకు సార్వభౌముడను పేరుగల రాష్ట్రాధిపత్యము గల్గును. ఇందుకు, తెలుపు రోమము తప్ప, నలుపు, ఎరుపు మొదలైన యే రోమములు లేని పశువు గావలసియుండును. ఈ విషయమై రాజు తగిన జనులకు ధనమిచ్చి వెదుకబంపెను. అట్లు వెదుకు వారికి కాశ్మీరదేశములో అటువంటి పశువు దొరికెను. దాని వారికి కావలసినంత ధనమిచ్చి కొందరు బ్రాహ్మణులున్ను, పరిచారక జనులున్ను పుణ్యాహవాచనాది స్వస్తివాక్యముల నుచ్చరించుచు

తీసుకొని వచ్చుచుండిరి. ఈ వార్త కళింగదేశపురాజు వినెను.

అతడు తన మంత్రులతో నీలాగున సమాలోచన చేసుకొనెను. "మాలవదేశపు రాజు చేయదలంచిన యజ్ఞము పూర్తియైనచో, ఇంద్రుని యను గ్రహమువల్ల ఈ భరతఖండమంతయు జయించి సార్వభౌమపదవిని సంపాదించగల్గును. అప్పుడు మనమందర మతనికి లోబడిపోవలసివచ్చును. సర్వ రోమములు తెల్లగానుండు పశువు దొరకుట దుస్తరము. కనుక మాళవదేశపు రాజుయొక్క జనులు, కాశ్మీరమునుండి తెచ్చెడు పశువును మీరు తెచ్చినచో మనమట్టి యాగమును చేసి యింద్రుని కరుణకు పాత్రులమై సార్వభౌమ పదవిని సంపాదించుకొనవచ్చును. అయితే యజ్ఞముకొఱకు, పశువు అపహరింపబడినదిగాని, దొంగిలింపబడినదిగాని తగదు. పశువు గలవానికి, ప్రీతిగ లంత ధనమివ్వనిచో నుపయోగపడదు. ఇట్టి విషయముగూడ యోచింపవలెను" అని చెప్పిన మాటలను విని మంత్రులందరు మహారాజా! మీ రీవిషయమై విచారింప నక్కరలేదు. పశువును వారి నిష్టపరచి, మనకిచ్చేలాగున తీసుకొని వచ్చెదము. మంచిబుద్ధిశాలిత్వము గలవారును, చక్కగా మాట్లాడుటకు సామర్థ్యము గలవారును, యోగ్యులగు నూరుమంది జనులను వారికి భోజనకార్యములకు తగిన ధనమున్ను ఇచ్చిన చాలును.

రాజు వెంటనే తగిన యేర్పాటు చేసి పంపివేసెను. వీరు మాళవదేశపు రాజుయొక్క జనులు తెచ్చెడు పశువుయొక్క మార్గమున నాల్గుమైళ్లు చొప్పున పాడవుగా అచ్చుటచ్చుట నిలబడియుండిరి. చెప్పవలసిన మాటలన్నియు దానికి ముందుగా వారు మాట్లాడుకొనియున్నారు. మాళవదేశీయులు పుణ్యతీర్థములచే ప్రోక్షించి కర్మకాండములకు సంబంధించిన వేదమంత్రముల నుచ్చరించుచుతెచ్చునది చూడగా, కళింగదేశజనుల మొదటి జట్టువారు బాటసారులవలె, పశువువెంటనున్న జనులతో కలసుకొని, చాలాకార్యముల గురించి మాట్లాడుచు అయితే "మీరు బ్రాహ్మణులే; త్రోవ పొడుగునా పుణ్యతీర్థములచే ప్రోక్షణ చేయుచున్నారు. వేదమంత్రములను పఠించుచున్నారు. ఈ

కుక్కను ఎక్కడికి పట్టుకొని పోవుచున్నా”రని అడిగిరి. దానికి మాళవ దేశజనులు “ఏమిది కుక్కయా? మీకు కండ్లు తెలియదా? ఇది యజ్ఞపశువు గదా?” అని చెప్పిరి. కళింగజనులు “మేము చూచిన దానిని చెప్పితిమి, మీయిష్టమేలాగో, అట్లుపొండి?”అని చెప్పి ఎచ్చటికో పోవునట్లు మఱియొక్క మార్గములో వెళ్ళిపోయిరి.

మఱికొంత దూరము వచ్చునప్పటికి నింకొక జట్టువారు పశువు వెంటనున్న జనులతో కలసి, “యిదియేమండి మీరు బ్రాహ్మణులు కారా? కుక్కను పట్టుకొని వేదమంత్రము లుచ్చరించుచున్నారు. ఏమి మీకు పిచ్చి పట్టినదా?” అని వీరి మనస్సు చలించేలాగున తగిన మాటలు చెప్పి, వీరితో కలసి కొంత దూరమువచ్చి వారు మరియొక దారిపట్టి వెళ్లిరి. అప్పుడు పశువు గల జనులకు కొంచెము సందేహము గలిగెను.

మరికొంత దూరము వచ్చునప్పటికి మఱియొక జట్టు జనము పశువు వెంటనున్న జనులతో గూడి చాల హాస్యరకపు మాటలను చెప్పి, వారి మనస్సునకు సంశయము కలిగేలాగున నటించి, “కుక్కను పట్టుకొని బ్రాహ్మణులు వేదమంత్రము లుచ్చరించుచు నడచుట యెప్పుడును చూచియుండలేదు. ఇది హీనజాతులు పట్టుకొని పోవలసిన జంతువే. ఏమి మీకు మతిచెడి పోయినదా?”అని మిత్రులతో కలసి మాట్లాడుచు చాలాదూరము వచ్చి యింకొక మార్గముగా వారిఊరికి వెళ్లుచున్నామని చెప్పివెళ్లిపోయిరి. అప్పటికి పశుపాలకులకు నిస్సంశయముగా దీనియందేదో పొరబాటు గల్గియుండును. లేకుండిన త్రోవపొడుగున నిట్టి గొప్ప జనులందరునిట్లు చెప్పుట కవకాశము లేదని తలంచిరి. అప్పుడొకడు దాని తోకను, ఇంకొకరు ముఖమును, ఇంకొకరు కాలిని చూచినప్పటికిన్ని యేమి పశువుగానే యున్నది అని కొంచెము బుద్ధిని నిర్మలము చేసుకొని యథాప్రకారము తీసుకొని వెళ్లుచుండిరి.

మరికొంత దూరము పోవునప్పటికి నింకొక సంఘము పశురక్షకులను చూచి చాలా ఆశ్చర్యము గలిగేలాగున మాటలుచెప్పి పశురక్షకులగు బ్రాహ్మ

ణులను నిందించేలాగున చెప్పి "మీరేదేశీయులు? భ్రష్టులైతిరి. పిచ్చికుక్కను పట్టుకొని వేదమంత్రము లుచ్చరించుచున్నారే"అని మొదట దూషించిన వారి వలె చెప్పి మఱల చాలా ప్రేమగలవారివలె నటించి వృత్తాంతము లన్నిటిని అడిగిరి. అప్పుడు వారు యజ్ఞార్థముగా మాళవదేశరాజాజ్ఞరీతిగా నీ పశువును తీసుకొనిపోవుచున్నామని చెప్పిరి. అప్పుడు కళింగదేశీయులు "ఈ పిచ్చి కుక్కను ఏ దేశమున కొన్నారని" అడిగిరి. కాశ్మీరదేశమున కొంటిమని జవాబు చెప్పిరి. అప్పుడు కళింగదేశీయులు ఒకరొకరు మాట్లాడుకొని నవ్వుకొనుచు "అయ్యో! ఇది పిచ్చికుక్క, కాశ్మీరదేశీయులు చాల మంత్రవేత్తలు. అంతేగాక యింద్రజాలములో చాల నిపుణులు. మిమ్ములను మీరాజుగారిని అవమాన పఱచుటకొఱకు ఇట్టి తంత్రము చేసిరి. మీ రాజుగారి దగ్గరకు దీనిని తీసు కొనిపోయినచో మీకు కలిగెడు కష్టము చెప్పవీలులేదు. కనుక వెంటనే దీనిని విడిచిపెట్టి తగిన పశువు దొరకలేదని చెప్పుట మంచిది." అనిచెప్పి వీరికి చాల సహాయము చేసిన వారివలె మాట్లాడి మేము మా ఊరికి వెళ్లుచున్నామని చెప్పి మఱియొక దారిన వెళ్ళిరి.

అప్పుడు పశుసంరక్షకు లందరు అది కుక్కయని తీర్మానము చేసికొనిరి. అయితే దానిలో కొందరు ఇంకను కొంతదూరము తీసుకొని వెళ్లుదము. అచ్చట జనులు ఏమి చెప్పుదురో చూచెదము అని తలంచి పట్టుకొని పోవునప్పుడు మఱికొంత దూరముపోగా ఇంకొక సంఘము చేరి యింతవఱకు చెప్పినవారికంటే ఎక్కువ పరిహసించుటయు, పిచ్చికుక్కయని స్థిరముగ చెప్పుటయు, దీనిని విడిచిన కరచుననియు నమ్మకముతో చెప్పిరి. ఈలాగు ననే మఱికొంత దూరము పోయినప్పుడు అచ్చటను, ఇక కొంతదూరము పోవునప్పుడు అచ్చటను జనసంఘములు చెప్పుటకు ప్రారంభించినవి. అప్పుడు మాళవదేశజనులు సత్యముగా నమ్మి రాజుగారి దగ్గరకు దీనిని తీసుకొనిపోయిన అవమానపడెదమని తలంచి ఆ సుందరమగు తెల్లని పశు వును ఒక చెట్టుకు కట్టివేసి పారిపోయిరి.

చూచితిరా! యీలాగుననే మీరు నిత్యశుద్ధ స్వయంప్రకాశజ్ఞానైక స్వరూపులై యుండియు, అనాత్మవాదులై కల్పితములైన శాస్త్రములు చదివిన వారిమాటలను వినియు, అకల్పితమైన ఆత్మను మఱచియు కల్పితములైన దేహాదులను నమ్మియు, బహుకాలమునుండి, దేహాత్మబుద్ధి గల మనుజుల మాటలనే వినుచుండుటచేతను, కర్మకాండల వలలో చిక్కుకొనుట చేతను, స్వబోధమును మఱచిపోతిరి. ఆత్మబోధము మఱచి, అనాత్మబోధము గల్గిన స్థితిని గురించిన వేదాంతశాస్త్రములో నిట్టి యుద్బోధము గలదు.

కనుక దైవాత్మస్వరూపులారా! మీరు బీజాంకురన్యాయముయొక్క యథార్థస్థితిని దెలుసుకొని ఆత్మోన్నతిని గలుగజేసుకొనుడు. మీరు నిర్మల గుణము కలవారలై పరిశుద్ధ ఆచరణ గలవార లైతిరేని, దైవికములైన సమస్త కార్యములలోను ప్రవేశించవచ్చును. ఏలాటి సందేహము లేదు. ఒకరిలో గల గుణములను చూడక కులమును మాత్రము చూచి వారి యధికారమును నిర్ణ యించువారు తప్పక వారికి విషమిచ్చినవారే యగుదురు. ఒకరి కులమును చూడక, వారి గుణములను చూచి వారి అర్హతను నిర్ధారణ చేయువారు వారికి అమృతము నిచ్చిన వారలగుదురు. దీనివల్ల వర్ణాశ్రమములను విడిచి పెట్టవలయునని చెప్పుట లేదు. అది లోకహితముగా కావలసిన వారుంచుకొన వచ్చును. దీనివల్ల జనుల ఆత్మోన్నతికి అడ్డుమాత్రము గలుగకూడదు. అంతే చాలును.

మనస్సుయొక్క శక్తియు, వేగమున్ను అచింత్యము, దేహేంద్రియ ములకే, కులవర్ణములకే సత్యత్వ మిచ్చినదని తలంచి మీరు వర్తించిన ఆ దేహాత్మబుద్ధి మిమ్ముల అతల వితల పాతాళములకంటె ఆవల కణగద్రొక్కి జడులుగానో, దయ్యములుగానో అయ్యేలాగున చేయును దేహేంద్రియ కుల కర్మములు కల్పితము లనియు, మీరే దేహేంద్రియములకు సాక్షి యనియు, శుద్ధబుద్ధ స్వయంప్రకాశ దైవాత్మజ్ఞాన స్వరూపులనియు తెలుసుకొనుటకు ప్రయత్నింతురేని అట్టి మనస్సే మిమ్ములను భూర్భువాది సత్యలోకముల

కావల తీసుకొనిపోయి చైతన్యస్వరూపముగాను, బోధైకజ్ఞానస్వరూపముగాను, దైవస్వరూపముగాను మార్చివేయును. మనస్సు అనెడు వాహనము అచింత్య వేగముతో ఊర్ధ్వాధోముఖముగా తిరుగుచుండు ఒక గొప్ప యంత్రము.

కావున పుణ్యాత్ములారా! అజ్ఞానులగు కేవలబద్ధులగు జనుల మాటలను విని మీరు చెడిపోకుడు. విజ్ఞానులగు ఆత్మజ్ఞానుల పవిత్రవచనములను విని మిమ్ములను మీరే ఉద్ధరించుకొనుడు. మన హిందూదేశపాఠశాలలో నిటువంటి ఆత్మబోధకులగు ఉపదేష్టలు లేనందుచేతనే, యీ భారతలోకము అడుగంటి పోవుటకు కారణమైనది. ఉన్నతపాఠశాల లన్నిటిలోను నిట్టి తత్త్వబోధకులుండిన లోకమెంతో బాగుపడును. ఇట్టి తత్త్వమును జనసంఘములో బోధించి వారికి ప్రబోధము గలుగచేయుటకొఱకు నేర్పడియుండు సన్న్యాసులు, సాధువులు, యోగులు మొదలైన దివ్యపురుషులు జనసంఘమునుండి వేరుపడిపోయిరి. సాధారణ గృహస్థజను లందరున్ను, సాధువులుగ జన సంఘమునకు సత్యబోధ యొనర్చుటగూడ సాధుధర్మమునకు విరుద్ధమనియు, సాధువు లెల్లప్పుడు, ఏకాంత ప్రదేశములో ఉండవలసిన వారని చెప్పుటకు ప్రారంభించిరి. సామాన్యసాధువులున్ను అది వేదప్రమాణమని నమ్మి దానికి తగిన స్థితిలోనికి వచ్చిరి.

ఓహో! యిది యెంత అంధవిశ్వాసము, శ్రీబుద్ధదేవుడు జనులకు బోధింపలేదా! శ్రీ యేసుక్రీస్తు జనులను అజ్ఞానమునుండి తొలగించ ప్రయత్నించలేదా! శ్రీ మహమ్మదునబి, జనులను అంధకారమగు మూఢవిశ్వాసము నుండి బయలుపఱచు కృషి సలుపలేదా! ఆలాగున శ్రీశంకరాచార్యులు లోకమంతట తిరిగి జనులకు తత్త్వము బోధించలేదా? అట్లే శ్రీరామానుజాచార్యులు, శ్రీమధ్వాచార్యులు, శ్రీకృష్ణచైతన్యులు, శ్రీగురునానక్, శ్రీదయానంద సరస్వతీస్వాములు, శ్రీరాజారాం మోహనరాయ్ మొదలగు ప్రబోధకు లందరున్ను విషయమోహములో పడియుండు జనుల అభిప్రాయము మార్పు చేయుటలో యావజ్జీవితమును ప్రవర్తింపజేయలేదా? ఇప్పుడు ప్రపంచములో

గల సాధువులు విరక్తు లందరున్ను ఇట్టి సంతతిలో చేరినవారు గారా? మధ్య కాలములో భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంసలవారి దివ్యావతారముచే సాధువులు సన్న్యాసులు నిర్జనస్థలములోనుండి తమకార్యము చూచుకొనుట మాత్ర ముచితము గాదని బోధించిన వాక్యమే ఫలమై పరిణమించినట్లు వివేకానంద స్వాములు శ్రీరామతీర్థులు మొదలైనవారు కల్పితశృంఖలలను ఛేదించి బైటికి వచ్చి, జనులకు తత్త్వమును బోధించుటకు ప్రారంభించిరి. తాము తరించుటయు, ఇతరుల, తరింపజేయుటయు సన్న్యాసులకు పరమ ధర్మమని లోకమునకు బోధించిరి. ఇదియే యధార్థమగు ఋషిధర్మము.

ఇంతవరకు చెప్పినవన్నియు, బీజాంకుర న్యాయము ననుసరించి కారణరూపుడైన యీశ్వరునినుండి గల్గిన జీవకోట్లు ఈశ్వరాంశములేగాని మరియొక విధము గానేరవని చెప్పబడినది. ఇది సామాన్యోపదేశమేగాని విశేషోపదేశము గాదు. ఇది మధ్యమోపదేశమేగాని, ఉత్తమోపదేశము గాదు. ఉత్తమోపదేశమనియు, ఉత్తమోత్త మోపదేశమనియు చెప్పబడు భాగము దీనికి పైభాగమున గలదు. అది బీజాంకుర న్యాయము గాదు. భ్రమరకీటక న్యాయముగాని, రజ్జుసర్ప న్యాయముగాని కావలెను.

బీజమునుండి గల్గెడు మొలకను, అనగా అంకురమును వేరుచేయ గలరా? వృక్షమున్ను, బీజమున్ను రెండుగా చెప్పువారజ్ఞులు. రెండును ఒకటియే. పెసలు, నువ్వులు, రాగులు, వరి మొదలైన బీజములను నానబెట్టి ఒకదినము పోయిన తర్వాత ఒక వస్త్రములో మూటగట్టి పెట్టి రెండవ రోజుగాని, మూడవ రోజుగాని విప్పిచూడుడు. అప్పుడు బీజము వేరుగా నుండునా? మొలకవేరుగా నుండునా? అని తెలుసుకొనగలరు. లేక చింతవిత్తనముగాని, మామిడి విత్తనముగాని, ముంతమామిడి విత్తనముగాని మొలకవేసిన తర్వాత అంకురించినప్పుడు పోయి చూడుడు. అప్పుడు దానియొక్క యథార్థజ్ఞానము మీకే తెలియును. అయితే బీజమునకున్ను, వృక్షమునకున్ను గల మార్పులు కాలముచేగాని వస్తువుచే గాదని తెలుసుకొనగలరు. ఆలాగున జీవునికిన్ని,

ఈశ్వరునికిన్ని గల్గియుండు భేదములు అవిద్యాకల్పితమగు ఆవరణమేగాని, మరియొకటి గాదని గోచరము గాగలదు. ఇక నీ విషయమై స్కందోపనిషత్తు చెప్పిన దానిని చూడుడు.

**న నిజం నిజవద్భాత్యంతఃకరణ జృంభణాత్ ।**
**అంతఃకరణనాశేన సంవిన్మాత్ర స్థితో హరిః ।**
**సంవిన్మాత్ర స్థితశ్చాహమజోఽస్మి కిమతః పరమ్ ॥**

అంతఃకరణముయొక్క చలనముచేత, సత్యమైనది సత్యముగా తోచ లేదు. హృదయముయొక్క చంచలత్వ ముడుగునప్పుడు, యథార్థమైన సత్యము గోచరించును. నేనును జ్ఞానస్వరూపుడనై యుండుటచేత జన్మము లేనివాడనై యున్నాడను; ఇట్టి జ్ఞానము గలుగుటకన్న శ్రేష్ఠమైన పదవి మరి యెద్ది గలదు? అనగా, నిట్టి జ్ఞానముతో సమానమైనది మరియొకటి లేదని భావము.

**వ్యతిరిక్తం జడం సర్వం స్వప్నవచ్చ వినశ్యతి ।**
**చిజ్జడానాం తు యో ద్రష్టా సోఽచ్యుతో జ్ఞానవిగ్రహః ॥**

ఆత్మకు అన్యమైన దేహేంద్రియాది జడవస్తువు లన్నియును స్వప్నము వలె నశించునట్టివి. చిత్ జడములను (చేతన అచేతన ప్రపంచములను) చూచువా డెవడో ఆ యచ్యుతుడు జ్ఞానమే స్వరూపముగా గలవాడు.

అనగా అట్టి జ్ఞానము గలవానికి మఱల పతనము లేనందుచేత అచ్యు తుడని పేరు గల్గినది.

**తుషేణ బద్ధో వ్రీహిః స్యాత్ తుషాభావే తు తండులః ।**
**కర్మబద్ధస్తథా జీవః కర్మనాశే సదాశివః ॥**

ఊకచేత కప్పబడి యుండునపుడు వడ్లుగా నున్నవి. పొట్టు లేనప్పుడు అవి (ఆ వడ్లు) బియ్యముగా నున్నవి. అట్లు జీవుడు, కర్మముచేత కట్టుపడి యున్నపుడు జీవుడుగను, కర్మము నాశమైనప్పుడు నిత్యమంగళ స్వరూపుడైన

శివుడుగను నున్నాడు.

ఇచ్చట మనము గ్రహించవలసిన పరమరహస్యము గలదు. ఏ బీజమైనను తౌడు అనగా పొట్టు ఉండువఱకే అంకురించును. దంచి పొట్టు తీసివేసిన మఱల అది మొలకయెత్తదు. ఆలాగున దృశ్యాది విషయములగు మాయతో సంబంధించి యుండువఱకే జననమరణము లుండును. అట్టిమాయ, (కర్మ) జ్ఞానధ్యానములచే నశింపజేసిన జననమరణ రహితమైన ముక్తి యగు నిత్య సౌఖ్యము గల్గును.

**పాశబద్ధస్తథా జీవః పాశముక్త స్సదాశివః ॥**

కర్మపాశముచేత కట్టుబడి యుండునంతవఱకును జీవుడుగా నున్నాడు. అనగా బద్ధుడుగా నున్నాడు. పాశమునుండి విడివడినపుడు శివుడగుచున్నాడు. అనగా ముక్తు డగుచున్నాడు.

**దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవస్సదాశివః ।**
**త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్ ॥**

దేహము దేవాలయమని చెప్పబడుచున్నది. జీవుడు సదా మంగళ స్వరూపియై, దేవుడై, శివస్వరూపుడై యున్నాడు. అజ్ఞానమనెడి నిర్మాల్యమును త్యజించి సోఽహంభావముచే ఆత్మలో పూజచేయవలయును. అనగా శివ జీవుల ఐక్యానుసంధాననిష్ఠ చేయవలయును.

**అభేదదర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః ।**
**స్నానం మనోమలత్యాగశ్శౌచమింద్రియ నిగ్రహః ॥**

అభేదముగా చూచుటయే జ్ఞానమనంబడును. అనగా, జీవేశ్వరుల ఏకత్వమును కనుగొనుటయే దివ్యజ్ఞాన మగును. మనస్సు విషయరహితముగానుండుటయే ధ్యానమనంబడును. అనగా ధ్యానములో నిస్సంకల్పావస్థ గల్గి యుండవలెను. దానికే ధ్యానమని పేరు. హృదయములో గల విషయాది దోషములను పోగొట్టుటయే స్నాన మనంబడును. అనగా మృజ్జలములచే శరీర

మలినమును పోగొట్టునట్లు జ్ఞానధ్యానములచే ఆత్మయొక్క మలినమును రహిత మొనర్చవలెను. అట్లు చేయక బాహ్యస్నానముమాత్రము చేసుకొన్నచో ఆత్మశుద్ధి కాజాలదు. ఇంద్రియములను విషయాభిముఖములుగ పోనియ్యక నిగ్రహించుటయే శౌచము. ఈ స్కందోపనిషత్తుచే ముముక్షువు ఏ సాధన ముచే పరిశుద్ధుడై ముక్తుడు కాగలడో అది చెప్పబడెను.

బీజాంకుర విషయమై తైత్తిరీయశ్రుతి ఉపదేశించినది చూడుడు.

**యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి**
**యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి ॥**

యతో వై = ఏ పరబ్రహ్మమునుండి, ఇమాని = ఈ, భూతాని = భూతములు, జాయంతే = పుట్టుచున్నవో, జాతాని = పుట్టిన భూతములు, యేన = ఏ పరబ్రహ్మముచేత, జీవన్తి = బ్రతుకుచున్నవో, (ప్రాణములను ధరించుచున్నవో), యత్ = ఏ పరబ్రహ్మమును, ప్రయంతి = పొందుచున్నవో, అభిసంవిశంతి = మిక్కిలి పొందుచున్నవో (బ్రహ్మస్వరూపముగా నగు చున్నవో), తత్ = ఆ బ్రహ్మమును, విజిజ్ఞాసస్వ = తెలుసుకొన నిచ్ఛ యించుము, తత్ = అది, బ్రహ్మేతి = బ్రహ్మమని, (ఉక్తం = చెప్పబడెను).

బ్రహ్మాదిస్తంబపర్యంత ముండెడి సమస్తభూతములు ఏ పరబ్రహ్మము నుండి పుట్టి ఏ పరబ్రహ్మముచేత జీవించుచు అంతమునందు ఏ పరబ్రహ్మమునందు ప్రవేశించి యంతటను ఆ పరబ్రహ్మస్వరూపమే తామై దానిని విడుచుట లేదో, అట్టి పరబ్రహ్మముయొక్క ఈ చెప్పబడిన లక్షణ మును విశేషముగా తెలిసికొనుటకు కోరుము. ఇక పురాతనమగు కఠోపని షత్తున ఉపదేశించిన దానిని, భక్తిశ్రద్ధలు గల్గి మనము గ్రహించవలెను.

**అణోరణీయాన్మహతో మహీయాన్**
**ఆత్మాఽస్య జంతోర్నిహితో గుహాయామ్ ।**
**తమక్రతుః పశ్యతి వీతశోకో**
**ధాతు ప్రసాదాన్మహిమానమాత్మనః ॥**

అణోః = సూక్ష్మపరిమాణముగల శ్యామాదికముకంటె (శ్యామాదిక మనగా, సన్నని ధాన్యమగు చాములు), అణీయాన్ = మిక్కిలి సూక్ష్మమయి నట్టియు, మహతః = మహాపరిమాణముగల పృథివ్యాదికముకంటె, మహీ యాన్ = మిక్కిలి గొప్పదైనట్టియు, ఆత్మా = ఆత్మ, అస్య = ఈ బ్రహ్మాది స్తంబ పర్యంతమయిన, జంతోః = ప్రాణిజాతముయొక్క, గుహాయాం = బుద్ధిగుహయందు, నిహితః = ఉంచబడియున్నది. తం = అట్టి యాత్మను, అక్రతుః =దృష్టాదృష్ట బాహ్య విషయోపరతబుద్ధి గలవాడు (చూచుచున్నాడు), ధాతుప్రసాదాత్ = మనస్సు మున్నగు ఇంద్రియ సముదాయముయొక్క ప్రసన్నత్వమువలన, ఆత్మనః=ఆత్మయొక్క, మహిమానం=మాహాత్మ్యమును పశ్యతి = దర్శించుచున్నాడు, వీతశోకః = శోకరహితుడున్ను (అగుచున్నాడు).

ఈ యాత్మ అణుపరిమాణమయిన దానికంటె అణుతరమును, మహా పరిమాణమయిన దానికంటె మహత్తరమును అగుచున్నది. అట్టి యాత్మ బ్రహ్మాదిస్తంబ పర్యంతమగు ప్రాణిజాతముయొక్క బుద్ధిగుహయందు ఆత్మ భూతమయి యున్నది. అట్టి యాత్మను కుటిలహృదయము లేనివాడున్ను, బాహ్యాభ్యంతర విషయములనుండి నివృత్తిగల చిత్తము గలవాడు (బాహ్య విషయమనగా చక్షురాది ఇంద్రియములు, అంతర విషయమనగా, మనో బుద్ధ్యాదుల విషయములు) మాత్రమే తెలుసుకొనుటకు శక్తిమంతుడగుచు న్నాడు. అంతర్బాహ్య విషయములనుండి యుపరతి గల్గినప్పుడు హృద యము నిర్మల మగుచుండును. అప్పుడు నిర్మలమగు నీటిలో సూర్య ప్రతి బింబము గనుపించునట్లు మహిమాతిశయముగల యీ ఆత్మను కనుగొన వచ్చును. అప్పుడు శోకమోహములు నశించును.

దీనివల్ల ఉపరతి గల్గినప్పుడే మనశ్శుద్ధి గల్గును. మనశ్శుద్ధి గల్గి నప్పుడే ఆత్మజ్ఞానము లభించును. అట్టి జ్ఞానము లభించునప్పుడే సంసార దుఃఖము నశించును అని తెలియందగినది. ఒక విద్యుచ్ఛక్తి యంత్రాలయ ములో చిన్నవిగాను, పెద్దవిగాను గల అనేక యంత్రములున్ను, అనేక

దీపములున్ను ఒక్కొక్క యంత్రము వేరు వేరు పనులు చేయుచుండిన ఒక్కొక్క దీపము వేరు వేరు రంగులతో వెల్గుచుండినను అన్నిటిలోను విద్యుచ్ఛక్తి యేలాగున ఒకే విధముగ నుండునో, ఆలాగున నీ యాత్మయు అన్నిటిలో ఒకే విధముగ నుండినను జీవకోట్ల ఉపాధి ననుసరించి అనేకములుగ గానుపించును. ఆలాగున పిపీలికాది బ్రహ్మపర్యంతముగల సమస్త ప్రాణికోట్ల ఉపాధులు యంత్రదీపముల వంటివనియు, అంతర్యామియై వెల్గుచుండు బ్రహ్మచైతన్యము విద్యుచ్ఛక్తివంటిదనియు, అనగా ఎలక్ట్రిక్ కరంటు వంటిదనియు గ్రహించ వలయును.

**అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్ ।**
**మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥**

ధీరః = బుద్ధిమంతుడు, ఆత్మానం = ఆత్మను, అశరీరం = శరీర విరహితమైనదిగను, అనవస్థేషు = అనిత్యములగు, శరీరేషు = శరీరము లందు, అవస్థితం = ఉన్నదానిగను, మహాంతం = గొప్పదానిగను, విభుం = వ్యాపనము గలదానిగను, మత్వా = తలంచి, న శోచతి = దుఃఖింపడు.

అనిత్యములగు దేవ, పితృ, మనుష్యాది శరీరముల యందున్నదియు, అనగా సత్యమైనదియు, గొప్పగను విభువుగను అనగా ప్రభువుగను సర్వవ్యాపిగను నున్న ఆత్మను (అనగా అంతర్యామియగు దైవస్వరూపమును) తెలుసుకొని ఆత్మవేత్తయగు విద్వాంసుడు శోకరహితు డగుచున్నాడు. ఇట్టివాడయిన ఆత్మవేత్తకు శోకము లేదని భావము. శోకమోహములకు అనాత్మ స్వరూపమగు దేహాదులలో ఆత్మబుద్ధియే కారణము.

**ఏష సర్వేషు భూతేషు గూఢోऽऽత్మా న ప్రకాశతే ।**
**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥**

ఏషః = ఈ పురుషుడు (ఆత్మ), సర్వేషు భూతేషు = సకల ప్రాణుల యందు, గూఢః = గూఢముగ నున్నవాడై, ఆత్మా = ఆత్మగా, న ప్రకాశతే =

ప్రకాశించుట లేదు (ఏషః = ఈ పురుషుడు), అగ్ర్యయా = ఏకాగ్రత్వము గలిగినటువంటిన్నీ, సూక్ష్మయా = సూక్ష్మమైన (ఇంద్రియ విషయరహితమైన), బుద్ధ్యా = బుద్ధితో, సూక్ష్మదర్శిభిః = సూక్ష్మమయిన, ఆత్మవస్తువును చూచుట యందు సమర్థులగు బ్రహ్మనిష్ఠులచేతనే, దృశ్యతే తు = చూడబడుచున్నాడు.

ఈ ఆత్మవస్తువు అసంస్కృత చిత్తునకు, అవిజ్ఞేయ మగుటచేత "న ప్రకాశతే"అని చెప్పబడినదేగాని, సంస్కరింపబడినట్టియు, ఏకాగ్రత గల్గి నట్టియు, సూక్ష్మవస్తు నిరూపణపరమయి నట్టియునగు బుద్ధిచేత, సూక్ష్మదృష్టి గల బ్రహ్మవేత్తలగు సూక్ష్మదర్శులచేత తెలుసుకొనుట సాధ్యమగుచున్నది.

ఇచ్చట పురుషశబ్దము శరీరమనెడు పురమందు నివసించు చైతన్య మగుటచే, పురుషశబ్దముగ గలిగినదేగాని, స్త్రీపురుష వ్యత్యాసముచే గల్గినది కాదు. అష్టవిధములగు పురీకములతో గూడిన దానికి పురమని పేరు.

**వాగాది పంచ శ్రవణాదిపంచ ప్రాణాది పంచాభ్రముఖాని పంచ ।**
**బుద్ధ్యాద్యవిద్యాపి చ కామకర్మణీ పుర్యష్టకం సూక్ష్మ శరీరమాహుః ॥**

1. వాగాదిపంచ = అయిదు కర్మేంద్రియములు, 2. శ్రవణాది పంచ = ఐదు జ్ఞానేంద్రియములు, 3. ప్రాణాదిపంచ = పంచప్రాణములు, 4. అభ్ర ముఖాని పంచ = పంచభూతములు, 5. బుద్ధ్యాది = మనోబుద్ధి చిత్తాహం కారములు (నాలుగు), 6. అవిద్యా = అజ్ఞానము, అపి చ = మఱియు, 7. కామ కర్మణీ = కామము, 8. కర్మయు (గూడిన వీనిని) పుర్యష్టకం = ఎనిమిది పురములనియు, అష్టపురీకము లనియు, దీనినే సూక్ష్మశరీరం = సూక్ష్మదేహ మనియు, ఆహుః = మహాపురుషులు చెప్పిరి.

ఇది స్త్రీపురుషు లుభయులకును సమానముగ నుండును. వనములో నుండు వానికి వని యనియు, గృహములో నుండువానికి గృహి యనియు, జటలుగలవానికి జటి యనియు, దండముగలవానికి దండి యనియు నెట్లు పేరు వచ్చినదో, ఆలాగున పురమందుండు కారణముచేత ఆత్మకు పురు

షుడని వచ్చినది కాని మఱియొకటి కాదు.

**యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ ।**
**మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥**

ఇహ = ఇచ్చట (అనగా ఇహలోకమున), యత్ = ఎయ్యది గలదో, తదేవ = అయ్యదియే, అముత్ర = అచ్చటను (అనగా పరలోకమున) గలదు, యత్ = ఎయ్యది, అముత్ర = అచ్చట (పరలోకమున) కలదో, ఇహ = ఇచ్చట; తదను = అదియే గలదు, యః = ఎవ్వడు, ఇహ = ఇచ్చట, నానా ఇవ = అనేకమువలె, పశ్యతి = చూచుచున్నాడో, సః = వాడు, మృత్యోః = మృత్యువునుండి, మృత్యుం = మరణమును (అనగా మాటిమాటికి పుట్టుట చచ్చుచుండుటయను సంసారమును), పశ్యతి = పొందుచున్నాడు.

ఇహలోకములో జీవించియున్నప్పుడు మీ హృదయములో నే భావము గల్గియుండునో పరలోకములోను మీకు అట్టిభావమే గల్గియుండును. పరలోకమున నెట్టి భావముండునో, దానికనుగుణమగు జన్మమే గల్గుచుండును. అట్టి జన్మములోను దానికనుగుణ ఫలమే సిద్ధించును. కావున నిచ్చటనే బ్రహ్మాకారవృత్తి గల్గియుండిన పరములోను అట్టి బ్రహ్మాకారస్థితిగల్గును. అట్లుగాక సాధారణ వైష్ణవు లందరున్ను చనిపోవునప్పుడు, పరమపదము వేంచేసినారనియు, శైవులు చనిపోవునప్పుడు శివలోకప్రాప్తి పొందిరనియు చెప్పుదురు. అట్టి శివత్వముగాని, విష్ణుత్వముగాని జీవించి యున్నప్పుడు గల్గిన మాత్రమే మోక్షము గలదుగాని, వేరు మార్గము లేదని శ్రుతియే చెప్పుచున్నది. ఇచ్చటగల దేహమునకు సంబంధించిన జాతివర్ణాదులపై ఆధారపడి జీవకోట్లను, భేదబుద్ధితో చూచువాడు, జనన మరణ సంసార చక్రమునుండి విడుదల పొందజాలడనియు, "మృత్యోస్స మృత్యుమాప్నోతి" అని చెప్పుటచే భేదదృష్టి గలవానికి సామాన్యజనుల మరణముకన్న అధిక దారుణమగు మరణమే గల్గుచుండుననియు గ్రహించవలెను. లేక యిచ్చట జీవేశ్వరుల ఐక్య జ్ఞానము గలుగక భిన్నభావమే గల్గియుండిన, అట్టివానికి ఇకను జననమరణ

ములు నశించలేదని తెలుసుకొనవలెను. కొందరు త్వరలో చనిపోవుటకు కోరుదురు. దానివలన సౌఖ్యము లేదు. ప్రాణము పోవుటకు ముందుగా ఆత్మ శుద్ధి గలిగేలాగున చూడవలెను. అదే పరములోను మఱియొక్క జన్మము వచ్చినప్పుడును సౌఖ్యమును గలుగజేయునేగాని తక్కినది భ్రమ యగును.

**మనసైవేదమాప్తవ్యం నేహ నానాఽస్తి కించన ।**
**మృత్యోస్స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి ॥**

ఇదం = ఈ బ్రహ్మము, మనసా ఏవ =మనస్సుచేతనే, ఆప్తవ్యం = పొందదగినది, ఇహ = ఈ బ్రహ్మమునందు, నానా = భేదము (అనేకత్వము), కించన = కొంచెమైనను, నాస్తి = లేదు, యః = ఎవ్వడు, ఇహ = ఈ ఆత్మయందు, నానా ఇవ = అనేకమున్నదానివలె, పశ్యతి = చూచుచున్నాడో, సః = వాడు, మృత్యోః = మృత్యువునుండి, మృత్యుం = (పునః పునర్జన్మ మరణరూపసంసార లక్షణమగు) మరణమును, గచ్ఛతి = పొందుచున్నాడు.

విషయవిరక్తి, యోగనిష్ఠ, జ్ఞానాద్యనుష్ఠానములచే నిర్విషయము గల్గిన మనస్సుచేతనే యీ బ్రహ్మత్వము పొందగల్గును. అట్టి బ్రహ్మైకత్వ వినిశ్చయ బుద్ధి ప్రాప్తమయిన దగుచుండగా, దేహవర్ణములతో చూచెడు జీవకోట్ల లోపల వేరు వేరు అను బుద్ధిని స్ఫురింపజేయునట్టి అవిద్య నివర్తించి పోవుచున్నది. లేక బ్రహ్మానుసంధానముచే అజ్ఞానము నశించి దైవత్వజ్ఞానము గల్గునప్పుడు జీవేశ్వరులకు భేదము గలదను భావము తొలగిపోవుచున్నది. కావున బ్రహ్మమునం దణుమాత్రమైనను నానాత్వ ముండజాలదు. వస్తుస్థితి యిట్లుండగా అవిద్యాతిమిరదృష్టితో బ్రహ్మమునందు నానాత్వము నెవ్వడు చూచుచుండునో అట్టివాడు అణుమాత్రము భేదదృష్టిని గాంచినను పునః పునః జననమరణ రూపమగు సంసారమునకు గురి యగుచుండును.

**అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ ।**
**ఏక స్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

యథా = ఏ విధముగా, ఏకః = ఒక్కటైన, అగ్నిః = అగ్ని, భువనం = లోకమును (వస్తువును), ప్రవిష్టః = ప్రవేశించినదై, రూపం రూపం = రక్తనీలపీతాది వర్ణములుగల ధాతువులనుగూర్చి, ప్రతిరూపః = ఆయా ధాతువులకు తగిన రూపము గలది, బభూవ = ఆయెనో, తథా = అదే విధముగా, ఏకః = ఏకవిధుడగు పురుషుడే, సర్వభూతాంతరాత్మా = సర్వ భూతములకు అంతరాత్మయై, బహిశ్చ = వెలుపలనున్న, రూపం రూపం = ప్రతిరూపమునుగూర్చి, ప్రతిరూపః = సమానమయిన రూపము గలవాడు (బభూవ = ఆయెను).

ప్రకాశస్వభావముగల అగ్ని యొక్కటే లోకమునందుగల యెరుపు, నలుపు, తెలుపు, పసుపు వర్ణములు గల వస్తువులను ప్రవేశించి ఆయా ధాతువుకు తగిన రూపముగల దెట్లగుచున్నదో, అదేవిధముగా ఒక్కటైన ఆత్మయే సర్వభూతములందు, సర్వదేహములందు అతిసూక్ష్మరూపమున అంతరాత్మభూతమై, ప్రవేశించి ఆయా దేహములకు తగిన రూపములు గలదగుచున్నది. ఈ విషయమై మఱియొక దృష్టాంతముగూడ చూపబడు చున్నది.

**వాయుర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ ।**
**ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

యథా = ఏ విధముగా, ఏకః వాయుః = ఒక్కటియగు వాయువు, భువనం ప్రవిష్టః = లోకమును ప్రవేశించినదై, రూపం రూపం = ప్రతి దేహ మును గూర్చి, ప్రతిరూపః = సమానమయిన రూపము గలదిగా, బభూవ = ఆయెనో, తథా = అదేవిధముగా, ఏకః = ఒక్కటైన ఆత్మయే, సర్వభూతాంత రాత్మా = అంతరాత్మ స్వరూపముతో సర్వభూతములందున్నదై, బహిశ్చ = వెలుపల నున్నదై, ప్రతిరూపః = సమానమైన రూపము గలదిగా, బభూవ = ఆయెను.

ఓ నచికేతసుడా! ఒక్కటియగు వాయువు ప్రాణాత్మకముచేత సకల

ప్రాణుల దేహములందు ప్రవేశించి ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన, కృకర, కూర్మ, గాంధార మొదలగు పేర్లతోను, రూపములతోను, స్థానములతోను, క్రియలతోను గూడి యెటులున్నదో అదేవిధముగా ఒక్కటే యగు ఆత్మయు, సకలభూతాంతరాత్మయై వెలయుచు లోపల వెలుపల ఆ యా రూపములకు తగిన రూపములు గలవానివలె ప్రకాశించుచున్నది.

**ఏకో వశీ సర్వభూతాంతరాత్మా**
**ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా**
**స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥**

ఏకః = ఒక్కటై, వశీ = సర్వజగత్తు స్వాధీనముగా గలదియు, సర్వ భూతాంతరాత్మా = సర్వభూతములకు అంతరాత్మస్వరూపమును (అగు), యః = ఏ ఆత్మ, ఏకం రూపం = శుద్ధవిజ్ఞానఘనరూపుని, బహుధా = అనేకవిధములు గలవానినిగా, కరోతి = చేయుచున్నదో, యే ధీరాః = ఏ పరిశు ద్ధాత్ములు, ఆత్మస్థం = స్వశరీర హృదయాంతర్గతమగు బుద్ధిగుహయందున్న, తం =ఆ యాత్మను, అనుపశ్యంతి = చూచుచున్నారో, తేషాం = వారికే, శాశ్వతం సుఖం = శాశ్వతమైన సుఖము (గలుగునుగాని), ఇతరేషాం = ఇతరులకు, న = అట్టి సుఖము గలుగదు.

స్వశరీర హృదయాకాశ మందుండు దానిని, అనగా బుద్ధిగుహయందు చైతన్యాకారముతో వెలయుదానిని, ఒక్కడై, సర్వాంతర్యామియైన సర్వేశ్వరు నిగా నెరుంగుము. సర్వభూతములలోను అట్టి విజ్ఞాన ఘనస్వరూపుడగు ఈశ్వరుడే వెల్గుచున్నాడు. అట్టి యీ ఆత్మను విషయవిరక్తి యోగసాధనలతో గూడిన ధీరులగు ఏ బ్రహ్మనిష్ఠులు బాహ్యవిషయములనుండి విముఖము లయిన యింద్రియవృత్తులు గలవారలై ఆచార్య శాస్త్రోపదేశ స్వానుభవము లతో గాంచుచున్నారో, యీశ్వరతుల్యులగు అట్టి బ్రహ్మవిద్వాంసులగువారికే శాశ్వతసుఖము గలుగును గాని, తదితరులకు అనగా బాహ్య విషయాసక్తిగల

బుద్ధిగలవారికి శాశ్వతసుఖము స్వాత్మభూత మయినప్పటికిన్ని, అవిద్యాది ఆవరణమువలన గలుగజాలదు.

ఇచ్చట ధీరశబ్దము వినియోగించుటకు కారణమేమన, వైరాగ్యోపరతి బోధనలతో యోగసాధనగల ధైర్యశాలురు మాత్రమే ప్రకృతియొక్క వికృతుల నణచుటకు శక్తిగలవా రగుదురు. అట్టి ధీరత్వము లేనిచో వైరాగ్యమును పొందుటలో ప్రతిబంధము గలుగజేయు తన దేహసంబంధుల భావములకు గూడ లోబడిపోవుదురు. శూరుడున్ను, ధీరుడున్ను కాని యోధుడు శత్రువుల జయింపగలడా? ఆలాగున వైరాగ్యమున్ను, దృఢబోధమున్ను, ధైర్యమున్ను గల సాధకుడే ప్రకృతి భావములనుండి తనను రక్షించుకొనగల్గును.

ఇది కఠోపనిషత్తునందు నాచికేతుడను ఋషికుమారునికొఱకు యమధర్మరాజుచే బోధింపబడిన పరమతత్త్వము. ఇప్పుడు ఉపనిషత్తులన్నిటి కిన్ని మొదటిదగు ఈశావాస్యోపనిషత్తును జూడుడు.

**యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి ।**
**సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే ॥**

యస్తు = ఎవ్వడైతే, సర్వాణి = సమస్తములయిన, భూతాని = భూతములను (ప్రాణికోట్లను), ఆత్మన్యేవ= ఆత్మయగు తనయందే, అనుపశ్యతి = చూచుచున్నాడో, సర్వభూతేషు చ =సమస్త ప్రాణికోట్లయందును, ఆత్మానం= ఆత్మయగు తనను, అనుపశ్యతి = చూచుచున్నాడో, సః = అట్టివాడు, తతః= అట్లెరుంగుటవలన, న విజుగుప్సతే = అసహ్యాపడడు.

ఏ ఆత్మవేత్త సర్వభూతములలోను తాను, తనయందు సర్వభూతములును గలవని తెలుసుకొనునో వాడు ఇతరులను నిందచేయడు. అనగా ఒక్కజాతివారు అదేజాతిలో గలవారిని తమ కన్యులనుగా తలంచరు. అందువల్ల భిన్నభావము గలుగదు. తాము అన్యజాతులలో గలయునప్పుడుగాని, అన్యజాతులు తమలో గలయునప్పుడుగాని అసహ్యాభావము గల్గుచుండును.

ఈ మానవులందరు ఒకే యీశ్వరుని అంశములని తెలుసుకొన్నప్పుడు అందరిని సోదరభావముతో జూచెడు అవస్థ గలుగును.

**యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః ।**
**తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః ॥**

యస్మిన్ = ఏ సమయమునందు, విజానతః = యథార్థ వస్తువు నెరింగిన వానికి, సర్వాణి = సమస్తములయిన, భూతాని = భూతములును, ఆత్మా ఏవ = తానే, అభూత్ = ఆయెనో (తస్మిన్ = ఆ సమయమునందు), ఏకత్వం = ఏకత్వమును (అనగా ఆత్మయొకటియే యథార్థవస్తువు గాని, తదితరము లేదనుట), అనుపశ్యతః = ఎఱింగినట్టి (విద్వాంసుడగు) వానికి, కః మోహః = మోహమేది? కః శోకః = శోకమేది?

అనగా సమస్త భూతములలో వెల్గుచుండు ఈశ్వరస్వరూపము ఆత్మ భావములో కనుగొనిన మహాత్మునికి శోకమోహము లుండవు. అతడు అంతయు ఒకే దైవమయముగానే చూచుచుండును.

మాండూక్యోపనిషత్తులో చెప్పినది జూడుడు :-

**వైశారద్యం తు వై నాస్తి భేదే విచరతాం సదా ।**
**భేదనిమ్నాః పృథగ్వాదా స్తస్మాత్తే కృపణాస్స్మృతాః ॥**

సదా = ఎల్లప్పుడు, భేదే = భేదమునందు (దేహభేదములనుబట్టి జీవులకుగూడ భేదము గలదని తలంచుట, లేక జీవేశ్వరులకు భేదము గలదని గ్రహించుట), విచరతాం = సంచరించువారలకు, వైశారద్యం = విశార దత్వము (పరిశుద్ధభావము) నాస్తి వై = లేదుగదా, భేదనిమ్నాః = భేదము ననుసరించువారు; పృథగ్వాదాః = నానావిధములుగా వాదించుచుందురు, అనగా వర్ణాశ్రమములనుబట్టి జీవులకుగూడ భేదముగలదని చెప్పుచుందురు, తస్మాత్ = అందువలన, తే = అభేదానుయాయులు, కృపణాః = కృపణులని (కుత్సితులని) స్మృతాః = చెప్పబడిరి.

ఎవ్వరు జీవులు నానాతరగతులుగా ఉన్నారని వాదించుదురో వారు భేదనిమ్నులు, అనగా సంసారమార్గములో నున్నవారనుట, ఆత్మజ్ఞానము లేని వారని భావము. అంతేగాక అట్టివారు విశుద్ధాత్ములు గారని తెలియందగినది. అందువలన కృపణులు అనగా దయాసత్య శాంత్యాది గుణములు లేనివార నుట. ఎందువల్లననగా? సంసారమార్గములో విషయాపేక్ష గల్గియుండు వారగుటచే అంతఃకరణశుద్ధి లేనివారని భావము. కావున దయాసత్య శాంత్యాది పవిత్రగుణములనెడు పావనతీర్థముచే పైజెప్పిన అశుద్ధకృపణ విషయాది దోషములను అంతఃకరణములో కడిగి శుద్ధపరచి విశుద్ధాంతః కరణు లగుటకు యత్నించవలయును.

**ఆదిబుద్ధాః ప్రకృత్యైవ సర్వే ధర్మాస్సునిశ్చితాః ।**
**యస్యైవం భవతి క్షాంతిస్సోఽమృతత్వాయ కల్పతే ॥**

ప్రకృత్యా ఏవ = స్వభావముచేతనే, సర్వేధర్మాః = ఆత్మలన్నియు, ఆదిబుద్ధాః = నిత్యబోధ స్వరూపములని, సునిశ్చితాః = చక్కగా నిశ్చయింప బడినవి, యస్య = ఎవనికి, ఏవం=ఈ విధముగా, క్షాంతిః= క్షాంతి, భవతి = అగుచున్నదో, సః = వాడు, అమృతత్వాయ=అమృతత్వముకొఱకు, కల్పతే = సమర్థు డగుచున్నాడు.

జీవకోట్లకు బాహ్యవ్యవహారములచే కానుపించెడు జాతివర్ణాశ్రమములు స్వభావముగా లేవనియు అవి స్వయముగా నిత్యశుద్ధ స్వయంప్రకాశధర్మము గల దైవాంశస్వరూపములనియు గ్రహించవలయును. అట్టి దైవాంశస్వరూప ములగు జీవులు ఇట్టివా? అట్టివా? అని సంశయింపదగిన స్వరూపము గలవి గావు. ఇటువంటి యథార్థజ్ఞాన మెవనికి గల్గునో వాడమృతత్వమునకు సమ ర్థుడు. అనగా అట్టి దివ్యాత్మజ్ఞానము గలవానికి నిస్సందేహముగా మోక్షము గల్గును.

ఇప్పుడు ఈ వ్యాసమును విరమిం దలంపు గలుగుటచే ఒక విషయమును చెప్పి దీనిని పూర్తిచేయవలసి యుండును.

**ఇహ చేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః ।**
**తతస్సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥**

ఎవనికి ఇహములో నీ కానుపించెడు శరీరమును వీడిపోవుటకు ముందుగా దైవసాక్షాత్కారజ్ఞానము గలుగక యుండునో, అట్టి వానికి ఇప్పుడు అంతఃకరణములో నే భావము గలిగియుండునో, దాని కనుగుణమగు శరీరమును దాల్చుట జన్మాంతరములో సిద్ధమై యున్నది. కావున ఇచ్చటనే జన్మరాహిత్యమునకు తగిన నిర్విషయస్థితిపరమగు ఆత్మసాక్షాత్కార జ్ఞానమును గలుగజేసుకొనుటకై ప్రయత్నించవలెనని వేదమాతయగు కఠవల్లిశ్రుతి అత్యధికదయతో మనకుపదేశించుచున్నది. అనగా రాబోవు జన్మము మన కందరకును ఇప్పుడే ఆత్మలో సృష్టి యగుచున్నది. విజ్ఞానబోధము గల్గినప్పుడు మరల జన్మము గలదా? లేదా? కల్గిన అదేలాగుండును? అని మొదలుగాగల విషయము లన్నియు ఆత్మజ్ఞానికి గోచరము గాగలవు. ఇప్పుడు మనము అజాగ్రత్త గలవారమై ఆత్మలో గల్గుచుండు సృష్టిని తెలుసుకొనక పోయితిమేని, మరల దానిని మార్చుట కవకాశము కలుగదు. చెట్టు పెట్ట దలంచినవాడు విత్తనము ఎటువంటిదో, తెలుసుకొనకపోయిన చెట్టయిన తర్వాత ఆ ఫలములను మార్చుటకెట్లు సాధ్యపడదో జన్మముల యొక్క స్థితియు నటువంటిదే. పూర్వసంస్కారముచే ఈ శరీరమున్ను దీని కనుగుణములగు సుఖదుఃఖములున్ను, జ్ఞానాజ్ఞానములున్ను ఇప్పుడు గల్గి యున్నవి.

ఇప్పుడు గల సంస్కారము ననుసరించి జన్మరహితముగాని, జన్మ సహితముగాని మనము చేసుకొనవచ్చును. ఇప్పుడంతఃకరణములోగల సంస్కారములు (లేక భావములు, లేక వృత్తులు) (లేక గుణములు) ఏలాగుండునో, దీనికగుణ మగు జన్మము ఏ కులములో, ఏ దేశములో, ఏ కాలములో, నే గర్భములో పుట్టందగునో, అట్టిదానిలో జన్మించుట నిక్కము. తరువాత ఆ జన్మములో దానికనుగుణమగు ఫలము ననుభవించియే తీరవలెను గాని అప్పుడు మార్చుకొనుట కనుకూలము దొరకదు. అనగా మీ

హృదయము సత్త్వగుణముగాని, రజోగుణముగాని, తమోగుణముగాని, లేక గుణములయొక్క మిశ్రమముగాని, త్రిగుణరహితముగాని, విశుద్ధగుణము గానీ, నిర్విషయముగాని, సవిషయముగాని, శాంతముగ్గాని, ఘోరముగాని, కారుణ్యముగాని, కఠినముగాని, ప్రేమగాని, దైవప్రేమగాని గల్గి యుండిన ఆలాటి జన్మము తప్పక గల్గును.

ఏ గుణములు లేకయు విజ్ఞానస్వరూపులై బ్రహ్మాకారైకజ్ఞానము గల్గియుండువారికి దైవసాక్షాత్కారజ్ఞాన మోక్షము గల్గును. ఇది సత్యము.

ఆత్మసోదరులారా! సోదరీమణులారా! ఇట్టి విషయములో అజాగ్రత్త పొందకుడు. కనులు మూసుకొనిపోయిన తర్వాత, మనమేమియు చేయ జాలము. అట్టి కండ్లు మూసుకొని పోయెడు కాలము ఇప్పుడో యెప్పుడో అని తెలుసుకొని కార్యములు చక్కపరచుటకుగూడ సమయము గలదో లేదోయని గూడ తెలియజాలము. ఒక ఎకరము భూమిలో పాదులు చేసి ఒక్కొక్కదానిలో నేమేమి విత్తనములు పెట్టెదమో, అనగా బీజములు చేదుగా గాని, తీపుగాగాని, పులుపుగాగాని, వగరుగాగాని యుండిన దానికనుగుణ ఫలము గల్గునట్లు జీవునియొక్క గుణములున్ను ఆలాగుననే యుండును. కనుక శుద్ధాత్ములై, దయాస్వరూపులై, నిర్విషయులై; ప్రశాంతులై, ప్రసన్నాత్ములై, మీరందఱును నుందురుగాక!

**ముక్తిస్తు బ్రహ్మతత్త్వస్య జ్ఞానాదేవ న చాన్యథా ।**
**స్వప్రబోధం వినా నైవ స్వస్వప్నో నశ్యతే యథా ॥**

మోక్షము బ్రహ్మతత్త్వజ్ఞాన సాక్షాత్కార మొక్కదానిచేమాత్రము గలుగునేగాని వేరుమార్గము లేదు. ఏలననగా తనకు స్వప్నములో గల్గిన భావము జాగ్రత్తలోనికి రానిచో ఆ భ్రాంతి నశింపదు గదా? ఆలాగున అజ్ఞాన మనెడు సుషుప్తిలో నుండు జీవునికి ఆత్మసాక్షాత్కార జ్ఞానమనెడు జాగ్రదవస్థ గలుగవలయును. అప్పుడు కృతార్థత గల్గును. ధన్యాత్ము లగుదురు. శోక శాంతియు, ఆనందప్రాప్తియు సిద్ధించును.

ఇప్పుడు మహావాక్యములో మొదటిది యగు ప్రజ్ఞానవాచకము చెప్పునది చూడందగును.

**యేనేక్షతే శ్రుణోతీదం జిఘ్రతి వ్యాకరోతి చ ।**
**స్వాద్వస్వాదూ విజానాతి తత్ప్రజ్ఞాన ముదీరితమ్ ॥**

యేన = చక్షుర్ద్వారా వ్యాపించిన అంతఃకరణవృత్తితో గూడినట్టి యే చైతన్యముచేత, ఇదం = చూచుటకు యోగ్యమైన యీ రూపాదికమును, ఈక్షతే =పురుషుడు చూచుచున్నాడో, శ్రుణోతి = శబ్దములను వినుచున్నాడో, జిఘ్రతి = గంధముల నాఘ్రాణించుచున్నాడో; వ్యాకరోతి = శబ్దసమూహములను వ్యవహరించుచున్నాడో; స్వాద్వస్వాదూ - స్వాదు = తీపిని; అస్వాదూ = చేదును అనగా రసముల ననుట; విజానాతి= ఎఱుంగుచున్నాడో; తత్ = ఆ చైతన్యము; ప్రజ్ఞానం = ప్రజ్ఞానమని; ఉదీరితం = చెప్పబడుచున్నది.

నేత్రేంద్రియముద్వారా బాహ్యమునకు వ్యాపించిన అంతఃకరణవృత్తితో గూడినట్టి ఏ చైతన్యముచేత పురుషుడు చూచుటకు యోగ్యమైన రూపాదికమును చూచుచున్నాడో మఱియు, శ్రోత్రేంద్రియముద్వారా బాహ్యప్రదేశములకు వ్యాపించినట్టి అంతఃకరణవృత్తితో గూడిన ఏ చైతన్యముచేత పురుషుడు శబ్దసమూహమును వినుచున్నాడో, మఱియు ఘ్రాణేంద్రియముద్వారా బాహ్యప్రదేశమునకు వ్యాపించినట్టి అంతఃకరణ వృత్త్యుపాధితో గూడిన ఏ చైతన్యముచేత గంధసమూహమును పురుషుడు ఆఘ్రాణించుచున్నాడో, మఱియు వాగింద్రియముద్వారా బాహ్యమునకు వ్యాపించినట్టి అంతఃకరణ వృత్త్యుపాధితో గూడిన ఏ చైతన్యముచేత పురుషుడు సకలశబ్దముల నుచ్చరించుచు వ్యవహరించుచున్నాడో, మఱియు జిహ్వేంద్రియముద్వారా బాహ్యప్రదేశమునకు వ్యాపించిన అంతఃకరణవృత్తితో గూడినట్టి యే చైతన్యముచేత పురుషుడు తీపి, చేదు మొదలగు రసముల నెరుగుచున్నాడో - యీ ప్రకారమే సకలేంద్రియములతోడను అంతఃకరణవృత్తి చేరుచుండగా

అట్టి వృత్తిభేదములతో గూడిన ఏ చైతన్యముచేత పురుషుడు సకలేంద్రియ విషయముల నెరుగుచున్నాడో అట్టి చైతన్యమే. "శ్రు॥ ప్రజ్ఞానం బ్రహ్మ"అనెడి మహావాక్యమందు గల ప్రజ్ఞానశబ్దముచేత చెప్పబడుచున్నది.

ఇట్లు ప్రజ్ఞానశబ్దార్థమును దెలిపి ఇప్పుడు బ్రహ్మశబ్దార్థమును చెప్పు చున్నాడు :-

**చతుర్ముఖేంద్ర దేవేషు మనుష్యాశ్వగవాదిషు ।**
**చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మ మయ్యపి ॥**

చతుర్ముఖేంద్రదేవేషు - చతుర్ముఖ = బ్రహ్మదేవునియందును; ఇంద్రదేవేషు = దేవేంద్రాది దేవతలయందును, మనుష్యాశ్వగవాదిషు - మనుష్య = మనుష్యులయందును, అశ్వ = గుఱ్ఱములయందును, గవాదిషు = గోవు మొదలగు వానియందుగల, ఏకం = ఒక్కటియగు, చైతన్యం = చైతన్యము బ్రహ్మమగును, అతః = ఆ కారణమువలన, మయ్యపి = నా దేహందునుగల, ప్రజ్ఞానము, బ్రహ్మబ్రహ్మమగును.

ఉత్తమములగు దేవాదిశరీరములను ధరించినవారియందును, మధ్యమములగు మనుష్యదేహములను ధరించిన వారియందును, అధమములగు గోవు, గుఱ్ఱము మొదలగు ప్రాణులయందును, ఏ చైతన్యము గలదో, అది బ్రహ్మమగును. ఇది బ్రహ్మశబ్దార్థమని తెలియవలెను. అందరిలో ఆత్మ రూపముగాగల ప్రజ్ఞానమునకు ఏ లక్షణము గలదో, అట్టి లక్షణము అందరి ఆత్మలోగల జీవచైతన్యమును గలిగియుండుటచేత, ఈ ప్రజ్ఞానమే బ్రహ్మ రూపమగునని అభిప్రాయము.

ఇక జీవులన్నియు ఒకే దైవస్వరూపములనియు, అవి యీశ్వర చైతన్యమున కన్యములు కావనియు తెలుపబడుచున్నవి. ఇది వేదసారమైన మహావాక్యమగుటచే నిక దీనికన్న యెక్కువ చెప్పదగినది లేదని తలంచెద.

ఇక శ్రీసూతసంహితలో జ్ఞానయజ్ఞవిషయమై చెప్పిన విషయమును

చూడుడు.

**వస్త్వైకత్వం మహావాక్యాదేవ జానంతి యే జనాః ।**
**తే ముచ్యంతే హి సంసారాద్యథా స్వప్నప్రబోధనాత్ ॥**

జీవకోట్లలోగల చైతన్యము భిన్నము గాదనియు, ఏకమనియు, అది యీశ్వర స్వరూపమనియు, మహావాక్యవిచారణచేత నెవరు తెలుసుకొనెదరో అట్టి వారు స్వప్నమునుండి మేల్కొనినవారు, స్వప్నదృశ్యము ఏలాగున మిథ్యగా తెలిసికొందురో, ఆలాగున ఈ సంసారస్వప్నమునుండి మేల్కొనిన వారై అజ్ఞానబంధనమునుండి విముక్తులై నిత్యశాంతియగు మోక్షమును బొందు చున్నారు.

**భేదదర్శనమాస్థాయ ముక్తిం వాంఛంతి యే నరాః ।**
**తే మహాఘోరసంసారే పత్యంత్యేవ న సంశయః ॥**

పై జెప్పిన ప్రకారము ఆత్మైకత్వజ్ఞానమును తెలుసుకొనక దేహాది వర్ణములతో గూడిన బుద్ధిగలవారలై మోక్షముకొఱకు ప్రయత్నించువారలు ద్వంద్వరూపమగు మహా ఘోరసంసారమునుండి తరింపజాలరు. సంశయము లేదు.

**సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని ।**
**సంపశ్యన్నాత్మయాజీ స్వారాజ్యమధిగచ్ఛతి ॥**

"ప్రజ్ఞానం బ్రహ్మ"అని పై దెల్పిన మహావాక్యానుసారముగ సర్వప్రాణి కోట్లలోగల ఆత్మవంటిదే తన ఆత్మయనియు, తన ఆత్మవంటిదే సమస్త ప్రాణికోట్లలోగల ఆత్మయనియు, వివేకజ్ఞానముచేత నెవండు తెలుసుకొను చున్నాడో వాడు ఆత్మయజ్ఞమును చేసిన వాడగును. వాడు అమృతమును పానముచేసిన వాడగుటచే స్వాత్మరాజ్యమగు దైవత్వమును బొందగల్గును.

**సర్వభూతాని సంపశ్యన్నాత్మన్యేవ మునీశ్వరాః ।**
**సంసారసాగరాదస్మాదుత్తీర్ణః స్యాదసంశయః ॥**

ఎవండు సర్వభూతములలోగల చైతన్యమును దైవచైతన్యమునుగా జ్ఞానదృష్టిచే తెలుసుకొన్నవాడై తన చైతన్యము అట్టి దైవచైతన్యమే యని యెరింగి ఏకాత్మజ్ఞానము గల్గినవాడుగా నుండునో, ఓ మునీశ్వరులారా! అట్టి వాడు ఆత్మైక్యజ్ఞాన మొక్కదానిచేమాత్రమే సంసారసాగరమునుండి యుత్తీ ర్ణుడు గాగల్గునుగాని వేరు మార్గము లేదు. ఇది నిస్సంశయమైన కార్యము.

**బహవో౽ద్వైత విజ్ఞానాద్విముక్తా భవబంధనాత్ ।**
**అద్వైతజ్ఞానయజ్ఞేన న తుల్యో విద్యతే క్వచిత్ ॥**

సనకసనందన శుక వామదేవాదులగు అనేక మహాత్ములు ఇట్టి అద్వైత జ్ఞానము గలవారగుటచేతనే అజ్ఞానబంధనమునుండి విముక్తులైరి. ఇట్టి అద్వైతమై, ఆత్మానాత్మసంధానమగు జ్ఞానయజ్ఞమునకు సమానమయినదిన్ని, మఱియొకటి పవిత్రమైనదిన్ని మూడు లోకములందును లేదు.

**ద్వైతవిజ్ఞానమాసాద్య ముక్తిం వాంఛంతి యే నరాః ।**
**తే మహామోహసంసారసర్పదష్టా న సంశయః ॥**

పై జెప్పిన జీవేశ్వరుల ఐక్యజ్ఞానమును గలుగజేసుకొనక భేదజ్ఞానము నవలంబించి యే మానవులు ముక్తిని బొందదలంచుదురో అట్టి వారు మహామోహమనెడు సంసారవిషసర్పముచే కరవబడిన వారలని తెలుసు కొనుడు. దీనియందు సందియము లేదు. అనగా పాముకాటు పొందినవానికి చేదైన వేపాకు తీపిగా నుండును. ఆలాగున అజ్ఞానవిషమెక్కిన వారికి విపరీత జ్ఞానముగల్గి యుండునని భావము.

**ఆత్మయాథాత్మ్య విజ్ఞానయజ్ఞం ముక్త్వా నరాధమాః ।**
**క్రియారూపేషు యజ్ఞేషు యతంతే మాయయా౽౽వృతాః ॥**

ఆత్మయొక్క యధార్థమగు ఐక్యజ్ఞానమును శ్రవణమనన నిది ధ్యాసనములతో గూడిన యోగాద్యనుష్ఠానములచేత తెలుసుకొనక క్రియా రూపములగు పశుయజ్ఞములు చేయు నరాధములు మాయామోహముచే

ఆవృతులైనందుచేత దిగ్భ్రమ మొందిన మానవులవలె భ్రమనొందుచున్నారు.

**యే లంఘయంతి సంసారసముద్రం కర్మయజ్ఞితః ।**
**తే మహాతమసా సర్వం పశ్యంత్యేవ రవిం వినా ॥**

పై జెప్పిన ఆత్మయజ్ఞము చేయక యెవరు పశువధ పూర్వకమగు యజ్ఞముచేత సంసారమను దుఃఖసాగరమును తరింపదలంచుచున్నారో, అట్టి వారు సూర్యప్రకాశముచే చీకటి తొలగదని చెప్పి గొప్ప తమస్సుచేతనే అంతయున్ను ప్రకాశింపగలదని నమ్మకము గల్గి దృశ్యవస్తువులను తెలుసు కొనుటకు మహాంధకారములో తిరుగుచుండువారలగుచున్నారు.

**జ్ఞానయజ్ఞోడుపేనైవ బ్రాహ్మణో వాఽంత్యజోఽపి వా ।**
**సంసార సాగరం తీర్త్వా ముక్తిపారం హి గచ్ఛతి ॥**

ముందు చెప్పబడిన ఆత్మనిష్ఠాపరమగు జ్ఞానయజ్ఞమనెడు ఓడచే, బ్రాహ్మణుడైననుసరి, లేక అంత్యజాతియందు పుట్టినవాడైననుసరి, యీ దుఃఖసాగరమగు సంసారమునుండి తరించినవాడై, నిత్యశాంతియగు శాశ్వత సుఖమును పొందగలుగును.

**సర్వధర్మ సమోపేతాశ్శివభక్తిపరాయణాః ।**
**ప్రసాదాదేవ రుద్రస్య జానంతి జ్ఞానవైభవమ్ ॥**

ఎందువల్ల ఇట్టి ఆత్మయజ్ఞపరమగు జ్ఞానము జనులకు తెలియదో, దానికి కారణము తెలుపబడుచున్నది. దైవభక్తి లేకపోవుటయే కారణము. సత్యధర్మనిష్ఠగలవారై దైవభక్తిపరులై యుండువారికి సర్వేశ్వరానుగ్రహము చేతనే అట్టి జ్ఞానము గల్గును. వారే ఆత్మయజ్ఞముయొక్క మహిమ నెఱుంగ గలరు.

**ప్రసాదహీనైః పాపిష్ఠైర్మానుష్యై ర్బ్రాహ్మణోత్తమాః ।**
**జ్ఞానయజ్ఞః పరిజ్ఞాతుం న శక్యం సర్వదా జనైః ॥**

దైవానుగ్రహము లేనివారున్ను, పాపవిషయములో నిష్టము గలవారు

నగు మానవులు జ్ఞానయజ్ఞముయొక్క మహిమను తెలియజాలరు. అందు వలన అట్టి జనులజ్ఞులై యున్నారు. కావున పరిశుద్ధమైన ధర్మము గలవారై దైవ భక్తిగలిగి ప్రయత్నింతురేని దైవకరుణచేత ఇట్టి జ్ఞానమును పొందగలరు. అందువలన నిత్యసుఖస్వరూపు లగుదురు.

ఇది సూతసంహితయందు యజ్ఞవైభవఖండమున దశమాధ్యాయ మందు గలదు.

బీజాంకురన్యాయముయొక్క యధార్థతత్త్వమును తెలుసుకొనక పోవుటచే నెందరు ఎందరి యాత్మలకున్ను, భారతదేశమునకున్ను ద్రోహ మొనర్చిరో, ఆ విషయమై విచారించిన నెవరి హృదయము కరిగి నీరుగా మారి దుఃఖోష్ణములతో గూడిన, బాష్పధార గారక యుండును? ఎందరు బ్రాహ్మణేతరులు ఆత్మవికాసము గలుగక అట్లనే కృశించి పోయిరో, ఎందరు నారీమణులు దైవశక్తిపరమగు వికాసప్రకాశములకు రాజాలక క్రుంగిపోయి నారో, తలంచిన ఓహో! ఎంత పాపకరము. భారతదేశమున కెంత అపకార మొనర్చిన వారమైతిమి!

బీజాంకురన్యాయముయొక్క నిజతత్త్వము తెలియనందుచేగదా! కల్పితములగు దేహములకు బీజాంకురము చెప్పిగదా! ఆత్మశక్తి విజృంభింపక పోయినది. అందువల్లనే గదా! జనులు మృగప్రాయులైపోవుట! అట్టి కారణమునుబట్టియే సర్వోత్కృష్టమైన, యీ భారతభూమి అడుగంటి పోవుట యున్ను, పరులమర్దనలకు లోబడిపోవుటయున్ను, దుఃఖసాగరములో మునుగుటయున్ను జరిగినది. దీనివల్ల గలిగిన యనర్థముచే ఒక్క జాతికేగాక, ఒక సంఘమునకే గాక, భారతదేశమున కంతకును బాధగల్గెను. బ్రాహ్మణాది సర్వజాతులకున్ను, సన్న్యాసాది సర్వాశ్రమములకున్ను ఇది దుస్సహమైన వేదనయై పరిణమించినది. ఆత్మాభివృద్ధికిన్ని ఈ బ్రహ్మహత్యాదోషమే అడ్డు గలుగజేసినది. దీనికన్న ఆత్మద్రోహ మేమున్నది? దీనికన్న దేశద్రోహ మేముండును? దీనికన్న పాపము మరియేమి గలదు? ఓహో! మహా ఘోర

కృత్యము. గొప్పదిగా పెరుగగల్గిన వట వృక్షమును మొలకలలోనే త్రుంచివేసిన నెట్లు పెరుగగలదు? ఆలాగున కల్పవృక్ష సమానమైన జీవకోట్ల యాత్మలను వృద్ధికి రానీయకుండుట కడుంగడు పాతకము.

అయితే, వారి యాత్మాభివృద్ధికి నేమి అడ్డుగలుగజేసినాము. వృద్ధి పొందేలాగున చేసికొనకూడదా? అని కొందరడుగవచ్చును. దీనికి, క్రింద చెప్పబోవు సమాధానము మనము గ్రహించవలసియుండును. బీజము వృక్ష మగుటకు శుద్ధమైన భూమియు, నిర్మలజలము, సూర్యరశ్మియు, శుద్ధ వాయువు, ఆకాశతత్త్వమున్ను కావలసియుండును. ఏలన? బీజము పంచభూ తాత్మకము. అది వృద్ధియగుటకు పంచభూతముల అనుకూలముండే తీరవలెను. లేనిచో, బీజమేలాగున వృక్షము గాగలదు? అదేప్రకారము ఆత్మ వికసించుటకు మొట్టమొదట 1. తగిన యాహారము, 2. యోగ్యమైన విద్యాభ్యాసము, 3. యోగ్యమైన ఆచరణ, 4. యోగ్యమైన జనుల సంసర్గము, 5. యోగ్యులగు వారి యుద్బోధనము - అనగా నీ యుపదేశవాక్యములు గల్గి యుండిన మాత్రమే తనలోగల ఆత్మశక్తి వికసించి ప్రకటితము గాగల్గును. అట్లు గానిచో, విత్తనమును మూటగట్టి పెట్టియుంచి యెందుకు వృక్షము గాకూడదని చెప్పునట్లుండును.

అట్టి అనుకూలమగు ఏర్పాటు ఉండిన యీ నారీమణులలో నిప్పటి కెందఱో మైత్రేయి, గార్గి, చూడాల, దమయంతి మొదలైన వారివంటి స్త్రీ రత్నములుండి యుందురుగదా? ఆలాగున బ్రాహ్మణేతరులలో గూడను విశ్వామిత్ర, జనక, భీష్మ, తులాధార, సూతాదులవంటి మహాపురుషులు గూడ ఆవిర్భవించవలసి యుండెడువారుగదా? అయ్యో! యెటువంటి పుణ్యాత్ము లను పోగొట్టుకొన్నాము. హా! ఎంత కష్టము. దీని కొక చిన్న దృష్టాంతము చూడుడు. ప్రస్తుత ఆంగ్లేయ విద్యలో అందరికిన్ని స్వాతంత్ర్యముండుటే గదా? బ్రాహ్మణులతో సమానముగ విద్యయందును, ఉద్యోగములలోను, బ్రాహ్మణేతరులున్ను, స్త్రీలున్ను ఏర్పడుటకు కారణము

ఇప్పుడు తెలివి తేటలు ఒక జాతికి మాత్రము గాదు. గుణకర్మముల ననుసరించి అందరి లోను గలవను తత్త్వము జనులకు గోచరించినదిగదా! పై జెప్పిన పంచవిధ సంస్కారములు లేనిచో, నే దేశమున్ను, ఏ జాతియు ఉన్నతస్థితికి రాజాలదు. ఇంతవఱకు వచ్చియుండలేదు. ఇట్టి సంస్కారము భారతదేశములో ఎప్పుడైన నుండినట్లు కనుపించుట లేదు. కనుకనే యీ జనులు సూత్రధారిచే తోలుబొమ్మలాడింపబడినట్లు ఇతరులచే ఆడింపబడు చున్నారు. దేశ సంస్కరణము, కాకతాళీయన్యాయము ననుసరించి యెప్పుడో, యెవరికో, ఒకరికి జన్మాంతర సంస్కారము ననుసరించి గల్గెడు దైవజ్ఞానము వంటిది గాదు. ఎట్లన హఠాత్తుగా భూమినుండి ధనము ఒకరికి దొరికియుండ వచ్చును. ఆలాగున అందరును ధనవంతులు గాజాలరు. అది దైవవశమున ఒక్కరికి దొరికిన దొరకవచ్చునేగాని, సర్వజనసమాన మైనది గాదు. సాధారణ విద్యచేతను, కృషిచేతను, ఉద్యోగముచేతను, వ్యాపారముచేతను, జనులు ధనవంతులు గాగలరుగాని వేరుమార్గము లేదు. ఆలాగున జనులయొక్క బుద్ధియు, జ్ఞానమున్ను, అభివృద్ధినొందుటకు సంఘసంస్కరణ మత్యవస రము. సర్వదేశీయులు నిట్టి తత్త్వమును కనుగొనియే లోకోత్తరులైరి.

బీజాంకురన్యాయము దేహమునకు సంబంధించి సాధించుటకు సాహసించువారు గూడ శాస్త్రమును ప్రమాణముగా గైకొందురు. ప్రత్యక్షాది ప్రమాణము లారింటిలో శాబ్దము అనగా ఆగమము నందరును అంగీకరిం పరు. అంగీకరించువారుగూడ అంతయు నంగీకరింపక యథార్థవాదిచెప్పునది, యేకాలముననైన బాధింపబడనిది మాత్రమే అంగీకరింతురు. ఇచ్చటనే దీనియొక్క కీలు గలదు. ఈ చెప్పేలాగున విచారణ చేసి అంగీకరించు పక్షమున శాస్త్రప్రమాణమును అందరున్ను అంగీకరింతురు. ఇది సత్యార్థదృష్టి గలవారి అభిప్రాయము. సత్యాన్వేషులయొక్క నిశ్చయాభిప్రాయము. ఆత్మసోదరులారా! ఇకనైన గుణకర్మముల యోగ్యతలనుబట్టి వారి వారికి తగిన స్థితిలోనికి ప్రవేశించుట కవకాశము కలుగజేయుడు. అప్పుడు దేశము ధన్యతను గాంచును. భారతదేశము తక్కిన దేశము లన్నిటికిన్ని మార్గదర్శి

యగును. సోదరులవలె నందరును సుఖింపగలరు. ఇక మంగళాచరణ పూర్వ కముగా సర్వేశ్వరస్తుతితో యీ వ్యాసము పరిసమాప్తము చేయబడుచున్నది.

## ధ్యానమ్

సౌమ్యం మహేశ్వరం సాక్షాత్సత్యం విజ్ఞానమవ్యయమ్ ।
వందే సంసారరోగస్య భేషజం పరయా ముదా ॥ 1

యస్య ప్రసాదలేశస్య లేశ లేశ లవాంశకమ్ ।
లబ్ధ్వా ముక్తో భవేజ్జంతుస్తం వందే పరమేశ్వరమ్ ॥ 2

యస్య మాయామయం సర్వం జగదీక్షణపూర్వకమ్ ।
తం వందే శివమీశానం తేజోనిధిముమాపతిమ్ ॥ 3

యం విశిష్టజనాః శాంతా వేదాంతశ్రవణాదినా ।
జానంత్యాత్మతయా వందే తమహం సత్యచిత్సుఖమ్ ॥ 4

యస్య శక్తిరుమాదేవీ జగన్మాతా త్రయీమయా ।
తమహం శంకరం వందే మహామాయానివృత్తయే ॥ 5

యస్సమస్తస్య లోకస్య చేతనాచేతనస్య చ ।
సాక్షీ సర్వాంతరః శంభుస్తం వందే సాంబమీశ్వరమ్ ॥ 6

ఒక సూర్యుండు సమస్త జీవులకు దానొక్కొక్కడై తోచు పో
లిక నేదేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుడై యొప్పుచు నుండు నట్టి హరి నే బ్రార్థింతు శుద్ధుండనై ॥



# శ్రీ సనాతన ధర్మసభ

1. ఇది వర్ణాశ్రమములను గురించి మాత్రము తెలిపెడు ఇతర వర్ణాశ్రమసనాతన సభలవంటిదిగాక సనాతనమగు ఆత్మనుగురించియు, ఈశ్వరునిగురించియు, ఆత్మధర్మమునుగురించియు, ఈశ్వరధర్మమును గురించియు ముఖ్యముగా తెలుపుచుండును. కావున దేహమునకు సంబంధించిన వానికే వర్ణాశ్రమధర్మాధిక్యము గలదని తలచువారగు సనాతనులును, ఆత్మకే (యీశ్వరునికే) సనాతనధర్మము గల్గునని నమ్మువారును అగు సనాతనులున్ను మన యీ సనాతన ధర్మసభలో చేరి దీనియందు చెప్పబడిన సాధనలు చేసికొని తరించవచ్చును.

2. ఆత్మపారిశుద్ధ్యహేతువులగు సాధనలనుష్ఠించి సర్వజనులున్ను భవబంధదుఃఖమునుండి విముక్తి పొందవచ్చును. అట్టి యవస్థయే మోక్షమనియు,కైవల్యమనియు, జీవన్ముక్తియనియు, ఈశ్వరప్రాప్తియనియు, పరమపదమనియు మొదలుగాగల పదములచేత చెప్పబడుచుండునని గ్రహించవలయును.

3. దీనిలో చేరువారికి దైవదత్తములగు సమస్తశాస్త్రములను చదువుటకున్ను, దైవప్రాప్తికొఱకు వానిలో చెప్పబడిన సకలసాధనలు చేయుటకున్ను అధికారము గలదు. కాని, భోజనాది కార్యము లన్నియు వారి వారి వర్ణాశ్రమములకు తగినరీతిగా చేసికొనుటలో నేలాటి యాటంకమున్ను లేదు.

4. ఈ సభయొక్క ముఖ్యోద్దేశ్యము బ్రహ్మచారులను తగిన సంస్కారములచేతను, దైవసాధనలచేతను, శుద్ధపరచి సంస్కృతవిద్య మొదలగు నుత్కృష్టశాస్త్రములనునేర్చి ఆత్మోన్నతికొఱకు తయారుచేయుటయు, విద్యాభ్యాసము చాలవఱకు వచ్చిన తర్వాత గృహస్థాశ్రమము స్వీకరించుటకు నిష్టము గలవారిని వారి వారి స్వగృహములకు బంపుటయు, నిష్టములేని వారిని దైవవిషయములోను, లోకసేవలోను ఉండేలాగున నేర్పాటు చేసికొనుటయు నగును. ఆలాగున విరక్తులై బ్రహ్మనిష్ట చేయదలంపుగల స్త్రీలకుగాని, పురుషులకుగాని, వేదాంతశాస్త్రములను అభ్యసింప జేసేలాగున తగిన యేర్పాటు చేసి

యోగసాధనలు నేర్చుకొనుట కిష్టముగలవారి కవియున్ను నేర్పి దైవజ్ఞాన ప్రాప్తికొఱకున్ను, దైవజ్ఞానమును లోకములో బోధించుటకున్ను, యోగ్యత గలిగేలాగున చేయుటయు నగును. వీరిలో తగిన యోగ్యత గలదని తోచు వారికి నిష్టమైనచో సన్న్యాసాశ్రమముగూడ నివ్వవచ్చును.

5. ఏ సమాజమైనను, మొదటనే గొప్ప సంస్థగా నుండజాలదు. సమాజము వృద్ధియగునప్పుడు స్త్రీలకు ప్రత్యేక ప్రదేశమున్ను, ఆలాగున పురుషులకు ప్రత్యేక స్థలమున్ను ఉండవలయును. అంతవఱకు విశేష దూరముగాక ఒకే ప్రదేశములోనే స్త్రీలకు ప్రత్యేకముగా నివాసస్థల మేర్పరచుట కనుకూలముండిన ప్రస్తుత మేర్పరచి, సమాజాభివృద్ధి గల్గునప్పుడు దూరప్రదేశములో ఆశ్రమములు నిర్మించుకొనవచ్చును. స్త్రీపురుషులకు ప్రత్యేకస్థలములే శ్రేయస్కరములుగాని, ఒకే ప్రదేశముననుండుట ఉభయులకున్ను శ్రేయోదాయకముగాదు. వటవృక్షబీజము గొప్పవృక్షమగుటకు కొంత కాలము పట్టును గదా! గంగ, గోదావరి మొదలగు నదుల ప్రారంభ ప్రదేశము చాల చిన్నదిగా నుండియు, క్రమముగా గొప్పపుణ్యనదులై, ప్రవహించి లోకము నేలాగున పునీతము లొనర్చుచున్నవో అట్లే యిప్పుడు కానుపించుచుండు గొప్పసంస్థలు గూడ మొదట నాలాగుననే చిన్నవిగా నుండి కమాభివృద్ధి నొందెను.

6. విరక్తులై శాంతస్వభావము గలవారలై, కరుణాళువులై, దైవనిష్ఠాపరులై యుండువారి కందరికిన్ని వారి వారి మతానుసారముగా దైవప్రాప్తికి తగిన సాధనలు చేసికొనుటకు అవకాశము నీ సంఘము గల్గియున్నది.

7. జనులయొక్క బాహ్యాచారములను మాత్రము పాటింపక అందరిని ఆత్మశుద్ధిగల వారలనుగా జేసికొనుటకు తగిన బోధకులు ఏర్పడి సాధనల నుపదేశించి క్రమక్రమముగా సోదరభావమును వృద్ధిపరచేలాగున నీ సంఘము వారందరున్ను చూడవలయును. అట్లయిన మాత్రమే జగదుద్ధరణము గాగలదు.

8. విశ్వప్రేమను వృద్ధిపరచి ఉపనిషత్తులు, యోగశాస్త్రము మొదలగు

పావనగ్రంథములను వ్యాపకపరచి వానిలోగల అర్థములను జనులకు బోధించి జనులను పాపకార్యములనుండి విముక్తులను చేసి పావనులనుగా నొనర్చుటకు ఈ సంఘము వారు ప్రయత్నపరులై యుండవలెను.

ఇట్లు

మీ చరాచర సుఖాభిలాషి,

**శ్రీ మలయాళస్వామి.**

లోకాస్సమస్తాస్సుఖినో భవంతు

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

# జ్ఞాన యజ్ఞము

**ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానామ్ ।**
**బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మ శివో మే అస్తు సదా శివోమ్ ॥**

సర్వవిద్యానాం = సమస్తవిద్యలకు, ఈశానః = ప్రభువును, సర్వ భూతానాం = సమస్తభూతములకును, ఈశ్వరః = నియామకుడును, బ్రహ్మాధిపతిః = వేదమున కధిపతియు, బ్రహ్మణః = చతుర్ముఖబ్రహ్మకు, అధిపతిః = ప్రభువును, బ్రహ్మ = గొప్పవాడును, సదాశివః = ఎల్లప్పుడు మంగళస్వరూపుడును (అనగా ప్రకృతిదోషములేనివాడును), ఓం = ఓంకార వాచ్యుడునైన పరమాత్మ, మే = నాకు, శివః = మంగళము నిచ్చువాడు, (శుభమును బొందింపజేయువాడు) అస్తు = అగును గాక!

సర్వవిద్యాప్రభువును, సర్వభూతనియామకుడును, వేదమునకును చతుర్ముఖబ్రహ్మకును ప్రభువును, అద్వితీయుడును (అనగా చతుర్ముఖ బ్రహ్మదులలో వ్యాపించి ప్రకాశించుచుండువాడును), సర్వదా నిరవద్య స్వరూపుడైన (అనగా అద్వితీయుడైన), ఓంకార వాచ్యుడైన పరబ్రహ్మము నాకు శుభమును పొందింపజేయువాడగునుగాక! అని ప్రార్థించవలసిన విధముగా ధ్యానము చేయుచున్నాను.

ఈ జ్ఞానయజ్ఞమునకే ఆత్మయజ్ఞమనిగూడ నామాంతరము గలదు. ఇట్టి జ్ఞానయజ్ఞమును కనుగొనుటకొఱకే కర్మయజ్ఞమేర్పడినది. బాహ్యములగు సర్వకర్మకలాపములున్ను, అంతరంగమగు సత్త్వమును అనగా జ్ఞానమును తెలిసికొనుటకొఱకే యేర్పడియున్నవి. ఇట్టి విషయములో మన పూర్వికులగు ఋషిశ్రేష్ఠులు చాల శ్రద్ధవహించిన వారలే. మందమతులకు ఫలాసక్తి మెండగుటచే అట్టివారికి స్వర్గాది ఫలములను నిరూపించి క్రమముగ వారినిగూడ నీశ్వరసాక్షాత్కార జ్ఞానమునకు తీసికొని పోవలెనను తలంపుతో, బాహ్యకర్మములను, వానియొక్క పరలోక సౌఖ్యములను వర్ణించడమైనది. ఇది స్థూలారుంధతీ న్యాయముగ నున్నది. స్థూలారుంధతీన్యాయ మనగా? వివాహ కాలములో కన్యకలకు అరుంధతీదర్శనము చేయించుట కొన్నిప్రదేశములలో

మామూలు ఆచారమై యున్నది. అరుంధతీ నక్షత్రము సూక్ష్మముగా నుండు టచే సమీపములో నుండు స్థూలనక్షత్రములను గనుపరచెడు రీతిగా దీనియొక్క తాత్పర్యమై యున్నది.

మనకు స్థూలదేహము మాత్రము గలదని తలంచువారు గలరా! ఒకవేళ అటువంటి వారుండినచో, వారు జడులుగానో; పశుప్రాయులుగానో యుందురని తలంతురు గదా! దేహమునకు భిన్నుడై జీవుడు (అనగా ఆత్మ) ఏలాగున వేరుగా నుండునో, ఆలాగున స్థూలములగు సమస్త కర్మములకున్ను అంతరార్థమగు సూక్ష్మతత్త్వము గలదు. అది కనుగొనుటకు ఈ స్థూలకర్మ లేర్పడినవేగాని, మఱియొకటి కాదు. కనుకనే విజ్ఞాన ముదయమగునప్పుడు, అజ్ఞాన సంబంధమైన సమస్త కర్మముల నుండి విడుదల చేసుకొని యాత్మ నిష్ఠలో కాలము గడుపుట జరుగుచున్నది.

సూక్ష్మబుద్ధితో విచారించిన నీ కనుపించెడు జగత్సృష్టిగూడ దీనికి సాక్షి యైన యీశ్వరుని గనుగొనుట కొఱకేర్పడినదే. ఈ మహామహిమ గలిగి చిత్ర విచిత్రములగు జగత్తును సృష్టించిన కర్త యొక డుండవలెనను బోధము గల్గు నప్పుడే యీశ్వరునియందు గొప్పభక్తి గల్గును. అద్భుతమైన యంత్రమును గాని, గ్రంథమునుగాని, వస్తువునుగాని, చూచినప్పుడుగదా! అవి నిర్మించిన వారిలో గౌరవభావము గల్గును! అవి లేనిచో వాని నిర్మాతలపై నెట్లు పూజ్య భావము గలుగదో, ఆలాగున నమోఘమగు నీ సృష్టియొక్క వైచిత్ర్యములు గోచరించునప్పుడే సర్వేశ్వరునియందు భక్తివిశ్వాసములు గల్గుట కవకాశమేర్ప డును. ఆలాగున సమస్తములోను గల సూక్ష్మతత్త్వమును కనుగొనవలయును. లేనిచో, దేహమే ఆత్మయని నమ్మినవాని జీవిత మేలాగున జడమైపోవునో, యజ్ఞాదికర్మలయొక్క అర్థమున్ను అటువంటిదే యగును.

ఒక వస్తువును కనుగొనక దానిలో గల రహస్యమును, పరిశీలించుటకు బుద్ధికి ప్రవేశము గలుగదు. ఇది సర్వజనుల ఏకాభిప్రాయమై యున్నది. అట్లు కనుగొనని మానవుండు మోటు మనుష్యుడనియు, జడస్వభావము గలవాడ

నియు, లోకము గ్రహింపగల్గును. ఈ జ్ఞానయజ్ఞవిషయమై గీతలో అ.4లో 25, 26, 27, 28, 29, 30 శ్లోకములను చూడుడు. వీని యర్థము వ్రాయంబూనిన గ్రంథము పెరుగునని తలంచి, మీరే చూచుకొనేలాగున తెలుపడమైనది. ఈ శ్లోకములలో ఆత్మయజ్ఞమును గురించి విశదముగాను, విస్తారముగాను, పదు నాల్గు విధములగు ఆత్మయజ్ఞమును శ్రీకృష్ణభగవాను లుపదేశించియున్నారు. ఇది యథార్థమైన సత్యము. ఇట్టి ఆత్మయజ్ఞము తెలియక కర్మయజ్ఞములను చేయు విషయాసక్తులను గురించి, గీత రెండవ అధ్యాయములో నేలాగున భగవానులు నిందించినారో చూడందగును. అప్పుడే జనులకు కర్మ యజ్ఞములోగల భ్రమ నశింపగల్గును.

**యా మిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్యవిపశ్చితః ।**
**వేదవాదరతాః పార్థ! నాన్యదస్తీతి వాదినః ॥**

**కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్ ।**
**క్రియావిశేష బహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి ॥**

**భోగైశ్వర్య ప్రసక్తానాం తయా పహృతచేతసామ్ ।**
**వ్యవసాయాత్మికాబుద్ధిస్సమాధౌ న విధీయతే ॥**

హే పార్థ! = ఓ అర్జునా!, వేదవాదరతాః = వేదమందును, ఫలములను దెలిపెడు భాగములైన అర్థవాదములయందును ప్రీతిగలవారును, నాన్యద స్తీతి వాదినః = కర్మమునకన్న వేరు పురుషార్థ సాధనము లేదనువారును, కామాత్మానః = విషయాసక్తియైన, కామభోగములచే నిండిన మనస్సుగల వారును (అనగా నీషణత్రయమను త్రాటిచే బంధింపబడినవారు), స్వర్గ పరాః = స్వర్గమే అన్నిటిలో మేలయిన పురుషార్థమని యెంచి యుండువారు నగు, అవిపశ్చితః = వివేకజ్ఞానము లేనివారు (తత్త్వచింతన చేయని అల్పబుద్ధి గలవారు), జన్మకర్మఫలప్రదాం = జన్మమును కర్మమును, కర్మఫలములను నిచ్చునట్టిదియు, భోగైశ్వర్యగతింప్రతి = భోగైశ్వర్యములను బొందుటకొఱకు, క్రియావిశేషబహుళాం = అనేకకర్మభేదములు గలదియు, పుష్పితాం =

ఫలప్రదముకాని కేవలపుష్పములను పూచు బంతిచెట్టులోనగువానివలె పైకి మెఱుగుగనుండి స్వర్గాదులనెడు నల్పసుఖముల నిచ్చునదియునగు, ఇమాం= ఈ, యాంవాచం = ఏ మాటను (మోసపుచ్చునట్టి యే మాటలను), ప్రవదన్తి= చెప్పుచున్నారో, తయా = అట్టి వాక్యముచేత, అపహృతచేతసామ్ = అపహరింపబడిన మనస్సుగలవారును, భోగైశ్వర్య ప్రసక్తానాం = సుఖానుభవము నందును, ఐశ్వర్యమందును ఆశగలవారునగు వారలకు, వ్యవసాయాత్మికా బుద్ధిః = నిశ్చయమైనబుద్ధి (సంస్కరింపబడిన హృదయము), సమాధౌ = చిత్తైకాగ్ర్యమునందు (ఆత్మసాక్షాత్కార సమాధినిష్ఠయందు), న విధీయతే = కలుగనేరదు.

ఓ అర్జునా! వేదమందు, ఫలమును దెలియజేయు అర్థవాదముల యందు ప్రీతిగలవారును; స్వర్గమునకన్న వేరు విశేషఫలము లేదని చెప్పు వారును, పుత్రమిత్ర కళత్రాదులయం దాశగలవారును అగు నవివేకులు భోగైశ్వర్యములను బొందుటకై, యనేక కర్మభేదములను జెప్పునవియు; జన్మమును; కర్మమును, కర్మఫలమును నిచ్చునవియు ఫలములను గలుగజేయని పుష్పములనుబూచు వృక్షములను బోలునవియునగు నే మాటలను జెప్పుచున్నారో, అట్టి మాటలచే నపహరింపబడిన హృదయము గలవారుగను, భోగైశ్వర్యముల యందాశగలవారుగాను నుండువారికి నిశ్చయరూపమైన బుద్ధి గలుగనేరదు. అనగా యజ్ఞము మొదలగు కర్మములకు శ్రేష్ఠమగు ఫలము స్వర్గాదులనియు, యజ్ఞము చేయుటవలన పుత్ర, మిత్ర, కళత్ర, ధన, ధాన్య వస్త్ర, వాహనాది ఫలములుగూడ గలుగుననియు, వేదములయందు ఫలములను దెలియజేయు నర్థవాదములను విని భోగైశ్వర్యాదుల యందాశగలవాని చేత నపహరింపబడిన మనస్సుగలవాని కాత్మస్వరూప జ్ఞానమందుప్రవృత్తియే కలుగదు.

భక్తులారా! శ్రీకృష్ణభగవానుల యాశయము దెలుసుకొన్నారా! బాహ్యములైన పశుహింసాది యజ్ఞములు గిల్టునగలవంటివనియు, దర్భపూత వంటి వనియు భగవానులే సెలవిచ్చియున్నారు. దర్భపూత దూరముగ చూచు

నప్పుడు, బహుసుందరముగ గనుపించినను దానియందు వాసనగాని, విత్తనముగాని యుండదు. అంతేగాక బాహ్యపశుయజ్ఞములో రమించువారు విషయాభిలాష గలవారగుటచే, దానివలన వంచింపబడిన మనస్సుగలవారై నందుచే సాక్షాత్ బ్రహ్మజ్ఞానమందు ప్రవృత్తియే గల్గదని నొక్కి వక్కాణించిరి.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।**

**ఏవం త్రయీ ధర్మమనుప్రపన్నా గతాగతం కామ కామా లభన్తే ॥**

తే = వారు (అనగా కర్మయజ్ఞులు), విశాలం = పుణ్యముయొక్క హెచ్చుతక్కువల ననుసరించి) విస్తారమైన, తం స్వర్గలోకం = ఆ స్వర్గలోకమును, భుక్త్వా = అనుభవించి, పుణ్యే = పుణ్యము, క్షీణే సతి = ముగిసిన తోడనే, మర్త్యలోకం = ఈ మనుష్యలోకమును, విశన్తి = ప్రవేశించుచున్నారు, ఏవం = ఈ ప్రకారముగా (మునుపటి జన్మమందువలె మరల), త్రయీ ధర్మం = కేవలమై, త్రిగుణాత్మకమైన వేదోక్తకర్మమును, అనుప్రపన్నాః = (ఫలాపేక్షతో) అనుష్ఠించెడి వారలగు, కామకామాః = విషయేచ్ఛగలవారు, గతాగతం = రాక పోకలను (చావుపుట్టుకలను), లభన్తే = పొందుచున్నారు.

అట్లు కర్మ యజ్ఞ పరులు తాము చేసిన పుణ్యమునకు తగినట్లు స్వర్గలోకసుఖముల ననుభవించి పుణ్యము ముగిసినతోడనే దేవశరీరమును విడచి భూలోకమందు మఱల జన్మింతురు. అట్టి జన్మములో మఱల యజ్ఞకర్మల నాచరింపక పోయిన స్వర్గప్రాప్తి గల్గదు. దుఃఖమే గల్గును. ఒకవేళ యజ్ఞకర్మల నాచరించిన స్వర్గము నొందవచ్చును అని యీ ప్రకారముగా నర్థవాదములయందు జెప్పబడిన ఫలములయందు గోరికగల యజ్ఞకర్తలు, విషయాసక్తులై, యిహ లోకమునుండి పరలోకమునకు పరలోకమునుండి యీ భూలోకమునకు, ఘటీయంత్రమువలె రాకపోకలు గల్గియుందురు. మఱియు నీ కర్మవిషయమై గల యితరప్రమాణమును జూడుడు.

**యత్సత్యం తదుపాసితవ్యమమునా సత్యం యతో లభ్యతే**
**உసత్యోపాసనయా తథైవ చ ఫలం స్వప్నోత్థరాజ్యాదివత్।**

**ఆయాసే సదృశేఽపి తుచ్ఛఫలదే మార్గే ప్రవృత్తిః కథం**
**మాయావైభవమేతదేవ తదిదం భక్త్యా హరేరాప్యతే ॥**

సత్యమైన బ్రహ్మము నుపాసన చేసినందువలన సత్యమగు బ్రహ్మత్వము వచ్చునుగాన బ్రహ్మానుసంధానపరుడై యుండవలెను. మిధ్యలగు పదార్థముల విషయమై, ప్రవర్తించుట స్వప్నములో రాజ్యపట్టాభిషిక్తుడై యున్నట్లుండును. అది యెట్లసత్యమో అట్టి యసత్యమగు ఫలమునే, బాహ్యాయజ్ఞముచే బొందును. రెండువిధములైన ధ్యానములయందు ప్రవృత్తి సమానమై యుండగా, నీచఫలప్రదమగు మార్గమున జనులేల ప్రవర్తింతురో? అయితే యిది యంతయు, మాయామాహాత్మ్యమని తలంపవలసియున్నది. ఈ మాయా రోగమునకు నిరంతర స్వస్వరూపానుసంధానమే సరియైన మందు. దాని వలననే యీ యవిద్య యను రోగము నశింపవలెను.

నిజముగా విచారించిన యజ్ఞశబ్దమునకర్థము జీవేశ్వరుల కైక్యము గలుగజేసుకొనుటయే యగును. జీవేశ్వరుల కైక్యము గలుగజేసుకొనవలసి యుండిన ఈశ్వరునివంటి గుణము జీవునికిగూడ గలుగవలయును. అట్లు గల్గుటకు జీవునియొక్క ఆత్మ శుద్ధిగావలసియుండును. అట్టి శుద్ధిగావలసి యుండిన విషయవిరక్తి గల్గి ధ్యానయోగముచే; అజ్ఞానమలము క్షయించవలయును. అట్టి దానికి కర్మపరమై విషయసుఖములను వృద్ధిపరచెడు, ఈ పశుహింసాపరమై, రంభాది విషయసుఖముల గలుగజేసెడి కర్మయజ్ఞమేలాగున నుపయోగపడును? ఇది అమృతము నిచ్చించువానికి విషము దొరికినట్లుగదా యగును! అట్లే సూతసంహితాది పవిత్రగ్రంధములు చెప్పుచున్నవి.

**ధ్యానయజ్ఞం వినా ముక్తౌ యతంతే మోహితా జనాః ।**
**పాయసాన్నం పరిత్యజ్య భక్షయంతి మహావిషమ్ ॥**

మోక్షమందభిలాష గలవారలు ఆత్మధ్యానమనెడు జ్ఞానయజ్ఞమును విడిచి కర్మయజ్ఞములోగల అర్థవాదవాక్యములచే మోహితులైన జనులు ఎటు

వంటివారనగా? స్వగృహములో మంచి క్షీరాన్నముండగా దానిని పరిత్యజించి యితరస్థలమునకు పోయి, కాలకూటవిషము గలసిన అన్నమును భుజించెడు వారివలె నుందురు. ఇది ఆత్మశుద్ధిచేతనే గల్గును. అట్లు హృదయశుద్ధికొఱకు విషయవిరక్తి గల్గి ధ్యానయోగము చేయవలయును.

ఆత్మానాత్మ సంధానపరమగు బ్రహ్మనిష్ఠచే గలిగెడు జ్ఞానామృతము, దైవరసామృతము, భక్తిరసము పానముచేసి కృతకృత్యులు కావలసినవారు పశుహింసయు, సోమరస మనబడు ఒక విధమగు మద్యపానమున్ను చేసి నచో బుద్ధిమాలిన్యము గలుగునేగాని, హృదయశుద్ధి యెట్లు గల్గును? దీనికి దృష్టాంతము అనేకసార్లు యజ్ఞముచేసి, పలుసార్లు సోమరసపానము చేసి యుండిన సురేశ్వరాచార్యులే. వారు పూర్వాశ్రమమున మండనమిశ్రుడను పేరుగలవారై యజ్ఞమున కాచార్యులై కర్మకాండమునకు జగద్గురువులై యుండిరి.

శ్రీశంకర భగవత్పాదులు కృపతో అట్టి కర్మకాండ కంటకారణ్యము నుండి వారిని బైటికి తీసి జ్ఞానము బోధించిన తర్వాత, వారు వ్రాసిన నైష్కర్మ్య సిద్ధి యను గ్రంథమును చూడుడు, దానియందు కర్మయజ్ఞాలను గురించి యేమి చెప్పినారో తెలియును. అట్టివారి శిష్యపరంపరలో చేరినవారుగూడ నిట్టి కర్మయజ్ఞపరులై యుండుట కడుంగడు ఆశ్చర్యముగా నున్నది. కావున నిజమైన యజ్ఞమేదియో దానికి కావలసిన సామగ్రు లెవ్వియో, దానివల్ల గల్గెడు ఫలమేమియో దాని కధికారి యెవడో! యీలాటి విషయములను మహానారాయణోపనిషత్తు చెప్పుచున్నది. అజ్ఞానబంధురముగానుండు కారుచీకటినుండి బైటికి రండు. స్వచ్ఛమైన ప్రకాశములో సంచరించుడు. రాజ వీధిలో నడువుడు. కృతార్థులు గాగలరు. జీవకోట్లలో దయగల్గి జీవింపుడు. విషయసుఖములను విషమువలె తలంచుకొనుడు. ఆత్మధ్యాననిష్ఠలో గల అమృతమును పానము చేయుడు. భవరోగము నశించును. శాశ్వతసుఖము లభించును.

తస్యైవంవిదుషో యజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ శరీర మిధ్మఉరో వేదిర్లోమాని బర్హిర్వేదశ్శిఖా హృదయం యూపః కామ ఆజ్యం మన్యుః పశుస్తపోఽగ్నిర్దమః శమయితా దక్షిణా వాగ్ఘోతా ప్రాణ ఉద్గాతా చక్షురధ్వర్యుర్మనోబ్రహ్మశ్రోత్రమగ్నీత్ । యావద్ధ్రియతే సాదీక్షా యదశ్నాతి తద్ధవిః యత్పిబతి తదస్య సోమపానం యద్రమతే తదుపసదో యత్సఞ్చ రత్యు పవిశత్యుత్తిష్ఠతే చ సప్రవర్గ్యః యన్ముఖం తదాహవనీయో యదస్య విజ్ఞానం తజ్జుహోతి యత్సాయం ప్రాతరత్తి తత్సమిధో యత్సాయం ప్రాతర్మధ్యదినం చ తాని సవనాని । యే అహోరాత్రే తే దర్శపూర్ణమాసౌ యే అర్ధమాసాశ్చ మాసాశ్చ తే చాతుర్మాస్యాని య ఋతవస్తే పశుబన్ధా ఏ సంవత్సరాశ్చ పరివత్సరాశ్చ తేఽహర్గణాః సర్వవేదసంవా ఏతత్సత్రం యన్మరణం తదవభృథః । ఏతద్వైజరా మర్యమగ్ని హోత్రం సత్రం య ఏవం విద్వానుదగయనే ప్రమీయతే దేవానామేవ మహిమానం గత్వా ఆదిత్యస్య సాయుజ్యం గచ్ఛత్యథ యోదక్షిణే ప్రమీయతే పితౄణామేవమహిమానం గత్వా చన్ద్రమసస్సాయుజ్యం గచ్ఛతి । ఏ తౌవై సూర్యాచన్ద్రమసోర్మహిమానౌ బ్రాహ్మణో విద్వానభిజయతి తస్మాద్బ్రహ్మణో మహిమానమాప్నోతి తస్మాద్బ్రహ్మణో మహిమాన మిత్యుపనిషత్ ॥

యజ్ఞస్య = యాగమునకు (ఆత్మయజ్ఞమునకు), తస్య = అటువంటి, ఏవం విదుషః = ఇట్లు స్వరూపజ్ఞానమును దెలుసుకొనిన విద్వాంసునియొక్క, ఆత్మా = ఆత్మస్వరూపమే, యజమానః = యజమానుడు (యాగమును చేయువాడు), శ్రద్ధా = ఆస్తిక్యబుద్ధి, పత్నీ = భార్య, శరీరం = దేహము, ఇధ్మః= సమిత్తు, ఉరః = వక్షఃస్థలము (అంతఃకరణము), వేదిః = యజ్ఞవేదిక, (అగ్నినుంచుట కలంకరించిన ప్రదేశము), రోమాని = వెంట్రుకలు (శరీరమం దుండెడి రోమములు), బర్హిః = దర్భ, శిఖా = జుట్టు, వేదః = వేదము, హృదయం = హృదయము, యూపః = యూపము (యజ్ఞపశువును గట్టెడి స్తంభము), కామః = విషయాభిలాష, ఆజ్యం = నెయ్యి, మన్యుః = క్రోధము, పశుః = పశువు, తపః = తపస్సు, అగ్నిః = అగ్ని, దమః= దమము, శమ

యితా = శాంతిగలుగుట (ప్రకృతియొక్క వికృతులు శమించుట; లేక శాంతి నొందుట), దక్షిణా = యజ్ఞ దక్షిణ, వాక్=వాక్కు, హోతా = హోమము చేయువాడు (ఋగ్వేదము చదివిన ఋత్విక్కు), ప్రాణః = ప్రాణము, ఉద్గాతా= ఉద్గాత (యజ్ఞమునందు సామగానము చేయువాడు), చక్షుః = నేత్రము, అధ్వర్యుః= అధ్వర్యుడు (యజుర్వేదము చదివిన ఋత్విక్కు), మనః= మనస్సు, బ్రహ్మ = బ్రహ్మ, శ్రోత్రం = చెవి, అగ్నీత్ = అగ్నులు (త్రేతాగ్నులనగా దక్షిణాగ్ని, గార్హపత్యాహవనీయములు), యావత్ = ఎంతమట్టుకు, ధ్రియతే = ధారణచేయబడునో, సా = అది, దీక్షా = యజ్ఞదీక్ష, యత్ = ఏది, అశ్నాతి = తినుటో, తత్ = అవి, హవిః = హవిస్సు, పిబతి = త్రాగుటో, తత్ = అది, అస్య = యీ యజ్ఞమునకు, సోమపానం = సోమ పానము, యత్ = ఏది, రమతే = ఆత్మలో రమించుటో, తత్ = అది, ఉపసదః = ఉపసదము (యజ్ఞమునం దగ్నిసమీపమున నియమముతో నుం డుట), యత్ = ఏది, సంచరతి = తిరుగుటో, ఉపవిశతి= కూర్చుండుటో, ఉత్తిష్ఠతే చ = నిల్చుటో, సః = అది, ప్రవర్గ్యః = ప్రవర్గ్యమను యాగవిశేషము, యత్ = ఏది, ముఖం = ముఖమో, తత్ = అది, ఆహవనీయః = ఆహవనీయాగ్ని, అస్య = యీ యజమానియొక్క, జ్ఞానం= విశేషజ్ఞానము, యత్ = ఏదియో, తత్ = అది, జుహోతి = హోమము చేయుట, సాయంప్రాతః = సాయంకాల ప్రాతఃకాలములందు, యత్ = ఏది, అత్తి=తినుటో, తత్ = అది, సమిధః = సమిత్తు, సాయం=సాయంకాల మును, ప్రాతః = ప్రాతఃకాలమును, మధ్యందినం = మధ్యాహ్న కాలమును, యత్ = ఏదియో, తాని = అవి, సవనాని = సవనములు (యజ్ఞములు), అహోరాత్రే = రాత్రింబవళ్ళు, యే = ఏవియో, తే = అవి, దర్శపూర్ణమాసౌ= అమావాస్యా పూర్ణిమలు, అర్ధమాసాశ్చ = పక్షములున్ను, మాసాశ్చ = నెలలును, యే=యేవియో, తే = అవి, చాతుర్మాస్యాని = చాతుర్మాస్యములు, ఋతవః= ఋతువులు (వసంతము మొదలైన ఆరు ఋతువులును), యే = యేవియో, తే = అవి, పశుబంధాః = పశుబంధములు (యజ్ఞపశుబంధనములు),

సంవత్సరాశ్చ = సంవత్సరములును, పరివత్సరాశ్చ = పరివత్సరములును, (పరివత్సరమనునదియును, సంవత్సరమనునదియును నీ రెండును అబ్దభేదములు), యే = యేవియో, తే = అవి, అహర్గణాః = దివసములయొక్క సమూహములు, ఏతత్సత్రం = ఈ యాగము, సర్వవేదసంవా = సర్వస్వ దక్షిణయాగము (సర్వధనమును దక్షిణగా నిచ్చెడియజ్ఞము), మరణం= చావు, యత్ = యేదియో, తత్ = అది, శరీరమునువిడుచుట, అవభృధః= యజ్ఞాంతస్నానము అనగా యజ్ఞము కడపట చేయునట్టి పుణ్యస్నానము, ఏతద్వై = ఇదియే, జరామర్యం = వయోహానిచేత సమాప్తి చేయదగిన (బ్రతికియున్నంతకాలముచేయదగిన) అగ్నిహెూత్రం= అగ్నిహెూత్రము (ఆత్మయజ్ఞము), సత్రం = యాగము, ఏవం = ఈ ప్రకారము విద్వాన్ = తెలుసుకొనిన, యః = ఎవడు, ఉదగయనే = ఉత్తరాయణమునందు, ప్రమీయతే = మరణము నొందుచున్నాడో (సః = వాడు), దేవానాం = దేవతలయొక్క, మహిమానమేవ = సామర్థ్యమునే, గత్వా= పొంది, ఆదిత్యస్య = సూర్యునియొక్క, సాయుజ్యం = కూడికను (ఏకత్వమును), గచ్ఛతి = పొందుచున్నాడు. అధ = మరియు, యః = ఎవడు, దక్షిణే = దక్షిణాయనమందు, ప్రమీయతే = మరణమును పొందుచున్నాడో, సః= వాడు, పిత్రూణాం= పితృదేవతలయొక్క, మహిమానమేవ = సామర్థ్యమునే, గత్వా = పొంది, చంద్రమసః = చంద్రునియొక్క, సాయుజ్యం = కూడికను, గచ్ఛతి = పొందుచున్నాడు, సూర్యాచంద్రమసోః = సూర్యచంద్రులయొక్క, ఏతౌ = ఈ, మహిమానౌ = సామర్థ్యములను, వై = ప్రసిద్ధముగా, విద్వాన్ = తెలుసుకొనిన, బ్రాహ్మణః = బ్రహ్మనిష్ఠుడు, అభిజయతి = సర్వోత్కర్షముగా నుంటున్నాడు, తస్మాత్ = అందువలన, బ్రహ్మణః = బ్రహ్మము యొక్క, మహిమానం = సామర్థ్యమును, ఆప్నోతి = పొందుచున్నాడు, తస్మాత్ = అందువలన, బ్రహ్మణః = బ్రహ్మము యొక్క, మహిమానం = సామర్థ్యమును, ఆప్నోతి = పొందుచున్నాడు, ఉపనిషత్ = ఉపనిషత్తు, ఇతి = సమాప్తము.

ఈ ప్రకారముగా విద్వాంసునిచేత జేయబడు ఆత్మహవిస్సమర్పణ

రూపమైన యజ్ఞమునకు ప్రసిద్ధమైన యజ్ఞాంగములయొక్క అపేక్షలేక పోవుటచేత శ్రేష్ఠతను చూపించుచున్నాడు. ఇట్లుతెలిసిన వానియొక్క ఆత్మయే యజ్ఞమునకు యజమానుడు. ఆస్తిక్యబుద్ధియే పత్ని (ఆస్తిక్యబుద్ధి యనగా, గురుదైవతశాస్త్రములలోగల విశ్వాసము), దేహమే సమిత్తు. (సమిత్తు అనగా హెూమమునకు కావలసిన మోదుగ మొదలగు వాటికట్టెలు). వక్షః స్థలాంతర తాంతఃకరణము యజ్ఞవేదిక. శరీరమునందలి వెంట్రుకలు దర్భ, జుట్టు వేదము, హృదయము యజ్ఞ పశువును కట్టెడి స్తంభము, దృశ్య విషయాభిలాష నెయ్యి, క్రోధము పశువు, తపస్సు అగ్ని, దమశమములు దక్షిణ, వాక్కు ఋత్విక్కు, ప్రాణము ఉద్గాత, నేత్రము అధ్వర్యుడు, మనస్సు బ్రహ్మ, శ్రోత్రమగ్నులు. ఎంతమట్టుకు ధారణ చేయుటో అది యజ్ఞదీక్ష, ఏది తినుటో అది హవిస్సు, ఏది త్రాగుటో అది యీ యజ్ఞమునకు సోమపానము. ఏది క్రీడించుటో అది ఉపసదము. ఏది తిరుగుటో కూర్చుండుటో నిలుచుటో అది ప్రవర్గ్యము. ఏది ముఖమో అది ఆహవనీయాగ్ని. స్వీకరించు ఆహుతులే ఆహుతులు. యజమానునియొక్క విజ్ఞానమేదో అది హెూమము. ఏది సాయంకాల ప్రాతఃకాలాహారమో అది సమిత్తు. సాయంకాలమును ప్రాతః కాలమును మధ్యాహ్నకాలమును ఏవియో అవి సవనములు. ఏవి ఆహో రాత్రముల అవి దర్శపూర్ణమాసములు, ఏవి అర్ధమాసములు, మాసములో అవి చాతుర్మాస్యములు, ఋతువులు పశుబంధములు. సంవత్సరములును, పరివత్సరములును దివసములయొక్క సమూహములు. ఈ యాగము సర్వ స్వదక్షిణ యాగము. చావు యజ్ఞాంత పుణ్యస్నానము. ఇదే యావత్కాలము బ్రహ్మనిష్ఠుండు చేయవలసిన ఆత్మయజ్ఞము.

ఇట్లు ఈ మంత్రమునందు చెప్పబడిన ప్రకారముగా దేహావయవము లను ఆయావ్యాపారములను సమస్తములైన యజ్ఞాంగములనుగా దెలిసికొని, యుపాసించెడి విద్వాంసుడు ఉత్తరాయణమునందు మరణము నొందిన వాడై, దేవతలయొక్క సామర్థ్యమును పొంది సూర్యసాయుజ్యమును పొందు చున్నాడు. దక్షిణాయనమునందు మరణమును పొందినవాడు పితరుల

సామర్థ్యమును పొంది చంద్రునియొక్క సాయుజ్యమును పొందుచున్నాడు. ఇట్టి సూర్యచంద్రుల మహిమను తెలుసుకొనిన బ్రహ్మజ్ఞాని సర్వోత్కృష్టుడగు చున్నాడు. అందువలన అట్టివాడు పరబ్రహ్మమహిమను పొందుచున్నాడు.

దీని యందు ఇట్టి ఆత్మయజ్ఞమును చేయువానికిగూడ ఉత్తరాయణ ప్రాప్తియని చెప్పబడియున్నది. అది యెందుకనగా; ఇచ్చటనే బ్రహ్మసాక్షాత్కార స్వరూపజ్ఞానముగల్గి విదేహముక్తిని ఒకవేళపొందకపోయినను ఉత్తరాయణ మార్గముగా సూర్యలోకము నొంది మఱల ఆవృత్తి గలుగక అచటినుండి బ్రహ్మలోకము ప్రాప్తించి బ్రహ్మదేవునివల్ల బ్రహ్మాత్మైక్యజ్ఞానము గలుగుటకు ఉపదేశము పొందుటగాని లేక బ్రహ్మదేవునితో సహా విదేహకైవల్యమును పొందుటగాని గల్గునేగాని, కామ్యకర్మలను చేయువారివంటి స్వర్గలోక ప్రాప్తియు, పునరావృత్తియు గలుగనేరదు.

దక్షిణాయన విషయమున్ను, చంద్రలోకప్రాప్తియు చెప్పుటకు కారణ మేమన? అట్టి మార్గముగూడ శాస్త్రములలో ప్రతిపాదింపబడినను అది యిట్టి ఆత్మయజ్ఞము చేయువారికి గలుగనేరదు. పశుయజ్ఞపరులగు కర్మఠులకు దక్షిణాయనప్రాప్తిగూడ గలుగవచ్చును. మఱియు సూర్యుని వంటి ప్రకాశమైన ఆత్మబోధమనెడు ఎరుక గలిగి దేహము వీడిపోవు వారు ఉత్తరాయణప్రాప్తిని, ఆత్మబోధము లేక, తమస్సుతో ఆవరింపబడిన స్థితిలోగలవారు దేహవియోగానంతరము చంద్రలోకప్రాప్తిని బొందుదురు. అవి రెండు ఇడాపింగళలకు సంబంధించిన సూర్యచంద్రనాడు లగును. వీటి రెండింటికి మధ్యనుండు సుషుమ్నానాడిలో నుండు మహాత్ముడు అఖండైక జ్ఞానస్వరూపముగల వాడగుటచే పైజెప్పిన వారికివలె లోకాంతరప్రాప్తి అట్టి యోగికి గలుగక బ్రహ్మాత్మైక్య జ్ఞానసాక్షాత్కార మిచ్చటనే గల్గి పరిపూర్ణ మోక్షసౌఖ్యము నొందగల్గును.

మహానారాయణోపనిషత్తునందు ఈ ఆత్మయజ్ఞమును ఆఖరున చెప్పుట ఈ చరాచర జగత్తంతట బ్రహ్మభావన గల్గియుండుటయే గొప్ప జ్ఞానయజ్ఞమని తెలుపుటకొఱకై యుండును.

ఇక సత్యశాంతశమదమాదుల మహిమను స్తోత్రము చేసెడు ఉపనిష ద్వచనములు కొన్ని వ్రాయబడుచున్నవి. ఇది సాక్షాత్ చతుర్ముఖబ్రహ్మ ఉపదేశించిన దివ్యవచనములని గ్రహించియైనను మీరు నమ్మిక గలవారై ఆచరింతురుగాక! ఇది పరమ ఋషియగు ఆరుణి యను పేరుగలవారు సత్యధర్మములయొక్క మహిమను దెలుసుకొనుటకు బ్రహ్మను అడిగిన విషయముగా నున్నది.

**ప్రాజాపత్యో హారుణి స్సొపర్ణేయః ప్రజాపతిం పితరముపససార కిం భగవన్తః పరమం వదంతీతి, తస్మై ప్రోవాచ । సత్యేనవాయురావాతి సత్యేనాదిత్యో రోచతే దివి సత్యం వాచః ప్రతిష్ఠా సత్యే సర్వం ప్రతిష్ఠితం తస్మాత్సత్యం పరమం వదన్తి । తపసా దేవా దేవతా మగ్రఆయం స్తపసార్షయస్సువరన్వవిన్దం స్తపసా సపత్నాన్ప్రణుదామారాతీం స్తపసి సర్వం ప్రతిష్ఠితం తస్మాత్తపః పరమం వదన్తి । దమేన దాంతాః కిల్బిష మవధూన్వన్తి దమేన బ్రహ్మచారిణ స్సువరగచ్ఛన్ దమో భూతానాం దురాధర్షం దమే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్దమః పరమం వదన్తి । శమేన శాన్తా శ్శివ మాచరన్తి శమేన నాకం మునయోఽన్వవిన్దన్ శమో భూతా నాం దురాధర్షం శమే సర్వం ప్రతిష్ఠితం తస్మాచ్ఛమః పరమం వదన్తి । దానం యజ్ఞానాం వరూథం దక్షిణా లోకే దాతారం సర్వభూతాన్యుపజీ వన్తి దానే నారాతీ రన్తపానుదన్తి । దానేన ద్విషన్తో మిత్రా భవన్తి దానే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్దానం పరమం వదన్తి । ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పన్తి ధర్మేణ పాపమపనుద తి ధర్మే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్ధర్మం పరమం వదన్తి ॥**

ప్రజాపతి పుత్రుడగు అరుణి యనువాడు తండ్రియొద్దకు పోయి తండ్రినిగూర్చి ఓ స్వామీ! పూజ్యులగు పెద్దలు దేనిని శ్రేష్ఠముగా చెప్పు చున్నా రని అడుగగా కుమారుడైన అరుణుని కొఱకు ప్రజాపతి చెప్పుచున్నాడు. “ఓయీ! సత్యముచేతనే వాయువు వీచుచున్నది, సత్యముచేతనే సూర్యుడు

అంతరిక్షమునందు ప్రకాశించుచున్నాడు. సత్యమే వాక్కునకు ఉనికి యైనది. సత్యమునందే సర్వము అణగియున్నది. కనుక సత్యమునే శ్రేష్ఠముగా చెప్పుచున్నారు. ఇదే ప్రకారము తపస్సును, బాహ్యేంద్రియ నిగ్రహమగు దమమును, అంతరింద్రియ నిగ్రహమగు శమమును, దానమును, ధర్మమును - వీటిని ఈ మంత్రమునందు చెప్పిన ఆయా కారణములవలన శ్రేష్ఠములనుగా చెప్పుచున్నారు. బ్రహ్మజ్ఞానియొక్క అభివృద్ధి యంతయు, పైజెప్పిన సత్య ధర్మ శాంత, శమ దమాదులలో గలదు. వీనిని ప్రాణముకన్న ఎక్కువ ప్రేమించువారు ఋషులచే పొందబడిన దైవస్థితి పొందగల్గుదురు. ఇక కర్మయజ్ఞముయొక్క నిందయు, జ్ఞానయజ్ఞముయొక్క మహిమయు సూతసంహితలో చెప్పబడినది చూడుడు.

**ధ్యానయజ్ఞం వినా కించిత్కుర్వాణో ముక్తిసిద్ధయే ।**
**అక్ష్ణాఽపి శబ్దం గృహ్ణాతి వినా శ్రోత్రేణ కేవలమ్ ॥**

ధ్యానయజ్ఞమనెడు ఆత్మయజ్ఞమును విడనాడి ముక్తికొఱకు కర్మయజ్ఞమును చేయువాడు చెవితో వినవలసియుండు శబ్దమును, అట్లు వినక కన్నుతో వినేలాగున ప్రయత్నించువానివలె కేవలము మూఢు డగును.

**అశ్వమేధాదయో యజ్ఞా అశేషా వేదదర్శితాః ।**
**మునీంద్రా ధ్యానయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్ ॥**

ఓ శౌనకాది మునులారా! కర్మలను బోధించెడు వేదములోగల భాగములో నేయొక్క అశ్వమేధాది యాగముల ఫలము చెప్పబడియున్నదో, అది ధ్యానయజ్ఞముచే గల్గెడు ఫలముయొక్క పదునారింటిలో గల ఒక భాగమునకైన సరిపోజాలదు.

**ధ్యానయజ్ఞపరో మర్త్య శ్శివ ఏవ న చాపరః ।**
**ధ్యానయజ్ఞైకనిష్ఠస్య న కించిదపి దుర్లభమ్ ॥**

ధ్యానయజ్ఞపరుడైన మానవుడు సాక్షాత్ ఈశ్వరస్వరూపుడేగాని,

సామాన్యమర్త్యుడు గాడు. అట్టి ధ్యానయజ్ఞయందు నిష్ఠగల బ్రహ్మనిష్ఠునికి ముల్లోకములందును లభింపదగినది మఱియొకటి లేదు, లభింప సాధ్యము గానిదిన్ని లేదు. అనగా అట్టి మహాపురుషున కసాధ్య మయినది మఱియొకటి లేదు.

**ధ్యానయజ్ఞ పరాణాం తు ప్రసాదం కురుతే శివః ।**
**శివోఽపి సాక్షాత్సర్వజ్ఞః సంసార వినివర్తకః ॥**

ధ్యానయజ్ఞమందు నిష్ఠ గలవా రెవరు గలరో అట్టి వారిని పరమేశ్వరు డనుగ్రహించుచుండును. ఈశ్వరుండు నిత్యమంగళస్వరూపుడు. సాక్షాత్సర్వ జ్ఞుడు. అట్టి పరమేశ్వరుని కృపగలవారు సంసార దుఃఖనివృత్తి గలవారగు దురు.

**బహునో క్తేన కిం సర్వం సమాసేన మయోదితమ్ ।**
**కురుధ్వం వేదవిన్ముఖ్యాః ధ్యానయజ్ఞమశంకితాః ॥**

వేదవేదాంత సారమెరిగిన వారిలో ముఖ్యులగు ఋషులారా! విస్తార ముగా నేల చెప్పవలయును, సంగ్రహముగా చెప్పుచున్నాను. అదేమనగా? మీరు నిస్సంశయులై ధ్యానయజ్ఞము నాచరింపుడు. దీనివల్ల మీరు ముక్తులు గాగలరు. లోకమున్ను మంగళకరము గాగల్గును.

**అపి దేవా న జానంతి జ్ఞానయజ్ఞస్య వైభవమ్ ।**
**కిం పునర్మానవా విప్రాశ్శివో జానాతి తత్త్వవిత్ ॥**

ఓ ఋషిసత్తములారా! ఈ జ్ఞానయజ్ఞముయొక్క మహిమను దేవ తలుగూడ నెరుంగజాలరు. అట్లుండగా సామాన్యమానవు లేమి తెలుసుకొన గలరు? దీనియొక్క మహిమను సంపూర్ణముగా నెరింగినవాడు సాక్షాత్ ఈశ్వరు డొక్కడే గలడు.

జనులారా! ఇంతవఱకు చెప్పిన శ్రుతిస్మృతుల ప్రబోధమును వినినయైన మీ రాత్మధ్యానజ్ఞాన యజ్ఞములో ప్రవేశించిన వారలై శాశ్వత దైవసుఖమును

పొందే లాగున ప్రవర్తింతురుగాక!

నైష్కర్మ్యసిద్ధిలో శ్రీసురేశ్వరాచార్యులు అనగా పూర్వమీమాంసాకర్మ యజ్ఞములకు ఆచార్యుడై యుండిన మండనమిశ్రుడు వచించినది జూడుడు.

**ఇతి హ్యాప్తధియాం వాచః స్వప్రజ్ఞాధ్మాతచేతసామ్ ।**
**ఘుష్యంతే యజ్ఞశాలాసు ధూమానద్ధధియాం కిల ॥**

ఈ పూర్వపక్షవాది కర్మలయం దతిశ్రద్ధగలవాడై నిరంతరము 'జ్యోతిష్టోమ చాతుర్మాస్యాది' యాగములను చేయుచు యాగశాలయందే యున్నందున అతనిచిత్తము అచ్చటి పొగచేత వ్యాపింపబడి మలినమైపోవుటచే విభ్రాంతుడై యీ విధముగా ఘోషించుచున్నాడుగదా! అనగా యజ్ఞశాలలో గల పొగచే నేత్రములలో మసిగూడి వేదార్థవిచారమును చక్కగా విచారింప శక్తి లేని కారణముచే కర్మయజ్ఞపరులై బద్ధులగుచున్నారు. వేదార్థమును తెలుసుకొనుటకు విషయవిరక్తియు, ఇంద్రియవిగ్రహము, ఆత్మసంయమము, కుశాగ్రబుద్ధి, అంతఃకరణశుద్ధి గల్గియుండవలయును గదా! అట్టి యోగ్యత కామ్యకర్మములను, భేదకర్మముల నాశ్రయించి ఇహాముత్ర కామ్యకర్మఫల భోగాసక్తులగు వారికి గల్గునా?

**అగ్నిముగ్ధో హ వై ధూమితాంతః స్వం లోకం న ప్రతి**
**ప్రజానాతి ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః ॥**

అగ్నిసాధ్యములైన కర్మలయందత్యంతాసక్తి గలవాడు పొగచే నావరింపబడిన చిత్తము గలవాడై స్వకీయమైన స్వరూపమును (ఆత్మతత్త్వమును) ఎఱుంగజాలడు. యజ్ఞములనెడు సాధనలతో సాంసారిక దుఃఖసాగరమును భరింపజూచువాడు ఓటియోడలో సాగరతరణమును చేయదలంచిన వానివలె భ్రమనొందిన వాడగును.

**అంతరేణ విధిం మోహాత్ యః కుర్యాత్సాంపరాయికమ్ ।**
**న తత్స్యాదుపకారాయ భస్మనీవ హుతం హవిః ॥**

ఏ పురుషుడు విధిచోదితమగు వైరాగ్యబోధోపరతిని బొంది బ్రహ్మ విచారము చేయక కామ్యకర్మలనే చేయుచుండునో వాడు మోహవశుడై యున్నాడు. వీని యీ యజ్ఞకర్మలు పరలోక ప్రాప్తి యగు ముక్తికొఱకు ఇచ్ఛ గలిగించెడివైనను అవి బూడిదలో హోమము చేసిన హవిస్సువలె వ్యర్థమగు నేగాని ఆత్మసుఖమును గలుగజేయవు.

**అతస్సర్వాశ్రమాణాం హి వాఙ్మనఃకాయకర్మభిః ।**
**స్వనుష్ఠితైర్యథాశక్తి ముక్తిస్స్యాన్నాన్యసాధనాత్ ॥**

కావున బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములలోనుండు వారికెవరికైనను చక్కగా అనుష్ఠింపబడిన మనోవాక్కాయ కర్మల శుద్ధిచేతనే మోక్షము సిద్ధించును; అనగా సాత్త్వికాహార బ్రహ్మచర్య తపస్సులచే కాయ శుద్ధియు, సత్యదయా శాంతములు గల్గి ఉపనిషత్పఠన ప్రణవాది జపములచే వాక్శుద్ధియు, వైరాగ్యబోధోపరతులచే మనశ్శుద్ధియు గలవారెవరైనను అట్టి వారికి మోక్షము గల్గునేగాని యిట్టి భక్తివైరాగ్య కారుణ్యములు లేనివారు ఇతర కర్మలెన్ని చేసినను మోక్షము గలుగదు.

**అయథావస్త్వవిద్యా స్యాద్విద్యా తస్యా విరోధినీ ।**
**సముచ్చయస్తయోరేవం రవిశార్వరయోరివ ॥**

అజ్ఞానముచేత కల్పింపబడిన కర్తృత్వ భోక్తృత్వాద్యభిమానమును నిమిత్తముగా చేసుకొని ప్రవర్తించుచున్నందున కర్మ అవిద్య యనంబడును. కర్తృత్వాది సర్వాభిమాన శూన్యమైన అకల్పితమైన పరమార్థవస్తువు నవలం బించి ప్రవర్తించుచున్నందున జ్ఞానము విద్య యనంబడును. ఇట్టి కర్మజ్ఞాన ములు స్వభావముచేతనే పరస్పర విరుద్ధము లైనందున సూర్యుడు, అంధ కారము ఈ రెండు నొకచోట చేరియుండనటుల సముచ్చయమును బొంద నేరవు. అనగా బాహ్యయజ్ఞమునకున్ను, ఆత్మయజ్ఞమునకున్ను అంధకార ప్రకాశములకువలె తారతమ్యము గలదని బ్రహ్మనిష్ఠులు గ్రహించుకొన వలయును.

ఇక నీ విషయమై విస్తారముగా చూడగోరువారు నైష్కర్మ్య సిద్ధియను ప్రకరణ గ్రంథమును చూచుకొనవచ్చును. శ్రీశంకరులున్ను ఆత్మబోధములో నుపదేశించినది చూడుడు.

**అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్ ।**
**విద్యాఽవిద్యాం నిహంత్యేవ తేజ స్తిమిరసంఘవత్ ॥**

ప్రపంచ సంబంధమైన అజ్ఞానము (మూలప్రకృతి) ఎట్లవిద్యాజన్యమో, ఆలాగుననే ప్రపంచోపభోగకారణములగు యజ్ఞాది బాహ్యకర్మలును, ప్రకృతి జన్యములే యగుటచేత జన్యజనకములగు కర్మ అజ్ఞానములకు పరస్పరవిరోధము లేదు; కావున కర్మ అజ్ఞానమును నశింపజేయజాలదు. జ్ఞానము ప్రకృతి జన్యము కాదు. స్వయంప్రకాశరూపము. కావున తేజఃపుంజము తిమిర సంఘమును హరించునట్లు అవిద్యను తప్పక హరించును, జన్యజనక మనగా? వృక్షమునకున్ను బీజమునకున్ను నుండు సంబంధము. ఏ జంతుసంతతి ఆ జంతువుగానే యున్నట్లు అగును. కరణములచే చేయబడు బాహ్యయజ్ఞాది కర్మలు అవిద్యాకల్పితములు. బ్రహ్మచింతన యింద్రియవృత్తిరహిత పరమై సాక్షియగు దివ్యజ్ఞాన మగుటచే చీకటిని ప్రకాశము నశింపజేయునట్లు అట్టి ఆత్మయజ్ఞము అజ్ఞానమును నశింపజేయును.

ఇక ముక్తిని బొందెడు క్రమమార్గమును శ్రీ సురేశ్వరార్యులే యుపదేశించి యున్నారు. చూడుడు.

**నిత్యకర్మానుష్ఠానాద్ధర్మోత్పత్తిః, ధర్మోత్పత్తేః పాపహానిః,**
**తతశ్చిత్తశుద్ధిః, తతస్సంసార యాథాత్మ్యావబోధః,**
**తతో వైరాగ్యం, తతో ముముక్షుత్వం, తతస్తదుపాయ**
**పర్యేషణం, తతస్సర్వకర్మతత్సాధన సంన్యాసః,**
**తతో యోగాభ్యాసః, తతశ్చిత్తస్య ప్రత్యక్ప్రవణతా,**
**తతస్తత్త్వమస్యాది వాక్యార్థపరిజ్ఞానం తతోఽవిద్యోచ్ఛేదః,**
**తతః స్వాత్మన్యేవావస్థానమ్ ॥**

నిత్యనైమిత్తిక పుణ్యకర్మలను భక్తిశ్రద్ధలు గల్గి యీశ్వరార్పణ బుద్ధితో ఆచరించి వాటి ఫలమును పరమేశ్వరునకు సమర్పించుచుండగా కొంత కాలమున కాపురుషునియొక్క మనస్సునందు పాపములను నశింపజేయు నట్టి అదృష్టము జనించును. ఆ యదృష్టము జనించినందువలన చిత్తము నందు గల పాపదోషములు నశించిపోవును. పాపములు నశించినతోడనే చిత్తము దర్పణమువలె నిర్మలమై నిత్యవస్తువును, అనిత్యవస్తువును వివేకించి తెలుసుకొనెడి సామర్థ్యము గలదై యుండును. అప్పుడాచిత్తమునకు సంసారముయొక్క వాస్తవస్థితి తెలియును. అనగా సంసారము అనిత్యమని, అశుచియని, దుఃఖమయమని, హేయమనిన్ని తెలియునని యర్థము.

ఇదియేగాక సంసారముయొక్క వాస్తవస్థితి ఇటులుండగా సంసారము నిత్యమని, శుచియని, సుఖరూపమని, ఉపాదేయమని తలంచుట చిత్తదోష మని తెలియవలయును. సంసార యాథార్థ్యము తెలిసిన పిమ్మట సంసార విషయమునందు విరక్తి జనించును. విరక్తి బుట్టిన పిదప నిత్యమై శుద్ధమై పరమానంద రూపంబైన ముక్తియందిచ్ఛ గల్గును. పిదప ఆ మోక్షమున కేది సాధనమో దానిని విచారించును. మోక్షసాధనల నెరింగిన పిదప వాటి ననుష్ఠిం చుటకు సాధనములైన గృహస్థకార్యములున్ను ప్రతిబంధకములుగా తోచి వాటినన్నిటిని యథాశాస్త్రముగ పరిత్యజించి వైరాగ్య జీవితమును పరిగ్రహిం చును. తరువాత సద్గురుసన్నిధియందు వేదాంతవాక్యములయొక్క అర్థమును గ్రహించి మనోవిశుద్ధతకొఱకు దీర్ఘచింతన కనుగుణమగు యోగము నవలంబించును. తరువాత వేదాంతములయొక్క అర్థమును సంశయ విపర్య యములు లేకుండా గురుముఖతః గ్రహించప్రయత్నించును. ఇదియే శ్రవణ మనంబడును. దీని యర్థమును యుక్తులతో చేర్చి మనస్సులో నాలోచించి నిశ్చయించుకొనుట మననమనంబడును. నిశ్చయించుకొనిన యర్థమును మనస్సులో చిరకాలము భావించుట నిదిధ్యాస మనంబడును.

ఇట్టి యోగమున్ను జ్ఞానమున్ను కొంతకాల మభ్యసింపగా చిత్తము శబ్దస్పర్శరూప రసగంధాదులయందు ప్రవర్తించుట మాని శుద్ధచిద్రూపుడైన

ప్రత్యగాత్మయందు ప్రవర్తించి తదేకాయత్తమై యుండును. అనంతరము వేదాంతములయందుగల 'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి' మొదలైన మహా వాక్యములయందు చెప్పబడిన జీవబ్రహ్మైక్య జ్ఞానము ప్రత్యక్షముగ నావిర్భ వించును. అందువలన సూర్యోదయము కాగానే అంధకారము నివర్తించి నటుల అనాదికాల ప్రవృత్తంబైన అజ్ఞానంబు నిశ్శేషముగ నశించిపోవును. అనంతరము స్వరూపస్థానము గల్గును. ఇది దైవసాక్షాత్కారమైన జ్ఞానము. ఇదే మోక్షసౌఖ్యమును గలుగజేయునది. దీనికి చెప్పవలసిన పరంపరామార్గము సోపానక్రమము ననుసరించి చెప్పడమైనది. ఇది అనన్యమైన దైవ భక్తిచేతను, జీవకారుణ్యముచేతను, విషయవిరక్తిచేతను మనుష్యమాత్రు లందరికిన్ని గల్గును. సందేహము లేదు.

**అతో మద్భక్తియుక్తస్య జ్ఞానం విజ్ఞానమేవ చ ।**
**వైరాగ్యం చ భవేచ్ఛీఘ్రం తతో ముక్తి మవాప్నుయాత్ ॥**

దీని యర్థము పైన వ్రాసినదే :-

ఒక విత్తనమును భూమిలో పెట్టి పెంచుచుండిన నేలాగున స్వయముగ అంకురించి, వృక్షమై, చిగిరించి, పుష్పించి, కాయ గాచి, ఫలము పండి స్వయ ముగా చెట్టునుండి రాలునో ఆలాగున దైవస్మరణ అనగా బ్రహ్మచింతయను బీజము పెట్టి జీవకోట్లలో కరుణ యనెడు జలముతో పోషించి విషయవిరక్తి యను వైరాగ్యముతో సంరక్షించుచు వచ్చిన అదే స్వయముగా శమదమాదు లను పల్లవములచేతను, హృదయవికాసమను పుష్పముతోను, తురీయ జ్ఞానమగు బ్రహ్మసాక్షాత్కారమను పండ్లతోను ఆవిర్భవించినదై ప్రకృతినుండి విముక్తి యను అవస్థ స్వయముగానే గలుగుచుండును. చెట్టుపెట్టి పెంచువారి కెవరికైనను ఇట్టి ఫలము గలుగుట యీశ్వరనియతియై యున్నది.

**ఏవ మాత్మారణౌ ధ్యానమథనే సతతం కృతే ।**
**ఉదితావగతిజ్వాలా సర్వాజ్ఞానేంధనం దహేత్ ॥**

లోకమందు యజ్ఞాగ్నికొఱకు కొయ్యమీద కొయ్యనుంచి చిలికిన

మాత్రముచేత అగ్నిహోత్రము పుట్టి ఆ కొయ్యలను దహించినట్లు ఆత్మ యజ్ఞము చేయువాడు బ్రహ్మాత్మానుసంధానపరుడై అనగా అంతఃకరణ మందు మనస్సునుంచి బ్రహ్మధ్యానముచేత దృఢముగా భావించినచో ఆత్మ సాక్షాత్కారజ్ఞానము గల్గి మూలాజ్ఞానమును బొత్తిగ నశింపజేసి వానిని సర్వ పరిపూర్ణ జ్ఞానముగల వానినిగా చేయుచున్నదని తాత్పర్యము.

ఈ ఆత్మయజ్ఞము సంగ్రహముగ క్రింద వివరింపబడుచున్నది. దానికి తన హృదయమే యజ్ఞవేదిక యగు హోమగుండము. స్వస్వరూపమగు ఆత్మలో పరమాత్మ భావము ఏమరుపాటులేక వెల్గుచుండుటయే అగ్ని యనం బడును. నిర్విషయమగు బుద్ధియే యూ పస్తంభము. అజ్ఞానము యజ్ఞపశు వగును. ఇంద్రియవృత్తులే నవధాన్యములు, సంచితాగామి ప్రారబ్ధకర్మలే సమిత్తులు అనగా యజ్ఞోపయుక్త అశ్వత్థాదులగుకట్టెలు, సోఽహం పదము యొక్క యథార్థతత్త్వబోధము గలిగేలాగున నడుపుటయే ఋత్విక్కుల యొక్క మంత్రము. హోమము చేయునప్పుడు అగ్నియొక్క శిఖలో పడినవి మాత్రమే దహించబడును. అట్లు గానివి భస్మము కాజాలవు. ఆలాగున సమస్త వృత్తులున్ను, సంకల్పములున్ను ఆత్మజ్ఞానాగ్నిలో జీర్ణము గావలసియుం డును. విషయాసక్తియే హోమమునకు ఆజ్యము, అనగా నెయ్యి. కామ్యకర్మ ఫలత్యాగమే హవ్యము అనగా హోమమునకు తగిన పాయసాన్నాది ద్రవ్య ములు. శరీరమే యజ్ఞశాల. వైరాగ్య బోధోపరతులే యజ్ఞసంరక్షకులు. అనగా నిర్విఘ్నమగు యజ్ఞము జరుగులాగున కాపలాగా ఉండేవారు. ఈశ్వరభక్తియే యజ్ఞమునకు పురోహితుడు. ఈలాగున ఆత్మయజ్ఞము చేయువారు ఇంద్ర పదవి ననుభవించెడు కర్మయజ్ఞము చేయువారికన్న కోటిరెట్లు అధికమగు బ్రహ్మలోకప్రాప్తి ననుభవింపగలరు. ఇది వృత్తి గలుగనిది. నిత్యమైనది. శివ మైనది. అమృతమైనది. ఆనందమైనది.



# క్షీరాబ్ధి మథనము

ఓమ్ కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనమ్ ।
వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిమ్ ॥

ఆత్మానమరణిం కృత్వా ప్రణవం చోత్తరారణిమ్ ।
* ధ్యాన నిర్మథనాభ్యాసా ద్దేవం పశ్యేన్నిగూఢవత్ ॥

భరతఖండవాసులగు ఋషులు వ్రాయు గ్రంథము లన్నియు కేవలము బాహ్యముగ గానుపించెడు అర్థములతో పూర్తి గాజాలవు. అట్టి ఋషులు ఆత్మదృష్టి గలవారగుటచే అంతరాత్మలో లక్ష్యముంచియే యేకార్య మైనను చేయుదురు. సామాన్యజనుల దృష్టి బహిర్విషయములలో లగ్నమై యుండుటచే అట్టి కార్యములు లేనిచో వారు తృప్తి నొందజాలరు. అయితే అట్టివారికి గూడ కర్మపరిపక్వస్థితి గల్గునప్పుడు అంతఃకరణశుద్ధిగల్గును. అత్తరివారే యింతవఱకు సత్యముగా తలంచియుండిన బాహ్య వస్తువులన్నియు అసత్యములని కనుగొనగలరు. అప్పుడు అంతవరకు జరిగిన జీవితమును గురించి వారే వ్యాకులత గలవారలై, యిక తరణోపాయ మేమని భయపూర్వకముగా వెదుక మొదలిడెదరు. అప్పుడు వారికే యీ బాహ్యార్థముతో ఋషుల యాశయము పూర్తిగాజాలదని దీనియందు నిగూఢమగు అంతరార్థము గల్గియుండుననియు తెలివిగల్గును. దేహముతో ఒకరి జన్మము పూర్తియైనదని తలంచినచో, అది పశుత్వమనియు, దేహములో అంతర్వర్తియగు ఆత్మ మఱియొకటి గలదు, దానియందు ప్రవేశించినప్పుడే మానవుడు పొందదగిన నిత్యసుఖము లభింపగలదనియు నిశ్చయించుకొనెదరు. కనుకనే సకలమునకున్ను స్థూలము, సూక్ష్మము అనగా బాహ్యము, అంతరమున్ను గల్గియుంటున్నది.

బాహ్యము జడముగాను, అంతరంగము చైతన్యముగాను నుండును. బాహ్యము అశాశ్వతము, అసత్యము, ఆంతరము శాశ్వతము, సత్యము.

---

* "జ్ఞాన నిర్మథనాభ్యాసాత్పాశం దహతి పండితః", "పాపం దహతి పండితః" అని పాఠాంతరములు ఇతర ఉపనిషత్తులలో కనబడుచున్నవి.

బాహ్యము వికారముతో గూడినది; ఆంతరము నిర్వికారము. బాహ్యమనాత్మ స్వరూపము. ఆంతరము ఆత్మస్వరూపము. కనుకనే బాహ్యావస్తువులలో రమించు వారజ్ఞులనియు, ఆత్మలో రమించువారు జ్ఞానులనియు శాస్త్రము చెప్పెడు రహస్యము. అయితే ప్రతిమానవుడు అంతఃకరణశుద్ధి గల్గువఱకును, బాహ్యకార్యములలో రమించును. అంతఃకరణశుద్ధి గల్గునప్పుడు స్వయముగ నతడే ఆత్మలో సత్యము గలదు. దానిని కనుగొనవలయును, అనుభవించ వలయును, అది లభించెడు మార్గమవలంబించవలయును అని ప్రయత్న మారంభించును.

మనుజులకు ఏలాగున దేహము వేరుగాను, దేహి వేరుగా నుండునో ఆలాగున క్షీరసాగర మధనమునగూడ బాహ్యార్థము వేరుగాను, అంతరార్థము వేరుగాను గలదు. కనుకనే క్షీరసముద్రమును మథించుటజరిగినది. అట్లు గానిచో సప్తసాగరములలో మఱియొకదానిని తరచగూడదా? క్షీరము తెలుపు వర్ణము గలిగినది. అట్లే సత్త్వగుణము గల్గునప్పుడే ఆత్మమథనమునకు యోగ్యత గలుగును. అనగా ఆత్మ ధ్యానమునకు లేక మనన నిదిధ్యాసముల కర్హత గల్గును.

ఇచ్చట హృదయమే సముద్రము. ఏలన సముద్రములో సుగుణములు దుర్గుణములుగల వస్తువు లనేకములు గలవు. ఆలాగున హృదయములో గూడ సుగుణ దుర్గుణములు గలవు. సముద్రమున కేలాగున, కల్లోలములుం డునో, ఆలాగున హృదయములోగూడ సంకల్పము లనెడి అలలు గలవు. సముద్రములో సుడులు గలవు. హృదయములో సంశయములనెడు సుడులు గలవు. సముద్రమున మకరతిమింగలాది భయంకర జంతువు లున్నవి. హృదయమున కామక్రోధాది క్రూరగుణములు గలవు. సముద్రమున రత్న ములు, పగడములు గలవు. అట్లే హృదయమున శాంతశమదమాది దైవ గుణములున్నవి. కావున సమానధర్మము హృదయమునకున్ను, సముద్రమున కున్ను గల్గియుండుటచే నీదృష్టాంతము సరిగానేయున్నది; మఱియు, సముద్ర

మగాధమయినది. అదేరీతిగా మనస్సుయొక్క లోతును గనుగొనుట దుస్సాధ్యము. సముద్రమునకు అపారత్వము గలదు. అట్లే మనస్సునకున్ను పారములేదు. కావున దృష్టాంతదార్ష్టాంతములు సరిపోయినవి. సముద్ర ములో గొప్ప గొప్ప పాములు గలవు. హృదయములోను ఆలాగున ఆశలనెడు సర్పము లున్నవి. సముద్రముయొక్క అంతము తెలియుట యెట్లు దుస్తరమో ఆలాగున మనస్సుయొక్క హద్దును గనుగొనుటకుగూడ ప్రయాసము గదా!

ఇప్పుడు దేనికొఱకు సముద్రమధనము చేయవలసి వచ్చినది? దేవతల యొక్క జరా, నరాది దోషముల రహిత మొనర్చుటకొఱకు. ఆలాగున హృదయమథనముచే గలిగెడు జ్ఞానామృతపానముచే జీవునియొక్క జనన మరణములు నశించును. అనగా జీవుడు కైవల్యమును జెందును. పాలకడలిని తరచిన వారు దేవతలున్ను, అసురులున్ను గదా? ఆలాగున నిచ్చట శమ, దమ, సత్య, శాంత, శౌచ, దయాది సాత్త్వికగుణములున్ను; ఆలస్యము, మందత, అజాగ్రత, అశ్రద్ధ, సోమరితనము, బుద్ధిహీనత మొదలగు తమోగుణములున్ను గలవు. అభ్యాసి యిట్టిస్థితిలోనే యుండును. మందర పర్వతముచే సముద్రమును మథించిరి. ఇచ్చట నిర్మలమైన హృదయములో వివేకజ్ఞానము లేక వివేకమైన బుద్ధి, లేక వివేకజ్ఞానముగల యాత్మయు నుండవలయును. ఇవి మూడున్ను పర్యాయపదములు.

దేవతలు వాసుకిని త్రాడుగా చేసుకొనిరి. ఇచ్చట ఆత్మాను సంధాన మను ధ్యానమునే పాశముగా నేర్పరచుకొనవలయును. జీవునికిన్ని, ఈశ్వరుని కిన్ని ఎడతెగని సంబంధమొకటి గలదు. అది సామాన్యముగా పితృపుత్రుల వలె నుండును. పితృస్థానము నధిష్ఠించుటకు పుత్రుడేలాగున అధికారము గల్గి యుండునో, జీవుడున్ను ఆలాగున దైవసాక్షాత్కారజ్ఞానము గలుగుటలో అధికారము గల్గియుండును. ఇట్టి యాత్మానుసంధానములో విఘ్నములు గల్గును. మందరపర్వత మేలాగున సముద్రములో దిగబడిపోయినదో, ఆలాగున బ్రహ్మనిష్ఠలోగూడ ఆత్మానుసంధానము నిరంతరము సాగనీయక

విచ్ఛేదము గల్గుచుండును. అనగా ధ్యానమునుండి తొలగిపోవును. భగవత్కృప యుండినందుచే నేలాగున భక్తవత్సలుడగు శ్రీభగవానుడు కూర్మావతారమునుగ్రహించి, తన వీపుపై పర్వతమును ధరించి పైకి తీసెనో, ఆలాగున దైవకృపకు పాత్రులైన వారి ధ్యానము నిర్విఘ్నముగా జరుగగలదు.

సర్వేశ్వరకరుణ గల్గియుండువారికి ఒకవేళ విఘ్నములు వచ్చినను వెంటనే నివృత్తి యగును. మఱల యథాప్రకారము ధ్యానము జరుగుచుండును. సాగరమధనము యథాప్రకారము జరుగుచుండగా మొట్టమొదట వాసుకి విషము గ్రక్కెను. ఆ మహాఘోరమగు కాలకూటమును పరమేశ్వరుండు దేవతలు ప్రార్థించినందుచే దానిచే నెవరికి నపాయము గలుగనీయక భక్తవాత్సల్యముచే భక్షించెను. ఆలాగున ధ్యానయోగము తీవ్రతరముగా జరుగుచున్నప్పుడు అంతఃకరణములోగల అనగా ఆత్మలోగల విషసమానమగు విషయవాసనలన్నియు బహిర్గతమగును. అనగా విషయవాసనలచే పతనము గలుగవచ్చును. ఆలాగున విషయబుద్ధి గల్గిన అనన్యభక్తితో నీశ్వర ప్రార్థన చేయవలయును. అట్లయిన నట్టి దోషము క్షయించును.

జన్మజన్మాంతరములలోగల దోషములన్నియు నీజన్మములోనే క్షయించి ముక్తుడు కావలసియుండుటచే, అభ్యాసదశలోనే అవి యన్నియు బహిర్గతములు కావలసియుండును. ఈ తరుణములోనే బ్రహ్మనిష్ఠునికి అనేక కష్టములున్ను, నష్టములున్ను గలుగవచ్చును. సొంతమువారుగూడ విరోధులగుదురు. రోగములు గూడ గలుగవచ్చును. ఏలన? కర్మలన్నియు నశించవలసియుండును గదా! ఈ యవస్థ దాటిన తరువాత సౌఖ్యము గలుగును. పూర్వవిరోధులందరు మిత్రు లగుదురు. అమితముగా ప్రేమింతురు. అన్ని కార్యములకున్ను తోడ్పడుదురు. కావున ధ్యానయోగము చేయువారికి నీశ్వర కరుణ గల్గియుండవలయును. ఇందువల్లనే భక్తిలేనిచో, ముక్తిగల్గుట దుస్తరమని మహర్షులు దెలిపెడు రహస్యము.

అట్లు దైవకృప లేనిచో, పతనముగల్గి నిష్ఠ నశించిపోవును. పరమేశ్వ

రుండు కాలకూటవిషపానము చేయనిచో అందరును క్షయించి యుందురు గదా! మఱియు, శ్రీ శివకేశవులయం దేకరీతిగా భేదము లేని భక్తి గలిగి యుండవలెనని యీ చరిత్రము దెలుపుచున్నది. ఏలన? మందరగిరి సముద్రములో దిగబడినప్పుడు శ్రీమన్నారాయణమూర్తి ఉద్ధరించెననియు, విషమును పరమేశ్వరుడగు శంకరమూర్తి భక్షించెననియు గనుపించుట లేదా! కనుకనే.

**వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో**
**నరో వా యః కశ్చిద్భవతు భవ! కింతేన భవతి**
**యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే**
**తదీయస్త్వం శంభో భవసి భవభారం చ వహసి ॥**

బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసాశ్రమముల నాశ్రయించినవాడైనను, లేక ఆశ్రయించనివాడైనను, పురుషుడైనను, స్త్రీయైనను; బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యశూద్రాదులలో నెవడైనను సరే వానివల్ల ఏలాటి లాభమున్ను లేదు. గొప్పతనమున్ను గలుగదు. ఎవనియొక్క హృదయము పరమేశ్వరాయత్తముగా నుండునో, అట్టివాని సమస్త సంసార కార్యములను, సర్వేశ్వరుండే భరించి, అన్నిబంధములనుండి విముక్తి గలుగజేసి కైవల్య పదవిని గలుగ చేయును అని శివానందలహరి.

సాగరమథనము యథాప్రకారము జరుగుచుండగ దానినుండి తొమ్మిది వస్తువులు గల్గెను. ఇది శ్రీమద్భాగవత ప్రమాణము ననుసరించినది. పద్మపురాణములో మఱికొన్ని వస్తువులుగూడ నుద్భవించినట్లు గాన్పించుచున్నది. అయితే యీ భాగవతములో చెప్పిన వస్తువులే ముఖ్యములు. అన్నిటిలో ఆఖరున మాత్రమే అమృత ముద్భవించినది. అదే రీతిగా, నిర్విఘ్నముగ ధ్యానయోగము జరుగుచుండు యోగియైన వానికిని కష్టములన్నియు దాటిన తర్వాత అనేకవిధములగు అద్భుత దివ్యసిద్ధులు గల్గును. అయితే సిద్ధులలో అభిలాష గల్గి యుండరాదు. అది అభిమానమును గలుగజేసి అహం

కారమును వృద్ధినొందజేసి బంధనమునకో, లేక పతనమునకో కారణమగును. దేవతలేలాగున అనేకదివ్యవస్తువులు గల్గినవారైనను అమృతము లభించు వఱకు తృప్తినొందక తరచుచుండిరో ఆలాగున బ్రహ్మనిష్ఠులుగూడ అనేక మహిమలు గల్గినను వానిని లక్ష్యపెట్టక ముక్తియనెడు అమృతపదవి లభించు వఱకు ధ్యాననిష్ఠనుండి చలింపరాదు. ఈ మహిమలచేతగాని, సిద్ధులచేతగాని ఆగిపోరాదు. ఆగినవారికి మోక్షము గలుగదు. ధ్యానముచే గలిగెడు పుణ్యము నశించునప్పుడు సిద్ధులన్నియు, మహిమ లనియు జలము నశించునప్పుడు సరోవరములోగల జలపక్షులన్నియు లేచిపోవునట్లు అంతర్ధానము లగును. కావున మఱల సంసారదుఃఖములో పడిపోవును. కనుక ఇట్టితరుణములో గొప్ప బ్రహ్మనిష్ఠులగు మహాపురుషుల సహాయము అభ్యాసికి నుండవలయును. అట్లుగానిచో సిద్ధిజాలముయొక్క అశాశ్వతబుద్ధియు, ప్రతిబంధస్థితియున్ను, తెలిసికొని యుండవలయును. కావుననే కఠోపనిషత్తు ఈలాగున నుద్బోధించుచున్నది.

**శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత**
**స్తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।**
**శ్రేయో హి ధీరోఽభి ప్రేయసో వృణీతే**
**ప్రేయో మందో యోగ క్షేమాద్వృణీతే ॥**

శ్రేయస్సున్ను అనగా దైవసుఖము, ప్రేయస్సున్ను అనగా ప్రపంచ సౌఖ్యమున్ను విరక్తుడై బ్రహ్మనిష్ఠ చేయు మనుష్యుని పొందుచున్నవి. ఆత్మానాత్మ వివేకజ్ఞానము గల ధీరుడు ఆ శ్రేయఃప్రేయస్సులను మనస్సుచే బాగుగా విచారించి ఎయ్యది శ్రేష్ఠమో, ఎయ్యది నికృష్టమో యని వివేచనము చేయుచున్నాడు. ధీరుడగువాడు ప్రేయస్సు తుచ్ఛమని తలంచి శ్రేయస్సునే వరించుచున్నాడు. అల్పబుద్ధిగలవాడు శ్రేయస్సుయొక్క మహిమ నెరుంగ జాలక స్వల్పసుఖముల నిచ్చెడు ప్రేయస్సునే వరించుచున్నాడు. అనగా ప్రపంచ సుఖమును పొందుచున్నాడు. శ్రేయస్సు మోక్షమనియు, ప్రేయస్సు ప్రపంచ భోగమనియు గ్రహించుకొనవలెను. యోగియైన వానిని ప్రపంచాతీత

జ్ఞానము పొందు కాల మాసన్నమగుచున్నప్పుడు ముక్తికాంతయు, భోగకాంతయు ఒకే తరుణములో ఆశ్రయించునని భావము. వివేకజ్ఞానము చాలనివాడైనచో భోగములోపడిపోవును. వివేకజ్ఞానము చక్కగగలవాడైనచో యోగము లభించును. ఇవి విషామృతముల వంటివనియు, అంధకార ప్రకాశములవంటివనియు అభ్యాసులు గ్రహించుకొనవలెను. సిద్ధులచే గలిగెడు గౌరవములన్నియు దుష్టగుణములు గల వేశ్యాస్త్రీలయొక్క ఆదరణవలె నుండును. ధనము గల్గియుండువఱకు వారు ప్రేమింతురు. ధనము నశించిన హీనముగా చూచుటయే గాక లోపలికైన రానీయరు. కనుకనే కొందరు బ్రహ్మనిష్ఠులు సిద్ధి గల్గిన తర్వాత పతితులగుట. కనుకనే పాతంజల యోగసూత్ర మీలాగున దెలుపుచున్నది.

**స్థాన్యుపనిమన్త్రణే సంగస్మయాకరణం పునరనిష్ట ప్రసంగాత్ ॥**

దేవతలు భోజనము చేయమని ప్రార్థించునప్పుడు అభిలాషయు, ఆశ్చర్యము నొందకూడదు. అభిలషించినయెడల మఱల దుఃఖరూపమైన సంసారముయొక్క సంబంధము గలుగును. అనగా దేవతలు మొదలగువారు యోగియొక్క ఉత్కృష్ట పదవికి సహింపనివారై, విఘ్నము చేయనెంచి, మాయొద్ద భోజనముచేసి మాకోరికను నెరవేర్పవలసినదని స్వర్గాది లోకాంతరములయందుండు దివ్యస్త్రీలను, రసాయనాది పదార్థములను యోగి ముందు తెచ్చిపెట్టి స్వీకరింపవలెనని ప్రార్థింతురు. వీరి ప్రార్థనలకు లోబడినచో, యోగి మఱల జననమరణ ప్రవాహరూపమైన ఘోరసంసారమునందు పడవలసి వచ్చును. కావున వారి ప్రార్థనము నంగీకరింపగూడదు.

బ్రహ్మనిష్ఠులారా! జాగ్రత్తపడుడు. విరక్తి నవలంబించి ఏకాంత ప్రదేశమున నిష్ఠ చేయువారిని ధనవంతులు తమ యింటిలో భోజనము చేసే లాగున చెప్పుటయేగాక, సేవకొఱకు కొందరి నేర్పాటుగూడ చేయుదురు. జ్ఞాపకములో నుంచి వర్తింపుడు. ఇది శ్రీపతంజలి మహర్షి చెప్పినదని గూడ యోచించుకొనుడు.

పాలకడలిని తరచుట కారంభించిన వెంటనే, వాసుకి నుండి విషము గల్గిన విషయ మింతవఱకు చెప్పబడినది. ఇది జీవునియొక్క కల్మషము లన్నియు నని గ్రహించవలయును. లేక మానసాదీంద్రియములలో గల విషయము లన్నియు తపస్సుచే బహిర్గతములైనవనిగూడ గ్రహించవచ్చును. బ్రహ్మనిష్ఠునియొక్క కష్టము లన్నియు దీనితో నివృత్తియైనవి. క్షీరసముద్రమునుండి మథనమున పుట్టిన వానిలో మొదటిది -

1. కామధేనువు - ఆత్మవిషయములో యోగధ్యానము చేయు వాని యొక్క తపస్సుచే, మలినవిషయము లన్నియు నశించిన తర్వాత సంకల్ప సిద్ధి గలుగుటకు ప్రారంభమగును. కామధేను వేలాగున కోరిక లన్నిటిని నొసంగుచుండునో, ఆలాగున యోగనిష్ఠుని యొక్కొక్క కోరికగూడ ఫలవంత మగుచుండును. ఇది అంతఃకరణము శుద్ధమగు నప్పటినుండియే గల్గును.

2. ఉచ్చైఃశ్రవము - అనగా తెల్లని గుఱ్ఱము. ఇత్తరి యోగియొక్క యశస్సు లోకమున వ్యాపింప మొదలిడును. గుఱ్ఱమునకు గమనశక్తి యేలా గుననుండునో, ఆలాగున బ్రహ్మనిష్ఠుని కీర్తి అతివేగముగ లోకములో వ్యాపించును. ఉచ్చైఃశ్రవము, ఏలాగున తెల్లగ నుండునో అట్లే యోగనిష్ఠునియొక్క యశస్సుగూడ నిర్మలమై యుండును.

3. ఐరావతము - ఇది తెల్లని యేనుగు. నాల్గుకొమ్ములు అనగా దంతములు గల్గినది. ఆత్మనిష్ఠలో నిత్తరి ధ్యాన, వైరాగ్య, బోధ, ఉపరతు లనెడు నాలుగు దివ్యగుణములు గల్గును. అంతేగాక యేనుగు మొదలగు వానిపై నీ మహాయోగియొక్క పటమును పెట్టి ఊరేగింపు ఉత్సవములు అచ్చటచ్చట భక్తులు జరుపుచుందురు. అంతేగాక కేవలము సత్త్వగుణము మాత్రము అట్టియోగికి గల్గియుండును. మఱియు శుద్ధబ్రహ్మమగు జ్ఞేయాకారము ఇత్తరి బ్రహ్మనిష్ఠునికి ఆవిర్భవించును. కామధేనువును ఋషులు పరిగ్రహించిరి. ఇచ్చట యోగనిష్ఠచే ఋషులు సంతోషింతురు. ఉచ్చైఃశ్రవమును, ఐరావతమునున్ను దేవేంద్రుడు గ్రహించెను. ఇచ్చోట నట్టి యోగిపై

దేవతలకున్ను, దేవేంద్రునికిన్ని ప్రీతిగల్గును.

4. కల్పవృక్ష ముద్భవించెను. ఈ తరుణములో యోగి జితేంద్రియుడగును. సంకల్పములు నశించును. నిస్సంకల్పస్థితి గల్గును. ఆ తరుణములో నేమేమి చేయవలెనని సంకల్పించిన నది సిద్ధి గల్గును. ఇదే యోగికి గల సంకల్పసిద్ధి యని గ్రహించవలయును :

5. మఱల అప్సరలు పుట్టిరి. ఈ యవస్థలో యోగికి సుందర స్త్రీల వల్ల మోహము గలుగవచ్చును. అప్సరలవంటి అనేకస్త్రీలు సేవ చేయుటలో కనిపెట్టి యుందురు. ఈ కాలములో మంచివైరాగ్య మవలంబించవలెను. విశ్వామిత్ర పరాశరాది మహర్షిసత్తములుగూడ విషయమాసన్న మైనప్పుడు మనస్సును జయింపజాలనివారై రనునట్టి వచనమును మరువకూడదు. కనుకనే ఆలాటి విఘ్నములు గలుగని స్థలములోనుండి యోగముగాని, తపస్సుగాని, బ్రహ్మనిష్ఠగాని చేయవలెనని శాస్త్రము చెప్పెడు రహస్యము. ఈ విఘ్నములు యోగినులగు స్త్రీలకు పురుషులచేతగూడ గలుగవచ్చును. కావున బ్రహ్మనిష్ఠురాండ్రగు నారీమణులుగూడ విఘ్నములు గలుగని స్థలములో నుండి బ్రహ్మనిష్ఠ సాధింపవలయును.

6. సుధాకరుడు పుట్టెను. అనగా చంద్రుడుద్భవించెను. ఇతని నీశ్వరుడు గ్రహించెను. ఈ స్థితిలో యోగికి అమృతపానము గల్గును. చంద్రుడు అమృతస్వరూపుడు. ఈశ్వరుండు చంద్రుని గ్రహించె ననుటలో నీశ్వరకృప గల్గునని భావము. అయితే యీ అమృతము యోగమునకు సంబంధించినదేగాని, జ్ఞానమునకు సంబంధించిన జ్ఞానామృతము గాదు. ఖేచరీముద్రచే గల్గెడు అమృతమని గ్రహించవలయును. అట్లు గానిచో ధ్యాన యోగములో నెల్లప్పుడున్ను ఆనందము గల్గియుండునని గూడ గ్రహించేది.

7. శ్రీ లక్ష్మీదేవి యావిర్భవించెను. యోగికి జ్ఞానలక్ష్మి, మోక్షలక్ష్మి, వైరాగ్యలక్ష్మి గల్గియుండునని భావము. అనగా జ్ఞానలక్ష్మిచే అలంకృతుడై యుండును. అంతేగాక ధనధాన్యాది ఐశ్వర్యములు విశేషముగా వచ్చి చేరును.

కావుననే గదా? మహాత్ముల ఆశ్రమములు మహోన్నతదశకు వచ్చుట. లక్ష్మీదేవిని శ్రీమన్నారాయణమూర్తి పరిగ్రహించుట యనగా, యోగీంద్రునకు విష్ణుప్రీతి కల్గును. అంతేగాక సర్వవ్యాపకాత్మత్వసిద్ధి లభించును. అత్తరి ముక్తి కాంతాలంకృతుడై బ్రహ్మజ్ఞాన పీఠమున పట్టాభిషిక్తుడై యోగి విరాజమానుడై యుండును. అనగా శోభాయమానుడుగ నుండును.

8. వారుణి గల్గెను. ఈ కాలములో యోగికి శత్రువులుగూడ మిత్రు లగుదురు. వారుణిని అసురులు గ్రహించిరి. ఇచ్చో యోగికి విఘ్నకారు లెవరున్ను ఉండరు. ఆత్మకు ప్రతిబంధములు గలుగజేసెడు వృత్తులన్నియు విలయములై పోవును. ఇప్పటికి నిర్విఘ్నదశ గల్గినదని గ్రహించుకొనవచ్చును. అసురసంపత్తంతయు నశించిపోయి దైవసంపత్తు గలవాడగును.

9. ధన్వంతరి - అమృతకలశముతో ఆవిర్భవించెను. ఇప్పటికి యోగి జ్ఞానామృతము గల్గినవాడయ్యెను. అమృతము సిద్ధించిన వాడయ్యెను. జీవన్ముక్తి గలవాడాయెను. ఇత్తరి బ్రహ్మనిష్ఠునికి కైవల్యప్రాప్తి గల్గెను. అప్పుడు సచ్చిదానందస్వరూప ఘనీభూతుడై యోగి వెల్గుచుండును. జన్మసాఫల్యము గలవాడయ్యెను. పైజెప్పిన ఒక్కొక్క శుద్ధి గల్గినను దానివల్ల తృప్తుడై యుండక కైవల్య పదవి గల్గువరకున్ను ధ్యానము వదలకూడదు. మఱియు అమృతము గల్గిన తర్వాత గూడ అసురులు తీసుకొని పోయిరి. అత్తరి భగవత్కారుణచేతనే మఱల దేవతలకది లభించినది. దీనివల్ల ఏమి యేర్పడుచుండుననగా? అమృత పదవి గల్గినప్పటికిన్ని దైవభక్తిని విడువరాదని గ్రహించవలెను. అయితే యీ భయము అమృతపానము గల్గువఱకుమాత్రమే యుండును. మఱల లేదు. కనుకనే యెట్టి జ్ఞాని యైనను మరణాంతము వఱకున్ను దైవభక్తియు, గురుభక్తియు, శాస్త్రములోగల విశ్వాసమున్ను, అనగా శిష్టాచరణము విడువ రాదని శాస్త్రము చెప్పెడు రహస్యము.

**ఆజీవితం త్రయస్సేవ్యా వేదాంతో గురురీశ్వరః ।**
**పూర్వం జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నత్వ నివృత్తయే ॥**

ముక్తుడైన జ్ఞానికి బంధము గలుగక పోయినను ఇట్లు ఆచరించుట శాస్త్రనియమమున్ను ఋషులయొక్క పారంపర్యధర్మమునై యున్నది. ఇది కృతజ్ఞతా స్వభావమగును. తక్కిన యర్థము పైజెప్పినదే. ఇట్టి యమృతపదవి గలుగుటకు జన్మజన్మాంతరములలోగల సుకృతవిశేషమున్ను, ఈజన్మములో గల తీవ్రతమమగు ననుష్ఠానమున్ను, పరమగురువుయొక్క, కృపయున్ను, పరమేశ్వర కరుణయు ఒకేకాలములో గూడియుండవలయును.

**సంసార దుఃఖతప్తానా మాత్మజ్ఞానామృతాంభసా ।**
**తాపశాంతిర్న చాన్యేన సత్యమేవ న సంశయః ॥**

సంసారమనెడు తాపత్రయాగ్నిచే తాపమునొందిన జీవులకు ఆత్మ జ్ఞానామృతమనెడు జలముచేత మాత్రము తాపశాంతి గల్గునేగాని, మఱిదేనిచే తను సిద్ధింపనేరదు. దీనియందు సందేహము లేదు. అమృతపానము లేక మర్త్యు లేలాగున మృతిరహితులు గారో, ఆలాగున జ్ఞానామృతపానముచే తప్ప జీవులు ముక్తులు గాజాలరు.

**క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే ।**
**సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః ॥**

పాలలో పాలున్ను, నూనెలో నూనెయు, నీటిలో నీళ్లున్ను కలిపిన నేలాగున భేదము లేక యేకమైపోవునో, ఆలాగున ఆత్మవేత్తయైన ముని యున్ను పరమాత్మలో ఐక్యమును పొందును (ఆత్మోపనిషత్).

**పుష్పే గంధం తిలే తైలం కాష్ఠేఽగ్నిం పయసి ఘృతమ్ ।**
**ఇక్షౌ గుడం తథా దేహే పశ్యాత్మానం వివేకతః ॥**

పుష్పమునుండి అత్తరు మొదలగు సుగంధతైలముల నెట్లు తీయు దురో, నువ్వులనుండి నూనె యేలాగున గానుగలో పెట్టి తీసెదరో, అరణి నుండి అనగా యాగయోగ్యమగు కట్టెనుండి మథించి నిప్పును నేలాగున తీయుదురో, పాలను మథించి నెయ్యి యేలాగున వేరుపరతురో, చెరకును

గానుగలో మర్దించి రసమేలాగున పైకి తీయుదురో, ఆలాగున ఆత్మలో ఆత్మను మథించిన వివేకజ్ఞానము గలవాడు పరమాత్మను పొందగల్గును. ఇదే క్షీరసాగర మథనము విషయమై ఉపనిషత్తు బోధించెడు పరమరహస్యము.

ఈ విషయమై ధ్యానబిందూపనిషత్తు మఱియొక విధముగా నీ యర్థమునే స్పష్టపరచుచున్నది.

**పుష్పమధ్యే యథా గంధః పయోమధ్యే యథా ఘృతమ్ ।**
**తిలమధ్యే యథా తైలం పాషాణేష్వివ కాంచనమ్ ॥**

**ఏవం సర్వాణి భూతాని మణౌ సూత్ర ఇవాత్మని ।**
**స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణిస్థితః ॥**

పుష్పముల మధ్య ఏలాగున గంధము, క్షీరము మధ్య ఏలాగున ఘృతము, తిలములలో నేలాగున తైలము, మఱియు సువర్ణశిలయం దేలాగున కాంచనము గల్గియుండునో (యిచ్చట మధ్య శబ్దమునకు అంతట వ్యాపించినదని గ్రహించవలెను), మఱియు నేలాగున దారములో అనేక రకములగు మణులు గ్రుచ్చబడియుండునో ఆలాగున సర్వభూతములున్ను ఆత్మలో గ్రుచ్చబడియున్నవి. ఇది ఆవరణములేని జ్ఞానముగలవాడున్ను సుస్థిరమైన ధ్యానముగలవాడు నగు బ్రహ్మనిష్ఠుడు పొందగల్గును. పరమాత్మ యందు పై చెప్పినలాగుననే సమస్త భూతములున్ను గలవు. క్షీరమును మథింపనిచో ఘృతమున్ను, నువ్వులు గానుగలో ఆడనిచో తైలమున్ను, కట్టెను తరచనిచో అగ్నియున్ను; బంగారముగల రాతిని పిండిచేసి నీటిలో వడగట్టనిచో నేలాగునసువర్ణమున్ను లభింపజాలవో, ఆలాగున నాత్మను ధ్యానజ్ఞానయోగములచే మథనముచేయనిచో, అమృతసదృశమగు పరమాత్మ లాభము గలుగదు.

**బ్రహ్మప్రణవ సంధానం నాదో జ్యోతిర్మయశ్శివమ్ ।**
**స్వయమావిర్భవేదాత్మా మేఘాపాయేఽంశుమానివ ॥**

బ్రహ్మస్వరూపమగు ప్రణవమును ఆత్మలో అనుసంధానము చేయుచు రాగా రాగా నాదము గల్గి జ్యోతిర్మయమై నిత్యమంగళ స్వరూపమగు శివత్వము మేఘము వదలిన సూర్యునివలె స్వయముగ తన యాత్మలో నావిర్భవించును (బ్రహ్మవిద్యోపనిషత్).

**కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।**
**కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే ॥**

జీవునియొక్క కార్యోపాధియు నీశ్వరునియొక్క కారణోపాధియు జ్ఞాన ధ్యానములచే విలయము నొందింపగా పూర్ణబోధైక ఆత్మసాక్షాత్కార జ్ఞానము మాత్రము మిగిలియుండును. అదే సాక్షాత్ ఆత్మలాభము, లేక ఆత్మప్రాప్తి, దైవసాక్షాత్కారము, కైవల్యపదవి యని గ్రహించుకొనవలయును. ఇక శ్రీపతంజలిమహర్షి యోగశాస్త్రములో చెప్పిన కొన్ని సూత్రవాక్యములు క్రింద వివరింపబడుచున్నవి.

**జన్మౌషధి మన్త్రతపస్సమాధిజా స్సిద్ధయః ।**

సమాధిసిద్ధులు జన్మముచేతను, ఔషధముచేతను, మంత్రజపముచేతను, తపస్సుచేతను, సమాధి చేతను అయిదు విధములుగా గల్గుచున్నవి.

1. సాంఖ్యశాస్త్ర ప్రవర్తకులైన కపిలాచార్యులు జన్మసిద్ధులు. అనగా జన్మించినది మొదలు సిద్ధులను బడసిరి. వీరికి జన్మసిద్ధులని పేరు. ఇది పూర్వజన్మసంస్కార మహిమచే గల్గునది.

2. మాండవ్యఋషి మొదలగువారు మూలికలచేత సిద్ధులను పొందిరి. అనగా రసాయనశక్తిచే సిద్ధులైరి.

3. నారద సనకాది మునులు ప్రణవాది మంత్రజపములచే సిద్ధులను సంపాదించిరి.

4. విశ్వామిత్రాది ఋషులు తపస్సుచే సిద్ధులైరి.

5. ఆత్మారామయోగీంద్రాదులు యమనియమాదులగు అష్టాంగ యోగములచే సిద్ధిగలవారైరి.

ఇట్లు చెప్పుటచే మీరు అమృతత్వ పదవియగు ముక్తిని పొందుటకు ఒకే మార్గము కాదు గాన భక్తిచేతగాని, ప్రణవాది మంత్రజపముచేగాని, తపస్సుచేతగాని, ధారణధ్యానాది యోగముచేతగాని, యీశ్వరుని పొంద వచ్చును. కనుక మీకు ఏది సాధ్యపడునో దానిలో ప్రవేశించి మోక్షమును గలుగజేసుకొనవచ్చును. దేనియందైన ఒక్కదానిలో పూర్ణమైన యనుష్ఠాన ముండిన చాలును. ఈ విషయము శ్రీభగవద్గీతలోగూడ చెప్పబడి యున్నది.

**తారకం సర్వవిషయం సర్వథా విషయమక్రమం చేతి వివేకజం జ్ఞానమ్ ॥**

వివేకమువలన బుట్టిన జ్ఞానమునకు తారకమని నామము. ఆత్మా నాత్మ వివేకజ్ఞానముచే గలిగెడు శుద్ధమైన ఆత్మజ్ఞానమునకు తారకమనిపేరు. (అనగా ఘోర సంసారమునందుండి గట్టెక్కింప గలిగినది. లేక యథార్థమైనది అనబడుచున్నది) తారకజ్ఞానమువలన పరమాణువు మొదలు మూలప్రకృతి వఱకుగల స్థూలసూక్ష్మాది నానావస్థాభేదములయందుండు సర్వమును సర్వతోముఖమై ఏకకాలమునందే గోచరించును.

**సత్త్వపురుషయోశ్శుద్ధి సామ్యే కైవల్యమ్ ॥**

చిత్తముయొక్క సత్త్వమునకును, పురుషునకును ఏకకాలమునందు నిర్మలత్వము గలుగుటయే కైవల్యము. చిత్తము మొదలగు సర్వేంద్రియము లలోగల విషయదోషము రహిత మగుటయు, ఆత్మయొక్క మూలావిద్య నశించుటయు ఏకాలమున గల్గునో అప్పుడు కైవల్యప్రాప్తి సిద్ధించును. దీని వల్ల అంతఃకరణము శుద్ధి కావలయుననియు, ఆత్మయొక్క నిజమైన బోధము గలుగవలెననియు తెలియవచ్చుచున్నది.

**సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్ ॥**

పరమేశ్వరునియందు అతిశయమైన భక్తిచేయుటవల్లను, సమస్తమును

సర్వేశ్వరార్పణము చేయుటవల్లగూడ సమాధిసిద్ధి గల్గును. ఈశ్వరుని యందు అధికమైన భక్తి నుంచుటవలన చిత్తమందలి సకలమలినములు నశించును. అందువల్ల మేఘము వదలిపోయిన సూర్యుడు ప్రకాశించునట్లు దైవసాక్షాత్కారజ్ఞానము గల్గును.

**తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్ ।**

ధారణాస్థలమునందు, జ్ఞానముయొక్క ధ్యానేతర వస్తువులను చిత్తము నందు రానీయకుండ చేయుటయే ధ్యాన మనంబడుచున్నది. ధ్యానకాలములో తాను ధ్యానము చేయు వస్తువు తప్ప తక్కిన దేదియు హృదయము లోపలికి రాని స్థితి గల్గియుండుటయే ధ్యానము పరిపక్వమైన దానికి గురుతని తెలుసు కొనవలెను. అనగా ధ్యేయాకారము తప్ప నేదియు హృదయమున స్ఫురింప కూడదు.

**తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః ।**

ముందు చెప్పిన ధ్యానము ధ్యానించు వస్తువులయొక్క స్వరూపమై, ధ్యేయాకారమై యుండుటయే సమాధి యనబడును. ధ్యానము ధ్యానించు వస్తువుయొక్క స్వరూపముగా పరిణమించి ధ్యాత ధ్యేయాకారమై అనగా జ్ఞానము జ్ఞేయాకారమై యుండు అవస్థయే సమాధి యని గ్రహించవలయును.

**ఏతే జాతి దేశకాల సమయానవచ్ఛిన్నా స్సార్వభౌమా మహావ్రతమ్ ॥**

జాతి, దేశము, కాలము, సమయము అను వీనియందుగాని, మఱియే యవస్థయందుగాని, యమాంగములను తప్పక ఆచరింపవలయును. ఈ సూత్రముచే బ్రహ్మనిష్ఠులయొక్క మహాసార్వభౌమ వ్రతమును చెప్పు చున్నారు. ఇతరజాతులతో ఒకానొకప్పుడు కలిసికొన వలసి వచ్చినను, తన దేశము విడిచి మఱియొక దేశము వెళ్ళినను, వర్షగ్రీష్మాదికాలములలో నుండినను, ఏదైన అపత్సమయము వచ్చినను తనయొక్క వ్రతమునకు భంగము గలుగనీయకుండ చూచుటయే యోగులయొక్క మహావ్రత మనం

బడును. అనగా ఏ కాలములోనైనను ఏ దేశమందైనను, మఱి యేయిక్కట్టులు సంభవించినను తనయొక్క వ్రతమును చెరచుకొనరాదు. అనగా అభ్యాసము నుండి ఆరూఢ స్థితిగల్గి జీవన్ముక్తుడైనను. లేక విదేహముక్తి పొందినను, తన యొక్క సత్య ధర్మ శాంత దయా విరక్త్యాది గుణముల నతిక్రమించి ప్రవర్తింపరాదు. ఓహో! సాక్షాత్ పతంజలి మహర్షియే యీలాగున ఉపదేశించి యుండగా ప్రస్తుతము కొంచెమనుష్ఠానము గలిగినవారు తమకు విధినిషేధములు లేవని చెప్పి ప్రవర్తించుట యెంత అపాయకరము! దైవసాక్షాత్కారస్థితి గల్గుటకు అనేకమార్గము లున్నట్లు శ్రీపతంజలిమహర్షి తెలిపిన లాగున శ్రీకృష్ణభగవానులుగూడ ఉపదేశించి యున్నారు.

**ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।**
**అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥**

జిజ్ఞాసువులగు కొందఱు ధ్యానయోగముచేత పరమాత్మను పొందుచున్నారు. ముముక్షువులగు మఱికొందరు ధ్యానసమాధి యోగము చేయ నొల్లని వారై సాంఖ్యయోగముచే అనగా ఇరువది అయిదు తత్త్వములను విమర్శించి తత్త్వాతీతమగు పరమాత్మను పొందుచున్నారు. మఱికొందరు ఆత్మానాత్మ విచారణరూపమగు జ్ఞానయోగముచే అంతఃకరణశుద్ధి గలవారై సర్వేశ్వరుని పొందుచున్నారు. ఇకకొందరు నిష్కామకర్మయోగముచే, నీశ్వరార్పిత బుద్ధి గలవారై ప్రవర్తించుటచే హృదయశుద్ధిగల్గి జగదీశ్వరుని పొందుచున్నారు. అనగా కొందఱికి ధ్యానయోగములో ప్రీతియు, మఱికొందఱికి ఆత్మానాత్మ విచారణలో ప్రీతియు, ఇకకొందఱికి సాంఖ్యయోగములో ప్రీతియు, వేరు కొందఱికి నీశ్వరార్పిత కర్మయోగము చేయుటలో ప్రీతియు గల్గియుండును. కాన పైజెప్పిన నాల్గింటిలో దేనియందైన ఒకదానిలో దృఢభక్తివిశ్వాసములు గల్గి అనుష్ఠించినచో తప్పక బంధవిముక్తి గల్గును. ఇప్పుడు ధ్యానయోగము చేయుటకు తగిన శక్తిలేనివారున్ను, ఆత్మానాత్మవిచారణ చేయుటకు తగిన విద్యాశక్తి లేనివారున్ను, ఆలాగున సాంఖ్యవిచారణ చేయుటకు తగిన బుద్ధి దృఢత లేని

వారును, అట్లే నిష్కామకర్మయోగముచే సమస్తమున్ను ఈశ్వరా ర్పణ చేయుటకు తగిన మనోబలము లేనివారును ఎట్లు తరింపగలుగుదురో యని భక్తులు తరించుట కుపాయాంతరము నిరూపించుచున్నారు. ఓహో! భగవంతుని కరుణాతిశయ మహిమను ఏమని కొనియాడగలము!

**అన్యేత్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।**
**తేఽపి చాతితరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥**

పై చెప్పిన ధ్యానయోగము; జ్ఞానయోగము, సాంఖ్యయోగము, కర్మ యోగము మొదలైన వేవియును చేయుటకు శక్తిలేనివారున్ను, మోక్షము గలుగవలెనని అభిలాషయు గలవారు పరమదయాళురగు ఆచార్యులవలన పరమాత్మ నిట్లుపాసన చేయుడు అని ఉపదేశింపబడినవారై అట్టి గురూపదిష్ట మార్గములో భక్తిశ్రద్ధలు గల్గి అనుష్ఠింతురేని వారలుగూడ జననమరణ భవ సాగరమును దాటి పరమాత్మను పొందుదురు. అనగా జన్మరహితులయి మోక్షమును పొందుచున్నారని తాత్పర్యము.

ఇది పైజెప్పిన నాల్గుయోగముల ననుష్ఠించుటకేగాక, పుస్తకము చదువుటకైన చేతగానివారు తరించే మార్గమై యున్నది. రోగియైనవాడు వైద్య శాస్త్రము చదివి రోగముయొక్క గుణమున్ను, దానికి తగిన ఔషధముయొక్క ప్రయోగమున్ను తెలుసుకొన శక్తిలేకపోయినను కరుణా స్వరూపుడగు వైద్యుని యొక్క సహాయముచే ఔషధము గ్రహించి, వైద్యులు చెప్పేలాగున పథ్యముం డినచో రోగశమనము గల్గునుగదా! అట్లే ధర్మాత్ముడున్ను, కరుణాళువున్ను అగు గురువు "ఈలాగున ధ్యానము చేయుము, విరక్తి గల్గియుండుము. శాంతము గల్గి ప్రవర్తింపుము, ఎల్లకాలములోను భగవద్భావము అనగా దైవ నిష్ఠ గల్గి జీవింపుము"అని ఈలాగున ఉపదేశించిన వాక్యములలో శ్రద్ధాభక్తి గలిగి అనుష్ఠించువారు గూడ తరింపగలరు.

# దైవ ప్రార్థన

1. ఓ కరుణామూర్తీ! సర్వేశ్వరా! ప్రపంచములో గల సర్వజనులకున్ను, వారి యోగ్యతకు తగిన స్వాతంత్ర్యమున్ను, ఉన్నతపదవియు గలిగేలాగున అనుగ్రహించుదువు గాక!

2. దయామయా! ఈశ్వరా! యోగ్యతయున్ను, జ్ఞానమున్ను లేని జనులకు యోగ్యతయు, జ్ఞానమున్ను గలిగేలాగున అంతరంగ పరివర్తన మున్ను, బాహ్యసంస్కారమున్ను గలిగేలాగున ననుగ్రహము చేయుము. వీరిపై జనులకు ప్రీతి గలిగేలాగున నాశీర్వాదము నొనర్పుము.

3. బ్రహ్మచర్యవ్రతము,: బాలురకున్ను, బాలికలకున్ను దృఢముగా గల్గి జితేంద్రియులై, దయాస్వరూపులై, జ్ఞాననిష్ఠులై వారు తరించేలాగునను్ను ఇతరులను తరింపజేసేలాగునను్ను అనుగ్రహించుము.

4. వానప్రస్థులు తపస్సంపన్నులై, యోగశక్తి గలవారై, లోకోద్ధారపరులై, బ్రహ్మచారిణులకున్ను, బ్రహ్మచారులకున్ను వేదవేదాంతవిద్యల నేర్పుచు విషయవిరక్తులనుగాను, జ్ఞానసంపన్నులనుగాను చేసేలాగున నుపదేశించెడు స్వభావముగల వారుగా ఆశీర్వాదము చేయుము.

5. కారుణ్యానిధీ! పరమేశ్వరా! యతీశ్వరులు అధికరించి శమదమాది గుణములు గలవారై, సత్యార్థమును తెలుసుకొనినవారై, వైరాగ్యశీలురై, సర్వ భూతదయ గలవారలై లోకమంతటను సంచరించి సర్వజనులకు భక్తిజ్ఞాన వైరాగ్యముల నుపదేశించు స్వభావముగలవారై యుండేలాగున కరుణింపుము.

6. పరమపావనమూర్తియగు జగదీశా! యీ మూడు ఆశ్రమస్థులను సంరక్షించేలాగునను్ను, ధర్మబద్ధమగు విషయసుఖములను మాత్రమను భవించెడు వ్రతనిష్ఠగలవారుగను, భూతదయాతత్పరులుగను, ఉండేలాగున గృహస్థాశ్రమస్థులను ఆశీర్వదింపుము.

7. పరమాత్మా! పరమపురుషా! ప్రభువులు, ప్రజలను సంరక్షించు వారలుగను, జనులయొక్క యోగ్యత ననుసరించి ఉపకారము చేసే స్వభా

వముగల వారుగను, యోగ్యులుగానివారిని యోగ్యులుగా చేయుటకు ప్రయత్నించెడు గుణముగలవారుగను, ఉండేలాగున నాశీస్సును పంపి కరుణింపుము.

8. ధర్మశాస్త్రముల సంస్కరించి గుణకర్మలకు యోగ్యత సర్వజనుల కును గలిగేలాగున సచ్ఛాస్త్రముల సిద్ధాంతీకరించుటకు తగిన యోగబలము, జ్ఞానబలముగల పుణ్యపురుషులను సృష్టించి లోకమును సంరక్షించుటకు కృపగలవాడవై యుండుము.

9. సర్వజ్ఞా! సర్వశక్తా! ప్రాణిహింసాపరమగు సర్వకర్మలను, సర్వసంస్థలను నిర్మూలనము నొనరించి అట్టి శాస్త్రములు ప్రపంచములో లేకుండ జేయుటకు తగిన మహాపురుషులను, పుణ్యమూర్తులను లోకమునకు బంపి వారిద్వారా లోకమును పావనము నొనర్పుము.

10. ఓ జగద్రక్షకా! భగవంతుడా! సకాలమున వర్షము గురిపించి ప్రపంచములో సస్యసమృద్ధిగల్గి జనులున్ను, జంతువులున్ను సౌఖ్యము నొందులాగున అనుగ్రహము చేయుము.

11. సర్వజనులున్ను తమతమ మతములలో గల వైషమ్యమును విడిచి, అందరును సోదరభావము గల్గియుండేలాగున అనుగ్రహము చేయుము.

12. కారుణ్యైకసింధో! సత్యస్వరూపా! సర్వజనులున్ను ఆవరణము గలుగని యాత్మజ్ఞానము గలవారలై సోమరితనము లేనివారలై స్వాత్మ ధర్మములను సదా నిర్వహించుస్వభావముగలవారలై యుండేలాగున దయ చూపుము.

13. ఓ పుణ్యమూర్తీ! వేదప్రకాశకా! కరుణాసాగరా! సర్వజనులున్ను నాల్గు ఆశ్రమములును చక్కగా నిర్వహించేలాగున నవకాశమును గలుగజే యుము. వీరిలో నెవరికి నే ఆశ్రమములో నుండునపుడు, వానప్రస్థాశ్రమముగాని, యత్యాశ్రమముగాని స్వీకరించుటకు తగిన వైరా

వానప్రస్థాశ్రమముగాని, యత్యాశ్రమముగాని స్వీకరించుటకు తగిన వైరాగ్యము, కరుణ, జ్ఞానము గల్గినో అచ్చటనుండియే తురీయాశ్రమమును గ్రహించేలాగునను గ్రహింపుము. సర్వజనులున్ను, సమస్తశాస్త్రములున్ను, సకలసాధనలున్ను, వారి వారి గుణకర్మల యోగ్యత ననుసరించి యనుష్ఠించేలాగున నవకాశమును గలుగజేయుము. అందరున్ను, మీయొక్క స్వరూపులు అను జ్ఞానము గల వారలై యుండేలాగున కరుణింపుము.

దీనికన్న ఎక్కువ ప్రార్థన చేయుటకు గనుపించుట లేదు. పావనమూర్తీ! ఇది మీ నిజధర్మము గాదా!

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

# పునర్వివాహము

**స్వతంత్రాయ దయాక్లప్త విగ్రహాయ శివాత్మనే ।**
**పరతంత్రాయ భక్తానాం భవ్యానాం భవ్యరూపిణే ॥**

ఈ పునర్వివాహ విషయమైయున్ను, బాల్యవివాహనిషేధ విషయమై యున్ను అనేకులు అనేక స్థలములలో బహుకాలమునుండి మా అభిప్రాయ మేమని అడుగుచుండిరి. అయినను ఇది ప్రపంచవిషయ మగుటచేత నింత వఱకెవరితోను నీ విషయమై సరియైన నాయాశయమును దెలిప యుండలేదు. మఱల మఱల అనేకులు ఈ విషయమై నాయభిప్రాయమును పత్రికలో ప్రకటన చేయవలెనని కోరుచుండిరి. కావున నిప్పుడు ప్రపంచము నకు మదీయాశయమును దెలుపవలయునని తలంపు గల్గినది. లోకము భిన్న రుచి గల్గియున్నదను విషయము పండితు లందరికిని దెలిసిన విషయమే. అయినను మహాపురుషు లందరున్ను వారి వారి నిర్దిష్టాశయమును నిశ్చయ ముగా దెలిపియున్నారు. వారు బాహ్యాభ్యంతరశుద్ధి గలవారగుటచే లోపల నొకటి, బైట మఱియొకటి యుండుటకు అవకాశము లేదు. అట్లు గాక బాహ్యా భ్యంతరములలో మార్పు గలవారలు శుద్ధాత్ములై వెలుగజాలరు. ఇదియే దీనికి నిదర్శనము.

ఈ విషయమై శాస్త్రకర్తల యాశయమును గనుగొన దలంచినచో, దానియందుగూడ నీ సమస్య పరిష్కారము గాజాలదు. శాస్త్రమునకు సర్వతో ముఖత్వము గలదని పండితు లంగీకరించియున్నారు. మఱల శిష్టాచారమును పరిశీలించిన అదిన్ని దేశకాలములనుబట్టి అనేకములుగానే కానుపించు చున్నది. ఇచ్చటగూడ నీ సమస్యకు పరిష్కారము గల్గుట లేదు. మార్గము యొక్క నిర్దిష్టతా విషయమై ఈ క్రింది శ్లోకమే భారతమున నుపదేశింపబడి యున్నది.

**తర్కో౽ప్రతిష్ఠః శ్రుతయశ్చ భిన్నా నైకో మునిర్యస్య మతం ప్రమాణమ్ ।**
**ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం మహాజనో యేన గతః స పంథాః ॥**

1. న్యాయశాస్త్రమును పరిశీలించితిమేని ఆ న్యాయశాస్త్రమున కప్రతిష్ఠా

దోషము గలదు. అనగా ఇది యుక్తిపై నాధారపడియున్నది. కావున ఒకరు యుక్తిబలముచే ఒక విషయమును నేటి దినమున స్థాపించిరేని రేపటిరోజున వీరి యుక్తిని ఖండింప శక్తిగల మఱియొకరు దానిని పూర్వపక్షము చేయ గలరు. కనుక ధర్మనిర్ణయవిషయమై న్యాయశాస్త్రము పనికిమాలినదిగా నున్నది. అనగా నెక్కువగా చదువుకొన్నవారు, తక్కువగా చదివినవారిని జయించుచున్నారు. ఇది మృగబలమువంటిదేగాని, ధర్మబలము గాదు. ఇట్టిది రజో గుణము గల్గిన దుష్టరాజుల సాహసకృత్యమువంటిది. బలవంతుడైన వాడు, బలహీనుని అణచుచున్నాడు. దీనియందు సత్యమేమి గలదు?

2. శ్రుతిని పరిశోధించినను ఇట్టి ఫలమే గల్గుచుండును. ఏలన శ్రుతి యనేకమార్గములను చెప్పుచున్నది. దీనికి దృష్టాంతము అనేకమతముల నున్ను, తత్సంప్రదాయములనున్ను చూచిన చాలును. ఒక్కొక్కరున్ను వారి వారి మతమే శ్రుతిసమ్మతమనియు, ఇతరులవి వేదవిరుద్ధములనియు గూడ చెప్పుచున్నారు. కనుక నిచ్చటను నిలకడ గల్గుట లేదు.

3. ఇక మహర్షులను జూచినను ఒకేవిధమగు ప్రమాణముగలవారు కారు. కపిల, గౌతమ, వ్యాసుడు, పతంజలి మొదలగు ఋషులే దీనికి తార్కాణము.

4. ధర్మతత్త్వమో కనబడునది కాదు. దైవమేలాగున నిగూఢముగా నున్నదో దైవధర్మమున్ను ఆలాగున దృష్టిగోచర మగునది కాదు.

ధర్మతత్త్వము అనగా ఆత్మధర్మము హృదయగుహయందు నిగూఢ మైయున్నది. ఇక మహాజనులు ఏ మార్గము ననుగమించి వెళ్ళిరో, అట్టి మార్గము ననుసరించుటే శరణ్యమని శాస్త్రము నిర్దేశించినది. ఇచ్చట మహా జనమున కర్థమేమి గ్రహించి యుండవలసినదనగా, ఒక్కొక్క యుగములో (కాలములో)ను దేశకాల పరిస్థితి ననుసరించి అప్పుడుండెడు జనములలో నెవరు మహాత్ములై యుందురో, అట్టివారు ఏ ధర్మము నిర్ణయింతురో, అదే ధర్మముయొక్క మార్గమని గ్రహించవలెను. కనుకనే కృత, త్రేతా, ద్వాపర,

కలియుగాదులకు ప్రత్యేక ప్రత్యేకముగా ధర్మశాస్త్రము లేర్పడినవి. పరాశరస్మృతి జూడుడు.

**కృతే తు మానవా ధర్మాస్త్రేతాయాం గౌతమాస్స్మృతాః ।**
**ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాస్స్మృతాః ॥**

కృతయుగంబున మనుస్మృత్యుక్త ధర్మములును, త్రేతాయుగంబున గౌతమస్మృతి ప్రతిపాదిత ధర్మంబును, ద్వాపరయుగంబున శంఖలిఖిత స్మృతివిహితధర్మంబులును, కలియుగంబున పరాశరోక్త ధర్మములును అనుష్ఠేయములు.

**అన్యే కృతయుగే ధర్మాస్త్రేతాయాం ద్వాపరే యుగే ।**
**అన్యే కలౌ యుగే నౄణాం యుగరూపానుసారతః ॥**

ధర్మముల ననుష్ఠించు మనుష్యుల శక్తితారతమ్యముననుసరించి కృత, త్రేతా, ద్వాపర, కలియుగములందు ధర్మములు భిన్నము లయియుండును.

**యుగే యుగే చ యే ధర్మాస్తత్ర తత్ర చ యే ద్విజాః ।**
**తేషాం నిందా న కర్తవ్యా యుగరూపా హి తే ద్విజాః ॥**

ఆయా యుగంబులందు (ఆ యా కాలమునందు) ఏ యే ధర్మములు నిర్ణీతము లయియున్నవో, ఆయా ధర్మముల నాచరించుచు ఏయే ద్విజులుందురో అట్టి ద్విజులను నిందింపరాదు. వారు ఆ యుగధర్మము ననుసరించి ఆ విధముగా నున్నవారలు.

దీనివల్ల ఆయా కాలముల ననుసరించి నడువ వలయుననియే శాస్త్ర కర్తల నిర్ణయమై యున్నది. ఆ కాలములో నెవరు గొప్పవారుగా నుందురో వారు చెప్పునదే ధర్మమని శాస్త్రసిద్ధాంతమై యున్నది. ఇదే యథార్థమైన ధర్మ తత్త్వము. ఇట్లుండిన మాత్రమే జనులు సుఖముగ జీవింపగలరు. దైవకార్యము గూడ నిర్వహింప గల్గుదురు. కలియుగ ధర్మనిర్ణేతలగు శ్రీపరాశరులుగూడ నెప్పుడెప్పుడు, పూర్వాచరిత ధర్మమునకు చలనము గల్గునో, అప్పుడప్పుడు,

ఆకాలానుగుణముగా అత్తరి నుండు, మహాపురుషులు ఏది ఆచరణయోగ్య మని నిర్ధారణ చేయుదురో, అదే ధర్మమని శాసించియున్నారు. దీర్ఘదృష్టి గల వారందరును నీలాగే చెప్పుదురు. ఇదే నిజమైన ధర్మోపదేశము. ధర్మశాస్త్రము లన్నియు రాజకీయనీతుల ననుసరించియే యుండును. ఏ రాజు ఏ కాలము నకు ఏ శాసనము మహాపురుషుల సహాయముచేగాని, స్వయముగాగాని ఏర్పాటు చేయునో, అది యేలాగున ఆచరణయోగ్యముగా నుండునో, ఆలాగు ననే ధర్మశాస్త్రమును గూడ వినియోగపరచవలయును. "అది అట్లు కూడదు. వేదము సనాతనము. ఆలాగుననే నడువవలయు"నని చెప్పువారు, వాక్య ములో మాత్రము అట్టి జ్ఞానము నుపయోగపరతురేగాని, నిజముగా క్రియ లలో ఆచరించువారెవరైన గలరా! క్రియాశూన్యమగు వాక్యము నుచ్చరించుట దైవద్రోహమున్ను ఆత్మవంచనమును గదా? ఇది యొక్కొక్కరున్ను, వారివారి యంతరాత్మలలో సత్యబుద్ధితో బరిశీలన సలిపిన తప్పక వారే చెప్పగలరు. అట్లు చేయనివారు మాత్రమే కయ్యమునకు కాలుదువ్వుదురు.

హిందూరాజుల కాలములోగల ధర్మశాసనము మహమ్మదీయ కాలములో ఉపయోగమునకు వచ్చినదా? మహమ్మదీయ పరిపాలనా సమయ ములో నుండిన శాసనము ఇంగ్లీషుప్రభుత్వమున కుపయోగపడునా? లేదు గదా! జనులయొక్క ధర్మశాస్త్ర మాలాగున నుండును. అయితే యిది లోక మునకు సంబంధించునేగాని మతమునకు సంబంధించునా? అని ప్రశ్న వేయుదురు. ఈ రాజకీయనీతి మతములో పెట్టవలయునని చెప్పలేదు. మత కర్తలు, సంఘసంస్కరణ నిర్మాతలు, లోకమంగళకాంక్షగల భారతీయ మహా పురుషులు కాలానుగుణముగా మతధర్మము నేర్పాటు చేయుచున్నారు. ఆలాగున నిష్టము గలవారు నడువవచ్చుననియు, నిష్టము లేనివారు మాన వచ్చుననియు, నిచ్చట ప్రస్తావించుటయేగాని మఱియేమియును గాదు. అయితే కాలచక్రమున కడ్డు పోదలంచిన, బండిచక్రమును తిరుగనీయక చీమ అడ్డు నిల్చిన ప్రయోజన మెంతయో అంతే గల్గును. పునర్వివాహ విషయమై గాని, రజస్వలానంతర వివాహ విషయమైగాని, కేరళదేశములో బ్రాహ్మణులకు

తప్ప, క్షత్రియ, వైశ్య, శూద్రులు మొదలైన వారికి నీ సంబంధ మేమియు లేదు.

కేరళబ్రాహ్మణులుగూడ పురాతనరీతిని సంస్కరించుకొనుచున్నారు. ఈ దేశములో క్షత్రియులకున్ను, శూద్రులకున్ను, రజస్వలానంతర వివాహమునకు నేలాటి నిషేధమున్ను గల్గియుండలేదు. ఏమి? వీరు వేద దూరులా? వీరికి, వేదము ప్రమాణము గాదా? వీరిలో రజస్వలానంతర వివాహ ముచే తక్కిన జాతులకన్న నీచకార్యములేవైన అధికముగా గలవా? వీరికి దైవ కృప గలుగలేదా? లేక వీరిలో దైవజ్ఞానము గల్గినవారలు ఇంతవఱకుండలేదా? అని యడుగవచ్చును. అయితే ఈలాటి కార్యము లన్నియు, నేదోయొక్క అలవాటునుబట్టి వచ్చినవేగాని మఱియొకటి కాదు. దృష్టాంతము జూడుడు.

క్షత్రియులలో కొందఱున్ను, శూద్రులలో కొన్ని తెగలవారున్ను స్త్రీలకు, ఘోషాపద్ధతి నేర్పరచిరి. ఇట్టి ఘోషాసంప్రదాయము లేనిచో స్త్రీశీలము శుద్ధముగ నుండదని చెప్పుదురు. ఇది వారి ధర్మమనిగూడ నిర్బంధముగ పలుకుదురు. అయితే బ్రాహ్మణులలోను, వైశ్యులలోను ఘోషాసంప్రదాయ ములేని స్త్రీలకు క్షత్రియశూద్రులలోగల స్త్రీలకుగల శీలశుద్ధి లేదా? దీనివల్ల వారిలోగల స్త్రీలు దుష్టవర్తనలో నుండువారని ఎవరైన చెప్పగలరా? ఈ ఘోషా సంప్రదాయముగూడ, కొన్ని దేశములలో మాత్రమేగాని, భరతఖండ మంత టనులేదు. ఇది యెప్పుడో యేర్పడిన యొక ఆచారమేగాని ధర్మశాస్త్రము గాదు. గుజరాత్ మొదలగు కొన్నిదేశములలో, కొన్ని జాతులలో గల స్త్రీలున్ను శిరస్సు, ముఖము వస్త్రముచే మూసికొని యుందురు. కర్నాటక దేశీయస్త్రీలు శిరస్సు మాత్రము సదా వస్త్రముచే మూసికొని యుందురు. వీరి నడిగినచో అది వారి ధర్మమనియే చెప్పుదురు. విచారణదృష్టితో జూచిన, ఇవన్నియు ఒకవిధమగు దేశాచారములే గాని, మఱియొకటి కాదు.

ఘోషాపద్ధతి ధనము గల్గినప్పుడు గౌరవ చిహ్నముగా నేర్పరచినదే గాని మఱి యేమియు దీనియందు సారము లేదు. ఇప్పుడది దురాచార మనియు, బుద్ధిహీనతయనియు విజ్ఞులు తలంచ మొదలిడిరి. కారణమేమన?

ఒక్క వంశములోనే శ్రీమంతులు గానివారికి నిట్టి ఆచారము గనుపించుట లేదు. ఇది ధర్మతత్త్వము గాదు. అంతఃకరణశుద్ధి గల్గుటకు హేతువైన ధర్మమెద్ది గలదో, అదే నిజమైన ధర్మమగును. అట్టిది యీ బాహ్యాచారములో గనుపించదు. అది ఆత్మయొక్క సత్య, దయా, భక్తి, విరక్తి, జ్ఞాన, విజ్ఞానము లలో గలదు. అట్టి దైవికములగు పావనగుణములను ఆర్జించుటలో నీ ఘోషాపద్ధతి స్త్రీలకు ప్రతిబంధము గలుగజేయుచున్నది. భక్తివిరక్తి కరుణాది సుగుణజలముతో హృదయమును గడిగి శుద్ధపఱచుకొనవలయును. అప్పుడు మాత్రమే ఆత్మశుద్ధి గల్గును. అట్టి వారి హృదయమున నిర్మలోదకములో భాస్కర ప్రతిబింబము గనుపించునట్లు ధర్మతత్త్వమగు పరమాత్మస్వరూప మును కనుగొనవచ్చును. సువర్ణపాత్రము చిత్రవిచిత్రములతో నిర్మించినను దానియందుగల జలము నిర్మలము గానిచో మీ ముఖమేలాగున గనుపడదో, ఆలాగున బాహ్యకృత్యము లన్నియు నేలాగున నుండినను అంతఃకరణశుద్ధి గలుగనిచో ఈశ్వరసాక్షాత్కారజ్ఞానము గోచరము గాదు. ముఖ్యముగా నింద్రియములయొక్క నిగ్రహమే ఆత్మశుద్ధిని గలుగజేయును.

స్త్రీలకు పునర్వివాహము శాస్త్రసమ్మతమా? లేక యసమ్మతమా? అను ప్రశ్నపై నీ వ్యాసము ప్రారంభించడమైనది. దీనికి ఇచ్చు సమాధానము ఇంత వఱకు మీరు వినియుండెడి రీతిగాదు. హిందూశాస్త్రముయొక్క సిద్ధాంతము ఏ రీతినైనను జీవులు ఈశ్వరుని పొంది ముక్తులై శాశ్వత సుఖస్వరూపులై యుండవలయు ననుటయే సుమీ? ఇది హిందూశాస్త్రముయొక్క ముఖ్య తత్త్వమగుటచే దీనియందు లక్ష్యము నుంచువారికి తక్కిన నియమము లన్నియు అముఖ్యములే యగును. లేక గౌణములే యగును. ఏలన? సూర్యునియొక్క ప్రకాశములో తక్కిన చంద్ర, నక్షత్ర, దీపాదుల కాంతు లన్నియు లీనమైపోవునట్లు దైవజ్ఞానములో నితరకర్మజ్ఞానము లన్నియు విలీన ములు. దైవమును పొందెడు ధర్మములో తదితర ధర్మకోట్లన్నియు గౌణ ములు, అముఖ్యములు. దైవధర్మము ప్రధానము. అది సముద్రమువంటిది. తక్కిన ధర్మసముదాయము లన్నియు నదీనదములను బోలియుండును. అవి

యావత్తున్ను సాగరములో ఐక్యమగును గాని, సముద్రము మాత్రము ఏ నదిలోను నైక్యముగాదు. క్రింది కోర్టులలో గలతీర్మానములన్నియు హైకోర్టులో రద్దుగావించబడును. హైకోర్టు తీర్మానము క్రిందికోర్టులలో నిరసింపవీలు గాదు. కనుకనే సమస్తధర్మములున్ను, కర్మములున్ను, దైవజ్ఞానాగ్ని యందు దహించబడునని శాస్త్రము చెప్పుచున్నది. పురుషులకు పునర్వివాహము శాస్త్రమంగీకరించి యుండినచో స్త్రీలకున్ను అట్టి అంగీకార మవశ్యముండే తీరవలయును. అట్లుగాని శాస్త్రము పక్షపాతులచే నిర్మితమేగాని, నిష్పక్షపాతియగు సర్వేశ్వరునిచే నిర్మితము గాదు. ఇట్టి పక్షపాతమున కేలాటి ఆధారమును గనుపింపదు. ఒక తప్పు ఇద్దరు చేసినచో, ఒకరిని శిక్షించుట మఱియొకరిని మన్నించుట న్యాయము గాదు. ఇట్లు చేయుట కేలాటి కారణ మున్ను తత్త్వజ్ఞులకు గనపడదు. ఇది యొకరిని అల్లునిగాను, మఱియొకరిని అన్యునిగాను చేర్చిన రీతిగానుండునేగాని, మఱియేమియు దీనియందు సత్యము గానరాదు. ఈ విషయమై వీనియొక్క యాశయము నిప్పుడు దెలి పెదను.

1. స్త్రీలుగాని, పురుషులుగాని యావజ్జీవితము బ్రహ్మచర్యవ్రతములో నుండి యీశ్వరసాక్షాత్కారజ్ఞానమును గలుగజేసుకొని, జన్మరహితమైన ముక్తిని బొందవలయును. విషయసుఖములు, పశుపక్ష్యాది జన్మలతో పూర్తియై పోయినవి. మనుష్యజన్మము ఈశ్వరసుఖమును బొందుటకొఱ కేర్పడినది. అయితే యిది సాధ్యమగునా! యని అనేకు లడుగవచ్చును. దానికి సమా ధానము- ఎందుకు సాధ్యము గాదు? శ్రీశుక సనకాది అనేక మహర్షులున్ను, శ్రీ శంకర మధ్వాచార్యాది అనేకమతోద్ధారక గురువులున్ను; సులభ, గార్గి మొదలైన అనేకయోగినులున్ను అనుష్ఠించలేదా? అయితే, అట్లు ఆచరించిన జగత్సృష్టి యాగిపోవును గదా! యని సందేహపడుదురేమో! అట్లు సంశయింప నక్కర లేదు. ఏలన? ఈ జగత్తును మీరు కంట్రాక్టుకు తీసుకొనియున్నారా! దానిని గురించి మీరేమియు భయపడనక్కరలేదు. అది దానిననుసరించి యుండిన నుండునుగాక లేక ధ్వంసమై పోయిన బోవునుగాక! మీరందరున్ను

దుఃఖములేని పదవిని పొందజూచిన చాలును.

ఈ ప్రశ్న యెటువంటిదనగా? మహాసాహసముగల ఒక పరమదొంగ యుండెను. అతనిని పట్టుకొనుటకు ఎన్నియో ప్రయత్నములను గవర్నమెంటు వారు చేసినను, దొరికిన వాడుకాడు. అతని పాపకర్మము పరిపక్వదశకు వచ్చినందుచే, ఒక సమయమున పోలీసువారికి దొరికెను. న్యాయస్థానములో విచారణ సలిపినప్పుడు, ఆ గజదొంగ మాబోటి దొంగలు లేనిచో మీబోటి యుద్యోగస్థులకు నెట్లు జీవనము గల్గును? ఈ గవర్నమెంటువారు ఏర్పాటు చేసిన కోర్టులు, జైలులు అన్నియు వ్యర్థమై పోవునుగదా! అని చెప్పేలాగున నుండును.

మీరు ఈ జగద్వ్యాపారమును నిలబెట్టజూచిన అది నిలుచునా? భూకంపముచేతను, సముద్రముయొక్క ఆక్రమణముచేతను, నెన్నియో దేశములు విలయములై పోయినవి. మఱియు ప్రళయకాలము వచ్చునప్పుడు మీరు అడ్డు నిలువగలరా? ఈలాగున నెన్నియో సార్లు ప్రళయములు గల్గినవి. ఇక నెన్నియో సార్లు జరుగగలవు. వానికన్నిటికిన్ని మీరా కర్తలు? అట్లుగాక, ఇది యీశ్వరాజ్ఞకు విరుద్ధమని యేమైన తలంతురేమో? అట్లయిన బ్రహచర్య వ్రతమునుండి ముక్తులైన మహనీయు లందరున్ను, ఈశ్వర ద్రోహులు గావలసివచ్చును గదా! అట్లెవరైన చెప్పగలరా? అట్లుగానిచో బ్రహ్మ చర్యవ్రతమున్ను, సన్న్యాసాశ్రమమున్ను పరమపవిత్రము లనియు, ఇవి లేనిచో నీశ్వరజ్ఞానము గలుగజేసుకొనుటకు ప్రయాసమనియు, శ్రుతి యేలాగున చెప్పియుండును? కావున, వేదమాతకు మిమ్ములను దుఃఖపెట్ట నిష్టము లేదు.

వేదము, బ్రహ్మజ్ఞానమును స్తోత్రము చేయుచున్నదేగాని కర్మజ్ఞాన మును స్తుతించుట లేదు. ఈలాగున నిర్మలమగు బ్రహ్మచర్యవ్రతములో కాలము గడిపి యీశ్వరజ్ఞానమును గలుగజేసికొనిన వారి యిరువది తరముల వారు ప్రేతలోకమునుండి ఉద్ధరింపబడుదురు. రాబోవు ఇరువది తరముల వారలు పుణ్యలోకప్రాప్తి నొందుదురు ఇట్టి పుణ్యాత్ముని దర్శించువారి

పాపము నశించునదే గాక వారికి పుణ్యబుద్ధియుగూడ వృద్ధి నొందగల్గును. ఇట్టి యాత్మజ్ఞానియొక్క వంశము పావనమగును. తల్లిదండ్రులు ధన్యాత్ము లగుదురు. అట్టి వారిని స్మరించువారి హృదయము నిర్మలత నొందును. అట్టి వారిని మనస్సులో తలంచుకొని యే కార్యమైన ప్రారంభించిన అది నిర్విఘ్న ముగ సఫలమగును.

ప్రయాణకాలములోగాని, యేదైన ప్రారంభించునప్పుడుగాని అట్టివారు కనుపించినచో అది మంచిశకునమే యగును. అట్టివారిని చిత్తములో స్మరిం చిన సర్వదుఃఖములును శమించును. పరమశాంతియు, అమితప్రేమయు, అనిర్వచనీయమైన ప్రసన్నతయు, అపారమగు సుఖమున్ను గల్గును. కనుకనే మహాపురుషుల సేవ పరమపావనమని శ్రుతి బోధించుచున్నది. దీనికి ప్రమాణ ములు కోరువారు 'ఓంకారోపాసన' గ్రంధములో కనుగొనవచ్చును.

ఇట్లుగాక, ఒకవేళ వివాహము జరిగినను, జీవితాంతమువఱకు నీశ్వర నిష్ఠలో కాలము గడిపి బ్రహ్మచర్యవ్రతమునుగూడ సలిపి జీవించవచ్చును. ఇదిన్ని సాధ్యమగునా? యని తలంచవచ్చును. సాధ్యమనియే భగవాన్ శ్రీరామకృష్ణపరమహంసలు ఉపదేశించిరి. దానికి ఆ పరమఋషియొక్క జీవితమున్ను, నిజధర్మిణియగు శారదామణిదేవియొక్క ఆచరణయు మనకు నీ కలియుగమునకు తార్కాణమై యున్నవి. ఇట్లు జీవించవలయుననియే ఆ దైవదంపతులు, మన కనుష్ఠించి చూపియున్నారు. దీనియందేమానవునికిన్ని సందేహము గలుగదు.

వివాహముయొక్క ముఖ్యోద్దేశ్యము విషయభోగము కాదు. దైవకార్య మున నొకరికొకరు సహాయము గల్గియుండవలెననియే శాస్త్రాభిప్రాయము. పైజెప్పిన వారు వివాహితులైనను వివాహితులు గారు. ఇట్లు ఆచరించువారికి నీజన్మములో నేలాటి దుఃఖమున్ను గలుగక నిత్యసుఖస్వరూపులై యుండ వచ్చును. వీరికెంతో లోకసేవ చేయుట కవకాశము గలదు. సదా పరతంత్రులు గాక స్వతంత్రులై జీవితమును ధన్యము గావింపవచ్చును. వివాహమునకు

ముందు స్త్రీకిగాని, పురుషునికిగాని, కాలివ్రేలికి మెట్టు (ఉంగరము) పెట్టరు. వివాహసమయమందే యీ కార్యము జరుగుచుండును. దీనియొక్క రహస్య మేమన? ఇంతవఱకు వారు బద్ధులు గారనియు, ఇప్పటినుండి సంసారమను గొలుసుచే బంధింపబడిన వారైరనియు తెలుసుకొనవలెను. పైజెప్పిన వివాహ మునకు నీశ్వరవివాహమని పేరు. దీనికి బ్రహ్మవివాహమని నామాంతరము గలదు.

2. ఇక నెంతవఱకు స్త్రీలుగాని, పురుషులుగాని బ్రహ్మచర్యవ్రతములో నిర్మలమైన మనోవాక్కాయకర్మములచే నుండుటకు సాధ్యమగునో, అంత వఱకుండి సాధ్యము కాదని తోచిన సచ్ఛాస్త్రములచేతను, సత్పురుషుల చేతను బోధింపబడినవారలై మనస్సును శుద్ధపడేలాగున చేసుకొన బ్రయ త్నించియు సాధ్యముగాదని తోచినను, సంసారములోగల కష్టము లన్నిటిని, మనస్సులోనికి తెచ్చుకొని, యితరులు పడుచుండు సంకటములను జూచియు, సంసారబంధము లేనివారియొక్క స్వేచ్ఛయు, స్వచ్ఛమైన జీవిత మున్ను, వారియొక్క దైవసుఖమున్ను, లోకపూజ్యతయు మనస్సులోనికి తెచ్చుకొని, మఱల మఱల చింతనచేసుకొనియు, నివృత్తి లేదని తోచినచో మాత్రము వివాహము చేసుకొనవచ్చును. అదిన్ని మనస్సు నిర్మలావస్థ గల్గ వఱకు మాత్రమే యుండవలెను. మఱల బ్రహ్మచర్య వ్రతమవలంబించ వలయును. వీరికి వయోనిర్ణయము లేదు. అనగా 30గాని, 40గాని, 50గాని వయస్సు గల్గినను విరోధము లేదు. వీరియొక్క పదితరములనుండి గతించిన వారలకును, రాబోవు పదితరములవారికిన్ని సద్గతి గల్గును. వారు పవిత్రు లగుదురు. వీరి వంశము కాలక్రమముగ పావనమగును. వీరి పితరులు సంతుష్టి గలవారై యుందురు. ఇట్టివారిని తలంచువారికి ధర్మబుద్ధి అధిక ముగ గల్గును. అధర్మబుద్ధి తొలగిపోవును. వీరి దర్శనము కొంతవఱకు శుభ దాయకము. వివాహకాలములో వీరిని స్మరించిన స్త్రీలకు వైధవ్యము గలుగదు. పురుషులకు భార్యావియోగ ముండదు. వీరి జీవితయాత్ర దుఃఖము లేనిదిగను, దైవప్రీతి గల్గునదిగను నుండును. వీరికి నీ జన్మములో ఒకవేళ

ముక్తి గలుగక పోయినను మరుజన్మలో ముక్తి గలిగేలాగున ఉత్కృష్ట జన్మము గల్గును.

ఏలన? సంపూర్ణముగ దృశ్యవిషయవాసన నశింపక మోక్షము గల్గుట కవకాశము లేదు గదా! అట్టి అవస్థ వీరికి గల్గినచో ముక్తులే. సందేహము లేదు. వీరున్ను దైవలోకములో పూజ్యు లగుదురు. వీరి సంతానములలో కొందరు విరక్తిగల్గి సాధుశీలము గలవారలై యుందురు. వీరి సంతానము ఋషి సంతానమువలె నుండును. ఋషులు ఈలాగుననే జీవించిరి. వీరి వివాహము దైవవివాహ మనంబడును. వీరి బిడ్డలు దీర్ఘాయుస్సు గలవారున్ను, సత్యధర్మ నిష్ఠగలవారున్ను, తల్లిదండ్రుల నుద్ధరించువారున్ను, లోకోద్ధారకులుగ నుందురు. వీరు ఋషులవలె నిమిత్తమాత్రము సంసారకార్యములో నుందురే గాని జీవితమంతయు దైవకార్యములోను, లోకసేవలోను గడుపుదురు. మంచి ముదిరిన బీజము సారవంతమైన క్షేత్రములో పెట్టి పెంచిన నెట్లుండునో ఇట్టి తల్లిదండ్రులకు పుట్టెడు బిడ్డలున్ను ఆలాగుననే యుందురు.

ఈలాటి పవిత్రవివాహమునకు బాల్యవివాహము చాలా అడ్డు గలుగ చేయుచున్నది. చిన్నతనములో వివాహము చేయుటచే దాంపత్యము సరిపడక పోవుటచే నెందరో స్త్రీపురుషులు కష్టములకు పాత్రులగుచున్నారు. మఱియు కొందరు పురుషులు విరక్తులైనచో సర్వసంగపరిత్యాగమునకు గొప్పభారము గల్గుచున్నది. ఆలాగున విరక్తురాండ్రగు నారీమణులుగూడ సంసార సాగరము నీదలేక సంకటపడుచున్నారు. కొందరి భర్తలు రాక్షసగుణము గల వారగుటచే దైవగుణముగల నారీమణులు పరితపించుచున్నారు. మఱి కొందరు పరిశుద్ధాత్ములగు పురుషులకు బ్రహ్మరక్షస్సులవంటి భార్యలు లభించుటచే వీరును కష్టముల పాలగుచున్నారు. ఇవియన్నియు బాల్య వివాహముచే గల్గెడు అనర్థములు. యౌవనకాలము వచ్చినతర్వాత వివాహము చేయు విషయములో నీలాటి కష్టము లేమియు గల్గుటకు హేతువుండదు గదా! వివాహము ఈ ధర్మబద్ధమగుటచే, మధ్యకాలమున విడిచిపెట్టుట కను కూలము లేదు. మొదట చెప్పినవారు దైవస్వరూపు లగుటచేతను, లోకాతీత

జ్ఞానముగలవా రగుటచేతను వారి వివాహము లెక్కలో చేరదగినది కాదు.

3. యౌవనకాలమువఱకు పరిశుద్ధమైన బ్రహ్మచర్యవ్రతములో స్త్రీ పురుషు లుభయులుండి, ధర్మశాస్త్రమును చక్కగా చదివి, పావనమగు గురు కులవాసము చేసినతర్వాత చేయు వివాహము ఆర్ష మనంబడును. ఆర్షమనగా ఋషిసంప్రదాయము ననుసరించునదని భావము. యౌవన కాలమనగా 16 సంవత్సరముల వయస్సు స్త్రీలకున్ను, 26 సంవత్సరముల వయస్సు పురుషులకున్ను గల్గునప్పుడే యౌవనము ప్రారంభమగును. వీరున్ను సత్సంతానాభిలాషులై మాత్రమే విషయపరులై యుండవలయును. అదిన్ని ఋతు కాలములో మాత్రమే విషయములో ప్రవర్తించవలెను. మఱల గర్భము ధరించి, ప్రసవించి శిశువునకు రెండుసంవత్సరముల వయస్సు వచ్చువఱకున్ను బ్రహ్మచర్యవ్రత మవలంబించవలయును. కనుకనే సామాన్య స్త్రీలు మూడు సంవత్సరముల కొకసారి ప్రసవించెడు స్వభావము గల్గియున్నారు. అట్టి గృహస్థాశ్రమము యౌవనాంతమువరకే యుండవలయును. మఱల వానప్రస్థాశ్రమముకొఱకు సన్నద్ధులై యుండవలయును.

యౌవనాంతము 50 సంవత్సరములలో పూర్తి యగును. తర్వాతగాని, ఋతుకాలధర్మము నతిక్రమించిగాని శిశువునకు రెండుసంవత్సరములు దాటి మూడవయేడు వచ్చుటకు ముందుగానే విషయప్రవర్తకులైనచో మంచి సంతానములు గలుగవు. అల్పాయుస్సున్ను, స్వల్పబుద్ధియు, కుయుక్తియు గల్గినట్టియు, ధర్మబుద్ధిలేనియు దైవజ్ఞానము గలుగని వారునగు శిశువులే కల్గుదురు. వీరు ధర్మదూరులును, మాతాపితరులకు ద్రోహులుగా నుందురు. బాగుగ ముదురని విత్తనము సారరహితమైన చవిటిభూమియందు పెట్టి పోషించినను అది మంచి వృక్షమై చక్కగా ఫలము నివ్వదు గదా! ఇట్టి బిడ్డల యొక్క గతియు నీలాగున నుండును. కావున నిట్టి దోషములకు పాల్పడక పై జెప్పిన పావనగృహస్థ బ్రహ్మచర్యముతో నుండెడు వంశము మంచిదిగా నుండును. వీరివల్ల పితరులు ప్రేతలోకమునుండి యుద్ధరింపబడుదురు. వీరి గృహస్థాశ్రమధర్మము పుణ్యమైనది. వీరు సంసారములో నున్నను, ఎక్కువ

బద్ధులు గారు. ఈ వివాహము దేవతలకున్ను, ఋషులకున్ను ప్రీతికరమైనది. కనుకనే ఆర్షమని పేరు వచ్చినది. సజ్జనులకు సంతోషము గలుగజేయునది. మూడుతరములవఱకున్ను ఇట్టి వారివంశములో సత్సంతానములు గల్గు చుండును. పరమభక్తులున్ను, బ్రహ్మనిష్ఠులున్ను వీరి కులములో జన్మిం తురు. వీరివంశముగూడ పావనవంశమని ఋషులున్ను, దేవతలున్ను, సజ్జను లున్ను గొనియాడుచుందురు. లేక ఒకవేళ రజస్వలా పూర్వము వివాహము గల్గినను 16 సంవత్సరముల వయస్సు గల్గులోపల భర్తతోగూడి గృహస్థ ధర్మములో అనగా గర్భాధాన కార్యములో ప్రవేశింపరాదు. ఋతుకాల నిర్ణ యము మనుస్మృతిలో జూడుడు.

**ఋతుస్స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః ।**
**చతుర్భిరితరైస్సార్ధమహోభిస్సద్విగర్హితైః ॥**

స్త్రీలకు స్వాభావికముగా పదునారు దినములవఱకు ఋతుకాలము. అందు మొదటి నాలుగు దినములు సజ్జనులచే నిందితములు. అనగా సజ్జను లైన వారు ఈ నాల్గుదినములు త్యాజ్యములని దెల్పిరి.

**తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా ।**
**త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః ॥**

ఆ ఋతుకాలపు దినములలో, మొదటి నాలుగు దినములును పదు నొకండవ పదుమూడవ దినములు నిందితములు. తక్కిన పదిరాత్రులు ప్రశస్తములు.

**నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్ ।**
**బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్ ॥**

ముందు చెప్పిన నిషిద్ధములైన మొదటి నాలుగు దినములు, పదునొ కండవ, పదుమూడవ దినములును, అమావాస్య, పున్నమ, ఏకాదశి, ప్రదోషము మొదలగు వ్రతదినములను వదలిపెట్టి, తక్కిన రాత్రులు పత్నితో

గూడిన వాడు ఏ యాశ్రమము (గృహస్థాశ్రమము) నందున్నను బ్రహ్మచారియే యగుచున్నాడు. స్త్రీయున్ను బ్రహ్మచారిణియే యగుచున్నది. మొదటినాల్గు రోజులు త్యాజ్యము లగుటకు కారణమేమన? ఈ దినములలో స్త్రీలకు రక్తములో మాలిన్యము గల్గియుండును. అట్టిదానిలో గలిగెడు శిశువులకు భూతప్రేత పిశాచాదుల గుణములు గల్గును. 16 రోజులు పోయిన గర్భాశయము మూసికొనిపోవును. అట్టికాలములో బిందువు వ్యర్థమైపోవును. అంతేగాక బిందువు శుద్ధముగా నుండదు. ఇట్టి వివేచన చేయక కలిగెడు సంతానములు ఊషర క్షేత్రములో లేతవిత్తనముగాని లేనిచో కొంత కుళ్ళిన విత్తనముగాని పెట్టిన పుట్టెడు వృక్షము దుర్బలమై, చక్కగ ఫలము నివ్వజాలక యున్నట్లు జ్ఞానములోను, బుద్ధిలోను, శరీరబలములోను, సుగుణములలోను హీనులై పోవుదురు.

ఋతుకాలముయొక్క మొదటి నాల్గురోజులు దాటునప్పుడు శోణితము చాల శుద్ధమై, మంచి కాంతి గల్గి సారమైన జవసత్త్వములు గలిగి యుండును. ఆలాగున పురుషునికిన్ని సరియగు బ్రహ్మచర్యముండిన శుక్లము శుద్ధమై, స్ఫటికమణివలెగాని, శుద్ధమైన పాదరసమురీతిగాని, ధవళమై సుగంధ వాసన గల్గి సారమగు మేధాశక్తి గల్గుటకు తగిన ప్రాణశక్తిని గల్గియుండును. వీరికి గల్గిన బిడ్డలు ఉత్కృష్ట క్షేత్రమున పరిపక్వబీజము పెట్టిన వృక్షమువలె తేజోవంతులై జ్ఞానశక్తి, శరీరబలము, ధర్మబుద్ధి గలవారలై యుందురు. అట్లుగానిచో శుక్లము చాల ద్రవరూపము గల్గి పచ్చని వర్ణముతో దుర్వాసన గల్గి యుండును. అట్టిదానితో నుద్భవించు శిశువులు రోగులుగను, కురూపులుగను, కుయుక్తులుగ నుండి పైశాచిక గుణములు గల్గియునుందురు.

కనుక వంశోద్ధారక సంతానముకొఱ కభిలాష గలవారు పైజెప్పిన పవిత్ర గార్హస్థ్యము నవలంబించవలయును. గర్భాధానము గలిగిన రోజు నుండి గర్భాశయము మూసికొనిపోవును. తర్వాత కలిగెడు బిందుపతనము వ్యర్థమైపోవును. స్త్రీలు ప్రసవించి, రెండు సంవత్సరము లగువఱకు రక్తమునకు శుద్ధియున్ను, బలమున్ను ప్రాణశక్తియు గల్గియుండరు. కనుకనే ఇట్టి

కాలములు వర్జనీయములని ఋషులు చెప్పిరి. ఈ మనుస్మృతి ధర్మశాస్త్రము లన్నిటికిన్ని మూలమైనది. ఇది స్వాయంభువ మనువుచే నిర్మింపబడినదిగాని, సామాన్యమైనదిగాదు. ఈలాగున స్త్రీపురుషులు వర్తించుట చేతనే పూర్వ కాలములో అనేక ధీమంతులున్ను, శూరులున్ను, ఆరోగ్యగాత్రులున్ను, ఆత్మజ్ఞాననిష్ఠులున్ను, ధర్మతత్పరులున్ను భరతఖండములో నుద్భవించిరి. కావుననే వారు ప్రపంచములో గల సర్వరాజ్యములకున్ను అధిపతులయిరి. ఇప్పుడుండు వారి అధఃపతనమునకు ఈ వ్రతనిష్ఠ లేక పోవుటయే కారణము.

పూర్వకాలమున రాజనీతిలో జనులనుష్ఠించు ధర్మనీతిగూడ గల్గి యుండెను. ఇప్పుడట్లు గాకపోయినందుచే రాజనీతి వేరుగా ప్రజలు గొల్లవాడు లేని గొఱ్ఱెల చందమున పరిణమించిరి. కావున మేధాసంపత్తి గలవారందరున్ను ఇట్టి విషయములో జాగరూకులై వర్తించినచో భరతఖండ ముద్ధరింపబడును. యంత్రనిర్మాణ చక్రములు మొదలైనవి పోతపోయుటకు ముందుగా లోహము శుద్ధమైనదా? దృఢమైనదా? అని శోధించుకొనవలయును, లేనిచో, యంత్రము అచిరకాలములోనే చెడిపోవును. ఆలాగున శరీరనిర్మాణ యంత్రసామగ్రి స్త్రీపురుషుల రక్తశుక్లములని జ్ఞాపకములో·నుంచవలెను. అట్లు చేయకపోయినచో సంతానము గల్గిన తర్వాత శిక్షించినను, రక్షించినను, బోధించినను, బాధించినను ఇసుమంతయు ప్రయోజన ముండదు. ఈ గృహస్థ బ్రహ్మచర్యవ్రత మెటువంటిదో, ఆలాగున మానసమున్ను నిర్మలము గాను, ప్రశాంతముగాను, ప్రసన్నముగాను, కరుణాన్వితముగాను, దైవభక్తితో గూడినదిగాను, ఈశ్వరజ్ఞానము గలిగినదిగాను నుండవలెననిగూడ జ్ఞాపక ములో నుంచవలయును.

ఇప్పటి కీమూడువిధములగు వివాహములు చెప్పబడెను. మొదటి వారికి ఇచ్చుటనే దైవసాక్షాత్కార సాయుజ్యమున్ను, రెండవవారికి దేహ వియోగానంతరము దైవలోకప్రాప్తియు, మూడవవారికి మరణానంతరమున బ్రహ్మలోకసిద్ధియు గల్గును. మొదటివారు దేహముక్తియున్ను, రెండవవారు

జీవన్ముక్తియు గలవారు, మూడవవారు బ్రహ్మలోకములోనుండి జీవన్ముక్తిని పొందగలరు. వీరు ముగ్గురున్ను జీవన్ముక్తుల సంఘములో గలవారలే. వీరికి ఈ జన్మములో ఇచ్చటనే సమస్తకర్మములు నశించిపోయినవి. కనుక పునర్జన్మము గలుగదు. వీరందరున్ను పరమపావనజీవులు.

4. ఇక మానవవివాహమును గురించి చెప్పెదను. దీనికి ప్రాజాపత్య మని నామాంతరము గలదు. వీరు గురుకులవాసము చేయకపోయినను బ్రహ్మచర్యవ్రతమును మాత్రము జరుపువారలుగా నుందురు. వీరికిన్ని వివాహవయోనిర్ణయము పైజెప్పినట్లు స్త్రీకి పదునారున్ను, పురుషునకు ఇరువదియారున్ను ఉండవలయును. దీనికన్న అధికమైనను విరోధము లేదు. మేలే గల్గును. ఎంతకెంతకు వయస్సు ఎక్కువగునో, అంతకంతకు పవిత్రత గూడ నధికరించును. వీరున్ను ఋతుకాలములో మాత్రమే భార్యాభర్తలు సంతానకార్యములో గలియవలయును. పైజెప్పిన ఆర్ష వివాహితులకున్ను వీరికిన్ని భేదమేమన? వీరు యౌవనకాలానంతరము వానప్రస్థాశ్రమములోనికి వెళ్ళరు. పైజెప్పిన వారలు యౌవనకాలము తీరినవెంటనే వానప్రస్థాశ్రమమును అవలంబించవలసియుందురు. వీరు గృహములోనే యుండి, గృహకృత్యములు కుమారులపైగాని, లేక తదితరులపైగాని యుంచి పై కార్యము మాత్రము, కొంత కొంత చూచుచుందురు. లేక బొత్తిగ మానిగూడ నుందురు. భగవద్భక్తి యందు కాలము గడుపుదురు. వ్రతములు, పూజలు, బ్రహ్మనిష్ఠలు సలుపుచుందురు. దైవకార్యములలోను, అతిథిసేవలోను కాలమును వినియోగ పరచెదరు.

వీరిలో కొందరు, వానప్రస్థాశ్రమమునకు వెళ్ళనివార లయినను, ప్రత్యేక ముగా బ్రహ్మనిష్ఠ చేసుకొనుటకు నిశ్శబ్దముగాను నిస్సంగముగా నుండు స్థలము ఇంటిలోగాని, బయట ప్రదేశమునగాని, యేర్పాటు చేసుకొని యుం దురు. సత్యధర్మములతోగూడి జీవితకాలము గడుపుచుందురు. ఉత్తములైన గురువుల నాశ్రయించుకొని బ్రహ్మనిష్ఠ సదా సలుపుచుందురు. గృహస్థ

బ్రహ్మచర్యమైనను నిర్వహింప తలంపుగల భార్యాభర్తలు ఏకశయ్యపై గాని, ఒక్కగదియందుగాని నిద్రింపరాదు. అట్లయిన మాత్రమే వీరు అనుకొన్నట్లు వ్రతసంరక్షణ చేయగలుగుదురు. ఇట్టి దంపతులు తమ జీవితము ధర్మమార్గములో గడపి దైవకృపకు పాత్రులై తరించవలెనని తలంపు గల వారలై యుందురు. అంతేగాక, పశువులవలె జీవించరాదని దృఢసంకల్పము గల్గియుందురు. వీరు పితృకార్యములున్ను, ఋషికార్యములునగు ఋణ త్రయమును ఈ జన్మములోనే చెల్లించెదరు. పంచయజ్ఞపరులై యుందురు. వీరికి స్వర్గలోకప్రాప్తి గల్గును. వీరియొక్క జన్మములను గురించి దేవతలు స్తోత్రము చేయుదురు. వీరికొఱకు స్వర్గద్వారము తెరచిపెట్టబడి యుండును. వీరి పుణ్యమహిమచే ఒకతరము పితరులు ప్రేతలోకమునుండి యుత్తీర్ణు లగుదురు. ఆలాగున రాబోవు ఒక్కతరము పితరులుగూడ పుణ్యలోకమును పొందుదురు.

వీరు స్వర్గలోకమున బహుకాలముండి మఱల నుత్తమకులము గల శ్రీమంతుల కుటుంబములో జన్మింతురు. అట్టి జన్మములో ముక్తికి యోగ్యుల గుదురు. వీరలలో భార్యగాని, భర్తగాని దైవవశంబున గృహస్థాశ్రమములో నుండునప్పుడు గతించినచో మఱల వివాహము చేసుకొనరు. తర్వాత జీవితమంతయు మంచివ్రతనిష్ఠలో గడుపుదురు. వీరికి దేవతలయొక్కయు, ఋషులయొక్కయు, పుణ్యఋషులయొక్కయు ఆశీర్వచనములు గలిగి యుండును. వీరి మరణకాలమున దేవతలు ఎదురుగా వచ్చి పుష్పమాలాలం కృతులుగ జేసి చాలా గౌరవభావముతో స్వర్గలోకమునకు గొనిపోవుదురు. ఈ నాల్గువిధములగు జీవులే, యోగ్యజీవులు, పుణ్యజీవులు, శాస్త్రముచే అంగీకరింపదగిన యోగ్యత గలవారలును. తక్కిన, పైజెప్పిన వారిలో బ్రహ్మ లోకప్రాప్తిగలవారికి బ్రహ్మాదిదేవతలున్ను, దైవలోకప్రాప్తిగలవారికి భగవ న్మూర్తులున్ను, ఋషులున్ను దేహవియోగకాలమున వచ్చి పరమసంతోష ముతో బ్రహ్మలోకములోనికి, దైవలోకములోనికి భక్తితో తోడ్కొనిపోవుదురు. ఓహో! సత్యధర్మములతో గూడిన మానవజన్మము ఎంత మహిమ గల్గినది!

మొదటివారికి ఇచ్చుటనే బ్రహ్మసాయుజ్యము గలుగుటచే, వారికి లోకాంతర గమనము లేనందుచే, నిచ్చట పరిపూర్ణ బ్రహ్మజ్ఞాన స్వరూపులై యుందురు. నాల్గవతరగతిలో చెప్పిన వివాహితులు ఉత్తమమానవు లనందగిన వారు. ఇక సామాన్యమానవులయొక్క వివాహధర్మమును చెప్పెదను.

5. వీరు అయిదవతరగతిలో చేరినవారు, వీరు సామాన్య మానవు లనంబడుదురు. వీరికిన్ని వివాహ వయోనిర్ణయము పైజెప్పినట్లే కన్యకకు 16 వయస్సున్ను, వరునికి 24గాని, 26గాని, లేక అంతకన్న అధికముగాని ఉండును. వీరు ఋతుకాలమును పాటింపక విషయప్రమత్తులై యుందురు. ఆలాగున సంతానోత్పత్తియైన తర్వాతగూడ కాలనిర్ణయము లేకనే భార్యా భర్తలు గూడుచుందురు. వీరిలో కొందరు భార్యగాని, భర్తగాని మృతినొందిన మఱల వివాహము చేసుకొనరు. సామాన్యముగా గృహకృత్యములలోను కొంచెము దైవభక్తి, పరోపకార పుణ్యకార్యములతో కాలము గడుపుదురు.

మఱికొందరు మఱల ఒకతూరి పునర్వివాహము చేసుకొందురు. దంపతులలో నెవరికైన మఱల వియోగము గలిగినచో ఉభయులలో నెవరున్ను వివాహము చేసుకొనరు. వీరు వయోనియమము లేకనే యిచ్ఛానుసారముగా విషయమోహితు లగుదురు. వీరి వివాహముచే పితరులకుగాని, దేవతలకు గాని, ఋషులకుగాని యేలాటి ప్రీతియున్ను ఉండదు. వీరి జీవితదశలో ఏదయిన పుణ్యవిశేషముకాని, జ్ఞానవిశేషముగాని, దైవప్రీతికరమగు కార్యము గాని చేసియుండినచో వాటివల్ల స్వర్గప్రాప్తిగాని, దైవలోక ప్రాప్తిగాని గలుగ వలసినదేగాని వివాహపుణ్యవిశేషముచేతగాని, గృహస్థధర్మ సంరక్షణచేతగాని యేలాటి సుకృతవిశేషము గలిగియుండదు. అంతేగాక వీరికి ప్రేతలోకము గల్గును. ప్రేతలోకమునుండి యుద్ధరించుకొనుటకు తగిన కర్మవిశేష ముండవలయును. అట్లు గానిచో ప్రేతలోకములో బహుకాలము వాసము చేయవలసివచ్చును. మరణకాలములోగూడ వీరికి సుఖముండజాలదు. మరణము వీరికి దుఃఖముగా నుండును. వీరు జీవించి యుండునపుడు ఏద

యిన సుకృత ఫలము గలిగేలాగున చేసుకొని యుండిన మాత్రమే పరలోకములో గతి గల్గును. లేనిచో కొంచెము కాలమైన సద్గతి యుండదు. వీరికర్మ పరిపాక మొందునప్పుడు మఱల భూలోకములో మానవజన్మము గల్గినను అతిసుఖ కరముగా నుండదు. కొంత దుఃఖమున్ను, సుఖమున్ను గలిసియుండును. మఱల ఆ జన్మములో సత్కర్మము చేసినచో అచ్చటనుండి యున్నత లోకమును పొందవచ్చును. ఉత్కృష్టజన్మముగూడ గలుగజేసుకొన వచ్చును. లేక అదేస్థితిలోనికిగాని, తక్కువ స్థితిలోనికిగాని మఱల రావచ్చును. ఈ కారణము లన్నియు మనుజులు జీవించి యుండినప్పుడే యోచించుకొన వలెను.

ఇంతటితో మానవ వివాహధర్మము పూర్తియైనది. ఈ అయిదవ తరగతివారు పునర్వివాహితులైనను భార్యాభర్తలు వరుసతప్పి పరస్త్రీ పర పురుషాది దోషము గలిగేలాగున ప్రవర్తింపరు. ఇక చెప్పబోయెడి విషయములో ఒకవేళ బాల్యవివాహము చేసుకొనినను గృహస్థధర్మము అనగా భార్యాభర్తలు చేరెడు విషయము మాత్రము 16 సంవత్సరములు స్త్రీకి పూర్తియగుటకు ముందుగా నుండెడివారికి మాత్రము సంబంధించును.

**బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః ।**
**గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః ॥**

బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధ ర్వము, రాక్షసము, పైశాచము అని వివాహము ఎనిమిది తెఱంగులు. అందష్ట మమగు పైశాచ మధమము.

**పంచానాం తు త్రయో ధర్మ్యా ద్వావధర్మ్యౌ స్మృతావిహ ।**
**పైశాచశ్చాసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన ॥**

ప్రాజాపత్యము మొదలు ఆసురమువఱకుగల అయిదు వివాహము లలో బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యములు నాల్గు వివాహములు ధర్మశాస్త్ర సమ్మతములు. తక్కిన ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము,

మొదలగునవి సజ్జనసమ్మతములు గావు. మనమున్ను మానవవివాహము వరకు మాత్రమే అంగీకరించితిమి. అయితే దానియందు, విశేష సామాన్యము లని రెండుభాగములు చేసుకొనడమైనది. కనుకనే, అయిదు ఏర్పడినవని గ్రహించవలెను.

6. ఇప్పుడు చెప్పబోవు వివాహము ధర్మశాస్త్రమునకు విరుద్ధమైనదిన్ని, ఇహపర సౌఖ్యములకు దూరమైనదిన్ని, రోగమునకు దుర్బలత్వమునకు, వంశ క్షయమునకు కారణమైనదియు గనుక దీనికి పైశాచిక వివాహమని పేరు. దీనిలో ఆసుర గాంధర్వ రాక్షస వివాహములుగూడ కొన్ని అంతర్భూతములు. ఇది రజస్వల యగుటకు ముందుగా జరుగును. భార్యయొక్క వయస్సును చూడక అనగా, 11గాని, 12గాని, 13గాని, 14గాని, 15గాని వయస్సులో గర్భాధానము చేయు క్రియలో ప్రవేశించి, గృహస్థ బ్రహ్మచర్యమైనను చూడక, కాలాకాలములను నిరీక్షించి యుండనొల్లక విషయలోలురై, జీవితమును దుర్వినియోగ పరచి, స్త్రీకి 11గాని, 12గాని, వయస్సులోనుండి సంతానము గలుగుటయు, భర్తకును 13, 14, 16, 18 వయస్సు మాత్రము గల్గి యుండియు, విషయులైయుండి జన్మించెడు బిడ్డలు పైజెప్పినరీతిగా నుందురు. మఱల భార్యగాని, భర్తగాని మరణించినను, ఉభయులున్ను ఇష్టము వచ్చినట్లు మఱల మఱల వివాహములను చేసుకొనుటయు, పరమ పవిత్రమైన బ్రహ్మచర్యమునుగాని, అగ్నికార్యమునుగాని, వేదపఠనమునుగాని, ధర్మమునకు సంబంధించిన గృహకృత్యమునుగాని, గృహస్థునికి విధించి యుండు పంచయజ్ఞములనుగాని చేయకమరణాంతమువఱకు కుక్షిని పూరిం చెడు విషయములో మాత్రము కాలము గడుపుచుందురు. వీరికి నిహమందు గాని, పరమందుగాని కొంచె మైన సౌఖ్యముగలుగదు. ప్రేతలోకమో, లేక నరకలోకమో మాత్రము వీరికి సిద్ధించునేగాని వేరు సద్గతి గల్గుటకు మార్గము లేదు.

అయితే వీరలలో కొందరు ఒక సుగుణమును మాత్రము గల్గియుం దురు. అదేమన? ఎంత విషయ ప్రమత్తులైనను, పురుషుడు పరస్త్రీనిగాని, స్త్రీ

పరపురుషునిగాని చేరరు. అందువల్ల వీరికి మరుజన్మములో మానవజాతులలో జన్మము గల్గును. అట్టివారు అచ్చటనుండి పుణ్యకర్మములు చేసుకొని వచ్చిన మఱల మంచిజన్మములకు పోవచ్చును. ఇంతవఱకైన పుణ్యము గట్టుకొనక పోయినచో, వీరియొక్క పితరులున్ను, ఋషులున్ను, కులదేవతలున్ను వీరిని శపింతురేగాని, సుఖముగా నుండేలాగున ఆశీర్వదింపరు. అయితే వీరికి సంతానము గల్గి పితృకార్యములు చేయుటచే, ప్రేతలోకములో కొంచెము సౌఖ్యము గల్గును. కావున పితరుల కృప కొంచెము గల్గియుండును. వీరికి మరణకాలములో సౌఖ్యముండదు. మంచి పుణ్యపురుషుల దర్శనము గూడ లభింపదు. ఏదైన సుకృతకార్యము జీవించి యుండునపుడు చేసియుండినచో యమదూతల దర్శనము తప్పిపోవును. దేవదూతల దర్శనము గలుగవచ్చును.

7. ఇది పూర్ణమగు రాక్షసవివాహ మనంబడును. వీరి వివాహము రజస్వలా పూర్వముగాను, రజస్వలయైన కాలమునుండి గృహకృత్యములో అనగా సంతానోత్పత్తి ప్రవృత్తితో గూడియుండును. వీరిని గురించి చెప్పజాలము. ఇది భూతప్రేత పిశాచ రాక్షసాసుర కృత్యములతో గూడియుండును. కాలముగాని, సమయముగాని వీరికుండదు. పాపముగాని, పుణ్యముగాని తెలియదు. భార్యాభర్త లుండురీతిగా, స్త్రీకి పాతివ్రత్యముగాని, భర్తకు ఏకపత్నీధర్మముగాని యుభయులకును నుండదు. విశేషముగ బిడ్డలు పుట్టుదురు. అందరును దుర్బలులు, ఆరోగ్యశూన్యులు. కడుపునిండ భోజనమైన నుండదు. దారిద్ర్య బాధ అధికముగనుండి యింటిలో దుఃఖరోదనము తప్ప సుఖచిహ్న మేమియు నుండదు. భార్య మృతినొందిన భర్తయు, భర్త మరణించిన భార్యయు నిష్టము వచ్చినట్టు మఱల మఱల వివాహములు చేసుకొందురు. దైవశక్తిగాని, జీవకారుణ్యముగాని వీరికి లభించుట చాలకష్టము. స్వల్పాయుస్సు గల్గి యౌవనకాలమునకు ముందుగానే వార్ధక్యదశ వచ్చి కూర్చుండును. వీరి మరణానంతరగతిని చెప్పజాలను. వీరికి దైవము కరుణించి యేదైన సహాయము చేయవలసినదేగాని, ధర్మవిషయమై యేమియున్ను గతి గనుపింపదు.

వీరి దీనావస్థను జూచి యమధర్మరాజు సహితము ఏదైన దయ చూపవలసినదే గాని మఱియేమియు సద్గతి గలుగదు. అయితే వీరిని జూచి సజ్జనులు వగచుచు అయ్యో! కలియుగమహిమ యిటువంటిదని తపించి జాలిగలవారై యేదైన సహాయము చేయుదురు. ఈ పుణ్యమువల్ల వారు తరించవలసి యుందురు.

ఇప్పుడు చెప్పిన ఏడవవివాహములోనే అష్టమమగు పైశాచము అంత ర్భూతమై యున్నది. ఈ అష్టమవివాహములో చేరిన వివాహములు కొన్ని గలవు. అవియేవన? అరువదిగాని, డెబ్బదిగాని వయస్సు గల ముసలివానికి రజస్వలగాని, పసిఆడబిడ్డల నిచ్చి ధనమోహముచే వివాహము కొందరు చేయుచుందురు. దీనికి పైశాచికవివాహమేగాక మఱియేమి పేరు పెట్టవలెను? అదేరీతిగా, ఒక్క పురుషునికి అనేక భార్యలుండుటగూడ పైశాచికవివాహ మనంబడును. మఱియు, భర్తలు భార్యలకు మాత్రము పతివ్రతా ధర్మము నుపదేశించి భర్తయే భార్యకు దైవమని బోధించుచు భర్తలు మాత్రము దయ్యపు వృత్తులతో మృగచేష్టలు గల్గి పరస్త్రీలతోను, వేశ్యలతోను సంచరిం చుటగూడ పైశాచికస్థితియనియే చెప్పబడును. ఇవియన్నియు దైవనియమ ములా? లేక దయ్యపు నీచస్వభావములా? పుస్తకము వ్రాసినవారు పురుషు లైనందుచే వారి ఇష్టానుసారముగా పిల్లచేష్టలుగా వ్రాసినదేగాని దీనియందేమి సత్యధర్మములు గలవు? కావున, ఇవియన్నియు రాజశాసనముచే నిషేధము గావలయును. వేశ్యలను నొకసంఘముగాని, జాతిగాని ప్రపంచములో నెచ్చో టను ఉండరాదు. ఇది ఉత్తములగు నారీమణులకు నెంత అవమానకరము? ఈ యేర్పాటుండుటచే నెందరో పతివ్రతలు భర్తల దుశ్చేష్టలచే పరితపించు చున్నారు. ఎందరో ఆత్మహత్య చేసుకొనుచున్నారు. అంతేకాక యెందరో పురుషులు రోగగ్రస్తులైరి. ఎన్నియో కుటుంబములు నశించినవి. ఇట్టి దురాచా రము లన్నిటిని రూపు మాపవలయును.

ఈలాటి కార్యము లన్నియు శాస్త్రనియమములని వ్రాసియుండు గ్రంథము లన్నియు అగ్నిలో ఆహుతిచేయవలెను. వీనికన్నిటికిన్ని రాజ శాస

నము అవసరము. అప్పుడే దేశము బాగుపడగల్గును. సరియైన గృహస్థ బ్రహ్మచర్యము స్త్రీ పురుష లుభయులకున్ను లేనిచో గలిగెడు సంతానములు లోకమునకు అపాయకరములు. కనుకనే హిందూసంతతి దుర్బలమైనది.

కళావంతులుగూడ ధర్మోక్తముగా వివాహము చేసుకొనుట వారికి నెంతో శ్రేయోదాయకము, యశస్కరము. వారిలోగల గౌరవపురుషు లెందరో యీ నీచకార్యముచే తనకులమేదియని యెవరైన అడిగినచో చెప్పుటకు సిగ్గు పడుచున్నారు. ఆలాగున చాలమంది స్త్రీలును ఈ పాపమైన నీచకృత్యముచే జనసముదాయములో సంచరించుటకు లజ్జ నొందుచున్నారు. కావున ఇదం తయు దైవశాసనము గాదు. దయ్యపుగుణము గలవారు సృష్టించిన పైశాచిక కృత్రిమమని అందరున్ను తెలుసుకొందురుగాక! ఈ కళావంతులలో నెందరో విదుషీమణులు గూడనున్నారు. అట్టివారు సామాన్యులగు పురుషుల సంఘములలో విచ్చలవిడిగ సంచరించుటయు ఉత్సవకాలములోను, వివాహ కాలములోను, మఱికొన్ని సమయములలోను, దేవాలయములలోను, వీధుల లోను, పబ్లిక్ స్థలములలోను విచ్చలవిడిగా సంచరించుటయు, ఆడుటయు, పాడుటయు చూచిన నే మానవాకృతిగల స్త్రీకిగాని, పురుషునికిగాని దుఃఖము గలుగదు?

అయితే యిట్టి కృత్రిమశాస్త్రములన్ని సచ్ఛాస్త్రీయములా? లేక అశాస్త్రీ యములా? అని తెలుసుకొనుటకు మేధాశక్తి లేనివారికి కష్టమైనది. దీనికి కారణమేమన గ్రంథకర్తలు వారి పేరుపెట్టక దేవతలయొక్కయు, ఋషుల యొక్కయు నామధేయములను పెట్టి వ్రాయుటచే తెలుసుకొన శక్తిలేకపోయి నది. ఇది చాలా పొరపాటు. ఇప్పుడుగూడ నాలాగున వ్రాయువారు గలరు. అట్లు కూడదు. ఎవరు వ్రాసిరో వారిపేరుండవలసినదేగాని మఱియెవరి పేరున్ను పెట్టరాదు. దీనికిన్ని రాజశాసన మేర్పడవలయును. అప్పుడు మాత్రమే దేశము బాగుపడగల్గును. అయితే వారు అట్లు వ్రాయుట ఇట్టి యుద్దేశ్యముతో గూడియుండును. అదేమన? పరమపావనులగు ఋషుల పేరుగాని, దేవతల నామముగాని పెట్టి మహిమలుగాని, మహాత్మ్యములుగాని

నిరూపించినచో జనులు ఆచరణలో నుంచెదరనియు, అట్లుండిన దానివల్ల పుణ్యము గల్గుననియు, మంచి సత్కర్మలు చేయుదురనియు, దీనివల్ల జనులు పావను లగుదురనియు తలంచియుందురు. అయితే అసత్యముపై సత్యము నేల ప్రతిష్ఠించవలయును? అది నీటిలోపల నిప్పుమంట వేయజూచి నట్లుగదా యుండును. అంతేగాక అసత్యమునకు స్థిరప్రతిష్ఠ యుండగల్గునా? అది గిల్టు నగలవంటిది గదా? కావున సత్యాన్వేషులున్ను, మేధావంతులున్ను నమ్మక పోయిరి.

అయితే అట్లు వ్రాయుట అసత్యవృత్తియని వారికి తెలియును. దాని వల్ల జనులకు పుణ్యకర్మాభిలాష గల్గుటచేత సుకృతము గల్గునని యెంచి అది అసత్యము గాదని తలంచియుందురు. స్వార్థబుద్ధిలేక యితరుల మేలు కొఱకు చేయుకార్యములలో అసత్యదోష ముండినను అది దోషము గాదను నొక యభిప్రాయము గలదు. అయితే యిది సత్యప్రవర్తకుని లక్షణము గాదు. కాని దానివల్ల దోషముండదు గాని సత్యాత్మునియొక్క గతిమాత్రము గలుగదు. ఇది చిన్నపిల్లవారికి వ్యాధి గల్గియుండిన తీపివస్తువులో ఔషధము నుంచి యిచ్చునట్లుండును. ఔషధము పేరు చెప్పిన పిల్లవాడు తినడు. కావున మిఠాయి పేరుగాని, బెల్లము పేరుగాని చెప్పి యిచ్చిన తినివేయును. తినుట వల్ల బాగుగా కుదురును. కావున అది అసత్యము గాదని యొక అభిప్రా యము గలదు. దీనికి గుడాంగుళి న్యాయమని పేరు.

ఈలాగుననే పురాణములలో నెక్కువ భాగములున్ను గలవు. ఉపవాస వ్రతములు, దైవపూజలు, యోగ ధ్యానములు, తపస్సులు మొదలైన వాటిలో అర్థవాదము గలదు. అనగా? మాహాత్మ్యమును అధికముగ వర్ణించియున్నారు. అట్లు గానిచో జనులకు అట్టి వానిలో ప్రవృత్తి గలుగదు. ఈ విషయము మాత్రము ఒకవేళనుండిన నుండునుగాక దీనివల్ల క్రమముగా పుణ్యబుద్ధియు, ఆత్మశుద్ధియు వృద్ధి గాగలదు. కాన ఇది అంగీకరించుటలో అసత్యదోషము లేదని కొందఱు ఋషు లభిప్రాయపడిరి. ఐతే భక్తితోను, ఆత్మశుద్ధితోను, శ్రద్ధతోను చేయవలయునని శాసించవలయును. అట్లయిన మాత్రమే ఫలము

గల్గుననియు, లేనిచో ప్రయోజనము లేదనియు స్పష్టముగ తెలుపవలయును. అతిశయోక్తితోను, మాహాత్మ్య వర్ణనలతోను గ్రంధపుపుటలు పూర్తిచేయరాదు. సుగుణములతోను, భక్తివైరాగ్యములతోను, శాంత, కరుణ, విజ్ఞానములతోను గ్రంథము నింపవలయును. అట్లైన నిక త్యాజ్యము లెవ్వియని జిజ్ఞాసువులు సందేహింపవచ్చును. అవి పైజెప్పిన పైశాచికాది వివాహకృత్యములున్ను, కళావంతుల నీచవృత్తులున్ను వ్రతనిష్ఠలు లేమిచే గలిగెడు అనర్థములు మాత్రమని గ్రహించవలెను. జనుల కాత్మశుద్ధికరములగు ననుష్ఠానము లన్నియు గ్రాహ్యములు. ఇక నీ విషయమై విస్తరించి చెప్పి కాలమును దీర్ఘ పరచతలంచుటలేదు. ఈ చెప్పిన వివాహములో నేది జనులకున్ను, లోకమున కున్ను అనుకూలమో అది సుజనులు ఆచరించుటకు యోగ్యమైనది.

ఇక కన్యాశుల్కము, వరకట్నము మొదలగు కొన్ని పాపకృత్యములు గలవు. అవి అందరికిన్ని తెలిసియుండినవి గనుకను, శాస్త్రములలో దాని యొక్క దోషము ప్రతిపాదించి యుండుటచేతను, ఇచ్చట విస్తరింపం బూన లేదు. ఇవి యన్నియు సరిపడవలసి యుండిన ప్రజాపరిపాలిత రాజ్యాంగ విధాన ముండవలయును. గుణకర్మముల కాధిక్య మివ్వవలయును. నిమ్న స్థితిలో నుండువారికి నున్నత పదవిలోనికి వచ్చుటకు త్రోవ యేర్పడవల యును. ఉన్నత స్థితిలో నుండువారిలో నిమ్నజాతి కృత్యముండువారిని తప్పక కడగా త్రోయవలయును. 16 సంవత్సరముల వయస్సు స్త్రీలకున్ను, 26 సంవ త్సరముల వయస్సు పురుషులకు వచ్చువఱకు బ్రహ్మచర్య వ్రతముండవల యును. మఱల 40గాని, 50గాని సంవత్సరముల ప్రాయము వచ్చిన వానప్రస్థ దశలో జీవించవలయును. తర్వాత సంతానవృత్తి యుండరాదు. వీని కన్నిటి కిన్ని రాజశాసన మేర్పడవలయును. అప్పుడు మాత్రమే వీర్యవంతులున్ను, బలవంతులున్ను, జ్ఞానవంతులున్ను అగు సంతానములు గల్గును. అప్పుడు మాత్రమే లోకోద్ధారము గాగల్గును.

అయితే జిజ్ఞాసువు లీలాగున తలంచవచ్చును. అదేమన? పునర్వివాహ మును గురించి ప్రారంభించి దానియొక్క కార్యమును చెప్పక యీ లోకాభి

రామాయణమున ఏల ప్రవేశించితిరి? అని యూహింపవచ్చును. ఈ చెప్పిన విషయము లన్నియు మనము గ్రహించవలసినవియే.

మొదట రోగముయొక్క కారణము కనుగొనక ఔషధమిచ్చిన అది ఫలము నిచ్చునా? ఆలాగున, లోకసంగతి యెఱుంగనిచో కార్యనిర్వహణము జరుగదు. కావుననే యివన్నియు చెప్పవలసివచ్చినవి. పునర్వివాహ మవసర మని చెప్పువారు ఈలాగున తెలుపుచున్నారు. ఈశ్వరసృష్టిలో స్త్రీపురుషులు సమానులుగా నుండగా, స్త్రీలకుమాత్రము పునర్వివాహము కూడదనియు పురుషులకు చేయవచ్చుననియు చెప్పుట సచ్ఛాస్త్రవిరుద్ధ మనియు, నీశ్వ రాజ్ఞకు విరోధమనియు పలుకుచున్నారు. అట్లు స్త్రీపునర్వివాహము లేనందున వీరి జీవితము దుఃఖభూయిష్ఠమై యుండుననియు, అనేకస్థలములలో గర్భభిన్నములు మొదలగు పాతకములు జరుగుచున్నవనియు, అట్లు భిన్నము చేయుటకు నొల్లనివారు స్వయముగ ఆత్మహత్య చేసుకొనుచున్నారనియు, మఱికొందరు దూరదేశములో తీర్థయాత్రనెపముతో వెళ్ళి ప్రసవించి, శిశువును పారవేయుచున్నారనియు, నిక కొందరు వీథులలోగాని, సందు మూలలోగాని, సత్రములలోగాని, పోలీసుస్టేషనుల దగ్గరగాని, ఆస్పత్రుల ముఖద్వారములలోగాని పసిబిడ్డలను పెట్టివేసి వెళ్ళుచున్నారనియు తెలుపు చున్నారు.

మఱికొందరు చెట్లలోగాని, పొదలలోగాని చిన్నపాపలను గుప్తముగ నుంచి వెళ్ళుటచే మృగములు తినివేయుచున్నవనియు, మరణము నొందు చున్నారనియు తెలుపుచున్నారు. ఇక కొందరు చిన్నబిడ్డలను హీనజాతులకు నిచ్చుచున్నారనియు, భోగమువారికి అప్పజెప్పుచున్నారనియు తెలుపు చున్నారు. మఱికొందఱు ఉత్తమజాతులలో గల నారీమణులు గర్భము ధరిం చుటచే హీనజాతులలో కలిసిపోవుచున్నారనియు, ఇక కొందఱు అన్యజాతు లలో చేరుచున్నారనియు, వేరుకొందఱు దేశాంతరమునకు పోవుచున్నా రనియు వచించుచున్నారు. మఱికొందరకు భర్తలు మృతి నొందిన తర్వాత జీవనాంశమునకైన వారసులు ఇవ్వనందున బహువిధములుగా సంకటపడు

చున్నారనియు, ఇక కొందఱు లోకభయమునకు వెఱచి గర్భవిచ్ఛేదము చేయుటలో అపాయము గల్గి అకాలమృత్యువునకు లోబడుచున్నారనియు నుద్బోధించు చున్నారు. వీని కన్నిటికిన్ని బాల్యవివాహమే మహానర్థక హేతువనియు, బాల్య వివాహముచే ధర్మశాస్త్రములు చదువుటకు తగిన అవకాశము గల్గుటలేదనియు, ఇందువల్ల నారీమణులు మృగావస్థలోనున్నా రనియు చెప్పుచున్నారు. ఇందువల్ల స్త్రీలకున్ను, పురుషులకున్ను బ్రహ్మచర్య పవిత్రత బొత్తిగ నశించి పోవుచున్నదనియు వాక్రుచ్చుచున్నారు.

ఇక కొందరు ఇంద్రియనిగ్రహయోగ్యతకు తగిన ఆశ్రమములు లేనం దుచే సంసారములో ఘోరదుఃఖమునకు పాత్రులగుచున్నారనియు నుపదే శించుచున్నారు. అట్టి వైరాగ్యబోధోపరతులు గలుగనివారు బాలవితంతువు లుగా నుండుటచే తమకు సమానులగు స్త్రీలు అనుభవించెడు సంసార సౌఖ్య మైన లేకపోయెనుగదా? యని, దుఃఖించి విధాతయొక్క లలాటలిఖితమునకు దుఃఖించి యోచించి ఆ బ్రహ్మదేవుని సదా శపించుచున్నారు. ఇట్టి శాపబల ముచే కాబోలు పంచాననుడై యుండిన బ్రహ్మయొక్క ఏకముఖమును ఈశ్వ రుండు త్రుంచి పారవేసినదనియు, బ్రహ్మదేవునికి లోకములో పూజాస్థలము లగు దేవాలయములు లేకపోయి యుండవచ్చుననియు పండితు లూహించు చున్నారు.

మఱియు నిట్టి బాలనారీమణులగు వితంతువులయొక్క తల్లిదం డ్రులు తమబిడ్డల వైధవ్య దుఃఖమును చూడజాలక నేత్రములనుండి సదా దుఃఖబాష్పవర్షమును కురిపించుచున్నారు. అయ్యో ఏమి పాపము నెఱుగని ఆ పుణ్యజీవులగు నారీమణుల దుఃఖముచేతనే భరతఖండమునకు ఇంత దారిద్ర్యబాధయు, అస్వాతంత్ర్యమున్ను, ఇతరులచే పీడయున్ను గలుగుచున్న వని తెలుపుచున్నారు. వీరియొక్క దుఃఖరోదనము సర్వేశ్వరుండెట్లు సహింప గలడని అనేకులు ప్రశ్నించుచున్నారు. వీరు చెప్పినవన్నియు సత్యములే. సందేహము లేదు. అట్లు జరుగుచున్న దంతయు నిజము. అయితే బాహ్య దృష్టి గలవారికి, ప్రపంచసుఖము సత్యమైనదని నమ్మువారికి, నీశ్వరసుఖము

యొక్కయు, జ్ఞానమహిమయొక్కయు, సౌఖ్యము తెలియని వారికి మాత్రమే యిది నిజముగ గానుపించును.

అయితే సత్యధర్మములలోను, దైవభక్తిలోను, జ్ఞాననిష్ఠలోను కాలము గడుపక పైజెప్పినరీతి గర్భవిచ్ఛేదాది పాపకృత్యములు చేయువారు పునర్వివాహము చేసుకొనుటయే మంచిది. దీనియందేలాటి పాపమున్ను లేదు. ఈశ్వరద్రోహమున్ను గలుగదు. శాస్త్రవిరుద్ధమున్ను గాదు. అయితే యీ సంసార సాగరములో మునిగినందుచే ప్రథమమున కొంచెము సౌఖ్యము గనుపించినను మఱల దుఃఖసాగరమునుండి తరింపజాలరు. అయితే భర్తలు మరణించిన తర్వాత స్త్రీలకు ప్రత్యేకముగ బ్రహ్మనిష్ఠ సల్పుటకున్ను, ఈశ్వర భజన చేయుటకున్ను, సచ్ఛాస్త్రములు పఠించుటకున్ను, లోకసేవ కుపయుక్తములగు కార్యములు నేర్చుకొనుటకున్ను, విషయులగు జనులసంసర్గము గలుగనీయక స్వధర్మమును సంరక్షించుటకును తగిన యాశ్రమము లేక మఠము లేక ఏకాంత ప్రదేశము లేక సమాజ మందిరము లేక వితంతు శరణాలయము మొదలైనవి యవశ్యముగ నుండవలయును. అంతేగాని పునర్వివాహము చేసినందుచే భూలోకము స్వర్గలోకముగా మారిపోవున దేమియును లేదు.

అయితే యిప్పుడుండువారికి వివాహము చేసుకొనుటలో ఆటంక ముండరాదు. కాని అది ఉత్తమ పక్షముగా గ్రహించవలదు. చెడిపోయి ఆత్మహత్య చేసుకొనుటకన్న మేలని మాత్రము చెప్పవలసినదేగాని, పవిత్ర ధర్మమని యంగీకరింపరాదు. పురుషులున్ను ఆలాగున నుండవలయు ననియే నా యాశయము. కనుకనే మొదటిది, రెండవది మొదలగు వివాహ పద్ధతులు దీనియందు ముందుగా చెప్పడమైనది. ఒకవేళ నీ పునర్వివాహము ఇప్పుడు పూర్తిగా కానప్పటికిని కొద్ది రోజులకైన నీ ధర్మము లోకమంతట గలుగక పోదు. అయితే స్త్రీ పునర్వివాహము అమలులోనికి వచ్చిన స్త్రీలు పునర్వివాహము ప్రారంభించినచో నిప్పుడుండు పవిత్రతగాని, దైవభక్తిగాని, ధర్మము గాని, పుణ్యకర్మలుగాని, దైవజ్ఞానముగాని, ఆత్మసుఖముగాని,

స్వచ్ఛమైన జీవితముగాని, స్వేచ్ఛగ నుండుటగాని, దైవవిషయమైన విద్యగాని యుండ జాలవు. మఱియు నీ పునర్వివాహము మామూలుగా నేర్పడినచో కొంచెము భక్తి వైరాగ్య జ్ఞానములు గలవారినిగూడ పునర్వివాహముకొఱకు నితరులు ప్రోత్సాహపరచెదరు. అప్పుడు బంధనములో చిక్కుకొనవలసియుం డును. కనుకనే యీ పునర్వివాహము ఉత్తమ మైనదనియు, పావన మైనదనియు చెప్పక యితర నీచకృత్యములచే చెడిపోవుటకన్న యిది మంచిదని తెలిపేలాగున నేర్పాటు ఉండవలయును. పైజెప్పిన దైవకార్యము లన్నియు పునర్వివాహముచే సున్నలై పోవును.

మఱియు నిప్పటికే జనులధికరించి, జీవించి యుండువారికే భోజన పదార్థములు చాలకపోవుచుండగా, లోకములో కరువధికరించి యుండగా, కూలిపనివారికి ఉద్యోగస్థులకు పని దొరకక యుండగా, మనుష్యులను మను ష్యులే బాధించి జీవించుటకు తరణోపాయము వెదకుచుండగా, పునర్వివా హము గల్గి జనవృద్ధి యైనచో మరల నేమి జరుగబోవుచుండునో సర్వేశ్వరునికే ఎరుక. ఈ తత్త్వమెరింగియే పూర్వికులు బ్రహ్మచర్యవ్రతమున్ను, వానప్రస్థ విధియున్ను, పునర్వివాహ నిషేధమున్ను ఏర్పరచుకొనుటకు కారణమని తోచు చున్నది. పునర్వివాహముచే నింతవఱకు భారతదేశములో గల నారీమణులకు గల్గియుండు పరమపావనత్వమునకు కళంకము గలుగవచ్చును. విదేశీయు లందరున్ను భారతీయ నారీమణుల పవిత్రతకు విస్మయము నొందు చున్నారు. ఇట్టి ఖ్యాతియున్ను లేకపోవును. బాల్యవివాహము నిషేధించి, యౌవనయుతలైన తర్వాత నిష్టముండువారు వివాహము చేసుకొనవచ్చునను పద్ధతి యేర్పడి, వితంతువులైనచో తర్వాత ఆత్మపరిశుద్ధతకు తగిన ఆశ్రమ ప్రవేశమున్ను గలిగేలాగున నేర్పాటు చేసుకొన్న చాలును. అట్లైన దుఃఖము లన్నియు శమించి పోవును. లోకము మంగళకరముగ నుండును. అంతటను ఆనందము గల్గుచుండును.

ఒకవేళ మలినహృదయము గల స్త్రీలలో కొందరు చెడువృత్తిలో కలిసి పోయిననూ అందరును నాలాగుననే యున్నారా! ఎందరో పుణ్యస్వభావము గల

నారీమణులున్నారు గదా! ఎందరో దైవసదృశురాండ్రుగా నున్నారు. ఎందరో సర్వజనులకు తల్లులవలె నుండి భూతకోట్ల కుపకారము చేయుచున్నారు. ఎందరో సాధుసజ్జనులకు సేవచేయుచున్నారు. ఎందరో బ్రహ్మనిష్ఠురాండ్రై యున్నారు. వీరికందరికిన్ని పునర్వివాహము గల్గిన నిట్టి మహాభాగ్యము గల్గునా? మరల సంసారకూపమునుండి పైకి రాగలరా! ఇదిన్ని మనము యోచించుకొనవలెను.

అయితే వైధవ్యము గలవారికి సరియైన ఆశ్రమమున్ను, ఆశ్రయ మున్ను ఉండిన నీ చిక్కులన్నియు చాలవరకు సవరణ కాగలవు. కావున నిట్టి విషయములందు నిప్పుడుండు స్త్రీపురుషులు ప్రయత్నించుటత్యంతావసర మైన పనిగా నున్నది. మఱల నేజాతిలో గల స్త్రీ యైనను యౌవనము వచ్చి వివాహమున కిష్టముండిన మాత్రమే పెండ్లిచేసుకొనుట కేలాటి లోక ఆక్షేపణయు నుండరాదు. దీనివల్ల వారి జీవితము సుఖప్రదముగ నుండునని తలంచుచున్నాను. ఇదే లోకమునకున్ను, నారీమణులకున్ను శ్రేయోదాయ కము. దీనివల్ల వారిదుఃఖము చాలవఱకు నశించును. కృతార్థులు కాగలరు. లోకమున్ను మంగళప్రదముగ నుండును. అట్లైన హిందూదేశమునకు గల పవిత్రతకు కళంకము గలుగదు. ఇట్టి యేర్పాటు వేదవిరుద్ధము గాదు. సనాతన ధర్మమునకున్ను విరోధము లేదు. ఋషుల మతములకున్ను విరోధము గలుగచేయునదిన్ని కాదు. దీనికి క్రింద చెప్పబోవు శాస్త్రములే ప్రమాణములు. వివాహపద్ధతులను గురించి మనుమహర్షి యభిప్రాయము కొంచెమిచ్చుట పొందుపరచెద.

**దశపూర్వాన్ పరాన్ వంశ్యానాత్మానం చైకవింశకమ్ ।**
**బ్రాహ్మీపుత్రస్సుకృతకృన్మోచయేదేనసః పితౄన్ ॥**

బ్రాహ్మవివాహముచే జనించిన పుత్రుడు పుణ్యము చేసినవాడు. అతడు తనముందటి పదితరముల వారిని, తనవెనుకటి పదితరముల వారిని, తనను మొత్తమున కిరువదియొక్క తరముల పితృదేవతలను పాపముల

నుండి తరింపజేయును. (అతని పుత్రాదులు అతని కులమున పాపరహితులై జన్మింతురు.)

**దైవోఢాజస్సుతశ్చైవ సప్త సప్త పరావరాన్ ।**
**ఆర్షోఢాజస్సుత స్త్రీం స్త్రీన్ షట్ షట్ కాయోఢజస్సుతః ॥**

దైవవివాహముచే జనించినవాడు ముందేడు తరములవారిని, వెనుక నేడుతరములవారిని, ఆర్షవివాహజాతుడు ముందు మూడుతరముల వారిని వెనుక మూడుతరములవారిని; ప్రాజాపత్య వివాహజాతుడు ముందాఱు తరములవారిని, వెనుకటి యాఱుతరములవారిని, తనను, ఋణమునుండి విడిపించును.

**బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః ।**
**బ్రహ్మవర్చస్వినః పుత్రా జాయంతే శిష్టసమ్మతాః ॥**

బ్రాహ్మము మొదలు అనగా, బ్రాహ్మము, దైవము, ఆర్షము; ప్రాజా పత్యము అను నాలుగు వివాహము లందును జన్మించిన పుత్రులు, వేదా ధ్యయనసంపత్తివలన గలిగిన తేజము గలవారై శిష్టజనుల కిష్టము కలుగ చేయువారలై జన్మింతురు.

**రూపసత్త్వగుణోపేతా ధనవంతో యశస్వినః ।**
**పర్యాప్తభోగా ధర్మిష్ఠా జీవంతి చ శతం సమాః ॥**

మఱియు రూపము, బలము, గుణసంపద - వీనితో గూడినవారలై ధనవంతులై, పేరెన్నిక గల్గి నిండుసౌఖ్యములు గలిగినవారైన పుత్రులు పుట్టు దురు. మఱియు, వారు శతాయుస్సు (నూరేండ్ల యాయుస్సు) గలవారై యుందురు.

**ఇతరేషు తు శిష్టేషు నృశంసానృతవాదినః ।**
**జాయంతే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః ॥**

తక్కిన యసుర, రాక్షస, పైశాచికాది వివాహములవలన జన్మించిన

సుతులు క్రూరులు, అసత్యవాదులు, వేదధర్మవిరోధులు, దైవజ్ఞాన భగవద్భక్తి సాధుసేవాది కార్యద్వేషులై యుందురు.

**అనిందితైః స్త్రీ వివాహై రనింద్యా భవతి ప్రజా ।**
**నిందితైర్నిందితా నృణాం తస్మాన్నింద్యాన్ వివర్జయేత్ ॥**

అనిందితములైన స్త్రీవివాహములచేత నింద్యము గానట్టి సంతతి గల్గును. నిందితములైన స్త్రీవివాహములచేత నింద్యమైన సంతతి గలుగును! కాన నింద్యములైన వివాహములను విసర్జింపవలయును. ఇక బ్రహ్మచర్య వ్రతముచే గలిగెడు ఫలమును జూడుడు.

**ఆయుస్తేజో బలం వీర్యం ప్రజ్ఞా శ్రీశ్చ మహద్యశః ।**
**పుణ్యం చ మత్ప్రియత్వం చ లభ్యతే బ్రహ్మచర్యయా ॥**

పూర్ణాయువు, బ్రహ్మతేజస్సు, బలము, వీర్యము, అమానుషప్రజ్ఞ, గొప్ప సంపత్తు, యశస్సు, గొప్పపుణ్యము, భగవత్ప్రీతి- ఇవన్నియు బ్రహ్మచర్య వ్రతము గలవారికి గల్గును.

**చతుర్థమాయుషో భాగముషిత్వాஉద్యం గురావిహ ।**
**ద్వితీయమాయుషో భాగం కృతదారో గృహే వసేత్ ॥**

మానవులు తనయాయుఃపరిమితిలో నాలుగవభాగమును, అనగా 25 సంవత్సరములను గురుకులవాసముచే బ్రహ్మచర్యవ్రతమున గడిపి, రెండవ భాగమున అనగా 26 సంవత్సరముల వయస్సునుండి 50 సంవత్సరముల వయస్సు పర్యంతము గృహస్థాశ్రమము నవలంబించి ధర్మయుక్తముగ గృహ కృత్యముల నిర్వహించవలయును అని ధర్మశాస్త్రకర్తయగు మనుమహర్షి ఆజ్ఞాపించియున్నారు. దీనిని ఆధారపడియే ఈ వ్యాసము వ్రాయడమైనది. ఆయుర్వేదమగు సుశ్రుత మీలాగున చెప్పుచున్నది.

**ఊనషోడశ వర్షాయామప్రాప్తః పంచవింశతిమ్ ।**
**యద్యాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థః స విపద్యతే ।**

**జాతో వా న చిరం జీవేజ్జీవేద్వా దుర్బలేంద్రియః ॥**

స్త్రీకి 16 సంవత్సరముల వయస్సు పూర్తియగుటకు ముందుగాను, పురుషునికి ఇరువది అయిదు సంవత్సరములు పూర్తియగుటకు పూర్వముగాను గర్భాధానము చేయరాదు. ఒక్కవేళ చేసినచో గర్భము నిలువక పోవును. ఏదో యొక ప్రకారము నిలిచి శిశువు జనించినచో, అచిరకాలములోనే మృతి నొందును. ఒక్కవేళ అట్లు మృతి నొందక కొంత కాలము జీవించినచో, దుర్బలములైన యింద్రియములు గలవాడై యుండును. కావున 16 సంవత్సరములు స్త్రీలకున్ను, 25 సంవత్సరముల వయస్సు పురుషులకున్ను పూర్తియగుటకు లోపల గర్భాధానము చేయరాదు. ఈలాగున పురాతన ఋషులగు ధన్వంతరి, సుశ్రుతుడు మొదలైనవారు ఆయుర్వేదములో చెప్పియుండగా నీ బాల్యవివాహమును, 16 సంవత్సరముల వయస్సులోపల గర్భాధాన కృత్యమున్ను ఎట్లు ఏర్పడినవో, ఎవరేర్పరచిరో, యెందు కొఱకేర్పాటు చేసినారో తెలియజాలము. శరీరసంరక్షణకొఱకు ఆయుర్వేద కర్తల మతము నంగీకరించవలసిదేగాని, దానికి విరుద్ధములైన స్మృతులుండిన మనమంగీకరింపగూడదు. ఏలన? రోగము వచ్చినప్పుడు వైద్యుని సలహా గైకొనవలసినదేగాని, ఇతరుల మాటలలో లక్ష్యము నుంచరాదు. కనుకనే, భారతదేశపు ముప్పది అయిదుకోట్ల మానవులు దుర్బలులై, శుష్కేంద్రియులై, మనోబుద్ధి వికాసములు లేనివారలై, పరులకు బానిసలై జీవించు చున్నారు. ఇప్పుడు కలియుగమున కేర్పడిన పరాశరస్మృతియందు విధించినది చూడుడు.

**నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ ।**
**పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే ॥**

పతి దేశాంతరమునకు బోయి వార్త దెలియకున్నను, మృతి నొందినను, సన్న్యసించినను, నపుంసకుడయినను, పతితుడయినను అనగా కులభ్రష్టుడైనను స్త్రీలకు మఱియొక పతి విధింపబడుచున్నాడు. అనగా పైజెప్పిన ఆపత్తు గల్గిన వివాహము చేసుకొనక బ్రహ్మచర్య వ్రతములో నుండి పవిత్ర జీవితము

గడుప శక్తిలేకపోయెనేని పునర్వివాహము చేసుకొనవచ్చును. ఇది విధిలేక యేర్పాటు చేయబడినదేగాని, మఱియొకటి కాదనియుగూడ జ్ఞాపకములో నుంచవలయును. అట్లు పునర్వివాహము చేసుకొనక బ్రహ్మచర్యవ్రత మవలంబించి, నిర్మలజీవితము గడిపెడువారికి గల్గెడు ఫలము క్రింద చెప్పబడుచున్నది.

**మృతే భర్తరి యా నారీ బ్రహ్మచర్యే వ్యవస్థితా ।**
**సా మృతా లభతే స్వర్గం యథా తే బ్రహ్మచారిణః ॥**

ఏ స్త్రీ భర్త మరణించిన పిదప బ్రహ్మచర్యమును పరిపాలించునో అట్టి స్త్రీ మరణానంతరము నైష్ఠిక బ్రహ్మచారులైన బ్రహ్మనిష్ఠులవలె స్వర్గమును బొందుచున్నది. ఈ విషయమై పూర్వ ధర్మశాస్త్ర నిర్ణేతలలో ముఖ్యుడగు మనుమహర్షి యాశయమును జూడుడు.

**ప్రోషితో ధర్మకార్యార్థం ప్రతీక్ష్యాష్టౌ నరస్సమాః ।**
**విద్యార్థం షడ్యశోఽర్థం వా కామార్థం త్రీంస్తు వత్సరాన్ ॥**

భర్త ధర్మకార్యార్థము దేశాంతరగతుడై సమాచార మేమియు తెలియని పక్షమున నెనిమిది సంవత్సరములున్ను, విద్యార్జనముకొఱకు వెళ్ళి తెలియని యెడల నారుసంవత్సరములున్ను, కీర్తికొఱకుగాని యితర మేమైన కోర్కెకొఱకుగాని వెళ్ళి తెలియనియెడల మూడుసంవత్సరములున్ను ప్రతీక్షించి రానిచో భార్య కిష్టమైన యెడల మఱియొక భర్తను వివాహము చేసుకొనవచ్చును. ఈ శ్లోకముచే భర్త జీవించి యుండినను దేశాంతరము పోయినగాని, భార్యను విడచిపెట్టి దుర్వృత్తిలో నడచునప్పుడుగాని, లేక భార్యనుపేక్షించి మఱియొకదానిని వివాహమాడినగాని మొదటి భార్య యిష్టమున్నదైనచో పునర్వివాహము చేసుకొనవచ్చును.

సత్యనిష్ఠులగు ఆత్మసోదరులారా! యీలాగున గదా! ధర్మాత్ములగు ఋషులుపదేశింతురు. ఇది గదా! నిష్పక్షపాతియగు సత్యనిష్ఠునియొక్క వర్తన

ముగా నుండును. ఇట్లు ఆచరణ గలిగియుండిన మాత్రమే దుర్మార్గులగు కొందరు పురుషులు సాధువులైన స్త్రీలకు పెట్టెడు కష్టము లన్నియు నశింప గలవు. అయితే ధర్మనిష్ఠురాండ్రగు నారీమణులకు పునర్వివాహము చేయ కుండుటయే శ్రేయస్కరము. ఏలన సంసార సంబంధమగు జంజాటము లన్నియు, దుఃఖములన్నియు, బంధనములన్నియు తొలగిపోవును. బ్రహ్మనిష్ఠ చేయుటకున్ను, చక్కగ చదువుకొనుటకున్ను, పుణ్యకర్మము చేసి తరించుట కున్ను అవకాశము గలుగును.

**ఉద్వాహితాఽపి యా కన్యా న చేత్సంప్రాప్తమైథునా ।**
**పునస్సంస్కారమర్హేత యథా కన్యా తథైవ సా ॥**

కన్య వివాహితురాలైనను పురుషసంసర్గము పొందనిపక్షమున వివాహము గాని కన్యవలెనే పునర్వివాహమున కామె యర్హురాలగును. అనగా నిది బాల వితంతువునకు పునర్వివాహ విషయమై యేలాటి ఆక్షేపము లేదని తెలుపుట యేగాక వివాహము కాని కన్నెవలె శుద్ధురాలని గ్రహించుకొనవలయును. ఈ వివాహము పునర్వివాహమని కూడా తలంచవలసిన పనిలేదు. అక్షతయోని కాని పైచెప్పినవారికే పునర్వివాహ శబ్దము అనువర్తించును. ఇక శ్రీవసిష్ఠస్మృతి తెలుపునది చూడుడు.

**పాణిగ్రాహే మృతే బాలా కేవలం మంత్రసంస్కృతా ।**
**సాచేదక్షతయోనిస్స్యాత్ పునస్సంస్కార మర్హతి ॥**

పాణిగ్రహణము చేసినవాడు మృతుడైనప్పుడు కేవలమంత్ర సంస్కృతు రాలైన కన్య అక్షతయోని అయినయెడల పునర్వివాహమునకు అర్హురాల గును. దీనియందు నేలాటి దోషమున్ను లేదు. అక్షతయోని అనగా భర్తసం సర్గము కానిదని అర్థము.

ఇంతవఱకు తెలిపిన ధర్మశాస్త్రముచే పునర్వి వాహము ఇష్టముండిన యెడల చేసికొనుటలో నేలాటి దోషమున్ను లేదని తెలుపుటకొఱకు నీ విషయ మిచ్చుట కనుపరచవలసివచ్చినది. అంతేకాని యీ ఆశ్రమధర్మము పునర్వి

వాహమును ప్రోత్సహించునది కాదు. అట్టి విషయ ములో నీ ఆశ్రమధర్మము తాటస్థ్యమును వహించి యుండును. ఏలన సర్వ జనులున్ను దుఃఖమునుండి తరించవలెననియే యీ ఆశ్రమముయొక్క యాశయమగును. కనుక స్త్రీ పురుషులందరున్ను వైరాగ్యము నవలంబించి శాస్త్రమును చక్కగ చదువుకొని బ్రహ్మజ్ఞాన సంపన్నత గలవారలై తాము తరించి, ఇతరులను తరింపజేయు టలో ప్రయత్నపరులై యుండవలయునని యీ ఆశ్రమము కోరుచున్నది.

**కామమామరణాత్తిష్ఠేద్గృహే కన్యర్తుమత్యపి ।**
**న త్వేవైనాం ప్రయచ్ఛేత గుణహీనాయ కర్హిచిత్ ॥**

కన్య ఋతుమతియైనను మరణ పర్యంతము గృహముననే యుంచ వలసినదేగాని గుణహీనుని కెన్నడును నియ్యకూడదని మనువచనము. దీని వల్ల కన్య రజస్వలయై వివాహము చేసుకొనకనే యావజ్జీవితము బ్రహ్మచర్య వ్రతములో నుండుటకు అనుకూల ముండిన నుండవచ్చుననియు, అట్లు గానిచో నెంతకాలమువఱకు నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతములోనుండి దైవకార్యము నిర్వహించుటకు అనుకూలముండునో అంతవఱకు నుండవచ్చుననియు, తర్వాత భక్తిజ్ఞాన వైరాగ్యధర్మనిష్ఠ గల వరుని వరించుకొనుటలో ఆక్షేపము లేదనియు తెలియవచ్చుచున్నది. ఆహా? ఎంత పవిత్రమైనది శాస్త్రశాసనము. ఇవి అన్నియు నెచ్చట అంతర్ధానములై పోయినవో, ఏ మహాత్ముఁడు జన్మించి యిట్టి పుణ్యమైన ధర్మశాస్త్రమును పునరుద్ధరించునో తెలియకున్నది. అయి నను ధర్మమునకు జయము గలుగక పోదుగదా!

**త్రీణి వర్షాణ్యుపేక్షేత కుమార్యృతుమతీ సతీ ।**
**ఊర్ధ్వం తు కాలాదేతస్మాద్విందేత సదృశం పతిమ్ ॥**

కుమారి ఋతుమతి అయిన తరువాత మూడుసంవత్సరములు వేచి యుండి వివాహమునకు ఇష్టము గలదైనయెడల ధర్మాత్ముఁడగు వరునికి తండ్రి వివాహము చేయనగును. ఆలాగున వివాహమునకు ఇష్టము గలదై యుండినయెడల ఆ కన్యయే స్వయముగా వివాహవిషయమై ప్రోత్సాహము

చేసుకొనవచ్చును. ఈ శ్లోకమువల్ల రజస్వల అయిన తర్వాత మూడు సంవత్సరములలోపల వివాహము చేసుకొన కూడదనియే మహర్షుల యాశయ మని తెలియుచున్నది. ఏలన? రజస్వలానంతరము స్త్రీలకు మూడు సంవత్స రములవఱకు శరీరావయవములు యావత్తున్ను పుష్టి గలిగి యుండవు. కావున కృశకాయులున్ను, శుష్కేంద్రియులున్ను, శుష్కజ్ఞానులున్ను, బలహీనులున్ను, అచిరకాలములోనే వార్ధక్యదశ నధిరోహించెడు జనులును పుట్టుచున్నారు. అట్లు కానందుననే పూర్వికులు దృఢకాయులున్ను, దృఢమైన యింద్రియ ములు గలవారలున్ను, ధైర్యస్థైర్యములు గలవారలున్ను, ధర్మాత్ములున్ను, మేధాసంపత్తి అపరిమితముగ గలవారలున్ను, నూరుసంవత్సరములవఱకు దృఢమైన శరీరము గలవారలునై మాతృదేశమునకు పరులబాధలు ఏమియు గలుగనీయక సంరక్షించుటకు శక్తిమంతులై యుండిరి.

**క్షేత్రభూతా స్మృతా నారీ బీజభూతః స్మృతః పుమాన్ ।**
**క్షేత్రబీజసమాయోగాత్సంభవస్సర్వదేహినామ్ ॥**

ఇప్పుడు స్త్రీపురుషులుభయులున్ను గృహస్థ బ్రహ్మచర్యవిధి నను సరించి యుండవలయునని శాస్త్రము తెలుపుచున్నది. స్త్రీ క్షేత్రతుల్య యన బడును. పురుషుడు బీజతుల్యు డనందగును. క్షేత్రబీజముల రెండింటి చేరిక వల్లనే సకలప్రాణులు పుట్టునని చెప్పబడినది. అనగా క్షేత్రబీజములు రెండున్ను ఉత్కృష్టములైన మాత్రమే శ్రేష్ఠులగు బిడ్డలు గల్గుదురు.

**బీజస్యచైవ యోన్యాశ్చ బీజముత్కృష్టముచ్యతే ।**
**సర్వభూత ప్రసూతిర్హి బీజలక్షణలక్షితా ॥**

పంచభూతములు మొదలైన సకలజీవరాసుల యుత్పత్తి బీజమునకు గల గుణరూపాది చిహ్నములతో గూడియుండును. కావున బీజక్షేత్రములలో బీజమే ప్రధాన మనబడును. అనగా నిచ్చట బీజమునకే ప్రాధాన్య మివ్వడ మైనది. దీనివల్ల పురుషునియొక్క బిందువు చాల శుద్ధ మగువఱకు విషయ ములో వీర్యమును నష్టపరచకూడదు.

**విశిష్టం కుత్రచిద్బీజం స్త్రీ యోనిస్త్వేవ కుత్రచిత్।**
**ఉభయం తు సమం యత్ర సా ప్రసూతిః ప్రశస్యతే ॥**

కొన్ని తావులందు బీజమునకు ఆధిక్యము గల్గును. అనగా శ్రేష్ఠత్వము గల్గును. కొన్ని స్థలములలో బీజము కొంత దుర్బలమైనను క్షేత్రము సార వంతమైనచో ఆధిక్యము గల్గును. బీజక్షేత్రములు రెండును సమములై యుండుటయే నియతియగును. ఎచ్చట నివి రెండును శ్రేష్ఠములై యుండునో అచ్చట నుత్కృష్టములైన సంతానములు గల్గును.

ఆహా! ఎటువంటి పవిత్రమగు ధర్మశాస్త్రము. ఇట్టి ధర్మమును జనులకు బోధించుటకు గదా మఠాధిపతు లేర్పడినది! అయితే పాపము వారు తపస్సంపన్నులున్ను, యోగసంపన్నులున్ను, జ్ఞానసంపన్నులున్ను, ధైర్యసం పన్నులున్ను గాకపోయినందుచే జనుల నాశ్రయించి జీవించవలసిన వారగు టచే నిట్టి ధర్మములన్నియు నడుగంటి పోయినవి. ప్రజలో? అజ్ఞానులై విషయ ప్రమత్తులై, ఆత్మశక్తి లేనివారలైపోయిరి. ఇట్టివారి సలహాలకు, అనుగ్రహము లకు ఆశించియుండెడు మత గురువు లెంత గొప్పవారు కాగలరు? అయితే పాపము వీరికి సత్యధర్మముల నరయుటకున్ను, నిశ్చింతగానుండి బ్రహ్మ చింతన చేయుటకున్ను సమయమెక్కడ? అంధకార ప్రకాశముల కేలాగున విరుద్ధధర్మము గలిగియుండునో యోగమునకున్ను, భోగమునకున్ను అట్టి విరోధగుణములు గల్గియుండునని పూర్విక ఋషులు తెలిసికొని యుండుట చేతనే వారు యోగము నవలంబించి జ్ఞానసామ్రాజ్య సింహాసనారూఢులగు టకు యోగ్యులైరి.

ఇప్పుడుండెడి సన్న్యాసులలో కొందఱియొక్కయు, మఠాధిపతులలో కొందఱియొక్కయు భోగము మహారాజులకైన గలదా? ఇట్టి అవస్థలలో మునిగి యుండువారు సత్యము నెట్లు పొందగలరు? యోగము నెట్లు గ్రహింప గలరు? కనుకనే మనదేశము శ్రీ యేసుక్రీస్తు చెప్పినట్లు గొల్లవాడు లేని గొఱ్ఱెలగుంపు చందంబున అయినదని తెలుపుట కెంతో మనోవేదన గల్గు

చున్నది. భోగములని చెప్పుటచే దుష్టకృత్యములు గలవని అభిప్రాయము గలుగ చేసుకొనరాదు. దేహేంద్రియ సౌఖ్యములున్ను, అభిమానము మాత్రమని యర్థము గ్రహించవలయును. అయితే అందరును నీలాగే యున్నారని చెప్పుట లేదు. పై జెప్పిన భోగగుణము లున్నవారికిమాత్రమే యిది సంబంధించునని పాఠకులు గ్రహించవలయును. ఇప్పుడుండు మతగురువు లందరియొక్క మతములను స్థాపించిన మహాపురుషుల జీవిత మెటువంటిదో, వారియొక్క తపస్సున్ను, యోగమున్ను, వైరాగ్యమున్ను, త్యాగమున్ను ఎట్లుండునో తలంచిన హృదయము కరిగి నీరై నేత్రములనుండి బాష్పబిందు వులు వర్షమువలె కురియుచున్నవి. ఇప్పుడుండే వారలు వారి మూలగురువు లను దినమున కొక్కసారియైన స్మరణలోనికి తెచ్చినచో, వీరున్ను అట్టి స్థితిని కొంతవఱకు పొందగలరు. కీటకమేలాగున భ్రమరమును స్మరించి భ్రమర మగుచుండునో వీరున్ను అట్టివారిని జ్ఞాపకములోనికి తెచ్చిన ఆలాటివారు కాగలరు.

ఇప్పుడుండువారలు సామాన్యులైన బద్ధులగు జనుల యిష్టము ననుసరించి నడువవలసి వచ్చిరి. తమ మతమునకున్ను తమకున్ను వచ్చెడు కట్నములు, శిష్యార్జితములు లేకపోవునని భయపడుచున్నారు. ఇట్టి విచారము వల్లనే వీరియొక్క దుర్బలత్వము గోచరమగుచున్నది. పూర్వీక మతగురువు లందరు వారికి సత్యమైనదనియు, ధర్మమైనదనియు, దైవాశయ మైనదనియు తలంపు గలిగిన వానిని నిర్భయముగ లోకమునకు బోధించియుండిరి. అట్లు గానిచో వారికాలములో నుండిన అన్యమతములను, మతధర్మములను నెట్లు ధిక్షేపింప శక్తి గలిగి యుందురు? స్వమతము నేలాగున ప్రతిష్ఠింపగల్గి యుందురు?

వారు లోకమునందలి జనులను శరణు బొందియుండలేదు. లోకము వారినే శరణుబొందినది. వారు సత్యమైన దానికిన్ని, దైవధర్మమైన దానికిన్ని విరుద్ధములైన వానిని దూరీకరించుటలో, తృణీకరించుటలో ప్రాణమునుగూడ గోల్పోవుటకు సన్నద్ధులైయుండిరి. ఇది వారి సత్యబలమేగాని, ధర్మబలమే

గాని, జ్ఞానబలమేగాని, ఆత్మనమ్మకబలమేగాని మఱియొకటి కాదు. అట్టి దైవ బలము వారు గల్గియుండుటచేతనే లోకములను నడుపుటకు వారికి శక్తి గల్గి యుండెను. ఇప్పుడు కొందరు ఇది కలియుగము గదా? సత్యము, ధర్మము, న్యాయము, జ్ఞానము గలుగునా?యని సందేహపడుచుందురు. ఈ విషయమై నిస్సందేహము గల్గుటకొఱకు "యధార్థ భారతి"మొదలగు కొన్ని గ్రంధములు ఇప్పటికే ప్రచురింపబడియున్నవి. ఇకను నీ విషయమై సందేహము గలవారు మహర్షి సత్తముడగు మనుమహర్షియొక్క ఆశయమును జూడుడు. వీరే ధర్మ శాస్త్రములు రచించిన వారిలో మొదటి వారున్ను, ముఖ్యులునై యున్నారు.

**కృతం త్రేతాయుగం చైవ ద్వాపరం కలిరేవ చ ।**
**రాజ్ఞో వృత్తాని సర్వాణి రాజా హి యుగముచ్యతే ॥**

కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము మొదలైనవి రాజకృతములనియు, రాజులనుబట్టియే యుగవ్యవహారములు గల్గినవనియు గ్రహించవలయును. రాజు ధర్మజ్ఞానము తెలియని వాడగుచో, అది కలియుగమనియు, సత్యధర్మములు తెలిసియు నడువకున్న అది ద్వాపర యుగమనియు, సత్యధర్మములను తెలుసుకొని నడువవలెనని ప్రయత్నము చేసినచో నది త్రేతాయుగమనియు, సత్యధర్మముల నెరింగి కార్యములను సాగించినచో అప్పుడు కృతయుగమనియు మనుమహర్షిచే చెప్పబడియున్నది. దీనినిబట్టివిచారింపగా యుగధర్మములనుబట్టి ధర్మములేర్పడుట లేదనియు, రాజులను బట్టియే యుగధర్మము లేర్పడుచున్నవనియు గోచరమగుచున్నది గదా! రాజు ధర్మాత్ముడైనచో, ప్రజలుగూడ ధర్మాత్ములై యుండే తీరుదురు. లేనిచో, రాజశాసనముచే బంధింపబడుదురు గదా! మఱియు, కృత త్రేతా ద్వాపర కలియుగములు నాల్గున్ను ప్రతివారలలోను గలవనియు గ్రహించు కొనవలయును.

**కలిః ప్రసుప్తో భవతి స జాగ్రద్ద్వాపరం యుగమ్ ।**
**కర్మస్వభ్యుద్యతస్త్రేతా విచరంస్తు కృతం యుగమ్ ॥**

ఎవనియందు, సత్యధర్మజ్ఞానములు సుషుప్త్యవస్థయందుండునో అప్పుడు వానికి అది కలియుగ మగును. ఎప్పుడు సత్యధర్మములు హృదయములో స్ఫురించునో, అప్పుడు వానికది ద్వాపరయుగ మగును. మఱల నెప్పుడట్టి సత్యధర్మముల నాచరణలో నుంచి ననుష్ఠించునో అప్పుడతనికది త్రేతాయుగమగును. ఎప్పుడు సత్యధర్మముల యనుష్ఠించి జ్ఞానము గల్గిన వాడై జనులకు ధర్మబోధము గలుగజేయుటలో ప్రచారము చేయునో, అప్పుడతనికది కృతయుగంబనంబడును. అహా యెటువంటి పరమధర్మరహస్యమును మనము తెలుసుకొన్నాము! ఇది తెలుసుకొన్న దినమే మనకు సుదినమగును. ఇట్టి ధర్మరహస్యము తెలుసుకొనుటకు గల్గిన మనయొక్క పుణ్యమహిమ యేమని చెప్పవచ్చును? ఇప్పుడు మనకెంత ధైర్యము గల్గినది! లేనిచో పామరజనులవలె మనమున్ను ఇది కలియుగమని తలంచి దైవ కార్యములోను, ధర్మకార్యములోను ప్రయత్నము చేయనివారలమై కలియొక్క కల్మషమునకు వశవర్తులమై చెడిపోయెదము గదా!

ఇట్టి ధర్మరహస్యమును లోకములో నుద్బోధించుటకు ధర్మాత్ములు లేకపోవుటచేగదా యీలోక మంధ కారావృత మగుచున్నది! కనుక బ్రహ్మనిష్ఠులను వృద్ధిపరచి, సచ్ఛాస్త్రముల నుపదేశించి ధర్మనిష్ఠకు తగిన సాధనస్థలములగు ఆశ్రమము లుండిన మాత్రమే యిట్టి అజ్ఞాన నిబిడమగు కారుచీకటి లోకమునుండి తొలగిపోవును. అయితే, కొందరీలాగున తలంచవచ్చును. అనాదిగా వచ్చుచుండు యుగధర్మములున్ను, వర్ణాశ్రమ ధర్మములున్ను, బాల్యవివాహ వితంతువివాహ నిరోధములున్ను అతిక్రమించి, వేదశాస్త్రముల నుల్లంఘించి, మహర్షుల శాస్త్రముల నతిక్రమించి చెప్పుటకు మీకేమి శక్తిగలదని అనుకొనవచ్చును. ఈ ప్రశ్న ఏలాటి అర్థమున్నులేని వ్యర్థవాగ్జృంభణమే గాని మఱియేమియుగాదని ధర్మనిష్ఠుడు నిర్భయముగ పలుకగల్గును. ఏలననగా? ఇంతవఱకు వచ్చుచుండెడు ఋషులుగూడ మతములలో భిన్న భిన్న అభిప్రాయములు గలవారై యుండిరి. అది అట్టి మహర్షులయొక్క యంతరాత్మలో దైవకృపచే గల్గిన సత్యబుద్ధియేగాని, మఱి

యొకటి గాదు.

ఆలాగున మతగురువులలో శ్రీకపిల, జైన, బుద్ధ, శ్రీశంకరాచార్య, రామానుజాచార్య, వేదాంతదేశికాచార్య, మధ్వాచార్య, శ్రీకృష్ణచైతన్య, గురునానక్, రాజారాంమోహన్‌రాయ్, దయానంద సరస్వతీ స్వామి మొదలైన వారెల్లరు ఏలాగున వారి వారికి సర్వేశ్వరుడు గలుగచేసిన ధర్మము సత్యమని తోచెనో దానిని వారికి పై పై గల మతగురువుల ఆశయములను లక్ష్యపెట్టక లోకమున కేలాగున బోధించిరో, యిదిన్ని ఆలాగున నుండునని గ్రహించు కొనిన చాలును. మఱియు శాస్త్రమునకు సర్వతోముఖత్వముండుటచే అట్టి మహాపురుషులున్ను ఒక్కొక్కవిధము నవలంబించి ధర్మతత్త్వము నుద్బోధించిరి. కనుకనే వేదములో

**"నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే ।**
**సహస్రపాదాక్షి శిరోరుబాహవే !"** అనియును,

**"సహస్రశీర్ష దేవం విశ్వాక్షం విశ్వసంభువం"** అనియును తెల్పిరి.

మఱియు, వేదమనంతము. ఒక్కొక్కరున్ను ఒక్కొక్క అంగమును మాత్రమే తెలుసుకొనగల్గుదురు. కనుకనే వేదవృక్షమున కనేక శాఖలేర్పడినవి. అట్లైనచో, వేదమనంతమని నమ్మువారికి ఇంతవఱకు నేర్పడిన వేదజ్ఞానము గాక, యికను నూతన జ్ఞానభాగము ఏల ఏర్పడకూడ దని తలంచగూడదు? మఱియు మనుష్యమాత్రునిచే వేదార్థమును వేద జ్ఞానమును; సంపూర్ణముగ దెలుసుకొనుటకు అసాధ్యమగును. భగవంతు డనంతుడైనచో భగవద్ధర్మము గూడ ననంతముగానే యుండవలెను. కనుకనే యిన్ని మతము లేర్పడినవి.

మఱియు, మతకర్తలలో నవీనములగు ధర్మములు జ్ఞానములు ఆవిర్భవించినప్పుడు అవి వారు లోకమున కుపదేశించియుందురు. అట్లుగానిచో ధర్మశాస్త్రములకు మూలమగు మనుస్మృతి యొక్కటి చాలదా? మఱల ఏల యిన్ని ధర్మశాస్త్రము లేర్పడినవి? అట్టి మతకర్తలు బోధించుటకు తగిన ధర్మములు వేదములనుండియు, స్మృతులనుండియు, పురాణములనుం

డియు గ్రహించినవారలేగాని యితరులనుండి గ్రహించి చెప్పినవారు కారు. దానికి వారు చూపిన ప్రమాణములే తార్కాణము. ఏ మతకర్తలున్ను సత్య ధర్మములకున్ను, ఈశ్వరప్రీతికి భిన్నములైన కార్యములను దెల్పియుండ లేదు. కనుకనే వారి మతములను జనులంగీకరించినది. అట్లు గానిచో నెవరు నంగీకరించి యుండరు. జరిగి పోయిన మతములేగాక, జరుగుచున్న మతములేగాక, యిక ఎన్ని మతములు జరుగగలవో యెవరు చెప్పగలరు?

లోకపావనములగు, దయాపరములగు, జనుల యాత్మలకు గుణ కర్మముల ననుసరించి స్వాతంత్ర్యము గలుగజేయు ఆ మతము లన్నిటికిన్ని యిప్పుడే హృదయ కవాటమును తెరచివేసి స్వాగత మిచ్చుచున్నాను. పవిత్రమగు మానవసౌఖ్యమును గలుగజేయు మతము లన్నియు వర్ధిల్లును గాక! ఇంతవరకు గల్గియుండు జ్ఞానముచే అంత్యమైనదని తలంచినచో, దైవ మును, దైవజ్ఞానమును, దైవవిషయశాస్త్రమును ఎట్లనంతమని చెప్పగలము? కనుక జ్ఞానమున్ను, జ్ఞానస్వరూపుడైన భగవంతుడును అనంతము.

ఇచ్చట ముముక్షువులకు ఒక్క సంశయము గలుగవచ్చును. అదియే మనగా? పై జెప్పిన విషయములో ఋషులున్ను మతకర్తలగు మహాపురుషు లున్ను, అప్పుడప్పుడు లోకమునకు హితముగా తోచినది వేదశాస్త్రమునకు విరోధము గలుగక సవరణ చేసుకొనివచ్చిరనియు, దాని నాధారపడియే యిదిన్ని చెప్పడమైనదనియు తెలుపబడినందుచే మీరున్ను ఆలాటి ఋషి వర్గములో చేరినవారుగాని, మతకర్తలవంటి వారుగాని అగుదురా? యని మీరును ప్రశ్నించెదరేమో? అట్లు సందేహపడ నక్కర లేదు. అట్టి ఋషు లున్ను, మతకర్తలున్ను మనబోటి మానవులే అని మీతో నిస్సంశయముగ ముమ్మారు చెప్పుచున్నాను. అయితే వారాచరించినట్లు మనమున్ను అనుష్ఠించుకొనవలయును. అప్పుడు మనకేగాక, మనుష్యమాత్రు లందరికిన్ని అది సాధ్యము గాగలదని మీరు నిస్సంశయముగ తెలుసుకొనగలరు.

ఒక కాలమునం దొకరికి ఒక సత్యము కనుపడినచో అది ఇప్పుడున్ను, రేపటికిన్ని అట్లుండువారికి గనపడుట నిస్సంశయము. ఏ మహాపురుషులుగాని

మతకర్తలుగాని, ఋషులుగాని తమకు గల్గిన దివ్యభావము వారు చెప్పే లాగున నాచరించువారి కందరికిన్ని గల్గుననియే చెప్పియున్నారు. అట్లుగాక మేమే మహాపురుషులము, మాకే అది సాధ్యమగును. మీకు సాధ్యము గాదని ఒక్క ఋషిగాని, మహాపురుషుడుగాని చెప్పియుండలేదు. అయితే పైజెప్పిన ఋషు లవలె ఒక్కస్మృతి వ్రాయుటగాని, మతకర్తలవలె క్రొత్తమతమును స్థాపించుట గాని చేయవలెనని తలంచుట లేదు. ఏలననగా, అట్టి ఋషులు వ్రాసిన దానిలో మనకు కావలసిన సమస్త ప్రమాణములు గలవు. ఆలాగున మత కర్తలు ఉపదేశించిన దానిలోనే మనయొక్క మోక్షద్వారము తెరచిపెట్ట బడి యున్నది. కావున పైజెప్పిన రెండువిషయములు లేకపోయినగదా మనకు క్రొత్తమత మొకటి కావలసివచ్చును!

మఱియు, వారి వారి శక్తికొలది సత్యధర్మముల నాచరణలో నుంచు టయు, నితరులకు బోధించుటయు ప్రతివారియొక్క ధర్మమైయున్నది. విశేష ధనము గలవారు ఎక్కువ దానధర్మములు చేయుచున్నారని యనుకొనుడు. బీదవాడు పైజెప్పిన ధనవంతులవలె చేయశక్తి లేనివాడైనను తనశక్తి కొలది చేయక యుండునా? శ్రీరామచంద్రుని ధర్మసేతు బంధనకాలములో అంగదాదులు గొప్పగొప్ప కొండలను, రాళ్ళను తెచ్చుకొని సేతుబంధనము చేయుచుండినను చిన్నదైన యుడుత తన శక్తికొలది సహాయము శ్రీరామ చంద్రులకొఱకు చేయక ఊరకుండలేదు కదా? మనయొక్క ప్రయత్న మటు వంటిదని తలంపుడు. నది నాశ్రయించి ప్రయాణము చేయువాడు సముద్ర ములో ప్రవేశించినట్లు ఏ మతములో నుండినను మతి శుద్ధమగుటకు తగిన యనుష్ఠానము గల్గినచో దానియందుండియే యీశ్వరసాక్షాత్కారము చేసు కొనవచ్చును.

అయితే ప్రస్తుతము మతములన్నియు బాహ్యాచారములచే సంతుష్టి బొందుచున్నవి. నాచుచే జలము క్రమ్ముకొన్నట్లు బాహ్యాకృత్యములచే అంత రాత్మయొక్క సత్యమున్ను, నిష్ఠయున్ను ఆవరించుకొనబడినవి. దీనిని మాత్రము సర్వమత ప్రవర్తకులను జ్ఞప్తిలో నుంచుకొనవలెను. మీరెవరైన

ఋషిసంతానము కారని చెప్పగలరా! మీగోత్ర, సూత్ర, ప్రవరలను ఒకసారి పఠింపుడు. అప్పుడు మీరు ఋషికుమారులనియు, ఋషికుమార్తెలనియు చెప్పగలరు. అప్పుడాధర్మము మీయందు ప్రకాశించును. ఇదిన్ని ఎక్కువైనది గాదు. మీరు ఈశ్వరాంశులే. దీని పైమెట్టులో ప్రవేశించిన నీశ్వర స్వరూపులే యని నిస్సంశయముగ చెప్పగలరు.

ఇంతకు పూర్వము వేదవృక్షమునకు అనేకశాఖలు గలవని చెప్పి యుండినందుచే, ఒక్క శాఖను అవలంబించిన పూర్ణత్వము పొందగల్గునా? యని సందేహపడనక్కరలేదు. ఎట్లనగా? బహుశాఖలుగల వృక్షముయొక్క ఒకే శాఖను ఆశ్రయించి ప్రయాణము సాగించిన వృక్షముయొక్క మొదలులో వచ్చిచేరుదుము గదా! ఆలాగున నే మార్గమునుండియైన అంతరాత్మ శుద్ధ మగునట్లు తగిన అనుష్ఠానము గల్గిన పరిపూర్ణుడగు సర్వేశ్వరుని చేరవచ్చును. ఇక నీ విషయమై విస్తారముగా వ్రాయబూనలేదు.

మనది సంపూర్ణనివృత్తి మార్గమగుటచే ప్రవృత్తిమార్గమునకు సంబంధించిన వివాహాది కార్యములు చెప్పుటలో కాలము వినియోగపరచ జూచుట లేదు. పునర్వివాహము శాస్త్రసమ్మతమా? కాదా? యను ప్రశ్నకు నిచ్చుట ఉత్తర మివ్వబడినది. ఈ విషయమై విస్తారముగా కనుగొనుటకు తలంపుగలవారు ఆర్యసమాజము, బ్రహ్మసమాజము, కందుకూరి వీరేశలింగం పంతులుగారు, లాహెూరు విధవా పునర్వివాహ ప్రచారకులు, విద్యాసాగరులు మొదలైన వారి గ్రంథములను జూచిన సంతృప్తి పొందగలరు. వారు సహస్ర ముఖములుగా శ్రుతిస్మృతుల ఆధారము చూపగలరు. మనమతమును బోధించుట కేర్పడిన మతకర్తలందరును కాలానుగుణముగా లోకమును నడుపుటకు ప్రయత్నించుటయే మంచిది. జలప్రవాహములచే చెరువులు నిండునప్పుడు కలుజు తీసివేయుటయే శ్రేయస్కరము. అట్లు గానిచో చెరువుకట్టను ధ్వంసమొనర్చి జలము సముద్రమువఱకు ప్రవహించునని మరువకుడు. ఆలాగున జనుల యొక్క విజ్ఞానోన్నతగతిని దెలుసుకొనదగిన మార్గము తెరచివేయుటే శ్రేష్ఠము. లేనిచో మోసముచే క్రమ్మివేసి యుండు కపటులకోటలను వారు బ్రద్దలుగా

కొట్టివేయగలరు.

ఇక నొక విషయము చెప్పకుండుటకై నాయాత్మ అంగీకరించుట లేదు. అదియేమనగా? కన్యావిక్రయమను మహాపాతకము ఒకటి. రెండవది వరకట్న మను దురాచారము. ఇవి రెండున్ను శాస్త్రములో చాల నిషేధముగా చెప్పబడి నవి. దీనివల్ల సకాలములో వివాహము జరుగనొల్లక, ఎందరో నారీమణులు దుఃఖములో కుందుచున్నారు. ఆత్మహత్యగూడ చేసుకొనుచున్నారు. మఱి కొందఱు కాలమతిక్రమించియు వివాహము జరుగలేదని తలచి, ఉన్న భూమి గాని, యిల్లుగాని యితర వస్తువులుగాని అమ్మివేసియు, అడుమానము పెట్టియు, అప్పుచేసుకొనియు వివాహము జరుపుచున్నారు. మఱల అట్టి అప్పు తీర్చనొల్లక వడ్డి పెరిగి యింటితో సహా ఏలము పాడి పోయే అవస్థకు వచ్చు చున్నారు. తర్వాత విక్రయించిన తమ సొంతపుత్రికలు భోజనమునకు లేకయు, వస్త్రమునకు లేకయు, ఉండుటకు ఇల్లయిన లేకయు సంకటపడు విషయమందఱును చూచుచున్నారు. ఇట్టి క్రూరకార్యములైన నిరోధించుటకు మతకర్తలు గనుపించుట లేదు. ఇట్టి అనర్థము గలుగుటకు మతనియమము రాజశాసనములో లేకపోవుటయే కారణమగుచున్నది. ఓహెూ! భారత దేశమునకు గల్గిన కష్టములను తలంచినచో నెట్టివారి మనస్సైన నీరుగా కరు గక పోవునా? కన్నాశుల్క విషయమై మనువు చెప్పినది చూడుడు.

**ఆదదీత న శూద్రోఽపి శుల్కం దుహితరం దదత్ ।**
**శుల్కం హి గృహ్ణన్ కురుతే ఛ్చన్నం దుహితృవిక్రయమ్ ॥**

శాస్త్ర మెరుగనివాడైన శూద్రుడయినను, కన్యనొసగి, యోలి గైకొన రాదు. ఇక శాస్త్రజ్ఞుడైన బ్రాహ్మణుని మాట యేమి చెప్పవలయును? ఓలి గైకొన్నవాడు రహస్యమయిన కన్యావిక్రయమును నొనరించినవాడే యగును. కన్యావిక్రయమనగా? ధన మందాశపడి తన యాడుబిడ్డలను హీనులకమ్మి అట్టి ధనముచే జీవించుట యని యర్థము. ఇది శాస్త్రములో పరమత్యాజ్యము. వరకట్నము ఇటువంటిదే. ఇట్టి భార్యాభర్తలకు సత్సంతానములు గలుగవు.

అధర్మ వివాహమగుటచే వారిలో గలిగెడు సంతానములున్ను అధర్మములై నవియే యగును. ముందు చెప్పబడిన బ్రాహ్మ, దైవములు మొదలగు వివాహ ములు ధర్మయుక్తములు. వారిలో ఉద్భవించెడు పుత్రులు ధర్మాత్ములగు దురు. వంశవివర్ధకు లగుదురు. లోకపూజ్యు లగుదురు.

8. ఆత్మ వివాహము : ఇది కష్టరహితమైనదేగాక అష్టైశ్వర్యములను గలుగ చేయునదిన్ని, ఇష్టమైన సుఖము గలుగుటలో సహాయము చేయునదిగా నున్నది.

**సత్యం మాతా పితా జ్ఞానం ధర్మో భ్రాతా దయా సఖా ।**
**శాంతిః పత్నీ క్షమాపుత్రష్షడేతే మమ బాంధవాః ॥**

అని ధర్మరాజు నుడివియున్నారు. మన్వాది ధర్మశాస్త్రములలో వివాహ మెనిమిది విధములుగా చెప్పబడియున్నదిగదా? వానిలో బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యములనెడు నాల్గున్ను గ్రాహ్యములనియు ఆసుర, గాంధర్వ, రాక్షస పైశాచము లనంబడు నాల్గు అగ్రాహ్యములనియు (త్యాజ్యము లనియు) విధింపబడియున్నవి. ఈ వివాహము లన్నియును గాక ఆత్మవివాహ మొకటి గలదు. ఇది యోగులయొక్క ఆత్మానుసంధానమై యున్నది. ఇది వేదాంతము లోను, ఉపనిషత్తులలోను గనందగినది. పై జెప్పిన వివాహము లన్నియు, ప్రపంచముతో సంబంధించినవియేగాని ప్రపంచాతీత జ్ఞానముగల ఆత్మ జ్ఞానులవి గావు. ఏలన? ప్రపంచకార్యము లన్నియు, బద్ధజీవుల కేర్పడినవి. ముక్తజీవుల కంతయున్ను ఆత్మలోనే గలదు. అంతేగాక, బాహ్యసుఖము లన్నియు భ్రమను గలుగజేయునవిగ నున్నవి. అవి యన్నియు అంతముతో గూడినవియే గాక, దుఃఖమునుగూడ గలుగజేయునవిగా నుండును.

పైజెప్పిన వివాహము లన్నియు ఆత్మశుద్ధి గలుగక విషయములో నుండి ధర్మమార్గములో ప్రవర్తించి అంతఃకరణశుద్ధి గల్గుటకొఱకేర్పడినవి. కనుకనే ధర్మరాజులవారు తమయొక్క ఆత్మకుటుంబమును పై శ్లోకముచే వివరించినది. ఆయన చెప్పే లాగుననే అంత్యకాలమున చేసినవాడు.

సర్వమును పరిత్యజించి, బదరికాశ్రమ ప్రయాణము స్వర్గారోహణ నిమిత్తము చేయునప్పుడు ఆలాగుననే చేసియున్నాడు.

పై శ్లోకమునందు, పరమశాంతినే భార్యగా వర్ణించియున్నారు. ఇచ్చట సామాన్యశాంతియే యెంతో గొప్పసౌఖ్యమును గలుగజేయుచున్నది గదా! అట్లుండగా, ప్రకృతి సంపూర్ణముగా శమించుటచే గలిగెడు ఆత్మశాంతి యొక్క సుఖమే మని చెప్పవచ్చును! సౌఖ్యముకొఱకు గదా భార్యను వివాహము చేసుకొనుట! అట్టి సుఖము బాహ్యమునుండి యెట్లుగల్గును? సుఖమునకు స్థానము హృదయము గదా! ఒకవేళ శాంతియు, కరుణయు గల భార్య లభించినను అది శాశ్వతసుఖము నివ్వగలుగునా!

**బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్ ।**
**స బ్రహ్మ యోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే ॥**

బ్రహ్మనిష్ఠ డైనవాడు శబ్ద స్పర్శ రూప రస గంధాది బాహ్యవిషయములతో సంబంధము గలుగజేయని అంతఃకరణము గలవాడై, ఆత్మనిష్ఠలో నే సుఖము గలదో అట్టి దైవసుఖమును అనుభవించుచున్నాడు. అట్టి ఉపరతిని పొందిన బ్రహ్మనిష్ఠతోగూడిన హృదయము గలవాడై నాశము లేని, శాశ్వత సుఖము ననుభవించుచున్నాడు.

**యే హి సంస్పర్శజా భోగాః దుఃఖయోనయ ఏవ తే ।**
**ఆద్యంతవన్తః కౌంతేయ! న తేషు రమతే బుధః ॥**

ఓ అర్జునా! ఇంద్రియములున్ను, వాని విషయములైన శబ్ద, స్పర్శ, రూప రస, గంధములు మొదలైన వానితో సంబంధపడి గలిగెడు, భోగము లెవ్వి గలవో, అవి యిహలోకములోను, పరలోకములోను దుఃఖమునకు కారణము లగుచున్నవి. అంతేగాక, ఆ బాహ్యసౌఖ్యములు ఆదియు, అంతమును గల్గినవి. అవి చంచల స్వభావములు. అందువల్ల నిజమైన ఆత్మతత్త్వ మెరింగిన జ్ఞాని అట్టి యింద్రియములయొక్క సంబంధముచే గలిగెడు భోగములలో మిథ్యాబుద్ధియున్ను, దుఃఖహేతువున్ను ఎఱింగిన వాడగుటచే

వానిలో రమించుట లేదు. అవి సుఖమని తలంచుటయును లేదు. శ్రీకృష్ణభగ వానులే యీలాగున నుపదేశించియున్నారు.

**యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చ మానవః ।**
**ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే ॥**

బ్రహ్మనిష్ఠుడైన ఏ మానవుడు ఆత్మధ్యానములో రమించువాడై, ఆత్మ యందే తృప్తినొందినవాడై, ఆత్మనిష్ఠలోనే సంతోష మనుభవించువాడై, యుండునో అట్టి యోగియైన వానికి చేయదగిన బాహ్యకార్య మేమియున్ను లేదు. తక్కిన బాహ్యకర్మలన్నియు, ఆత్మనిష్ఠను పొందని అజ్ఞానులకొఱకే ఏర్పడినవి. కావున ఆత్మవివాహమునకు సరియైన శాశ్వతసౌఖ్యము మఱి యొకటి లేదు.

అట్లయిన గృహస్థాశ్రమములో నెందరో పుణ్యపురుషులు ధర్మబద్ధమైన వివాహము చేసుకొనేలాగున శాస్త్రమేల విధించవలెనని సందేహము గలుగ వచ్చును. అది ఆత్మసుఖ మెరుంగని అజ్ఞానికి అట్టి వివాహము లేనిచో, పశు కృత్యముతో గూడినవాడై చెడిపోవునని తలంచి, శాస్త్రము విధించినదేగాని మఱియొక విధము గాదు. అట్లు ధర్మబద్ధముగా భార్యాభర్తలు వివాహము చేసుకొని, అంతఃకరణశుద్ధి గలుగజేసుకొని విరక్తులై, బ్రహ్మనిష్ఠ చేయవలయు ననియే శాస్త్రనియమము. ఆలాగున అగ్నిసాక్షిగాను, వేదమంత్రముతోను, వివాహము చేసుకొనిన వారయ్యు ధర్మము నుల్లంఘించి యెందరో పశువృత్తి గల్గి వర్తించుచున్నారు.

**అధర్మాజ్జాయతేఽజ్ఞానం యథేష్టాచరణం తతః ।**
**ధర్మకార్యం కథం తత్స్యాద్యత్ర ధర్మోఽపి నశ్యతి ॥**

అధర్మాచరణమువల్ల అజ్ఞాన మావిర్భవించుచున్నది. అట్టి అజ్ఞానము వల్ల జ్ఞానమావరణమై పోవుటచే స్వేచ్ఛాప్రవృత్తి కల్గుచున్నది. దానివల్ల ధర్మము నశించుచున్నది. అందుచే మనుష్యుడు భ్రమలో చిక్కుకొనుచున్నాడు. అట్టి వారికి ధర్మకార్య మేమియు గలుగదు.

**న హి సత్యాత్పరో ధర్మో నానృతాత్పాతకం పరమ్ ।**
**న హి సత్యాత్పరం జ్ఞానం తస్మాత్సత్యం సమాచరేత్ ॥**

సత్యవర్తనమునకన్న పరమైన ధర్మము లేదు. అసత్యవర్తనమునకన్న పరమపాతకమున్ను లేదు. జ్ఞానమునకు సత్యవర్తనమునకన్న వేరు మార్గము లేదు. కావున జ్ఞానాభిలాష గలవారు సదా సత్యమునే ఆచరించవలెను.

**న హి దుఃఖప్రదం వస్తు సుఖం దాతుం సమర్థతి ।**
**కిం విషం పిబతో జంతోరమృతత్వం ప్రయచ్ఛతి ॥**

దుఃఖమును కలుగజేసెడు కృత్యము సుఖమును గలుగజేయజాలదు. ఎట్లన? విషపానము చేసిన వానికి మరణము గలుగునేగాని అమృతత్వమెట్లు సిద్ధించును? విషబీజము పెట్టినవానికి అమృతఫలము గలుగదు గదా! ఆలాగున బాహ్యవిషయము విషసమానముగ నుండగా దానియందు రమించు వానికి అమృతపదవి యగు మోక్షమెట్లు గలుగును? మఱియు, బాహ్య సౌఖ్యముల నన్నిటిని మాయాభ్రమచే సౌఖ్యముగా తలంచుచున్నారేగాని అవి దుఃఖహేతువులని శ్రీపతంజలి మహర్షి యోగశాస్త్రములో వచించియున్నారు.

**అనిత్యాఽశుచి దుఃఖాఽనాత్మసు**
**నిత్యశుచి సుఖాఽత్మఖ్యాతిరవిద్యా ॥**

అనిత్యములైన వస్తువులయందు నిత్యత్వబుద్ధియు, అపరిశుద్ధములైన దేహాదులయందు శుచిత్వబుద్ధియు, దుఃఖాదులైన యింద్రియ విషయము లందు సుఖత్వబుద్ధియు, ఆత్మ కాని శరీరమునందు ఆత్మత్వమని భావిం చెడు బుద్ధియు అవిద్య యనంబడును. అవిద్య యనగా? లేనివస్తువు ఉన్నట్లు కనబరచు స్వభావము (లేక దుఃఖవస్తువులో సుఖము గలుగునని గలిగెడు భ్రమ యనంబడును). దీనియర్థము పాఠకులు యోచించుకొనిన విశేషముగా గోచరము గాగల్గును. ఆహా! ఇట్టి తత్త్వమును తెలుసుకొనక పామరులగు జనులు బాహ్యసౌఖ్యము గల్గునని తలంచి భార్యను వివాహము చేసుకొన్న తర్వాత నెందరో దుఃఖమునకు పాలగుచున్నారు. వారు సంసారమనెడి దుఃఖ

సాగరములో మునిగి తేలుట జూచుచున్నారు గదా! విజ్ఞులైనవారు ఇట్టి ఆత్మ వివాహము చేసుకొనవలయును. పరమశాంతి అనగా ఉపరతి యను భార్యతో అంతరాత్మలో యోగరతుడైన మహనీయుని ఆత్మసుఖము వర్ణించుట కెవరి తరము? గురుగీతయందు నీలాగున పరమశివుం డుపదేశించి యున్నాడు.

**న తత్సుఖం సురేంద్రస్య న సుఖం చక్రవర్తినామ్ ।**
**యత్సుఖం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥**

ఏ సుఖము విరాగియై మననశీలుడై యేకాంత నివాసము చేయు యోగికి గల్గుచుండునో, అట్టి సుఖము దేవేంద్రునికిన్ని గలుగబోదు. అట్లుండ అట్టి సుఖము చక్రవర్తుల కెట్లు గల్గును? చక్రవర్తులకు గూడలేదని భావము.

**నిత్యం బ్రహ్మరసం పీత్వా తృప్తో యః పరమాత్మని ।**
**ఇంద్రం చ మన్యతే తుచ్ఛం నృపాణాం తత్ర కా కథా ॥**

నిత్యము బ్రహ్మానంద రసామృతమును పానము చేసి పరమాత్మధ్యాన మందు తృప్తిని పొందిన యోగియైనవాడు దేవేంద్రునియొక్క సుఖమును తుచ్ఛముగ తలంచుచున్నాడు. అట్లుండగా, రాజులను గుఱించియు వారి సుఖమును గురించియు ఏమి చెప్పగలము.

అయ్యో! సంసారులు ఎండచే జలము ఇంకిపోయి బురదలో పరిత పించెడు చేపలవలె సంసారవిషయ మనెడు పంకములో చిక్కుకొని తరించు టకు మార్గము గనుపించకయు, ఎండచే తపించెడు చేపలు దాహము సహింప జాలక దీర్ఘనిశ్వాసములు విడుచునట్లు సౌఖ్యము గలుగకయు పరితపించుట జూచుటలేదా? ఇట్టి దుఃఖభూయిష్ఠమైన సంసారపంకములో నేల మగ్నులు గావలయును? మఱియు, ఇక కొందరు కారుచిచ్చుచే చుట్టున్ను కాలుచున్న అరణ్యమధ్యములో చిక్కుకొన్న మృగముల చందంబున సౌఖ్యముకొఱకు అచ్చోటనుండి యిచ్చోటికిన్ని, ఇచ్చోటనుండి అచ్చోటికిన్ని భయముగల్గి పరు గెత్తుచు, తాపత్రయాగ్నివల్ల దహింపబడువారలై, శాంతిగానక ఒక్కొక్క దుఃఖము వచ్చునప్పుడు దానియొక్క నివృత్తికొఱకు అచ్చటికిచ్చటికి దిన

రాత్రులనక పరుగెత్తుట చూచుట లేదా? అయ్యో! ఇట్టి మహాభయంకరమైన సంసార దుఃఖమునకా మానవజన్మము కలిగివది? ఆత్మలో శాంతి యను పత్నిని వివాహము చేసుకొన్నవారలై ఇట్టి కష్టము లేమియు లేకపోవుటయేగాక పూర్ణిమచంద్రునివలె ప్రసన్నముఖము గలవారై సౌఖ్యమును పొందెడు జ్ఞానులను చూచుట లేదా? వేరు కొందఱు వేటగానివలలో చిక్కుకొనిన పక్షి వలె విషయవాసన యనెడు, సంసార జాలమనెడు వలలో చిక్కుకొని తప్పించు కొనుటకు మార్గము తెలియక పొందెడు దుఃఖము జూచుచున్నారము గదా!

ఇట్టి దుఃఖమేమియు ఆత్మలో ఉపరతిని పొందిన యోగికి లేదు గదా! పట్టుపురుగు తనచే కట్టబడిన గూటిలో చిక్కుకొని చచ్చునట్లు ఎందరో తమచే కట్టుకొనబడిన భార్యాది సంసార బంధములకు లోబడి దుఃఖితులై వ్యర్థముగా చచ్చిపోవుచున్నారు. విరక్తియనెడు భార్యను ఆత్మలో వివాహము చేసుకొని మహాత్ములందఱు ఇట్టి దుఃఖము నొందక పరమానందభరితులై దుఃఖములో పరితపించెడు జనుల కాత్మశాంతి గలుగజేసి తామున్ను శాశ్వత సుఖములో నుండుట జూచుచున్నాము గదా! మరియు ఎండాకాలమున దామరకొలనులో గల కమలముకొరకు దిగిన యేనుగు బురదలో దిగబడి పైకి రాజాలక అచ్చటనే యుండి గద్దలచేతను, కాకులచేతను, బోరువలచేతను పొడువ బడినదై వణకుచు, బాధకోర్వలేక ఒక్కకాలు పైకెత్తజూచిన మరియొక పాదము మరింత క్రిందికి క్రుంగుచు జీవము గల్గియుండునప్పుడే పక్షులు తినగా తినగా ప్రాణము పోగొట్టుకొనునట్లు సంసార విషయమనెడు బురదలో స్త్రీలముఖమనెడు పంకజమును మోహించెడు మానవుడు ఆ సంసారపంకము లోనే పడినవాడై యనేక ఈతిబాధలచే జీవించి యుండియు మృతప్రా యునివలె నుండి యెన్నియో దుఃఖములను సహింపజాలక దానియందే దుఃఖించి ప్రాణమును విడుచుట అందఱును చూచుటలేదా? మరియు, రాత్రి కాలములో అగ్నిని చూచి మిడుతలు ఆనిప్పు మంచి భోగ్యవస్తువని తలంచి దానిలో ప్రవేశించి ప్రాణముతో కాలిపోవునట్లు అజ్ఞానమనెడు తమస్సులో చిక్కుకొనిన మనుజుడు ఎట్టిని వర్ణముగల స్త్రీని గొప్ప భోగ్యవస్తువని తలంచి

వివాహమాడి మరల విషయాగ్నిలో తగులుకొని విడిపించికొని పైకి రాజాలక సజీవముగా అంత్యకాలమువఱకు దానిలో మునిగి దహించిపోవుట గనుపించుట లేదా?

ఈలాగున, స్త్రీలుగూడ సుందర పురుషులను మోహించి, పై జెప్పిన మిడుతల చందంబున సంసారాగ్నిలో కాలుచున్నారు గదా! ముక్తికాంతను ఆత్మలో వివాహము చేసుకొన్న యోగికి నిట్టి సంకటము లన్నియు తప్పిపోవుటయేగాక, శాశ్వతమైన దైవసుఖము లభించుచున్నది గదా! ఎట్టిగా కాలుచుండు ఇసుకలోపడిన పేడపురుగు ఏలాగున వేడిమి సహింపజాలక తపించుచుండునో, ఆలాగున సంసారమనెడు నెండకు లోబడిన మానవుల కెచ్చట సుఖము గలదు? ప్రవాహ మను సుడిలో చిక్కుకొనిన కీటకము తిరిగి తిరిగి క్రమముగా ఉప్పుసముద్రములో పోయిచేరునట్లు, ఈ సంసారమనెడు ప్రవాహములో చిక్కుకొన్న మానవుడు ఈర్ష్యా, అసూయా, రాగద్వేషాదు, లనెడు సుడిలో గిఱ్ఱున దిరుగుచు ఒడ్డు జేరజాలక, ఆఖరున మృత్యువను సంసారసాగరముయొక్క లోనికి దిగిపోవుచున్నాడు. వివాహమునకు కళ్యాణ మని మఱియొక పేరు గలదు. కళ్యాణమను పేరుకు మంగళకరమని అర్థము. అట్టి సౌఖ్యమిప్పుడెవరు పొందుచున్నారు?

ఈ పై జెప్పిన విషయము లన్నియు పురుషులకేలాగున చెప్పబడినవో, ఆలాగున స్త్రీలకుగూడ చెప్పబడినట్లు గ్రహించుకొనవలయును. అయితే పురుషులకు మాత్రము ముక్తికాంత యనియు, ఉపరతియనియు, శాంతియే పత్నియని చెప్పిరి. ఆలాగున స్త్రీలకెట్లు సమన్వయపరచవచ్చునని శ్రోతలు తలంపనక్కఱలేదు. ముక్తికాంతాపదమునకు బదులు స్త్రీలకు ఆత్మారాముడని గ్రహించవలెను. ఉపరతియు, శాంతియు, అందఱికిన్ని సమాన వాచకములు. అయితే యీ వివాహవిషయమై పడు బాధలలో పురుషులకంటె స్త్రీలు వెయ్యి రెట్లధికముగా దుఃఖము నొందుచున్నారు. ఏలన? పురుషులకు కొంత వఱకు స్వాతంత్ర్య ముండును. అయ్యో! పాపము స్త్రీలకు అంతమాత్రమైనను స్వాతంత్ర్యము లేకపోయినది. కనుకనే సాధక బాధకములను తెలుసుకొన

దగిన వయస్సు వచ్చినతర్వాత మాత్రమే స్త్రీపురుషు లుభయులకున్ను వివాహము చేయవలెనని చెప్పబడినది.

ఎండమావులలో గనుపించెడు జలభ్రాంతిచే మృగములు పరుగెత్తి జలము దొరకక తపించి చచ్చునట్లు జనులందఱున్ను సంసారమరుభూమిలో సౌఖ్యము గలదని తలంచి మృతి నొందుచున్నారు. ఇట్టి కష్టము లన్నిటికిన్ని తగిన మతబోధకులు జ్ఞానవైరాగ్య సంపన్నత గలవారు లేకపోవుటయే కారణ మగుచున్నది. అయ్యో కొందఱు సంసారములో చిక్కుకొని అరణ్యమున రేచుకుక్కల గుంపుచే చుట్టబడిన మృగ మేలాగున శరీరముతో ఉన్నప్పుడే ఆ క్రూరమృగములచే కన్ను, ముక్కు, చెవి, కడుపు, ఉపస్థము మొదలగు అంగములు ఒక్కొక్కటి పెరికి తినివేయబడుచున్నదో ఆలాగుననే ఈ సంసారములో చిక్కుబడిన జీవియు నీషణత్రయముచేతను, తాపత్రయము చేతను, వాసనాత్రయముచేతను పిల్లలు, బంధువులు, అప్పువారలు మొదలైన వారిచే పట్టి పీల్చి పిప్పిచేయబడుచు దుఃఖరోదనముతోనే అంత్యకాలము వఱకు గడుపుచుందురు గదా!

ఇట్టి దుఃఖముల కన్నిటికిన్ని అజ్ఞానము, లేక మాయాభ్రాంతి కదా కారణమగుచున్నది! సంయమియైన యోగిగాని లేక యోగినిగాని యైనచో నీ ఘోరదుఃఖము లన్నియు, తప్పిపోవుటగాక, బ్రహ్మానందసుఖ మనుభవింప వచ్చును గదా! ఈ ఆత్మవివాహమున పురుషుడైనచో ముక్తికాంతను వివాహ మాడవలెను. దీనికే భక్తియనియు, విరక్తియనియు, శాంతియనియు, ఉపరతి యనియు పేర్లుగలవు. స్త్రీయైన ఆత్మారాముని భర్తగా జేసుకొనవలెను. ఈ ఆత్మారామునికే పరమాత్మ యనియు, భగవంతు డనియు, సర్వేశ్వరు డనియు, అంతరాత్మ యనియు, నారాయణమూర్తి యనియు, పరమేశ్వరు డనియు మారుపేర్లు గలవు. వీరికి ధర్మరాజు చెప్పిన శ్లోకము చొప్పున సత్యమే తల్లిగాను, జ్ఞానమే తండ్రిగాను, ధర్మమే అన్నదమ్ములుగాను, దయాదాక్షిణ్య ములే అక్కచెల్లెంద్రుగాను, వైరాగ్యత్యాగ పుణ్యకర్మలే బంధువులుగాను, పురో

హితుడే గురువుగాను, శాంతశమదమాదులే పుత్రులుగాను, శుద్ధమైన మనస్సున్ను బుద్ధియున్ను చిత్తమున్ను అహంకారమున్ను అంతరంగ కార్యనిర్వాహకులుగను, హృదయమే వివాహవేదికగాను, సహస్రారము మండపముగాను, దశవిధవాదములే వాద్యఘోషములుగాను, జీవేశ్వరుల ఐక్యమే మంగళ సూత్రధారణగాను, యోగములో ఆత్మైక్యము భోగములో కలియుటగాను, ఏకాంతమే రహస్యగృహముగాను, జ్ఞానసంప్రాప్తియే సంతానోత్పత్తిగాను, బ్రహ్మానందమే భోగముగాను గలుగును. కనుకనే, "బోధో జ్ఞానమయస్సుతః" అని యోగశాస్త్రము చెప్పినది. ఇట్టి ఆత్మబోధము గలుగుటయే పుత్రుని గనుట యని తలంపుగల తల్లిదండ్రుల జన్మములు ధన్యములు. వారి వంశము ధన్యము. వారి వంశీయులందఱు ధన్యులు. వారి వంశములో బ్రహ్మజ్ఞాన సంపన్నులైన పుత్రులప్పుడప్పుడు పుట్టుచుందురు. వారు గృహస్థులైన పుణ్యాశ్రమ నివాసులవలె నుందురు. ఇదియే ఆత్మవివాహముచే గలిగెడు దివ్య ఫలము.

ఇచ్చటనొక గొప్ప రహస్యము గలదు. మంగళసూత్రము ధరించువరకే భార్యాభర్తలు అన్యులుగా నుందురు. తర్వాత ఉభయులున్ను ఏకమై పోవుదురు. అదేరీతిగా ధ్యానములోను ఆత్మైక్యము గల్గువరకు మాత్రమే ప్రకృతి వేరుగాను, పురుషుడు వేరుగా నుండును. తర్వాత ఒకటియే యగుదురు. కనుకనే పురుషుని యర్ధాంగము భార్యదిగాను, భార్య అర్ధాంగము భర్తదిగాను ఉండునని శాస్త్రము చెప్పు రహస్యము. అనగా జీవేశ్వరుల ఐక్యజ్ఞానము గల్గువరకుమాత్రమే త్రిపుటి యుండును. మఱల దృక్ దృశ్యము లేకమగును. ధ్యాతయు, ధ్యేయమున్ను ఒకటియే యగును. జ్ఞానమున్ను, జ్ఞేయమున్ను రెండుగా నుండవు. అంతయు సుప్రకాశ స్వయంజ్ఞాన స్వరూపమై, నిత్యానంద మయమై యుండును.

**యథా నద్యః స్యందమానాః సముద్రే**
**ఉస్తం గచ్ఛంతి నామరూపే విహాయ,**

**తథా విద్వాన్నామరూపాద్విముక్తః**
**పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥**

ఏలాగున నదులన్నియు ప్రవహించి, తమయొక్క నామమున్ను, రూపమున్ను విడిచి సముద్రములో చేరిపోవునో, ఒకే సముద్రజలమై యెట్లుండునో ఆలాగున బ్రహ్మవిద్యాజ్ఞాన సంపన్నుడు తనయొక్క నామరూపములను "నేతి నేతి" వాక్యములచే విడిచినవాడై 'తత్త్వమసి' ఇత్యాది మహావాక్యముల విచారణచే, యోగనిష్ఠుడును, జ్ఞాననిష్ఠుడునునై పరాత్పరుడగు పరమపురుషుని పొందుచున్నాడు. అనగా పరబ్రహ్మాకారజ్ఞానముగలవాడగుచున్నాడు.

**యథా జలే జలం క్షిప్తం క్షీరే క్షీరం ఘృతే ఘృతమ్ ।**
**అవిశేషో భవేత్తద్వత్ జీవాత్మ పరమాత్మనోః ॥**

ఏలాగున జలములో గలిసిన జలమున్ను, క్షీరములోగలిసిన క్షీరమున్ను, ఘృతములో గలసిన ఘృతమున్ను వేరుపడక ఏకమగుచుండునో, ఆలాగున జీవాత్మ పరమాత్మానుసంధాన నిష్ఠగల మహాత్ముడున్ను పరమాత్మ స్వరూపము గల్గినవాడగుచున్నాడు.

**ఆత్మనోఽన్యజ్జగన్నాస్తి ఆత్మనోఽన్యత్సుఖం న చ ।**
**ఆత్మనోఽన్యాగతిర్నాస్తి సర్వమాత్మమయం జగత్ ॥**

ఆత్మకన్యమైన జగత్తు లేదు. ఆత్మకన్యమైన సుఖము లేదు. ఆత్మకన్యమైన గతి లేదు. ఈ జగత్తంతయును ఆత్మమయము.

**చిత్తే చలతి సంసారో నిశ్చలే మోక్ష ఉచ్యతే ।**
**తస్మాచ్చిత్తం స్థిరీకుర్యాత్ప్రజ్ఞయా పరయా పరే ॥**

చిత్తము చలించిన సంసార మేర్పడును. చిత్తమాత్మలో నిశ్చలత్వమొందిన మోక్షము గల్గును. కావున వివేకజ్ఞానము గలవాడు గొప్పజ్ఞానమును గలుగచేసుకొని పరమాత్మయందు చిత్తమును స్థిరముగా చేసుకొనవలయును.

**యస్య వాఙ్మనసీ శుద్ధే సమ్యగ్గుప్తే చ సర్వదా ।**
**స వై సర్వ మవాప్నోతి వేదాంతోపగతం ఫలమ్ ॥**

ఎవనియొక్క వాక్కున్ను, మనస్సున్ను శుద్ధములై యుండునో, యెవని యొక్క యింద్రియములు యావత్తున్ను స్వాధీనములై యుండునో, అనగా నిర్విషయత గల్గియుండునో వానికి సమస్తములున్ను మంగళకరములై యుండును. వాడు వేదాంతములో చెప్పబడిన బ్రహ్మానందఫలము ననుభ వింపగల్గును.

**మృత్తికానాం సహస్రైర్వా జలకుంభశతైరపి ।**
**న శుద్ధ్యంతి దురాత్మానో యేషాం భావో న నిర్మలః ॥**

ఆత్మశుద్ధిలేని వారు వెయ్యి ఘటములచే సహస్రావర్తిగా మంచి రేగడ మట్టిచే కడిగినను శుద్ధులు గాజాలరు. ఆలాగున వేలకొలది తీర్థములలో మునిగినను నిర్మలులు గాజాలరు. ఎవనియొక్క మనోవాక్కాయకర్మలు నిర్మలములై యుండునో వాడు నివసించుచోటులోనే యుండి నిర్మలాత్ముడై జ్ఞానమును పొందగల్గును.

**ఇత్థం వాక్యై స్తదర్థానుసంధానం శ్రవణం భవేత్ ।**
**యుక్త్యా సంభావితత్వానుసంధానం మననం తు తత్ ॥**

తత్త్వమస్యాది వాక్యములచేత, ఆ వాక్యార్థమగు జీవబ్రహ్మైక్యలక్షణము ననుసంధించుటయే శ్రవణమగును. యుక్తిచేత ఆ తత్త్వమస్యాది వాక్యముల వల్ల వినబడిన యర్థము సరియైనదని పొందబడుచుండెడి జ్ఞానమెద్ది గలదో అదియే మననమని తెలియవలెను.

**తాభ్యాం నిర్విచికిత్సేఽర్థే చేతసః స్థాపితస్య యత్ ।**
**ఏకతానత్వమేతద్ధి నిదిధ్యాసనముచ్యతే ॥**

మఱియు, పురోక్తశ్రవణమననములచేత సంశయములేని ఆత్మ స్వరూపమందు చిత్తము స్థాపింపబడుటచేతనది ధారణావంతమని చెప్ప

బడును. అట్లు స్థాపింపబడిన ఆత్మస్వరూపమును నిరంతరము ధ్యానించుట చేత ప్రవాహమువంటి యేకాకార బ్రహ్మాకారవృత్తిత్వము చిత్తమునకు గల్గును. ఇట్లు చిత్తముయొక్క యేకాకారమగు బ్రహ్మాకారవృత్తి ప్రవాహమే నిదిధ్యాస మని చెప్పబడును!

**ధ్యాతృ ధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైక గోచరమ్ ।**
**నివాత దీపవచ్చిత్తం సమాధిరభిధీయతే ॥**

అట్లు ధ్యానించుచుండగా ఏ కాలమందు చిత్తము అభ్యాసవశమున క్రమముగా ధ్యాతృధ్యానములను రెంటిని విడిచి ధ్యేయమొకటియే విషయ ముగా గలది యగుచు, ఆ ధ్యేయమువంటిదేయై యుండునో అప్పుడు సమాధి యని చెప్పబడును. వాయువులేని ప్రదేశమందు నిశ్చలముగా వర్తించు చుండెడి దీపమువలె సమాధ్యవస్థయందు చిత్తము నిశ్చలముగ నుండునని తెలియవలెను. ధ్యాత యనగా ధ్యానించెడివాడు. ధ్యానమనగా ధ్యానించుట యగును. ధ్యేయమనగా ధ్యానింపబడునది యగును. ఇక్కడ ధ్యేయమనగా ఆత్మ యగును.

**అనాదావిహసంసారే సంచితాః కర్మకోటయః ।**
**అనేన విలయం యాంతి శుద్ధో ధర్మో వివర్ధతే ॥**

మఱియు అనాదిగా నీ సంసారమందు సంపాదింపబడిన అపరిమిత పుణ్య, పాప కర్మకోట్లన్నియు ఈ సమాధిచేత నశించుచున్నవి. మఱియు నీ సమాధివలన కార్యవర్గముతో గూడిన మూలాజ్ఞానము నిశ్శేషముగ నశింపబడి బ్రహ్మసాక్షాత్కార సాధనభూతమగు జ్ఞానము వృద్ధి బొందుచున్నది.

**ధర్మమేఘమిమం ప్రాహుస్సమాధిం యోగవిత్తమాః ।**
**వర్షత్యేష యతో ధర్మామృతధారా స్సహస్రశః ॥**

బ్రహ్మజ్ఞానులగు మహాత్ములు ఈ నిర్వికల్పసమాధిని ధర్మమేఘ మునుగా వర్ణించియున్నారు. మేఘము కుంభవృష్టి చేయునట్లు ఈ

నిర్వికల్పసమాధి పుణ్యలక్షణములైన అమృతధారలను అపరిమిత ముగాను, సహస్రసంఖ్యాకముగాను వర్షించుచున్నది.

**అమునా వాసనాజాలే నిశ్శేషం ప్రవిలాపితే ।**
**సమూలోన్మూలితే పుణ్యపాపాఖ్యే కర్మసంచయే ॥**

వాసనాసమూహమే సంసారమని చెప్పబడును. అట్టి వాసనా సమూహ మంతయు, ఈ సమాధిచేత నిశ్శేషముగ నశించును. మఱియు పుణ్యపాపము లనెడు అపరిమిత కర్మరాశియంతయు అజ్ఞానసహితము సమూలముగా నీ సమాధిచేత నశింపజేయబడును. నిత్యానందమైన బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము గల్గును. శాశ్వతసుఖము లభించును. స్త్రీలకు వైధవ్యము గల్గుటకు వారికర్మ గదా! కారణమని తలంచువారు పురుషప్రయత్నమను గ్రంథమును చదువుడు.

**ఓమ్ సర్వస్తరతు దుర్గాణి సర్వో భద్రాణి పశ్యతు ।**
**సర్వః సద్బుద్ధిమాప్నోతు సర్వః సర్వత్ర నందతు ॥**
**ఓమ్ శాంతిః శాంతిః శాంతిః**



# సన్న్యాసముయొక్క సంక్షిప్త నియమములు

ఇది చాతుర్మాస్యప్రారంభమున ఆశ్రమములో సన్న్యాసము స్వీకరించిన వారలకు శ్రీస్వాములవా రుపదేశించినది :-

1. సన్న్యసించుట యనగా ప్రపంచములోగల సమస్త బంధనముల నుండి విముక్తి నొందుట. దీనిలో దేహసంబంధుల నందరినేగాక, తనయొక్క ధన ఋణములనుగూడ విముక్తి చేసుకొనవలయును. తనదేహ సంబంధులు గలరను స్మృతిగూడ హృదయములో గలుగనీయకూడదు. ఇది బాహ్యసన్న్యా

సమే యగును.

2. ఆత్మసన్న్యాసము లేనిచో బాహ్యసన్న్యాసము నిరర్థకమే యగును. ఇందు పైజెప్పిన విధముగా దేహసంబంధము లన్నియు నేలాగున విముక్తి చేయ బడెనో, ఆలాగున ఆత్మకుగల యనాత్మభావముల నన్నిటిని విడిచి కేవలం మహావాక్యోద్బోధితమగు దైవభావములో నిలువవలయును.

3. స్త్రీలను, ధనమును స్పృశించరాదని దృఢసంకల్పము గలిగి యుండవలెను. ఆపత్కాలములో నితరులయొక్క యాత్మసంరక్షణ విషయమై విధిలేక రక్షించవలసి యుండినచో ముట్టవచ్చును.

4. గృహస్థుల యింటిలో నివాసము చేయరాదు.

5. తగిన పురుషులు లేక, స్త్రీలతోగూడ నెచ్చటికిని ప్రయాణము చేయ రాదు.

6. కోపము వచ్చిన సచేలముగా స్నానమాచరించి ఆ దిన ముపవాస ముండవలయును. ఆలాగున హృదయములో నితర దుర్గుణములు గల్గినను, ఆ సమయమునుండి మఱురోజు ఆ సమయమువఱకు ఉపవాసముండి ధ్యాననిష్ఠ, దైవ విషయాది కార్యములలో కాలము గడుపవలెను.

7. సమస్తభూతములలోను, సమానదైవబుద్ధిగల్గి యుండవలెను. తనకు సంబంధము లేని యే పనిలోను ప్రవేశించరాదు.

8. తనయాత్మకు తృప్తి గలిగేలాగున ప్రయత్నించునట్లు ఇతరుల యాత్మ క్షేమము కొఱకు ప్రయత్నము చేయవలయును.

9. దొరికిన దానితో సంతుష్టి గల్గి యుండవలెను. అయితే శరీరము నకు బాధ గలుగచేసెడు పదార్థమైనచో స్వీకరింప నక్కరలేదు.

10. కాఫీహొటల్, మిఠాయిఅంగడి మొదలైన స్థలములలోనికి వెళ్ళుటగాని, అచ్చోటనుండి తెప్పించుకొనుట గాని, యెవరైన తెచ్చిన దానిని

స్వీకరించుటగాని కూడదు.

11. పగలు ఏకభుక్తము మాత్రమే చేయవలెను. మఱల దాహమున కేదైన నీళ్ళు కావలసిన దీసుకొనవచ్చునేగాని, ఇతరమైన ఏ పదార్థములున్ను పుచ్చుకొనరాదు. పగలు ఏకభుక్తముచే రాత్రిగూడ ఆహారము లేక నిర్వహింప శక్తి యుండిన మంచిది. లేక యేదైన స్వల్పాహారమును తీసుకొనవచ్చును.

12. సమయమంతయు బ్రహ్మనిష్ఠలోను, బ్రహ్మవిషయ శాస్త్రవిచార ణములోను, బ్రహ్మవిషయములను బోధించుటలోను గడుపవలయును.

13. తనయొక్క దేహకృత్యములు సాధ్యమైనంతవఱకు తానే నిర్వ హించుకొనవలయును. ఇతరుల సహాయము కోరరాదు. లేనిచో స్వాతం త్ర్యము గలుగదు. అనివార్య కార్యములకు మాత్రమే యితరుల సహాయ ముండవలెను.

14. సన్న్యాసియొక్క పరమధర్మము ఆత్మలో నిలకడ గల్గియుండు టయే. అచ్చటనే పరమశాంతి గల్గును. దీనికి భిన్నములైన కర్మలన్నియు నాత్మదృష్టిలో శ్రేష్ఠములైన ధర్మములు గావు. ఆ ప్రసన్న ప్రశాంత దైవభావము నకు భిన్నములు గాని యితర ధర్మకార్యము లాచరింపవచ్చును.

15. ఏ కార్యమైనను నిర్విఘ్నముగా జరుగునని దృఢసంకల్పము గలిగిన మాత్రమే దానిలో ప్రవేశింపవలెను. అట్లు జరుగక మఱల దానివల్ల మనస్సులో నేలాటి క్లేశమును గలిగేలాగున నుండరాదు. మనోజయము గలిగి ఆత్మశుద్ధి సిద్ధించినవారు చేయ శక్తిలేనిచో చేసిన చాలునని సంకల్పించిన చాలును. అది యెవరైన చేయగలరు. చేయనిచో అట్టి సంస్కారము, ఈ యుపాధికి లేదని సంకల్పము చేసుకొని సుఖముగ నుండవలెను. లోకములో చేయుచుండు మంచికార్యము లన్నియు మనవని తలంచిన చాలును. అప్పుడాత్మ సుఖమునకు భంగము గలుగదు.

ఓమ్ తత్, సత్.



# గురువు అవసరమా? అనవసరమా?

**యదంఘ్రికమలద్వంద్వం ద్వంద్వతాపనివారకమ్ ।**
**తారకం భవసింధోశ్చ శ్రీగురుం ప్రణమామ్యహమ్ ॥**

ఏ మహాత్ముడగు గురువరునియొక్క పాదపద్మద్వయము ద్వైత తాపనివారక మైనదో, అనగా ద్వంద్వదుఃఖశమన మైనదో, ఏ మహానుభావు డగు నాచార్యునియొక్క చరణపద్మయుగము జననమరణ ఘోరభవసాగర మును దాటుటకు మంచి నావ వంటిదో అట్టి గురువును నమస్కరించు చున్నాను.

ఈ శ్లోకమువల్ల గురుపాదాశ్రయము లేనివారికి హర్షశోకాది ద్వంద్వ శమనము గలుగదనియు, వారు భవసాగరమును దాటలేరనియు గోచర మగుచున్నది.

మఱియు ద్వంద్వతాపమునకు అవునా? కాదా? యను సందేహమని గూడ అర్థము గలదు. ఇది గురుకృప లేనిచో నివృత్తి కాదు. అంతేగాక, శివజీవైక్య సాక్షాత్కార జ్ఞానమున్ను గురుకరుణ లేనిచో గలుగదని యర్థము గలదు. కనుకనే గీతయందు "సంశయాత్మా వినశ్యతి"అని శ్రీ గీతాచార్యులగు భగవానులు గూడ సెలవిచ్చుచున్నారు. కనుక గురువు అవసరమనియే యుగాదినుండి నేటివఱకుగల మహాపురుషు లందరియొక్క ఏకాభిప్రాయమై యున్నది.

1. అయితే యిప్పుడు గల యాధునిక నవనాగరికులలో కొందరు గురు వవసరమా? లేక యనవసరమా? అని సందేహించుచున్నారు.

2. మఱికొందరు గురువు అవసరమే లేదు. మంచిది చేసిన మంచియే గల్గుననియు, చెఱుపు చేసిన చెఱుపే గల్గుననియు అందరికిన్ని దెలిసిన విషయము గదా! మఱల గురువు ఏల? యనియు చెప్పుదురు.

3. ఇక కొందరు మంచిచెడుగులు జ్ఞానాజ్ఞానములు గ్రంథములలో గలవు గదా? వానినిజూచి తెలుసుకొనిన జాలదా? యనిగూడ అడుగుదురు.

**4.** వేరు కొందరు భక్తిగల్గిన భగవదాజ్ఞానుసారము ప్రవర్తించి భగవంతుని గురువుగ భావించిన చాలును. అట్టివారిని భక్తవత్సలుడగు భగవంతుడే తరింప జేయగలడని చెప్పుదురు.

5. మఱికొందరు పుణ్యాజీవులు గురువు అవశ్య మవసరము. అట్లు గానిచో గురి తెలియదు. అనగా గురుతు గోచరము గాదనెదరు.

6. మరికొందరు ధీమంతులు, గురువుండినను ఆచరణ లేనిచో నేమి ప్రయోజనమని ప్రశ్నింతురు. ఇట్లు పలువురు పలువిధములుగా చెప్పుచుందురు.

అయితే యీ ప్రశ్నలు గల్గుటకు ముఖ్యమైన కారణములు రెండు గలవు. అవి యెవ్వియన, ఒక్కటి - పూర్వికఋషి సంప్రదాయానుసారముగా విద్యాభ్యాసము లేకపోవుటచేతను; రెండవది - యిప్పుడు గురువులలో చాల మందికి పురాతన మహర్షులకు గలిగియుండు కరుణయు, శాంతియు, భక్తియు, విరక్తియు, జ్ఞానమున్ను, విజ్ఞానమున్ను, సత్యమున్ను, ధర్మమున్ను, యోగమున్ను, తపస్సున్ను మొదలైనవి లేకపోవుటచేతను- ఈ ప్రశ్నలన్నియు పుట్టుచున్నవి. బ్రహ్మచర్య వ్రతానుష్ఠానముతో గురుకుల వాసముచేసిన విద్యార్థి యైనచో, గురువుచే గలిగెడు ఆత్మలాభానుభవము గల్గియుండును. సత్యధర్మములయొక్కయు, భగవద్భక్తియొక్కయు, జ్ఞానముయొక్కయు, మహిమాతిశయ మతడెఱింగి యుండును. అట్టి విద్యాభ్యాస సంప్రదాయము లేక పోయినది. అదేప్రకారము మహాత్ములగు బ్రహ్మనిష్ఠుల సన్నిధిలోనుండి శమదమాదుల నభ్యసించి, జ్ఞానవిజ్ఞానములును గ్రహించెడు జిజ్ఞాసువులును అరుదైరి. ఇది కాలమహిమ యనియే విజ్ఞులు తలంచుదురు. కలియుగమున ధర్మము నశించి అధర్మము వృద్ధి యైనదని చాలమందిన్ని తలంచియున్నారు. అయితే కలి యందరిని కల్మష మొనర్పలేదను తత్త్వమును వీరు బొత్తిగ మఱచిరి. పుణ్యపురుషులను, జీవదయాపరులను, భగవద్భక్తులను, సత్యవ్రతులను, ధర్మనిష్ఠులను, ఏకపత్నీవ్రతులను, పతివ్రతలగు నారీమణు

లను కలికల్మషము ఏమియు చేయజాలదని మనశాస్త్రములలో అనేకస్థల ములలో చెప్పబడియున్నది. దీపము చిన్నదైనను గొప్పదైన చీకటికి ఆ దీపమును ఆవరణము చేయు శక్తి లేదుగదా! సత్యధర్మములయొక్క యథార్థ మున్ను ఇదే రీతిగ నుండును.

మఱియు కృతయుగమున ధర్మము నాల్గుపాదములతో కూడియుం డుననియు, త్రేతాయుగమున మూడుపాదములతోను, ద్వాపరయుగమున పాదద్వయముతోను, కలియుగమున నేకపాదముతోను నుండుననియు శాస్త్రము చెప్పుచున్నది. అట్లయినను నూటికి నిరువది యైదు మందియైన ఈ కాలమున ధర్మాత్ములుగా నుండవలయును గదా? అంతమాత్రమైన గనుపించుట లేదే! దీనికి కారణము గలదు. కలియుగమున ధర్మమే నిలువదని జనులందరును వాడుకలోనికి తెచ్చిరి. ఇది ధర్మబోధకులు లేని కారణముచే గలిగిన ప్రమా దమేగాని మఱియొకటి గాదు.

మఱియు నాల్గు యుగములలోను నాల్గు యుగములు గలవు. అనగా కృతయుగములో కృతయుగము, కృతయుగములో త్రేతాయుగము, కృత యుగములో ద్వాపరయుగము, కృతయుగములో కలియుగము - ఈలాగున త్రేతాయుగమున కృతయుగము, త్రేతాయుగమున త్రేతాయుగము, త్రేతాయుగమున ద్వాపరయుగము, త్రేతాయుగమున కలియుగము, ఆలాగున ద్వాపరయుగమున కృతయుగము, ద్వాపరయుగమున త్రేతా యుగము, ద్వాపరయుగమున ద్వాపరయుగము, ద్వాపరయుగమున కలి యుగము, అదేప్రకారము కలియుగమున కృతయుగము, కలియుగమున త్రేతాయుగము, కలియుగమున ద్వాపరయుగము, కలియుగమున కలి యుగము గలవు.

ఈలాగున అన్నియుగములలోను పరివర్తనము గల్గుచుండును. యథార్థభారతి యను పుస్తకమును జూడుడు. ఈ తత్త్వమును జనులకు బోధించుటకు ధర్మబోధకులగు జనులు అనగా తత్త్వవేత్తలు, జ్ఞాననిష్ఠులు,

త్యాగులు, సన్న్యాసులు లేకపోవుటచే యీ లోకము ఇంత అంధకారావృతమై పోయినది. పూర్వకాలములో తత్త్వవేత్తలు, వైరాగ్యపురుషులు, జ్ఞాననిష్ఠులు, యతీశ్వరులు ఎక్కువగానుండుటచే జనులకు ధర్మముపదేశించి, మనుజుల హృదయమును నిత్యసౌఖ్యమునకు ఆస్పదముగా చేయు చుండిరి. ఇదే మనకు మతబోధకులచే గల్గిన మహాభాగ్యము. అట్టివారు ఇకపై నేర్పడిన మాత్రమే లోకము సుఖము ననుభవింప గలుగును.

ఇక పై ప్రశ్నలన్నిటికిన్ని సమాధానము చెప్పవలసియుండును :-

1. గురువు అవసరమా? యని శంకించువారు గురువవసరము లేదని అభిప్రాయము గలవారు కారు. వారి సందేహనివృత్తి గల్గిన చాలును. అది క్రింద వివరింపబోవు విషయమువలన నివృత్తి గాగలదు.

2. గురువవసరమే లేదు. మంచిది చేసిన మంచిదిన్ని, చెఱుపు చేసిన చెఱుపున్ను గలిగెడు విషయము అందరికిన్ని తెలిసినదియే గదా? దీనికి సమాధానము :- ఇది మంచిది, ఇది చెడ్డది అని తెలుసుకొని ప్రవర్తించువారు ప్రపంచములో నెంతమంది యున్నారు? లేక అందరున్ను ఆలాగున తెలుసుకొని వర్తించుచున్నారా! అట్లు లేనివారుండిన తెలియని వారికి తెలుపువారవశ్యముగ నుండవలయుననియే తేలుచున్నది. మఱియు, మనుజుల బుద్ధియందు భ్రమప్రమాద దోషములు గలవని సర్వశాస్త్రజ్ఞులయొక్క సిద్ధాంతము. వీనికి అవిద్యయే కారణము. కాని తనయొక్క స్వానుభవము మాత్రము చాలదు. దిగ్భ్రమముచే తూర్పు పడమరగాను, పడమర తూర్పుగాను గానుపించును. రోగముచే అరుచి గలిగిన వారికి రుచిపదార్థము అరుచిగనుండును. నేత్రవ్యాధి గలవానికి ప్రపంచ మంతయు పచ్చగ గనుపించును. ఈ దోషము నేత్రచికిత్సచే శుద్ధము గావలసియుండును. కావున వీరున్ను గురువుండవలయునని అంగీకరించవలసియుండును.

3. మంచి చెడుగులు పుస్తకములలో కలవు గదా? గనుక, అది చూచిన చాలదా? అందురు. దీనికి సమాధానము :- పుస్తకము వీరికి ధర్మము తెలుపు

టచే వారికి ఆ పుస్తకమే గురువుగ నుండవలయును. లేక పుస్తకము వ్రాసిన వారి నైన గురువుగ అంగీకరించవలసియుండును.

4. భక్తి గల్గి భగవద్ధ్యానము చేయువారికి భగవంతుడే గురువుగా నుండి తరంపజేయునని చెప్పువారు గురువు గలవారే. భగవంతునే గురువుగా భావించి యున్నారు గదా! చాలును. అయితే యీ విషయములో భగవద్దర్శన మైన వారితోగూడ భగవంతుడు సాక్షాత్కరించి గురువు కావలయునని యుప దేశించిన చరిత్రము లనేకములు గలవు. శ్రీభక్తవిజయమున మహాజ్ఞానియగు నామదేవుని చరిత్రమును జూడుడు. ఈ తత్త్వమునే శ్రీకృష్ణభగవానులు అర్జు నున కుపదేశించి యున్నారు.

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥**

ఓ యర్జునా! బ్రహ్మసాక్షాత్కారమైన ఆత్మతత్త్వజ్ఞానమును, తత్త్వవేత్త లైన జ్ఞాననిష్ఠులను విధిప్రకార మాశ్రయించి వారికి నమస్కరించి ఉపచార ములుచేసి వారి కరుణకు పాత్రుడవై ప్రార్థించి అడిగి తెలుసుకొనుము. అప్పుడు వారు మీపై కరుణగలవారలై మీయోగ్యతను పరిశీలించి దైవ జ్ఞానము నుపదేశింపగలరు. ఇక నీ విషయమై దీనికన్న పరమప్రమాణమేమి గావలయును?

5. గురువు అవశ్యముండవలెనని చెప్పువారు ఆస్తికులు. పుణ్య సంస్కా రము గలవారు.

6. గురువుండినను ఆచరణలేనిచో నేమి ప్రయోజనమని వచించు వారు- వీరి యాశయము గురువవసరము లేదని కాదు. గురువుల నాశ్రయించియు ఆచరణ లేనివారై యుండువారిని జూచి అట్లు చెప్పిరేగాని గురువవసరమే లేదను తలంపుగాదు. లేక సత్యధర్మనిష్ఠ లేని దురాచార వృత్తిలో నుండు కొందఱు గురువులను జూచి యైన చెప్పియుండవచ్చును. ఇది వారు చెప్పినది సత్యము. ఈ ఆరవ ప్రశ్న వేసిన వారి స్థితిలోనే జను

లనేకులున్నారు. ఇందువల్లనే యీ ప్రశ్నలన్నియు నేర్పడినవని ముందుగా చెప్ప లేదా?

**అనేకజన్మ సంప్రాప్త కర్మబంధ విదాహినే ।**
**జ్ఞానానలప్రభావేన తస్మై శ్రీ గురవే నమః ॥**

ఈ శ్లోకముచే, జీవునియొక్క బుద్ధిగుహయందుగల యవిద్య అనగా నజ్ఞానము 'గురు కృపచేతనే' దొలగి, శుద్ధవిజ్ఞానోదయము గావలసియుండు నని తెలియుచున్నది. ఏ గురువుయొక్క జ్ఞానమనెడు అగ్నియొక్క ప్రభావ ముచే శిష్యునియొక్క అనేకపరంపరలుగా వచ్చుచుండు కర్మమున్ను, బంధ మున్ను దహింపజేయబడునో, అట్టి జ్ఞానలక్ష్మీ సమలంకృతుడగు గురువు కొఱకు నమస్కారము.

దీనివల్ల గురువైన వారి జ్ఞానోపదేశ మనెడు అగ్నివల్లనే, శిష్యునియొక్క కర్మము నశించి బంధవిముక్తి గలుగవలయునని తెలియుచున్నది. గురు కృపచే గలిగెడి ఆత్మసౌఖ్యము, బంధవిముక్తి, పరమశాంతి, నిత్యసౌఖ్యము, దైవానుభవము మొదలగునవి గలుగని కారణముచేతనే గురువు అవసరమా? అనవసరమా? యను ప్రశ్నలు వచ్చుచున్నవి. ఒక బీదవాడు వీథిలో భిక్షమెత్తి దుఃఖభూయిష్ఠమగు జీవనమును గడుపుచున్నాడని తలంపుడు. అట్టివానిని చక్రవర్తిగా, సింహాసనారూఢునిగా గావించి, పట్టాభిషిక్తుని చేసినచో ఆ సార్వ భౌమపదవి గలుగచేసినవానిపై అతనికి ఎంత కృతజ్ఞత యుండునో, ఆలాగున సంసారమను దురితరాశిలో కించిద్జ్ఞుడై, బద్ధుడై, దుఃఖియై యుండు జీవుని మహాకృపాళువగు గురుమహారాజు సర్వదుఃఖములను శమింపజేసి సర్వజ్ఞుడు గాను, నిత్యసుఖిగాను, స్వయంశివస్వరూపుడుగానుచేసిన యావజ్జీవితము కృతజ్ఞతగలిగి యుండవలయునుగదా? అట్టి మహాత్ముడగు కృపామయుని ఎంత కొనియాడినను చాలునా?

చక్రవర్తిపదవి యుపమానముగ చెప్పినదేగాని సార్వభౌమపదవిగూడ కాలాంతరమున నశించునదే. శ్రీగురువు గలుగజేసిన దైవపదమన్ననో

నశించునది కాదు, శాశ్వతమైనది. కావున అట్టి దానిని చక్రవర్తిస్థానముతో, నెట్లుదాహరింపదగును? గురువులేని వారి జన్మము మృగప్రాయము గదా! ఆహారాది ప్రపంచ కార్యములు మృగములు గూడ నిర్వహించుచున్నవి. ఆలాగున ప్రపంచ విషయములలో మాత్రము కాలము గడిపెడు జీవిత సౌఖ్యము ఏమి విశేషము గలది యగును? దైవప్రాప్తి గలుగచేయుటకు గురువునకు తప్ప నెవరికి సాధ్యపడును? నేత్రములు లేనివాడు ఇతరులగు అంధులకెట్లు దారి జూపగలడు? ఈ పంచభూతాత్మకమైన దృష్టి పంచభూతములను మాత్రమే గోచరింపజేయును. కాని, ప్రపంచాతీతమై, అప్రాకృతమైన సత్యపథమును, ధర్మరహస్యమును, దివ్యజ్ఞానమును ఈ దృష్టి యేలాగున ప్రకాశింప జేయ గలుగును? అది జ్ఞానదృష్టిచేతనే గనుగొనవలసి యుండును. కనుకనే వేదమునకు శ్రుతి యని పేరు వచ్చినది.

శ్రుతి యనగా గురుపరంపరగా శ్రవణముద్వారా వచ్చినదని యర్థము. కనుకనే యిప్పుడుగూడ ఉపనయన సంస్కారాదులు గురుపరంపరగా జరుపుటయు, గాయత్ర్యాది మంత్రోపాసనలు మొదట వ్రాసి యివ్వక చెప్పి నేర్పుటయు జరుగుచున్నవి. కనుకనే, మంత్రోపదేశమైనదా? లేక మంత్ర శ్రవణ మైనదా? అని ఒకరినొకరు అడుగుదురు. మఱియు గురుముఖతః అధ్యయనము చేయనిచో హ్రస్వ, దీర్ఘ, ప్లుత, ఉదాత్త, అనుదాత్త, స్వరితములు మొదలగు స్వరములనెట్లు ఉచ్చరింపగలుగును? అక్షరములుగాని, స్వరములుగాని శబ్దము నుచ్చరించుటకు ఒక గురుతుగా నేర్పరచినవేగాని దానివల్ల శబ్దము తెలియదు. కనుకనే అన్నిభాషలలోను, అక్షరములు వేరువేరుగా నేర్పరచిరి.

దృష్టాంతముగా "అ" అని ఒక అక్షరము గురుతు గలదు. ఆ చిహ్నము "అ" అని పలుకుటకు నేర్పడిన ఒక గురుతు మాత్రమే యగును. మీకు స్వరముతో గూడిన ఒక వేదపుస్తకముగాని, లేక సంగీతగ్రంథముగాని లభించినట్లు గ్రహించుడు. దానిలో గల ఒకస్వరమునుచ్చరించుటకుగాని, ఒకపాట స్వర తాళయుక్తముగ పాడుటకుగాని, సాధ్యపడునా? ఆ స్వరతాళములు తెలిసిన

వారు తప్పక మీకు నేర్పవలసి యుండును. దీనివల్లనే, గురువవశ్యముగా నుండవలయునని యేర్పడుచున్నది. లేక మీకు మంచివీణగాని, ఫిడేలుగాని దొరకినట్లు అనుకొనుడు. దానివల్ల సంగీతజ్ఞానము లేనిచో మీరెట్లు పాడ గలరు? బ్రహ్మవిద్యయున్ను ఇటువంటిదే యని గ్రహించవలెను. కావుననే అనాదినుండి యీ బ్రహ్మవిద్యగూడ గురుపరంపరగా ఉపదేశింపబడు చున్నది.

**హేతవే జగతామేవ సంసారార్ణవసేతవే ।**
**ప్రభవే సర్వవిద్యానాం శంభవే గురవే నమః ॥**

ఈ కనుపించెడు జగత్తునకు కారణభూతుడున్ను, సంసారమనెడు దుఃఖసాగరమును దాటుటకు వంతెనవంటివాడును, సమస్తవిద్యలకు ప్రభు వైనవాడును, నిత్యసుఖము గలుగచేయువాడునగు గురువుకొఱకు నమస్కా రము. మంచి వంతె యుండిన సముద్రమును దాటుట యెంత సులభమో, ఆలాగున గురుకృప గలవారికి జననమరణ భవసాగరమును దాటుట సుఖముగ నుండును. గురువులేనివారికి దాట తరము గాదని యర్థము.

మఱియు, తర్క, వ్యాకరణ, వైద్య, శిల్ప, ఖగోళ, విద్యుత్, యంత్ర, వైజ్ఞానిక ధనుర్విద్యాది శాస్త్రము లన్నియు ఒక్కడు స్వయముగ కనిపెట్టి జ్ఞానము గలుగచేసుకొనుటకు నిప్పుడు సాధ్యమగునా? ఒకవేళ పరిశ్రమ చేసి కనుగొన దలంచినను అది యెంత శ్రమయో గదా? ఒకవేళ అట్లయినను పూర్తిగ నీ జన్మలో గల్గునని చెప్పగలరా? పై జెప్పిన జ్ఞానము గలవారి నాశ్ర యించిన నెంతో త్వరలో తనయొక్క యుద్యమము పూర్తిచేసుకొని కృతార్థత నొందవచ్చును గదా! ఇట్టి సులభమార్గముండగా నేల శ్రమపడవలయును? మఱియు వ్యాకరణాది అనేకశాస్త్రములు, పాణిన్యాది అనేకఋషులకు భగవత్కృపచేతనే లభించినవని తెలియవచ్చుచున్నది. కనుకనే వ్యాకరణ సూత్రములకు శివసూత్రములని పేరు వచ్చినది. ఇవి శ్రీశివచిదంబరమున పరమశివుని కృపచే పాణినిమహర్షికి లభించినవి. యోగశాస్త్రమున్ను

ఇటువంటిది. జ్యోతిషశాస్త్రమున్ను ఇదే రీతిగానే యేర్పడినది.

ఆ శాస్త్రములకు సంబంధించిన ఆ విషయము అట్టి గ్రంథములలోనే వ్రాయబడియున్నది. వేదముగూడ అపౌరుషేయమనియు, దైవదత్తమనియు, ఆస్తికులకందరికిన్ని తెలిసిన విషయమే. అవన్నియు నిచట వ్రాయబూనిన గ్రంథము పెరిగిపోవునని తలంచి విడిచిపెట్టడమైనది. అయితే బ్రహ్మవిద్య యీలాటిది కాదు సుమీ! అది అవిద్యచే ఆవరింపబడి యుండుటచే, దాని తత్త్వము అవశ్యముగా గురుముఖమునుండియే తెలుసుకొనవలసియుం డును. నిజము తెలియ శక్తిగలుగనీయక తాను తెలుసుకొనినదే నిజముగా నుండునట్లు తోచే లాగునజేయు ఒక అనిర్వచనీయమైన మాయాశక్తి దాని యందు గలదు. కనుకనే అనేకధీమంతులుగూడ ఆ విషయములో ప్రమా దము నొందుచున్నారు. కావున ఆత్మజ్ఞులగు మహనీయులైన గురువులవల్లనే నిజము తెలుసుకొనవలసియుండును.

మఱియు పై జెప్పిన వ్యాకరణాది శాస్త్రములను తెలుసుకొనుటకు నిర్విషయము, ఆత్మనిర్మలత్వము, ఇంద్రియనిగ్రహము, చిత్తనిరోధము గలుగవలసిన పనిలేదు. ఈ బ్రహ్మవిద్యయో అటువంటిది కాదు సుమీ! సంపూర్ణ విషయవిరక్తియు, ఆత్మనిర్మలత్వమున్ను, చిత్తైకాగ్రతయు, ప్రశాం తియు, ప్రసన్నత, కరుణ, ఆత్మసంయమశక్తి, దైవభక్తియున్ను గలుగవలసి యుండును. అదే దీనియందుగల యితరములగు విద్యలన్నిటికన్న అధిక మగు ప్రయత్నము. మఱియు వైద్యాది విజ్ఞానశాస్త్రములన్నియు బుద్ధియొక్క యోగ్యతచేత తెలుసుకొనవచ్చును. అట్టి పరమయోగ్యతను సంపాదించిన బుద్ధియో యీ బ్రహ్మవిద్యయందు ప్రవర్తింపజాలదు. అచ్చటికి వెళ్ళునప్పుడు ఈ మహాప్రభావముగల బుద్ధి వట్టి జడమై పోవును. బృహస్పతి వలె వచించెడు వాక్కు అక్కడ మూకత్వము నొందును. ఊహాపోహలను గలుగజేసెడు అతి సూక్ష్మమైన మనస్సుగూడ అచట చైతన్యరహితమై నిర్జీవత్వము నొందును. అదే దీనిలోని మహిమాతిశయమని తెలుసుకొనుడు.

కనుకనే శ్రుతి యీలాగున చెప్పుచున్నది- "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన" (కఠవల్లి). కనుక ఈ ఆత్మ విశేషము లగు శాస్త్రములను చదువుటవల్ల లభించునది కాదు. భౌతికజ్ఞానమందు మహామేధాసంపత్తిగల బుద్ధిమంతునికిన్ని లభించునది గాదు. మహాత్ములగు గురువులవల్ల పలుసార్లు పెక్కుతెఱంగుల శ్రవణము చేసినను లభించునది గాదు. గురుకృప గల్గి నిరంతర బ్రహ్మనిష్ఠ చేయువానికే లభించును. స్మృతి యున్ను ఈలాగుననే చెప్పుచున్నది. "నాహం వేదైర్న తపసా, న దానేన న చేజ్యయా" (గీత 11-53)-భగవత్సాక్షాత్కారము సమస్త వేదములు చదివినను, తపస్సు చేసినను, దానము చేసినను, యజ్ఞము చేసినను లభించునది గాదు. భగవత్కృపకు పాత్రుడైన వానికే అది లభించును. ఇక నీ విషయమై శ్రుతి స్మృతులందు వేలకొలది ప్రమాణములు గలవు. విస్తారమగునని తలంచి మానుకొనడమైనది. పై జెప్పిన ఆత్మకున్ను, బుద్ధికిన్ని మధ్య మూలప్రకృతి యనునొక మహాశక్తి భ్రమను గలుగజేయుచుండును. అట్టి మోసము తెలుసు కొనుటకు గురుకృప తప్ప గత్యంతరము లేదు. ఆ మాయాభ్రమ అయిదు విధములుగా నుండి ఆత్మను మోసము చేయుచుండును. అది యీ క్రింద వివరింపబడుచున్నది.

## పంచభ్రమ నిరూపణము.

**నిదాఘో నామయోగీంద్రో ఋభుం బ్రహ్మవిదాం వరమ్ ।**
**ప్రణమ్య దండవద్భూమావుత్థాయ స పునర్మునిః ॥ 1**
**ఆత్మతత్త్వమనుబ్రూహీత్యేవం పప్రచ్ఛ సాదరమ్ ।**
**కయోపాసనయా బ్రహ్మన్నీదృశం ప్రాప్తవానసి ॥ 2**
**తాం మే బ్రూహి మహావిద్యాం మోక్ష సామ్రాజ్యదాయినీమ్ ।**
**నిదాఘ త్వం కృతార్థోఽసి శృణు విద్యాం సనాతనీమ్ ॥ 3**
**యస్య విజ్ఞానమాత్రేణ జీవన్ముక్తో భవిష్యసి ।**
**భ్రమః పంచవిధో భాతి తదేవేహ సముచ్యతే ॥ 4**

జీవేశ్వరౌ భిన్నరూపావితి ప్రాథమికో భ్రమః ।
ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వా ద్వితీయకః ॥ 5

శరీరత్రయ సంయుక్త జీవస్సంగీ తృతీయకః ।
జగత్కారణ రూపస్య వికారిత్వం చతుర్థకః ॥ 6

కారణాద్భిన్నజగతః సత్యత్వం పంచమో భ్రమః ।
పంచభ్రమ నివృత్తిశ్చ తథా స్ఫురతి చేతసి ॥ 7

బింబ ప్రతిబింబ దర్శనేన భేదభ్రమో నివృత్తః ।
స్ఫటికలోహితదర్శనేన పారమార్థిక కర్తృత్వభ్రమో నివృత్తః ॥ 8

ఘటమఠాకాశదర్శనేన సంగీతిభ్రమో నివృత్తః ।
కనకరుచక దర్శనేన వికారిత్వభ్రమో నివృత్తః ॥ 9

రజ్జుసర్పదర్శనేన కారణాద్భిన్న జగతః సత్యత్వభ్రమో నివృత్తః ।
తదా ప్రభృతి మచ్చిత్తం బ్రహ్మాకారమభూత్స్వయమ్ ।
నిదాఘ త్వమపీత్థం హి తత్త్వజ్ఞాన మవాప్నుహి ॥ 10

నిదాఘుడను పేరుగల యోగీంద్రుడు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుండగు ఋభువను పేరుగల మునీశ్వరునికి నమస్కరించి, ముకుళితహస్తుడై యీ లాగున ప్రశ్నించెను. "ఓ బ్రహ్మీభూతుడవగు మహాత్మా! తాము ఏ ఉపాసన చేత, నిట్టి బ్రహ్మప్రాప్తిని బొందితిరి? అట్టి ఆత్మతత్త్వమును నాకుపదేశించి, నన్ను కృతార్థునిగ చేయవలయు"నని సవినయముగ నడిగెను. అట్టి పరవిద్య యును, మోక్షసామ్రాజ్య ప్రదాయినియునగు బ్రహ్మవిద్యను అనుగ్రహించవల యునని, మఱల మఱల వేడుకొన్న మాటలను విని ఋభుమహర్షి నిదా ఘునితో నిట్లు చెప్పెను. "నీవు కృతార్థుడవైతివి. సనాతనమగు బ్రహ్మవిద్య నుపదేశించెదను. సావధానముగ వినుము. ఏ యొక్క ఆత్మజ్ఞానము తెలుసు కొన్న మాత్రముచే నీవు జీవన్ముక్తిని బడయగలవో, అట్టి బ్రహ్మవిద్య నుపదే శించుచున్నాను. ఈ అజ్ఞానమను భ్రమనుండి విముక్తి నొందిన మాత్రమే

జీవులు తరింపగల్గుదురు. అట్టి భ్రమ అయిదు విధములుగ నున్నది.

1. జీవేశ్వరులు భిన్నరూపులను భ్రాంతి మొదటి భ్రమ యగును.

2. ఆత్మయందు కర్తృత్వగుణము వాస్తవముగ గలదను తలంపు రెండవ భ్రమ యగును.

3. శరీరత్రయముతో గూడినవాడే జీవుడను బుద్ధి మూడవ భ్రమ యనంబడును.

4. జగత్కారణమగు బ్రహ్మము నకు వికారిత్వము గలదనునది నాల్గవ భ్రమ యగును.

5. అట్టికారణమగు బ్రహ్మమునకన్న జగత్తుభిన్నమను బుద్ధి అయిదవ భ్రమ యనంబడును. ఈ అయిదు భ్రమలను సద్గురూపదేశముచే నివృత్తి చేసిన సత్తాస్వరూపమగు ఆత్మజ్ఞానమునప్పుడు స్వయముగ ముముక్షువు తెలుసు కొనగల్గును. ఈ పంచభ్రమలకు నివృత్తి -

1. సూర్యబింబమునకున్ను, ప్రతిబింబమునకున్ను భేదము లేదని తెలుసుకొన్న మొదటి భ్రమ నివృత్తి యగును. ఇది జీవేశ్వరుల భిన్నభ్రమను నివృత్తి చేయును, 2. స్ఫటికమణికిన్ని, దానికి సంబంధపడిన ఎఱ్ఱని పుష్ప ముచే గలిగెడు స్ఫటికమందుగల రక్తవర్ణమునకున్నుగల తత్త్వము గ్రహించిన ఆత్మయందుగల కర్తృత్వభ్రమ నివృత్తి యగును, 3. ఘటమఠాకాశము యొక్క నిజము తెలుసుకొన్న ఆత్మ అసంగస్వరూపమను బోధగల్గి సంగభ్రమ నివృత్తి యగును, 4. కనకకుండల కిరీటకంకణాదులయొక్క తత్త్వము తెలుసుకొనిన బ్రహ్మమునకు వికారిత్వము గలదను భ్రమ నివృత్తి యగును. 5. రజ్జుసర్ప దర్శనముచే కారణమునకు భిన్నముగా కార్యము లేదను బోధము గల్గిన జగత్సత్యత్వబుద్ధి నివృత్తి యగును.

ఓ నిదాఘుడా! గుర్వనుగ్రహముచే నేను ఈ భ్రమనివృత్తి గలవాడనై బ్రహ్మాకారస్వరూపుడనై, నిత్యముక్తుడనై యున్నాను. నీవున్ను ఈలాగున

పంచభ్రమలను నివృత్తిచేసుకొని మహావాక్యాను సంధానము చేసి బ్రహ్మాకార స్వరూపుడవై సుఖివిగా నుండుము".

పాఠకులారా! విద్యలేని దేశము గాని, జాతిగాని పశువులతో సమానము గదా! ఏ జాతి విద్యచేతను, సంస్కరణముచేతను నున్నతి నొంది యుండునో యట్టి జాతి విద్యయు, సంస్కరణమును లేని దేశమును, జాతిని ఆక్రమించి వారిని పశువులవలె పాలించునది చూచుట లేదా? విద్య లేనిచో బాహ్యసంస్కరణముగాని, ఆత్మసంస్కరణముగాని గలుగదు. సంస్కరణములేనిచో జ్ఞానము పుట్టదు. జ్ఞానమెప్పుడు లేకపోయెనో విజ్ఞానమెప్పుడావిర్భవింపదో అట్టి జీవితము మృగజీవితము గదా! కావున విద్య గురువులేనిచోనెట్లు సిద్ధించును? గురువు దగ్గఱ విద్యనభ్యసింపని వారలు ఎంతమంది పండితులున్నారు! ఒక్కడును కనపడడు. కావున, ఇహమునకున్ను, పరమున కున్ను గురువు లేనిచో ఇహపరసౌఖ్యములను మనుజులు పొందజాలరు. విద్యలేని సంఘమును జూచిన యెవరి హృదయము నీరుగా కరుగదు? అయ్యో! అట్టివారి జీవితమెంత దుఃఖముతో గూడినది! ఎంత దుర్భరమైనది? గురువుండిన నీలాటి దుఃఖజీవితము గలుగదు గదా!

**నమోఽచ్యుతాయ గురవేఽజ్ఞానధ్వాన్తైకభానవే ।**
**శిష్యసన్మార్గపటవే కృపాపీయూష సింధవే ॥**

అజ్ఞానమనెడు అంధకారమునకు ప్రచండభాస్కరునివంటివాడును, శిష్యులను సన్మార్గములో నడుపుటకు మంచి నిపుణుడును, కృపయనెడు అమృతమునకు సముద్రము వంటివాడును, నాశములేని వాడునగు గురువు కొఱకు నమస్కారము. ఈ శ్లోకముచే గురుకరుణ లేనిదే అజ్ఞానమనెడు తమస్సు నశింపదని తెలియుచున్నది. మఱియు, "గురు" అను శబ్దము యొక్క అర్థమును క్రింద శ్లోకము వివరించుచున్నది.

**గుశబ్దస్త్వంధకారస్స్యాత్ రుశబ్దస్తన్నిరోధకః ।**
**అంధకారనిరోధిత్వాద్గురురిత్యభిధీయతే ॥**

"గు" అను నక్షరమున కంధకారమని యర్థము. "రు"అను అక్షరము అట్టి గాఢతమమగు చీకటిని విలయమొందించెడు ప్రకాశమై యున్నది. కావున నెవని కరుణచే శిష్యునియొక్క యజ్ఞానమనెడు కారుచీకటి రహితమై విజ్ఞానోదయము గల్గునో వాడు గురువనబడును.

ఓహో! యిట్టి మహిమ గల గురుడా అవసరము లేదని చెప్పుట? తల్లి దండ్రి దైవములకన్న గురువధికుడు. ఏలన? అజ్ఞానముచే కల్గు జనన మరణములకు హేతువైన యీజన్మదుఃఖమును పై జెప్పినవారు రహిత మొనర్పజాలరు. అట్టి భవరోగమును నశింపజేసి జననమరణ రహితమగు మోక్షమును, నిత్యసుఖమును అనుగ్రహించువాడు గురువరేణ్యుడు. దీనివల్ల మాతాపితరులలో భక్తి యుండకూడదని యర్థము కాదు. వారిని దైవతములుగా భావించి పూజించిన మాత్రమే సద్గురుకృప గల్గుట కవకాశము సిద్ధించును. మాతాపితృదైవములలో భక్తివిశ్వాసములు లేనివారికిన్ని, సత్యధర్మనిష్ఠలు గోల్పోయిన వారికిన్ని ఉత్తముడగు సద్గురువు లభింపడు. పై జెప్పిన సుగుణములచే పుణ్యాభివృద్ధి గల్గిన నిర్మలజీవులకు మాత్రమే పరతత్త్వమును బోధించు నాచార్యుడు లభించును. మఱియు దైవముండినను అట్టి దైవమును తెలియజేయువాడును, దైవమార్గము నుపదేశించువాడును, దైవపదవిని గలుగ జేయువాడును గురుడుగదా! కావున మాతాపితృదైవములకన్న గురుడధికతరుడు. కావుననే గురుశబ్దమునకు అన్నిటికన్న అధికమైనదనియే అర్థము.

దైవపదవి గదా మోక్షము! అప్పుడు గురువుకన్న దైవమధికమని చెప్ప రాదా? అట్లు చెప్పరాదు. ఏలన, భూమి క్రిందిభాగమున అమృతకలశముండునని తలంపుడు. అది అచ్చటనుండియు మనకు దొరకనిచో నేలాగున మృత్యురహితమగును? అట్టి అమృతమును మనకు తీసియిచ్చినవాడు గదా గొప్ప వాడు. అదే ప్రకారము దైవములో మనల నైక్యపరచినవాడు గురువే గనుక ఆచార్యుడే గొప్పవాడు. లేక దివ్యౌషధసేవచే మహారోగము రహితమైనట్లు తలంపుడు. అట్టి ఔషధమును మనకనుగ్రహించిన వైద్యుడు లేనిచో నేమి

లాభము? కనుక రోగరహితుడైనవాడు వైద్యుని స్తుతించునా? లేక మందును పొగడునా? మఱియు ఒక్కరి యింటిలోపల అడుగుభాగమున గొప్ప ధన ముండెను. మట్టి క్రింద నా నిక్షేపముండినను అతనికేమి సౌఖ్యముగల్గును? పాపమతడు దారిద్ర్యబాధచే దుఃఖజీవితము గడుపుచుండగా ఒక నిధిపరీక్ష కుడు ఆ ధనమును వీనిపై కరుణ గల్గి తీసియిచ్చెను. అప్పుడు పాపము ఆ బీదగృహస్థుడు ధనమును స్తోత్రము చేయునా? లేక తీసియిచ్చిన వానిని స్తుతించునా?

ఆలాగున హృదయగుహయందు జ్ఞానధన ముండినను, జ్ఞానకలశము గలిగియుండినను గురుకృప లేనిచో, మనమెట్లు దానిని బొందగల్గుదుము? కనుక గురుకృపయు నిటువంటిదని గ్రహించవలయును. లేక కల్పవృక్షము, కామధేనువు, చింతామణి యుండునని తలంపుడు. అవి మనకు దొరకనిచో, వానివల్ల ఏమి లాభము? దొరకేలాగున చేసిన వారుగదా మనకుపకారులు. ఆలాగున కల్పవృక్ష కామధేను చింతామణులవంటి భగవంతుడుండినను, ఆ భగవానునిలో చేర్చినవారు గదా గురువులు! కావుననే భగవంతునికన్న భాగవతు లధికులని మహాత్ములు చెప్పెడు రహస్యము. కనుకనే "తదీయా రాధ నం పరం"అని శాస్త్రము చెప్పు రహస్యము. మఱియు భగవంతుడు కంటికి కనుపించువాడు గాడు. గురువో ఆ భగవత్స్వరూపము సాకారముతో ఆవిర్భవించిన వాడనియే పరమభక్తులు తలంతురు. మఱియు, కల్పవృక్ష, కామధేను, చింతామణులవంటి కాలాంతరమున నశించెడు వస్తువు వంటిది కాదు గురువను గ్రహించెడు ఆత్మపదవి. అది నాశములేనిమోక్షమని గ్రహించ వలెను.

మఱియు అద్వైతశాస్త్రమగు వేదాంతము రీతిగా తనలోగల ఆత్మవస్తు వునే దైవముగా గురుకర్ుణ గలవాడు తెలియగల్గును. కావున మఱియొక స్థలములో నీ ఆత్మను తీసుకొనిపోయి దైవముతో ఐక్యము చేయవలసిన పని గూడ అద్వైతబ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గల్గిన గురువు లభించినవారికి లేదు. మహాపురుషులగు గురువులు శిష్యుల ఆత్మలోనే పరమాత్మను చూపుదురు.

ఓహో! అట్టి గురువులగు మహానుభావులను వర్ణించి వర్ణించి గదా సహస్రముఖములుగల ఆదిశేషుని నాలుక రెండుగా చీలిపోయినది?

ప్రపంచములో భక్తుల హృదయము పరిపక్వావస్థ పొందునప్పుడు అట్టివారిని తరింపజేయుటకు నిరాకారుడగు ఆ సర్వేశ్వరుండే భక్తులపై గల పరమకరుణతో సాకారుడై గురురూపముగ వచ్చి, ఉపదేశించి జీవన్ముక్తులను చేయుచుండును. భ్రమర మేలాగున పురుగును తెచ్చి ప్రణవోపదేశమగు ధ్వనిచే భ్రమరరూపముగ జేయుచుండునో, గురువున్ను అట్లే ఆత్మోపదేశ ముచే మాయావిషయములో మోహితుడై అజ్ఞానపాశములలో చిక్కుకొని జీవ భ్రాంతిగల్గియుండు ఆత్మను బ్రహ్మోపదేశమొనర్చి మాయామోహ అజ్ఞాన బంధనములనుండి నివృత్తిచేసి, తనయొక్క స్వరూపముగ చేయుచుండును. కల్పవృక్ష, చింతామణి, కామధేనువులతో గురువును సమానముగ చెప్పరాదు. ఏలన? ఇవి బాహ్యసౌఖ్యములను గలుగజేయునవియేగాని, భక్తివైరాగ్య జ్ఞానములను గలుగజేయవుగదా! ఆత్మసుఖము నుపదేశింపవుగదా! ఈశ్వర సాక్షాత్కారజ్ఞానమును సమకూర్చవుగదా! నిర్వికల్పుడైన, నిష్కాముడైన నిశ్చింతుడైన యోగికి పైజెప్పిన కల్పవృక్షాదులు బహుతుచ్ఛములుగాను తృణ ప్రాయములుగాను నుండును. కనుకనే శ్రీపరమశివుండు శ్రీ పార్వతీదేవి కీలాగున నుపదేశించెను.

**న గురోరధికం న గురోరధికం న గురోరధికం న గురోరధికమ్ ।**
**శివశాసనతశ్శివశాసనతశ్శివశాసనతశ్శివశాసనతః ॥**

గురువుకన్న అధికమైనది మఱియొక్కటి లేదు. గురునికన్న అధికు డొకడు లేడు. గురువుకంటే శ్రేష్ఠుడింకొక డుండడు. గురుపదమునకన్న అధిక మైన పదవి యింకొకటి లేదు. ఇది యీశ్వరశాసనము. ఇది యీశ్వరశాస నము, ఇది యీశ్వర శాసనము, ఇది యీశ్వరశాసనము అని నాలుగుసార్లు సాక్షాచ్ఛంకరుండు చెప్పియున్నాడు. మఱియు శ్రీదత్తాత్రేయులు ఈలాగున స్తుతించి యున్నారు.

**కృతార్థోఽహం కృతార్థోఽహం కృతార్థోఽహం మహామతే ।**
**అద్య తే పాదపద్మస్య దర్శనాద్భక్తవత్సల! ॥**

ఓ బ్రహ్మాకారజ్ఞానమే రూపముగా గల గురువరేణ్యా! నేను కృతార్థుడనైతిని. ఓ భక్తవత్సలా! మీ యొక్క పాదారవిందదర్శనముచేత ఇప్పుడే నేను కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని.

**ధన్యోఽహం ధన్యోఽహం తృప్తేర్మే కోపమా భవేల్లోకే ।**
**ధన్యోఽహం ధన్యోఽహం ధన్యో ధన్యః పునః పునర్ధన్యః ॥**

మఱియు నాయొక్క తృప్తికి సమానమైన వస్తువెద్దియు లోకమందు లేదు. అందువలన నేను ధన్యుడనైతిని, నేను ధన్యుడనైతిని. ఈ జ్ఞానతృప్తి కంటె మఱియొకటి చెప్పందగినది కనపడని కారణముచేత నేను కృతార్థుడనైతిని, నేను కృతార్థుడనైతిని. మాటిమాటికి కృతార్థుడనైతిని. నేను కృతార్థుడనైతిని.

**అహెూ పుణ్యమహెూ పుణ్యం ఫలితం ఫలితం దృఢమ్ ।**
**అస్య పుణ్యస్య సంపత్తేరహెూ వయమహెూ వయమ్ ॥**

అహెూ! (ఆహా) పుణ్యము దృఢముగ ఫలించెను. అహెూ! నాయొక్క పుణ్యము దృఢముగ ఫలించెను. ఈ పుణ్యసంపత్తువలన ఓహెూ మేమే ధన్యులము. ఓహెూ మేమే ధన్యులము.

**అహెూ శాస్త్రమహెూశాస్త్రమహెూగురురహెూ గురుః ।**
**అహెూ జ్ఞానమహెూజ్ఞానమహెూసుఖమహెూ సుఖమ్ ॥**

వేదాంతశాస్త్రము, ఓహెూ! యెంత మనోహరము. వేదాంతశాస్త్రము ఓహెూ! ఎంత యపారమైనది! ఓహెూ వేదాంతము నుపదేశించిన మా గురువెంత గొప్పవాడు! ఓహెూ! మా గురువెంతవాడు, ఓహెూ! ఆత్మజ్ఞానమెంత మంచిది? ఓహెూ! అద్వైతాత్మ తత్త్వజ్ఞానమెంత సారమైనది. ఓహెూ! మా ఆత్మసుఖమెంత గొప్పది. ఓహెూ! మా సుఖమెటువంటిది. ఓహెూ! ఆశ్చ

ర్యము. పరమాశ్చర్యము.

ఈ దత్తాత్రేయోపనిషద్రీతిగా జీవించి యుండగనే బ్రహ్మానందాంబుధిలో మునిగి తాండవము చేయువారే యథార్థమగు గురుతత్త్వ మెఱింగిన వారు, ఆత్మసుఖము ననుభవించిన వారలగుదురు. ఇదే గురుకృప గల్గిన దానికి గురుతుగ, ఆత్మసుఖమును పొందిన దానికి చిహ్నముగ నుండును.

**పతిహీనా యథానారీ మాతృహీనో యథా శిశుః ।**
**గురుహీన స్తథా ప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్ ॥**

భర్తలేని స్త్రీయు, తల్లిలేని శిశువు ఏలాగున స్వాత్మసుఖమును పొందలేరో, ఆలాగున గురువులేని మనుజుడున్ను ఇహసుఖమునుగాని, పరమసుఖమునుగాని, పరాత్పరసుఖమునుగాని, పరమాత్మసుఖమునుగాని పొందలేడు. అంతేగాక అట్టి వాని జన్మముగూడ నిరర్థక మగుటయేగాక అనర్థకారణముగ గూడ నగును.

ఈ విషయమై ఒక చిన్నకథ బాల్యకాలములో చదివియుంటిని. అదే మన, జర్మనీదేశములో ఒక్క గొప్ప తత్త్వజ్ఞాని యుండెను. ఆయన తత్త్వవేత్తల సహాయము లేకనే మనుజులకు స్వయముగ జ్ఞానము కలుగునా? లేక తత్త్వవేత్తలసహాయ మవశ్య ముండవలసి యుండునా? అని తెలుసుకొనుటకొఱకు నలుగురు పిల్లవారిని చిన్నతనములోనే ఒక అరణ్యప్రదేశమున నిర్మింపబడి యుండు గృహమున నుంచి బైటప్రదేశమునకు పోవుట కవకాశము లేని స్థితిలోనుంచెను. ఒక మనుజుడు మౌనముగా వెళ్ళి ఆ పిల్లవాండ్రకు కావలసిన అన్న పానాదులు మాత్రమిచ్చుచుండెను. మఱి యెవరున్ను అచ్చటికి వెళ్ళుట కవకాశము లేనిస్థితిలో నుండెను. ఈలాగున ఇరువది సంవత్సరములు జరిగిన పిమ్మట వారిని గ్రామములోనికి తీసుకొనివచ్చిరి. అప్పుడు పరిశోధన సలుపగా వారికి ఏ భావమున్ను తెలిసియుండలేదు. మాట శుద్ధముగ ఉచ్చరించుటకు రాలేదు. మృగమువలె అఱచుచుండిరి. ఏ విషయమైన జ్ఞానమున్ను గల్గి యుండలేదు. కేవల మడవిమృగమువలె నుండిరి.

దీనివల్ల గురువు అవసరమా? అనవసరమా? అని జనులు తెలుసుకొన గలరు. మఱియు అడవి జనులున్ను, కోయజాతులున్ను, అమెరికాలో నుండు నీగ్రోజాతులున్ను దీనికి తార్కాణములు. ఆధునిక నవనాగరికులు ఇంగ్లీషు పాఠశాలలో చదువుటచే తను, కొన్ని నవలలను పఠించుటచేతను, దేహశుచిత్వము, గృహనిర్మలత్వము నాగరికచిహ్నమని తలంచి పొరబాటు చెందుట చేతను సాధుపురుషుల మహిమ నెరుంగజాలకయున్నారు. శివాజీ మొదలగు మహారాజులు శ్రీసమర్థ రామదాసస్వామి సాధువుకొఱకెంత వెదకిరో, ఆ చరిత్రము చదివినవారికి తెలియును.

ఆలాగున మన హిందూరాజులలో ఎక్కువమంది సాధువుల నెంత ప్రయత్నపడి లభింపజేసుకొనిరో చరిత్రకారులు తెలియగలరు. జనకుడు మొదలగు మహాత్ములు సాధుసేవకొరకెంత తిరిగిరో, చదివినవారికెఱుక. వారికన్న నాగరికులా ఇప్పుడు మూడు మాటలు ఇంగ్లీషులో మాట్లాడ నేర్చుకొన్నవారు? ఇది యెట్లుండినను, మన పూర్వికులు ఈ బాహ్యానాగరికత మాత్రముండియు, ఆత్మసంస్కరణము లేనిచో అట్టివారిని సుందరమైన ఒక మృగమో, సౌందర్యము గల ఒక పక్షియో అనియే తలంచి యుండిరి.

నిజముగా హృదయముయొక్క పవిత్రమైన పరివర్తనమే నాగరికతా చిహ్నమగును. హృదయములో కరుణ, విరక్తి, సత్యము, శాంతము, ధర్మము, దైవబుద్ధిలేని నాగరికత నిజముగ అనాగరికతయే యగును. కొన్ని పుష్పములు ఎంతో సౌందర్యముగా నున్నవి. త్రాచుపాముయొక్క పడగ ఎంత శోభాయమానమైయున్నది! కొన్ని పుష్పములయొక్క సౌరభమున్ను, చిత్ర విచిత్రములైన వర్ణములున్ను ఎంత మనోహరముగనున్నవి! ఇవి యన్నియు మనుష్యులకన్న బాహ్యాపరిష్కారము ఎక్కువ గల్గియున్నవి గదా? దీనివల్ల బాహ్యా శుచిత్వము, గృహశుభ్రత అవసరము లేదని యర్థము గాదు. అయితే యిదే నిజమైన నాగరికలక్షణమని తలంచి, వ్యామోహములో పడిపోయి చెడిపోరాదని మాత్రము తెలుపుటకొఱకు వ్రాయడమైనది.

పాత్రయొక్క వెలుపలమాత్రము శుద్ధపరచి, లోపల కడుగనిచో దానిలోగల వంటకమెట్లుండునో తెలుసుకొనవచ్చును. ఇంగ్లీషులో తత్త్వవేత్తలు వ్రాసిన గ్రంథములను, శ్రీ యేసుక్రీస్తు మొదలైనవారి చరిత్రములున్ను చదివినట్లయిన ఇట్టి అంధవిశ్వాసమునకు హృదయములో తావుండదు. మన పూర్వికఋషులు, సన్న్యాసులు, యోగీశ్వరులు, శ్రీ యేసుక్రీస్తు, బుద్ధదేవుడు, మహమ్మదునబి మొదలైనవారికి నెంతవఱకు బాహ్యాడంబరములుండెనో, చరిత్రకారులు నిర్ణయింపగలరు. అట్టివారి జీవితమును పరిశీలించిన నాగరికతయొక్క గురుతు కనుగొనవచ్చును.

**అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**

అజ్ఞానమనెడు తిమిరవ్యాధిచే ఆవరింపబడిన నేత్రములు గలవాని వ్యాధిని జ్ఞానమనెడు అంజనముచే నివారించి నేత్రప్రకాశము గలుగజేసిన మహానుభావుడగు గురువుకొఱకు నమస్కారము. దీనివల్ల జ్ఞాననేత్రము అజ్ఞానవ్యాధిచే మూయబడియున్నట్లున్ను, గురువుయొక్క కరుణయనెడు అంజనముచేతనే అది నివృత్తిగావలసినట్లును దెలియుచున్నది. లేనిచో నేత్రములు లేని గ్రుడ్డివానివలె అతని జీవితము దుఃఖమయమై యుండునని భావము.

ఆత్మజ్ఞులు దైవమునకన్న గురువు నెక్కువగ ప్రేమింతురు. ఏలన? గురువువలన గలిగిన మహిమ వారికి బాగుగ తెలియును. గురువు విషయమై ఒక చిన్నసంగతి చెప్పెద. మీరు నాల్గుమైళ్ళ దూరమున ఒక గ్రామమునకు వెళ్ళి ఒకయింటి యజమానిని చూడవలసియుండిన నెవరిని అడుగక ఆ గ్రామము వెళ్ళి గృహమును కనుగొని, గృహాధిపతిని జూచి మాట్లాడుటకు సాధ్యము గానప్పుడు దైవవిషయమై ఆచరించుటకున్ను, దైవజ్ఞానమును గలుగచేసుకొనుటకున్ను, దైవమును సాక్షాత్కరించుటకును సాధ్యమగునా? మఱియు దైవసాధనపరమగు యోగములోను, మంత్రజపములలోను, ఇతర

సాధనలయందును కొన్ని రహస్యములు గలవు. అంతేగాక, యెన్నియో విఘ్న ములుగూడ గలుగవచ్చును. ఇవన్నియు గురుకృపచేతనే మనకు నిర్విఘ్నముగ సిద్ధించ వలసియుండును. అట్లు అవసరము లేనిచో, వేదము గురుముఖ ముగ గ్రహించవలసినదనియే శాస్త్రమేల చెప్పును?

మఱియు, శ్రీ వైష్ణవాది కొన్ని సంప్రదాయములలో ఆచార్యుల ననుగ మించి వెళ్లనిచో మోక్షముగూడ కలుగనే కలుగదని చెప్పుదురు. ఏ విధమైనను సద్గురువు నాశ్రయించుటయే మంచిది. దానివల్ల శ్రేయస్సు గల్గునే గాని యేలాటి లోపమున్ను గలుగదు. అట్టి నిర్మలులైన గురువులు దొరకని కారణముచేతను, కొందరి మోసకారులవృత్తిని జూచియు మీకు గురువులపై విశ్వాసము లేకపోయి యుండవచ్చును. అయితే మంచిగురువును జూచి పరిగ్రహించు విషయము జనులపై ఆధారపడి యున్నది.

**ఋషిం ఛందోఽధిదైవం చ ధ్యాయేన్మంత్రస్య సత్తమే ।**
**యస్తు గార్గి జపేన్మంత్రం తదేవ హి ఫలప్రదమ్ ॥**

**భవేద్వీర్యవతీ విద్యా గురువక్త్ర సముద్భవా ।**
**అన్యథా ఫలహీనా స్యాన్నిర్వీర్యాఽప్యతిదుఃఖదా ॥**

ఓ గార్గీ! ఎవడు మంత్రధ్యానమునకు ముందుగా ఋషి, ఛందస్సు, దేవతాదులను న్యాసము చేసి ధ్యానించునో, ఆ మంత్రము మంత్రమే ఫలము నిచ్చును. మఱియు బ్రహ్మనిష్ఠుడగు గురుముఖమునుండి గ్రహించిన మంత్రమే వీర్యవంతమై, అనగా చైతన్యము గలదై యుండును. అట్లు గానిచో స్వయముగ జపించు మంత్రము చైతన్యరహితము ఫలమును గలుగ జేయనిదియు నగుటయేగాక దుఃఖమును గలుగ జేయునదిగ నుండును. కనుకనే అనాదినుండి గురువులేని విద్య కూడదని పెద్దలు చెప్పిరి.

ఒకవేళ నీ జన్మములో కొందరికి గురువులేకనే మహత్తరమగు దైవ జ్ఞానము గల్గియుండవచ్చును. అయితే అట్లుండువా రరుదు. వీరుగూడ కఠిన ములైన సాధనలచేతగాని, అనన్యమైన దైవభక్తిచేతగాని ఆ స్థితిని బొంది

యుందురు. దైవమును గురువుగా భావించుటచే ఆ స్థితి గల్గియుండును. మఱియు నేదైన పుస్తకములు చూచిగాని, చదివినది వినిగాని, యెవరైన చెప్పి నది వినిగాని గ్రహించియుందురు. లేక స్వప్నములో ఇష్టదేవతలయొక్క, లేక సిద్ధపురుషులయొక్క కరుణచే కొన్నివిషయములు బోధకు వచ్చియుండ వచ్చును. అయితే అవన్నియు జన్మాంతర సంస్కారబలమనియే శాస్త్రము చెప్పుచుండును. అట్టివారి కీజన్మములో గురువు లేకపోయినను పూర్వ జన్మముచే బోధింపబడిన అనుష్ఠాన మంతఃకరణములో బీజాకృతియై యుం డుటచేతనే అట్టి స్మృతిజ్ఞానము గల్గినది. కనుక వారు జన్మాంతరములో గురు సేవచేసి, దైవకృపకు పాత్రులై, అంతఃకరణ దోషరహితులై, గురువులచే వేదాంతవాక్యము శ్రవణము చేసినవారై యుందురు.

వేసవికాలములో మట్టిలోగల విత్తనములు వర్షాకాలము వచ్చునప్పున డంకురించునట్లు, అంతఃకరణములో నిగూఢమైయుండు పూర్వజన్మ సంస్కా రము ఇప్పుడు ఫలరూపముగ పరిణమించియుండును. ఒకవేళ దైవజ్ఞాన తత్త్వము గల్గియుండినను, వారు లోకములో బోధించునప్పుడు అనేక శాస్త్ర వాక్యములయొక్కయు, మహాత్ముల వచనములయొక్కయు సహాయము గైకొనియే వర్తించుచున్నారు. ఇది అందరికిన్ని తెలిసిన విషయమే! శ్రీరామ కృష్ణాది అవతారపురుషులకు స్వబోధజ్ఞానము గల్గియుండియు, శ్రీవసిష్ఠ సాందీపాది గురువుల నాశ్రయించి కృతార్థత నొందినట్లు శాస్త్రములు చెప్పుచు న్నవి. అదిన్ని లోకముయొక్క పరంపరామార్గముయొక్క పరివర్తనము కొఱకే అట్లు చేసియుందురు. ఈ గురుశిష్య సంప్రదాయము మనయొక్క సనాతన మగు వేదానుయాయులకు మాత్రమేగాక సర్వవిదేశీయులకుగూడ గలదు. మఱియు, కొందరు మహాపురుషులు వారివారి సంప్రదాయములో చేరిన మాత్రమే ఋషుల కరుణ గల్గుననియు, అప్రత్యక్షులై యుండు దివ్య ఋషులు వీరికి సహాయము చేయగలరనియు చెప్పుదురు. ఇదిన్ని కొంత వఱకు మనకు నమ్మదగినది. కనుకనే కొందరికి స్వప్నములో దివ్యపురుషులు ఫలాని సంప్రదాయములో చేరి సాధనచేయుము అని యుపదేశించినట్లు

కథలు వినుచున్నాము.

ఇదిన్ని మనము బొత్తిగ(త్రోసివేయదగినది కాదు. మామూలుగా బ్రాహ్మ ణాదులలో ఉపనయన సంస్కారాదులు చేయక, పిల్లలచే నే వైదికకార్యమున్ను చేయింపరు. దీనివల్ల సంస్కరణముచేతనే వారు శుద్ధిగావలయునని యేర్పడు చున్నది. సంస్కారముచే, ఆత్మశుద్ధి నొందునని శాస్త్రసిద్ధాంతము, వైష్ణవాది సంప్రదాయులు పంచసంస్కారము చేయనిచో, స్వపుత్రులైన వారి వంటగాని, పదార్థములుగాని భుజింపరు. ఇది క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధాది అన్ని మత ములలోను గలదు.

## నమో తస్స భగవతో అర్హతో సమ్మానం బుద్ధస్స।

ఇప్పుడు భారతీయుల వేదమతములకు భిన్నులైన శ్రీబుద్ధ, శ్రీ మహ మ్మదు, శ్రీయేసుక్రీస్తు మొదలైన మతోద్ధారకులను గురించి విచారింతము. వాస్తవముగ పర్యాలోచించిన వీరున్ను వేదమతవిరుద్ధులు కారు. వీరందరున్ను పరమాస్తికులు. ఆస్తికులంగరున్ను వేదమతస్థులే. నాస్తికులు మాత్రమే వేద విరుద్ధులని చెప్పందగును. అయితే శ్రీ బుద్ధమతము నాస్తికమతమని కొందరు తలంచవచ్చును. అది యెప్పటికిన్ని సరి కాదు. ఏలన! సత్యమున కున్ను, దైవమునకున్ను అభేదము గలదు. నిజముగా చూచిన సత్యమే దైవము, దైవమే సత్యము. సత్యవాక్యముయొక్క అర్థము త్రికాలాబాధ్యమగు నిత్యవస్తు వనియే తేలుచున్నది. రెండవది దయయే భగవంతుడనియు, 'దయ గల హృదయమే భగవన్నిలయ'మనియు మహర్షులమతము. మూడవది వైరాగ్యము. వైరాగ్యము లేనిచో సత్యదయలు నిలువజాలవు. ఇట్టి అమూల్య ములగు దైవరూపములను ప్రేమించిన వారున్ను, ఆచరణలో పెట్టినవారున్ను, వానిచే గల్గిన సౌఖ్యము ననుభవించినవారున్ను, నిష్కపటముగ వానిని లోకము నకు బోధించినవారున్ను నగు బుద్ధభగవానుని కన్న ఆస్తికులు మఱి యెవరు గలరు? అయితే పశువధ రూపమగు కర్మయజ్ఞదురాచారము లోకమంతట వ్యాపించి మనుష్యుల హృదయము కఠినమై పరిణమించినందుచేతను,

కేవలము యుక్తికిన్ని, అనుభవమునకున్ను, సచ్ఛాస్త్రమునకున్ను దూరమైన వర్ణాశ్రమములపై రాజ్యము ప్రతిష్ఠించియుండుటచేతను ఉన్నతజాతులని తలంచువారికి ఔన్నత్య ప్రదములగు దైవగుణములు లేకపోయినను వారు శ్రేష్ఠులని తలంచుటచేతను, నిమ్నతరగతిలో నుండువారికి దైవికములగు సత్యము, ధర్మము, దయ మొదలగు ఔదార్యగుణము లుండియు శ్రేష్ఠులు గారని లోకము తలంచుటచేతను నిజమైన సత్యమును బోధించుట కొక అవతార పురుషుడు కావలసివచ్చినది.

శ్రీబుద్ధదేవుడు చెప్పిన నిర్వాణపదవి మన హిందూమతములోగల మోక్షశబ్దముయొక్క పర్యాయార్థమని అమరకోశాది నిఘంటువులు తెలుపు చున్నవి. నిర్వాణమనగా దైవప్రాప్తియనియు, పరమపదప్రాప్తియనియు, ముక్తి యనియు తెలిపెడు సందర్భములు శ్రీమద్భగవద్గీతాది గ్రంథములలో నెన్నియో గలవు. వాని యన్నిటిలోను నిర్వాణ శబ్దమునకు మోక్షమనియే భాష్య కర్తలర్థము వ్రాసియున్నారు. శ్రీజ్ఞానవాసిష్ఠమున నిర్వాణప్రకరణమని ఒక గొప్ప భాగము గలదు. ఉపనిషత్తులలోను వేలకొలది నిర్వాణపదములు గలవు. ఇవన్నియు సత్యబుద్ధితో పరిశోధించిన శ్రీబుద్ధదేవుడు చెప్పిన నిర్వాణమున్ను ఆస్తికమేగాని, నాస్తికము కాదు. నిర్వాణోపనిషత్తు అని ఒకటి గలదు. "ముక్తిః కైవల్య నిర్వాణశ్రేయో నిశ్శ్రేయసామృతమ్ । మోక్షోఽపవర్గః" = ముక్తిః- కైవల్యమ్- నిర్వాణమ్ - శ్రేయః - నిశ్శ్రేయసమ్ - అమృతమ్ - మోక్షః-అప వర్గః - ఈ యెనిమిది మోక్షము పేర్లు. కావున వేదమతస్థులు చెప్పు నిర్వాణమే శ్రీ బుద్ధదేవుడు చెప్పిన మోక్షమున్ను అగుచున్నది.

నిర్వాణశబ్దమునకు అమరకోశనిఘంటువు గురుబాల ప్రబోధికయందు నీలాగున అర్థము వ్రాయబడియున్నది:- 'నిర్వాంతి నిర్గచ్ఛంతి దుఃఖాదయోఽ స్మిన్నితి నిర్వాణం, నిరిత్యుపసర్గ పూర్వకో వా గతి గంధన యోరితి ధాతుః'- దుఃఖాదులు దీనియందు నిర్గతము లగును. స్వదుఃఖోపశమనమున్ను, నిత్యానందప్రాప్తియు మోక్షమని గదా వేదాంతముయొక్క సిద్ధాంతము. అట్టి పరమధర్మమునే శ్రీ బుద్ధదేవుడుగూడ ఉపదేశించినది. శ్రీమన్నారాయణుని

యొక్క కరుణావతారమే శ్రీబుద్ధదేవుడని శాస్త్రములు చెప్పుచున్నవి. అట్టి శ్రీబుద్ధదేవుడుగూడ గురూపదేశము నవలంబించియే మోక్షము నొందియున్నాడు.

అయితే దీనియందొక విశేషము గలదు. శ్రీబుద్ధదేవుడు కరుణాసాగరుడని అందరికిన్ని తెలిసిన విషయమే. దుఃఖము లేని పదవియే మానవ జన్మముయొక్క పరమగమ్యమని అతనికి స్వయముగ హృదయములో బోధము గల్గియుండెను. అయితే అంతఃకరణములో దృశ్యవృత్తులు అనగా, జన్మాంతర సంస్కారములు కొన్ని ఆ నిర్వాణబోధైక సుఖమునకు అడ్డుపడుచుండెను. వానియొక్క నివృత్తికొఱకు అక్కాలమున నుండిన గురువుల బోధచేత అతడు తృప్తి జెందియుండలేదు. అయితే మహాగురువులను, యోగీశ్వరులను, తాపసోత్తములను, ఋషిసత్తములను సేవించి, నిర్వాణ పదవిని గురించి సంభాషణ సలుపుచుండెను. ఆ పరమపురుషులుపదేశించిన వానిలో గల సారములైన ప్రతి వచనములను, శ్రీబుద్ధదేవుడు శిరసావహించి, యాచరణలో నుంచియుండెను. కేవలశుష్కములగు వేదాంతవాక్యములచే నిర్వాణము లభింపజాలదని తలంచి, అతడు తనలో తాను గొప్ప ప్రయత్నము చేసుకొని తాననుకొన్న నిర్వాణమను పూర్ణప్రజ్ఞను బొందెను. తనకట్టి స్థితి గల్గువఱకును, ఆయన యెవరికిన్ని ఉపదేశ మిచ్చియుండలేదు. శిష్యులుగా నెవరిని పరిగ్రహించుటగూడ చేయలేదు. ఇదే నిజమైన సత్యాన్వేషి యొక్క లక్షణమై యుండును.

శ్రీయేసుక్రీస్తును, శ్రీమహమ్మదునబియు ఈ తరగతిలోచేరినవారలే. వారున్ను దైవసాక్షాత్కారము గల్గువఱకు తీవ్రతర ప్రయత్నములు చేసుకొని ఆత్మశాంతి గల్గిన తర్వాతనే, లోకమునకు బోధించుటకు ప్రారంభించిరి. మనయొక్క పూర్వికులగు ఋషులున్ను, శ్రీశంకరభగవత్పాదాచార్యులున్ను ఈలాగుననే చేసియున్నారు. అట్లుగానిచో గ్రుడ్డివాడు మరియొక గ్రుడ్డివానికి త్రోవ చూపినట్లుండునని వారు లెస్సగ గ్రహించియుండిరి. అట్లు చేయనిచో, అదియొక విధమగు ఆత్మవంచనమే యగును. శ్రీబుద్ధదేవుని ఆయన

యొక్క సాధనకాలములో, అనేకులు ఉపదేశము లడిగియుండిరి. బహు జనులు తమను శిష్యులుగా చేర్చుకొనేలాగున ప్రార్థించుచుండిరి. వారి కందరి కిన్ని శ్రీబుద్ధదేవు డిట్లుపదేశించెను:-"నేను సత్యమును కనుగొనినతర్వాత నాకాత్మ శాంతి గల్గిన పిమ్మట మీకుపదేశించెదను. అంతవఱకు మీరంద రును భూతదయ గలవారై ధర్మప్రవర్తకులై యుండుడు"అని తెలిపియు న్నారు. ఇప్పుడు గురూపదేశ విషయమై శ్రీబుద్ధదేవుని గురించి చెప్పిన విషయ మును ఈ క్రింద పొందుపరచెద. బుద్ధదేవునికి సిద్ధపురుషులు అప్రత్యక్ష ముగా బోధించియున్నారు. అట్టి వాక్యములు ఆకాశవాణి యని చెప్పబడును:-

"సిద్ధార్థకుమారా! నీవిత్తరి జీవప్రపంచ దుఃఖమూలోచ్ఛేదనము గావించి సౌఖ్యప్రపత్తి నార్జింపుము. దుఃఖితచిత్తులగు నీ సోదర మానవుల, సమస్త ప్రాణులను సుస్థిరానందానుభవమునకు అర్హులుగా జేయుటయే నీ విహిత ధర్మము. అనుదినము భూతలంబున జ్ఞానము నశింప నస్థిరంబులగు భోగవిలాసములకు మూలమైన అజ్ఞానమభివృద్ధియై, వేరుబారి మహావృక్ష మగుచున్నది. ఈ యజ్ఞాన మహావృక్షము ఫలించు విషయఫలంబుల నారగించి ప్రాణికోటి మృత్యువువాతంబడి దుఃఖించును. మృత్యువువాతంబడి యా ప్రాణికోటి స్వేచ్ఛానందములేక నరకయాతనల ననుభవించి, పునర్జనన మరణ చక్రమున జిక్కి స్రుక్కుచుండును. జ్ఞానప్రాప్తిచే మానవులు సమస్త జీవహిత పరతంత్రులై తమ జీవితముల వ్యతీతము చేయుచు, వార్ధక్యము నందు సహితము అత్యంతానంద పరీత హృదయారవిందులై జననమరణము లకు వశవర్తులుగాక నిర్వాణమును బడయుదురు. శాశ్వతసౌఖ్య సౌభాగ్యము నంది సోదరమానవులకు సహితమందజేసి యుత్తమమానవుడవై మనుము. లెమ్ము! మేల్కాంచుము. అప్రమత్తుడవై యుండుము" అని ఆకాశవాణి వచనము శ్రీబుద్ధదేవునికి వినవచ్చెను. దీనికన్న పరమోపదేశ మింకేమి గలదు? ఇది గదా! మన ఉపనిషత్తులలో చెప్పిన పరమవాక్యము. "ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్ నిబోధత" దీని యర్థమే బుద్ధదేవునికి సిద్ధపురుషు లుపదేశించిరి.

మఱియు ఇంకొక రోజున "సిద్ధార్థా! సంసారమునందు, నీ విషమ పరీక్షా సమయ మేతెంచినది. ఏతదగ్నిపరీక్షయం దుత్తీర్ణుడవైతివేని నీకితరేతర పరీక్షలు తృణప్రాయములు. ఈ కఠోరసమస్యను సుకరముగ ఖండిరిప శక్తుడైన వ్యక్తియే ధన్యతముడు. భూపాలనందనుడవైన నీవు ప్రపంచములో మహాధనాఢ్యుడవై సకలభాగ్యభోగ్య విలాస చేష్టలయందు నిరతుడవై, షడ్రసోపేతభోజనముల నారగించుట యందెక్కువ మక్కువ గల్గి విశాలధరావలయ పరిపాలనమే నృపాత్మజధర్మమని సంభావించి కీర్తికాయుడును, విస్తీర్ణ పృథ్వీతలచతుర్దిశా వ్యాప్తయశో విరాజితుండును నగు రఘుకుల కమలదివాకరుని చందమున విశేషానందప్రద రాజ్యలక్ష్మీకరకమల గ్రహణసౌభాగ్యము బడసి దిగంతవిఖ్యాతిం బడయుదువో; లేక విషాదభయ బాహుళ్యయుక్తంబును, నిస్సారమాయా కల్పితంబును, క్షణికంబునగు సంసారమును పరిత్యజించి కామినీ కాంచనపుత్ర కళత్రమిత్రబంధువర్గాది ప్రగాఢవ్యామోహ పాశముల పూర్ణముగ ఖండించి, సర్వసంగ పరిత్యాగివై క్షణికంబును, నవిశ్వసనీయంబు నగు మానవజీవితమును, బ్రహ్మాండసేవకే నిర్మింపబడినదని యెంచి, తత్సేవార్థమై, శ్రవణవ్రతానుష్ఠాన గరిష్ఠుండవై, నిత్యైకాంతవాస స్వీకారమును అభిలషించి, సమగ్రసంసారమున హితబోధప్రచారము చేయుచు, జీవన పరిమితిని వ్యతీతము సేయుదువో మనమున దృఢముగ నిశ్చయించుకొనవలసిన సమయ మేతెంచినది. కర్తవ్యాకర్తవ్య నిర్ణయంబున బుద్ధిమంతులగు నరులు కాలవిలంబనము సేయనొల్లరు. సత్వరాచరణీయ సత్కార్యమునెడ గురుజన సూక్తియగు "శీఘ్రం శుభస్య"అనునది సంపూర్ణముగ చరితార్థ మగును. తామసించిన, "ఆలస్యాదమృతం విషం"అను కోవిదోక్తి సఫలంబగును. కావ శీఘ్రమాత్మీయ కర్తవ్యానుష్ఠానమున కుపక్రమింపుము".

ఇట్టి సిద్ధపురుషుల ఆకాశవాణిని వినిన తర్వాత శ్రీబుద్ధదేవుడు సత్యమును కనుగొనుటకు ప్రయాణమై పోవునప్పుడు తనసారథియగు ఛన్నునికి నీలాగున ఉపదేశించెను. "ఛన్నా! విశ్వసౌభ్రాత్రమునే జీవనసర్వస్వమని భావించి నేను మానవహృదయముల నధిపసించు కామక్రోధాది అరిషడ్వర్గ

ముల బారద్రోలి మారుని సింహాసనభ్రష్టుని గావించి ఆ రాచగద్దెపై సత్య స్వరూపిణియగు ధర్మలక్ష్మి నధిష్ఠింపజేయ కృషిసలుపుటకే యరుగుచున్నా డను, మారుని సామ్రాజ్యముపై దండెత్తి శమదమాది యోధాగ్రేసరుల సాహాయ్యం బున ధర్మరణదుందుభిని మ్రోయించి పైకి ఢీకొన నేతెంచు మారుని కామ, క్రోధాదియోధుల సమేతముగా దునిమి పరిపాలనాధికాం మును బడయయత్నించుటకు సత్యధర్మముల గ్రహింప మహాత్ముల నాశ్ర యింపనరుగుచుండ నానందింపకమూఢునివలె వాపోవనేల?" ఇట్లు విరాగియై పర్వతప్రాంతములలోను, అటవీ ప్రదేశములలోను, నదీతీరముల లోను సంచరించుచు సమాధి నిష్ఠనభ్యసించుకొని అనేకమహాత్ములను దర్శించుకొని కొంత కాలము జరిగిన పిమ్మట సిద్ధార్థుడు వైశాలీనగరమున హిరణ్యావతీనదీ ప్రాంతమున నాకాడకాలామను పేరుగల శాస్త్రజ్ఞుండగు ఋషి వరేణ్యుని దర్శించెను. అతనికి మున్నూరుగురు శిష్యులుండిరి. సిద్ధార్థుడు ముక్తిసంబంధమయిన యనేకవిషయముల గ్రహింప నాసక్తి గలవాడగుటచే వెంటనే యా ఋషీశ్వరునివద్ద శాస్త్రాధ్యయనము సేయ నారంభించెను. అసా ధారణ మేధా బల ప్రభావంబున అల్పకాలమునందే ఋషీశ్వరు లెరింగియున్న సకలవిద్యల నామూలాగ్రముగ గ్రహించెను. కాని ముక్తివిషయకంబగు అతనికి వాటిల్లిన సమస్య అచటను పరిష్కరింపబడదయ్యెను.

అనంతరము సిద్ధార్థు డాఋషీశ్వరు నెడబాసి యా ప్రాంతమందే పర్వత కందరమున తపమాచరించు రామపుత్రరుద్రకుండనువాని దర్శించెను. రామ పుత్రరుద్రకునియొద్ద సమస్తశాస్త్రముల నధ్యయనము చేసి శాస్త్రములయం దుత్తమమగు పరిజ్ఞానము నార్జించెను. ఇచ్చట సిద్ధార్థశబ్దము శ్రీబుద్ధదేవుని పూర్వాశ్రమపు పేరుగా నుండెను. సర్వశాస్త్రములను గ్రహించిన తర్వాత పూర్ణ ప్రబోధమగు బ్రహ్మసాక్షాత్కారముకొఱకు శ్రీబుద్ధదేవుడు ఏకాంత ప్రదేశ మున కరిగెను. అది పరిశుద్ధ సలిలభరితమగు నైరంజనా నదీతీరముగా నుండెను. అచ్చట సిద్ధార్థుడు వర్షషట్కపర్యంతము ఘోరమగు తపమాచరిం చెను. అచ్చటనే శ్రీబుద్ధదేవునికి ఆత్మప్రబోధము గల్గినది. అదియే బోధప్రాప్తి

యనంబడును."

ఇప్పుడు మనము బుద్ధదేవునియొక్క చరిత్రసంగ్రహమును గ్రహించితిమి. రాజాధిరాజకుమారుడై దేవేంద్రసౌఖ్యము ననుభవించుచుండెడు శ్రీ బుద్ధదేవుడు దైవప్రాప్తికొఱకు, సత్యాన్వేషణముకొఱకు సర్వసుఖములను ఒక్క క్షణములో తృణీకరించి పరమవిరాగియై పోయినందుచే గదా ఇట్టి పరమ పావనమగు నవస్థ గల్గినది? ఆ మహాపురుషుని వైరాగ్యమును జూచిన నిప్పుడు గల త్యాగులకు సన్న్యాసులకున్ను ఎంతభేదము గలదో పాఠకులూహించుకొనవచ్చును. సిద్ధపురుషులచేతను, ఇతరులైన ఉపగురువుల చేతను శ్రవణముచేసిన దాని నేకాంతప్రదేశమున మననిదిధ్యాసనల నొనర్చి సాక్షాత్కారజ్ఞానమును శ్రీబుద్ధదేవుడు బడసెను.

**మైత్రధర్మిక ఖిలేశ సూదన సర్వసత్వ కరుణాయ ఉద్గత ।**
**మోదప్రాప్తపరమ ఉపేక్షక బ్రహ్మభూత సుగతో నమోస్తు తే ॥**

సర్వభూతములతోను మిత్రభావము గలవాడవును, సర్వధర్మముల యొక్క సారభూతుడవు, దుఃఖములను సమూలముగ శమింపజేయువాడవు, సర్వసత్త్వములలోను కారుణ్యమును ప్రదర్శించుటకొఱకు ప్రకటితమైన వాడవు, పరిపూర్ణమోదమును పొందినవాడవు, సర్వవిషయములలోను పరమోపేక్ష గలవాడవు, బ్రహ్మభూతుడవు నగు ఓ సుగతా! నీకు నమస్కారము.



## శ్రీబుద్ధదేవుని చరిత్ర

క్రీస్తుశకమునకు పూర్వము 662వ సంవత్సరారంభమున అయోధ్యా ప్రాంతస్థ రోహిణీ తరంగిణీతటంబున విరాజమానమై యున్న కపిలవస్తువను పట్టణమును శాక్యవంశోద్భవుండగు శుద్ధోదనభూపాలుడు రాజధానిగా నేర్పరచుకొని శాక్యవంశ రాజ్యపాలనము చేయుచుండెను. అతడు కాలీయ

వంశజుండగు సుభూతుని కన్యాద్వయమును ధర్మపురస్సరముగ పరిణయ మాడెను. ప్రథమపత్ని మాయాదేవియను నామంబునను, ద్వితీయపత్ని గౌతమదేవియను శుభాహ్వాయంబునను ప్రసిద్ధికెక్కి యుండిరి. అందు మొదటిభార్యయగు మాయాదేవియందు జనన మొందిన పుణ్యపుంజమే శ్రీ బుద్ధదేవుడు. చిన్నతనములో సిద్ధార్థుడను పేరు గల్గియుండెను. ఇతని బాల్య కాలములో కన్నతల్లి భూలోకవాసము పూర్తిచేసి స్వర్గలోక మలంకరించెను. తర్వాత పిన్నతల్లియగు గౌతమదేవి కన్నబిడ్డకన్న వెయ్యిరెట్లధికముగ పెంచి నది. శుద్ధోధనుడు పుత్రసంతానము లేక అనేకములగు దానధర్మములు, దైవ కార్యములు సల్పుటచే గల్గినవాడు శ్రీ బుద్ధదేవుడు. ఇక నీ విషయము విశద ముగ గనుగొన గోరువారు శ్రీ బుద్ధచరిత్రముగాని, బుద్ధ పురాణముగాని చూచుకొనవచ్చును.

ఇక మనము శ్రీ మహమ్మదునబివారికి గురువు గలడా? లేడా? యని విచారింతము. ఈ మహమ్మదువారు శ్రీ బుద్ధదేవునివలె పూర్ణదయయే తన మతమునకు సిద్ధాంతము చేయకయు, శ్రీ యేసుక్రీస్తువలె నపారదైవభక్తియు, శాంతియు, మతమునందు లక్ష్యముగా నుంచకయు సత్యముపై ధర్మముపై నాధారపడి మతస్థాపన చేసిరి. సత్యమునకు ధర్మమునకు నెంతమాత్రము దయ చూపవలసియుండునో అంతమాత్రమునకైన దయావిషయములో తక్కువనియే చెప్పవచ్చును. అయితే దానికి కారణము గలదు. మహమ్మదు ప్రవక్త ఆవిర్భవించునప్పటికి అరబ్బీదేశీయులకు ఆత్మసంస్కరణము చాల కొరతబడియుండెను. నాగరికవిషయములోను నిండా క్రిందిమెట్టులో నుండువారనియే తలంచవచ్చును. మహమ్మదుప్రవక్తగూడ జనులకు చాలవఱకు దయయు, శాంతియు బోధించుచు వచ్చెను. కాని ఆ మృదుర సామృత పానము చేయదగినట్లు జనులుండలేదు. అందువలన మతస్థాపనములో వాడిమిగల కత్తిని సదా చేతిలో నుంచుకొనవలసివచ్చినది. ప్రపంచములో తీక్ష్ణమైన ఖడ్గముచే రక్తప్రవాహము భూమియందు ప్రవహింప జేసి మతము స్థాపించినవాడు ఈయన దక్క మఱియొకండు లేడు.

శ్రీబుద్ధదేవుడు కరుణామృతముతో మనుజుల హృదయము నభిషిక్తముగావించి పవిత్రములగు మతబీజముల నాటెను. శ్రీయేసుక్రీస్తు భక్తి ప్రవాహములో జనుల హృదయమును జ్ఞానస్నానము చేయించి పావనమగు మతవిత్తనము పెట్టెను.

శ్రీమహమ్మదుగారుమాత్రము అట్టి ప్రేమామృతములో, భక్తిరసామృతములో, శాంతపీయూషములో జనులహృదయమును కడిగి నిర్మలము చేయక దుఃఖరోదనముతో గూడిన రక్తములో జనులమతశుద్ధి చేయవలసివచ్చెను. ఈ దోషమతని యనంతరమున మతప్రచారమునకువచ్చిన వారి కందరికిని గల్గియుండెను. అది యొకవిధమగు నమ్మకమైనను, మూఢవిశ్వాసమేగాని విచారణజ్ఞానముచే గల్గిన శుద్ధవిశ్వాసము గాదు. అందువలన గలిగిన ఘోరమగు దోషాగ్ని ప్రపంచమంతట చాలవఱకు కాల్చివేసెననియే చెప్పవచ్చును. ఎందరో పిల్లలు తల్లులు లేనివారలైరి. ఎందరో తల్లులు పిల్లలు లేనివారలై దుఃఖించిరి. ఎందరో భర్తలు భార్యలు లేక జీవించవలసి వచ్చెను. ఎందరో పతివ్రతా శిరోమణులగు నారీరత్నములు భర్తల నెడబాసి శోకసాగరములో నిమగ్నులు గావలసివచ్చెను. వీనికన్నిటికిన్ని మహమ్మదునబి ఖడ్గము చేతిలో పట్టుకొనుటయే కారణమైనది.

అయితే మహమ్మదునబి మాత్రము గొప్ప ధైర్యశాలియు, సత్యాన్వేషియు, దైవభక్తుడుగా నుండెను. అతనికి సత్యముగా తోచిన దానిని చేసియే తీరును. అచట వెనుక ముందు చూడడు. వీనికన్నిటికిన్ని ఆ దేశకాల పరిస్థితులట్లుండెననియే మనము తలంచవలయును. లేనిచో అట్లు జరిగియుండదు. అతని ఆశయమేమన, జనులు సత్యమునకు, దైవమునకున్ను దూరులై సుఖముగా జీవించి నరకమును బొందుటకన్న సత్యమును, దైవమును స్మరించి చచ్చుటయే మేలని తలంచియుండును. అయితే మహమ్మదు తనయొక్క మతమును స్థాపించుటలో ఆ దేశీయులగు క్రూరజనులచే చాల శ్రమపడెను. చాల బాధ నొందెను. అనేక కష్టములకు లోబడవలసివచ్చెను. ప్రాణాంతకములైన అనేక విపత్తులనుండి సర్వేశ్వరుండితనిని రక్షించెను. ఇవన్నియు చూచి

యోర్వజాలకనే సాయుధపాణియై మత ప్రచారమునకు ప్రారంభించినట్లు మనము తెలుసుకొనవచ్చును.

అతడు చిన్నకాలమునుండియే అగాధబుద్ధియు, గొప్పదైవ విశ్వాస మున్ను గల్గినవాడై జనులయొక్క దుఃస్థితిని జూచి చాల వగచుచుండెడివాడు. ఇందువల్లనే, అత్తరి ఆదేశీయులు చాల అనాగరికులై, ధర్మదూరులై, దైవ విముఖులై యుండినట్లు గనుకొనవచ్చును.



## మహమ్మదు చరిత్ర

ఈ మహమ్మదునబి క్రీస్తు సంవత్సరం 570 సం॥ ఆగస్టు 26వ తేదీన జననమందెను. ఇతడు అబ్దుల్లాకును, అమీనాయను నామెకును పుట్టినవాడు. ఈయన పుట్టుటకు పూర్వమే పితృహీనుడయ్యెను. తల్లియగు అమీనా యతని నతిగారాబముతో బెంచుచుండెను. కాని యామెయు నచిరకాలము లోనే లోకాంతరప్రాప్తినొందెను. తల్లి చనిపోయిన నాలుగేండ్లకే తాతయు నా బాలుని పినతండ్రియగు అబూతలీబున కొప్పగించి మృతి నొందెను. అబూతలీబు మహమ్మదు నతిప్రేమతో బెంచెను. మహమ్మదు బాల్యము నుండియు తనదేశీయుల దుష్కృత్యముల జూచి చాల దుఃఖించుచుండెడి వాడు. ఇది లోకోద్ధారకులగు మహాపురుషుల కందరికిన్ని చిన్నకాలములో గల్గెడు చిహ్నముగ నుండును. ఇతడు తన పినతండ్రి బిడారులతో కలిసి దూరదేశముల కేగుచు లోకజ్ఞానమును సంపాదించుచుండెను.

ఇతనికి 25వ యేట వివాహమాయెను. అప్పటినుండి సంఘదుఃస్థితిని గురించియు, అధ్యాత్మతత్త్వమును గురించియు మఱింత గాఢముగ చింతన చేయుటకు మొదలిడెను. అతడు తన యూరికి దగ్గరనుండు ఒక కొండ గుహలో గూర్చుండి ధ్యాన తత్పరుడగుచుండెను. ఇట్లు పదునైదు సంవత్స రములు రేయింబగళ్ళు తదేక ధ్యానములో నుండెను. ఒకనాటిరాత్రి యాతడు

ధ్యాననిమగ్నుడై యుండ ప్రకృతి యంతయు పరమశాంతత వహించి యుండెను. అంతయు నిశ్శబ్దముగ నుండెను. అప్పుడాతని హృదయ మొక భారమును వహించియుండెను. ఆ పరమప్రశాంత సమయమున ఒకయశరీర వాణి యాతని బిలిచి నట్లయ్యెను. అది యేమో యని అతడు సరకుకొనలేదు. మూడవసారి యావాణి "అనుము. ప్రకటించుము" అని పలికెను.

ఈ శబ్దము అతనికి మూడుసార్లు వినవచ్చెను. అతడును "ఏమి ప్రకటించవలెను" అని కేకవేసెను. "నీ ప్రభువుపేర ప్రకటించుము"అని పెద్ద ధ్వనితో చెప్పి మనుష్యుడు పరమాణువునుండి యెట్లుద్భవించినదియు, జ్ఞానమువలనను, దయామయుండగు అల్లాకరుణవల్ల ఎట్లున్నతిని బొంది నదియు వివరించి, యావాణి యూరకుండెను. ఈ ఆకాశవాణిని దైవవాణి యనియు, సిద్ధపురుషుల వచనమనియు మనవారు చెప్పుదురు. అట్టి యుప దేశమైన వెంటనే మహమ్మదునబికి గొప్పప్రబోధజ్ఞానము గల్గి ప్రాణికోట్ల యొక్క సృష్టియు, మఱల నే ప్రకారము గలుగవలసినట్టి విషయమున్ను, ఈశ్వరకృపకు పాత్రుడై యేలాగున దైవసాక్షాత్కార జ్ఞానము గల్గునో ఇవ న్నియు నప్పుడే బోధగల్గెను. సిద్ధపురుషుల (లేక యీశ్వర) ఆదేశముచే, గలిగెడు ఉపదేశమహిమ యీలాగుననుండును. ఇది లోకోద్ధారకులగు ప్రవక్త లకు మాత్రము గల్గునుగాని సామాన్యులకు గలుగదు. ఇట్లు బోధ గల్గియు, మహమ్మదునబి లోకమున కుపదేశించవలసిన విషయమును గురించి కొన్ని రోజులు గాఢచింతనయందు మగ్నుడై యుండెను. అట్టి సమయమున అతని విధికృత్యము నెరవేర్చవలసినదిగా దేవదూత యాతని కుత్సాహము గల్గించుచు తాను లోకములో వ్యాపింపజేయవలసిన వార్తను దెలుపుచుండెను.

ఈ దేవదూతలను మహమ్మదీయులు జిబ్రీలందురు. జిబ్రీలు అతని మనోనియమమునకు సాక్షాత్కారించు నప్పుడెల్ల మహమ్మదు మూర్ఛ నొందు చుండెను. అనగా నిర్వికల్ప సమాధిలో నుంటుండెను. అతని మొగమును, కండ్లును ఎఱ్ఱబారుచుండెను. ముచ్చెమటలు బోయుచుండెను. ఆ సమయ మున నతడు ఒడలి నిండ దుప్పటిని కప్పుకొనియుండ, అతనినుండి జిబ్రీలు

దేవుని సందేశమును పలికించుచుండిరి. ఆలాగున సమాధి స్థితిలోనుండి పలికిన మాటలను భక్తులు వ్రాసికొనుచుండిరి. ఆ వచనముల సంహితయే కురానుషరీఫను గ్రంథము. అది మహమ్మదీయ వేదగ్రంథము. ఇది నూటపది యధ్యాయములతో గూడినది. అప్పటినుండియే మహమ్మదు ప్రవక్తయైనారు. ఈ మహమ్మదునబి చరిత్రమును విస్తారముగ గనుగొనగోరువారు ఖురాను షరీపును చూచి తెలుసుకొనవచ్చును. ఇందువల్ల ఈశ్వరాదేశముతో ప్రపంచములో నవతరించిన గొప్ప మతోద్ధారకుడగు మహమ్మదునబికి గూడ గురూపదేశము గలదని వినవచ్చినప్పుడు సామాన్యజనుల విషయమై మఱల చెప్పవలయునా? ఇట్లుండియు మహమ్మదు పైగంబరయ్యు తన మేనమామ యున్ను, మతగ్రంథములను బాగుగ పరిశీలించిన వారు నగు వరాకాయొద్ద ధర్మవిషయము లనేకములను నేర్చుకొన్నాడు. శ్రీబుద్ధదేవునికిన్ని ఇదే ప్రకారము గల్గినది.

శ్రీమహమ్మదుప్రవక్త, ధర్మస్థాపనము చేయవలసివచ్చినందుచే అధర్ములను పరిమార్చవలసివచ్చినది. దయాదృష్టిగల వారికి మనోవ్యాకులత గలుగచేసినను అదియొక్క విధమగు నీతియే యగును. అయితే మహమ్మదు నబి చేసిన కృత్యమునకున్ను తమ అనుయాయులు చేసిన కార్యమునకున్ను చాల భేదము గలదు. మహమ్మదునబి దైవమునకున్ను, సత్యమునకున్ను, ధర్మమునకున్ను విరోధులై అక్రమ ప్రవర్తకులైన వారిని మాత్రమే అణచివేయ దలంచిరి. అట్టి అధర్మమానవులనే కాఫిర్లని చెప్పిరేగాని, దైవమందు విశ్వాసమున్ను, సత్యమందు అనురక్తియున్ను, ధర్మమందు ప్రవృత్తియున్ను గల వారగు ఇతర మతస్థులను మహమ్మదునబియొక్క అనుయాయులు బాధించిరి. వీరు మహమ్మదునబియొక్క బాహ్యావర్తనమునే గ్రహించిరిగాని ఆత్మ విచారణ చూడరైరి.

ధర్మస్థాపనకొఱ కవతరించిన, శ్రీరామకృష్ణాది దైవపురుషులు గూడ సత్యధర్మదైవనిష్ఠకు దూరులైన వారిని సంహరించుచుండిరి. అట్టివారినే అసురులనియు, రాక్షసులనియు, ధర్మదూరులనియు మనవారు చెప్పుచుండిరి.

సత్యదృష్టితో చూచిన శ్రీమహమ్మదు ప్రవక్త చేసినదిగూడ తప్పనిసరిగ అంగీకరించవలసియే యుండును. అనేక యుద్ధములలో శత్రువులను బరిమార్చిన వారలగు రామకృష్ణాది అవతార పురుషులను మనవారలు దైవములుగా భావించుట లేదా? పూజించుట లేదా? ధ్యానించుట లేదా?, మనలను రక్షించిన యీశ్వర స్వరూపులని తలంచుట లేదా? ఈ దృష్టి నవలంబించియే మహమ్మదీయులుగూడ మహమ్మదుగారిని పైగంబరనియు, ప్రవక్తయనియు నంగీకరించి పూజించి వారు చెప్పు వాక్యములను వేదప్రమాణములుగా నమ్ముటకు కారణమైనది.

ఇక మనము క్రైస్తవ మతోద్ధారకుడగు శ్రీక్రీస్తుదేవుని గురించి విచారింతము. ఈయన శ్రీమహమ్మదునబివలె గాక పరమదయాళువున్ను, అపారశాంతిమూర్తియు అత్యధిక దైవభక్తియున్ను గల్గియుండినవాడు. ఈయన అవతరించుటకు ముందుగా ఆ దేశములో గొప్ప దురాచారము ప్రబలియుండెను. అది మనహిందూదేశములో గలిగియున్నట్లే యుండెను.

అదేమనగా? ఆ దేశములో ఒకతెగవారు మాత్రమే యీశ్వరునికి సంబంధించిన వారనియు, ఈశ్వరకుటుంబమునకు చేరినవారనియు, వారికి మాత్రమే సమస్తశాస్త్రములు చదువుటకున్ను, అన్ని అధికారములు గల్గియుండుటకును అర్హత గలదుగాని, తదితరులుకు లేదని చెప్పుటయేగాక, వీరిసేవయే ఇతరులకు పరమపురుషార్థమనియు, ఈశ్వరాజ్ఞయనియు చెప్పుకొనుచు వీరికృపకు పాత్రులైన వారికిమాత్రమే మోక్షము గల్గునని వాదించెడి వారలు. వీరే గురుపీఠములకును, మతబోధనలకును, ఆచార్యపదవికిని, పౌరోహిత్యకృత్యమునకున్ను తగినవారని పలుకుచుండెడివారు. వీరు విద్యాధికులై రాజులదగ్గరచేరి యీ ధర్మములన్నియు రాజులకుబోధించి ప్రజలపై శాసనములు చేయించెడి వారు. అట్లు చేయనిచో రాజు దైవద్రోహి యగుననియు, ఈశ్వరశాసనము నుల్లంఘించిన వాడగుననియు, మహానరకమునకు పాత్రుడగుననియు నుపదేశించెడి వారలు. ఇది యించుమించుగా మన దేశమునకు సంబంధించియుండును. హిందూరాజు లున్నప్పుడు మన దేశములోను

ఈలాటి పాపభూయిష్ఠమగు అంధ విశ్వాసమే నిండియుండినది. ఈ దుష్కృత్యమునకు వ్యతిరేకముగా, నెవరైన ధర్మమును బోధించినచో అతడు దైవదూరుండనియ వేదనిందకుండనియు, దండనార్హుడనియు, వధ్యుడనియు గూడ తెలుపుచుండెడివారు. ఒకవేళ వారికి దైవగుణములుగాని, సత్యధర్మములు గాని, దయాదాక్షిణ్యములుగాని యుండినచో వారు చెప్పిన దానిని కొంత వఱకైన నమ్ముటకవకాశము గల్గి యుండెడిది.



## ఏసుక్రీస్తు చరిత్ర

ఆలాటి దైవవిషయము లేనివారై, జనులపై అధికారము వహించుకొని యుండే సమయములో నీశ్వరకృపచే శ్రీయేసుక్రీస్తు అవతరించి, జనులకు ధర్మతత్త్వమునుబోధించుటకారంభించెను. అంతవరకు పార్సీలను ఆ దేశీయ శాస్త్రుల మఠాధిపతుల బంధనములో చిక్కియుండు జనులను విముక్తి చేయుటకు చాల శ్రమపడవలసి వచ్చినది. ఆఖరున అట్టి దుష్టహృదయులగు పురోహిత సంఘములచేతనే, ఆ పరమ పావనుడగు, పుణ్యమూర్తియగు, నీశ్వరపుత్రుడగు, దయాశాలియగు శ్రీ యేసుక్రీస్తు హతము గావలసివచ్చెను. అయితే ఆ దురాత్ములు అతని దేహమును నాశమొనర్చ శక్తి గల్గిన వారలైరే గాని అతని ఆశయమును అరికట్ట నశక్తులైరి. శ్రీ యేసుక్రీస్తుయొక్క మరణానంతరమే యా మతము లోకమంతయు సహస్రముఖములుగ వ్యాపించి ప్రకాశమునకు వచ్చినది. క్రమముగ తనకు శత్రువులైన వారు గూడ అనేకులు దైవప్రేమతోను, శాంతామృతముతోను గూడిన యామతములో చేరిరి. రాజులందరు క్రైస్తవులైరి. ఇప్పుడు పాశ్చాత్యదేశమంతయు శ్రీక్రీస్తుదేవుని శిలువను పూజించుచున్నారు. క్రీస్తు జన్మించినప్పటినుండియే క్రైస్తవ సంవత్సర మేర్పడినది. తక్కిన మతోద్ధారకులగు మహాపురుషుల జన్మముకన్న క్రీస్తుజననమునకు ప్రత్యేక ఆశ్చర్యమొకటి గలదు. అదేమన :- క్రీస్తు తల్లియగు మేరియమ్మ వివాహితురా లగుటకు ముందుగా దేవుని సంకల్పముచే

పరిశుద్ధాత్ముఁడగు క్రీస్తువు అమానుష దైవశక్తిచే మేరియగర్భములో ప్రవేశించి నట్లు చెప్పుదురు.

ఇతడు నజరేత్తు దేశమున నవతరించెను. ఇతని తండ్రిపేరు యోషేపు. భర్తలేకనే మేరియ గర్భము ధరించు విషయమై గల సందేహ నివృత్తులన్నియు క్రీస్తు చరిత్రమున విస్తారముగ గనందగును. యోషేపుకున్ను ఆ సంశయము గల్గినప్పుడు దేవదూతలు వచ్చి యోషేపుతో "ఓ యేషేపా! మేరియను వివాహము చేసుకొనుము. మేరియ నిర్దోషురాలు; దేవుని సంకల్పముచే పరిశుద్ధాత్ముఁడగు యేసు మేరియగర్భములో ప్రవేశించియున్నాడు. మీ జన్మము ధన్యము. లోకముగూడ పావన మగుటకు కాలమాసన్నమైనది. ఈ విషయమై సందేహ పడకుము." ఇట్లు దేవదూతల వచనముల విన్న తర్వాత యేషేపు మేరియను వివాహము చేసుకొనెను. దానికి ముందుగా ప్రధానము మాత్రమే జరిగియుండెను. ఈ క్రీస్తుయొక్కయు, మహమ్మదుయొక్కయు, బుద్ధదేవునియొక్కయు జననసమయములోను, తర్వాతను అనేక మహిమలు గల్గియున్నవి. అవి యెవ్వియు మనకు ఇచ్చట వ్రాయుట కవసరము లేదు. క్రీస్తు జన్మించిన తర్వాత పంఢ్రెండు సంవత్సరములవఱకు తండ్రివద్ద నుండెను. తర్వాత తత్త్వాన్వేషణముకొరకున్ను, దైవజ్ఞానము కొరకున్ను లోకోద్ధారక విషయమునకు కావలసిన దైవగుణముల సంపాదించుటకును నిర్జన ప్రదేశములో నెవరికిని తెలియక 17 సంవత్సరములు తపస్సు చేసిన తర్వాత మనోజయము గల్గి, జ్ఞానసిద్ధి నొంది, యీశ్వరకృప బడసి 29వ వయస్సులో మఱల ప్రపంచ జనసంఘములోనికి వచ్చెను. అంతవర కతనికి సరియైన గురూపదేశమై యుండలేదు. తనయొక్క జన్మాంతర ఆత్మశక్తియే అతనిని ప్రేరేపించినది.

ఇప్పుడు మతమును స్థాపించుటకు దైవసంకల్పము గల్గినందుచే బ్రహ్మవిద్య గురుపరంపరగా నుండవలసినదిగా తలంచి శ్రేష్ఠుండగు నాచార్యుని వెదకుచున్న సమయమున ఆ దినములయందు యోహాను వచ్చి జనులకు బాప్తిస్మమిచ్చుచుండెను. యోహాను అనగా ఆ దేశములో అట్టికాలమున

గొప్ప దైవకరుణ గల్గిన తత్త్వవేత్తగా నుండెను. బాప్తిస్మమనగా జ్ఞానస్నానమని యర్థము. ఇది క్రైస్తవమతములో చేరునప్పుడు జీవులను పాపశుద్ధి చేయుట కొఱకేర్పరచిన ఒకవిధమగు పుణ్యస్నానము. అట్టి యోహాను "పరలోక రాజ్యము సమీపించియున్నది. మారు మనస్సు పొందు"డని యూదైయ అరణ్యములో ప్రకటించుచుండెను. "ప్రభునిమార్గము సిద్ధపరచుడి, ఆయన త్రోవలు సరళము చేయు"డని అరణ్యములో కేకవేయుచు ఇప్పుడే గొడ్డలి చెట్ల వేరులలో నుంచబడియున్నది, కనుక మంచిఫలము ఫలింపని ప్రతిచెట్టును వేరులతో గూడ నరకబడి అగ్నిలో వేయబడును. మారు మనస్సు నిమిత్తము నేను నీళ్ళలో మీకు బాప్తిస్మమిచ్చుచున్నాను. అయితే, నా వెనుక వచ్చుచున్న వాడు నా కంటె శక్తిమంతుడు. నేను ఆయన చెప్పులు మోయుటకైన పాత్రుడను గాను. ఆయన పరిశుద్ధాత్మతోను అగ్నితోను మీకు బాప్తిస్మ మిచ్చును. ఆయన చేట ఆయన చేతిలోనున్నది. ఆయన తన కళ్ళమును బాగుగ శుభ్రము చేసి గోధుమలను కొట్టులో పోసి ఆరని అగ్నిలో పొట్టును కాల్చివేయు"నని వారితో చెప్పుచుండెను. అట్లు జీసను యోహానుచేత బాప్తిస్మము పొందుటకు, గలిలైయ నుండి యొర్దను అను పేరుగల నదిదగ్గరనున్న అతనివద్దకు వచ్చెను. అందుకు యోహాను 'నేను నీచేత బాప్తి స్మము పొందవలసినవాడనై యుండగా నీవు నాయొద్దకు బాప్తిస్మము నిమి త్తము వచ్చుచున్నావా?"అని శ్రీ యేసువును నివారింపజూచెను. కాని యేసు ఇప్పటికి కానిమ్ము. నీతి యావత్తు ఈలాగున నెరవేర్చుట మనకుతగియున్న' దని అతని కుత్తరమిచ్చెను. కనుక అతడా లాగున కానిచ్చెను. యేసు బాప్తిస్మము నొందినవెంటనే నీళ్ళలోనుండి యొడ్డుకువచ్చెను. అప్పుడు ఆకా శము తెరువబడెను. దేవునియాత్మ పావురమువలె దిగి తనమీదికి వచ్చుట చూచెను. మఱియు "ఈయనయే నా ప్రియకుమారుడు. ఈయనయందు నేనానందించుచున్నాను"అను నొకశబ్దము ఆకాశమునుండి వినవచ్చెను. ఇచ్చట ఆకాశము తెరువబడినదనగా - బ్రహ్మరంధ్రము తెరవ బడెననిగాని, హృదయగ్రంథులు భేదింపబడినవనిగాని, ఆత్మయొక్క ప్రతిబంధములు

భగ్నము లైనవనిగాని గ్రహించవలయును.

శ్రీ యేసుక్రీస్తుగారికి అంతవఱకు నెంతో ప్రభావము గల్గియుండినను, గురూపదేశము నొందినప్పుడే పూర్ణప్రజ్ఞయు, ప్రబోధబ్రహ్మ సాక్షాత్కారమున్ను గల్గినవని దీనివల్ల మనము గ్రహించుకొనవచ్చును. ప్రపంచములో గల ముఖ్య మతములు నాల్గు. అవి - 1. సనాతనమగు హిందూ మతము, 2. బౌద్ధ మతము, 3. క్రీస్తు మతము, 4. మహమ్మదు మతము. ఇప్పుడు ఈ మతకర్తలందరున్ను వారి వారి గురు పరంపర ననుసరించిన వారలని మనకు చక్కగ తెలియడమైనది. హిందువులకు అనాదినుండి యిది మామూలుగా నుండునని అందరికిన్ని తెలిసిన విషయమే. అయినను ఒక్కొక్కరిని ప్రత్యేక ప్రత్యేకముగా తెలుసుకొన తలంపు గలవారికి శ్రీ జగద్గురువగు శ్రీ శంకరభ గవత్పాదాచార్యులనుండి వరుసగ ముఖ్యులగు భారతదేశమతకర్తల గురూపదేశ విషయమైన సంగతి మాత్రము సంగ్రహముగ ఈ క్రింద వ్రాయబడును. మన సనాతనమగు వేదమతానుయాయులగు ఋషుల పరంపర ననుసరించి గురు శిష్య సంప్రదాయముగ స్థాపనములు అనగా మఠములు, ప్రార్థనామందిరములు, అధ్యాత్మ బోధనాలయములు శ్రీబుద్ధదేవుడున్ను, శ్రీమహమ్మదు నబియు, శ్రీ యేసుక్రీస్తున్ను స్థాపించుటలో బ్రహ్మవిద్య గురుముఖముగా ఆచరణలో నుంచవలసినదని స్పష్టమగుచున్నది. మహాత్ములగు గురువుల సహాయములేకనే యీశ్వరప్రాప్తి పొందవచ్చునని యేర్పాటుండినచో నీ ముగ్గురు ప్రవక్తలున్ను అట్టి సంప్రదాయ పద్ధతి నేర్పాటు చేసియుండరు.

ఈముగ్గురు మతస్థులున్ను, కొన్ని మతసంప్రదాయ పద్ధతులు, ప్రార్థనా నియమములు, సన్న్యాస క్రమములు ఏర్పాటు చేసుకొనియున్నారు. ఇది చరిత్రకారుల కందఱకును తెలిసిన విషయమే. భారతీయ మతానుయాయులవలె బాహ్యకృత్యములలో మాత్రమేగాక, అంతరంగమైన సాధనలలోను, అనుష్ఠానములోను, అభ్యాసములోను, మంత్రజపస్మరణలోను, ధ్యాన ధారణ సమాధి విషయములోను ప్రత్యేకముగ నేర్పాటు గలదు. ఈశ్వరాంశులై లోకోద్ధారకులైన ప్రవక్తలే యిట్లు ఏర్పాటు చేసిరేగాని ఇవి సామాన్యులచే

నేర్పడినవి గావు.

పైజెప్పిన మూడు మతస్థులలో తురీయాశ్రమములో ప్రవేశించునప్పుడు హిందూమతములోగల యోగసత్తముల యతివర్యుల రీతిగానే సంపూర్ణ విముక్తి గల్గియుండవలెనను నియమము గలదు. అంతేగాక, గృహస్థాశ్రమ ముతో సంబంధములేక, విజనస్థలములో ప్రత్యేకాశ్రమము లేర్పరచి, ఆత్మ జ్ఞానము సంపాదింపవలెననియు, జనులకు బోధించవలెననియు తత్త్వము గలదు. ఇది బౌద్ధ సన్న్యాసులను, కాథలిక్ క్రైస్తవ మతబోధకులను, మహమ్మ దీయతత్త్వ బోధకులను చూచిన గనుగొనవచ్చును. వైరాగ్యము లేనిచో, నెవరికిన్ని ప్రకృతి నుండి విముక్తియు, పరమాత్మ యందైక్యమున్ను గలుగ జాలదు గదా? మోక్షమనెడు కల్పవృక్షమునకు వైరాగ్యము కూకటి వేరు. వేరు చెడిన వృక్షము నశించునట్లు ఎవరికైనను వైరాగ్యములో లోపము గల్గిన పతనము నిక్కువము. దైవభక్తి అట్టి కల్పవృక్షమునకు జలము వంటిది. ఎంత సారవంతమగుభూమి యైనను ఉదకము లేనిచో చెట్టు వృద్ధి నొందనట్లు అనన్యభక్తియను శుద్ధజలము లేనిచో ముక్తి యనెడు కల్పవృక్షము నిలువ జాలదు.

ఇక మతములు - వాటి స్థాపనాచార్యుల గురూపదేశముల గూర్చి తెలిసికొందము.



## అద్వైత మతము

ఈ మతము స్థాపించినవారు శ్రీ శంకరాచార్యులవారు. ఈ మతము శ్రీమన్నారాయణ మూర్త్యాదులవలన గల్గినది.

**నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ ।**
**వ్యాసం శుకం గౌడపాదం మహాన్తం గోవింద యోగీంద్ర**
**మథాస్య శిష్యమ్ ॥**

**శ్రీశంకరాచార్య మథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యమ్ ।**
**తం తోటకం వార్తికకారమన్యా నస్మద్గురూర్ సంతత మానతోఽస్మి ॥**

అనగా శ్రీమన్నారాయణుడు, బ్రహ్మ, వసిష్ఠుడు, శక్తి, పరాశరులు, వ్యాసులు, శుకులు, గౌడపాదులు, గోవిందయోగి, శంకరాచార్యులు, పద్మ పాదులు, హస్తామలకులు, తోటకులు, వార్తికకారులు - ఇట్లు అద్వైత గురు పరంపర చెప్పంబడియున్నది.

భూలోకములో సన్మతము లుడిగి దుర్మతములు వ్యాపించియుండగా, దేవతలు కైలాసమునకుం బోయి పరమశివుని ప్రార్థించిరి. అంత నీశ్వరుడు ప్రసన్నుడై, తానే శంకరుడై యవతరించి, ధర్మమతమును స్థాపన చేసెదనని, దేవతలతో సెలవిచ్చిరి. ఇట్లుండగా కేరళమను మలయాళ దేశమున వృషభా చలమందున పూర్వవాహినీతీరమున శశలమనెడి కాలడి యగ్రహారమున విద్యాధినాధులకు ఒక పురుష సంతతి గలిగెను. ఆ బిడ్డకు శివగురుస్వామి యని నామకరణము చేసిరి. ఆ శివగురువు క్రమక్రమముగా వృద్ధినొంది సకల కళాప్రవీణుడై, మహాపండితుని కుమార్తెయైన ఆర్యాంబను పెండ్లాడెను. తర్వాత శివగురుస్వామి సంతానము లేక మిగుల పరితపించుచు పరమేశ్వ రుని గూర్చి తపము చేయుచుండగా, వారికోర్కె దీర్చుటకును, కైలాసవాసుడు లోకోద్ధారణముజేయ నవతరించుటకును తగిన తల్లిదండ్రులు శివగురు స్వామి ఆర్యాంబలని యెంచి వారికి కలియుగము 3058వ సంవత్సరమునకు సరియగు నీశ్వరనామ సంవత్సరము వైశాఖ మాసము శుక్లపక్ష పంచమీ భాను వారము, ఆర్ద్రానక్షత్రమందు భూలోకమం దవతరించిరి.

ఇట్లుండగా కాలడియందు శిశువైన శంకరులవారి తండ్రియైన శివ గురువులు ఈశ్వరలింగమునకు సమర్పించిన బిల్వమాలిక, శంకరులకంఠము నందుండుటం గని లింగమూర్త్యంతర్గతులగు శ్రీ శంకరస్వామియే యీ శిశు వని తెలుసుకొనిరి. శంకరులు ఇట్లనేకములగు అద్భుతములను గనుపరచిరి. రెండవసంవత్సరముననే అకారాద్యక్షరముల నుచ్చరించుచు, నెవరేది యడిగి

నను స్వయముగ గంభీర భావముతో సమాధానము చెప్పుచుండిరి. మరియు, లౌకిక వైదిక విద్యల నన్నిటిని మూడవయేట నేర్చిరి. ఆ మూడవ యేటనే శివగురువు శంకరుల కుపనయనము గావించి పరలోకమున కేగిరి. అది మొదలు "భవతి భిక్షాం దేహి" యను వాక్యము చొప్పున భిక్షాన్నమును భుజించుచు, నిత్యకర్మానుష్ఠానముల నెరవేర్చుకొనుచుండిరి. శంకరులు ఏడవ సంవత్సరమునందు పరబ్రహ్మోపాసన చేయుట యందత్యంతాసక్తి గలవారై యుండగా, దుర్వాసమహర్షి చనుదెంచి అష్టాంగయోగాదుల నుపదేశించిరి. తర్వాత ఉపమన్యు, దధీచి, గౌతములు, అగస్త్యులు వచ్చి శంకరులకు సకల విద్యలయొక్క మర్మములను బోధించిరి. ఆర్యాంబ శంకరులకు వివాహము గావింపదలంచి "నా కుమారుడు వివాహంబై సత్పుత్రుని బడయం గలడా?" యని అగస్త్యాది మహర్షులను గూర్చి యడుగగా, అప్పుడగస్త్య మహర్షి ఆర్యాంబను జూచి, "నీ కుమారరత్నము లోకాచార్యులై వెలయగలరుగాని, సంసారబంధమునం దగులుకొన"రనగా, ఆర్యాంబ చింతాక్రాంతురాలై యుండిరి. అంత కొన్నిదినములకు శంకరులు సన్న్యాసమును స్వీకరింప దలంచి తల్లికి విన్నవింప, ఆమె యసమాధాన మొందగా శంకరులు సంసార తాపత్రయ దుఃఖము లన్నియు తల్లితో వివరించిరి. ఇట్లుండగా నొకనాడు నారదుడును, దత్తాత్రేయులును శంకరులకు విష్ణుతత్త్వోపదేశము గావించి చనిరి.

శ్రీశంకరులకు ప్రతినిమిషమున్ను సన్న్యసించు విషయమై అత్యధికమగు తీవ్రతమ భావములు సముద్రపు అలలవలె హృదయములో ఉప్పొంగుచుండెను. అయితే ఏకపుత్రుడు, తల్లి వృద్ధురాలు. కుటుంబములో రెండవ వారెవరును లేరు. ఇట్టి స్థితిలో తల్లికి నచ్చజెప్పి సన్న్యసించుట కుపాయము నూహించుచునే యుండిరి. ఇట్లుండగా ఒకరోజు శంకరులు తన తల్లి తోడ నదికింబోయి స్నానము చేయుచుండగా శంకరుల పాదమును మొసలి పట్టుకొని శిరస్సు మాత్రము నీటిలోనికి ముంచక నదీమధ్యభాగమునకు తీసుకొని పోవుచుండెను. అప్పుడు శంకరులు తల్లింజూచి "అమ్మా! ఇప్పుడు

నేను మొసలి నోటంజిక్కి చావబోయెదను. నా జన్మమున్ను వ్యర్థమై పోవుచున్నది. మీ జన్మమున్ను సార్థకత నొందక నిరర్థకమై పోవుచున్నది గదా! ఒక్కరు సన్న్యసించిన నింతవరకు గతించిన అరువది తరముల పితరులు ఉద్ధరింపబడుదురనియు, రాబోవు అరువది తరులవారు తరింపగలరనియు శాస్త్రము చెప్పుచున్నది. అంతేగాక తల్లియున్ను తల్లివంశీయులున్ను, తండ్రియున్ను తండ్రి గోత్రస్థులున్ను ధన్యత గాంచగలరని శాస్త్రముద్ఘోషించుచున్నది. అయ్యో! అట్టి భాగ్యము మన వంశీయులకు లేకపోయినది గదా! తల్లిదండ్రులగు మీ ఆత్మలకున్ను శాంతి గలుగకపోయె. నాజన్మమున్ను నిరర్థకమయ్యె''అని ఇట్లు చెప్పుచూ, "అమ్మా! నేను వృషభాచలేశ్వర వరప్రసాదముచే గలిగినవాడనని మీరు చెప్పినది వినియుంటిని గాన ఇప్పుడైన ఆ దేవుని ప్రార్థన జేసి బ్రతికినచో, సన్న్యాసమున కనుమతి నిమ్మని మ్రొక్కుకొనుము. ఈ సమయముననైన నాకు సన్న్యసించుట కనుమతి నొసంగుము" అనగా తల్లి ఏమియుం దోచక "ఆలాగున దేవుని కృపచే నీవు జీవించిన సన్న్యసించియైన బ్రతుకుము''అని దీవించెను. అప్పుడు వెంటనే ఆ గొప్పమకరి యేమియు నపాయము గలుగచేయక శ్రీశంకరులను నదియొడ్డుకు తీసుకొనివచ్చి విడిచిపెట్టెను. వెంటనే ఆ మొసలి దివ్యదేహమును ధరించి, శంకరాచార్యుని స్తుతించి ఇట్లనియెను :- "స్వామీ! నేను సురగ్రాహియను పేరుగల గంధర్వుడను. నారదుని శాపమువలన మొసలి నైతిని. ఇప్పుడు నా శాపవిమోచనంబయ్యె''నని వచించి గంధర్వ లోకమునకుం జనెను.

వెంటనే శ్రీశంకరులు ఆత్మసన్న్యాసము చేసుకొని, లోకసంచారము కొరకు వెడల ప్రారంభించినప్పుడు, పుత్రశోకము సహింపలేక తల్లి నివారింప జూచినను "చెప్పిన మాటను నిర్వహించుట బ్రాహ్మణులగు మన ధర్మము. ఇక మీరు నా దైవమార్గమున కడ్డుపడకూడదు. అంత్యకాలమున మీ దగ్గర నుండి నీ యాత్మను తరింపజేసెద''నని పలికి ఉత్తరాభిముఖమై ప్రయాణము చేసెను. ఈ మధ్యలో అనేక మహాద్భుతములు శ్రీ శంకరులు ప్రపంచమునకు చూపియున్నారు. అవి శ్రీశంకరవిజయాది గ్రంధములను చదివి అభిలాష

గలవారు తెలుసుకొనవచ్చును. అట్లు పుణ్యాతీర్థములు, పుణ్యాశ్రమములు, పుణ్యక్షేత్రములు దర్శించు కొని తగిన గురువును వెదకుచు ప్రయాణమై పోవుచుండగా, నర్మదానదీ తీరంబున తపంబు చేయుచుండు శ్రీ గోవింద యోగీంద్రులవలన తత్త్వోపదేశ మును బడసినదేగాక, వేదవేదాంత యోగాది విద్యలన్నియు గ్రహించి యోగము మొదలగునవి యభ్యసించుచుండిరి. చాతుర్మాస్యము సమీపించి నంత, నా వ్రతమును నర్మదానదీ తీరమునందే ముగింపనెంచి అచ్చటగల మునిసత్తములతో నా వ్రతమనుష్ఠించుచు, వేదతత్త్వార్థ విచారణచేయుచుండ ఒకనాడు అమితవర్షము కురిసి ప్రవాహ మధికముగావచ్చెను. అచ్చటగల మహాత్ములందరు భయకంపితులైరి. శంకరులు తనకమండలమును భూమి యందుంచినంతనే ప్రవాహజల మంతయు నా కమండలములోనికి ఆకర్షింప బడెను. అప్పుడచ్చటగల యోగీశ్వరులాదిగా గలవారందరును శంకరాచార్యు లను వినుతించిరి.

అచ్చటనుండి గురువువల్ల సన్న్యాసధర్మమును గ్రహించి, శంకరులు అద్వైతమతము ప్రపంచములో బోధించు నిమిత్తమై శ్రీ కాశీపట్టణమున కేగిరి. అచట శాస్త్రార్థము చేయుచుండి సనందాది శిష్యులతో గూడ, నరనారాయణాశ్రమమగు బదరికాశ్రమమే బ్రహ్మసూత్రమును రచించుటకు తగిన స్థలమని తలంచి అచ్చటికివెళ్ళి, ఆ బదరీవనములోనే సూత్రభాష్యము రచించిరి. అప్పటికి శ్రీ శంకరుల వారికి 16వ సంవత్సర మాసన్నమైనది. ఆ సూత్రభాష్యమును భగవత్పాదులు బదరికాశ్రమవాసులగు మునిసత్తములకు వినిపింపగా, వారందరును పరమానందభరితులై అద్వైతామృతమును పానము చేసి ధన్యాత్ములైరి.

అనంతరము పద్మపాదాది శిష్యులతో బదరికాశ్రమమునుండి శ్రీకాశికి రాగా అనేక మతవాదులు శంకరులతో వాదించి, అద్వైతమతమే వేదాంత సిద్ధాంతమని అంగీకరించిన వారలయి శ్రీ శంకరులకు శిష్యులైరి. ఇట్లుండ ఒకనాడు శారీరకమీమాంసాభాష్యమును శంకరులు శిష్యులకు బోధించి శాంతిచేసిన యనంతరము వృద్ధబ్రాహ్మణ రూపముతో వ్యాసులవారు

అచ్చటికి చనుదెంచి బ్రహ్మసూత్రములో కొన్నిటికి తాత్పర్యము చెప్పుడనిరి. శ్రీశంకరులు చెప్పగా వ్యాసులు సంతోషించి నిజస్వరూపమును ధరించినంత శంకరులు స్తుతించిరి. అప్పుడు వ్యాసులు వ్యాఖ్యాన సింహాసనాచార్యాద్యనేక బిరుదముల నొసంగి దీవించిరి. అప్పుడు శంకరులు తమకు ఈశ్వరునిచే నివ్వబడిన 16 సంవత్సరముల జీవితము పూర్తియైనదనియు, నిజస్థానమగు కైలాసమునకు వెళ్ళుచున్నాననియు చెప్పగా, వ్యాసభగవానులు బ్రహ్మదేవుని ధ్యానించి ప్రత్యక్షము చేసుకొని మరియొక్క 16 సంవత్సరముల జీవితము ఆశీర్వదింపచేసెను. అప్పుడు వ్యాసులు "ఓ శంకర యతీంద్రా! నేను రచించిన సూత్ర మింతవరకు బీజరూపముగా నుండెను. మీ భాష్యముచే అది గొప్ప కల్పవృక్షమై పరిణమించినది. ఇది ఆచంద్రతారార్కము భూమియందు వెలయునుగాక" అని ఆశీర్వదించి చనిరి.

తర్వాత శ్రీ శంకరులు జగద్గురువను పేరుతో, శిష్యులతో సహా భరత ఖండ మంతయు సంచరించి కుమతములను ఖండించి పరమాద్వైతమత మును లోకములో స్థాపించెను. శ్రీ శంకరులవారి శిష్యులలో, 1. పద్మపాదులు, 2. హస్తామలకులు, 3. తోటకులు, 4. సురేశ్వరాచార్యులు - వీరు నలుగురు ముఖ్యులు. వీరందరును మతప్రబోధకులై గురువాక్యానుసారముగ జనుల హృదయపరిపక్వత ననుసరించి నిష్కామ కర్మయోగ, భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞానయోగములను ప్రపంచ మంతట బోధించి గురుకృపకు పాత్రులై ధన్యాత్ములైరి.

ఇచ్చట మనము ప్రస్తుతము గ్రహించవలసిన విషయమేమన, శ్రీశంకరులు పరమేశ్వరావతారమని ఆస్తికులందరికిన్ని తెలిసిన విషయమే. అట్టి మహనీయుడు గూడ గోవింద భగవత్పాదుల చరణసేవ చేసికొని వారిని గురువుగా వరించి వారివలన తత్త్వోపదేశమును బొంది బ్రహ్మసాక్షాత్కారము గల్గిన వారైరట. శ్రీ గోవిందభగవత్పాదుల బ్రహ్మోపదేశము గల్గువఱకు భాష్యరచనాశక్తియు, దృఢాపరోక్ష సాక్షాత్ప్రబోధమున్ను గల్గియుండలేదనియు, గురూపదేశమైన తర్వాతనే వారికట్టి శక్తులు గల్గెనని మనము గ్రహించవలెను.

## శ్రీ విశిష్టాద్వైత మతము

ఈ మతమును స్థాపించినవారు శ్రీ రామానుజాచార్యులవారు. ఈ మతమునకు శ్రీసంప్రదాయమనియు, ఆధ్యాత్మ సంప్రదాయ మనియును పేర్లు గలవు. ఈ సంప్రదాయము ఆదియందు శ్రీమన్నారాయణమూర్తివలన నియమింపబడి శిష్యపరంపరగా వ్యాప్తమయ్యెనని చెప్పుదురు.

**అస్మద్దేశిక మస్మదీయ పరమాచార్యానశేషాన్ గురూన్**
**శ్రీమల్ల లక్ష్మణ యోగిపుంగవ మహాపూర్ణం మునిం యామునమ్**
**రామం పద్మవిలోచనం మునివరం నాథం శఠద్వేషిణం**
**సేనేశం శ్రితమిందిరాసహచరం నారాయణం సంశ్రయే ॥**

ఈ శ్లోకార్థమున అస్మదాచార్యునినుండి నారాయణమూర్తివరకు పరంపర అనుసంధింపబడినది. విశిష్టాద్వైత మతమును శ్రీమన్నారాయణమూర్తి, శ్రీదేవి, విష్వక్సేనులు, శఠకోపమునులు, నాథమునులు, పుండరీకాక్షులు, రామ మిశ్రులు, యామునాచార్యులు, మహాపూర్ణులు, శ్రీరామానుజాచార్యులు ఉద్ధరించిన వారైరి.

ఈ విశిష్టాద్వైత సంప్రదాయకర్త లనేకులు రామానుజులకు పూర్వ మవతరించినను, సంప్రదాయ స్థాపనాచార్యులని జగత్ప్రసిద్ధి నొందినవారు శ్రీరామానుజాచార్యులవారు.



## శ్రీరామానుజాచార్య చరిత్రము

శ్రీవైకుంఠమునందు నారాయణమూర్తి చింతతో నుండగా ఆదిశేషులు స్వామిని జూచి దేవరవారిట్లుండుటకు కారణమేమన? నారాయణమూర్తి యిట్లనియెను. "విష్వక్సేనాదులగు నిత్యసూరులు పరమభాగవతులు ఇప్పటికి భూలోకములో అనేకు లవతరించియు, చేతనాకోట్లను సంపూర్ణముగా పరిశుద్ధులనొనర్చి మత్సాయుజ్యమున కర్హులను చేయజాలకపోయిరి. ఇప్పుడు

నీవవతరించి లోకము నుజ్జీవించునట్లు చేయవలయును" అనగా, ఆదిశేషులు స్వామివారి యాజ్ఞప్రకార మవతరించెదనని విన్నవించి, మాతాపితరు లెవరు తగినవారని ఆలోచించుచుండిరి. ఇట్లుండగా, భూతపురమనెడు శ్రీపెరుంబూ దూరియందు హరితసగోత్ర, ఆపస్తంబసూత్ర, యజుశ్శాఖాధ్యాయియు, యజుర్వేదశిక్షా శ్రౌతాది వివరణ గ్రంధకర్తయు నగు, సర్వక్రతు సోమయాజు లను కేశవాచార్యులు తమ ధర్మపత్నియైన కాంతిమతితోడ, పుత్రప్రాప్తికై తిరువల్లిక్కేణికిం జని, సోమోపరాగమున కైరవిణీతీరంబున, స్నానంబుచేసి, పుత్రకామేష్టి చేయగా, పార్థసారథిస్వామి ప్రత్యక్షమై, పుత్రప్రాప్తియగునని వర మిచ్చి యేగినంత ఆ దంపతులు భూతపురంబు చేరిరి.

అనంతరము కాంతిమతీదేవి గర్భంబున ఆదిశేషుల అంశముగ కలి యుగము 4118 సంవత్సరము, పింగళ సంవత్సర చైత్రశుక్ల పంచమి యందా చార్యులవతరించిరి. కాంతిమతి భ్రాతయైన శ్రీశైల పూర్ణులు భూతపురికి వచ్చి వారికి రామానుజాచార్యులని నామమిడిరి. ద్వాత్రింశల్లక్షణములతో గూడిన రామానుజాచార్యులకు కేశవాచార్యులు అన్నప్రాశనాది కర్మల జరిపించి, ఉపనయనము గావించి, 8వ ఏట వేదవేదాంగముల నుపదేశించి 16వ ఏట వివాహము గావించిరి. తరువాత రామానుజాచార్యులవారు విధ్యుక్త ప్రకారము సకలకర్మల నెరవేర్చి, భార్యతో గూడి మాతృ శుశ్రూష చేయుచుండి పూర్వ పక్షాది గ్రంథపరిశోధన చేయదలంచి, కాంచీ పురియందుండు యాదవప్రకా శులవద్ద చదువుచుండగా, యాదవ ప్రకాశుల వారికిన్ని శ్రీరామానుజాచార్యుల కున్ను శాస్త్రార్థములో భిన్నభావము గల్గి, శ్రీరామానుజాచార్యులు విద్యా భ్యాసము నిల్పి శ్రీకంచివరదరాజస్వామి తీర్థ కైంకర్యము చేయుచుండిరి.

ఇట్లు రామానుజాచార్యులు యాదవప్రకాశుల వారి వద్ద విద్యాభ్యాసము విరమించిన సంగతి యామునాచార్యులవారు తెలుసుకొని తాము రచించిన స్తోత్రమును మహాపూర్ణుని చేతికిచ్చి దీనింజూపి రామానుజాచార్యులవారిని పిలుచుకొనిరమ్మని పంపగా మహాపూర్ణులు కంచికిపోయి యాస్తోత్రరత్న మును అనుసంధింపగా రామానుజులు విని, ఆశ్చర్యమునొంది, మహాపూర్ణు

లతో నీ స్తోత్రరత్నము ఎవరు రచించిరని యడుగ, వారు యామునాచార్య విరచితంబని యెరిగింప తోడనే వారి దర్శనార్థమై మహాపూర్ణులతోడ శ్రీరంగమునకు వేంచేసిరి. అక్కడ కావేరీతటంబున వైష్ణవులు వ్యసనాక్రాంతులైయుండంగని కారణంబడుగగా, యామునాచార్యులు పరమపదము నొందిరని చెప్పిరి. అంత రామానుజాచార్యులవారు దుఃఖముతో గూడిన హృదయము గలవారై కొంతవడికి వారి చరమవిగ్రహమైన దర్శింపవలెనని తలంచి, ఆ చరమవిగ్రహమును సేవింపగా, వారి చేతివ్రేళ్ళు మూడుమాత్రము ముడుచుకొని యుండంగని, అచ్చటివారినింజూచి, యిట్లెప్పుడు నుండుట గలదా యనగా వారిప్పుడే యిట్లున్నదని యనిరి. అప్పుడాచార్యులు యామునాచార్యులవారికి కోరిక లేవైన గలవా యని యడిగిరి.

అప్పుడు వైష్ణవులు యామునాచార్యులు పరాశరుల ప్రభావమును వెలిబుచ్చవలయుననియు, బ్రహ్మసూత్రమునకు భాష్యము చేయవలయుననియు తిరువాయ్‌మొళికి వ్యాఖ్యానము వ్రాయవలయుననియు తలంచి యుండిరనిరి. ఆ మీద రామానుజులు ఈ మూడు కార్యములను ఆచార్య కటాక్షముచే నేనే నెరవేర్చెదననిరి. అంత నావ్రేళ్ళు ఎప్పటి యట్లే సాగియుండెను. అప్పుడావైష్ణవులందరున్ను దేవరవారే దర్శనోద్ధారకు లగుదురు గాక యని మంగళాశాసనము చేసిరి.

అచ్చటనుండి కాంచీపురము వచ్చి రామానుజులు యథాప్రకారము భగవత్కైంకర్యము చేయుచుండిరి. ఇట్లుండ నొకనాడు వారు కాంచీపూర్ణులను జూచి దేవరవారు దాసునిగృంహబున భుజించి శేషమును కృపచేయవలెనని ప్రార్థింపగా, కాంచీపూర్ణులు సమ్మతించి అట్లే రామానుజులవారి గృహమునకుం జని భుజించిరి. ఇంతలో రామానుజులవారి పత్ని, గృహంబంతయు శుద్ధిచేసి స్నానము గావించుచుండగా భార్యను జూచి యిట్లేల చేయుచున్నావన? అన్యజాతివాడైన కాంచీపూర్ణుడు భుజించిన కారణమున చేయుచున్నాను అని చెప్ప రామానుజులు చాలా దుఃఖాక్రాంతులై, తమ యిష్టసిద్ధిగాక పోయినందులకై చింతనొంది కాంచీపూర్ణుల కడకుంజని తన యిష్టసిద్ధి గాకపోయి

నందులకు చాల పరితాపము నొందిరి.

దీనివల్లనే శ్రీరామానుజుల వారి నిరభిమానమున్ను, పరమభక్తియు లోకము తెలుసుకొనవచ్చును. అనగా కాంచీపూర్ణులు నాల్గవవర్ణములో చేరిన వారు. అయితే పరమ భాగవతోత్తములు, భక్తాగ్రగణ్యులు. శ్రీరామానుజుల వారి మనస్సు భక్తివిషయములో లగ్నమై యుండెనేగాని కులముపై నుండ లేదు. భార్య హృదయము భగవద్భక్తికి దూరమై దృశ్యమైన వర్ణాశ్రమములపై నుండెను. మరియొక రోజున రామానుజాచార్యులవారి యింటికి వైష్ణవుడొకడు వచ్చి ప్రసాద మిప్పింపుడని యడుగ, వారిపత్ని ప్రసాదముండియు శ్రీరామాను జులు అన్నము పెట్టుట కాజ్ఞాపించియు, పెట్టక తన అమ్మగారి యింటనుండి తన్ను పిలుచుకొని పోవుటకు వచ్చియుండు పనివానికి పెట్టి భగవద్భక్తునితో లేదని చెప్పెను. ఇదే మంచి తరుణమని తలంచి సంతోషముతో భార్యను పుట్టింటికి బంపివేసి యిట్టి పత్నివలన మహాపాతకము గల్గునని తలంచి రామా నుజులు సర్వసంగ పరిత్యాగియై గృహమును వదలి, శ్రీరంగములో నివసించి యుండు మహాపూర్ణులవద్ద సమాశ్రయమును పొందిరి. ఈ తరుణములోనే కాంచీపురములో యత్యాశ్రమమును స్వీకరించిరి. రామానుజాచార్యులవారు వివాహము చేసుకొన్నను, స్వల్పకాలము మాత్రమే గృహస్థధర్మములో నుండిరేగాని, సంతానోత్పత్తి యేమిన్ని గల్గియుండలేదు. భార్య యూరుదాటిన వెంటనే గృహమును అగ్నిహోత్రునికి సమర్పించిరనియు చెప్పుచుందురు. తర్వాత రామానుజాచార్యులవారు మహాపూర్ణులతో రహస్యార్థముల నుపదే శింపుడని ప్రార్థింపగా వారు కొన్నింటి నుపదేశించి మిగిలినవి యుపదేశించు టకు తిరుక్కోటియూరు గోష్ఠీపూర్ణు లధికారులని తెలియచేసిరి.

అంత రామానుజులు తిరుక్కోటి యూరికింబోయి గోష్ఠీపూర్ణులకు దండమును సమర్పించి తమ యభీష్టమును విన్నవించిరి. గోష్ఠీపూర్ణులు రామా నుజుల యధ్యవసాయమును పరీక్ష జేయనెంచి, మొగమిచ్చి మాటలాడకుం డిరి. ఆ కారణ మెరుంగకయే రామానుజులు మఱల శ్రీరంగమునకు విచ్చే సిరి. గోష్ఠీపూర్ణులు శ్రీరంగమునకు వచ్చినపుడు రంగనాథులు సాక్షాత్కరించి

వారితో యతిరాజులకు మంత్రార్థము నుపదేశించుడని నియమించిరి. కాని యతిరాజులు పదునేడుమారులు తిరుక్కోటియూరికి పోయి తిరుమంత్రార్థో పదేశమును పొందకయే వచ్చుచుండిరి.

ఇచ్చట మనము గ్రహించవలసిన పరమ రహస్యమొకటి గలదు. అదే మన, సాక్షాత్ భగవంతుడగు రంగనాథస్వామి పరమ భాగవతోత్తముడున్ను, ఆదిశేషుని అవతారమూర్తియు నగు రామానుజాచార్యులకు స్వయముగా మంత్రోపదేశము చేయక భక్తాగ్రణియగు గోష్ఠీపూర్ణులతో రామానుజాచార్యుల కుపదేశింపుడని సెలవిచ్చి రట! ఇందువల్ల గురువు అవసరమా? అనవసరమా? యను తత్త్వమును జనులు దెలియగలరు.

మరియొకమారు రామానుజులు, గోష్ఠీపూర్ణుల శిష్యులను జూచి తమ యభీష్టమును నెరవేర్చి రక్షింపవలసినట్లు వారి కెరిగింపుడని వేడిరి. ఆ మీద గోష్ఠీపూర్ణులు హర్షమొంది త్రిదండ పవిత్రములతో రావలసినదని యతి రాజులకు తెలియజేయగా రామానుజులవారు త్రిదండతుల్యులగు దాశరథుల తోడను, పవిత్రతుల్యులగు కూరేశులతోడను జనగా, గోష్ఠీపూర్ణులు చరమార్థ రహస్యోపదేశము నొనర్చి దీనిని నితరుల కెరుక చేసినచో దుర్గతి గల్గునని చెప్పిరి. శ్రీరామానుజులు పరమానందభరితులై తిరిగి వచ్చుచుండు దోవలో తిరుకొట్టయూరు గోపురమెక్కి మహాగుప్తమైన ఈచరమార్థమువలన లోకు లెల్లరు నుజ్జీవింప వలసియుండగా దీనిని ఇతరుల కెరింగింపకపోయినచో, లోకోపకారము కానేరదనియు, దాసుడొక్కడు దుర్గతిపాలైనను లోకులందరు నుజ్జీవించుటయే యిష్టమనియు తలంచి రహస్యార్థ మంత్రమును సర్వజను లకు బోధించిరి.

ఈ సంగతి వెంటనే గురువులవారికి తెలియగా వారు రామానుజుల వారిని రప్పించి అడిగిరి. "దాసుడొకడు గురుద్రోహమునకు పాత్రుడై నరకము నొందినను ఈ చేతనాకోట్లు భగవత్సాయుజ్యమును బొంది ముక్తులగుదురు గదా! యని తలంచి యిట్టి సాహసకృత్యము చేసితిని" అని ఆయన చెప్పగా అప్పుడు గోష్ఠీపూర్ణులు, యతిరాజుల గుణమునకు మెచ్చి 'మన్నాథా'యని

పిలిచి తక్కిన రహస్యార్థములను మఱల నుపదేశించెదనని చెప్పి పొమ్మనిరి. మఱల కొన్నాళ్లకు యతిరాజులు గోష్ఠీపూర్ణులయొద్ద తక్కిన రహస్యార్థములను గ్రహించిరి.

ఇచ్చట మరియొక రహస్యము గలదు. శ్రీరంగనాధస్వాములు గోష్ఠీపూర్ణులతో రామానుజులవారికి తిరుమంత్రోపదేశముచేయుట కాజ్ఞాపించినను 18సార్లు రామానుజులు గురువు నొద్దకు వెళ్ళినను, శిష్యపరీక్ష చేయ తలంచిన గురువుయొక్క మహిమయెటువంటిదో, 17సార్లు మఱల మఱల తిరుగ పంపివేసినను విసుగుచెందక, మఱల మఱల గురువునొద్దకు వెళ్ళిన శ్రీరామానుజులవారి భక్తివిశ్వాసము లెటువంటివో తెలుసుకొనవచ్చును. రామానుజుల వంటి మహాపురుషులే గురుకరుణ కొఱకు ఇంత శ్రమపడియుండగా సాధారణ జనులెంత భక్తి గల్గియుండవలెనో తెలుసుకొనవచ్చును.

తిరుమంత్రోపదేశమైన తర్వాతనే రామానుజాచార్యులకు ప్రబోధజ్ఞానమున్ను, భాష్యరచనాది మహిమయున్ను, మతోద్ధారక శక్తియున్ను గల్గినది. శ్రీ రామానుజాచార్యులు జన్మించినప్పుడున్ను తదితర సమయములలోను అనేక అద్భుత మహిమలు గల్గియుండెను. అట్టికాలములో చోళదేశమున శైవ ప్రచారమధికముగ నుండుటచే రామానుజుల వారు వైష్ణవమతమును నెలకొల్పుటకవకాశములేక పోయినదేగాక శివభక్తిపరుడగు చోళరాజున్ను శైవమత ప్రచారకులగు శివాచార్యులున్ను, రామానుజులవారికి చాల యిబ్బందులు కలుగజేసిరి. ద్రావిడదేశములో నివసించుటకు గూడ అనుకూలములేని స్థితి గల్గించినందుచే రామానుజులున్ను, ముఖ్యశిష్యులున్ను మైసూరు దేశమున కేగి తిరునారాయణపురమున పంద్రెండు సంవత్సరముల కాలము గడిపిరి. అప్పటికి చోళమహారాజు నిర్యాణమైన సంగతి తెలుసుకొని, మఱల ద్రవిడదేశములో మతప్రచారము సలిపి, తన దివ్యజీవితమంతయు శ్రీరంగములో గడిపిరి. దీని మధ్యకాలములో భరతఖండమంతయు సంచరించి విశిష్టాద్వైత మతమును బోధించుచుండిరి. శైవమతస్థులు అప్పుడు రామానుజాచార్యులకున్ను, తదనుయాయులకున్ను గలుగచేసిన ద్రోహముచే కాబోలు! శ్రీవైష్ణవ

సంప్రదాయములలో కొందరికి శైవమందును, శివభక్తులయందును ద్వేషము గల్గినదని తోచుచున్నది. శ్రీరామానుజులు పరమైకాంత భక్తికి ఆధిక్య మిచ్చిరి. ప్రపత్తివల్లనే జీవులకు వైకుంఠప్రాప్తిగల్గునని ఉపదేశించిరి. ఇది పరమభక్తి మతము తక్కుంగల విషయములు శ్రీరామానుజుల వారి జీవితచరిత్రములో విస్తారముగ గనందగును.



## ద్వైతమతము

ద్వైతమతము స్థాపించిన వారు మధ్వాచార్యులు. వీరికి పూర్ణప్రజ్ఞులని యొకపేరు గలదు. కాన నీ మతమును పూర్ణప్రజ్ఞమతమనియు, మధ్వమత మనియును, తత్త్వవాదిమత మనియును, బ్రహ్మవాది మతమనియును చెప్పుదురు.



## శ్రీ మధ్వాచార్య చరిత్రము

భూలోకమున శ్రీశంకరులు బోధించిన అద్వైతమతమునకున్ను, శ్రీరామానుజు లుపదేశించిన భక్తిమతమునకున్ను తగిన అర్హతగల జీవులు లేకపోవుటచే జ్ఞానమునుండియు, పరమైకాంతభక్తినుండియు మరలిన జనులు లోకములో నిండిపోవుటచేతను, శుష్కవేదాంతులు వృద్ధినొందుట చేతను, దైవభక్తి, జీవకారుణ్యము, తపస్సు, యోగాభ్యాసము మొదలైన దైవ గుణములు నశించిపోవుటచేతను అత్తరి లోకోద్ధారకులగు నొక్క మహాపురు షుడు భూలోకములో కావలసివచ్చెను. ఆ తరుణములో దుర్మతములు ప్రబలి వేదవేదాంతముల కపార్థము కల్పించి లోకమును నాశము చేయునట్టి కాలమున బ్రహ్మాదిదేవతలు శ్రీహరితో మొరపెట్టగా, శ్రీహరి లోకోద్ధారక పురుషు డెవడని తలంచి, వాయుదేవుని పిలిచి భూమియందవతరించి వేద వేదాంతముల విజ్ఞానార్థమును బోధించి లోకులను తరింపజేయవలసినదని

యనుజ్ఞ నొసంగెను.

ఇట్లుండగా, కర్ణాటకదేశమున రజతపీఠపురములో జేరిన, శివరూప్య మనెడు పాజిక గ్రామమున వసించు మధ్యగేహభట్టు అను బ్రాహ్మణుడు సకలవిద్యాపారంగతుడై, వేదవతియనుకన్యకను వివాహముచేసుకొని ధర్మము తప్పక కర్మములను జేయుచు, వేదముయొక్క నిజార్థమును బోధించుట కెవ రవతరింతురోయని చింతించుచు, భార్యాసహితముగ ఉడిపికిబోయి అనంతే శ్వరస్వామి సన్నిధియందు, పండ్రెండేండ్లు నివసించి పాలనుమాత్రము స్వీకరిం చుచు, సత్పుత్రుని కృపచేయుమని ప్రార్థించుచుండగా కొంతకాలమునకు వేదవతి గర్భమును దాల్చిన మీద స్వామి యానతిం బడసి స్వగృహమునకు బోయెను. అనంతరము క్రీస్తుశకము 1119 విళంబినామ సంవత్సరము ఆషాఢ బహుళ చతుర్దశియందు వాయుమూర్తి వేదవతి గర్భమునుండి జనించెను. ఇట్లవతరించిన వాయుమూర్తికి మధ్య గేహభట్టు వాసుదేవాచార్యులని నామకర ణము గావించిరి.

వీరికిన్ని చిన్నతనములోనుండి అమానుషికములగు ననేక మహిమలు గన్పట్టుచుండెను. మధ్యగేహభట్టు వీరికి విధి ప్రకారము ఉపనయనమును గావించిరి. ఆచార్యులు క్రమక్రమముగా, బ్రహ్మచర్యవ్రతము నిర్వహించు చుండిరి. వాసుదేవాచార్యులవారు సహపాఠకులతో గూడి వేదాధ్యయనము చేయుచుండగా, ఉపాధ్యాయులు ఆచార్యులను జూచి నీవు చదువక కాలము గడుపుచున్నావని నిందించిరి. ఉపాధ్యాయుల మనస్సు రంజిల్లునట్లు వారు అనేక వేదాంతరహస్యవిషయములను చెప్పగా ఉపాధ్యాయులుమొదలగువారు సంతోషించిరి. గురువునొద్ద అతిత్వరితముగ వేదవేదాంగములను గ్రహించిన వారై వాసుదేవాచార్యులు తమ అవతారవిషయమును తలంచి సన్న్యాసాశ్ర మము నవలంబించుటకు నిశ్చయించి గురువును వెదకుటకై బయలుదేరిరి. ఇట్లుండ అతివైరాగ్య శీలురగు అచ్యుత ప్రేక్షులను యతీశ్వరులొకరు హస్తినా వతియందు నివసించుచుండి అచ్చోటు బాసి ఉడిపికి వచ్చి స్వామిని సేవించుచుండిరి. అప్పుడొకరిపై అనంతేశ్వరస్వామి ఆవేశమై అచ్యుతప్రేక్షాచా

ర్యులంజూచి కాలాంతరమున నీయొద్దకు వచ్చుచున్నట్టి శిష్యునివలన నా నిజస్వరూపము నెరుంగుము అని చెప్పిన మాటను విని వారు సంతోషించు చుండగా, వాసుదేవాచార్యులు అచ్యుతప్రేక్షాచార్యుల కడకుంజని సన్న్యాసము నొసంగునట్లు ప్రార్థించిరి.

అప్పుడు మధ్యగేహభట్టును, వేదవతియును పుత్రశోకమునకు చింతింపగా తల్లిదండ్రుల వ్యసనమును జూచి, అచ్యుతప్రేక్షాచార్యులు వాసుదేవాచార్యులతో నీవిప్పుడు సన్న్యాసము గైకొనవలదు అనిచెప్పి వేత్రవతీనదీ తీరమునందుండు మఠమునకుం బోయిరి. అంత ఆచార్యులును, ఆ మఠమునకుం బోయి అచ్చోట గల యతులకు నమస్కరించుటను గాంచి అచ్యుతప్రేక్షాచార్యులు ఆ నమస్కార లక్షణమును దెలుసుకొనిరి. అప్పుడొకరిపై స్వామి ఆవేశమై అచ్యుతప్రేక్షాచార్యులంజూచి నీకు తగిన శిష్యుడైన పూర్ణప్రజ్ఞ నిచ్చితినిగైకొనుమని చెప్పెను. అనంతరము వాసుదేవాచార్యులు తల్లిదండ్రుల నూరడించి మీకు నేటికి 315వ దినము ఉదయమున సింహలగ్నమందు దీర్ఘాయుష్మంతుడగు కుమారుడు గలుగ బోవుచున్నాడు. వాడు కలిగిన తర్వాత నేను సన్న్యాసము స్వీకరించెదనని చెప్పిరి. ఆలాగే వారికి నొక కుమారుడు పుట్టగా అతనికి విష్ణుతీర్థులని నామకరణము గావించిరి. అటుతర్వాత వాసుదేవాచార్యులు యత్యాశ్రమము స్వీకరించి వేదాంతోపదేశము చేయుచుండగా అద్వైతులు మొదలగు వారందరు వచ్చి వినుచుండిరి.

మఱియొకప్పుడు తమగురువు భాగవతపాఠము చెప్పుచుండగా యుక్తియుక్తముగా, వేదవ్యాస హృదయమును బోధించుచుండిరి. ఆ తర్వాత బ్రహ్మమీమాంసాశాస్త్రమును శిష్యులకుబోధించునట్లు అచ్యుతప్రేక్షాచార్యులు వాసుదేవాచార్యులను నియమించిరి. అట్టి కాలములో అనేక మతస్థులు వాదమునకు వచ్చుచుండిరి. వారి వాదము లన్నిటిని పూర్వపక్షముచేసి వేదము యొక్క రహస్యము విష్ణుపరత్వమని ఉపదేశించుచుండిరి. అత్తరి వయోవృద్ధులైన లికుచాన్వయ బ్రాహ్మణ యతిశ్రేష్ఠు లొకరు మధ్వాచార్యులను జూచి, బ్రహ్మసూత్రముయొక్క నిజార్థమును తెలుపుడనగా, బ్రహ్మసూత్రమునకు

వ్యాఖ్యానము రచించిరి. తర్వాత అచ్యుతప్రేక్షాచార్యులతోడ దేశ సంచారార్థమై బయలుదేరి అనంతశయనము, రామేశ్వరము, శ్రీరంగము మొదలగు దక్షిణ దేశయాత్ర లన్నియు సేవించి అచ్చటచ్చట తనయొక్క మతమును ప్రచారముచేసి, వాదనకు వచ్చినవారిని, పూర్వపక్షము గావించి పండితులచేత సర్వజ్ఞులను బిరుదు వహించి ఉడిపిక్షేత్రము వచ్చి చేరిరి. తరువాత మధ్వాచార్యులు వేదముయొక్క వ్యాకులత్వము సహించనివారై శిష్యులతోడ 17వ యేట బదరికాశ్రమమునకుంబోవ నిశ్చయించి గీతాభాష్యమును రచియించి ప్రయాణమై బయలుదేరి బదరికాశ్రమమునందలి నారాయణాశ్రమమునకు బోయి గీతాభాష్యమును సమర్పించి నమస్కరించి పఠించగా నారాయణ స్వామి సంతోషించెను.

అనంతరము మధ్వాచార్యులు బదరికాశ్రమమున నుండు అనంతమఠమున నివసించి, అనశనవ్రతమును కాష్ఠమౌనముతో నిర్వహించిరి. తరువాత వ్యాసభగవానులు మధ్వాచార్యులను మానససరస్సునందుండు తమమఠమునకు వచ్చునట్లు చేయగా, అట్లే వ్యాసులవారి ఆశ్రమమునకు పోవుటకు నిశ్చయించిరి. ఆ శిష్యులలో సత్యతీర్థులను వారు మాత్రము ఆచార్య విశ్లేషమునకు సహింపక వెంబడించిరి. మధ్వాచార్యులు వాయ్వంశసంభూతులు గనుక ఒక గుట్టపై అడుగునుంచి, మఱియొక గుట్టపై వేరొక యడుగు నుంచుచు పోవుచుండిరి. సత్యతీర్థులకు గురువులవెంట నంటిపోవుటకు శక్యము గాక, మఱలి అనంతమఠము వచ్చిచేరిరి. మధ్వాచార్యులు వ్యాసులవారి యాశ్రమమునకు పోగా అచ్చటనుండు ఋషులెల్లరును ఎదుర్కొని సమ్మానించిరి. మధ్వాచార్యులు వ్యాసుల వారికి నమస్కృతు లొనర్పగా వ్యాసులు తమ రెండు చేతులతో నెత్తి యాలింగనము చేసుకొని యుక్తాసనమున గూర్చుండం జేసిరి.

తరువాత మధ్వాచార్యులు తాము రచించిన బ్రహ్మసూత్ర భాష్యము సమర్పించగా వ్యాసులవారు చూచి సంతోషించిరి. అనంతరము మధ్వాచార్యులు ఋగ్వేదభాష్యము, తత్త్వవివేకము మొదలగు 37 గ్రంధములను రచించి వ్యాసులకు వినిపించి వారొసంగిన 8 సాలగ్రామములలో 6 సుబ్రహ్మ

ణ్యమునందును, ఒకటి ఉడిపియందును, వేరొకటి మధ్యతాలమునందు ప్రతిష్ఠ చేసినదేగాక ద్వారకానగరమునుండి వచ్చిన యోడయందు లభించిన శ్రీకృష్ణ విగ్రహమును గ్రహించి, ఆవిగ్రహమున కలదియున్న గోపీచందన మునుగైకొని ఆకృష్ణవిగ్రహమును ఉడిపియందు ప్రతిష్ఠజేసి తమ గ్రంథము లకు వ్యాఖ్యానముచేయునట్లు జయతీర్థులనెడి తమశిష్యుల కనుజ్ఞ నొసంగి పద్మనాభతీర్థులు, నరహరితీర్థులు, మాధతీర్థులు, అక్షోభ్యతీర్థులను నలు గురు శిష్యులను ద్వైతసంప్రదాయప్రవక్తులనుగా నియమించి, డెబ్బదియేడు సంవత్సరములు, ఆరునెలలు, ఇరువది దినములు స్వసంప్రదాయస్థానము నధిరోహించి తర్వాత పద్మనాభతీర్థులకు తమస్థానము పట్టాభిషేకము చేసి, మఱల బదరికాశ్రమముకుం బోయి వ్యాసాది మహర్షులతోడ సద్గ్రంథ కాల క్షేపము చేయుచు మధ్వసిద్ధాంతము భూలోకమున వృద్ధియగునట్లు భగవం తుని ప్రార్థించుచున్నట్లు తన్మతస్థులు చెప్పుచున్నారు.

శ్రీ శంకరులుగూడ నీలాగున తమయొక్క ముప్పదిరెండు సంవత్స రములలో బదరికాశ్రమప్రాంతములో నుండు దత్తాత్రేయగుహలో అంతర్ధా నులై నందికేశ్వరారూఢులై శివగణములతో పరివేష్టితులై కైలాసమునకు వేంచేసినట్లు తత్సంప్రదాయకులు చెప్పుచున్నారు. భరతఖండములో ముఖ్య తమములగు అద్వైత, విశిష్టాద్వైత ద్వైతమతములకు శ్రీశంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు, శ్రీమధ్వాచార్యులు వరుసగ సంప్రదాయగురువులు. వీరే మూడుమతముల నుద్ధరించిన వారలు, లోకములో స్థాపించినవారలు, తత్తత్సంప్రదాయ మఠముల ప్రతిష్ఠించినవారలు. ప్రపంచములోగల నాస్తిక మతములు తప్ప తక్కిన మతములన్నియు నీ మూడు మతములలో అంతర్భూతములే.

ఇచ్చట పాఠకులగు జిజ్ఞాసులకొక సందేహము గల్గుట కవకాశము గలదు. అదేమన? ప్రపంచములో, దుర్మతములు వృద్ధియై సన్మతములు క్షయించునప్పుడే దేవతలు కైలాసమున పరమేశ్వరుని ప్రార్థించినందుచే నీశ్వ రాంశ సంభూతులై శంకరాచార్యులు అవతరించి మతస్థాపన చేసిరనియు,

మఱల వేదార్థములకు విరుద్ధార్థమును కల్పించి దుర్మతములు వృద్ధియై సన్మ తములు క్షయించగా బ్రహ్మాది వేల్పులు శ్రీవైకుంఠములో శ్రీమన్నారాయణ మూర్తిని ప్రార్థించగా ఆదిశేషాంశసంభూతులై రామానుజు లవతరించి దుర్మ తములనణచి సన్మతమును స్థాపించిరనియు, ఆవల దుష్టమతములు చెలరేగి శిష్టమతములు క్షయము నొందగా చతుర్ముఖాది బృందారక బృందము శ్రీమన్నారాయణుని స్తోత్రము చేయగా వాయ్వంశ సంభూతులై మధ్వు లవత రించి వేదముయొక్క అపార్థమును తొలగించి సత్యార్థమును బోధించిరనియు చెప్పుచున్నారు. ఇందువల్ల భక్తులు సందేహపడనక్కరలేదు. ఎందుకనగా? ఈ మతత్రయాచార్యులు ఒకే కాలమున నుద్భవించిన వారు కారు. శ్రీ శంకరుల తరువాత వందలకొలది సంవత్సరము లావల రామానుజాచార్యులున్ను, తర్వాత నూర్లకొలది సంవత్సరానంతరమున మధ్వాచార్యులును అవతరించిరి.

పూర్వ పూర్వము వచ్చిన మహాపురుషుల శిష్య ప్రశిష్యులుండు వఱకు ఆయామతము మంచిస్థితిలో నుండెను. తర్వాత తత్తత్సంప్రదాయములలో యోగ్యులగు యోగిపుంగవులు, తపోనిష్ఠులు, ధ్యానపరులు, జ్ఞాననిష్ఠులు తగ్గిపోయి యుండవచ్చును. అప్పుడు ఆయా సంప్రదాయములలో ఆచరణ లోపించవచ్చును. అందువల్ల దానిని శుద్ధపరచి నూతనముగా కొన్నిటిని కల్పించుకొని మతమును నిలబెట్టుకొని యుండవచ్చును. ఒక్క మంచిభవ నము జీర్ణమగునప్పుడు కొన్ని పాతవస్తువులను తొలగించి క్రొత్త సామానులు చేర్చుకొని యేలాగున నవీనగృహమును పటుతరముగా స్థిరము చేయుదురో మతములయొక్క స్థితియు నాలాగున నుండును.

ఈ ముగ్గురి కాలానంతరము మఱియు కొన్ని క్రొత్తమతములు బయలుదేరియున్నవి. మఱియు కాలక్రమము ననుసరించి జనులయొక్క మనశ్శక్తియు, బుద్ధివికాసమున్ను, ఇంద్రియములయొక్క పటుత్వమున్ను, ధర్మబుద్ధియు హెచ్చుతక్కువలుగ మారుచుండును. వీనినిబట్టియు జనుల యొక్క మనఃపరిపక్వత ననుసరించియు కాలానుగుణముగ నాచరణములో నుండుటకు యోగ్య మగునట్లు మతములలో పరివర్తనము గలుగుచుండును.

అట్లుగానిచో జనులు తరింపజాలరు. ఇట్టి అవస్థలన్నియు సర్వేశ్వరసంకల్పము చేతనే జరుగుచుండునని మహాత్ములున్ను, పరమభక్తులున్ను గ్రహించి ఆనందభరితులై యుందురు. అద్వైతమతము కేవలము బ్రహ్మమును గురించి బోధించుచుండును. దీనికి జ్ఞానమతమని పేరు. విశిష్టాద్వైతమతము జీవునియొక్క శుద్ధిని గురించియు బోధించును గాన ఈశ్వరోపాసనా మత మనంబడును. కావుననే దీనికి ప్రపత్తియే చరమగతియని చెప్పబడినది. ద్వైత మతము తపస్సును గురించియు, వర్ణాశ్రమములను గురించియు, భక్తిని గురించియు నెక్కువగ చెప్పుచుండును. ఇది దేహేంద్రియములయొక్క శుద్ధినిగుఱించి చెప్పుటచేతనే దీనికి తత్త్వవాదమతమని పేరు. ఈ మతత్రయ మునకు జీవేశ్వరుల ఐక్య విషయమున మాత్రమే కొంచెము భేదము గలదు గాని తక్కిన వేదవిశ్వాసములోను, ఉపనిషత్తులలోను, స్మృతిపురాణముల లోను, భక్తిశ్రద్ధవైరాగ్యములలోను, తపోధ్యానయోగనిష్ఠాదులలోను నందరున్ను సమానులే, ఏకాభిప్రాయము గలవారలే. సత్యము, శాంతము, కరుణ, విరక్తి, భక్తి మొదలగు దైవికగుణములను సర్వులున్ను ఒకేవిధముగా నంగీకరించి యున్నారు. ఇవి లేనిచో మోక్షము గలుగజాలదనియే అందరియొక్క ఏకాభిప్రా యమై యున్నది.

మఱియు నింకొక సంశయము ముముక్షువులకు గలుగుట కవకాశము గలదు. అదేమన, ఈ మతత్రయాచార్యులకు ప్రస్థానత్రయమే పరమ ప్రమాణము. అనగా ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత. ఈ గ్రంథములకు త్రిమతాచార్యులున్ను భాష్యము రచించిరనియు, సూత్రభాష్య ములో శ్రీశంకరులకున్ను, శ్రీవ్యాసులకున్ను శాస్త్రార్థము జరిగెననియు శ్రీవ్యాసులవారు శంకరులు రచించిన భాష్యమేసరియనియు, అద్వైతమే పరమ సిద్ధాంత మనియు సెలవిచ్చినట్లు శ్రీవ్యాసులే శంకరాచార్యుల నాశీర్వదించి జగద్గురువనియు, సర్వతంత్ర స్వతంత్రులనియు, భాష్యకర్తయనియు బిరుద ముల నిచ్చెనిచ్చిరనియు, అదేప్రకారము శ్రీరామానుజులుచేసిన బ్రహ్మ సూత్రాదిభాష్యములకు శ్రీనగరమున శ్రీశారదాదేవి ప్రత్యక్షీకరించి విశిష్టాద్వై

తమే నిజమైన వేదార్థమనియు, రామానుజుల భాష్యమే సరియనియు, అట్లే వరదరాజస్వాములు శ్రీభాష్యమే నిజమైన శ్రీభాష్యకర్తయని రామానుజులకు బిరుదమిచ్చినట్లున్ను, వేదార్థతత్త్వమని తెలిపినట్లున్ను, వ్యాసాదిమహర్షుల హృదయాభిప్రాయమిదియనియును చెప్పుచున్నారు. ఇదేప్రకారము శ్రీమధ్వాచార్యులు ద్వైతపరముగా రచించిన సూత్రగీతాదులను బదరికాశ్రమములో వ్యాసులకు సమర్పింపగా శ్రీవ్యాసభగవానులు మధ్వభాష్యమే వ్యాసులవారి మతమనియు, ఇదే బ్రహ్మసూత్రములయొక్క ఆశయమనియు, వేదముయొక్క నిజార్థమనియు నానతిచ్చినట్లున్ను చెప్పుకొనుచున్నారు. ఇచ్చటను మనము పైన ఉదాహరించినట్లు జనులయొక్క హృదయ పరిపక్వత ననుసరించి ఆ యా కాలములకు ఆయా అర్థమునే గ్రహించదగిన యోగ్యత గల జనులుగలరని తలంచి అట్లు కృష్ణద్వైపాయనులు ఆనతిచ్చి యుండవచ్చును; దీనియందు నేలాటి దోషములున్ను లేవని తలంచవలెను.

ఒక మనుజుడు బాల్య, కౌమార, యౌవన, వార్థక్యావస్థల ననుసరించి యెట్లు మారుచుండునో, ఆహారాద్యనుష్ఠానములున్ను ఏలాగున భిన్నములుగ నుండునో, అట్లే ఒక్కరికి బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమములలో నెట్లు మార్పు గల్గుచుండునో, అనుష్ఠానక్రమములున్ను వేరు వేరుగా నేర్పడి యుండునో, దీనియొక్క తత్త్వమున్ను ఆలాగుననే యుండును. మఱియు కలియుగము వృద్ధియై రాగారాగా జనులయొక్క మేధాశక్తియు, ఓజస్సు, దృఢకాయత్వము, ధర్మబుద్ధి, జ్ఞానశక్తి తగ్గి తగ్గి వచ్చుటచే కాలానుగుణముగా బాదరాయణాది ఋషులున్ను పై అర్థము నంగీకరించి యుందురు. మఱియు ఒకకాలములోనే నాలుగు యుగములకు సంబంధించిన కొందరు జీవులుండుటచే వారిబుద్ధికి, యోగ్యతకు అవలంబించదగిన అర్థము బోధపడుట కొఱకున్ను భాష్యత్రయము ఆవశ్యకమైనది.

కృతయుగమున ధర్మము చతుష్పాదములతోను, త్రేతాయుగమున పాదత్రయముతోను, ద్వాపరమున పాదద్వయముతోను, కలియుగమున ఏక పాదముతోను నుండునని కృష్ణద్వైపాయినాది ఋషులు పూర్వమే వచించి

యున్నారు. కనుక వారి వారియొక్క హృదయమునకు గోచరించేలాగున నున్ను, ఆచరించుటకు శక్తి గలిగేలాగుననున్ను, దేశకాలానుకూలములను జూచియు మతకర్తలు ఆచరణలను ఏర్పాటు చేసి యుందురు. కావున నీ విషయములో నెవరున్ను సందేహపడనక్కర లేదు. సముద్రములోనికి చేరు వఱకు మాత్రమే నదులయొక్క నామరూపము లుండును. సాగరములోనికి ప్రవేశించిన సర్వనదులు తమతమ నామధేయములను, ఆకారములను విడిచి ఒకే మహాజలమగునట్లు దైవములోనికి ప్రవేశించువఱకు మతములున్ను, సంప్రదాయములున్ను, ఉపాసనాభేదములున్ను గల్గియుండును. అచ్చటికి చేరుటకు సర్వమతములున్ను ఒకేవిధముగా దోవ జూపుచున్నవి. ఎచ్చట సత్య మున్ను, దైవధర్మమున్ను గల్గియుండునో అచ్చటికి ముక్తియున్ను స్వయముగా వచ్చి చేరును.

యుగముల ననుసరించి మనుష్యులకు మోక్షప్రాప్తి ఉపాయములున్ను భిన్నములై యున్నట్లు మనువు మొదలైన స్మృతికర్తలు విధించియున్నారు. దృష్టాంతము చూడుడు. సత్యయుగమున తపస్సుచేతను, త్రేతాయుగమున యోగముచేతను, ద్వాపరమున పూజార్చనాదులచేతను, కలియుగమున నామ స్మరణచేతను ముక్తి గలుగునని విధించియున్నారు. కొన్ని స్మృతులలో కృత యుగమున జ్ఞానముచేతను, త్రేతాయుగమున యజ్ఞముచేతను, ద్వాపరమున అర్చనలచేతను, కలియుగమున దానముచేతను, ముక్తి సిద్ధించునని వచించి యున్నారు. దీనినిబట్టి యూహించిన కృష్ణద్వైపాయనమునియు మూడు భాష్య ముల అభిప్రాయములను అంగీకరించుట కిదియే కారణమై యుండును.

మఱియు ఋషులు దీర్ఘదర్శులగుటచే భవిష్యత్ జ్ఞానము గలవారై నందున యుగభేదములచే సూత్రాదులకు నీలాగున భాష్యము చేయగల రనియు నెరింగియుండవచ్చును. మఱియు భాష్యకర్తలు అసామాన్య పురుషులగుటచే నీయీకాలమున నిట్లు జరుగవలసియుండునని తలంచి యీశ్వరాజ్ఞచే వచ్చిన వారలే త్రిమతస్థులని తలంచి యిది యీశ్వరాజ్ఞయని యెరింగిగూడ నుండవచ్చును. అద్వైతజ్ఞానము అతీంద్రియ జ్ఞానులకు

మాత్రమే గల్గును. అట్టివారు కలియుగములో అరుదగుటచేతను, జనులు బాహ్యదృష్టి గలవారగుటచేతను ఈశ్వరసాక్షాత్కార జ్ఞానమును యథార్థముగ తెలుసుకొనుట కశక్తులగుటచేతను పాంచభౌతికమగు విగ్రహములను దైవరూపములుగా ఆరాధించుటకొఱకు ప్రతిమ లేర్పడినట్లు అనేక శాస్త్రములు చెప్పుచున్నవి.

ఇప్పుడు మనము గ్రహించిన విషయమేమనగా, శ్రీమన్నారాయణాజ్ఞచే అవతరించిన ఆదిశేషాంశ సంభూతులగు రామానుజాచార్యులు గోష్ఠీపూర్ణులను గురువుగాచేసుకొని జ్ఞానమును గలుచేసుకొన్నారనియు, విష్ణుమూర్తి అనుమతితో వాయ్వంశ సంభూతులగు మధ్వాచార్యులు అచ్యుతప్రేక్షాచార్యులను శరణుబొంది దైవజ్ఞానమును గలుగచేసుకొన్నారనియు తెలుసుకొన్నాము. ఒక్క వ్యాససూత్రములకే అద్వైత విశిష్టాద్వైత ద్వైతపరముగా శ్రీ శంకర, రామానుజాచార్య, శ్రీమధ్వాచార్యాదులు భాష్యము రచించిరనియు, నీ ముగ్గురి భాష్యములను శ్రీవ్యాసభగవాను లంగీకరించిరనియు చెప్పుటలో మనము గ్రహించవలసిన సారమొకటి కలదు. అదేమన కాండత్రయాత్మకమగు వేదమున కనుగుణమగు బ్రహ్మసూత్రములయొక్క జ్ఞానకాండమును శంకరులున్ను, ఉపాసనాకాండమును రామానుజులున్ను, కర్మకాండమును మధ్వులున్ను ఉద్ధరించిరనియు, ఇది వేదముయొక్క సిద్ధాంతమనియు గ్రహించవలయును. జ్ఞానోపాసనా కర్మత్రయాత్మకమే వేదమని అందరికిన్ని తెలిసిన విషయము. ఈ మూడున్ను జీవకోట్ల ఆత్మపరిపక్వస్థితి ననుసరించి, అవశ్యాచరణీయము లనియు సర్వజనవిదితము. కావున భాష్యత్రయము మన కవసరమైనది.



## చైతన్య మతము

వంగదేశమునందు నవద్వీపమున క్రీస్తుశకము 1486వ సంవత్సరమునందు చైతన్యుడు విష్ణ్వంశమున పుట్టెను. ఈ చైతన్యాచార్యులవారి తండ్రి

జగన్నాథమిశ్రులు. ఇతడు గంగాతీరమునందు నవద్వీపమున తపస్సు చేసెను. ఈ జగన్నాథమిశ్రుని భార్య శచీదేవి. జగన్నాథమిశ్రునికి 8 మంది ఆడబిడ్డలు పుట్టిరి. అందరును మృతులైరి. 9వవాడు విశ్వరూపుడు. 10వవాడు చైతన్యుడు. చైతన్యునియొక్క మొదటిపేరు విశ్వంభరుడు. చైతన్యుడు మిక్కిలి తేజస్సు గలవాడుగ నున్నందుచే నిరుగు పొరుగు వారందరును నీతని ప్రేమించు చుండిరి. అయినను నితడు శ్రీకృష్ణునివలె బాల్యమునందు తోడిబాలుర నేడ్పించుచును, తనకు వలయు వస్తువుల నితరుల యిండ్లలో దూరి యెత్తు కొని పోవుచును, గంగకు వచ్చిన ఆడువారిని తొందరపెట్టుచును నుండెను. చైతన్య దుర్మార్గమునకు తాళజాలక స్త్రీలు శచీదేవికి చెప్పుచుండిరి. చైతన్యుని బుద్ధి మిగుల చురుకుదనముతో నున్నందువలన జగన్నాథుని మనస్సు నందు దుఃఖవిచారణములు పొడచూప నారంభించెను. కారణ మేమనగా? సంస్కృతమును సంపూర్ణముగ నేర్చి విశ్వరూపుడు సన్న్యాసి యైనందున చైత న్యుడును అలాగే యగునని భయపడుచుండెను.

ఆ కాలమున వాసుదేవసార్వభౌము డనెడు దర్శనములను చదివిన పండితుడొకడు నవద్వీపమందొక చతుష్పథిని స్థాపించియుండెను. చైతన్యుడు ఈ పాఠశాలయందు తనసహపాఠకుల కందరికంటెను మించిన చదువరి యాయెను. ఈ విద్యాభ్యాసమువలన చైతన్యుడు శాంతస్వభావము గలవాడై, తల్లిదండ్రుల యాజ్ఞనుసారము నడుచుకొనుటకు ప్రయత్నించెను. ఇట్లుండగా జగన్నాథమిశ్రులు పరలోకమున కేగినందున, శచీదేవిదుఃఖము చెప్పుటకలవిగా కుండెను. ఇట్లు వైధవ్యమొంది దుఃఖస్థితియందుండు కాలమున చైతన్యుని సమాధాన వాక్యములవలన నామె దుఃఖము చాలవఱకు నణగిపోయెను. శచీ దేవియు తన పెద్దకుమారునివలె చైతన్యుడు విరక్తుడగునేమోయని భీతి జెందుచుండెను. అందుచే చైతన్యుని పెండ్లిచేసుకొని యింటియందే యుండ వలెనని సదా కోరుచుండెను. అట్లే వల్లభాచార్యుని కూతురైన లక్ష్మీదేవిని చైతన్యుడు వరించెను. వివాహమైన తర్వాత చైతన్యుడు ఒక సంస్కృత పాఠ శాల స్థాపించెను.

ఇతడు ప్రసిద్ధ పండితుడైనందున నాల్గు ప్రక్కలనుండియు బాలురు వచ్చిచేరుచుండిరి. ఆ కాలమున న్యాయశాస్త్రప్రాబల్యము మెండుగ నుండెను. విశేషముగ చదివిన పండితులుగూడ చైతన్యుని వాదమున జయించుటకు వెరగందుచుండిరి. ఒకప్పుడు శ్రీవాసుడు చైతన్యునిగూర్చి కృష్ణునియందు భక్తిలేని విద్యాసమర్థత నిరుపయోగమైనది. కాబట్టి మిధ్యావాదమునందు ప్రొద్దుబుచ్చక శ్రీకృష్ణపరమాత్మను భజింపుమనెను. అప్పటినుండి చైతన్యుని మనస్సు బహిర్వృత్తులనుండి మరలినదై అంతరాత్మ ధ్యానములోను, శ్రీకృష్ణ భక్తిలోను దూరుటకు ప్రారంభించెను. ఇదే వైరాగ్యము గల్గుటకున్ను, కృష్ణ భక్తిలో మగ్నులగుటకున్ను మొదటి కాలము. తరువాత బంగాళప్రదేశములో అనేక స్థలములు సంచరించి పండితులతో శాస్త్రవాదము చేసి, భక్తిబీజములను వెదచల్లుటకు ప్రారంభించెను.

ఇట్లుండగా తన తండ్రికి పిండశ్రాద్ధము చేయుటకై శిష్యులతోగూడి చైతన్యుడు గయకు బోయి అచ్చట పితృప్రీతిగా శ్రాద్ధాదుల నంతయు చేసెను. విష్ణుపాదములో పిండసమర్పణము చేయుకాలమున చైతన్యుడు భక్తియందు మైమఱచి కొన్ని గంటలసేపు తన్మయత్వము నొంది నిర్వికల్ప సమాధిలో నుండిపోయెను. అప్పటినుండి చైతన్యుడు చాలవఱకు బహిర్వ్యాపారములను తగ్గించి కృష్ణకీర్తనలలోను, ధ్యానములోను మగ్నుడై యుండెను. తరువాత ప్రయాగయందు ఈశ్వరపురియను యోగీశ్వరునకు శిష్యుడై ధర్మతత్త్వము లను తెలుసుకొనవలయుననెడు ఆతురత గలిగియుండగా నీశ్వరపురియును చైతన్యుని అనన్యవృత్తిని తెలిసికొని ఉపదేశించుటకు సమ్మతించెను. చైతన్యుడు ఈశ్వరపురివద్దనే యుండి ఆ యోగియొక్క సదుపదేశమువలన సంసార విచారమును వదలి భగవంతుని ధ్యానమందే కాలము గడుపవలెనని యెంచెను. ఇంతేగాక నిత్యానందులను భక్తులొకరు వీరికి వైష్ణవమతమును బోధించిరి. అది మొదలు, 'శ్రీహరీ! నీవద్దకు నెట్లు రాగల్గుదును?' అని ప్రార్థన చేయుచుండెను. చైతన్యుడు శ్రీకృష్ణజన్మస్థానమగు మధుర, బృందావన గోకు లాది పుణ్యతీర్థయాత్రలు చేసి మిఱల తిరిగి తనయింటికి వచ్చెను. ఈ మధ్య

తనధర్మపత్ని పరలోకము నొందెను. అప్పటినుండి విష్ణుభక్తులుండే స్థలము లోనికి భజనలు జరుగుచుండు ప్రదేశములకును సదా వెళ్ళుచు భజనలో శ్రీకృష్ణభక్తి యందు తన్మయులై గంటల ఝాముల కాలము బాహ్యావృత్తి లేక భగవద్ధ్యానములో లీనమై పడియుండెడివాడు.

ఒకనాడు చైతన్యుడు శుక్లాంబరబ్రహ్మచారియను వాని యింటికి పోయి అక్కడగూడియున్న వైష్ణవులనుదర్శించి మైమఱచి, తెలివివచ్చినమీదట 'నాతో గూడనే యుండిన దేవుడెక్కడ పోయినాడు?' అని చెప్పి ఆయింటి స్తంభము నొకదానిని కౌగలించుకొనెను. చైతన్యునియొక్క యీస్థితి అనంతర సమాచారము నవద్వీపమంతయు వ్యాపించెను. ఈ మహావిద్వాంసుడు వైష్ణవమతము గైకొని హరిభక్తుడైన మాటను విని అందరును వెరగందిరి. ఎచ్చట జూచినను అతని హరిభక్తిపరాయణత్వమును, అతని విచారమును, అతని నిట్టూర్పులును, అతని మైమఱపులును, అతడు హరినిగూర్చివిలపించుటను గూర్చియే సదా జనులు మాటలాడుచుండిరి. మఱికొందరు శ్రీకృష్ణుడు చైతన్యుల మూలకముగా విష్ణుభక్తిని భూమియందు వృద్ధి చేయనెంచి యాతని హృదయమునందు నివసించుచున్నాడని చెప్పుచుండిరి.

ఇప్పటికి చైతన్యునకు 24 సంవత్సరముల వయస్సు అగుచున్నది. ఈ కాలమున జగన్నాథము మొదలు రామేశ్వరమువఱకుగల సమస్తతీర్థయాత్రలు చేసుకొని కృష్ణభక్తిని జనుల కుపదేశించుచుండెను. చైతన్యుడు విష్ణుభక్తికిన్ని, భగవత్కృపకున్ను, విష్ణుసాయుజ్యమగు మోక్షమునకున్ను బ్రాహ్మణులే కాక అన్ని జాతులవారును ఉపదేశమునకు పాత్రులని యెంచి మాలమాదిగలాదిగా గల సకలజాతుల వారికిని తనమతమును బోధింపనారంభించెను. చైతన్యుడు ముక్తిమార్గమునే బోధింప నారంభించెను. అతనికి కర్మమార్గమునందు నమ్మిక లేదు. యజ్ఞయాగహోమాదులవలన మోక్షము లభించుట అబద్ధమని యెంచెను. కర్మమార్గమును జనుల మనస్సునందు ప్రతిఫలింపజేయుటకు యత్నించెను.

చైతన్యుని మతమునందు ముక్తిమార్గములు రెండు - 1. మోసము లేని విశ్వాసము, 2. ఎడతెగని భక్తి. ఇట్టి భక్తివిశ్వాసములు మోక్షమునకు తగిన యుపాయములని చైతన్య డుపదేశము చేసెను.

ఆత్మ దేహసంసర్గముచే వేరు వేరు విధములగు దోషములను పొందు చున్నది. ఆ దోషము లేవియనగా - కామక్రోధాద్యరిషడ్వర్గములు, కులమద విద్యామదాది అష్టమదములు. ఇవి మనుష్యుని బుద్ధిని చెరుచుచున్నవి. కాన వీటిని విడిచి సదసద్విచారముచేసి దేవునియందు నిష్కపటమైన విశ్వాసమును నిరంతరమైన భక్తి నుంచినచో, ముక్తిని పొందదగునని చైతన్యునకు సంపూర్ణ విశ్వాసము గలదు. ఇంతియేగాక స్వార్థపరత్వమును దూరము చేసి పరోపకార బుద్ధిని వహించుటయే చైతన్యునియొక్క ముఖ్యోద్దేశముగనుండెను. శ్రీచైతన్యులు 12 సంవత్సరములు కటకదేశమున సదా కృష్ణభజన చేయుచు, మతోద్ధారము చేసెను. చైతన్యునకు గౌరాంగయని మఱియొక నామము కలదు. ఈ మతసిద్ధాంత మంతయు నించుమించుగా శ్రీవిశిష్టాద్వైత సిద్ధాంతము ననుసరించుచున్నది. చైతన్యులు తనయొక్క 43వ సంవత్సరములో జగన్నాథ క్షేత్రములో భక్తులమధ్యమున భజన చేయుచుండగా శ్రీకృష్ణభక్తితో కొంతసేపు మతిమఱచి తన్మయుడై యుండి శ్రీకృష్ణభగవానుని సాక్షాత్కరించి; అదిగో! శ్రీకృష్ణుడు పిలుచుచున్నాడని చెప్పి భజనచేసుకొనుచు సముద్రముపై నడచుచువెళ్లి సాక్షాత్ వైకుంఠమును ప్రాపించెను.

ఈ విషయము శ్రీకృష్ణ చైతన్య జీవితచరిత్రలో విస్తారముగ గనందగును. పై జెప్పిన శ్రీశంకర రామానుజ మధ్వాచార్యులవలె చైతన్యులును చిన్నతనమునుండి నిర్యాణకాలమువఱకు అత్యద్భుతములైన యనేక మహిమలను జూపియున్నారు. ఇచ్చట మనము గ్రహించవలసిన దేమన, విష్ణ్వంశసంభూతులగు చైతన్యులు గూడ నీశ్వరపురియను యోగీశ్వరులచే నుపదేశమును పొంది, దైవజ్ఞానము గల్గి లోకమును తరింపజేసిరని గ్రహించవలయును. గురువుల వారి అనుగ్రహమును పొందిన తర్వాతనే చైతన్యులకుగూడ మతప్రబోధము చేయ శక్తిగల్గినది. ఇప్పుడు మనము సనాతనమై యుగాదినుండి వచ్చుచున్న

లోకోద్ధారకులగు మహాపురుషుల జీవితములో గురూపదేశము లేనివారు లేరని తెలుసుకొంటిమి.

ఇట్టి లోకోద్ధారకులగు మహాపురుషులే శ్రీసద్గురు పాదాశ్రితులై పునీతులైనట్లు వినుచుండగా, మాయామాలిన్యముచే గూడిన సామాన్యజీవులకు ఆత్మశుద్ధి గల్గుటకున్ను, సత్యమార్గము తెలుసుకొనుటకున్ను, నిత్యపదవి యగు మోక్షము నొందుటకున్ను సద్గురువు అవసరము లేదని చెప్పదగునా? బంగారము నిప్పులో నెంత కరుగబెట్టినను వెలిగారము వేయనిచో నెట్లు కరుగదో, ఆలాగున నెంత తపస్సుగాని, యోగముగాని, విద్యగాని గలిగినను గురునను గ్రహము లేనిచో ఆత్మశుద్ధి గాజాలదు. మఱియు పాలు కాగబెట్టి నను తోడువేయక అనగా చేమిరి వేయనిచో నేలాగున వెన్న వేరుపడదో ఆలాగుననే యెంత ధ్యానము, యోగము చేసినను గుర్వనుగ్రహము లేనిచో ప్రకృతినుండి ఆత్మవిముక్తి గాజాలదు. ఇది ఆస్తికబుద్ధి గలవారి యాశయము.

ఇక శ్రీగురుగీతలో సాక్షాత్ పరమశివుండు శ్రీపార్వతీదేవి కుపదేశించిన విషయములను కొన్నిటి నీ క్రింద పొందుపరచెద.

ఇది శ్రీస్కాందపురాణాంతర్గత సనత్కుమార సంహితయందు గలదు.

**యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥**

పరమభక్తుడైనవానికి నేలాగున తన యిష్టదైవమందు సర్వోత్కృష్టమైన భక్తి గల్గియుండునో, ఆలాగున గురుదేవునియందును శ్రేష్ఠమైన భక్తిగల్గునో అట్టి మహాత్ముడైనవానికి మాత్రమే యీ వేదాంతార్థము స్పష్టముగ గోచర మగును. ఈశ్లోకము శ్వేతాశ్వతరోపనిషత్తునందుగూడ గలదు. ఇది వేద వాక్యము.

**జపస్తపో వ్రతం తీర్థం యజ్ఞో దానం తథైవ చ ।**
**గురుతత్త్వమవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ప్రియే ॥**

ఓ పార్వతీదేవీ! గురు నను(గ్రహమును పొందని వారియొక్క జపము, తపస్సు, వ్రతము, తీర్థయాత్ర, యజ్ఞము ఆలాగున దానము మొదలుగా గల కార్యము లన్నియు వ్యర్థములైపోవును.

**యజ్ఞినో పి న ముక్తాస్స్యుః న౽ముక్తా యోగినస్తథా ।**
**తాపసా అపి నో ముక్తా గురుతత్త్వాత్పరాఙ్ముఖాః ॥**

గురుతత్త్వమునుండి విముఖులైనవారు యజ్ఞము లాచరించినను, ముక్తిని పొందరు. ఆలాగున గురుభక్తిలేనివారు యోగాభ్యాసపరులైనను మోక్షము నొందజాలరు. గురుతత్త్వవిముఖులు తాపసులైనను కైవల్యమును పొందజాలరు.

**న చ ముక్తాస్తు గంధర్వాః పితృయక్షాస్తు చారణాః ।**
**ఋషయః సిద్ధదేవాద్యాః గురుసేవాపరాఙ్ముఖాః ॥**

గురుసేవయందు విముఖులైనచో ఋషులైనను, గంధర్వులైనను, పితృదేవతలైనను, యక్షులైనను, చారణులైనను, సిద్ధులైనను, దేవతలైనను, వెయ్యేల మఱి యెవరయినను ముక్తులు గాజాలరు.

**మహాహంకారగర్వేణ తపోవిద్యాబలేన చ ।**
**భ్రమంత్యేవ హ్మి న్ సంసారే ఘటీయంత్రం యథా పునః ॥**

గొప్ప అహంకారమగు గర్వముచేతను, తపోబలముచేతను, విద్యా మహిమచేతను ఎవండు సద్గురువు నాశ్రయించుట లేదో, అట్టివాడు ఘటీ యంత్రమువలె నీ సంసార సాగరములో మఱల మఱల పుట్టుచు గిట్టుచుం డునే గాని జన్మనివారణము పొందజాలడు.

ఘటీయంత్రమనగా :- బావినుండి నీళ్ళు తోడెడు ఏతమువంటిది.

**ఇదమేవ శివం ఇదమేవ శివం ఇదమేవ శివం ఇదమేవ శివమ్ ।**
**హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతః ॥**

గురువే శివము, గురువే శివము, గురువే శివము, గురువే శివము. ఇది విష్ణు శాసనము, విష్ణు శాసనము, శ్రీమన్నారాయణుని యాజ్ఞ, శ్రీహరి శాసనము. శాసనమనగా విధివాక్యము, అనగా నియమము.

**విదితం విదితం విదితం విదితం విజనం విజనం విజనం విజనమ్ ।**
**విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతః ॥**

విధి శాసనమువలన ఏకాంతమైన గురుస్వరూపము తెలిసినది, విధి శాసనమువలన ఏకాంతమైన గురుస్వరూపము తెలిసినది, విధి శాసనమువలన ఏకాంతమైన గురుస్వరూపము తెలిసినది.

**న గురోరధికం న గురోరధికం న గురోరధికం న గురోరధికమ్ ।**
**శివశాసనతశ్శివశాసనతశ్శివశాసనతశ్శివశాసనతః ॥**

పరమశివుడు ఆనపెట్టి గురువుకన్న అధికము లేదని యుద్ఘోషించుచున్నారు. ఈ శ్లోకముయొక్క అర్థము ముందు వ్రాయబడి యున్నది.

**కిమత్ర బహునోక్తేన శాస్త్రకోటిశతైరపి ।**
**దుర్లభా చిత్త విశ్రాంతిః వినా గురుకృపాం పరామ్ ॥**

ఇచట వేయేల చెప్పవలయును! చిత్తవిశ్రాంతి యను ప్రశాంతమగు పరమపదము సద్గురువుయొక్క గొప్ప కరుణ లేక నూరు కోట్లు శాస్త్రము లభ్యసించినను కలుగనేరదు.

**ఆబ్రహ్మస్తంబపర్యంతం పరమాత్మస్వరూపకమ్ ।**
**స్థావరం జంగమం చైవ ప్రణమామి జగన్మయమ్ ॥**

బ్రహ్మ మొదలు స్తంబపర్యంతముగల స్థావర జంగమాత్మకమగు, నీ జగమంతయు పరబ్రహ్మ స్వరూపము. అందువల్ల జగన్మయమగు గురుస్వరూపమును నమస్కరించుచున్నాను. స్థావరమనగా? స్థిరములైన వృక్షాదులు, జంగమమనగా? సంచరించెడు ప్రాణికోట్లు, స్తంబమనగా, ఒక్కవిధమగు సూక్ష్మమైన తృణము, లేక అతిసూక్ష్మమగు క్రిమికిగూడ పేరు గలదు.

**యద్యప్యధీతా నిగమాః షడంగా ఆగమాః ప్రియే ।**
**అధ్యాత్మాదీని శాస్త్రాణి జ్ఞానం నాస్తి గురుం వినా ॥**

పరమప్రియురాలవగు పార్వతీ! ఋగ్యజుస్సామాథర్వము లనెడు నాల్గు వేదములున్ను; శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిష ములనెడు వేదాంగములారున్ను; ఆలాగున శైవవైష్ణవాది శాస్త్రము లన్నిటినిన్ని, అట్లే ఆత్మతత్త్వమును ప్రకాశింపజేయు వేదాంతశాస్త్రముల మొత్తము పఠించి నను గురువు లేనిదే ఆత్మజ్ఞానము గోచరము గాజాలదు.

**శివపూజారతో వాపి విష్ణుపూజారతోఽథవా ।**
**గురుతత్త్వ విహీనశ్చేత్తత్సర్వం వ్యర్థమేవ హి ॥**

శివపూజయందు ప్రీతిగలవాడైనను, లేక విష్ణుపూజయందు నియుక్తు డైనను గురుకరుణ లేనిచో శ్రీశివకేశవుల కరుణ గలుగదు. ఈ పూజాదు లన్నియు వ్యర్థములు.

**శివస్వరూపమజ్ఞాత్వా శివపూజా కృతా యది ।**
**సా పూజా నామమాత్రం స్యాచ్చిత్రదీప ఇవ ప్రియే ॥**

ఓ పార్వతీ! ఈశ్వరునియొక్క స్వరూపమును తెలుసుకొనక చేసెడు నీశ్వరపూజ చిత్రములో వ్రాయబడిన దీపమెట్లు వ్యర్థమో అట్లే వ్యర్థమగును. గురుకృపలేని నిష్ఠయున్ను, నామమాత్రమేగాని ప్రయోజనముండదు. అనగా చిత్రములో వ్రాయబడిన దీపము ఏలాగున చీకటిని పోగొట్టజాలదో, అట్లే శివ స్వరూపమే గురుస్వరూపమని తెలుసుకొనక చేసెడు కృత్యములు వ్యర్థములు.

**సర్వం స్యాత్సఫలం కర్మ గురుదీక్షాప్రభావతః ।**
**గురులాభాత్సర్వలాభో గురుహీనస్తు బాలిశః ॥**

గురుదీక్షా పరాయణుడైన వాని సమస్తకర్మములును సఫలత నొందును. గురుకృపాలాభము గల్గినవానికి సమస్తకార్యములలోను లాభము గల్గును. అనగా జయము గల్గును. గురుభక్తి విహీనుడు మూఢుడు.

**గురుహీనః పశుః కీటః పతంగో వక్తుమర్హతి ।**
**శివరూపం స్వరూపం చ న జానాతి యతస్స్వయమ్ ॥**

దేనివల్ల శివస్వరూపమున్ను, తనయొక్క ఆత్మస్వరూపమున్ను ఒకే స్వరూపముగా (తనయొక్క ఆత్మరూపముగా) తెలుసుకొనుట లేదో, దానివల్ల గురువిహీనుడు మృగమో, క్రిమియో, పతంగమో అగునని చెప్పదగునేగాని, వివేకవంతుడైన మానవుడని అతనిని చెప్పదగదు.

**శిలాయాః కిం పరం జ్ఞానం శిలాసంఘప్రతారణే ।**
**స్వయం తర్తుం న జానాతి పరం విస్తారయేత్కథమ్ ॥**

గురువులేక సంసారసాగరమును తరింపజూచువాడు పెద్దరాతిని సముద్రముపై పడవేసి దానిపై నూరక కూర్చుండువాని వలెనుండును. రాతికి నెంత జ్ఞానముండునో గురువిహీనునికిని నట్టిజ్ఞానమే యుండును. సముద్రము దాటుటకు ఓడయు, ఓడ నడిపెడువాడు ఎట్లవసరమో, ఆలాగున గురువనెడు నావికుడున్ను దుఃఖసాగరము దాటనవసరము. రాళ్ళు నీటిలో మునుగునేగాని తేలునా? ఆలాగున స్వయముగా తరింపజూచుకొనువాడు దుఃఖసాగరములో మునుగునేగాని తేలజాలడు. స్వయముగా తరింపశక్తిలేని వాడు ఇతరులనెట్లు తరింపజేయ శక్తిగలవాడగును? అనగా తాను దాటకపోయిన నితరుల నేలాగున దాటింప గల్గునని భావము.

**సర్వశాంతికరం నిత్యం తథా వంధ్యా సుపుత్రదమ్ ।**
**అవైధవ్యకరం స్త్రీణాం సౌభాగ్యస్య వివర్ధనమ్ ॥**

ఓ పార్వతీ! నిత్యము సమస్తవిధములగు దుఃఖములను శమింపజేయునదియు లేక నిత్యశాంతియగు మోక్షమును గలుగజేయునదియు, నాలాగున సంతానము లేనివారికి సుపుత్రుల నిచ్చునదియు, సుమంగళీ స్త్రీలకు వైధవ్యమును గలుగజేయనిదియుననగా నిత్యసుమంగళత్వము నిచ్చునదియు, సౌభాగ్యము నొసంగునదియు, నన్ని పుణ్యకార్యముల నభివృద్ధి చేయునదియునగు గురుభక్తి నారాధింపుము. దీనివల్ల గురుభక్తి గలిగియుండుట

సంసారములో నుండెడు స్త్రీలకుగూడ శ్రేయోదాయకమని గోచరమగుచున్నది.

**కామ్యానాం కామధేనుర్వై కల్పితే కల్పపాదపః ।**
**చింతామణిశ్చింతితస్య సర్వమంగళకారకమ్ ॥**

మఱియు గురుభక్తి యెటువంటిదన? సమస్త కాంక్షల నిచ్చుటకు కామ ధేనువువంటిదిన్ని, సమస్తసంకల్పములను గలుగజేయుటలో కల్పవృక్షము వంటిదిన్ని, సమస్త ఆశయములను పూర్తిచేయుటలో చింతామణివంటిదిన్ని, సకల మంగళములను గలుగజేయునదియు నగు గురుభక్తిని గలుగజేసు కొనుము.

**జపన్ జయమవాప్నోతి మరణే ముక్తిదాయికా ।**
**సర్వకర్మాణి సిద్ధ్యంతి గురుపుత్రే న సంశయః ॥**

మఱియు గురుమంత్రము జపించువానికి జయము గల్గును. గురు స్మరణము చేయువానికి మరణకాలములో ముక్తి గలుగును. గురుపుత్రులకు సమస్త కర్మములును ఫలమును గలుగజేయును. దీనియందు సందేహము లేదు.

**గురుమంత్రో ముఖే యస్య తస్య సిద్ధ్యంతి నాన్యథా ।**
**దీక్షయా సర్వకర్మాణి సిద్ధ్యంతి గురుపుత్రకే ॥**

ఎవని ముఖములో గురుమంత్రము స్థిరముగ నుండునో వానికోరిక లన్నియు సఫలము లగును. గురుమంత్రము లేక వేరు ఏవిధముచేతను, సిద్ధిని పొందజాలరు. గురుపుత్రునికి గురుదీక్షా ప్రభావముచే సమస్తమున్ను సిద్ధించును.

**భవమూలవినాశాయ చాష్టపాశనివృత్తయే ।**
**గురుగీతాంభసి స్నానం తత్త్వజ్ఞః కురుతే సదా ॥**

జనన మరణములకు కారణమగు నజ్ఞానము సమూలముగ నశించుట కొరకున్ను, అష్టకష్టపాశములనుండి నివృత్తి గల్గుటకొఱకున్ను గురుజ్ఞాన

మనెడు తీర్థములో సదా తత్త్వజ్ఞాని స్నానమాచరించుచున్నాడు.

**అథ సంసారిణస్సర్వే గురుగీతాజపేన తు ।**
**సర్వాన్ కామాంస్తు భుంజంతి త్రిసత్యం మమ భాషితమ్ ॥**

ఈ సంసారములో పరితపించు మానవులు గురుమంత్ర జపముచేత సమస్త కాంక్షలను అనుభవించెదరు. ఇది ముమ్మాటికి సత్యము. ఇది శివుడ నైననా వాక్యము. అసత్యము గాజాలదు.

**మందభాగ్యా హ్యశక్తాశ్చ యే జనా నానుమన్వతే ।**
**గురుసేవా సువిముఖాః పచ్యంతే నరకేఽశుచౌ ॥**

మందభాగ్యులైన వారున్ను, గురుసేవ చేయుటకు శక్తిలేని వారునగు ఏ జనులు గురుభక్తి నాచరింపని వారలై యుందురో, అట్టి వారశుచియైన నరకములో దహింపబడుచున్నారు.

ఇచ్చటనుండి గురువులలోగల తారతమ్యము చెప్పబడుచున్నది.

1. సూచకగురువు, 2. ప్రవక్తృలగురువు, 3. బోధగురువు, 4. నిషిద్ధ గురువు, 5. విహిత గురువు, 6. కారణగురువు, 7. పరమగురువు.

ఈలాగున గురువులలో నేడు తరగతులవారు గలరు. వారి లక్షణములు ఈ క్రింది శ్లోకములలో వివరింపబడుచున్నవి.

**సూచకాది ప్రభేదేవ గురవో బహుధా స్మృతాః ।**
**స్వయం సమ్యక్పరీక్ష్యాథ తత్త్వనిష్ఠం భజేత్సుధీః ॥**

సూచకుడు మొదలుగాగల భేదములచే గురువులు పలు తరగతుల వారు గలరు. కావున స్వయముగ లెస్సగ పరిశోధించి బుద్ధిమంతుడు తగిన యోగ్యతగల తత్త్వనిష్ఠుడగు జ్ఞానిని పొందవలయును.

**వర్ణజాలమిదం తద్వద్బాహ్యశాస్త్రం తు లౌకికమ్ ।**
**యస్మిన్ దేవి సమభ్యస్తం స గురుః సూచకః స్మృతః ॥**

ఓ దేవీ! ఎవనివల్ల వర్ణసమూహము ననగా అక్షరముల సంఖ్యను నేర్చు కొనుచుందుమో, ఆలాగున లౌకికమైన బాహ్యశాస్త్రములను చక్కగ నభ్య సించుదుమో, అట్టి గురువు సూచకగురు వనంబడును. వర్ణసమూహాభ్యాస మనగా అక్షరాభ్యాసము మొదలైనవని తాత్పర్యము.

**వర్ణాశ్రమోచితాం విద్యాం ధర్మాధర్మవిధాయినీమ్ ।**
**ప్రవక్తారం గురుం విద్ధి వాచకం త్వితి పార్వతి ॥**

ఓ పార్వతీ! వర్ణాశ్రమములకు సంబంధించినవియు, ధర్మాధర్మము లను వివేచనము చేయునవియు నగు విద్యలను నేర్పెడు గురువు వాచకగురు వనంబడును.

**పంచాక్షర్యాది మంత్రాణా ముపదేష్టా తు పార్వతి ।**
**స గురు ర్బోధకో భూయాదుభయోరయముత్తమః ॥**

ఓ పార్వతీ! పంచాక్షరము, షడక్షరము, అష్టాక్షరము, ద్వాదశాక్షరము, షోడశాక్షరము మొదలగు మంత్రములను మాత్రమును పదేశించెడు గురువు బోధకు డనంబడును. పైజెప్పిన యుభయులకన్న వీరు శ్రేష్ఠులు; యోగానుష్ఠా నము దీనియందంతర్భూతము.

**మోహమారణవశ్యాది తుచ్ఛమంత్రోపదేశినమ్ ।**
**నిషిద్ధ గురురిత్యాహుః పండితాస్తత్త్వదర్శినః ॥**

ఓ దేవీ! మోహనము, మారణము, వశ్యము మొదలైన తుచ్ఛములగు క్షుద్రమంత్రముల నుపదేశించెడు గురువును నిషిద్ధగురువని తత్త్వజ్ఞానులైన పండితులు తలంతురు. ఇట్టి పాపమంత్రములచే చెడుకార్యముల చేసి జీవుడు మరణానంతరము భూత, ప్రేత, పిశాచ సంఘములలో చేరిపోవును. ఇట్టి గురువు పరమత్యాజ్యుడు.

**అనిత్య మితినిర్దిశ్య సంసారం సంకటాలయమ్ ।**
**వైరాగ్య పదదర్శీ యః స గురుర్విహితః ప్రియే ॥**

ఓ ప్రియమైన దేవీ! సంకటము లన్నిటికిన్ని స్థానమైన సంసార మనిత్య మని శ్రుతియుక్త్యనుభవములచే నిరూపించి, వైరాగ్య పదవిని బోధించెడు గురుడెవడో అతడు విహితగురు డనంబడును.

**తత్త్వమస్యాది వాక్యానాముపదేష్టా తు పార్వతి ।**
**కారణాఖ్యో గురుః ప్రోక్తో భవరోగనివారకః ॥**

ఓ పార్వతీ! తత్త్వమసి మొదలైన వాక్యముల నుపదేశించువాడును, భవ రోగముయొక్క నివారణము చేయువాడునగు వారు కారణగురువని చెప్ప బడును. అనగా జీవేశ్వరుల ఐక్యస్వరూపమును బోధించువాడు కారణగురు వని చెప్పబడును -

**సర్వసందేహసందోహనిర్మూలనవిచక్షణః ।**
**జన్మమృత్యుభయఘ్నో యః స గురుః పరమో మతః ॥**

ఓ పార్వతీ! సంశయము లన్నింటిని సమూలముగ నివృత్తి చేయుటలో సమర్థులున్ను, జననమరణ భయమును తొలగించు వారునునగు గురు వెవరో, వారే పరమగురువని ఋషులు తలంతురు.

ఇప్పుడు సప్తవిధ గురువుల నెరింగితిమి. వీరిలో నిషిద్ధగురువు తప్ప తక్కిన వారందరున్ను క్రమక్రమముగ మంత్రోపదేష్ట స్థితినుండిగల గురువు లందరున్ను జ్ఞానగురువులగుదురు. విద్యాభ్యాసమునుండి బాహ్యవిద్యను, ధర్మాధర్మములను బోధించెడు గురువులు ధర్మగురువు లగుదురు. వీరిద్ద రున్ను బాహ్యగురువులనియు, మారణాదుల బోధించువాడు నిషిద్ధగురుం డనియు, తక్కినవారు అంతరంగగురువులనియు గ్రహించవలెను. కర్మ గురువులనగా బాహ్యమైన నిత్యనైమిత్తికాది ధర్మాధర్మములను బోధించు వారు. కర్మకాండ ప్రవర్తకులగుటచే వారున్ను గురువులే. అయితే వారు జ్ఞాన గురువులలో చేరినవారు కారు. ఇక బాధగురువు ఒకడు గలడు. అతనిని శాస్త్రము చెప్పలేదు.

**బహుజన్మకృతాత్పుణ్యాల్లభ్యతేఽసౌ మహాగురుః ।**
**లబ్ధ్వాఽముం న పునర్యాతి శిష్యస్సంసారబంధనమ్ ॥**

ఓ భవానీ! అనేకజన్మములలో చేసిన పుణ్యాబలమువల్ల ఇట్టి మహా గురువు లభించును. శిష్యుడైనవాడు ఇట్టి గురువును పొందిన మఱల సంసార బంధమున చిక్కుకొనడు.

**ఏవం బహువిధా లోకే గురవః సంతి పార్వతి ।**
**తేషు సర్వప్రయత్నేన సేవ్యో హి పరమో గురుః ॥**

ఓ పార్వతీ! పై జెప్పిన ప్రకారము లోకములో గురువు లనేకమైన తరగ తులు గలవారలై యున్నారు. వారిలో మిక్కిలి ప్రయత్నము చేసియైన, పరమ గురువు లభించేలాగున చేసికొని అట్టివారిసేవ చేయదగినది.

**నిషిద్ధ గురుశిష్యస్తు దుష్టసంకల్పదూషితః ।**
**బ్రహ్మప్రళయ పర్యంతం న పునర్యాతి మర్త్యతామ్ ॥**

నిషిద్ధగురునికి శిష్యుడైనచో దుష్టకృత్యములచే చెడినవాడగును. అట్టి నీచగుణము గలవానికి బ్రహ్మప్రళయ పర్యంతముగూడ మఱల మనుష్య జన్మము లభింపదు. భూతప్రేత పిశాచములతో గూడిన దుఃఖము నొంద వలసియుండును. కావున నట్టి పాపమంత్రముల నభ్యసించుటగాని పాపకృత్య ములు చేయువారి దగ్గర చేరుటగాని చేయక సత్యధర్మదయాదులుగల మహా త్ములగు గురువుల నాశ్రయించి తరించవలయును.

**శృణు తత్త్వ మిదం దేవి! యదా స్యాద్విరతో నరః ।**
**తదాఽసావధికారీతి ప్రోచ్యతే శ్రుతిమస్తకైః ॥**

ఓ దేవీ! యథార్థమైన తత్త్వమును వినుము. మనుజుడైన వాడెప్పుడు సమస్త విషయములలోనుండి విరక్తుడగునో, అప్పుడే వాడు గురుదీక్ష పొందుట కర్హుడగుచున్నాడని శ్రుతిశిరస్సులైన ఉపనిషచ్ఛాస్త్రములచే చెప్పబడుచున్నది. అనగా నెంతవఱకు విషయవిరక్తి గలుగదో అంతవఱకు గురూపదేశమున

కర్తృత గలిగియుండలేదని భావము.

**జలానాం సాగరో రాజా యథా భవతి పార్వతి! ।**
**గురూణాం తత్ర సర్వేషాం రాజాఽయం పరమో గురుః ॥**

ఓ శివే! జలము లన్నిటికిన్ని అనగా నదీనదములు, కాలువలు మొదలైన వాటికన్నిటికి నేలాగున సముద్రము రాజై యుండునో, ఆలాగున గురువు లందరిలోను నీ పరమగురుడైన వాడు రాజగుచున్నాడు.

**సిద్ధిజాలం సమాలోక్య యోగినాం మంత్రవాదినామ్ ।**
**తుచ్ఛాకారమనోవృత్తిర్య స్యాఽసౌ పరమోగురుః ॥**

ఓ కాత్యాయనీ! సమస్తయోగులయొక్కయు, మంత్రవాదులయొక్కయు సిద్ధిజాలముల మహిమలను జూచి యెవనియొక్క మనస్సు అవి యావత్తున్ను తుచ్ఛములని యనగా నివి మోక్షమున కనుకూలపడునవి కావని తలంచి తత్త్వనిష్ఠలో మగ్నమైయుండునో అట్టివాడే పరమగురువని గ్రహించుకొనుము.

**స్వశరీరం శవం పశ్యన్ తథా స్వాత్మానమద్వయమ్ ।**
**యః స్త్రీ కనకమోహఘ్నః స భవేత్పరమో గురుః ॥**

ఎవండు ఆత్మబోధముచేత తనశరీరమును శవము మోస్తరుగా తలంచునో, తనయొక్క యాత్మను అద్వయమగు దైవమయముగా నెరుంగునో, యెవడు స్త్రీ కనకము మొదలైన వాటిలోగల మోహములను జయించి యుండునో అట్టివాడు గదా పరమగురు డనందగును!

**మౌనీ వాగ్మీతి తత్త్వజ్ఞో ద్విధాఽభూచ్ఛృణు పార్వతి! ।**
**న కశ్చిన్మౌనినాం లోభో లోకేఽస్మిన్ భవతి ప్రియే! ॥**

ఓ పార్వతీ! సావధానచిత్తము గలదానవై వినుము. మౌనియనియు, వాగ్మియనియు తత్త్వజ్ఞానులు ఇరుతెగలుగా నున్నారు. వారలలో మౌనులకు

నేలాటి లోకవ్యవహారమున్ను లేదు. మౌనశబ్దముచే కేవల వాఙ్మౌనమే గాక ఆత్మమననము గలవారనియు గ్రహించవలయును.

**వాగ్మీ తూత్కట సంసార సాగరోత్తారణక్షమః ।**
**యతోఽసౌ సంశయచ్ఛేత్తా శాస్త్రయుక్త్యనుభూతిభిః ॥**

ఓ గౌరీ! వాగ్మియైనచో ఘోరదుఃఖమైన సంసారసాగరమును ఇతరులను దాటింప శక్తిగలవాడు, ఏలయన! వీడు శాస్త్రము, యుక్తి, యనుభవము మొదలగువానివల్ల జనులయొక్క సంశయములను ఛేదించుటకు సమర్థుడగుచున్నాడు. వాగ్మి స్వరూపస్థితిలో నిలుచుకొని పరోపకారార్థమై మాట్లాడువాడు.

**గురునామజపాద్దేవి! బహుజన్మార్జితాన్యపి ।**
**పాపాని విలయం యాంతి నాస్తి సందేహమణ్వపి ॥**

ఓ దేవీ! గురుమంత్రజపమువల్ల ననేక జన్మములనుండి యార్జితమైన పాపసంఘము నశించుచున్నది. దీనియందు కొంచెమైనను సందేహము లేదు.

**శ్రీగురోస్సదృశం దైవం శ్రీగురోస్సదృశః పితా**
**గురుధ్యానసమం కర్మ నాస్తి నాస్తి మహీతలే ॥**

ఓ దేవీ! శ్రీగురునికి సదృశమైన దైవమున్ను, శ్రీగురునకు సదృశుడైన తండ్రియున్ను లేడు. గురుధ్యానమునకు సదృశమైన మఱియొక్క పుణ్యకర్మమున్ను భూలోకమందు లేదు. లేనేలేదు.

**కులం ధనం బలం శాస్త్రం బాంధవాస్సోదరా ఇమే ।**
**మరణే నోపయుజ్యంతే గురురేకో హి తారకః ॥**

ఓ కళ్యాణీ! మరణసమయములో కులమున్ను, ధనమున్ను, ఇతర బలమున్ను, శాస్త్రమున్ను, బంధువులున్ను, సహోదరులున్ను, సహాయము చేయజాలరు. గురుమంత్ర మొక్కటి మాత్రమే రక్షించును. ఇది యొక్కటి మాత్రమే తరింపజేయును.

**గురురేకో హి జానాతి స్వరూపం దైవమవ్యయమ్ ।**
**తద్జ్ఞానం యత్ప్రయత్నేన నాన్యథా శాస్త్రకోటిభిః ॥**

నశింపని యీశ్వరస్వరూపమైన జ్ఞానమును గురుడొక్కడే తెలుసుకొనగల్గును. అట్టివారి యనుగ్రహముచేతనే అట్టి దైవస్వరూపమగు జ్ఞానము శిష్యులకు గల్గును. కోట్లకొలది శాస్త్రముల నభ్యసించినను గురువు లేక యాత్మతత్త్వము గలుగదు.

**స్వరూపజ్ఞానశూన్యేన కృతమప్యకృతం భవేత్ ।**
**తపోజపాదికం దేవి! సకలం బాలజల్పవత్ ॥**

ఓ దేవీ! ఆత్మస్వరూపజ్ఞానము తెలియని వానివల్ల చేయబడు తపస్సు, జపము, అధ్యయనము, వ్రతము మొదలైన యావత్తున్ను వ్యర్థములు. అవి యన్నియు నర్థము లేనివియు, భావము లేనివియు నగును. చిన్నపిల్లల మాటల వలెను ఉపయోగకరములు గావు.

**న జానంతి పరం తత్త్వం గురుదీక్షాపరాఙ్ముఖాః ।**
**భ్రాంతాః పశుసమా హ్యేతే స్వపరిజ్ఞానవర్జితాః ॥**

గురుదీక్ష బొందని వారు సర్వోత్కృష్టమైన పరమతత్త్వమును తెలుసుకొనజాలరు. అట్టి గురుభక్తి విముఖులు భ్రాంతులతో సదృశులు, పశువులతో సములు. స్వరూపజ్ఞాన శూన్యు లగుటచే జడములతో సదృశులు.

**తస్మాత్కైవల్యసిద్ధ్యర్థం గురుమేవ భజేత్ప్రియే ।**
**గురుం వినా న జానంతి మూఢాస్తత్పరమం పదమ్ ॥**

ఓ ప్రియురాలా! ముందు చెప్పిన కారణమువల్ల మోక్షప్రాప్తికొఱకు, గురువు నాశ్రయింప వలయును. గురువు లేక ఆత్మజ్ఞాన రహితులు పరమ పదమగు దైవజ్ఞానమును తెలుసుకొనజాలరు.

**భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః ।**
**క్షీయంతే సర్వకర్మాణి గురోః కరుణయా శివే ! ॥**

ఓ శివే! గురుకృపవల్ల శిష్యునియొక్క హృదయగ్రంధి నశించిపోవును. సంశయము లన్నియు నస్తమించును. కర్మలు యావత్తున్ను క్షయము నొందును. హృదయగ్రంధి యనగా ఆత్మ కనాత్మయగు బుద్ధ్యాది ప్రపంచముతో గల సంబంధము. ఇది నశింపనిచో బంధవిముక్తి గాజాలదు.

**కృతాయా గురుభక్తేస్తు వేదశాస్త్రానుసారతః ।**
**ముచ్యతే పాతకాద్ఘోరాద్గురుభక్తో విశేషతః ॥**

వేదశాస్త్రానుసారము విశేషముగ చేయబడిన గురుభక్తివలన గురు కృప గలవాడు ఘోరమైన పాతకమునుండి విడుదల నొందును. అనగా గురుభక్తి వలన ఘోరములగు సమస్త పాపములును నశించును.

**బహుజన్మ కృతాత్పాపాదయమర్థో న రోచతే ।**
**జన్మబంధనివృత్త్యర్థం గురుమేవ భజేత్సదా ॥**

అనేకజన్మములలో చేయబడిన పాపబలము గలవారికి గురుకార్యములో శ్రద్ధ గలుగదు. అట్టి కార్యము వారికి రుచింపదు. జన్మబంధనివృత్తి గల్గుట కిచ్ఛగలవారందరున్ను, గురుసేవ చేయవలయును. రోగబలిమిచే జిహ్వా చేదు పొందిన వానికి రసయుక్తపదార్థము రుచించదు గదా! ఇప్పుడు గురుశబ్దమున కర్థము చెప్పబడుచున్నది.

**గుకారో సిద్ధసంజ్ఞః స్యాద్రేఫః పాపస్య దాహకః ।**
**ఉకారో విష్ణురవ్యక్తస్త్రితయాత్మా గురుర్భవేత్ ॥**

గుకారమనునది సిద్ధులయొక్క పేరై యున్నది. రేఫము అనగా రకారము పాపములను నశింపజేసెడు నగ్నిరూపబీజాక్షరమై యున్నది. ఉకారమవ్యయాత్ముడగు విష్ణువుయొక్క పేరు. ఈ మూడు స్వరూపములతో కూడినది గురువగును. మఱియొక అర్థము జూడుడు.

**గణేశో౽వా గ్ని నాయుక్తో విష్ణునా వా సమన్వితః ।**
**వర్ణద్వయాత్మకో మంత్రశ్చతుర్ముక్తి ప్రదాయకః ॥**

F20

గణేశబీజమైన గకారము, అగ్నిబీజమైన రకారము- వీటితో గూడిన విష్ణుబీజమైన ఉకారముతో చేరి గురుఅను రెండక్షరము లేర్పడి గురుమంత్ర మైనది. ఇది యనుష్ఠాన తారతమ్యమునుబట్టి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యాది చతుర్విధ ముక్తులను గలుగజేయును. ఇచ్చట మూడక్షరములు చెప్పినను 'రా'కు కొమ్ము "ఉ''యను నక్షర మగుటచే నదియొకే యక్షర మగును. కనుక నక్షరద్వయమని చెప్పబడినది అకార, ఉకార, మకారములకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అధిదేవతలు. కనుక మధ్యాక్షరమగు ఉ, రా కు కొమ్ముగా వచ్చినందుచే గురుమంత్రమును స్మరించువారు విష్ణు సాయు జ్యమును బొందగలరు. దీనియందు గణేశబీజము విఘ్నహరణమున్ను, అగ్ని బీజము పాపక్షయమున్ను, విష్ణుబీజము కైవల్యపదవియు గలుగజేయున వగుటచే గురుమంత్రము విఘ్నహరము, పాపశమనము, మోక్షదాయకమున్ను నగుచున్నది.

**గురోర్వినా న శ్రవణం భవేత్కుత్రాపి కస్యచిత్ ।**
**వినా కర్ణేన శాస్త్రస్య శ్రవణం తత్కుతో భవేత్ ॥**

కర్ణము వినా శాస్త్రశ్రవణ మెచ్చోటను నెవ్వనికిన్ని ఎట్లు గలుగదో, నాలాగున గురువు వినా యెవరికిన్ని ఎచ్చోటను ఆత్మ శ్రవణము గలుగదు. బాహ్యశాస్త్రమునకు బాహ్యకర్ణము లేనివాడు చెవిటివాడెట్లగునో ఆలాగున స్వరూపస్థితి యిట్టిదను జ్ఞానము గురువుచే బోధింపంబడని వాడుగూడ ఆత్మజ్ఞాన విషయములో బధిరు డగునని భావము.

**యదా మమ శివస్యాపి బ్రహ్మణో బ్రాహ్మణస్య హి ।**
**అనుగ్రహో భవేన్నౄణాం సేవ్యతే సద్గురు స్తదా ॥**

ఎప్పుడు విష్ణువైన నాయొక్కయు, శివునియొక్కయు, బ్రహ్మ యొక్కయు, బ్రహ్మజ్ఞానియైన బ్రాహ్మణునియొక్కయు ననుగ్రహము నరు లకు గలుగునో యప్పుడు మాత్రమే నరునికి సద్గురువు లభించును. అనగా త్రిమూర్తులయొక్కయు, బ్రహ్మనిష్ఠులగు సాధువులయొక్కయు, కరుణ

గల్గునప్పుడే సద్గురువు లభించునని శ్రీవిష్ణువచనము.

**చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యః స్మరేత్ ।**
**హస్తస్థముదకం త్యక్త్వా ఘనస్థమభివాంఛతి ॥**

ఎవడు నేత్రానందముగా కానుపించెడు గురువును త్యజించి శాస్త్రములచే గ్రహించుట కలవిగాని దైవమును గ్రంథములు చదివి వెదకుచుండునో, అట్టివాడు కరస్థమై యుండు శీతలజల కుంభమును పారవేసి యాకాశమండలములోగల మేఘజలమును పానము చేయుటకు వాంఛించువాడుగ తెలియదగినది.

**సులభం తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే ।**
**లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్విష్యతి క్షితౌ ॥**

సులభముగా మానవాకారముతో దైవజ్ఞానము నుపదేశించుటకొఱకు, మనుష్యాకారము ధరించియుండు గురువును విడిచి అవ్యక్తమగు ఈశ్వరుని ఉపాసింపదలచు వాడెట్టివాడన, లబ్ధమైన నిధిని త్యజించి, భూమిలో గుప్తమై యుండు ధనమును వెదకుటకు ప్రారంభించిన మూఢునివంటివాడని తెలియదగినది. రత్నగర్భయని భూమికి పేరుగల్గి యుండినను భూగర్భములో అట్టి ధనమెచ్చటనో ఉండును, ఆలాగుననే వేదాంత శాస్త్రములో దైవజ్ఞానము గలదని విని శాస్త్రజ్ఞానముచేతను తపస్సుచేతను నీశ్వరజ్ఞానము గలుగచేసుకొనదలంచువాడు పైజెప్పిన వానివలె ఉండునని తెలుసుకొనందగినది. అన్నిటికిన్ని వైరాగ్యము ముఖ్యమని చెప్పుచున్నారు.

**వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలమ్ ।**
**స్వానందానుభవాచ్ఛాంతి రేషైవోపరతేః ఫలమ్ ॥**

వైరాగ్యముయొక్క ఫలము బోధము, బోధముచే గలిగెడు ఫలము ఉపరతి. ఉపరతియొక్క ఫలము సంపూర్ణశోకశాంతి. పరమశాంతియొక్క ప్రయోజనము సంపూర్ణానందానుభవము.

ఇతర ఉపనిషద్వచనము :-

**వేదాభ్యాస స్తపోజ్ఞానమింద్రియాణాం చ సంయమః ।**
**అహింసా గురుసేవా చ నిశ్శ్రేయసకరం పరమ్ ॥**

ఉపనిషత్పఠనముచేతను, తపస్సుచేతను, జ్ఞానముచేతను, ఇంద్రియ ముల యొక్క సంయమముచేతను, భూతదయచేతను, గురుసేవచేతను పరమోత్కృష్టమైన మోక్షము గల్గుచున్నది.

**అహింసా సత్యమస్తేయం బ్రహ్మచర్యాపరిగ్రహౌ ।**
**యథా సంక్షేపతః ప్రోక్తాశ్చిత్తశుద్ధికరా నృణామ్ ॥**

అహింసావ్రతముచేతను, సత్యవాక్యముచేతను, పరవస్తువును గ్రహింప కుండుటచేతు, బ్రహ్మచర్యవ్రతముచేతను, పరవస్తు పరిత్యాగముచేతను మనుజులకు అంతఃకరణ శుద్ధి గల్గుచున్నది. ఇదే సమస్తశాస్త్రములయొక్క సారసంగ్రహము.

**సాధనానాం హి సర్వేషాం వరిష్ఠా సాధుసంగతిః ।**
**ఏ తయా సిద్ధయా సిద్ధం సర్వమేవ హి సాధనమ్ ॥**

సాధనము లన్నిటిలోను సర్వోత్కృష్టమైనది సాధుసేవ యనంబడును. ఇట్టి సాధుసేవ లభించినచో తక్కినవి సమస్తమున్ను స్వయముగా సిద్ధించును.

**న శాస్త్ర పాఠమాత్రేణ యోగసిద్ధిః ప్రజాయతే ।**
**న వేషధారణం సిద్ధేః కారణం న చ తత్కథాః ॥**

శాస్త్రపఠనముమాత్రముచేత జ్ఞానము సిద్ధింపనేరదు. వేషధారణ మున్ను జ్ఞానసిద్ధిని గలుగజేయదు. వేదాంత ప్రసంగమున్ను ఆత్మజ్ఞానమును గలుగజేయదు. సద్గురువుయొక్క కృప యొక్కటి మాత్రమే దైవజ్ఞానమును ప్రకాశింపజేయును.

**యేన నారాధితో దేవో యస్య నో గుర్వనుగ్రహః ।**
**న వశ్యం హృదయం యస్య తస్య శాంతిర్న సిధ్యతి ॥**

ఎవండు అనన్యభక్తితో సర్వేశ్వరుని ఆరాధన చేయలేదో, ఎవనికి గురు కృప గలుగలేదో, యెవనియొక్క హృదయము శాంతి నొందలేదో వానికి సర్వ దుఃఖశాంతి కలుగదు. ఆత్మజ్ఞానమున్ను లభింపదు.

**కర్ణాధారం గురుం ప్రాప్య తద్వాక్యం ప్లవవద్దృఢమ్ ।**
**అభ్యాసవాసనా శక్త్యా తరంతి భవసాగరమ్ ॥**

కర్ణధారుడైన గురువును ప్రాపించి వారిచే ఉపదేశింపబడిన సాధనము పడవగా చేసుకొని అభ్యాసబలముచేత ముముక్షువులు భవసాగరమును తరించుచున్నారు. ఇచ్చట కర్ణధారుడనగా - ఓడ నడిపేవాడు, నావికుడు లేనిచో నేలాగున సముద్రమును తరింపజాలరో, ఆలాగుననే పరమగురు సహా యము లేనిచో జీవులు ద్వంద్వసాగరము దాటజాలరు. కర్ణధారునికి సముద్ర ప్రయాణములో నెచ్చటెచ్చట అపాయములగు సుడులు, కొండలు మొదలైనవి ఉండునో తెలిసియుండుటచేతను గమ్యస్థానము అవగాహనమై యుండుట చేతను, ప్రయాణికులకు ప్రయాసము గలుగనీయక స్వస్థానము చేర్చును.

## మహానారాయణోపనిషత్తు

**సకలవేదశాస్త్రసిద్ధాంత రహస్య జన్మజన్మాభ్యాసాఽత్యంతోత్కృష్ట సుకృత పరిపాకవశాత్సద్భిః సంగో జాయతే । తస్మాద్విధినిషేధవివేకో భవతి । తతః సదాచారప్రవృత్తిర్జాయతే । సదాచారాదఖిలదురితక్షయో భవతి । తస్మా దంతఃకరణమతివిమలం భవతి । తతః సద్గురు కటాక్ష మంతఃకరణమా కాంక్షతి । తస్మాత్సద్గురు కటాక్ష లేశ విశేషేణ సర్వసిద్ధయః సిద్ధ్యంతి సర్వబంధాః ప్రవినశ్యంతి । శ్రేయోవిఘ్నాః సర్వే న ఫలం యాంతి సర్వాణి శ్రేయాంసి స్వయమేవాయాంతి । యథా జాత్యంధస్య రూపజ్ఞానం న విద్యతే తథా గురూపదేశేన వినా కల్పకోటిభిస్తత్త్వజ్ఞానం న విద్యతే । తస్మాత్సద్గురు కటాక్ష లేశ విశేషేణాచిరాదేవ తత్త్వజ్ఞానం భవతి ॥**

సకలవేదశాస్త్రముల సిద్ధాంత రహస్యము తెలిసికొని, అనేక జన్మ జన్మములలో అభ్యసించిన అత్యంత ఉత్కృష్ట పుణ్యాపరిపాకవశమువల్ల సద్గు

రువుల సంగము లభించును. అందువలన విధినిషేధ వివేకజ్ఞాన ముద్భ వించును. అందుచే సదాచార ప్రవృత్తి జనించును. సదాచారమువల్ల సమస్త పాపక్షయము గల్గును. అందుచే అంతఃకరణము మిక్కిలి పరిశుద్ధమగును. దానివల్ల సద్గురుకటాక్షమును అంతఃకరణము గోరుచుండును. అట్టి కారణ ముచే సద్గురు కటాక్షలేశ విశేషమువల్ల సమస్తసిద్ధులున్ను గల్గును. సమస్త బంధములున్ను సమూలముగ నశించును. శ్రేయస్సు విషయమై, గలిగెడు విఘ్నము లన్నియు నంతరించును. సమస్త శ్రేయస్సులును స్వయముగా వచ్చి చేరును. ఏలాగున పుట్టంధునకు రూపజ్ఞానము లేదో ఆలాగున గురూప దేశము వినా కల్పకోటికాలము గడచినను తత్త్వజ్ఞానము గలుగదు. అట్టి కారణముచే సద్గురు కటాక్షలేశ విశేషమువల్ల తత్త్వజ్ఞానము అనగా దైవ సాక్షాత్కారము త్వరలో ముముక్షువులకు గల్గును.

ఇకను, శ్రీగురుగీతయందు పరమేశ్వరుండు పార్వతీ దేవికుపదేశించి నది చూడుడు :-

**సర్వతీర్థావగాహస్య సంప్రాప్నోతి ఫలం నరః ।**
**గురోః పాదోదకం పీత్వా శేషం శిరసి ధారయేత్ ॥**

శిష్యుడు గురుపాదోదకమును పానము చేసి మిగిలినది శిరస్సున ధరించుటవల్ల సమస్త తీర్థములలో స్నానము చేసినందున గల్గిన ఫలమును బొందుచున్నాడు.

**శోషణం పాపపంకస్య దీపనం జ్ఞానతేజసః ।**
**గురోః పాదోదకం సమ్యక్ సంసారార్ణవతారకమ్ ॥**

గురుపాదోకము భక్తితోసేవించువారి పాపపంకమును నశింపజేయును. జ్ఞానతేజస్సును ప్రకాశింపజేయును. లెస్సగ అతనిని సంసారార్ణవము నుండి తరింపజేయును.

**యత్పాదాంబుజరేణుర్వై ఘోరం సారవారిధేః ।**
**సేతుబంధాయతే నాథం దేశికం తముపాస్మహే ॥**

ఎవనియొక్క పాదపంకజ రజోరేణువు ఘోరదుఃఖమును గలుగచేయు సంసారసాగరమునకు వారధివంటిదో అటువంటి దేశికనాథుని నిత్యము ఉపాసించుచున్నాము.

**కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకమ్ ।**
**గురుర్విశ్వేశ్వరస్సాక్షాత్తారకం బ్రహ్మనిశ్చయః ॥**

గురువు నివసించెడు ప్రదేశము కాశీక్షేత్రమువంటిది. వారిపాద తీర్థము పావనమగు గంగాజలము. గురువులైనవారు సాక్షాత్ విశ్వేశ్వరస్వరూపులు. అట్టివారి ముఖారవిందమునుండి యుపదేశింపబడిన మంత్రము తారకమగు బ్రహ్మమంత్ర మగును.

**గురుసేవా గయా ప్రోక్తా దేహస్స్యాదక్షయో వటః ।**
**తత్పాదం విష్ణుపాదం స్యాత్తత్ర దత్తం మనస్తతమ్ ॥**

గురుసేవయే గయ యనంబడును. వారి దేహము గయలోగల అక్షయమగు వటవృక్ష మగును. వారి పాదకమలము గయలో గల విష్ణుపాద మగును. అచ్చట దత్తముచేయబడిన మనస్సు వ్యాపకబ్రహ్మమును పొందును.

**దృశ్యవిస్మృతి పర్యంతం కుర్యాద్గురుపదార్చనమ్ ।**
**తాదృశస్యైవ కైవల్యం న చ తద్వ్యతిరేకిణః ॥**

దృశ్యవిస్మృతి, దేహవిస్మృతి, మనోవిస్మృతి గల్గు పర్యంతము గురు పాదార్చనము మానరాదు. అనగా గురుభక్తినుండి తొలగరాదు. అట్టి భక్తి గలవానికి మాత్రమే కైవల్యము సిద్ధించును. దానికన్న వ్యతిరిక్తబుద్ధి గలవారికి మోక్షము గలుగదు.

**అద్వైతం భావయేన్నిత్యం సర్వావస్థాసు సర్వదా ।**
**కదాచిదపి నో కుర్యాదద్వైతం గురుసన్నిధౌ ॥**

సర్వకాల సర్వావస్థలలోను నిత్యము అద్వైతభావన చేయదగినది. అనగా జీవఈశ్వరగురువుల ఐక్యము చేసి ఒకే స్వరూపముగా ధ్యానించదగి

నది. అట్లయినను గురుసన్నిధిలో మాత్రము వ్యవహారదశలో అద్వైత భావన చేయరాదు. అనగా అచ్చట గురుశిష్యుల ఏకభావము చేయరాదు. ఈ విషయమై ఆంజనేయులవా రుపదేశించిన గొప్ప అర్థము నిచ్చెడు శ్లోకమొకటి గలదు. అమనస్కము నుపదేశించిన తర్వాత రామచంద్రులు ఆంజనేయుని యొక్క అభిప్రాయము కనుగొనుట కడిగినప్పుడు హనుమంతులు తమ యాశయము నిట్లు వెలిబుచ్చిరి. ఇది యీ తరుణమున కిచ్చుట ఉపయోగమని తలంచి చేర్చడమైనది.

**దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం జీవబుద్ధ్యా త్వదంశకః ।**
**ఆత్మబుద్ధ్యా త్వమేవాహమితి మే నిశ్చితా మతిః ॥**

ఓ శ్రీరామచంద్రమూర్తీ! దేహబుద్ధితో నేను మీకు దాసుడను. జీవ బుద్ధితో మీ అంశస్వరూపుడను. అనగా శేషిశేషభావములో శేషుడను. ఆత్మ బుద్ధితో జూచిన నీయొక్క స్వరూపమే నేనున్ను, సమస్తజగత్తును అగుచున్నది.

భక్తులారా! శ్రీ ఆంజనేయుల స్వామివారి యాశయమే ఆచరణ యోగ్య మైనది. అట్లు గానిచో శుష్కవేదాంతు లగుదురు. ఆంజనేయస్వామి వంటి తపస్సంపన్నులు, జ్ఞాననిష్ఠులు, వైరాగ్యపురుషులు, వ్యాకరణాగ్రేసరులు, భక్తి వర్యులు, ధ్యాననిష్ఠులు, యోగసిద్ధులు, అమనస్క సాక్షాత్కారులు ఇంకొక్కరు గలరా? అట్టి వాయునందనునియొక్క భక్తిని జూచితిరా! ఇదియే ఆర్షమగు గురుశిష్య సంప్రదాయమని తెలుసుకొనవలెను. అట్టి వారికెచ్చటను మంగళమే గల్గును. ఇక గురుగీతనే గ్రహించెదము.

**స్వయం తథావిధో భూత్వా స్థాతవ్యం యత్ర కుత్రచిత్ ।**
**కీటో భృంగ ఇవ ధ్యానాద్యథా భవతి తాదృశః ॥**

కీటకము ఏలాగున భ్రమరమును ధ్యానించి కీటకత్వమునుండి విముక్తి నొంది భ్రమరమగుచుండునో, ఆలాగున శిష్యుడైనవాడు ఎచ్చోట కూర్చుండి యైనను గురుధ్యానము చేయుచుండిన తప్పక ఆ గురుస్వరూప స్థితిని బొంద గల్గును. దీనివల్ల గురువు దగ్గరనున్నను సరి, దూరప్రదేశమున నున్నను సరి

ఎవనియొక్క పాదపంకజ రజోరేణువు ఘోరదుఃఖమును గలుగచేయు సంసారసాగరమునకు వారధివంటిదో అటువంటి దేశికనాథుని నిత్యము ఉపాసించుచున్నాము.

**కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకమ్ ।**
**గురుర్విశ్వేశ్వరస్సాక్షాత్తారకం బ్రహ్మనిశ్చయః ॥**

గురువు నివసించెడు ప్రదేశము కాశీక్షేత్రమువంటిది. వారిపాద తీర్థము పావనమగు గంగాజలము. గురువులైనవారు సాక్షాత్ విశ్వేశ్వరస్వరూపులు. అట్టివారి ముఖారవిందమునుండి యుపదేశింపబడిన మంత్రము తారకమగు బ్రహ్మమంత్ర మగును.

**గురుసేవా గయా ప్రోక్తా దేహస్స్యాదక్షయో వటః ।**
**తత్పాదం విష్ణుపాదం స్యాత్తత్ర దత్తం మనస్తతమ్ ॥**

గురుసేవయే గయ యనంబడును. వారి దేహము గయలోగల అక్షయమగు వటవృక్ష మగును. వారి పాదకమలము గయలో గల విష్ణుపాద మగును. అచ్చట దత్తముచేయబడిన మనస్సు వ్యాపకబ్రహ్మమును పొందును.

**దృశ్యవిస్మృతి పర్యంతం కుర్యాద్గురుపదార్చనమ్ ।**
**తాదృశస్యైవ కైవల్యం న చ తద్వ్యతిరేకిణః ॥**

దృశ్యవిస్మృతి, దేహవిస్మృతి, మనోవిస్మృతి గల్గు పర్యంతము గురు పాదార్చనము మానరాదు. అనగా గురుభక్తినుండి తొలగరాదు. అట్టి భక్తి గలవానికి మాత్రమే కైవల్యము సిద్ధించును. దానికన్న వ్యతిరిక్తబుద్ధి గలవారికి మోక్షము గలుగదు.

**అద్వైతం భావయేన్నిత్యం సర్వావస్థాసు సర్వదా ।**
**కదాచిదపి నో కుర్యాదద్వైతం గురుసన్నిధౌ ॥**

సర్వకాల సర్వావస్థలలోను నిత్యము అద్వైతభావన చేయదగినది. అనగా జీవ-ఈశ్వరగురువుల ఐక్యము చేసి ఒకే స్వరూపముగా ధ్యానించదగి

యుండును. విస్తరించి కనుగొనగోరువారు శుష్కవేదాంత తమోభాస్కరము చూడవచ్చును. గురువును చక్కగ పరిశోధించి గ్రహించవలసిన విషయము శిష్యునిపై ఆధారపడి యున్నది. శాస్త్రములో చెప్పినట్లు యోగ్యత లేని గురువుల నేదో మూఢవిశ్వాసముతో ఆశ్రయించిన మరల శోకమునకు కారణమగును. గురులక్షణము సప్తవిధములుగా దీనియందు నిర్ణయింపబడి యున్నది గదా!

**చాతుర్యవాన్ వివేకీ చ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః ।**
**మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే ॥**

సమస్తకార్యములలోను మంచి చతురత గలవాడున్ను, వివేకజ్ఞానము గలవాడును, అధ్యాత్మజ్ఞానము గలవాడును, శుచి, ఆచారము గలిగిన వాడును, మనస్సు నిర్మలమైనవాడును నెవడో అతనికే గురుత్వము శోభించును. అనగా అతడే గురువగుటకు తగినవాడు.

**గురవో నిర్మలాశ్శాంతా స్సాధవో మితభాషిణః ।**
**కామక్రోధ వినిర్ముక్తాః సదాచారా జితేంద్రియాః ॥**

మరియు నిర్మలస్వభావము గలవారున్ను, శాంతస్వభావముగల వారున్ను, సాధనానుష్ఠానములు గలవారున్ను, మితభాషులున్ను, కామక్రోధ మోహశోకాదులు లేనివారున్ను, సద్వర్తనము గలవారున్ను, ఇంద్రియ జయము గలవారును ఎవరు గలరో వారే గురువులు కాగలరు. అట్లున్న వారి నాశ్రయింపక నికృష్టాచారము గలవారి నాశ్రయింపగూడదని పరమశివుండే ఉపదేశించి యున్నాడు.

**పాషండినః పాపరతా నాస్తికా భేదబుద్ధయః ।**
**స్త్రీలంపటా దురాచారాః కృతఘ్నా బకవృత్తయః ॥**

పాషండులు అనగా గురు, దైవ శాస్త్రములలో విశ్వాసములేని వారలు. పాపకర్మలు చేయువారు నాస్తికులు. అనగా సత్యమునకున్ను, ధర్మమున

కున్ను దూరులైన వారలు భేదబుద్ధిగలవారు. స్త్రీ విషయమందాసక్తి గలవారు, దురాచారకృత్యములు చేయువారు, కృతఘ్నులు అనగా చేసిన ఉపకారమును మరచిన వారు, బకవృత్తిగలవారు అనగా బయట కనబడువారికి మంచి తాప సోత్తమునివలె నుండి సమయము లభించునప్పుడు వంచనము చేయువారు ఇట్టి వారిని చేరరాదు.

**కర్మభ్రష్టాః క్షమానష్టా నింద్యతర్కైశ్చ వాదినః ।**
**కామినః క్రోధినశ్చైవ హింసాశ్చండాః శఠాస్తథా ॥**

సత్కర్మమునుండి వీడిపోయినవారున్ను, ఓరిమి లేనివారున్ను, నింద్యములైన కుతర్కవాదములు చేయువారున్ను, కాముకులున్ను, కోపము గలవారున్ను, ప్రాణిహింసకులున్ను, క్రూరకృత్యములు చేయువారును, శఠులు మొదలుగాగల వారిని గురువులనుగా భావింపరాదు.

**జ్ఞానలుప్తా వన కర్తవ్యా మహాపాపా స్తథా ప్రియే ।**
**యేభ్యో భిన్నో గురుస్సేవ్య ఏకభక్త్యా విచార్య చ ॥**

ఓ ప్రియురాలవగు నో పార్వతీ! ఆత్మజ్ఞానములేనివారున్ను, మహాపాప స్వభావము గలవారునగు పైజెప్పిన వారిని గురువులనుగా నంగీకరింపరాదు. వారికన్న భిన్నుడై అనగా పైజెప్పిన దుర్గుణములు లేనివానిని చక్కగా విచారణ చేసి గురువుగా వరించుకొనవలయును. అట్టివారిని పరమైకాంత భక్తితో సేవించదగినది.

**మోహాదిరహితశ్శాంతో నిత్యతృప్తో నిరాశ్రయః ।**
**తృణీకృతబ్రహ్మవిష్ణువైభవః పరమో గురుః ॥**

ఎవడు శోకమోహములు నశించినవాడో, ఆత్మశాంతి నొందినవాడో, సదాతృప్తుడై యుండువాడో, నిరాశ్రయుడై యుండువాడో, బ్రహ్మ, విష్ణువు మొదలైన వారి వైభవములను గూడ తృణముగా దలంచువాడో, ఆత్మానంద మందు పరమతృప్తిని బొందినవాడో అట్టివాడే పరమగురు వనంబడును.

**సముద్రే వై యథా తోయం క్షీరే క్షీరం జలే జలమ్ ।**
**భిన్నే కుంభేఽయథాకాశం తథాఽఽత్మా పరమాత్మని ॥**

ఏలాగున సముద్రములో జలము, క్షీరములో క్షీరము, నీటిలో నీరు కలియునప్పుడు ఏకత్వమై యుండునో, ఆలాగున ఘటము భిన్నమగునప్పుడు ఘటములోగల ఆకాశము, మహాకాశమగునో అట్లే పరమాత్మ స్వరూపములో ఆత్మ కలసి ఏకమై యుండు రీతి యేదో, అట్లుండుటయే నిజమైన దైవసాక్షాత్కార ఐక్యజ్ఞాన మగును.

**నవాయ నవరూపాయ పరమార్థైకరూపిణే ।**
**సర్వాజ్ఞానతమోభేదభానవే చిద్ఘనాయ తే ॥**

నూతనుడున్ను, నూతనాకారుడున్ను, పరమార్థస్వరూపముయొక్క ఏకరూపమైనవాడును, సమస్త అజ్ఞానతమస్సును నశింపజేయుటలో సూర్యుని వంటివాడును, చిద్ఘన స్వరూపుడునగు గురువుకొఱకు నమస్కారము.

**స్వతంత్రాయ దయాక్లుప్త విగ్రహాయ శివాత్మనే ।**
**పరతంత్రాయ భక్తానాం భవ్యానాం భవ్యరూపిణే ॥**

స్వతంత్రుడున్ను, అనగా ప్రకృతి కధీనము గానివాడును, దయా మృతముచే చేయంబడిన విగ్రహము గలవాడును, శివస్వరూపమైన ఆత్మగలవాడును, భక్తులకు పరతంత్రుడైన వాడును, భక్తులకు భగవత్స్వరూపుడునగు గురువుకొరకు నమస్కారము చేయుచున్నాను.

ఇప్పుడు గురుగీతలో గల భావము పూర్తి చేయడమైనది. ఇతర గ్రంథముల ఆశయము చూడుడు :- శ్రీ సీతారామాంజనేయ సంవాదము యొక్క ఆశయ మెటువంటిదో గ్రహించుకొనుడు.

**గురుపదాంభోజముల్ గొలువక గల్గునే**
**ప్రవిమల వైరాగ్య భాగ్యమహిమ**

గురుపాద తీర్థంబు గ్రోలక గల్గునే
　　జ్ఞానవిజ్ఞాన యోగానుభవము
గురుసుప్రసాదంబు గొనకున్న గల్గునే
　　ప్రతిలేని చిత్తోపరతి సుఖంబు
గురుతత్త్వ మాత్మ గన్గొనకున్న గల్గునే
　　నిరతిశయంబైన పరమపదము

అట్లు గావున విద్యార్థియైన యోగి
వినయ భయభక్తు లెదలోన బెనగొనంగ
నల చతుర్విధ శుశ్రూష లాచరించు
కొనుచు ననిశంబు గురువుల గొలుచు ననఘ.

ధరణిలోపల నారారు తత్త్వములకు
నవ్వలై యున్న తత్త్వంబు నెవ్వడెరుగు
శివుడు గురురూపమున వచ్చి చెప్పకున్న
నవ్యతరభోగి శ్రీసదానందయోగి.

శ్రీసదానందయోగి గొప్ప సిద్ధపురుషుడు.

పాపము కొందరు భక్తులును, కొంతవరకు సదాచారము గలవారున్ను, కొన్నిశాస్త్రములు చదివినవారు గలరు. అది యేమో వారి అదృష్టము మంచిది కానందుచే తగిన యోగ్యుడగు గురువు దొరకక పోవుటచేతను, దురాచారము, దుర్వృత్తి, దుష్టకృత్యము గల గురువులు దొరుకుటచేతను, (భో)రోగులగు గురువులు లభించుటచేతను, వారికన్నులలో నిటువంటి గురువులే యెచ్చటను గనుపించుటచే నీ పాడు గురువులుండి యేమి? లోకమునకు బాధయే గల్గునని తలంచి, అందరు గురువులున్ను ఈలాగున ఉండవచ్చు నని ఊహించుకొని గురువు లవసరము లేదని చెప్పుటేగాక, గురువులను గూడ నిందించుచుందురు. అది వీరికర్మశేషమే గాని మహాగురువులు పరమ పూజ్యులు. బ్రహ్మజ్ఞాన ఘనీభూతులు, ఆత్మబోధకులు, దయాస్వరూపులు,

ఈశ్వరైకరూపులగు మహాత్ములు వారికి దొరకలేదు. పరుసవేది సోకిన వెంటనే యినుమేలాగున బంగారగునో, ఆలాగున మాయాబద్ధజీవులు అట్టి పరమ గురువుల పాదస్పర్శముచేతనే పవిత్రు లగుదురు. అట్టి వారికేగదా గురుమహిమ తెలియును! నేత్రమందు పసిరికవ్యాధి గలవారికి లోకమంతయు పచ్చగానే కనుపించునట్లు వీరి గుణమున్ను, వీరికి దొరికిన కర్మగురువుల దుర్గుణములున్ను చూచి లోకమంతటను అందరును ఆలాగుననున్నారని తలంచుచున్నారు. శ్రీరామకృష్ణపరమహంసలు, గురునానక్ మొదలైన మహాగురువులు వారు చెప్పేలాగున గలవారలా! అయితే ప్రస్తుత మెక్కువమందిన్ని వారు చెప్పు తరగతిలో నున్నారు. ఇదిన్ని మనము స్మరణకు తెచ్చుకొనందగినది :-

**వేదశాస్త్రంబులు వివరించి బుధులచే**
**జదివింపవచ్చు దా జదువవచ్చు**
**యజ్ఞదానతపంబు లధికారిజనముచే**
**జేయింపవచ్చు దాజేయవచ్చు**
**నిలలోన గల తీర్థముల కేగ నన్యుల**
**బోధింపవచ్చు దా బోవవచ్చు**
**నష్టాంగయోగవిద్యల నార్యులకు నుప**
**దేశింపవచ్చు సాధింపవచ్చు**

**గాని యెవ్వారికైన విజ్ఞాన యోగ**
**గతిని దేహేంద్రియము లరికట్టి మనము**
**నాగి యంతర్ముఖము జేసి యనవరతము**
**నిశ్చలసమాధి నిష్ఠచే నిలుపరాదు.**

అని సీతారామాంజనేయ సంవాదము.

వేదశాస్త్రాదులు పైపద్యములో వివరించిన వన్నియు ఒకవేళ స్వప్రయత్నముచే సాధించవచ్చునుగాని, నిర్వికల్ప సమాధియందు దైవభావములో సదా

నిలుచుటకు గురుకృప తప్ప గత్యంతరము లేదు. ఇప్పుడు లోకాతీతజ్ఞానము గలవారున్ను, ప్రపంచములో గల సమస్త ధర్మకర్మములను కుప్పలవలె వెక్కిరించిన వారునగు శ్రీవేమనయోగీశ్వరులు గురువిషయమై యెంత గౌరవ భావము జూపియున్నారో చూడుడు. ఆత్మానుభవముగల మహాత్ములందరు నాలాగుననే యుందురు.

**అంజనంబు కనుల కంటించి చూచిన**
**సొమ్ము దొరకు భువిని సూత్రముగను**
**గురుని నమ్మి కరుణ గుణమంటి చూడరా**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**అన్ని దానములను నన్న దానమె గొప్ప**
**కన్నవారి కంటె ఘనులు లేరు**
**ఎన్న గురునికన్న నెక్కువ లేదయా**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**ఉత్తమ జ్ఞాన నిలయమౌ నుపమచేత**
**భక్తి సాధించి పూర్ణత బడయవచ్చు**
**ముక్తి కిరవగు గురునాజ్ఞ మొదటిదయ్యె**
**అది లభించిన సర్వంబు నబ్బు వేమ!**

**ఉపమతోడ గురుని నొప్పుగా సేవించి**
**జపము హృదిని జేయు జాడలెరిగి**
**తపము జేయువాడు తత్త్వజ్ఞుఁడగు యోగి**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**గురుడనగ ధేనువై తగు**
**వరశిష్యుడు వత్సమగుచు వర్తింపఁగా**
**దటి గలిగినప్పు డొసగును**
**నిరుపమ లక్ష్యామృతంబు నిజముగ వేమా**

గురుపరంపర నీవిద్య గూఢమెఱిగి
పరమ పరిపూర్ణ మందుట పరవశతర
నిరుపమానంద సుఖకేళి నెఱపవలెను
బరశివుండన భాసిల్లవలెను వేమ!

గురువు లేక విద్య గురుతుగా దొరకదు
నృపతి లేక భూమి నియతిగాదు
గురువు విద్యలేక గురుతర ద్విజుడౌనె
విశ్వదాభిరామ వినుర వేమ !

గురుని శిక్షలేక గురుతెట్లు కల్గునో
అజునికైన వాని యబ్బకైన
తాళిపుజెవి లేకతలు పెట్టు లూడును
విశ్వదాభిరామ వినుర వేమ !

చెడు గుణంబు లెల్ల జేపట్టి శిక్షించి
పరమ పదవి సిద్ధపడగ జూపు
నట్టి గురుని వేడి యపరోక్ష మందరా
విశ్వదాభిరామ వినుర వేమ!

చదువురాదటన్న సామాన్యత యికేల
బుద్ధి కుదరకున్న పొంది కేల?
గురుని గూర్చ ముక్తి కరతలామలకమౌ
విశ్వదాభిరామ వినుర వేమ!

తనివి దీఱ గురుని ధ్యానించి మదిలోన
దనువు మఱచి గురుని దాకినపుడె
తనరుచుండు బ్రహ్మతత్త్వమందురు దాని
విశ్వదాభిరామ వినుర వేమ!

దేహమాత్మ రూపు తేటతెల్లము జేసి
యవని చూపు చూచి నతడె గురువు
భ్రమరము తనరూపు క్రిములకిచ్చిన రీతి
విశ్వదాభిరామ వినుర వేమ!

వెఱుపులేక గురుని వేడుచు వేసారి
స్థిరముగాను పూజ చేసి చేసి
వరముగన్నవాడు పరిపూర్ణ యోగిరా
విశ్వదాభిరామ వినుర వేమ!

కలుష మానసులకు గాన్పింపగా రాదు
అడుసు లోన భాను డడగినట్లు
తేటనీరు పుణ్య దేహ మట్లుండురా
విశ్వదాభిరామ వినుర వేమ!

కస్తురి యటుజూడ గాంతి నల్లగనుండు
పరిమళించు దాని పరిమళంబు
గురువులైన వారి గుణము లీలాగురా
విశ్వదాభిరామ వినుర వేమ!

తరువ దరువ బుట్టు దరువునం దనలంబు
దరువ దరువ బుట్టు దధి ఘృతంబు
తలప దలప బుట్టు తనువున దత్త్వంబు
విశ్వదాభిరామ వినుర వేమ!

దేవపూజ సేయ దివ్యభోగము గల్గు
తత్త్వమెరుగ గలడు దైవసముడు
ఏమిలేని నరుని కేగతి లేదురా
విశ్వదాభిరామ వినుర వేమ!

**అంతరంగమందు నపరాధములు సేసి**
**మంచి వానివలెనె మనుజుడుండు**
**ఇతరు లెరుగకున్న నీశ్వరుడెరుగడా?**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**చిత్తమనెడు వేరు శిథిలమైనప్పుడే**
**ప్రకృతి యనెడి చెట్టు పడును పిదప**
**గోర్కులనెడి పెద్ద కొమ్మలెండును గదా!**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**ఆశలుడుగ గాని పాశముక్తుడు గాడు**
**ముక్తుడైన గాని మునియు గాడు**
**మునియునైనగాని మోహంబు లుడుగవు**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**పాముకన్న లేదు పాపిష్ఠిదగు జీవి**
**యట్టి పాము చెప్పినట్లు వినుము**
**ఇలను మూర్ఖు దెల్ప నెవ్వరి వశమయా?**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

ఈశ్వరుండు సర్వవ్యాపకుడైనను లోకమునకు దైవజ్ఞానమును దెలుపవలసి వచ్చునప్పుడు ఒక మహాపురుషుని హృదయముద్వారా మాత్రమే సాధ్యపడును. విద్యుచ్ఛక్తి అనగా ఎలక్ట్రిక్ సమస్తమును వ్యాపించి యుండినను ఒక యంత్రము ననుసరించియే అది దీపముగా ప్రకాశించుటకున్ను, యంత్రముగా పనిచేయుటకున్ను సాధ్యపడును. నిజముగ విచారించినను మహాగురువు లిటువంటి వారలే. అట్టివారు లేనిచో మనము దైవవిషయ మేమియు తెలుసుకొనజాలము. మరియు సూర్యరశ్మి లోకమంతట ప్రసరింపబడి యుండినను భూతఅద్దముద్వారా మాత్రమే ఆరశ్మిని అగ్నిగా పరిణమింప జేయ సాధ్యపడును. ఆలాగున పరబ్రహ్మము పరమాణువులనుండి

పృధివ్యాది మహాగోళములో వ్యాపించియున్నను పరిశుద్ధమగు బ్రహ్మనిష్ఠుల హృదయద్వారముగ అది ప్రకాశించి భక్తులకు జ్ఞానమును గలుగజేయవలసి యుండును. బ్రహ్మజ్ఞులగు మహాగురువులు భూతఅద్దమువంటివారలే. విద్యుచ్ఛక్తి ఒక్కొక్కదీపముతో సంబంధించి అన్ని దీపము లేలాగున వెల్గుచుండునో కరెంటు ఒక్కొక్క యంత్రముతో సమన్వయపడి అన్ని యంత్రము లేలాగున పనిచేయుచుండునో, అయస్కాంతముతో సంబంధింపజేయబడు సూదు లన్నిటిని అది యేలాగున లాగుకొనుచుండునో ఆలాగున బ్రహ్మవిద్యా ప్రబోధకులగు గురువుల ననుసరించి శిష్యప్రశిష్యులు పరంపరలుగా నేర్పడి దైవ జ్ఞానము గలవారగుచున్నారనియే మహర్షుల సిద్ధాంతము. కనుక ఇది అనాది నుండి గురుపరంపరగా నేర్పడినది. ఇది సర్వదేశములలోను, సర్వమతము లలోను గలదు.

ఇప్పుడు ఆధునికులగు మతకర్తలు, సంఘ సంస్కర్తలు, ఆత్మజ్ఞులు నగు గురువులను గురించి విచారింతము:- వీరిలో బ్రహ్మసమాజ స్థాపకులగు రాజా రాంమోహనరాయ్‌గారును, ఆర్యసమాజ ప్రతిష్ఠాపకులగు దయానంద సరస్వతీస్వామియు ముఖ్యులు. ఇంతవరకు చెప్పబడిన ప్రాచీనులగు శ్రీశంకర, శ్రీరామానుజ, శ్రీమధ్వ, శ్రీకృష్ణచైతన్యులు మొదలగు ప్రముఖులు కేవలము మతము విషయమై అనగా అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములు, శ్రీకృష్ణభక్తి మొదలగు వానిలో అపారముగ కృషి సలిపిరేగాని సంఘసంస్కరణ విషయమై యెక్కువ పనిచేసినట్లు కనబడదు. దానికి కారణమీలాగున నుండ వచ్చును. అప్పుడు హిందూదేశములో స్వదేశరాజుల పరిపాలనము క్రింద రాజ్యపరిపాలనము వలెనే, వర్ణాశ్రమములు మతసంబంధములు గూడ గల్గియుండెను. కావున పైజెప్పిన ఈ కార్యములో ప్రవర్తింపజేయవలసిన పని వారి దృష్టికి కనబడియుండలేదు. అప్పటికాలమునకు అదిసరిగానే యుండ వచ్చును. అయితే శ్రీబుద్ధ, శ్రీయేసుక్రీస్తు, శ్రీమహమ్మదు మొదలైనవారు మతసంస్కరణముతో గూడ సంఘసంస్కరణముగూడ చేసి కొనిరి.

అయితే శ్రీ శంకరప్రభృతులకు అప్పటి కాలము ననుసరించి, జనుల

పరిపక్వత ననుసరించి, ఆచారవ్యవహారములకు సంబంధించి, రాజ్యపరిపాల రీతి ననుసరించి అది సరిగానే యుండవచ్చును. కాలాంతరముచేత పైజెప్పిన వన్నియు తలక్రిందుగా పరిణమించినందుచేతను, రాజ్యపరిపాలన చట్టము విదేశీయుల హస్తగతమగుటచేతను, ప్రపంచము సర్వత్ర పరిణామము జెంది వచ్చుటచేతను, ఉన్నతజాతిలో గలవారలకు ఉత్కృష్టములైన గుణములు తగ్గి పోయినను జన్మముచేతనే శ్రేష్ఠులైరని తలంచుటచేతను, అన్యజాతిలో ఉత్కృష్ట గుణము గలవారు ఉద్భవించినను శ్రేష్ఠపదవి కర్హత లేదని వాదించు టకు ప్రారంభించుటచేతను; ధర్మబోధకులై, దయాస్వరూపులై సమబుద్ధి గలవారలై ఉండవలసిన సాధువులకు అనగా సన్న్యాసులకు అట్టి దైవికగుణ ములు లోపించిపోయినను వేషపరిగ్రహముచేత మాత్రము ముక్తిగల్గుననియు, ఇతర ఆశ్రమములలో నుండువారు ఎటువంటి శ్రేష్ఠులైనను బ్రహ్మజ్ఞానులై నను తమకు సమానులుగారనియు చెప్పుటకు ప్రారంభించుటచేతను ఈ నూతనమత స్థాపకులు సంఘసంస్కరణముగూడ చేయవలసివచ్చినది.

ఇట్టి సంఘసంస్కరణ విషయమై వ్రాసియుండు గ్రంథములను అనగా స్మృత్యాదులను శ్రీశంకర, శ్రీ రామానుజ, శ్రీ మధ్వాచార్యాదులు చూచి యుండియు నేల సంఘసంస్కరణమునకు గడంగక విడిచిపెట్టిరో తెలియ కున్నది. ఏలన? అట్టి విశాలహృదయులై, జ్ఞానస్వరూపులైన వారలు లోకములో గల యీ అంధవిశ్వాసములను ఎట్లు సహించిరో, మూఢనమ్మకము నెట్లు ఒప్పుకొనిరో తెలియజాలము. మొత్తముమీద అట్టి కాలపరిస్థితియు, జనుల యొక్క స్థితియు దానికనుగుణముగానే యుండవచ్చును.

శ్రీరాజారాం మోహనరాయ్‌గారు, దయానంద సరస్వతీస్వామిగారు మత సంస్కరణమునకన్న సంఘసంస్కరణమునకెక్కువ పాటుపడినట్లు వారి చరిత్రమువల్ల గోచరమగుచున్నది. ముఖ్యముగా హిందూదేశములో జనుల అభివృద్ధికి అడ్డు గలుగజేసెడు కల్పితగ్రంథము లనేకములు గలవు. ఇవి యన్నియు నీశ్వరనిర్మితములనియు, మహర్షిప్రోక్తములనియు చెప్పి జనులను నమ్మించుటకు ప్రారంభించిరి. నమ్మని వారు నాస్తికులనియు, వేద దూరు

లనియు రాజులకు బోధించి దండించుటకుగూడ ప్రయత్నించిరి. అదే యీ దేశముయొక్క అధఃపతనమునకు ముఖ్యకారణమైనది. సత్యబుద్ధియు, దైవచింతనయు, ధర్మనిష్ఠయు గలవారెవరున్ను యుక్తాయుక్తములకు విరుద్ధములగు వాక్కులు దైవవచన మనియో, ఋషి ప్రోక్తమనియో నమ్మజాలరు. అట్లు నమ్మకూడదనియే సచ్ఛాస్త్రముగూడ చెప్పుచున్నది.

అయినను సత్యధర్మములను తెలిసికొని అనుష్ఠించి లోకమునకు బోధించుటకు తగిన సంఘము మనదేశములో లేకపోయినది. నవీనమతకర్తలగు శ్రీదయానంద, రాజారాంమోహనరాయ్ మొదలైనవారు ఈ సత్యాన్వేషణములో చాల కృషిసలిపినవారలు. దయానందసరస్వతీస్వామిగారు మరింత విశేషముగా మనస్సు నీ సత్యాన్వేషణములోనే వినియోగపరచియున్నారు. వీరుభయులున్ను ఆది వేదమగు ఋగ్వేదమునుండి, ఆది స్మృతియగు మను శాస్త్రమునుండి నేటివరకుగల గ్రంథము లన్నిటిని పరిశీలించిన వారనియే చెప్పవచ్చును. ఒక్కవేళ మతతత్త్వమునకు భిన్నములైన గ్రంథములు చదువక పోయినను, మతములను ప్రతిపాదించెడు శ్రుతిస్మృత్యాదుల నన్నిటిని వారా మూలాగ్రముగ శోధించినవారలే. అంతేగాక బౌద్ధ, జైన, మహమ్మదు, క్రీస్తు మొదలైన వారి మతగ్రంథములనుగూడ చదివినవారలే.

ఈ విషయములో పాశ్చాత్య మతగ్రంథములను ఎక్కువగ పరిశోధించినవారు రాజారాంమోహనరాయ్‌గారే. వీరికి హిందూదేశ ముఖ్యభాషలేగాక జర్మన్, లాటిన్, అరబీ, ఉరుదు, ఇంగ్లీషు మొదలైన భాషలలోగూడ పాండిత్యము గలదు. వీరి మతములను సనాతనులుకొందరు హిందూమతమునకు భిన్నమని చెప్పినను దానియందేలాటి సత్యమును లేదు. వీరు వేదమతానుయాయులే. అయితే కేవలము ఎవరైన ఒక్కదానిని జెప్పినచో నట్టిది మూఢ విశ్వాసముతో నమ్మువారు కారు. అది వేదము చెప్పినదైనను, దైవము చెప్పినదైనను, ఋషి చెప్పినదై యుండినను చక్కగ బుద్ధిని ఉపయోగపరచి యుక్తియుక్తముగాను; జనుల మహాభివృద్ధికిన్ని, సచ్ఛాస్త్రమునకున్ను, అనుకూలముగా నుండునా? లేదా? అని చక్కగ పరిశోధించి అనుకూలమనియు, సత్య

మనియు తోచిన మాత్రమే నమ్ముదురు. ఇది సత్యనిష్ఠునియొక్క లక్షణమై యున్నది.

ప్రతివారును ఈలాగున ఉండవలయుననియే నేను గోరుచున్నాను. అయితే బుద్ధియందు భ్రమప్రమాద దోషములు గలవు. అట్టి స్థితిలో దైవము యొక్క ఆజ్ఞను తెలిసికొనెడి జ్ఞానమున్ను, వేదార్థములను లెస్సగా గ్రహించు కొను శక్తియున్ను పూర్వికులైన ఋషులయొక్క ఆశయమును, తెలుసు కొనెడు మహిమ గలిగి యుండవలసినదేగాక వర్తమానయుగములో గల మత తత్త్వమెరింగిన మహాపురుషుల అభిప్రాయముగూడ తెలుసు కొన వలసి యుండును. లేనిచో ప్రమాదములో పడిపోవుట నిక్కము. ఇదిన్ని స్వాతంత్ర్య ప్రియులున్ను, సత్యాన్వేషులున్ను తెలుసుకొనియుండవలెను. దయానంద రాయలు గార్లు కల్పితములై, బాహ్యాడంబరములతో గూడినవై, యేలాటి అర్థమున్ను లేనివై, ఆత్మశుద్ధి కుపకరించనివై యుండు కర్మ కాండము లన్నిటిని దూరీకరించిరి. దేనివల్ల ఈశ్వరప్రీతియు, ఆత్మశుద్ధియు, దైవజ్ఞాన మున్ను గల్గునో అట్టి పవిత్ర కార్యముల మాత్ర మంగీకరించిరి.

ఇట్టి విషయములో రాయలవారికన్న దయానందుల వారే యెక్కువ నిపుణులు. వేదాధ్యయనము, అగ్నిహోత్రము, బ్రహ్మచర్యవ్రతము అత్యవ సరములైన యోగసాధనలు, రాయలవారి మతమునకన్న దయానందులవారి మతములో నెక్కువ గలవు. వీరుభయులున్ను సంఘసంస్కరణములో సమానులు. మూఢవిశ్వాసములను, కల్పితకథలను, అర్థము లేని బాహ్యక్రియ లను వీరు నమ్మరు. మరల జనులయొక్క ఉచ్చనీచావస్థలు గుణకర్మల ననుసరించి యుండునేగాని కులకర్మమునుబట్టి లేదని సిద్ధాంతీకరించువారు. ఆదిలో ఆర్యమతము ఒకటియే యుండెనని, బ్రహ్మోపాసన మతమొకటియే పురాతనకాలమునుండి యుండెనని దయానందులవారును, రాయలు గారును వాదింతురు. తక్కిన వర్ణములన్నియు మధ్యకాలములో నేర్పడె ననియు చెప్పుదురు. ఇది చాలవరకు అంగీకరించవలసినదే.

కల్పితములగు శాస్త్రము లను జనులను బంధించియుండిన గొలుసు లన్నియు వీరు తమయొక్క వివేకమను ఉక్కు గొడ్డలిచేత నరికివేసిరి. స్వార్థ పరులచే, సంకుచిత హృదయులచేతను, అర్థములేనిదేగాక అనర్థములను గలుగచేసెడు వ్యర్థకర్మలచే కట్టబడిన దృఢమగు కోటలోపల బంధించబడి యుండు జనులందరిని వీరియొక్క ఆత్మోద్బోధమను ఫిరంగి గుండ్లచే ఆ దుర్భేద్యములగు పాపపు కోటలను ధ్వంసమొనర్చి బయటికి తీసిరి. ఆహా! యెంత మహత్తైన ఉపకారము చేసిరి? అట్టి బోనులో పెట్టి చీకటిగదిలో నుంచి యుండిన జనులను ఆత్మసోదరులారా! అని కరుణతో బిలిచి ప్రేమానురాగ ములతో గాఢాలింగనముచేసి చీకటిగదిలో కఠినశిక్ష వేసియుండు కారాగృహ బంధీకృతుని బంధవిచ్ఛేదన మొనర్చి బయటికి తెచ్చినట్లు వీరున్ను జన సముదాయమును ధర్మపంధాలోనికిన్ని, జ్ఞానసూర్యప్రకాశములోనికిన్ని, దైవ చింతనచేయుట కనుకూలమగు మందమలయ మారుతములోనికిన్ని తెచ్చిరి.

అయితే వీరుభయుల మతముల నింతవరకు జనులు వేదవిరుద్ధ ములని తలంచియుండిరి. దానికి కారణమేమనగా? భారతీయులు హిందూ దేశమును విడిచి యితరదేశపరిస్థితిని తెలుసుకొనుటకు ప్రయత్నించిన వారరుదుగా నుండిరి. దానికి ఉదాహరణము చెప్పెద. ఏదైన మహత్తరము లగు వైదికకార్యములు ప్రారంభించినప్పుడు "కృష్ణా గోదావర్యోః మధ్యప్రదేశే" "కృష్ణాకావేర్యోః మధ్యప్రదేశే" అని చెప్పే మామూలు గలదు. దీనివల్ల ఏమి అర్థమువచ్చు ననగా? వీరి బుద్ధి యింతవరకే వికసించియున్న దనియు నీ నదులయొక్క మధ్యప్రదేశమే వారికి తెలుసుననియు గోచర మగుచున్నది. ఇది యేదైన మహాసంకల్పము ప్రారంభించినచో "జంబూద్వీపే భారతవర్షే భరతఖండే"అని గూడ ప్రారంభింతురు. పై చెప్పిన వారికన్న వీరి హృదయము కొంచెము వికసించినదని చెప్పవచ్చును. ఏలన? వీరు భరత ఖండము మాత్ర మెరింగియున్నారు. దానికన్న యెక్కువ దేశపరిస్థితి యేమియు తెలియదని గోచరమగుచున్నది. అట్లుగాక గొప్పదగు యజ్ఞము మొదలగు మహాకార్య ములు ప్రారంభించి వానియొక్క పర్యవసానమున చేయు "చతుస్సాగర

పర్యంతం గోబ్రాహ్మణ హితాయ చ''అను ఆశీస్సు అన్నిటికన్న యెక్కువైన స్థితిగా నుండును. దీనివల్ల హిందూదేశముయొక్క తూర్పు సముద్రము బంగాళాఖాతమునకున్ను, దక్షిణప్రదేశమగు హిందూమహాసముద్రమునకున్ను, పశ్చిమప్రదేశమగు అరబ్బీసముద్రమునకున్ను, మధ్యగా నుండు నీదేశమును మాత్రమే వీరు తెలుసుకొనియున్నారు. కనుకనే వీరి భావము ఇంతకంటే వికసించకపోయినది.

అయితే యిది వేదకర్తలగు ఉపనిషత్ప్రవక్తలగు ఋషుల ఆశయము గాదని మాత్రము జ్ఞాపకముంచుకొనవలెను. మధ్య ఏర్పడిన కర్మకాండుల యాశయమని తెలుసుకొనవలయును. ఋషులు ఆబ్రహ్మస్తంబపర్యంతము భూర్భువాది ఊర్ధ్వలోకములకు అతల, వితల, పాతాళ లోకములనేగాక బ్రహ్మాండములో గల సమస్త చరాచరములకు మంగళము నాకాంక్షించు వారలే. ఇట్టి మహాశయుల దివ్యాశయమును దెలిపెడు ఉపనిషద్వచనములను, వేదాంతవాక్యములను, వేదమంత్రములను ఎత్తి చూపి హిందువుల ఆశయము ఎంతవిశాలమైనదని చూపువారనేకులు గలరు. వేదాంతులు అంతయు బ్రహ్మమనియు, వైష్ణవులంతయు విష్ణుమయమనియు, లేక ఈశ్వరమయమనియు, చెప్పుదురు. అయితే ఆలాగున మీరు ఆచరణలో పెట్టుచున్నారా? అని యెవరైన అడిగినచో కలహము సిద్ధము. అంతేగాక అడిగిన వారిని నాస్తికుడు, వేదదూషకుడనియుగూడ చెప్పువారు కొందరు గలరు. ఇదంతయు ఎటులైన నుండనీ, ప్రపంచములో దైవసృష్టిలోగల మానవులలో దైవతత్త్వమున్ను, భూతదయయు, విషయ విరక్తియున్ను, పరోపకారబుద్ధియు గనుగొన్న వారలలో ఆచరణలో పెట్టిన వారలలో భారతదేశీయులే అగ్రగణ్యులని ఘంటాపథముగ చెప్పుటలో నేలాటి సందేహము లేదు.

అయితే ఆకాలమునుగురించి స్మరించిన మనస్సు నీరుగా కరిగి వరదలై పారుచుండును. ఓసర్వేశ్వరా! కరుణామూర్తీ! దీనదయాళో! భక్తవత్సలా! అట్టి పుణ్యకాలము, అట్టి పుణ్యజీవులు ఈ భరతఖండములో నెప్పు డేర్పడుదురు! ఎప్పుడిది ఆచరణలోనికి వచ్చునో అప్పుడుమాత్రమే ఋషి

సంతానములగు భారతీయులు దుఃఖము లేనివారలై నిత్య సుఖమును బొంద గలరు. ఆర్యమతము, బ్రాహ్మమతము ప్రారంభదశలో వృద్ధికి రాకపోయెను. మధ్యకాలములో కొంత అణగియుండినను, నిప్పుడిప్పుడీ రెండుమతములు వృద్ధినొందుట లోకమునకు శ్రేయోదాయకము. అభివృద్ధి గల్గుటకున్ను అది శాస్త్రసమ్మతమని జనులకు నమ్మకము గల్గుటకున్ను, వానిలో చేరుటకు మను ష్యుల కభిలాష గల్గుటకున్ను కారణము గలదు.

ముఖ్యకారణమేమన? విదేశములగు జర్మనీ, జపాన్, చైనా, ఆస్ట్రే లియా, ఇంగ్లాండు, రష్యా, అరబ్బీ మొదలైన పరిశ్రమ దేశములను భారతీ యులు వెళ్ళి చూచుటయు, ఆ జనులయొక్క సంఘబలమున్ను, గార్య నైపుణ్యమును, కర్మపవిత్రతయు తెలుసుకొనుట ఒకటి. రెండవది ఇంతవరకు సంస్కృతములో గల శాస్త్రములు చదువుటకు అందరికిన్ని అర్హత లేక పోవుట చేత; ఆ భాష తెలుసుకొనుటకు దుస్తరమగుటచేతను; నిప్పుడు అనేక మత గ్రంధములు, వేదాంతగ్రంథములు, స్మృతులు, ఉపనిషత్తులు, వేదములు ఆ యా దేశభాషలలోనికి పరివర్తనము చేయుటచేతను, సర్వజనులకు అన్ని శాస్త్ర ములు చదువుట కర్హత గల్గియుండుటచేతను, మతము లన్నిటిని సమన్వయ పరచి చూచుటకు శక్తి గల్గినందుచేతను, సత్యాసత్యములు కొంతవరకైన తెలుసుకొనుటకు భాగ్యము లభించుటచేతను దయానందుల రాయలవారల మతములో చెప్పునట్లు ఆచరణలో నుంచుటకు సాధ్యమైనట్లు వారు ఏర్పాటు చేయుటచేతను, జనులకు పై జెప్పిన రెండు మతములలో ప్రవేశించుట కుత్సాహము గల్గినది.

కావున సనాతనులమని చెప్పువారు గూడ జనులయొక్క బుద్ధివికాసము ననుసరించి యేర్పాటు చేసుకొనుటయే మంచిది. వర్షముచే కాలువలద్వారా జలమువచ్చి చెరువు నిండునప్పుడు కలుజు తీసివేయుటే మంచిది. లేనిచో మూర్ఖపుపట్టున గట్టివేసిన చెరువుకట్టతోగూడ ధ్వంస మొనరించి జలము ప్రవ హించునను తత్త్వము జ్ఞప్తిలో నుంచుకొనుట మంచిది. మహాత్మైన గోదావరి, కృష్ణ మొదలగు నదులకు కట్టిన ఆనకట్టల తలుపులుగూడ వర్షకాలమున జల

ప్రవాహము వచ్చినప్పుడు తెరచి పెట్టుచున్నారు. లేనిచో కట్టను త్రెంపి గ్రామములను నశింపజేయుటయే ఫలితమగును. కనుక మతపుకట్టులు సనాతనుల కట్టులని చెప్పి కూర్చుండిన లోకమునకు కష్టమే ఫలితమగును. ఈశ్వరాజ్ఞను అతిక్రమింపజూచుట బండిచక్రమునకు నీగ అడ్డుపోయి నిలచినట్లుండును. కావున లోకానుసారము జనుల హృదయ వికాసానుగుణముగ వారి వారి యోగ్యతల ననుసరించి సుగుణములను కనుగొని సర్వజనులకు అనుకూల మేర్పరచుకొనెడు మతమే సన్మత మగును. తక్కినవన్నియు దుర్మతములని భేరి ఘోషించెడు కాల మాసన్నమైనది.

ముఖ్యముగా "ఆత్మ వత్సర్వభూతాని" అని యుద్ఘోషించిన సనాతన మతము ఇప్పుడీలాగున ప్రవర్తించుచున్నదా? "బ్రహ్మైవేదం"అని యుద్ఘోషించెడు వేదాంత మతమాలాగున నడచుచున్నదా? అని ప్రజ్ఞావంతులును జ్ఞాపకములో నుంచుకొని ఋషుల పాదధూళిచే పునీతమ్మైన పుణ్యభూమి యగు భారతదేశము నుద్ధరించుటలో ప్రయత్నింతురుగాక! మైనరు కాలము తీరువరకు మాత్రమే అతని పిత్రార్జిత సొమ్ములో స్వాతంత్ర్యము లేక పోవును. మైనరుకాలము దాటిన ఎవరు ఇంతవరకు రక్షకులై యుండిరో వారు మంచి బుద్ధి, జ్ఞానము, ధర్మము చెప్పి ఆ బాలునియొక్క తండ్రి సొమ్మును అతనికి ఒప్పచెప్పుటయే మంచిది. అట్లు చేయక యింతవరకు రక్షకులై యుండేవారు ఏదైన కుయుక్తులు, కుతంత్రములు చేసుకొని యివ్వకపోయినచో ఆ బాలకుడు పిత్రార్జితము తప్పక స్వాధీనమగువరకు అతనిని విడిచి పెట్టడు. ఇది నీతియొక్క లాంఛనము. అప్పుడు ఇంతవరకుండిన గౌరవబుద్ధియు, రక్షకుడను భావమున్ను అతనికుండదు. కావున నీలాగున పరిణమించునని ముందుగానే తెలుసుకొని, మంచి మనస్సుతో వారివారిది వారివారి కిచ్చివేసిన మన యొక్క గౌరవమున్ను, మనపైగల నమ్మకమున్ను, పూజ్యభావమున్ను, ధర్మా త్ముడను బుద్ధియున్ను సదా నిల్చియుండును.

మరియు తమయొక్క సొంతదేశమును మంచి స్థితిలోనుంచి సంరక్షించుటకు తగిన తెలివితేటలు లేనివారు తాము సమర్థులమనియు, బుద్ధి

మంతులనియు, ప్రపంచములోగల మానవవర్గములో ఉత్కృష్టులమనియు వచించెడు ప్రగల్భవాక్యము లన్నియు వికల్పవచనము లనియే బుద్ధిమంతులు దలంతురు. మతమనగా ఒక చిత్రము వంటిది. భిత్తి లేనిచో మంచి చిత్ర కారుడైనను నెచ్చట తనయొక్క వైచిత్ర్య శిల్పనైపుణ్యమును జూపగల్గును? మతమనెడు సుచిత్రమునకు దేశము మంచి భిత్తివంటిది. అది లేనిచో తన కార్యమేమియు కొనసాగజాలదు. అట్లు గానివారు దైవము తమను ప్రత్యేక ముగా శ్రేష్ఠులుగా సృష్టించిరనియు, మేమే దైవకుటుంబమునకు వారసుల మనియు, మాకే దేవుడు వారసత్వముయొక్క వీలునామా వ్రాసి యిచ్చియున్నా డనియు చెప్పుటకు సిగ్గులేదా! ఇవి వారియొక్క స్వార్థపరత్వముచే స్వకల్పిత ములైనశాస్త్రములేగాని దైవనిర్మితములుగావు. స్వబుద్ధితో సత్యమును చింతిం చుటకు శక్తిలేని సాధుజనులు నమ్ముటకొరకు అట్టి స్వార్థపర వాక్యములను దేవుడు చెప్పినాడని చెప్పిరేగాని దీని యందిసుమంతైన సత్యము లేదు.

ఇది పక్షపాత రహితుడై సర్వసముడై కరుణామూర్తియై సత్యశీలుడగు సర్వేశ్వరుని అవమానించుటయే గదా! ఇది సత్యమైన శ్రుతివాక్యమునకు విరుద్ధవచనము. శ్రుతిస్మృతులు దైవఆజ్ఞలనియు వాని నతిక్రమించువారు దైవనిందితులనియు వ్రాయువారున్ను, చెప్పువారున్ను ఈశ్వరుండు సర్వ భూతములలోను సమానముగ నుండువాడనియు వారివారి కర్మములకు తగిన ఫలమును గలుగ జేయువాడనియు; సత్య, శాంత, దయా, విరక్త్యాది దైవగుణములు గల్గి నిర్మలహృదయులై అనన్య భక్తిగలవారి హృదయములో మాత్రమే కనుగొనుటకు సాధ్యమగుననియు తెలిపెడు శ్రుతిస్మృతులు వీరి కన్నులకు గనుపించుట లేదా? ఇది జనుల నందరిని సత్యమార్గములో నడప తలంపు గలవారి ఆశయమై యుండును. అట్టివారికి సర్వేశ్వరునియొక్క కరుణ గల్గుట నిక్కము.

శ్రీరాయలవారున్ను, దయానందుల వారున్ను పై జెప్పిన దానియందు దృష్టి నుంచి ప్రవర్తించినవారలే. వీరుభయులయొక్క జననకాలమునకు 50 సంవత్సరములు హెచ్చుతగ్గులు గలవు. రాయలవారి జననమునకు 50

సంవత్సరముల తర్వాత దయానందులవారు జన్మించిరి. వీరుభయులును ప్రపంచములో నింతవరకుండిన కర్మకాండ కఠోరకుతర్కకుమతము లను చెడు వృక్షములను సమూలముగా తీసివేసి మనుష్య హృదయములో సత్య, ధర్మ, దయా, శాంతులు మొదలగు మంచివృక్షములు పెట్టుటకు చాలశ్రమ పడిరి. అయితే వీరు నాటిన సుందరములగు తరువులు లేబ్రాయములో నుండుటచే కర్మకాండకంటక భూరుహములు చుట్టుప్రక్కల విశేషముగా నుండుటచే వాని నణచివేయుచునే యుండెను. అయినను రాయలవారి అనంతరము బ్రహ్మసమాజమును వృద్ధికి తెచ్చిన కేశవచంద్రసేనుడు ఆ కఠోర వృక్షములయొక్క కొమ్మలను చాల నరికినందుచే ఇప్పుడు బ్రహ్మమత వృక్షము కొంతపైకి ఎక్కినందుచే దూరమునుండి చూచువారికి కనపడే స్థితికి వచ్చినది. ఆలాగుననే దయానందులవారి తర్వాత ఆర్యసమాజమును ప్రచారమునకు తెచ్చిన శ్రద్ధానందస్వాములవారున్ను కఠోరకంటకములగు వృక్షములచే ఆక్రమించుకొనిన వృక్షశాఖలను చాలవరకు ఛేదింపగల్గిరి. కనుకనే ఆర్య మతమున్ను కొంచెము హెచ్చుగ పెరుగజొచ్చినది.

ఇప్పుడు బ్రాహ్మమతస్థాపకులగు రాజారాంమోహనరాయ్‌గారి జీవిత చరిత్రసంగ్రహమును క్రింద వివరించెద. వీరున్ను గురువులకొరకు భరత ఖండమంతయు సంచరించినదేగాక టిబెట్టు మొదలగు హిమాలయ ప్రదేశములను పాదచారియై తిరిగి బుద్ధమతతత్త్వముగూడ గ్రహించుటకు ప్రయత్నించిరి. క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధ, జోరాష్ట్ర మొదలగు ఇతర మతములను చక్కగ పరిశీలించియే తమ మతమును నెలకొల్పిరి.

## రాజారాంమోహనరాయల చరిత్ర

రాంమోహనరాయలు బెంగాలుదేశమునందలి హుగ్లీమండలములో రాధానగరమున 1772వ సంవత్సరమున మే నెలలో జనన మొందెను. తల్లిదండ్రులు తారిణీదేవి, రమాకాంతరాయలు. వీరు చాల దైవభక్తి గలవారు. ఆ దినములలో రాజభాషయగు పారశీకము నేర్చుకొనుటకు రామమోహనుడు

చాల చిన్నతనమునే పాట్నా నగరమునకు పోయెను. అరబ్బీ పారశీకములలో బాగుగ కృషి చేసి పదునారవయేట వంగభాషలో విగ్రహారాధనమును నిషేధించు నొక గ్రంథమును వ్రాసెను. దీనివలన రమాకాంతరాయ లాగ్రహించి కుమారు నింటనుండి వెడలించెను. పదునారేండ్ల యాగర్భశ్రీమంతుడు హిందూదేశమున పాదచారియై తిరిగి తిరిగి హిమాలయము దాటి టిబెట్టుకు పోయి అచ్చట బౌద్ధమత సిద్ధాంతము గ్రహించెను.

అచట లామాలు అనగా బుద్ధమత సన్న్యాసులవద్ద వీరుండిన సంగతి విని తండ్రి అతనిని పిలిపించెను. ఇంటికి వచ్చిన తర్వాత రాంమోహనుని యొక్క మనస్సు కొంచెమైనను మార్పు చెందనందుచే మరల రాంమోహనుడు ఇల్లు విడిచి కాశికిబోయి సంస్కృత విద్యాభ్యాసముచేసి గొప్ప పండితుడయ్యెను. ఇత్తరి అతని తండ్రియగు రమా కాంతరాయలు పరలోకప్రాప్తి నొందెను. తర్వాత తల్లియగు తారణీదేవి కుమారుని పిలిపించుకొనెను. ఇరువది రెండవయేడు మొదలుకొని యిరువది యారవయేడువరకు ఇంగ్లీషు భాషయందు కృషిచేసి చదువను బాగుగ వ్రాయను నేర్చుకొనెను. గ్రీకు, హిబ్రూభాషలలో పాండిత్యమును, ఫ్రెంచి, లాటిన్‌భాషలలో పరిచయముగూడ సంపాదించెను. 18 వందల సంవత్సరమున రంగపురం కలెక్టరు కచ్చేరిలో గుమాస్తాగా ప్రవేశించి క్రమముగా జిల్లా శిరస్తాదారై 1813వ సంవత్సరమున ఉద్యోగము మాని 1814వ సంవత్సరమున కలకత్తాలో కాపురముండవచ్చెను.

మతకలహములతో, జాతిద్వేషములతో, నరబలి, సహగమనము మున్నగు దురాచారములతో మనదేశ మప్పుడంధకారావృతమై యుండెను. దీని నివృత్తికొరకు చిన్నపుస్తకము వ్రాసియు, ధర్మబోధముల నుపన్యసించియు సహగమనాది పాపకార్యముల నివర్తించుటకొరకు గొర్మెంటువారికి మహజర్లను పంపియు, 1829వ సంవత్సరము డిశంబరు నాల్గవతేదీన సహగమనము నిషేధించు చట్టము నిర్మింపచేసి పుణ్యాము గట్టుకొనెను. తర్వాత ముఖ్యములగు నుపనిషత్తులను అతడింగ్లీషు భాషలోనికిని, బాంగ్లాభాషలోనికిని అనువదించి వాని కుపోద్ఘాతములను వ్రాసెను. ఈమధ్య వేదాంతసూత్ర

ములకు కొన్నిటికికూడా ఉపోద్ఘాతములను వ్రాసి ప్రచురించెను. ఏకేశ్వరోపాసనకై యాత్మీయసభను 1815వ సంవత్సరమున స్థాపించెను. వేదాధ్యయనమునకై సర్వజనుల కుపయోగార్థముగా వేదమందిరమను నొక పాఠశాలను స్థాపించెను. ఏసుక్రీస్తు ఉపదేశములను గూర్చియు, మహమ్మదు ప్రవక్తయొక్క సందేశమును గూర్చియు, బుద్ధమతసారమును గురించియు వంగ సంస్కృత భాషలలో గ్రంథములను వ్రాసెను.

ఇట్లు సర్వమత గ్రంథములను భక్తిగౌరవములతో సహేతుక విమర్శనములతో శోధించి, 1828వ సంవత్సరము ఆగస్టు 20వ తేదీన బ్రహ్మసమాజమను పరిశుద్ధాస్తిక మతమును స్థాపించెను. ఢిల్లీచక్రవర్తి రాయబారిగా 1830వసంవత్సరము అతడింగ్లాండునకు పయనమైపోయెను. అక్కడ కవులు, పండితులు, తత్త్వాదిశాస్త్రజ్ఞులు ఇతనితో పరిచయము చేసుకొనిరి. ఇంగ్లాండులో సహగమన సంబంధమైన మతవిషయములోను, రాజకీయ విషయములలోను, పార్లమెంటువారు చేసిన ప్రశ్నలకు రామమోహనుడు అద్భుతముగాను, అమోఘముగాను ప్రత్యుత్తరముల నిచ్చి వారిని తృప్తిపరచెను. 1831వ సంవత్సరమున నతడు ఫ్రాంసునకు పోయి ఫ్రెంచిరాజును సందర్శించి రెండు మూడుమార్లు వారి యతిథిగా మన్నింపబడెను. 1833వ సంవత్సరమున బ్రిష్టలుననుండగా జ్వరము తగిలి 27వ తేదీ శుక్రవారము నాడు శ్రీరాజా రాంమోహనరాయలు ఈశ్వరసన్నిధానము చేరెను.

వీరు చిన్నతనమునుండి మనుష్యులయొక్క దురాచారములను, మూఢ విశ్వాసములను, సోదరభావమునకు భిన్నములైన మతసిద్ధాంతములను, కల్పితములైన అనేక దైవోపాసనలను జూచి చాల వగచుచుండువారు. సమయము దొరకునప్పుడంతయు అగాధనిష్ఠలో దైవధ్యానములో మగ్నులై కూర్చుండువారు. ఏకాంతప్రదేశములోను నిర్మలస్థలములోను, పర్వత ప్రదేశములోను ఏకాకియై దైవధ్యానములో మగ్నులైకాలము గడపువారు. కాశిలో సంస్కృతము చదువునప్పుడు అనేక పండితులతోను, సన్న్యాసులతోను, యోగీశ్వరులతోను, తాపసోత్తములతోను దైవోపాసనావిషయమై చర్చలు

సలుపువారు. బుద్ధమతముయొక్క సత్యము గనుగొనుటకే ఒంటరిగా హిమాలయముదాటి బుద్ధసన్న్యాసులలో ముఖ్యులుండెడు టిబెట్టున మతవిషయమై బుద్ధలామాలతో సంప్రదించి, తనయొక్క ఆత్మతత్త్వమునే నిజమని తెలుసుకొని లోకమునకు బోధించెడువారు.

ఇచట మనకు కావలసిన విషయమేమన? రాయలవారికి గురువుండిరా? లేరా?అను విషయము. దైవసంకల్పముచేతనో, జన్మాంతర సంస్కారముచేతనో వీరికి గల్గియుండు దైవోపాసన విషయములో సందేహ నివృత్తి కొరకే హిందువులకు ప్రధానమగు కాశీక్షేత్రములో ఉండెడు మతాచార్యులతో సంప్రదించుటయు, ఖురాను, బైబిల్, బౌద్ధగ్రంధములు శోధించుటయు జరిగినది. ఈగ్రంధము లన్నిటియొక్క పరిశోధనచేతను అప్పుడు గల మతప్రబోధకులయొక్క ఉపదేశములచేతను, వారియాత్మ సంతుష్టిగల్గినదై ఏకదైవోపాసన ఉపనిషత్తులయొక్క సారమని యెరింగి యిది దైవశాసనమని గ్రహించి, బ్రహ్మోపాసనా పరమగు బ్రాహ్మమతమును జనుల కుపదేశించెను. కావున వీరున్ను గురువులు గలవారే.

అయితే శ్రీశంకర, శ్రీరామానుజాచార్య, శ్రీమధ్వాచార్య, శ్రీకృష్ణచైతన్యులు మొదలైనవారి మతములవలె వీరిది లోకములో వ్యాపకము గాకపోవుటకు కారణము గలదు. అదేమన పైజెప్పిన మతాచార్యులెవరున్ను పూర్వాచార పద్ధతులను పరిశీలన సలిపి మూఢవిశ్వాసములను మార్పు చేయుటకు ప్రయత్నించి యుండలేదు. కనుకనే వారిది సులభముగా వ్యాపించుటకు కారణమైనది. వీరి మతమో! పురాతనములగు ఉపనిషచ్ఛాస్త్రములయొక్క సారమగుటచేతను, అంతర్నిహితమగు ధర్మమగుటచేతను అది ప్రపంచమునకు తెచ్చినప్పుడు నూతనముగ గనుపించినందుచేతను, దురాచారములను బాహ్యకృత్యములను అర్థములేని వ్యర్థకార్యములను నిరసించుటచేతను దీనిలో తత్త్వజ్ఞానములేనివారికి చేరుటకు భీతి గల్గి యుండవచ్చును. మరియు వీరు సదా దైవధ్యానములోనే గాలము గడుపక సంఘసంస్కరణములోను ప్రవర్తించినందుచేతను, సామాన్య భక్తుల కీతత్త్వము తెలుసుకొనుటకు దురవ

గాహమగుటచేతను నెక్కువ వ్యాప్తి గలుగలేదు. వీరి జీవితచరిత్రము సాంగముగ దెలుసుకొనదలంచువారు రాజారాంమోహనరాయ్ జీవితగ్రంథములో గనుగొనవచ్చును.

ఇక ఆర్యసమాజ స్థాపకులగు శ్రీ దయానందసరస్వతీస్వాములవారి జీవితమును పరిశీలింతము.

## శ్రీ దయానందసరస్వతీ స్వాములవారి చరిత్ర

ఈ ఆర్యమతమును స్థాపించిన దయానందసరస్వతీ స్వాములవారి మొదటిపేరు మూలశంకరులు. క్రీస్తుశకము 1824వ సంవత్సరమున మర్యాద గల్గినట్టి ఔదిత్య బ్రాహ్మణ కుటుంబములో జన్మించిరి. ఘూర్జర (గుజ రాతి) దేశమునందు కాధియవాడ అర్ధద్వీపమునందుండు మోర్వియను రాజ సంస్థానపు న్యాయస్థానమునందు న్యాయవాది యుద్యోగమును నీకుటుంబస్థులు పరంపరగ బడయుచుండిరి.

శ్రీ దయానంద సరస్వతీ స్వాములవారు 14వ సంవత్సరములోపల భాష్యసహితముగా యజుర్వేదమును, తక్కిన మూడువేదములలో కొన్ని భాగములను, వేదనిఘంటువును, వ్యాకరణమును, పాండిత్యమునకు వలయు మరికొన్ని ఉత్కృష్టగ్రంథములను గ్రహించిరి. శైవమతము నందత్యంత ప్రీతి గల యీతని తండ్రి తన కుమారుని శివభక్తియందు ప్రబుద్ధునిగా జేయుటకు నిది సమయమని యెంచి, శివరాత్రి దినమున కుమారుని వెంటబెట్టుకొని ఒక శివాలయమునకు బోయి శివపూజా విధానము లన్నింటిని ఉపదేశించి పూజ గావించెను. ఆ తర్వాత అచ్చటనుండు అర్చకులు మొదలగువారి కృత్యములను జూచి మూలశంకరులు తృప్తి గలుగక, యీ దేవుని సన్నిధిలో సదా సేవ చేయుచుండు ఇట్టి జనులకేలాటి దైవగుణములు గలుగలేదు. ఈ విగ్రహము నిజమైన దేవుడైనచో వీరికేల సుగుణములు గలుగక పోయెనని తనలో తాను చింతన చేసుకొని తండ్రితో చెప్పగా, కుమారునియొక్క చిత్తవిక్షేపమును పోగొట్టుటకై తండ్రి అనేకపురాణేతిహాసములను బోధించెను. దయానందులు

దానిని నమ్మక వేదమతమే సర్వోత్తమ మైనదనియు, దీనిని బోధించినచో లోకోపకారముగ నుండునని యెంచిరి.

ఇట్లుండ కొంతకాలమునకు దయానందసరస్వతీస్వామి నిరుక్తము, మీమాంస, వేదనిఘంటువు మొదలగునవి యభ్యసించిన వారైనను, వాని యందు సంపూర్ణ జ్ఞానమును బొంద నిశ్చయించి, కాశీక్షేత్రమునకు బోవల యునని తండ్రిని నడుగగా, నాతడు సమ్మతింపక పోయినందుచే తన యూరికి నారుమైళ్ళ దూరమున నుండు నొకపండితునియొద్ద విద్యాభ్యాసము చేయుచుండిరి. ఇట్లు తన కుమారుడు లౌకిక విషయమునందపేక్ష గల్గి యుండుటనుగని, తండ్రి త్వరగా వివాహముచేసినచో విద్యాభ్యాసము తక్కువ యగునని తలంచి, యొకసుందరియైన కన్యకను నిశ్చయించి, వివాహమున కుపక్రమించెను. జ్ఞానాభిలాషియు, వైరాగ్యశీలుడునగు దయానంద సరస్వతీ స్వామి తన 18వ యేట వివాహనిశ్చితార్థమును విని నాటిరాత్రి ఏకాకియై బయలుదేరి సత్యాన్వేషణము కొరకుపోయెను. అంత తండ్రి వివాహ ప్రారంభము నందు తప్పించుకొని పోయిన తనకుమారుని వెదకు నిమిత్తము గుఱ్ఱపు రౌతులను సిపాయిలను బంపెను. కాని వారున్నచోటు తెలియక మరలివచ్చిరి.

కొంతకాలము గడచిన వెనుక సిద్ధపురమున సాధువేషముతో కుమారు డున్నాడని విని వారిని పట్టుకొనివచ్చి వారు ధరించియున్న కాషాయము తీసి చించి పారవైచి సిపాయిలచేతి కప్పగించెను. పారావారు అజాగ్రత్తగా నుండు సమయము చూచి తప్పించుకొని దైవసాక్షాత్కారము బడయుటకు వైరాగ్య మవలంబించి ఏకాకియై సంచరించుచు జ్ఞానులుండు స్థలములకు పోయి, తమకు తెలియని దానిని వారియొద్దనుండి గ్రహించుచు నర్మదాతీరము జేరి, అచ్చోట వసించు పూర్ణానందపరమహంసవలన ననేక వేదాంతతత్త్వ శాస్త్రము లను చదివి తర్వాత బరోడా సమీపమున శ్రీశంకరాచార్యాశ్రమమునందుండు పరమానంద సరస్వతియను సన్న్యాసివలన సత్యజ్ఞాన బోధము వడసి వారి

వలన సన్న్యాసాశ్రమము స్వీకరించి దయానందసరస్వతి యను అంకిత నామము పడసెను.

తర్వాత ప్రపంచజ్ఞానము సంపాదింపవలెనను తలంపుచేతను, మత మతాంతరముల సత్యము నెరుంగవలెనను నిచ్ఛచేతను, చైతన్యాశ్రమమునకు వచ్చి పరమానందులవద్దను ధర్మతత్త్వములు మరింత గ్రహించి ఆ పర్వత మున నుండు శివానందులవద్ద యోగాభ్యాసము నేర్చుకొని, హరిద్వారము, హృషీకేశము, గౌరీఖండము, భీమఘోర, అగస్త్యాశ్రమము, గుప్తకాశి, త్రిజోగి, నారాయణము మొదలగు స్థలములకేగి తాపసోత్తములను సందర్శించి ధర్మ తత్త్వముల నార్జించుచు మధురకు వచ్చి, అచ్చోట ప్రసిద్ధిగల విరజానంద స్వాముల వారివలన తామభ్యసించిన యోగాది విషయములను విమర్శించి సర్వజ్ఞ శిరోమణియగు విరజానందస్వాములవారిచే యోగతత్త్వమును పూర్ణముగ గ్రహించిరి.

తర్వాత దయానంద సరస్వతీస్వాములవారు లోకోపకారార్థమై జ్ఞాన మును వినియోగపరుప నెంచి కొన్ని స్థలములందు విద్యాశాఖలను స్థాపించి వేదములయొక్క అర్థమును విద్యార్థులకు బోధించుటకై వేతనమిచ్చి పండి తులను నియమించి తాము పై విచారణ చేయుచుండిరి. అయినను పండి తులు వేదార్థమును నిజముగ నుపదేశింపనందుచే అప్పుడప్పుడు విద్యార్థులకు హిందీభాషలో బోధించు నిమిత్తమై త్వరలోనే హిందీభాష నభ్యసించి ధర్మ తత్త్వమును బోధించుచుండిరి. ఇంతేగాక, చతుర్వేదములకున్ను అనేక ఆర్ష గ్రంథములకున్ను నవీనభాష్యము రచించి జనులకు బోధించుటకు ప్రారంభిం చిరి.

మరియు పంజాబు అనబడు పాంచాలదేశమునందలి చాల గొప్ప పట్టణములందు క్రీస్తుశకము **1875**వ సంవత్సరమున ఆర్యసమాజమను పేర అనేకసంఘములను స్థాపించిరి. వీరికి అనేక ధనవంతులున్ను రాజులును శిష్యులైరి. వీరు వేదార్థముయొక్క సత్యమును బోధించుటలో పౌరాణిక మతస్థులున్ను, సనాతన సంప్రదాయులున్ను అనేక స్థలములలో అడ్డుపడిరి.

అనేకకలహములు చేసిరి. ప్రాణాపాయకరములగు అనేక ప్రతిబంధములను గలుగచేసిరి. అవమానకరములగు నిందలను వారిపై మోపిరి. అనేకులు వీరి పవిత్ర ఆస్తికమతమును పాషండమతమనియు దూషించుటకు ప్రారంభించిరి. వీని కన్నిటికిన్ని జంకక సత్యాన్వేషణబుద్ధితో సర్వేశ్వరునిపై భారముంచి సర్వదా యీశ్వరధ్యానమందు మగ్నులై తనయొక్క సత్యమతమును సదా బోధించుటకు ప్రయత్నించుచుండిరి. అవన్నియు సత్యార్థ ప్రకాశిక యను గ్రంధమున గనందగును.

ఈ మతముయొక్క ముఖ్యసిద్ధాంతము:- ఈశ్వరుడొక్కడే గలడు. ప్రతివారున్ను అట్టి సర్వేశ్వరుని ఉపాసించుట కర్హులు. బ్రాహ్మణాది చతుర్వర్ణములును వారి వారి వృత్తుల ననుసరించినవి, బ్రహ్మచర్యాది చతురాశ్రమములును ప్రతివానికి గలవు. విగ్రహారాధనము మొదలగునవియు, జాతి భేదమును వేదసమ్మతములు గావు. హింస చేయకూడదు. ఈ మతస్థులు క్రీస్తుమతమున, మహమ్మదు మతమున గలసిన హిందువులలో నిష్టమైన వారలను శుద్ధిచేసి మరల ఆర్యమతమున చేర్చుకొనుచున్నారు. వీరు వేదమునే ప్రమాణముగా నంగీకరింతురు. తక్కిన స్మృత్యాదులలో వేదార్థమున కనుకూలములైన వాటిని మాత్రమే గ్రహింతురు. వేదములను చదువుటయు, చదివించుటయు, వినుటయు, వినిపించుటయు ఆర్యులం దరకు పరమ ధర్మము. యజ్ఞములో పశువధ, బాల్యవివాహము మొదలైనవి వేదవిరుద్ధములు. ప్రతివారును సత్యాన్వేషులై యుండి సత్య ప్రవర్తకులై జీవించి సత్య స్వరూపుడగు సర్వేశ్వరునుపాసించి తరించవలెను-అన్న మొదలగు పవిత్ర విషయములు ఆర్యమత సిద్ధాంతములో ముఖ్యములు.

వీరు జీవించియుండగా కాశీ, కలకత్తా, బొంబాయి, లాహెూర్, శ్రీనగర్ మొదలగు మహాపట్టణములలో పండితసభలుచేసి తనమతమును బోధించుచుండిరి. ఆసేతు హిమాచలమువరకు సంచరించి కుమతములను తిరస్కరించి సుమతముల నుపదేశించి జనుల ఉచ్చనీచావస్థలకు గుణకర్మములే కారణములని యుద్బోధించి హిందువులు అందరున్ను ఆర్యసంతానము

లనియు, ఆర్యుల ధర్మశాస్త్రమునకు వేదమని పేరనియు, ఇది ప్రతివారును పఠించి సర్వేశ్వరానుగ్రహమునకు పాత్రులై యిహసుఖమును పరసుఖమును బొంది జీవన్ముక్తులు గావలసినదనియు నుపదేశించిరి. బ్రహ్మసమాజ స్థాపకులగు రాంమోహనరాయలవారివలె వీరును అర్థములేని బాహ్యకృత్యము లన్నియు వ్యర్థములని తెలుపుచు, ఈశ్వరకృపకు సత్యము, శాంతము, కరుణ, విరక్తి, భక్తి మొదలగు దైవగుణములు గల్గి నిర్మలాత్ములై యుండవలెనని యుద్బోధించిరి.

ఇట్టి మహానుభావునకు లోకోద్ధారకునకు జోధ్‌పూరులో కుమతస్థుల ప్రేరణచే నొకడు విషము ప్రయోగించెను. దానిచే క్రీస్తుశకము 1883 సం॥ సెప్టెంబరు 26వ తేదీ దీపావళి పండుగనాటి సాయంకాలమునందు లోకులందరును సంతోషముతో నుండగా ప్రణవపూర్వకముగా గాయత్రీధ్యానము చేయుచు పరమేశ్వరుని ధ్యానించుచు దయానందులు పాంచభౌతిక శరీరమును విడిచి యీశ్వర సాక్షాత్కారముక్తిని బొందిరి. తర్వాత నీ మతమును వారి ముఖ్యశిష్యులగు శ్రద్ధానందస్వాములవారు చాల ప్రచారము చేసిరి. వీరిచే స్థాపింపబడినదే హరిద్వారములోగల గురుకులము. అచ్చట వందలకొలది బ్రహ్మచారులు వేదాధ్యయనము చేసుకొని బ్రహ్మచర్యవ్రత మనుష్ఠించి సత్యాన్వేషణ తత్పరులై సత్యధర్మబోధోత్సుకులై సర్వేశ్వరుని ధ్యానముచేయుచున్నారు.

రాంమోహనునివలె నీ దయానందులున్ను సదా దైవకార్యములలోనే కాలము గడపక దైవవిషయమునే సదా బోధింపక వేదము చదువుటలోను, వేదార్థము బోధించుట మొదలగు సంఘసంస్కరణ కార్యములోను ప్రవర్తించి నందుచేతను, పౌరాణిక కల్పితములగు బహుదైవారాధనల నిషేధించుట చేతను, ఆదిజ్ఞానమగు వేదార్థము బోధించుటచేతను, సామాన్యజనులకు గ్రహించుటకు దుస్తరమగుటచేతను పైజెప్పిన శ్రీశంకర, శ్రీరామానుజ శ్రీమధ్వాచార్య, శ్రీకృష్ణచైతన్యుల మతములవలె వీరి మతము అధికవ్యాపకమునకు రాకపోయి యుండవచ్చును. అయినను జనుల బుద్ధి వికసించి వచ్చుట

చేతను, సత్యాన్వేషణమున కందరికిన్ని స్వాతంత్ర్యము గల్గియుండుటచేతను, వేదశాస్త్రముల అర్థము స్వభాషలలోనికి వచ్చుటచేతను, సులభముగ గ్రహిం చుట కవకాశము గల్గినందుచేతను, విదేశములలో సంచరించి లోకపరిస్థితి మత పరిస్థితి, సంస్కరణ పరిస్థితి గనుగొనుట కనుకూలమైన కాలము గల్గి నందుచేతను, జనులు నిజమును దెలుసుకొని జీవించుట కవకాశము గలుగు చుండుటచేతను నికపైన బుద్ధిమంతులు ఈ న్యాయపరిశీలన మతములో నెక్కువ చేరగలరు. ఏ ప్రకారమైనను ఏ మతములో చేరియైనను, ఏ దేశములో వారైనను, ఏ జాతివారైనను, ఏ ప్రవర్తనలో నుండినవారైనను, భూతదయ గల్గి, విషయ విరక్తిగల్గి, దైవభక్తిగల్గి, సత్యబుద్ధిగల్గి, శాంతి శమములుగల్గి వర్తించువారైనచో శాశ్వతసౌఖ్యము నొందగలరు. అట్టి వారందరు పరమాస్తిక మతస్థులే! దైవమతస్థులే యగుదురు. జనులందరును ఇహములోను పరములోను సౌఖ్యముగలవారై యుండిన చాలును. ఇతర ప్రాణికోట్లకుగాని, మానవులకుగాని క్లేశముగలుగజేయక వర్తించిన చాలును. వారందరును ఈశ్వర కృపకు పాత్రులై జ్ఞానాత్ములగుదురు.

వేదవేదాంగములగు ఉపనిషత్తులను, ధర్మశాస్త్రములను, పురాణేతి హాస ములు మొదలయిన మతగ్రంథములను ఆధునికకాలములో సమగ్రముగా పరిశోధించిన వారిలో శ్రీదయానంద సరస్వతీస్వాములు అగ్రగణ్యులు. ఇంత శ్రమకోర్చి మతగ్రంథములను విమర్శించిన వారు మరియొక్కరు లేరనియే చెప్పవచ్చును. ఇట్టి అపార మేధాశక్తియు, వ్రతనిష్ఠయు, దైవజ్ఞానమును గలిగిన దయానంద సరస్వతీ స్వాములవారికి పరమానంద సరస్వతీ స్వాముల అనుగ్రహము గల్గిన తర్వాతనే భాష్యరచనామహిమయు, మతస్థాపనకు తగిన దైవశక్తియు లభించినవి. కర్మకాండ సంప్రదాయము లన్నిటిని కపోల కల్పిత ములని నిరాకరించిన దయానందులుగూడ గురుమహిమను గొనియాడి యున్నారు. బాహ్యాడంబర అర్థశూన్యమగు కర్మసముదాయమును మాత్రము అనవసరమని చెప్పిరేగాని, అంతఃకరణశుద్ధికిన్ని దైవకృపకున్ను కారణమగు ఆత్మసంస్కరణమైన బ్రహ్మచర్యవ్రతము, తపస్సు, వేదాధ్యయనము, అగ్ని

హెూత్రము, ప్రణవోపాసన మొదలగు వేదసంబంధ కర్మములను భక్తితోను గౌరవముగాను ఆచరింపవలెనని యుద్బోధించిరి.

## శ్రీభగవాన్ రామకృష్ణపరమహంస చరిత్ర

ఇప్పుడు మనము సృష్ట్యారంభమునుండి నేటివరకు ఆవిర్భవించిన మతములయొక్కయు, మతకర్తలయొక్కయు చరిత్రమును సంగ్రహముగా గ్రహించితిమి. ఒక్కొక్క నదీనదముల నాశ్రయించిన జలము లన్నియు నేలాగున సముద్రములో చేరుచుండునో ఆలాగున నింతవరకు చెప్పిన మతములన్నియు నదులవంటివనియు, నదములవంటివనియు మనము గ్రహించవలయును. సర్వజలాశయములున్ను చేరుస్థానము సాగరమని యేలాగున పిలువబడునో, ఆలాగున లోకైక మతప్రబోధకులగు ఒక్క మహ నీయుని దివ్యచరిత్రము ఇప్పుడు మనము వినబోవుచున్నాము. భరతఖండ ములో మతప్రవర్తకులై ఉండినవారందరును విద్యామహిమగల బలముచేతనే మతమును స్థాపించి యున్నారు. వీరు ఒక్కొక్కరున్ను వారి వారికి పూర్వము గల్గియుండు మతములను నిందించి యున్నారు.

అయితే ఇక ఇప్పుడు చెప్పబోవు మహాత్ముడో! సర్వమతములకును వందన మొనర్చుకొని మతము లన్నిటిలోనుగల సారమును మాత్రము గ్రహించియున్నారు. అంతేగాక, పైజెప్పిన వారివలె శాస్త్రముల పరిశోధించు టలో కాలమును దుర్వినియోగపరచక దైవనిష్ఠలోనే కాలము గడపి ఒక్క అక్షరాభ్యాసము గూడ చేయనొల్లక వేదములకు మూలమైన పరతత్త్వమును తల్లిగా భావించి ధ్యానించి ఆ వేదమాత యగు పరాశక్తియొక్క కృపచేత దివ్య జ్ఞానము గలవారై ఆత్మవిద్యా ప్రభావముచేతనే మతము నుపదేశించినవారు. ఇదే తక్కిన మతాచార్యుల కందరికన్న యీ మహానుభావునికి గల్గియుండు మహిమవిశేషము. వీరిమతము కేవలము జ్ఞానమతము. వీరు భక్తిచేతనైనను, జ్ఞానముచేతనైనను, యోగముచేతనైనను, కర్మయోగముచేతనైనను ఈశ్వ రుని పొందవచ్చునని యుపదేశించినవారు. ఈ మహాపురుషు డెవరనగా

శ్రీభగవాన్ రామకృష్ణ పరమహంసలు.

వీరు వంగరాష్ట్రమున హుగ్లీమండలమునందు క్రమపురము అను గ్రామమున కుటీరామఛటోపాధ్యాయులకున్ను, తన సతీమణియగు చంద్ర మణీదేవికిన్ని క్రీస్తుశకము 1836వ సంవత్సరము ఫిబ్రవరి 19వ తేదీన బ్రాహ్మ ముహూర్తమున శుభలగ్నములో భూలోకమున నవతరించిరి. వీరితల్లి దండ్రులు కడుబీదవారయ్యును దీనజనులకు చేతనైనంతమట్టుకు తమ సుఖమునైనను పాటింపక ఉపకారములను చేయుచుండెడివారు. ఆకలిగొని బిచ్చమునకై వచ్చువారికి అన్నము నిడి తాము తిండిలేక గడిపిన దినము లెన్నియో గలవు. శ్రీరామకృష్ణ పరమహంసవారికి మొదట జన్మనక్షత్రము ననుసరించి శంభుచంద్రుడని పేరిడిరి. అతడు పెద్దవాడై, యతీశ్వరుడై జగ ద్గురువు కాగలడని జ్యోతిష్కులు పలికిరి.

వీరి తండ్రియగు ఛటోపాధ్యాయులు గొప్ప విష్ణుభక్తులై యుండి గయ యందు తీర్థయాత్ర సలుపుచుండే కాలములో జన్మించిన కొమరు డగుటచే గదాధరుడని పిలుచుచుండిరి. ఈ పేరే చిన్నతనములో నెక్కువ వ్యాప్తికి వచ్చినది. చిన్నతనములో అనేకములగు అమానుష కార్యములను చూపెడి వారు. ఆ బిడ్డ తల్లియొడిలో పాలుద్రాగుచుండగా ఆకస్మికముగా చాల బరువై గాన్పించెడివాడు. మరల నెప్పటియట్లు తేలికగ నుండువాడు. ఒకదిన మున తొట్టిలో పరుండబెట్టి చంద్రమణీదేవి యింటిపనులపై వేరొక తావునకు బోయివచ్చి చూడగా బిడ్డడు యువకునంతవాడై తొట్టినిండ పండుకొని యుండెను. అది గాంచి తల్లి భీతిజెంది ఛటోపాధ్యాయుని ఆతురతతో బిలి చెను. అతడు వచ్చులోపల బాలకు డెప్పటిరూపు దాల్చియుండెను. అట్టి వింతలు కొన్ని చూపట్టుచుండుటచేత, అమాయకులగు నాయింటివారును, పొరుగువారున్ను అయ్యవి భూతచర్యలని నిర్ణయించి మంత్రగాండ్లను పిలిపించెడివారు. విభూతులను పెట్టించెడివారు, జపములు చేయించెడివారు, బిడ్డని కేయాపదయు రాకుండ తురాయలు కట్టించెడివారు.

ఇట్లు అయిదు సంవత్సరములు గడచినవి. గదాధరుని జ్ఞాపకశక్తి మహాద్భుతము. కడు సులభముగ దేవతల పేర్లు వారింగూర్చిన స్తోత్రములు నేర్చి మరువక యుండెడివాడు. భారత భాగవత పురాణగాధలను తండ్రివలన విని పరులకు చెప్పుచుండెడివాడు. ఒకసారి విన్న విషయము మదినుండి జారి పోకుండెను. గదాధరుడు కుమ్మరులు చేయుచుండు దేవదేవుల బొమ్మలను జూచి ఆలాగున నింటికడ తానును అట్టి వానిని ముద్దులొలుకు తీరున నిర్మాణము చేసెడివాడు. చక్కగ రంగులు తీర్చెడివాడు. చిన్న చిన్న పూజా మందిరముల నమర్చి ఉత్సవముల సాగించెడివాడు. గజ్జెలు కట్టి పిల్లవారి మధ్యలో హరికథలు చెప్పెడివాడు. తోడివారిం జేర్చుకొని భజనలు చేయించెడువాడు. తాపసవరుండగు శివుని విగ్రహమును బోలి గూర్చుండి జపములు చేయ ననుకరించెడివాడు. తోటలో చేరి శ్రీకృష్ణుని బృందావన లీలను ప్రదర్శించుచు బాలురతో గూడి పాటలు పాడెడివాడు.

చిన్నపిల్లలు మరమరాలను బుట్టలో వేసికొని పొలాలలోనికి బోయి ఆటలాడుకొను నాచారము గలదు. గదాధరు డొక్కనాడు బొంగురు పేలాలను బుట్టలో వేసికొని ఒక డొంకలో నుండి పోవుచుండెను. ఆకస్మికముగా చక్కని నీలంపు మబ్బొక్కటి ఆకసమున గానవచ్చినది. అది క్రమముగా పెద్దదై ఆకాశమంతయు నిండినది. ఇంతలో కొంగలు బారులు దీరి స్వచ్ఛమగు తెల్లని ముత్యాలహారమో యనునటుల కాననయ్యెను. ఆ దృశ్యమును కాంచిన గదాధరుని హృదయము ఆనందపరవశమై భగవన్మయమై ఒడలు తెలియక నేలపై బడిపోయెను. ఆ మార్గముగా పోవు జనులు వానింగని మేలుకొలుప జూచిరి. కాని వారి ప్రయత్నములు ఫలించినవి గావు. వారాబాలకుని చేతులతో నెత్తుకొని యింటికి చేర్చినారు.

ఈ రీతిగా గదాధరుడు పారవశ్యమున స్మృతి తప్పి భగవద్భావములో మగ్నుడై మరల మరల పడిపోవుట జరుగుచు వచ్చినది. దీని శాంతికొరకు తల్లి అనేక భూతవైద్యములు చేయించినను ఉపయోగము లేకపోయినది. మూర్ఛ

నుండి లేచి గదాధరుండు పరమానంద భరితుడై జగన్మాతలో ఐక్యమై ఉంటినని తల్లితో చెప్పినను అది వారు తెలుసుకొనజాలక పోయిరి. ఈలాగున అనేకములగు అమానుష కార్యము లన్నియు జరుగుచుండెను. అప్పుడప్పుడు సాధువులు దిగుచుండు సత్రమునకు వెళ్ళి సాధువులతో గూడ కూర్చుండి సాధువులవలె వేషము వేసుకొని ధ్యానమందుండేవాడు. క్రమముగా వైరాగ్యముచే ఆవరించబడిన వాడయ్యెను.

ఆ కాలమున కలకత్తాలో దక్షిణేశ్వరాలయమున తన అన్నయగు రామకుమారుడు పూజారియై యుండేవాడు. ఈ దేవాలయము రాణీరాసమణీదేవిచే నిర్మింపబడినది. అన్నగారగు రామకుమారుడు రామకృష్ణుని పూజాకార్యములకు నేర్పాటు చేసి స్వగ్రామమునకు వెడలిపోయెను. అత్తరి రామకృష్ణులే దేవీపూజాది కార్యములు జరుపుచుండిరి. ఈ మధ్య రామకుమారుడు పరప్రాప్తి నొందెను. ఇది వినగా ప్రపంచముయొక్క సత్యత్వమును తెలుసుకొనుటకు రామకృష్ణునకు మరింత విచారము గల్గినది. సతతము మారిపోవుచు, నిలకడ అనునది లేని యీ ప్రపంచమున స్థిరమగునది యేదేని గలదా? ఈ లౌకికసంపదలు బంధుత్వములు శాశ్వతములా? ఆలాగున తల్లిదండ్రులు పుత్రమిత్రులు స్థిరములా? దీనివలన జనించి సులభముగ తప్పించుకొన నలవి గాని కామక్రోధములను నరుడు పూననేల? ఇట్టి ప్రశ్నలు వాని మనస్సును బాధింపసాగెను. క్రమముగా తృప్తిని, మనశ్శాంతిని ఒసగజాలు శాశ్వతపదార్థము వేరొకటి కలదని విశ్వాసము కలిగినది. దానిని కనుగొనవలయునని తీవ్రకాంక్ష వానిని ఆవరించినది. అది భగవత్సాక్షాత్కారమునగాని తెలియరాదని నిశ్చయించెను.

రామకృష్ణుడు సాంద్రమగు భక్తితో కాళీదేవికి అర్చనలు చేయసాగెను. అతడు దినదినము పూజించు కాళీవిగ్రహము శిలామాత్రము గాదనియు, యధార్థముగా చేతనామూర్తి యనియు భావించుచు నెదురుగ కూర్చుండి స్తోత్రమును చేయుచు ప్రత్యక్షము గమ్మని వేడుకొనును. "తల్లీ! తల్లీ! నీవు రామప్రసాదునకును, నిత్యరామునకును ఇంక నితర భక్తులకును ప్రత్యక్ష

మైతివట గదా? ఇప్పుడు నాయెడ నేల ప్రసన్నవు గావు? సంపదలు, సుఖములు, సతీసుతులు, ఇట్టివి యేవియు నాకు వలదు. జననీ! నాకొక్కసారి దర్శనము నిమ్మ" అనుచు కడుదీనముగా బ్రతిమాలుకొనును. "తల్లీ! జగజ్జననీ నిన్ను కనుగొను మార్గమును జూపుము" అని దేవిని వేడుకొనుచు కన్నీరు మున్నీరైపారగా నెలుగెత్తి యేడ్చెడివాడు. ఈ దశయందు రామకృష్ణుని కప్పుడప్పుడు దేవియొక్క అఖండతేజము గోచరించుచు వచ్చెను. అప్పుడది యొకటియే సత్యమనియు, తక్కిన వన్నియు కల్పితములనియు బోధ గల్గి నిశ్చేష్టుడై ధ్యాననిష్ఠయందు మగ్నుడై యుండేవాడు. ఈలాగున భక్తిపారవశ్యముతో అనేకములగు స్తోత్రములు చేసుకొని ఆనందభరితుడై తాండవము చేయువాడు.

ఇట్లుండగా ఒక భైరవి అనగా వైష్ణవ బ్రాహ్మణి యెందుండియో వచ్చి "కుమారా! కనబడితివా! నేను నీ కొరకు వెదకులాడుచుంటి"ననెను. అందుకు రామకృష్ణుడు "అమ్మా! నన్నే వెదకుచున్నట్లు నీవెట్లు గుర్తించితివి?"అని ప్రశ్నించెను. "జగజ్జనని యనుగ్రహమువలన నేను నిన్ను కలిసికొనవలసి యుండునని మున్నే గ్రహించగల్గితిని" అని ఆమె పల్కినది. "ఇదివరకే చంద్ర, గిరిజ అను వారలను నిద్దరిని కలిసికొంటిని. వారు బారిశాలు మండలము వారు. ఇక నిన్నుమాత్రమే పరిచయము చేసికొనవలసి వచ్చితి"ననెను. అంతట వారు పూర్వపరిచితులవలె తల్లికొమరుల తీరున మెలగిరి. ఈ యోగినియే రామకృష్ణులకు సమాధి పర్యంతముగల యోగసాధన నేర్పినవారు. నిర్వికల్ప స్థితి గల్గి జీవేశ్వరుల ఐక్యసౌఖ్యమును గలుగజేయుటలో ఈ మహాతల్లియే రామకృష్ణుని గురువుగానునుండి సంరక్షించినది. తరువాత నాగాసంప్రదాయమునకుచెందిన సన్న్యాసి యొక్కడు తోతాపురియను ఆయన వచ్చి రామకృష్ణునికి వేదాంత రహస్యము నేర్పెదను, నేర్చుకొందువా? అని అడిగెను. రామకృష్ణుడు కాళీదేవితో అడిగి అనుమతి వచ్చిన అట్లే చేసెదనని సమాధానమిచ్చెను.

తర్వాత కాళీకాదేవికి పూజలు సల్పి ధ్యానమందు మగ్నుడై యుండగా దేవిసాక్షాత్కరించి "ఈ సాధుసత్తముని గురువుగా వరించుకొనుము. ఆ మహాత్ముడు చెప్పేలాగున బ్రహ్మసాక్షాత్కార సాధన చేయుము"అని యుపదేశించి ఆశీర్వదించెను. తర్వాత ఒక నిర్ణీత కాలమున తోతాపురికి సాష్టాంగ నమస్కారముచేసి ఉపదేశము గ్రహించుటకు రామకృష్ణుడు సంసిద్ధుడయ్యెను. "ఎందునను బ్రహ్మము మాత్రము సత్యము. దేశకాల నిమిత్తభావముల కది అతీతము, నిత్యశుద్ధబుద్ధ సత్యరూపము. అది అఖండము, అనంతము, ఘటనాఘటన ప్రవీణమగు మాయవలన కల్పితములైన నామరూపములచేత అంటబడక అద్వితీయమై వెలుంగును. మాయకధీనమై యున్నదంతయు బూటకము. అసత్యమై జగమున తోచు ఇంద్రియ గోచరములగు విషయము లన్నిటినుండి మనస్సును లాగివేయుము. బుద్ధిని ఆత్మయందు చొనుపు"మని గురుడు పదేశించెను.

"నేనెంతగా ప్రయత్నించినను నామరూపములను దాటి ఆ అనిర్వాచ్యతత్త్వమందు మనసును చొనుపజాలనైతిని. నాచుట్టును గోచరించు వస్తుజాలమును సులభముగనే మరువగల్గితిని. కాని, కేవల చిద్రూపియై దేదీప్యమానముగ వెలుగొందుచు గోచరించు జగజ్జనని నాకు చిరపరిచిత గావున ఆ రూపునుమించి నామతి పైకి పోజాలదయ్యెను. నా మనస్సునంతను అద్వితీయ పరమాత్మయందు నామరూపములు ఏవియు తోచని కేవల ఆత్మతత్త్వము పూని ఏకాగ్రము చేయనెంచుచో ప్రతిసారియు అమ్మరూపు నాకు అడ్డమై నిలుచుచున్నట్లుండెను. తోతాపురి గురుని హెచ్చరికలు సహాయములు వ్యర్థములగుచున్నవి. ఆయన విసిగికొని "యేమి? చెప్పినట్లు చేయజాలకుంటివా? కాని నీవటుల చేసియే తీరవలయును"అని తీక్షణముగ పలికిరి. దాపున నున్న ఒక గాజుముక్కను తీసుకొని నా భ్రూమధ్యమున పొడిచి యీచోటునందు చిత్తమును నేకాగ్రము చేయుము. నీకు అడ్డు తగులు మీ అమ్మయొక్క మాయాకల్పిత నామరూపములను లయమొందించితి ననిరి. నేనును అతి ప్రయత్నముతో చిత్తమును ఏకాగ్రతకు దెచ్చుచు అమ్మ

రూపు గోచరించునప్పుడెల్ల నిది మాయాకృతస్వరూపమే గదా? నామరూపములు ప్రాకృతములు గదా? శాశ్వతతత్త్వము దీనియందు లేదుగదా? అనుచు వివేకించి వివేకించి దానిని దాటి నిరామయంబగు సమాధిని చేరితిని" అని శిష్యులతో రామకృష్ణులు చెప్పియుండిరి.

ఇటుల రామకృష్ణుడు నిర్వికల్ప సమాధిని జెంది అవ్యయానందమును గ్రోలగల్గెను. ఆ ఆనంద పారవశ్యమున నింద్రియముల వ్యాపారము కట్టువడి పోయెను. ద్వైతజ్ఞానము స్ఫురించదు. రామకృష్ణుడిపుడు పరబ్రహ్మమును గుర్తించి పరబ్రహ్మమై వెలయుచున్నాడు.తోతాపురి అతివిస్మయమున శిష్యుని తదేకదృష్టితో తిలకించినాడు. "ఆహా యిది సత్యమా! యితడు ఒక్కదినములో నిర్వికల్పసమాధి పొందియుండునా! నాకు నలుబది సంవత్సరములు పాటుబడిన గాని యీ దివ్యపదము దొరకినది గాదే! బాపురే? ఇది అసాధారణ దైవకృత చిత్రకార్యము. అద్వైతసాధనయందు నిదిగదా పరమప్రాప్యము!" అని అనుకొనెను. తుదకతడు మంత్రము నొకదానిని రామకృష్ణుని చెవిలో నుపదేశించెను. అంతట నెమ్మది నెమ్మదిగా దేహస్మృతి గలవాడై కండ్లు తెరచి కృతజ్ఞత మీర రామకృష్ణుడు తోతాపురి గురువర్యునికి సాష్టాంగ నమస్కృతుల నర్పించినాడు. అప్పటినుండియు రామకృష్ణుడు పూర్ణముగ మారిపోయినవాడై సందేహము లన్నియు తీరి పరమహంసయై యొప్పెను. శ్రీరామకృష్ణపరమహంసయను నామము సార్ధకముగ లోకమున కెక్కెను.

భక్తులారా! ముముక్షువులారా! జిజ్ఞాసువులారా! గురువు అవసరమా? అనసరమా? యను ప్రశ్నకు నింతవరకు చెప్పిన దివ్యభావములు మీకు తృప్తి గలుగచేసి యుండునని తలంచెదను. మహానుభావులగు శ్రీ రామకృష్ణ పరమహంసల విషయమై మనము గ్రహించవలసిన గొప్పవిషయ మొకటి గలదు. ఆయన చిన్నతనమునుండియే ప్రపంచ వృత్తులతో సంబంధింపని వారై చాలకాలమునుండి దైవభావములో మగ్నులై యుండినవారు. మరల కాళికాదేవియందు తన్మయభక్తి గల్గి అతీత వైరాగ్యము నొంది భక్తిపారవశ్యముచే దేవిని ప్రత్యక్షము చేసుకొనిరి. తలంచినప్పు డంతయు దర్శనము ఇచ్చు

చుండు మహాకాళికాదేవి మామూలు ప్రపంచములోగల తల్లి బిడ్డలకు వలె శ్రీరామకృష్ణపరమహంసలకు వశవర్తినియై యుండి అడిగిన ప్రశ్నల కన్నిటికిన్ని సమాధానము ఇచ్చుచుండే స్థితిలో కరుణాసాగర సమానమగు ఆ మహాదేవి శ్రీరామకృష్ణ పరమహంసలతో తోతాపురి యోగీశ్వరుని గురువుగా స్వీకరించు కొనుము అని యుపదేశించుటలో మానవలోకమునకు గురువు ఉండవలయు నని మరల చెప్పవలయునా?

జగజ్జనని, దివ్యస్వరూపిణి యగు కాళికాదేవి రామకృష్ణ పరమహంస లకు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము నుపదేశించుటకు శక్తిలేక అట్లు చేసినది కాదు. ప్రపంచములో గురుపరంపరగా ఉండవలెనేగాని వేరు మార్గము లేదని తలంచుటచేతనే ఇట్టి మహాకార్యము జరిగియుండును. మరియు రామకృష్ణ పరమహంసలవలె లోకాతీతజ్ఞానమున్ను, ప్రపంచాతీత భక్తివైరాగ్యములున్ను, అందరికిన్ని గల్గి దైవము సాక్షాత్కరింప జేసుకొనుటకు శక్తి చాలక యున్నదని తలంచుటచేతను ఇట్టి అమానుష కార్యము జరిగియు నుండవచ్చును. ఇక నీ విషయమై విస్తారముగ వ్రాయదలంచుట లేదు. ఈలాటి చరిత్రలు మహనీయుల జీవితకథలు అనేకములు గలవు. వ్యాసవిస్తార మగునని తలంచి యింతటితో నిది ముగింప దలంచితిని.



## శ్రీ వివేకానందస్వామివారి చరిత్ర

ఇట్టి మహాత్ములగువారి శిష్యకోట్లలో శ్రీ వివేకానందస్వాములవారు ముఖ్యులు. ఆంగ్లేయ నాగరిక భౌతికజ్ఞాన వ్యామోహ మహాసముద్రములో భరత ఖండము మునిగియుండు సమయమున ఆత్మతత్త్వోద్బోధముచే ఉద్ధరించి ప్రాచ్యపాశ్చాత్య దేశములలో గల సర్వజనుల హృదయములలో దైవజ్ఞాన దివ్యజ్యోతిని నెలకొల్పి రక్షించినవారు శ్రీవివేకానంద స్వాములవారు. శ్రీరామకృష్ణపరమహంసలవారి దైవజ్ఞానామృతమును ఆకాశమునుండి వర్షము కురియునట్లు, ప్రపంచము నంతట వర్షింపచేసిన మహానుభావుడు

వివేకానందస్వామి. రామకృష్ణ పరమహంసలు సర్వ మతములను అనగా బుద్ధ, క్రైస్తవ, మహమ్మదీయ, ద్వైత, విశిష్టాద్వైతాద్వైతాది సమస్తమతములను ఒక్కొక్క తరుణములో ఆ యా మతముల ననుసరించి అనుష్ఠించి శోధించినవారు. మతము లన్నిటియొక్క మూలస్థానమగు సద్వస్తువు అనగా దైవనిలయము ఒకటే యని కనుగొనినవారు, నదీనదముల యొక్క నామరూపములు ఋజువక్ర గమనములు, జలములయొక్క గుణములు యావత్తున్ను సముద్రములోనికి చేరువరకుమాత్రమే యుండుననియు, సముద్రజలములలో కలిసిన పైజెప్పిన నామరూప గుణము లన్నియు లేవనియు తెలుసుకొన్నట్లు దైవత్వస్థితి గల్గువరకు మాత్రమే మతముల యొక్క భిన్న భిన్న భావములు గల్గియుండునని తెలుసుకొనినవారు.

ఇదే పరిశుద్ధమైన శ్రుతియొక్క సారమని బ్రహ్మవేత్త లందరున్ను గ్రహించియున్నారు. శ్రుతి "ఏకం సత్ విప్రా బహుధా వదంతి" అని చెప్పు టకు కారణమిదే. అనగా సత్తాస్వరూపమగు దైవవస్తు వొకటియే. పండితులు దానిని అనేకవిధములుగాను, నామములుగాను, రూపములుగాను చెప్పుచుం దురు. ఇప్పుడు కొందరికి జన్మాంతర సంస్కారముచేత అనన్యమైన, దైవభక్తి గల్గియుండిన నీశ్వరకృపచేతనే ఆత్మతత్త్వము గోచరపడేలాగున హృదయ శుద్ధి గల్గునని అనగా మాయావిమోచనము సిద్ధించునని గీతాది ఉత్కృష్ట గ్రంథము లుపదేశించుచున్నవి. అట్టి వారి ఆత్మ యితర దృశ్యాది విషయము లలోగాని, ఆచరణానుష్ఠానభావములోగాని చిక్కుకొని యుండినను, పూర్వ జన్మసంస్కారము అట్టి భావములనుండి వేరు పరచగలుగునని చెప్పుచున్నవి.

**తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్ ।**
**యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన ॥**

అర్జునా! పూర్వజన్మములో బ్రహ్మనిష్ఠ చేసికొని యుండిన యోగి యీ జన్మములో ఆత్మవిషయమైన జ్ఞానముతో సంబంధమును పొందుచున్నాడు. అందుచేత వర్తమానజన్మములో పూర్ణజ్ఞానము గల్గువిషయమై అధిక

ప్రయత్నముగూడ చేయుచున్నాడు. అనగా అత్యధిక వైరాగ్య బోధోపరతులు గలిగే లాగున యత్నించుచున్నాడు. అట్టి జన్మములో జ్ఞానసిద్ధియే లక్ష్యముగా ఆతనికుండునేగాని యితరములైన కర్మఉపాసనాదులలో నెక్కువ శ్రద్ధ గల్గియుండదు. అదే దానికి గురుతు.

**పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ॥**

అట్టి జ్ఞానముతో గూడిన జన్మముగలవాడు దృశ్యాదియైన విషయ సౌఖ్యములచేతగాని, ప్రాకృతములైన ప్రవృత్తులచేతగాని, లేక యితరములగు కర్మానుష్ఠానములచేతగాని ఒకవేళ కొంతకాలము సంబంధపడియున్నను, స్వబోధ బ్రహ్మనిష్ఠ సాక్షాత్కార జ్ఞానము ప్రకాశింపక ఆవరణము గల్గియుండి నను ఆ సంస్కారశక్తిచే స్కాంతము నినుమును లాగుకొన్నట్లు అన్నిటిలో నుండియు ఆత్మసాక్షాత్కార జ్ఞానములోనికి తన్ను ఆకర్షించుకొనుచున్నాడు. కనుకనే కొందరికి చిన్నతనమునుండి సమస్త దృశ్యవిషయములందు విరక్తి గల్గుటయున్ను, మరికొందరికి జన్మాంతరసంస్కారవాసనలుండువరకు దృశ్య విషయములలో ఉండి మరల విరక్తి గల్గుటయున్ను, సర్వసంగపరిత్యాగమున్ను సంభవించుచున్నది. ఇట్టివారికి ఒకవేళ నీ జన్మములో గురుబోధ లేక యుండి నను జన్మాంతరములో గల ఆ గురుబోధము గల్గి యుండినందుచేతనే యిప్పుడట్టి యవస్థ గలుచున్నది.

కారణములేక కార్యమెప్పటికిన్ని గలుగదని న్యాయము గలదుగదా! అనగా బీజము లేక యెచ్చటను నే వృక్షమున్ను పుట్టియుండదు. ఇట్టి వారు గురువవసరము లేదని యెప్పుడును చెప్పరు. వీరిలో గూడ నీ జన్మములో గురువు నవలంబించువా రనేకులు గలరు. ఇదే యధార్థమైన శాస్త్రీయపద్ధతి యగును. ఎవరికి జన్మాంతరములోగాని యీ జన్మములోగాని గురువుండ లేదో, అనుభవజ్ఞానము గల్గియుండదో సుకృతవిశేషము చాలక యుండునో అట్టివారు మాత్రమే గురువవసరము లేదని చెప్పుదురు. వీరికింకను తరించవలసిన కాలము గలుగలేదు. ఏదైన పుణ్యాకార్యముచేసి, సర్వేశ్వర

కరుణ గల్గి బంధవిముక్తి గలుగచేసుకొనవలెనని తలంపు గల్గునప్పుడు తప్పక గురువు నవలంబింతురు. కొందరు చాల బ్రహ్మనిష్ఠులై యుండియు, అనేక గ్రంథములను వ్రాసియు, స్వప్నములో నిష్టదేవతాకృపచే కొన్ని ఉపదేశ వాక్యములను వినియు చాలాకాలము వాని నాచరించియు, అంత్యకాలము సమీపించినప్పుడు సందేహముగల్గి గురువుల నాశ్రయించిన వారున్ను గలరు. అట్టి గురుబోధ లేనిచో నెట్టివారికిన్ని సంశయము గల్గుట కవకాశ ముండును.

శ్రీశుకబ్రహ్మర్షియే దీనికి దృష్టాంతము. శుకులవారికి గర్భములో ఉండునప్పుడే ఆత్మజ్ఞానము గల్గియుండెననియు, జన్మమునుండి అవధూత వృత్తిలో అతీతజ్ఞానము గల్గియుండిన వారనియు భాగవత జ్ఞానవాసిష్ఠాది గ్రంథములలో చెప్పబడియున్నది. అట్టివారికి శ్రీవ్యాస భగవానులచే అనేక విధములుగా బోధింపబడియు సంశయనివృత్తి గలుగక జనకుని ఉపదేశము చేత సందేహనివృత్తి గల్గి బ్రహ్మసాయుజ్య సాక్షాత్కారములో నిలకడ గల్గినట్లు శాస్త్రములచే వినుచున్నాము. అట్టి శుకబ్రహ్మర్షికన్న అధికులా యిప్పుడు గురువవసరము లేదని చెప్పువారు?

**తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।**
**దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥**

ఎల్లప్పుడును భగవంతుడనగు నాయందే ఏకాగ్రచిత్తులును, తదేక ధ్యాననిష్ఠులున్ను, ప్రీతిపూర్వకముగా అనగా ప్రేమతో నన్ను ధ్యానించు వారున్ను అయిన బ్రహ్మనిష్ఠులకు పరమేశ్వరుడనగు నన్ను పొందుటకు నే సాధన అనగా మార్గము కావలసియుండునో, దానిని వారి అంతరాత్మనై యుండి నేను స్ఫురతి గలుగచేయుచున్నాను. అనగా అట్టి తదేక ధ్యాననిష్ఠులగు వారికి నే యుపాయము గల్గిన తరింపగలరో, అట్టి యోగజ్ఞానము నుపదేశించుచున్నానని చెప్పుటలో నే అనుష్ఠానముచేతగాని, లేక యే గురువుచేత గాని తరించుటకు యోగ్యమని భగవంతునికి తోచునో అట్టిజ్ఞానమును గలుగ జేయుచుండునని భావము. ఇట్టివారికి యాదృచ్ఛికముగా మహాపురుషులు

తటస్థించుటగాని, లేక అట్టి కారణగురువును పొందవలెనను తలంపుగాని గల్గుచుండును. లేక భగవంతుడు వారికి అట్టి గురువులతో సంబంధము గలుగచేయును. ఇది శ్రీరామకృష్ణపరమహంసల జీవితములో జరిగినది. భైరవి యను యోగినియు, తోతాపురియను మహాత్ముడు దైవప్రేరణచే పరమహంస దగ్గరకు వచ్చినవారనియు దైవాజ్ఞచే ఉపదేశించవలెనని తెలియుటచే అచ్చటికి రావడమైనదనియు వారు తెలిపియున్నారు. ఈలాగున నెన్నియో చరిత్ర ములు గలవు.

**తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।**
**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥**

ఎల్లప్పుడును ధ్యానము చేయు భక్తులను అనుగ్రహించుటకొరకు వారి యంతఃకరణమం దున్నవాడనై వారియొక్క అజ్ఞానజన్యమైన మోహాంధ కారమును వెలుగుచున్న జ్ఞానమనెడు దీపముచేత నేను పోగొట్టుచున్నాను. అనగా దీపమెట్లు చీకటిని పోగొట్టి సర్వవస్తువులను కనబరచునో అట్లే జ్ఞానము మోహ మను తమస్సును పోగొట్టి పరమాత్మను కనబరచును. కాన అట్టి జ్ఞానమును నా భక్తులకు గలిగించుచున్నాను. దీనియొక్క భావమున్ను పై శ్లోకముతో సంబంధించినదే. ఇది శ్రీ పండరీనాథుండు నామదేవునికి ఉపదే శించిన పద్ధతికి సంబంధించి యున్నది. అనన్యభక్తి గల్గి, సర్వసంగ పరిత్యా గము గల్గి తదేకధ్యాననిష్ఠతో భగవంతుని ధ్యానించువారు ఏ ప్రకారము తరించవలెనో ఆ ప్రకారము వారిని కరుణామూర్తి భక్తవత్సలుడగు భగవం తుడు తరింపజేయగల్గును. ఇదే భక్తియోగముయొక్క పరమకాష్ఠయొక్క సిద్ధాంతము.

ఇక జగద్విఖ్యాతి గాంచి మహారాష్ట్రదేశమునకు మహాగురువగు శ్రీ సమర్థరామదాసుస్వామి గురువిషయమై చెప్పినది చూడందగును. ఇది యిచ్చటచేర్చుట యెందుకనగా?వీరు లోకోద్ధారకులు, అఖండ బ్రహ్మనిష్ఠులు, అతీంద్రియ జ్ఞానులు, ఆజన్మాంతము బ్రహ్మచర్యవ్రతము సలిపినవారు.

భక్తిజ్ఞానయోగ నిష్కామ కర్మాదులను సమముగా అనుష్ఠించినవారు. శివాజీ మహారాజుగారికి గురువై యుండి మహారాష్ట్ర దేశమును సంరక్షించినారు. ఇటువంటి మహాపురుషులు గురువువిషయమై యెంత భక్తి గల్గియున్నారో, అది చూపుటకొరకే ఇది యిచ్చట అనుసంధింపబడినది. శ్రీ సమర్థరామదాసు స్వామిదివ్యవచనము -

## సద్గురు స్తుతి

"సద్గురువర్ణనము నెటుల గావింపవలయునో తోచకున్నది. మాయకు గూడ స్పృశింప నశక్యమగు గురుస్వరూపము అజ్ఞానుడనగు నా కేవిధముగా తెలియును? సద్గురుపరబ్రహ్మస్వరూపము నెరుంగుట యసాధ్యకార్యము. ఎవరి విషయమున శ్రుతులు "నేతి, నేతి" యని వాకొనుచున్నవో యట్టి గురుబ్రహ్మమును వర్ణించుటకు మూఢుడనగు నా హృదయమున స్థాన మెక్కడిది? స్తుతి విషయము నాకేమియు దెలియరాకున్నది. కావున దూరము నుండియే నీకు వందనములను సమర్పించుచున్నాడను. ఓ గురుదేవా! నీ మహిమ సముద్రమును దరిచేరుటకు తగిన శక్తిని నాకు దయతో ప్రసాదింపుము. నిన్ను గొనియాడవలయునని యాపరానియంత కోరిక గలదు. కాని మాయచే నాధైర్య మంతయు వికలమై పోయినది. కావున నో గురుస్వామీ! నీ వెవ్విధంబున నింతకు మున్నుంటివో యటుల నుండుము. ఇంతకు మున్ను మాయాబలమున నిన్ను గొనియాడగలనని మురిసితిని. కాని మాయ యంతయు లజ్జనొందిపోయినది. ఇక నా గురుమూర్తిని స్తోత్రము గావింప ననువగు విధమెద్ది?

ముఖ్యపరమాత్మను గల్పన మొనరించుట యెన్నటికిన్ని సాధ్యము కాని పని. ఇందుచేతనే యాతని ప్రతిమను చేయవలసివచ్చినది. ఆ విధముగనే నేను మాయాయోగమున సద్గురుని మహిమ నభివర్ణించెదను. సాధకుడు తన భావానుసారముగా నేవిధమున తన హృదయమునందు దేవతాధ్యానము గావించునో యట్లే యీ స్తుతి ప్రకరణమందు సద్గురుమూర్తిని స్తుతించెద.

ఓ సద్గురురాజా! నీకు జయమగునుగాక! నీకు జయమగునుగాక! ఓ విశ్వంభరా! ఓ విశ్వబీజమూర్తీ! పరమపురుషా! మోక్షధ్వజా! దీనబాంధవా! సూర్యప్రకాశముచే నంధకార సముదాయము పటాపంచలగునట్లు నీ యభయ రూపమగు ప్రకాశలేశముచే దుర్నివారమగు మాయయంతయు నశించు చున్నది. సూర్యుడంధకారమును రూపుమాపుచున్నాడు. రాత్రియైన పిదప నా యంధకారమంతయు లోకమునిండనల్లుకొనుచున్నది. కాని, నా సద్గురు స్వామి యట్టివాడు కాదు. ఆయన జననమరణములను వినాశము నొనరించు చున్నాడు.

మరియు సూర్యుడు బాహ్యతమస్సును పారద్రోల శక్తిగలవాడగునే గాని అంతఃకరణములో గల అవిద్యాతమస్సును నశింపజేయ శక్తిగలవాడు కాదు. కావున మా గురుస్వామికి సూర్యుని సదృశునిగా ఉపమింప తగదు. అజ్ఞానరూపమగు మహాంధకారము నాయన మూలమట్టముగా నశింపజేయు చున్నాడు. బంగార మెన్నటికిని నినుముగా మారని విధమున గురుభక్తు లెన్నటికిని సందియములకు బాల్పడజాలరు. ఏ నదియేని గంగానదిలో గలిసిన పిదప నదియును గంగానదియై పోవును. మరల నొకవేళ నది వేరు గావింపబడిన అది గంగానదిమాత్ర మెన్నటికిని గాజాలదు. కాని గంగానదిలో గలియుటకు ముందుగా నా నదిని జనులందరు (సామాన్య) నది యనియే యందురుగాని గంగయని యెప్పుడును చెప్పరు. శిష్యునిస్థితి యట్టిది గాదు. అతడు సర్వవిధముల గురుస్వామియే యగును. పరుసవేది లోహ మును పరుసవేదిగా జేయనేరదు. సువర్ణము ఇతరలోహమును సువర్ణముగా జేయజాలదు. కాని సద్గురుభక్తుడు ఉపదేశములచే నితరులను గూడ సద్గురువులనుగా జేయగల్గును. శిష్యున కీవిధముగా గురుత్వము చేకూరును. పరుసవేదిచే గావింపబడిన సువర్ణము ఇతర లోహములను సువర్ణముగా జేయనేరదు. కాన సద్గురునకు పరుసవేదితో నుపమాన మెన్నటికిని పొసగదు.

పోనిమ్ము, సద్గురునకు సముద్రము నుపమానము నొసంగుదమన్న నదియు యుక్తియుక్తముగ లేదు. ఏలయన? సముద్ర మత్యంత క్షారోదక

ముతో నిండియున్నది. కాదు, క్షీరసాగరముతో పోల్చుదమన్న నదియు యుక్తముగ లేదు. ఏలయన? క్షీరసాగరము సయితము కల్పావసానమున నశించుచున్నది. మేరుమహాపర్వతముతో సద్గురుమూర్తిని పోల్చుదమన్న నదియు దగియుండ లేదు. మేరువు జడపాషాణమయము. మా సద్గురుమూర్తి యట్టివాడు గాడు. అతడు దీనజనులను గాంచినంతనే దయార్ద్ర హృదయు డగును.

ఆకాశము నుపమానముగా గైకొందమనిన సద్గురుస్వరూపము ఆకాశముకంటె నిర్గుణముగాన సద్గురున కాకాశదృష్టాంతము జతపడుట లేదు. ధీరత్వమునందు సద్గురునకు నొకవేళ భూమిని సమానముగ చెప్పుద మన్న నదియు సరిపడదు. భూమి కల్పాంతమునందు నాశమగుచున్నది. కావున భూమి నుపమానముగ చెప్పుట తగదు. అన్నివిధముల సూర్యుడు సద్గురుమూర్తితో నుపమింపదగిన వాడందుమేని యాతని ప్రకాశమునకు గూడ శాస్త్రనియమ మున్నటుల పెద్దలు చెప్పుచున్నారు. సద్గురుడో? నియమా తీతుడుగాన నీ యుపమానము తగదు. కావున సూర్యుడు సయితము గురుమూర్తికంటె నుపమలో దక్కువవాడు. సద్గురుని జ్ఞానరూపమగు ప్రకాశము మిక్కిలి గొప్పది. ఒకవేళ ఆదిశేషుని నుపమింపదలచిన నెడల నదియు సంబంధింపదు. ఆదిశేషుడు భూభారమును మోయువాడు. జలము నుపమించుదమన్నచో నదియు గాలాంతరమునందెండిపోవును. సద్గురు నిరూపము నిశ్చలమైనది. కావున నది యెన్నటికిని నశింపజాలదు. సద్గురువున కమృతము నుపమానముగ చెప్పుదమన్న నదియు సరిపోకయున్నది. ఏల యన? అమృతపానము గావించు వారలమరులు, వారలుగూడ నొకప్పుడు మృత్యువునకు లోనగుచున్నారు. సద్గురుకృప ఆశ్రితులకు యధార్థమగు నమరత్వము గలుగచేయునుగాన నీ యుపమానము సరిపడదు.

ఒకవేళ సద్గురుని కల్పవృక్షమని చెప్పుదమన్నను నదియు పొసగ కున్నది. సద్గురుని స్వరూపము కల్పనాతీతము, కాన కల్పవృక్షోపమానము సర్వ విధముల ననుచితము. మనస్సులో గోరిక లేనప్పుడు చింతామణిని పాటించు

వాడెవ్వడు? నిష్కాముడగు వానికి గామధేనువుతో బనియేమి? కాన మా గురు మూర్తిని చింతామణితోడను, గామధేనువుతోడను బోల్చుట యుక్తము గాదు. సద్గురుమూర్తి యొకవేళ లక్ష్మీయుతుడని చెప్పదమేని యదియు నుచితముగ లేదు. లక్ష్మి నశించునది. మోక్షలక్ష్మిని తన గృహద్వారమునందు బంధించు సద్గురుమూర్తికి నాశవంతమగు లక్ష్మితో పోలిక తగదు. స్వర్గలోకమునకు, దేవేంద్రపదవికినిగూడ కాలాంతరమునందు చలనము గలదు. సద్గురుకృప చలనరహితమైనది. కావున దానిని స్వర్గముతో దేవేంద్రపదవితో బోల్చుట యెట్లు? హరిహరబ్రహ్మలుగూడ నాశన మగుదురు. సద్గురుపద మెన్నటికిని నాశనమొందక యవినాశిగా నుండును.

కావున మా దృష్టిలో సద్గురున కుపమింపదగిన దేదియు లేదు. సమస్త సృష్టియు నాశన మగుట గలదు. కాన పాంచభౌతికమగు భూమినెట్లు గురుమూర్తితో బోల్పనగును? ఇందుచే సద్గురుని వర్ణనము గావించుట నాకశక్యమని తొలుతనే విన్నవించినాడను. ఇక జాలును. సద్గురువర్ణనము నాకు సాధ్యము కాదు అని నుడువుటయే నేను గావించు గురువర్ణనము. అంతరస్థితమగు నెరుకను అంతర్నిష్ఠుడే (అనుభవజ్ఞుడే) యెరుంగును".

ఇంతవరకు చెప్పినది శ్రీసమర్థరామదాసువారి దివ్యవాక్యము. గురువుచే గలిగిన పరమసుఖమున్ను, దుఃఖనివృత్తియున్ను, శాశ్వతపదవియు, అపార మహిమయున్ను పెరింగిన వారిట్లే చెప్పుదురు. సూర్యప్రకాశమును అంధుడెట్లెరుంగ గలుగును? ఇక గురువిషయమై యెక్కువ చెప్పదలంచ లేదు. అయితే ఇచ్చటనుండు భక్తులు ఈలాగున సందేహమొంద గలరు.

అదేమన? ఇతరశాస్త్రములున్ను, ఇతరుల చరిత్రములున్ను ఇతరులు చెప్పిన వాక్యములున్నుమాత్రమే మీరు చెప్పితిరేగాని మీరు సొంతము చెప్పిన దేమి గలదని సంశయము నొందగలరు. అది అట్లు గాదు. ఇంతవరకు వివరించిన శాస్త్రములున్ను, చరిత్రములున్ను, మహనీయుల వాక్యములున్ను సామాన్యములు గావు. వారలు ఈశ్వరాంశ సంభూతులు. లోకోద్ధారకులు,

మతకర్తలు. అట్టివారే యిట్టి గురుభక్తి గల్గియున్నవారలని మీకు తెలుపుట చేత సందేహనివృత్తి గలుగగలదు. ప్రారంభమునుండి అంత్యమువరకు అచ్చటచ్చట నాయొక్క ఆశయమున్ను తెలుపుకొనియే వచ్చితిని. నాకు అట్టి గురుభక్తి లేనిచో, మీ యెదుట నీలాగున నిలువజాలి యుండను. భాష్య కర్తలు, స్మృతికర్తలు, యోగశాస్త్రజ్ఞులు మొదలగు వారందరున్ను వారిచే విరచితములైన గ్రంథము లన్నిటిలోను, అనేక మహాపురుషులను సాక్ష్యముగా ఉదాహరించుటయేగాక బలవత్తరములగు ననేకులు చెప్పిన శాస్త్రములను, శ్రుతివచనములను, స్మృతి వాక్యములను దృష్టాంత మిచ్చుచునే వచ్చిరి. అట్లు చేయుటయే సమంజసమగును.

కానిచో మీ యిష్టానుసారము తోచినట్లు చెప్పితిరేగాని దీనికేదైన ప్రమాణము గలదా? మహర్షుల అభిప్రాయము గలదా? అని అడుగుటకు భక్తి విశ్వాసము లేనివారలు ప్రారంభింతురు. కనుకనే న్యాయస్థానములో సాక్ష్య ములు గావలసి వచ్చినవి. సాక్షులు ఎంత బలవత్తరులో, న్యాయశీలురో, సత్యప్రవర్తకులో, లోకవిఖ్యాతి గలవారలో జనులకు నమ్మకము గలిగిన వారలో వారి సాక్ష్యమునకు అంత పటుత్వము గల్గును. న్యాయాధిపతియు అట్టివారి సాక్ష్యవాక్యములను గౌరవముగా ఆదరించును. అందుచేత నీ చరిత్రము లన్నియు, నీశాస్త్రము లన్నియు నిచ్చట నిరూపించవలసి వచ్చినవియేగాని మరియేలాటి తలంపును గల్గియుండలేదు. జనులేలాగున తలంచినను తలంచుదురుగాక! ధర్మబుద్ధియు, సత్యనిష్ఠయు, దైవభక్తియు, జ్ఞానమందు నిలకడయు గలవాడు తనకు సత్యముగా తోచిన దానిని వెల్లడి చేయుచునేయుండును. అతడు తాను చేయునవి లోకమంగీకరించుచున్నదా? అని దృష్టినుంచడు.

లోకమునకు హితమై యుండినను దైవమునకు దూరమైనచో అట్టి కార్య మత డాచరింపడు. అది ఆత్మవంచనమే యగును. దైవహితమైనది, ప్రస్తుత జనులకు హితముగాకపోయినను దాని నాదరించు జనులు పుట్టగలరు. లేక యితరస్థలములో నుందురు. జ్ఞానియైనవాడు యథార్థమైన సత్యబుద్ధి గల

వాడు దైవహితమును జూచునేగాని లోకహితముపై చిత్తమును ప్రసరింపనీ యడు. ఇట్టివానికి ప్రస్తుతము జయము గలుగక పోయినను కాలాంతరమున విజయము గల్గుట నిక్కము. అట్లుగానిది ప్రస్తుతముగ విజయము గనుపించి నను అచిరకాలములో నశించిపోవును. కావున భక్తులారా! జిజ్ఞాసువులారా! ఆస్తికబుద్ధిగల సన్మార్గనిష్ఠులారా! దైవహితకార్యము నాచరింపుడు. విజయము గల్గును. శాంతియు నిత్యసౌఖ్యమున్ను లభించును. ఇది అమృతపదవిని గలుగ చేయును. కాలక్రమముగా లోకమును గూడ మంగళకరముగ నొనర్చును. సర్వభూతకోట్లున్ను సంతుష్టి నొందగల్గును. ఋషులు సంతోషింతురు. దేవతలు సంతుష్టి గలవార లగుదురు. మీ వంశము గూడ ధన్యమగును. మీరున్ను ధన్యులగుదురు.

ఇక శ్రుతిసారమగు ఒక్కొక్క ఉపనిషత్తునుపదేశించిన ఒక్కొక్క ఋషియు వారి గురువులును పరమఋషిసత్తములచేతను బ్రహ్మాదిదేవతల చేతను ఉపదేశము పొందినవారలుగా నున్నారు. ఇది ఒక్కొక్క ఉపనిషత్తున్ను, వాని పేర్లున్ను, అవి ఉపదేశింపబడిన గురుశిష్యుల నామధేయమున్ను వ్రాయ వలసివచ్చిన ఈ వ్యాసము చాల పెరిగిపోవును. కావున అవి అష్టోత్తరశతోపని షత్తులలో చూచుకొని గ్రహించుటయే మంచిదిగా నుండునని తలంచి విడిచి పెట్టడమైనది. ఉపనిషత్తు మొదలగు పరిశుద్ధాస్తిక గ్రంధములను చూడ తలంపుగల వారికి గురువు అవసరమా? అనవసరమా? అని ప్రశ్న గూడ గలుగదు. అంతదూరము వెళ్ళక యుండే వారికే ఈ ప్రశ్న గల్గును. అట్టివారికి నిది చాలునని తలంచుటచేతను విరమించుకొనడమైనది. "ఆచార్యవాన్ పురుషో వేద'' - ఆత్మయొక్క యథార్థమైన తత్త్వము ఆచార్యుని అనుసరిం చినవాడు మాత్రమే తెలుసుకొనగల్గును అని ఛాందోగ్యశ్రుతి.

**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః**
**శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ।**

శ్రుతిసారమును చక్కగ తెలిసినవాడున్ను, బ్రహ్మనిష్ఠుడున్ను,

శాస్త్రానుసారముగవర్తించువాడును అగు గురువును పూజార్హ వస్తువును కరములో స్వయముగ నెత్తుకొని ఆత్మసాక్షాత్కారజ్ఞానము గలుగచేసుకొనుట కొరకు శిష్యుడైనవాడు పాదచారిగా వెళ్ళి శరణు పొందవలయును అని ముండకశ్రుతి ఉపదేశించుచున్నది.

ఇచ్చట శ్రుతిసారమనగా శ్రుతియొక్క సారమగు వేదాంతము, అనగా ఆత్మసాక్షాత్కారము చక్కగా అనుభవించిన గురువుగా ఉండవలెనని భావము. మరియు శ్రుతిచే చెప్పబడినట్లు సర్వసద్గుణ వర్తనము గలవా డనియు తెలియందగినది. బ్రహ్మనిష్ఠుడని చెప్పుటచే బ్రహ్మసాక్షాత్కారములో సదా ప్రవృత్తి గలవాడై యుండువాడని తెలియందగినది. ఇక నీ విషయమై యెక్కువ చెప్పదలంచుట లేదు. సనక సనందన సనత్కుమార సనత్సుజాతు లను ఊర్ధ్వరేతస్సు గలవారున్ను, చతుర్ముఖ బ్రహ్మయొక్క మానసపుత్రు లును పుట్టుకతో నుండి బ్రహ్మనిష్ఠులున్ను, ప్రకృతియను మాలిన్యము తగు లనివారున్ను, యోగీశ్వరులున్ను పరమమునిసత్తములునగు నిట్టి సనకాది మహర్షులే శ్రీదక్షిణామూర్తులవారిని శరణుపొంది బ్రహ్మసాక్షాత్కార జీవేశ్వ రైక్య మహాజ్ఞానమును గలుగజేసుకొన్నారని శ్రుతి చెప్పుచుండగా మాయా మలినులైన జీవులను గురించి మరల చెప్పవలయునా? ఈ విషయమై విస్తారముగ గనంగోరువారు సనత్కుమారసంహితలో గనందగును. నాల్గు వేదములున్ను ప్రప్రథమమున శ్రీవేదవ్యాస మహామునిసత్తమునుండి పైలాది మహర్షిసత్తములు గ్రహించి యున్నారు. ఇది సమస్త శాస్త్రములలో చెప్పబడి యుండుటచేతను శ్రీ మద్భాగవతమున ప్రథమమున వ్రాసియుండుటచేతను నెక్కువ చెప్పంబనిలేదని తలంచెద.

వేదము మొదటి నుండి గురుశిష్య పరంపరగా వచ్చుచుండు విష యము ఋషిసంప్రదాయములో జన్మించిన ఆబాల వృద్ధుల కందరికిని తెలి సిన విషయమే.

**పైలుండు ఋగ్వేద పఠనంబు దొరకొనె**
**సామంబు జైమిని సదువుచుండె**

యజావు వైశంపాయనాఖ్యుండు గైకొనె
దుది నధర్వము సుమంతుపఠించె
నఖిల పురాణేతిహాసముల్ మాతండ్రి
రోమహర్షణుడు నిరూఢి దాల్చె
దమతమ వేద మాతపసులు భాగించి
శిష్య సంఘములకుజెప్పి రంత
శిష్యులెల్లను నాత్మీయ శిష్యజనుల
కంత బహుమార్గముల ద్రుంచి యనుమతింప
బెక్కు శాఖలు గలిగి యీ పృథివిలోన
నిగమ మొప్పారె భూసుర నివహమందు

ఇకను భగవద్వాక్యములు రెండు ఉదాహరించెదను :-

**మహావరాహో భగవానాహ జన్మాబ్ధితారణే ।**
**నావం నృతనుమాత్మానమనుకూలానిలం గురుమ్ ।**
**కర్ణధారమతో దేహీ గురుణా సంసృతిం తరేత్ ॥**

**నృదేహమాద్యం ప్రతిలభ్య దుర్లభం ప్లవం సుకల్పం గురుకర్ణధారకమ్ ।**
**మయా నుకూలేన నభస్వతేరితం పుమాన్ భవాబ్ధిం న తరేత్సఆత్మహా ॥**

మనుష్యదేహము లభించుట అతిదుర్లభము. అత్యంత పుణ్యకర్మలచే కష్టపడి సాధింప దగినది. చిరకాలపుణ్య సంస్కార పరిపక్వత వచ్చునప్పుడు గల్గునది. అట్టి మనుష్యదేహము, సంసారమనెడు సముద్రమును తరించుటకు నావ వంటిది. ఈ నావను చక్కని మార్గములో నడుపుటకు గురువు కర్ణ ధారుని వంటివాడు (అనగా నావ నడుపువాడు). నేను (భగవంతుడు) అను కూలమైన వాయువువలె సహాయము చేయువాడను. అట్టి సౌకర్యములు గల్గియు మనుష్యుడు సంసారము తరింపదలంపడేని వాడు తనఆత్మను నశింపజేసుకొన్నవాడే యగును (ఆత్మహంతయగును).

ఇట్టి భగవద్వాక్యములనైన దలంచుకొని పరిశుద్ధాస్తికులై దయాస్వరూ

పులై బ్రహ్మజ్ఞానులగు గురువుల నాశ్రయించి తరింతురుగాక!

శివజ్ఞానదీపికయందు సాక్షాచ్ఛంకరుడు భవానికి ఉపదేశించినది చూడుడు -

**స్వతంత్రాభ్యాసశీలానాం కథం యోగ మవాప్నుయాత్ ।**
**నాస్తి తేషామపి జ్ఞానం నాస్తి తేషాం గతిః పరా ॥**

**న గుణం సాత్త్వికం తేషామ్ న భవేద్గురుదర్శనమ్ ।**
**గురూపదేశాత్ జ్ఞాతవ్యం ప్రాగ్ జన్మ సుకృతేన చ ॥**
**అన్యథా జ్ఞాతుమభ్యాసైః కల్పకోటిశతైరపి ॥**

గురూపదేశములేక స్వతంత్రముగా యోగజ్ఞానము నభ్యసించువాని కెట్లు సిద్ధి గల్గును? కలుగదని భావము. అట్టివారికి ఆత్మజ్ఞానము కలుగ నందుచే వారికి ఉత్కృష్టగతి సిద్ధింపదు. అంతేగాక వారికి సాత్త్విక గుణము లేనందుచేతనే సద్గురువు లభింపడు. స్వాతంత్ర్యబుద్ధి రజోగుణమగుటచే వీరికి పరమగురుసేవకు భాగ్యము గలుగక పోయినది. బ్రహ్మజ్ఞానము పూర్వజన్మ సుకృతవిశేషముచేతను, పరమగుర్వనుగ్రహముచేతను గలుగ వలసి యున్నది. అట్లుగాక కోటికల్పములు స్వయముగా నభ్యసించినను అను భవమునకు రాజాలదు. ఇట్టి యీశ్వరవాక్యములలోగూడ నమ్మకము లేని వారిని గురించి మనమేమి చేయగలము?

**గురుభక్తిం సదా కుర్యాచ్ఛ్రేయసే భూయసే నరః ।**
**గురురేవ శివస్సాక్షాన్నాన్య ఇత్యబ్రవీచ్ఛ్రుతిః ॥**
**నవాయ నవరూపాయ పరమార్థైకరూపిణే ।**
**సర్వాజ్ఞానతమో భేదే భానవే చిద్ఘనాయ తే ॥**
**స్వతంత్రాయ దయాక్లృప్తవిగ్రహాయ శివాత్మనే ।**
**పరతంత్రాయ భక్తానాం భవ్యానాం భవ్యరూపిణే ॥**
**ఓమ్ మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే ।**
**సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళమ్ ॥**

**హరిమహిమ దనకు జెప్పిన**
**గురువున్ నరుడని దలంచి కుంఠిత భక్తిం**
**దిరుగు పురుషు(శ్రమ మెల్లను**
**గరిశౌచము క్రియ నిరర్థకంబగు నధిపా ॥ (శ్రీమద్భాగవతము)**

❀❀❀❀

## గురుస్తోత్రము *

**శరీరం సురూపం సుతో వాకళత్రం**
**యశశ్చారు చిత్రం ధనం మేరుతుల్యమ్ ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

సుందరమైన శరీరమున్ను, సుందరుడైన పుత్రుడున్ను, సుందరియైన భార్యయు, విఖ్యాతిగల్గి నిర్మలమైన కీర్తియున్ను, మేరుపర్వతమంత ధనమున్ను ఉండినను నెవనియొక్క మనస్సు గురుపాదకమలములో లగ్నము గాలేదో వానికి పైవానివల్ల ఏమిఫలము? తర్వాత నేమి ఫలము? తరువాత నేమిఫలము? తరువాత నేమిఫలము? అనగా మరణానంతరము ఇవి యేమియు ఆత్మకు సహాయము గలుగజేయవు. గురువాక్యశ్రవణముచే గల్గిన జ్ఞానమొక్కటి మాత్రమే ఆత్మను రక్షించు చున్నదని భావము.

**కళత్రం ధనం పుత్ర పౌత్రాది సర్వం**
**గృహం బాంధవాస్సర్వ మేతద్ధిజాతమ్ ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

---

* శ్రీ శంకరభగవత్పాద విరచితముగా ప్రసిద్ధమైన ఈ స్తోత్రము పూజా పంచరత్న మాలలో (శ్రీమలయాళ సద్గురు గ్రంథావళి-పదునారవ సంపుటము)కలదు అయినను తాత్పర్యరచనలోను, వివరణములోను వైవిధ్యముండుటచే ఇట నుండి తొలగింపలేదు.(సం పా.)

కళత్రము, సంపత్తు, పుత్రపౌత్రాది యావద్బంధువులున్ను, గృహ మున్ను, మిత్రులున్ను - ఇవి అన్నియు గల్గియుండినను ఎవనియొక్క మనస్సు గురుపాద పద్మములో లయము నొందలేదో వానికి తర్వాత గతి యేమి? తర్వాత గతియేమి? తర్వాత గతియేమి? తర్వాత గతియేమి?

**షడంగాది వేదో ముఖే శాస్త్రవిద్యా**
**కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

ఋగ్యజుస్సామాథర్వణములను నాల్గువేదములున్ను; శిక్ష, కల్పము, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము అని ఆరు వేదాంగములున్ను ముఖస్థములై యుండినను, ఆలాగున తర్కవ్యాకరణ మీమాంసా యోగ సాంఖ్యాదులైన ఆరు శాస్త్రములు ముఖస్థములై యుండినను, అట్లే యితరము లైన విద్యలన్నియు ముఖస్థములై యుండినను, కవిత్వము చెప్పుటలో మంచి నైపుణ్యము గల్గియుండినను, ఆలాగున గద్యరచనలో మంచి నిపుణత యుండినను, నెవనియొక్క మనస్సు గురుపాదపంకజములో లీనము గాలేదో అట్టి కారణముచే పైచెప్పిన వానివల్ల నేమి ప్రయోజనము? పైజెప్పిన వానివల్ల నేమిప్రయోజనము? పైజెప్పిన వానివల్ల నేమిప్రయోజనము? పైజెప్పిన వానివల్ల నేమిప్రయోజనము?

**విదేశేషు మాన్యః స్వదేశేషు ధన్యః**
**సదాచారవృత్తేషు మత్తో న చాన్యః ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

విదేశములలో మిక్కిలి విఖ్యాతి గల్గినను, మన్ననబడసి స్వదేశములో విశేషముగ మాన్యుడైనను, సమస్త సదాచారములలో మంచి నడతగల వాడై నను, సుగుణములలో తనకు సమానుడైన మరియొకడు లేడని స్థితి తగినట్లు

గల్గినను, మనస్సుననది గురుపాద సరోజములో లయింపనిచో పై జెప్పిన వానివల్ల ఏమి ప్రయోజనము? వానివల్ల ఏమి ప్రయోజనము? వానివల్ల ఏమి ప్రయోజనము? వాని వల్ల ఏమి ప్రయోజనము?

**క్షమామండలే భూపభూపాలబృందైః**
**సదా సేవితం యస్య పాదారవిందమ్ ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

భూమండలములో రాజాధిరాజ సమూహములచే నెవని పాదారవిందము సదా సేవింపబడినదిగా నుండినను వాని మనస్సు గురుపాదపంకజములో అధీనముగానిచో దానివల్ల ఏమి ప్రయోజనము? దానివల్ల ఏమి ప్రయోజనము? దానివల్ల ఏమి ప్రయోజనము? దానివల్ల ఏమి ప్రయోజనము?

**యశో మే గతం దిక్షు దాన ప్రతాపా**
**జ్జగద్వస్తు సర్వం కరే యత్ప్రసాదాత్ ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ।**

దానప్రతాపమువల్ల ఎవనియొక్క యశస్సు దశదిక్కులలోను వ్యాపించి ప్రకాశించుచుండినను, ఈశ్వరుని కృపవల్ల లేక, పూర్వసుకృత విశేషమువల్ల ప్రపంచము యావత్తున్ను తనహస్తగతమై యుండినను అతని మనస్సు గురుపాదకమలములో లయము నొందనిచో దానివల్ల ఏమి ప్రయోజనము? దానివల్ల ఏమి ప్రయోజనము? దానివల్ల ఏమి ప్రయోజనము? దానివల్ల ఏమి ప్రయోజనము?

**న భోగే న యోగే న వా వాజిరాశౌ**
**న కాంతాసుఖే నైవ విత్తేషు చిత్తమ్ ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం: తతః కిం తతః కిమ్ ॥**

ఎవనియొక్క చిత్తము భోగములలో రుచించుట లేదో, యోగములో రుచించుట లేదో, గజతురగరథాది సమూహములో రమించుట లేదో ఆలాగున ధనధాన్య సమూహములోను రుచించుట లేదో ఆలాటి వైరాగ్యము గల్గినను గురుపాదపద్మములలో మనస్సు లగ్నము గానిచో దానివల్ల ఏమి? దానివల్ల ఏమి? దానివల్ల ఏమి? దానివల్ల ఏమి? అనగా నిట్టి వైరాగ్యము గల్గినను గురుకృప లేనిచో ముక్తి గలుగదని భావము.

**అరణ్యే న వా స్వస్య గేహే న కార్యే**
**న దేహే మనో వర్తతే మేత్వనర్ఘ్యే ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

ఎవనియొక్క మనస్సు అరణ్యావాసములోగాని, స్వగృహములోగాని ప్రీతిలేనిదై యితర కార్యములలో వేనిలోను మనస్సు లేనిదై, దేహసంరక్షణ యందైనను ప్రీతిలేనిదై యుండెడు తీవ్రవైరాగ్యము గల్గియుండినను అమూల్యమైన గురుపాదపద్మములో లయింపనిచో పై జెప్పిన వానివల్ల నేమి ప్రయోజనము? ఏమి ప్రయోజనము? ఏమి ప్రయోజనము? ఏమి ప్రయో జనము?

**అనర్ఘాణి రత్నాని ముక్తాని సమ్యక్**
**సమాలింగితా కామినీ యామినీషు ।**
**గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం**
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

వెలలేని రత్నరాసులుండినను, అమూల్యములైన ముత్యములు కుప్ప లుగా నుండినను, సుందరస్త్రీయైన భార్యచే భోగలాలసుడై యుండినను, నెవనియొక్క మనస్సునునది గురువులవారి పాదధూళిచే పునీతము గాలేదో పై జెప్పిన వాని యన్నిటివల్ల ఏమి ఫలము? ఏమి ఫలము? ఏమి ఫలము? ఏమి ఫలము?

**గురోరష్టకం యః పఠేత్పుణ్యదేహీ**
**యతిర్భూపతిర్బ్రహ్మచారీ చ గేహీ ।**
**లభేద్వాంఛి తార్థం పదం బ్రహ్మ సంజ్ఞం**
**గురోరుక్తవాక్యే మనో యస్య లగ్నమ్ ॥**

ఇతి శ్రీమత్ప రమహంస పరివ్రాజక శ్రీశంకరాచార్యవిరచితం గుర్వష్టకమ్ సంపూర్ణమ్.

గుర్వష్టకము ఏ పుణ్యదేహియైన సన్న్యాసిగాని, రాజుగాని, బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని పఠించునో అట్టివానికి గురువు ఉపదేశించిన వాక్యములో మనస్సు లగ్నమై యుండును. అట్లు మనస్సున నమ్మకము గలవానికి తాను కోరిన బ్రహ్మమను పేరుగల మోక్షపదము లభించును.

శ్రీజగద్గురువులగు శంకర భగవత్పాదులే యీలాగున బోధించి యుండగా, మరల గురువు అవసరమా? అనవసరమా? అని సందేహ పడవలసి యుండునా? అయితే గురువువల్ల గల్గిన మహోపకారము నెరింగిన పుణ్యశాలికి మాత్రమే ఆ పరమగురువుయొక్క కృప గోచరించును.



# గురుకీలకం

## (గురు రహస్యం)

ఇప్పుడు గురుకీలకము చెప్పబడబోవుచున్నది. ఇది మరింత జాగరూకతతో వినందగినది. ఈ రహస్యము గురువులయందు అణగియుండును. అయితే యిది గురువులయొక్క కార్యమేగాని శిష్యులకు సంబంధించినది గాదనిగూడ తలంపరాదు. ఏలన? నేటి శిష్యులే రేపటి గురువులుగా మారవలసియుండునను తత్త్వము జ్ఞాపకములో నుంచవలెను. కావున నిది గురుశిష్య లుభయులకున్ను కావలసిన విషయమే. అయితే గురుకీలకమను పరమ రహస్యము అందరికిని తెలిసిన సంగతియే. అట్టి అతిరహస్యము చెప్పబోవుచున్నారని తలంచి అదేమో? యని వినుటకు చాల కుతూహలము గలవారై మనవారందరును ఆతురతతో నిరీక్షించుచున్నారు.

1. అది తారకమని కొందరును, సాంఖ్యమని మరికొందఱున్ను, అమనస్కమని ఇంక కొందఱును తలంచియుందురు. అది గాదు. దీనికి క్రింద నుండు ముద్రలుగాని, లక్ష్యములుగాని ఆధారాధిష్ఠాన దేవతలుగాని కానే కాదని మరి చెప్పనక్కర లేదుగదా?

2. అయితే కర్మ, భక్తి, జ్ఞాన, యోగములైయుండవచ్చునేమో యని తలంప నక్కరలేదు. అది కానే కాదు.

3.అట్లయిన అష్టాంగయోగములోగల ప్రాణాయామరహస్యమై యుండవచ్చునని తలంచినను, లేక ధారణాధ్యాన సమాధులలో ఒకటై యుండవచ్చునని యోచించినను అది అసలే కానే కాదు.

4. జీవేశ్వరుల ఐక్యమై, లేక హంసమంత్రము లేక సోఽహంభావము యొక్క రహస్యమైన అయియుండవచ్చునని తలంచిన అది బొత్తిగ కానేగాదు.

5. అట్లయిన బ్రహ్మాత్మైక్యముగా నుండవచ్చునో యని యూహించినచో అదియును గాదు.

6. అయితే యోగ సాధనలచే కుండలిని మేల్కొల్పి జీవునికి ప్రబోధము గలుగజేయునదిగా నుండునని తలంచిన అదిన్ని కాదు.

7. అయితే సుషుమ్నా నాడిద్వారా ప్రాణవాయువును బ్రహ్మరంధ్రములోనికి తీసుకొని వెళ్ళి పరమాత్మను దర్శింప చేయుట యైయుండవచ్చునని తలంచిన అదిన్ని కాదు.

8. అయితే ఇడాపింగళల మధ్య నుండు త్రికూటస్థానములో గల ఆనందమను మడుగులో మునిగి శుద్ధాత్ముడై యుండుట యైయుండవచ్చునని తలంచినచో అదిన్ని కాదు.

9. అట్లుగాని యెడల త్రికూటస్థానములో మేరుగిరియొక్క ఉపరి భాగమున ముక్తికాంతతో కలసి యోలలాడుట యైయుండవచ్చునని తలంచినచో అదిన్ని గాదు.

10. అయితే ఉపనిషత్ప్రతిపాదితమగు హృదయగుహయందు నిగూఢమైయుండు ఆత్మను దర్శింప జేయుట యైయుండునని తలంచిన అదియు గాదు.

11. అయితే గురువాక్యమనెడు తాళపుచెవితో హృదయబిలమును తెరచుట యైయుండునని తలంచిన అదిన్ని కాదు.

12. అయితే మోక్షద్వారమును తెఱచి ముక్తికాంతను దర్శింప జేయుట యనినచో అదిన్ని కాదు.

13. అయితే మాయామోహముచే జీవుడని తలంచి భ్రమించెడు నీవు శివుడవే యని తెలిపెడు మహామంత్రముయొక్క గోప్యమై యుండవచ్చునని తలంచిన అదియును గాదు.

14. అయితే యివి యన్నియు బట్టబయలు. అచల పరిపూర్ణ మొక్కటియే నిజమని తెలుపునదిగా నుండునని తలంచిన అదిన్ని కాదు.

15. అయితే యీశ్వర శరణాగతి యనంబడు పరమప్రపత్తి రహస్య మైయుండునని తలంచిన అదిన్ని కాదు.

16. అయితే పుణ్యమున్ను లేదు, పాపమున్ను లేదు. అంతయును భ్రమమాత్రమనియు, అన్నియు చేయవచ్చునని తెలిపెడు అచలమార్గమైన లేక అతీతమార్గమైన అయియుండవచ్చునేమో యని యనుకొనిన అది యెప్పటి కిని కానే కాదు.

17. అయితే శక్తిపూజ చేయనిచో శివుని యనుగ్రహము గలుగదని తెలిపెడు శాక్తేయ వామమార్గ ప్రసంగముగా నుండవచ్చునేమో యని తలం చిన అది కానే కాదు.

18. అయితే ప్రకృతి సేవ చేయనిచో పరమపురుషజ్ఞానము గలుగదని తెలిపెడు కుయోగులు చెప్పెడు రహస్యమైన అయియుండవచ్చునని తలంచి నచో అది కానే కాదు.

19. అయితే సాకారధ్యానము లేనిచో నిరాకార ధ్యానము గలుగదని భక్తులు చెప్పు మార్గ మేదైన నుండవచ్చునా యనిన అదియును గాదు.

20. అయితే గురుసేవ చక్కగ చేయనిచో నీ గురుమర్మము తెలియదని చెప్పునదేదైన నుండవచ్చునేమో యని యనుకొనిన అదియును గాదు.

21. అయితే అంతయును నీశ్వర సంకల్పమువల్లనే జరుగుచున్నది. జీవుని ప్రయత్నము ఏమియును లేదు. కావున నీవు కర్తృత్వమును విడిచి నిస్సంగుడవై యుండుము అని తెలిపెడు పరాపర రహస్యమేదైన నుండునో యనిన అదియును గాదు.

22. అయితే ఆత్మయే పరమాత్మ, అది నిత్యము, నిర్మలము, అనం తము, ఆనందము, శివము, జ్ఞానము. అట్లుండియు సంకల్పముచే ఆత్మను దుఃఖితునిగాను, బద్ధునిగాను, అజ్ఞునిగాను దలంచుచున్నావు. కావున నిస్సం

కల్పత్వము గల్గి చిన్మాత్రజ్ఞానైక స్వరూపుడుగా నుండుమని అంతరంగ శిష్యులకు గురువులు ఉపదేశించునదేదైన అయియుండవచ్చునని తలంచిన అదిన్ని కాదు.

23. అయితే గురుశిష్య ఈశ్వర భేదము అవిద్యాకల్పితమేగాని అది విద్యచే నివృత్తింపగ అభేదమని కలిగెడు జ్ఞానముగా నుండవచ్చునని తలంచిన అదిన్ని కానే కాదు.

24. అయితే మఠాకాశ, ఘటాకాశ, మేఘాకాశాది భేదము ఉపాధి కృతమే గాని ఉపాధిరహితకాలమున ఏకైకాకాశముగా నున్నట్లు జీవ, జగత్, ఈశ్వర భేదము లన్నియు కల్పితములనియు, ఆత్మ ఆకాశమువలె అన్నిటి లోను వ్యాపించియు దేనితోను అంటక యుండునట్లు కేవలాత్మ స్వరూపుడవై యుండుము అనియు తెలిపెడు పరమ రహస్యమేదేన నైయుండుననిన అది యును గాదు.

అయితే యివి యన్నియును కానిచో అది మరల నేమై యుండునో యని మీరు తలంచి తలంచి విసుగు గలుగజేసుకొన నక్కఱ లేదు. అది పరమ సులభమై ఎల్లప్పుడును మీకన్నులార చూచుచుండునదే. అది యేమన "గురువు యొక్క ఆచరణయే.

అయితే అట్టి, ఆచరణ సామాన్యమని తలంపరాదు. దానివల్లనే శిష్యులు భక్తులందరున్ను గురుమార్గములోనికి రావలసియుండును. అచ్చులో పోసిన కరగిన లోహము ఏలాగున అచ్చు (కరువు) లేక మూసయొక్క ఆకృతిని పొందుచుండునో ఆలాగున గురువుయొక్క ఆచరణచే శిష్యులు గురురూపు లుగా మారవలసియుండును. పై జెప్పిన వాటి కన్నిటికన్న ఇట్టి యాచరణ కడుంగడు ప్రయాసమైనదిగాను, అతిరహస్యమైనదిగాను నుండును. ఇదియే గురు కీలకము.

అంతేగాని, మంత్రమునకు గల ఋషి, ఛందస్సు, కీలకములను

తెలుసుకొనుట గాదు. కీలకమనగా కీలుబొమ్మయని మీరెరింగి యుందురు. దానియొక్క కీలు త్రిప్పిన ఆ బొమ్మ గంతులు వేయుచుండును. ఆలాగున యంత్రములకు ఇంజనులకుకూడ కీలు గలదు. ఆ కీలు మర్మము తెలిసిన వారు దానిని త్రిప్పిన ఆ మిషన్లు తత్తత్కర్మను చేయుచుండును. దీనిని మర యని గూడ సామాన్య జనులు చెప్పుదురు. ఆ కీలు తెలియనిచో అట్టివానివల్ల గల్గు ఉపయోగము తెలియదు. విద్యుచ్ఛక్తి యంత్రముయొక్క మరయంత్ర మును త్రిప్పిన నేలాగున దీపములుగాని, యింజనులుగాని వానివాని పనులు చేయుచుండునో, ఆలాగుననే మనయొక్క సమస్త శ్రేయస్సున్ను నిశ్శ్రే యస్సున్ను ఆచరణ యను కీలకములోపల నున్నది. ఆలాగున గురుకీలకము తెలియనిచో జ్ఞానరహస్యము తెలియదని సంప్రదాయ వాక్యములు గలవు. ఇది గురునియొక్క అనుష్ఠానమేగాని మరియొకటి గాదు.

గురువైనవారు భక్తులందరిని, శిష్యులందరిని తనయొక్క స్వరూపు లుగా చేయుటయే యగును. దీనినే భ్రమరకీటక న్యాయమని వేదాంత శాస్త్రములు చెప్పుచుండును. ముఖ్యముగా గురువులందరున్ను తనయొక్క ఆచరణ జూచి శిష్యులు ఆలాగున కాగలరను నమ్మకము గలవారలై యుం దురు. ప్రతి మతము వారున్ను, సంప్రదాయమువారున్ను తమగురువులను ధ్యానకాలములో ముందుగా తప్పక ధ్యానించుచుందురు.

అట్టి ధ్యానకాలములో గురుధ్యానము చేయునప్పుడెట్టి యశాంతి గల మనస్సునకైనను వెంటనే శాంతి గలుగవలయును. వైరాగ్యములేని వారైనను గురుధ్యానము చేయునప్పుడు సంపూర్ణ వైరాగ్యము గలవారలు గావలయును. కోపము గలవారైనను సద్గురువును ధ్యానించినప్పుడు పరమ శాంతము గలుగ వలయును. మందుడైనను గురుని ధ్యానించిన అప్పుడే మంచి చురుకుదనము గలవాడు గావలయును. భక్తిలేనివాడైనను గురుమూర్తిని స్మరించిన వెంటనే పరమభక్తి గలుగవలయును. లోభియైనను, పరమాచార్యుని తలంచిన వెంటనే గొప్ప త్యాగము గలవాడు గావలయును. ఆచార్యుని స్మరించిన మేఘములు దట్టముగా నుండు ఆకాశమైనను ఝంఝామారుతముచే కొట్టబడినప్పు

డేలాగున నిర్మలమగునో, ఆలాగున మలిన బుద్ధి గలవాడైనను నిర్మలుడు గావలయును. సూర్యోదయమున తమస్సు నశించి మంచు విరిసిపోవునట్లు సమస్త శోకములున్ను అజ్ఞానమున్ను లయించి ప్రసన్నత గలుగవలయును. చంద్రోదయమందు చకోరము ఆనందభరితముగ నుండునట్లు శ్రీగురుని జ్ఞాపకము చేయునప్పుడు హృదయములోగల మోహములు నశించి ఆనంద భరిత వర్తనము గలవాడు గావలయును. భాస్కరోదయమున పద్మములు వికసించునట్లు మాయామోహసంకలిత హృదయముచే ఖిన్నుడై యుండినను హృదయము వెంటనే వికసించవలెను. ఎండలో పెట్టిన వెన్నపూస యేలాగున కరుగునో ఆలాగున నెంత కఠినాత్ముడైనను గురువును స్మరించునప్పుడు హృదయము కరుణగలదై నీరై కరుగవలయును. చంద్రోదయమున సముద్రము పొంగునట్లు గురుస్వాములవారిని స్మరించినప్పు డానందము వెల్లువలుగా ప్రవహించవలయును. కారుచిచ్చు రగులుచున్నప్పుడు కుంభవృష్టి గలిగిన నేలాగున చల్లబడిపోవునో ఆలాగున సంసారతాపత్రయాగ్నిచే తపించు హృదయమైనను గురుధ్యానము చేసిన వెంటనే శమించి చల్లని హృదయము గలుగవలయును.

గురుస్వామిని తలంచునప్పుడు ఎంత భీరువుగా నుండినను పంజరమునుండి బయటపడిన సింహమువలె ధైర్యము గలిగి యుండవలెను. గురుపాదము స్మరించునప్పుడు ఇంద్రునివంటి భోగము గలవాడైనను భర్తృహరి వలె త్యాగి కావలెను. గురుభావము హృదయములో గల్గునప్పుడు శుకమహర్షి వంటి నిస్సంగుడు కావలెను. గురుమూర్తిని హృదయములో భావించినప్పుడు సనకాదులవంటి యోగసమాధి గలుగవలెను. నారీమణులైనచో గురుభావమును జ్ఞాపకము చేయునప్పుడు మైత్రేయివలె వైరాగ్యబోధోపరతి గలుగవలయును. సోదరీమణులైనచో గురుమహారాజును ధ్యానించునప్పుడు సులభ వంటి యోగినులు కావలయును. గురుభావము చేయునప్పుడు అబలలైనను గార్గివంటి బ్రహ్మచర్యవ్రతము గల్గి వేదములోగూడ విదుషీరత్నములు గావలయును. ఆలాగున మీరాబాయివంటి భక్తి గురుని జ్ఞాపకము చేయు

నప్పుడు నారీమణులకు గలుగవలయును. అందరున్ను శ్రీ గురుధ్యానము చేయునప్పుడు శ్రీదత్తాత్రేయులవంటి నిస్సంగత్వము, నిర్మలత్వమును గలుగ వలెను. గురువును హృదయమున దలంచునప్పుడు శ్రీరామకృష్ణ పరమహంస వంటి, భక్తిజ్ఞాన వైరాగ్యములున్ను సమత్వమున్ను పురుషులకు గలుగవలెను. స్త్రీలైనచో గురుస్మరణ చేయునప్పుడు శ్రీ శారదాదేవివంటి పతిభక్తియు, పరాత్పరభక్తియు గలుగవలెను.

ఇట్టి సుగుణములన్నియు గురువులయందుండిన మాత్రముననే శిష్యులు అట్టి స్థితికి రాగలుగుదురు. కావున నిదే గురుకీలకమని చెప్పిన రహస్యము. సంసారములో నారీమణులైనచో గురుని స్మరించిన సక్కూబాయి వంటి భక్తి గలుగవలయును. గురుస్మరణ చేసిన నారీమణులు శ్రీతరిగొండ వెంకమాంబవంటి యోగినులుగా మారవలెను.

ఒక ఫోటో తీయు కెమరాలోపల గల యద్దములో ఫోటో తీయబడు వారి ఛాయ యేలాగున ప్రతిఫలించునో, ఆలాగున శిష్యుల హృదయములలో గురువుయొక్క గుణములున్ను, ఆచరణలు మాత్రమే నిలుచును. ఇట్టి సుగుణములు లేనిచో ఎన్ని యోగములుగాని, జ్ఞానములుగాని, విద్యలుగాని, మంత్రములుగాని, మంత్రార్థములుగాని, మంత్రరహస్యములుగాని, అతి గోప్యములుగాని, అత్యంత సారోపదేశములుగాని యుపదేశించినను గురు కీలకము తెలిసినవారు గారు.

అయితే గురువునందు ఇట్టి దైవగుణములు లేనప్పటికిన్ని శిష్యులకు గురువులపై దైవభావము గల్గియుండరాదా? యని కొందఱడుగుదురు. కాని అట్లు గల్గుట దుస్తరము. అట్లు గల్గినవారుండిన వారు ధన్యాత్ములే. సంశ యము లేదు. ఇది పెద్దపులిని జూచి గోవుగా తలంపు గలుగజేయుటకు శక్తి గలవారుండిన వారికి మాత్రమే సాధ్యమగును. ఒకవేళ ఒకానొకనికి గలిగినను అది అందరికిన్ని గలుగుట ప్రయాసము. గోవును గోవుగా తలంచుటకు నెవరి కిన్ని ఎలాటి ప్రయాసముగాని నేలాగుననుండదో అట్లు సుగుణరాశియగు గురువునందు దైవభావమును చేయుటకు నెవరికిన్ని ఏలాటి శ్రమయు

నుండదు. అట్లయిన వైరాగ్యనిధులగు గురువుల శిష్యులు కొందరు వైరాగ్య హీనులైయుండుటకు కారణమేమి? అనిన అది గురువులయొక్క దోషము గాదు. శిష్యులయొక్క మనఃపరిపక్వత సరిగా లేనందుచే గలుగుచుండును. అయితే గురుభావము చక్కగా హృదయములో చేసుకొని కొంతకాలమునకు వారును మంచిస్థితికి రాగలరు.

మరియు వీరికి గురుకార్యములో గురుభావములో భక్తి లేకయుండదు. కాని వారిలోగల లోపమును గురించి వారే వగచుచుందురు. కాని మరియేమియు గాదు. ఒకే జన్మలో నందరున్ను పరిపక్వ దశలోనికి రాజాలరు. కాలక్రమముచేతను, జన్మాంతరములచేతను పరిపక్వజీవులు గావలసియుందురు. ఈ విషయమై గురువులు ఏలాటి విచారమును పడనక్కరలేదు. తమ యొక్క స్థితిలో తాముండిన చాలును. అప్పుడు శిష్యులందరున్ను మంచి స్థితి లోనికి రాగలుగుదురు. ఈ విషయమై వేదాంతపంచదశి తెలిపినది చూడుడు.

**త్రయోఽప్యత్యంతపక్వాశ్చేన్మహతస్తపసః ఫలమ్ ।**
**దురితేన క్వచిత్కించిత్కదాచిత్ప్రతిబధ్యతే ॥**

వైరాగ్యబోధోపరతులు మూడును ఒకపురుషునియందు మిక్కిలి పరిపక్వములై యున్నయెడల అనేక జన్మములయందు సంపాదింపబడిన మహాపుణ్యారాశియొక్కయు, తపస్సుయొక్కయు ఫలమని తెలియవలెను. మరియు ప్రతిబంధక పాపము ననుసరించి ఆ మూటిలో నొకటి యైనను, రెండైనను, ఒకానొక కాలమందు లేకపోవుచున్నవి.

ఇక గీతలో శ్రీకృష్ణభగవాను లుపదేశించినది చూడుడు :-

**ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః ।**
**అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్ ॥**

సంస్కారము ననుసరించి యీ జన్మములో నివృత్తిమార్గమందు అధిక ప్రయత్నము చేయుచున్న బ్రహ్మనిష్ఠుడు పాపమునుండి పరిశుద్ధుడైన

వాడును, అనేకములగు జన్మజన్మములయందు సంపాదింపబడిన పుణ్య సంస్కార వశముచేతను, ఈశ్వరకృపచేతను జ్ఞానవంతుడునై బ్రహ్మమును పొందుచున్నాడు. ఇవి రెండును ప్రబల ప్రమాణము లగుటచే ఇతర ప్రమాణ బాహుళ్యము లవసరము లేదని తలంచి నిలుపడమైనది. గురుకీలకము ఈలాటి రహస్యమగుట చేతనే గురువులు కరుణాళువులై, శాంతాత్ములై, త్యాగాత్ములై, సత్యాత్ములై, జ్ఞానాత్ములై, ధర్మాత్ములై, విజ్ఞానాత్ములై, సహనాత్ములై, బ్రహ్మజ్ఞానముచే పూతాత్ములై, పునీతాత్ములై యుండవలెనని శాస్త్రము చెప్పెడు రహస్యమై యున్నది.

ఇక సూతసంహితలో గురువులు గొప్పవారలై యుండియు శిష్యులకు జ్ఞానము గలుగకపోవుటకు కారణములు చెప్పుచున్న భాగములనుండి కొంచెము ఇచ్చట తెలిపెద.

**మాతృసంరక్షణాభావో మాతృద్రోహశ్చ కేశవ ।**
**మాతృసంతాపకారిత్వం జ్ఞానానుత్పత్తికారణమ్ ॥**

మాతృసంరక్షణ చేయకపోవుటచేతను, మాతృద్రోహము చేయుట చేతను, మాతృసంతాపకరమగు కార్యము చేయుటచేతను జ్ఞానము గలుగకున్నది.

**పితృద్రోహశ్చ శుశ్రూషాఽభావస్తస్య తథైవ చ ।**
**పితృసంతాపకారిత్వం జ్ఞానానుత్పత్తి కారణమ్ ॥**

పితృద్రోహము చేయుటచేతను, పితృసేవ చేయకపోవుటచేతను, పితృ సంతాపకరమగు క్రూరకృత్యము చేయుటచేతను జ్ఞానము కలుగకపోవుచున్నది.

**అభక్ష్యభక్షణే శ్రద్ధా తథాఽభక్ష్యస్య భక్షణమ్ ।**
**అభక్ష్యభక్షకస్పృష్టిః జ్ఞానానుత్పత్తి కారణమ్ ॥**

నీచాహారము తినవలెనని తలంచుటచేతను, నీచాహారము భక్షించుట

చేతను, నీచాహారము భుజించువారితో సంపర్కము చేయుటచేతను జ్ఞానము గలుగక పోవుచున్నది.

**గురోరనిష్టాచరణం గురోరిష్ట వివర్జనమ్ ।**
**గురోశ్చ సేవాఽకరణం జ్ఞానానుత్పత్తి కారణమ్ ॥**

గురువున కనిష్టమగు కార్యము చేయుటచేతను, గురుని కిష్టమైన కార్యము చేయకపోవుటచేతను, గురుసేవయందు విముఖత గల్గియుండుట చేతను జ్ఞానము గలుగకపోవుచున్నది.

**ఆచార్యే బాలబుద్ధిశ్చ నరబుద్ధి స్తథైవ చ ।**
**అనిష్టబుద్ధిర్భూనాథ జ్ఞానానుత్పత్తి కారణమ్ ॥**

గురునియందు చిన్నబుద్ధి గలిగియుండుటచేతను, గురువు సామాన్య మానవుడని తలంచుటచేతను, గురుమూర్తియందు పవిత్రమైన గౌరవబుద్ధి లేకపోవుటచేతను జ్ఞానము గలుగకపోవుచున్నది.

**ఆచార్య నిందాశ్రవణం తద్బాధస్య చ దర్శనమ్ ।**
**వివాదశ్చ తథా తేన జ్ఞానానుత్పత్తి కారణమ్ ॥**

ఇతరులు గురునింద చేయునది విని సంతోషించుటచేతను, ఎవరైన గురువును బాధించుచుండ చూచి ఊరకుండుటచేతను, గురువుతో వివా దము పెట్టుకొనుటచేతను జ్ఞానము గలుగకున్నది.

**ఆచార్యేఽనీశ్వరజ్ఞాన ముపేక్షా చ తథైవ చ ।**
**తదుక్త విస్మృతిశ్చాపి జ్ఞానానుత్పత్తి కారణమ్ ॥**

ఆచార్యునియందు నీశ్వరభావము లేకపోవుటచేతను, గురుకార్యములో ఉపేక్ష గల్గియుండుటచేతను, గురువుచెప్పిన కార్యములు మరచిపోవుటచేతను జ్ఞానము కలుగకున్నది.

ఇవి శ్రీశివకేశవ సంవాదమగు సూతసంహితలోగల వాక్యములు. పరమ శివుండు శ్రీమన్నారాయణమూర్తి కుపదేశించినవి. ఇప్పుడు ఆచరణయే

మనకు కావలసినది. ఈ విషయములో గురువులు జాగ్రత్త వహించిన మాత్ర ముననే బ్రహ్మవిద్య యుద్ధరింపబడును, అనుష్ఠానములేని శుష్కవాక్యము లన్నియు గింజలు లేని వట్టి పొట్టును కృషిచేసే లాగున నుండును. ఎప్పటి నుండి ఆచరణలేని వేదాంత ప్రసంగము అమలులోనికి వచ్చినదో అప్పటి నుండియే జ్ఞానమున్ను, భారతదేశమున్ను పతనమునకు లోనైనవి. ఈ తత్త్వము మతబోధకులు, మతాధిపతులు, మతకర్తలు మరువక యుందురు గాక! అట్లైన వారి కెచ్చోటను విజయమే గల్గుచుండును. మోక్షలక్ష్మి వారిని వరించును. దానితో గూడ విజయలక్ష్మి గూడియుండును.





# ఇంద్రియ నిగ్రహము



ఇంద్రియములు మలినములనియు, శుద్ధములనియు, విశుద్ధము లనియు మూడు తరగతులుగా నున్నవి. మలినావస్థలో నుండునప్పుడవి యెప్పుడును దృశ్యవిషయములతో గూడియుండును. అనగా విషయములే గోరుచుండును. ఈ విషయములు మలినములుగా, దుష్టములుగా నుండును. ఈ అవస్థలో ఇంద్రియములు రజోగుణముతోను, తమోగుణము తోను గూడియుండును. పుణ్యసంస్కారబలముచే శుద్ధములగు నప్పుడవియు ధర్మబద్ధములుగా నుండును. ఇచ్చట నుండియే యింద్రియ నిగ్రహము ప్రారంభమగును.

అప్పుడు కర్ణేంద్రియము మంచిమాటలను, సత్యవాక్యములనుమాత్రమే వినుట కభిలషించును. చెడుమాటలు వినుటనుండి మంచిమాటలలోనికి మరలించుటయే కర్ణేంద్రియ నిగ్రహ మనంబడును. స్పర్శేంద్రియమును దృశ్యవిషయములనుండి మరలించుటయే దానియొక్క నిగ్రహమగును. మృదు, సుగంధ, సుందరములైన వానినుండిగూడ మరలించుకొనవల యును. నేత్రేంద్రియమును చెడు చూపులనుండి మరలించి మంచిభావముతో జూచుటే దానియొక్క నిగ్రహమగును. రసనేంద్రియమును రుచులకు వశము చేయక జ్ఞాననిష్ఠ కనుకూల పదార్థములలోనికి మరలించుటయే దానియొక్క నిగ్రహమగును. ఘ్రాణేంద్రియమును అపవిత్ర వాసనలనుండి మరలించు టయే దాని నిగ్రహమగును. ఇవి యన్నియు జ్ఞానేంద్రియము లనంబడును.

ఆలాగున వాగింద్రియమును. అసత్య, అక్రమ, క్రూరాది వచనముల నుండి మరలించి సత్య, శాంత, ప్రియ, దైవవాక్యములలోనికి చొప్పించి అమితముగ మాట్లాడు స్వభావమునుండి మితముగా మాట్లాడేలాగున చేసి కొనుటే వాగింద్రియనిగ్రహమగును. పాణీంద్రియమును పాపకృత్యమును చేయనీయక పుణ్యకార్యములోను, దానకార్యములోను, దైవకార్యములోను ప్రవేశపెట్టుటే దాని యొక్క నిగ్రహమగును. పాదేంద్రియమును వ్యర్థస్థలముల

లోనికి, నిషిద్ధ స్థలములలోనికి పోనివ్వక ధర్మస్థలములలోనికి పుణ్యస్థలము లోనికి, లోకోపకార స్థలములోనికి పోనిచ్చుటయే దానియొక్క నిగ్రహమగును. ఉపస్థేంద్రియము, దేహసంరక్షణ కనుగుణముగా మూత్రవిసర్జనమునకున్ను కేవలధర్మబద్ధ గృహస్థ నియమిత కార్యములలోను వినియోగపరచుటయు ధర్మవిరుద్ధ కార్యములో ప్రవేశింపనివ్వక చూచుటయు దానియొక్క నిగ్రహ మగును. ఆలాగున పాయ్వింద్రియమునుగూడ దేహసంరక్షణకు తగిన మల విసర్జనమునకు మాత్రము వినియోగపరచి మార్గములలోను, ధర్మస్థలముల లోను మలవిసర్జనము చేయక జూచుటయే దానియొక్క నిగ్రహమగును. ఇవి యైదున్ను కర్మేంద్రియము లనబడును. ఈ నిగ్రహమునకే దమమని పేరు.

ఈలాగున మనస్సు చెడువిషయములను సంకల్పింపక మంచివిషయ ములను, పుణ్యవిషయములను, ధర్మవిషయములను సంకల్పించుటయే దాని యొక్క నిగ్రహమగును. ఆలాగున బుద్ధిని, దుష్టవిషయములను నిర్ణయము చేయనీయక వానినుండి మరలించి సత్య, జ్ఞాన, ధర్మాది విషయము నిర్ణయములో ప్రవేశింపజేయుటే దానినిగ్రహ మగును. ఆలాగున చిత్తమును పాపచింతనము చేయనీయక పుణ్యకార్య, దైవకార్య, విద్యాకార్యములను చింతనముచేయుటయే దానియొక్క నిగ్రహమగును. ఆలాగున అహంకార మును దేహమునకు సంబంధించిన అభిమానులముగాని, ఆంతరగుణము లనుగాని తలంచి అహంకరింపనీయక ధ్యాన, జ్ఞాన, యోగాదులయందు ప్రవేశించేలాగున జేసికొని పరిశుద్ధ జీవునిగురించి అభిమానము గల్గి యుండే లాగున చేసికొనుటే దానియొక్క నిగ్రహమగును. దీనికే అంతరింద్రియ నిగ్రహమనియు, శమమనియు పేర్లు గలవు. ఈలాగున చేయుటే యింద్రియ నిగ్రహమని గ్రహించవలెనుగాని, యింద్రియములను నశింపజేయుట గాదు. కృశింప జేయుటయును గాదు. అది మూఢత్వము లేక మూర్ఖత్వమనియే గ్రహించవలెను.

ఈ సంగతి తెలియక కొందఱు ఇంద్రియములను ధ్వంస మొనర్చు చున్నారు. అది యసుర స్వభావము. పైజెప్పేలాగున అన్ని యింద్రియము

లను శుద్ధములుగా చేసికొనుటయే న్యాయమైన యింద్రియ నిగ్రహమగును. ఇది సత్త్వగుణము గల్గునప్పు డేర్పడును. ఇట్టి యవస్థ గల్గిన ఇంద్రియము లన్నియు శుద్ధములగును. అట్టి తరుణమున శుద్ధదర్పణ మందుగాని, స్వచ్ఛ జల మందుగాని సూర్య ప్రతిబింబము గనుపించునట్లు ఆత్మలో దైవ జ్ఞానము గనుగొనందగును. ఈ స్థితికి వచ్చినవారికి దుఃఖము గలుగదు. ఎల్లప్పుడున్ను ప్రశాంతులై, ప్రసన్నులైన వారికి నిర్మల దైవసుఖమనుభము లోనికి వచ్చును.

ఇదే యింద్రియనిగ్రహ రహస్యము. నిగ్రహమనగా స్వాధీనములో నుంచుట యని యర్థమేగాని ధ్వంసమొనర్చుటయని యర్థము కాదు. ఋషు లందరికిన్ని నేత్రేంద్రియాదులుండలేదా? యోగీశ్వరు లందరికిన్ని కర్ణేంద్రి యము లుండలేదా? అవి లేనిచో శుకబ్రహ్మర్షి యేలాగున శ్రీమద్భాగవతము నుపదేశింప గల్గెను? సనకాది యోగులకు ఘ్రాణాదీంద్రియము లుండలేదా? అట్లు గానిచో వారేలాగున యోగశాస్త్రములను రచింపగల్గిరి? ఆలాగున పతంజలి మహామునికి మానసేంద్రియాదులు లేనిచో నెట్లు యోగదర్శనము, వ్యాకరణ మహాభాష్యమును వ్రాయగల్గెను? అట్లే శ్రీ వ్యాసమహర్షికి బుద్ధ్యాదీం ద్రియములు లేనిచో నేలాగున శారీరక సూత్రముల రచింపగల్గిరి? ఇదేరీతిగా దత్తాత్రేయాది మహనీయులు అవధూతవృత్తిలో నుండియు చిత్తాదీంద్రియ ములు లేనిచో అవధూతగీతాది గ్రంధములను నెట్లు నిర్మింపగల్గిరి? ఇట్లే శ్రీవసిష్ఠ యాజ్ఞవల్క్యాది మహర్షుల చరిత్రములను గ్రహించి కొనవచ్చును.

మరియు వాగింద్రియము లేనిచో మైత్రేయి యేలాగున యాజ్ఞవల్క్యు లతో వేదాంత జ్ఞానమడిగి తెలిసికొనగల్గెను? బృహదారణ్యకోపనిషత్తు ఈ విషయమునే దెలుపుచున్నది. ఇంద్రియములు లేనిచో సులభ యేలాగున జన కునితో బ్రహ్మవిషయమై చర్చ చేయగల్గెను? ఆలాగున గార్గి ఋషిమండలిలో వేదాంత ప్రసంగమున కెట్లుపక్రమించెను? ఛాందోగ్యమున భారతమున నీ విషములు గనుపించుట లేదా? ఇంద్రియములు నశించుటయే మోక్షమని నమ్మిన పక్షమున చూడాల యేలాగున తనభర్తయగు శిఖిధ్వజ మహారాజునకు జ్ఞానమార్గ ముపదేశించుటకు సాధ్యమగును? ఆలాగున నింద్రియ విలయమే

మోక్షమనియు, బ్రహ్మసాక్షాత్కారమనియు, దైవజ్ఞానమనియు చెప్పినచో శ్రీ ఆదిశంకర భగవత్పాదులు ఏలాగున దిగ్విజయము చేయగల్గిరి? సూత్ర భాష్యాది గ్రంథముల నుద్ధరింప గల్గిరి?

అదేరీతిగా నింద్రియములు నీటిలో గలిసిన ఉప్పురీతి భగవంతునిలో లీనమయిపోవుటయే ముక్తి యని చెప్పుటలో శ్రీరామానుజాచార్య శ్రీకృష్ణచైత న్యాదులు ఎట్లు దైవజ్ఞానమును లోకమునకు బోధింపగల్గిరి? శాస్త్రములు వ్రాయగల్గిరి? కుమతస్థులతో వాదింపగల్గిరి? భక్తిమార్గము నుపదేశింప గల్గిరి? అట్లే యేమియు తెలియక స్తంభమువలె నుండుటే మోక్షమైనయెడల శ్రీయేసు క్రీస్తు ఏలాగున ధర్మబోధ చేయగలిగెను. ఇంద్రియములను మరచి యుండ డమే కైవల్యమని చెప్పినచో శ్రీహజరత్ మొహమ్మద్ నబి గారెట్లు శత్రువులను నిరోధించి దైవమతమును ప్రపంచములో స్థాపింపగలిగిరి? అదేరీతిగా జలములో గలిసిన ఐస్‌గడ్డవలె ఆత్మ పరమాత్మలో ఐక్యమొందుటే నిర్వాణ మగు ముక్తియైనచో శ్రీ బుద్ధదేవుడేలాగున తనయొక్క పరమ పావనమగు బౌద్ధధర్మమును లోకములో నుపదేశింపగలిగెను? ఈలాగున నీటిలో కలిసిన చక్కెర రీతిగా బ్రహ్మయమై యుండుటే ముక్తి యని చెప్పినచో శ్రీ గురునానక్ ఏలాగున తనయొక్క పావనమతము బోధింపగల్గెను?

ఈలాగున నితరమతస్థులయొక్కయు, మహర్షులయొక్కయు, యోగులయొక్కయు, పరమభక్తుల యొక్కయు స్థితి గ్రహించికొనవచ్చును. వీరియందరియొక్క మతప్రకారము ఇంద్రియములు శుద్ధములై స్వాధీనములై యుండుటే ఇంద్రియ నిగ్రహమని అర్థమగునుగాని, మఱియొకటి గానేరదు. ఈ తత్త్వమును దెలిసికొనక యోగమార్గము చక్కగ నెరుంగక అధికప్రాణ పీడనపరమగు ప్రాణాయామముచేతను, ముద్రల చేతను, షట్క్రియలచేతను, నిరాహారముచేతను శరీరపీడాపరమగు తపస్సుచేతను, ఇంద్రియములను క్షీణంపజేసికొనిన ఆఖరున ఆ ఇంద్రియములను దైవకార్యములైన చేయుటకు శక్తిలేని స్థితిలోనికి తీసికొనివచ్చుచున్నారు. దీనివల్ల యోగాభ్యాసముగాని, ప్రాణాయామముగాని, వ్రతములుగాని, తపస్సులుగాని, అవసరము లేదని

తలంపరాదు. ఇవన్నియు ఇంద్రియ శుద్ధి, దేహశుద్ధి, మనశ్శుద్ధి గలుగుటకు కారణములని భావింపవలయును. కాని యింద్రియములు మరచి యుండ వలెననిగాని, వాని ధర్మబద్ధములగు వృత్తులుండరాదనిగాని మాత్రము తలంపరాదు.

పాషాణాది వస్తువులు పుటము వేయవలెనన్న వానిలో గల విషము నశించవలెనని యర్థమేగాని వస్తువుగూడ నశింపజేయవలెనను నర్థముగాదు గదా! ఆలాగున మలినపుబంగారమును పుటము వేయుటయని చెప్పునప్పుడు దానియందు గల యశుద్ధ లోహము పోగొట్టవలెననిగాని బంగారమే లేకుండు నట్లు చేయుటయని యర్థము గాదుగదా! ఆలాగున ఏవస్తువునైన శుద్ధిచేయ వలెనని చెప్పునప్పుడు వానిలో గల దోషములు లేకుండ చేయవలెనని యర్థమే గాని వస్తువులను నశింపచేయవలెనను అర్థము లేదుగదా! అట్టి యర్థమే యిచ్చట గూడ గ్రహించవలెను. ఇంద్రియములకు శుద్ధావస్థ గల్గునప్పుడు అంతరింద్రియములున్ను, జ్ఞానేంద్రియములున్ను, కర్మేంద్రియములున్ను పరిశుద్ధములై నిర్విషయత్వము గల్గియుండును.

ఇక చెప్పవలసిన విషయము విశుద్ధతత్త్వమును గురించిన దగును. ఇచ్చటికి వచ్చినప్పుడు మనస్సు వ్యవహార సత్యమునుండియు, వ్యావహారిక ధర్మమునుండియు, విముక్తి గలదై యుండును. అప్పుడు పరమార్థసత్యమును పారమార్థిక ధర్మమునుమాత్రము తెలిసికొనవలసినదను ప్రేరణ యాత్మకు గల్గును. అత్తరి మనస్సు పరబ్రహ్మములోనికి చేరిపోవును. బుద్ధి బ్రహ్మతత్త్వ నిర్ణయములోనికి జరుగుచుండును. చిత్తము బ్రహ్మచింతనములోనికి ప్రవేశించును. అహంకారము సోఽహంకారములోనికి వెళ్ళిపోవును.

శ్రోత్రేంద్రియము బాహ్యశ్రవణములనుండి మరలి ఆంతరశ్రుతి సారము వినుచుండును. త్వగింద్రియము నిశ్చేష్టత గల్గియుండును. నేత్రేం ద్రియము చూచునదంతయు దైవమయముగ జూచుటకు తగిన యవస్థ గల్గి యుండును. జిహ్వేంద్రియము సర్వవిధరసములను విడిచిపెట్టినదై బ్రహ్మ

ధ్యాన రసామృతమునుగాని, భగవద్భక్తి పీయూషమునుగాని పానముచేసి తృప్తి నొందియుండును. ఘ్రాణేంద్రియము ఏ గంధమును గోరక తూష్ణీంభావావస్థను బొందియుండును. ఆలాగున కర్మేంద్రియములలో వాగింద్రియము మౌనమును దాల్చియో, బ్రహ్మవిషయమును మాత్రము స్వల్పముగా భాషించుచునో యుండును. పాణీంద్రియము నిశ్చేష్టత గల్గి యేమియు చేయక అత్యవసరమైన దేహధారణ కార్యమునుమాత్రము చేయును. పాదేంద్రియము తనయొక్క పనిని ముగించి అనివార్య దేహకృత్యమును నిర్వహించుటలోను, దైవతత్త్వమును బోధించుటకు వెళ్ళుటలోను కొంచెము ప్రయత్నము గల్గియుండును. ఉపస్థేంద్రియము ఏవికారము నొందక దేహసంరక్షణకు జల విసర్జనమును మాత్రము చేయుచుండును. పాయ్వింద్రియము శరీరనిర్వహణ కొరకు మలవిసర్జనము మాత్రమే చేయును. ఇదియే విశుద్ధతత్త్వము గల్గు నప్పుడు గల్గెడు నవస్థగా నుండును.

ఇచ్చట జీవన్ముక్తి గల్గియుండును. ప్రత్యగాత్మ స్పష్టముగ గోచరించును. ఇదే ప్రకృతి నశించిన పుణ్యజీవుల లక్షణముగా నుండును. ఇంద్రియములు సుషుప్తి పొందవలెననియు, మృతి నొందవలెననియు శాస్త్రములో చెప్పుటలో నిదే యర్థమని గ్రహించవలెను.

సుషుప్తిలో నింద్రియము లన్నియు గల్గియు నేలాటి వికారము లెట్లు గలుగకయుండునో ఆలాగున జాగ్రదవస్థలో దృశ్యవిషయములలో వికారము పొందకయుండుటే సుషుప్త్యవస్థయనియు, మృతి నొందిన వానికి దృశ్యము తోచనట్లు దైవభావమున కన్యముగా దృశ్యము గలుగక యుండుటే యింద్రియము మృతి నొందవలెనని చెప్పుదాని కర్థముగాని మరియొకటి గాదు. మరియు, నీ విశుద్ధేంద్రియములు పరిపక్వస్థితికి వచ్చు అవస్థలో నింద్రియ నిగ్రహము లేదు. ఏలన? ఆపత్తులనుండి రక్షించుటకొరకు గదా నిగ్రహము కావలసి యుండును? లేక విషయములనుండి వశపరచుటకు గదా నిగ్రహము కావలసివచ్చినది? లేక యింద్రియార్థములనుండి యింద్రియములను స్వాధీనము చేసికొనుటకు గదా నిగ్రహము కావలసివచ్చినది? లేక దృశ్యముల

నుండి యింద్రియములను స్వాధీనములోనికి తెచ్చుకొనుటకు గదా నిగ్రహ మావశ్యకమై యుండును? లేక వశముగాని వానిని వశపరచుకొనుటకు గదా నిగ్రహ మవసరమై వచ్చినది? ఇది ద్వైతజ్ఞానమేగాని ద్వంద్వాతీత జ్ఞానము గాదు. ఇది కర్మజ్ఞానమే గాని నిర్ణయజ్ఞానము గాదు. ఇది ధర్మజ్ఞానమేగాని ధర్మియొక్క జ్ఞానము గాదు. ఇది ప్రపంచ జ్ఞానమేగాని దైవజ్ఞానము గాదు.

అచ్చట ఏకైకరసమగు సద్వస్తు వొక్కటి మాత్రమే గలదు. అచ్చట దృశ్యమున్ను, దృక్కున్ను ఒకటిగానే యుండును. అచ్చట ధ్యానమున్ను ధ్యేయమున్ను ఏకమయ్యే యుండును. అచ్చట రాగము లేనందున విరాగమున్ను లేదు. అచట నపేక్ష లేందున నుపేక్షయును లేదు. అచ్చట నజ్ఞానము లేనందున జ్ఞానమున్ను లేదు. వియోగము లేనందున యోగమున్ను లేదు. అచ్చట నశుద్ధము లేనందున శుద్ధమున్ను లేదు. అచ్చట నసత్యము లేనందున సత్యము మాత్రమే యుండును. దృశ్యము లేనందుచే దృక్కు మాత్రమేగలదు. అచ్చట పాపము లేనందున పుణ్యము మాత్రమేగలదు. అచ్చట ధ్యాత లేనందున ధ్యేయము మాత్రమేగలదు. అచ్చట ప్రపంచము లేనందున దైవము మాత్రమే యుండును. అచ్చట ద్వైతము లేనందున నద్వైతము మాత్రమే యుండును. అచ్చట కర్మము లేనందున ధర్మము మాత్రమే యుండును. అచ్చట అన్యుడు లేనందున తాను మాత్రమే యుండును. అచ్చట నుండునది సత్, అచట నుండునది చిత్. అచ్చట నుంటున్నది పరమానందము. బ్రహ్మానందము, ఇవియే విశుద్ధేంద్రియములు గల్గినప్పుడు గల లక్షణములు. ఈ యవస్థయే పరిపూర్ణావస్థ యగును.

ఇచ్చటనే జీవునియొక్క దైవప్రాప్తి. ఇదే జీవులచే పొందదగిన గమ్యస్థానము, అచ్చట మాత్రమే నిలకడ గల్గును. అంతవరకు ఉన్నతోన్నత పదవులను, ఉన్నతోన్నత జన్మములను, ఉన్నతోన్నత లోకములను నీ జీవులు పొందియే తీరవలయును. బహుయోజన దూరమునుండి అనేకదినములుగా వచ్చుచుండు నదులు సముద్రమును జేరునప్పుడెట్లుండునో అచ్చట అట్లే యుండును. వేలకొలది మైళ్ళదూరమునుండి రాత్రింబగళ్ళు విశ్రాంతి లేక

వచ్చుచుండు రైలుబండ్లు గమ్యమైన స్టేషనుకు వచ్చి ఏలాగున నిలిచిపోవునో ఆలాగున జీవకోట్ల ప్రయాణశ్రమ లన్నియు అచ్చట శమించిపోయి నిలకడ గల్గును. వేలకొలది మైళ్ళదూరమునుండి నిలకడ లేక సముద్రములో ప్రయాణము చేసికొని వచ్చుచుండు పొగయోడ లన్నియు రేవులలో వచ్చి నిలిచి విశ్రాంతి నొందునట్లు సంసారసాగరములో తల్లడిల్లి యనేకజన్మములనుండి వచ్చుచుండు జీవకోట్లన్నియు నచ్చట విశ్రాంతి నొందును, అందాక వెళ్ళును.

**యథా నద్య స్స్యందమానాః సము**
**ద్రేఽ స్తంగచ్ఛన్తి నామ రూపే విహాయ ।**
**తథా విద్వాన్నామ రూపాద్విముక్తః**
**పరాత్పరం పురుషముపైతి దివ్యమ్ ॥**

ఏలాగున నదీనదములన్నియు ప్రవహించుచు, నామరూపములను విడిచి మహాసముద్రములో ఐక్యమగుచుండునో, ఆలాగున బ్రహ్మజ్ఞానియు నామరూపములనుండి విముక్తుడై, పరాత్పరుడగు పరమపురుషుని (పరమాత్మను) బొందుచున్నాడు.

**దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం హి యథా మలాః ।**
**తథేంద్రియాణాం దహ్యంతే దోషాః ప్రాణస్య నిగ్రహాత్ ॥**

ఏలాగున ధాతువులు స్ఫుటముచేయునప్పుడు వానియొక్క మాలిన్యములు నశించి శుద్ధములగునో ఆలాగున ప్రాణాయామ యోగ ధారణ, జప, వ్రత, తపశ్చర్యాదులచే నింద్రియములయొక్క దోషములు నశించి శుద్ధములగును. అప్పుడే యీ జీవులు దైవకృపకు పాత్రులై కైవల్య పదవిని పొందగల్గుదురు.





# జ్ఞానము గలుగకపోవుటకు కారణములు

1. యోగులని చెప్పుట, భోగము వదలక యుండుట.
2. సన్న్యాసులని చెప్పుట, అన్యాయ ప్రవర్తన గల్గియుండుట.
3. తపస్వులని చెప్పుట, తమస్సులోనే యుండుట.
4. ముముక్షువులని చెప్పుట, బుభుక్షువులై తిరుగుట.
5. భక్తులని చెప్పుట, భుక్తిప్రియులై యుండుట.
6. సాధులని చెప్పుట, సాధనలు చేయక పోవుట.
7. ఆశ్రమవాసులని చెప్పుట, విశ్రాంతి గలుగజేసికొనకుండుట.
8. విరాగులని చెప్పుట, రాగపరవశులై యుండుట.
9. సోఽహంపరులని చెప్పుట, సోమరులై తిరుగుట.
10. మంత్రనిష్ఠులని చెప్పుట, తంత్రపరులై యుండుట.
11. సోఽహంపరులని చెప్పుట, అహంకారపరులై యుండుట.
12. రాజయోగులని చెప్పుట, రాగరోగులై వర్తించుట.
13. తీర్థపరులని చెప్పుట, ధూర్తగుణము గల్గి వర్తించుట.
14. బ్రహ్మిష్ఠులని చెప్పుట, కర్మిష్ఠులై నడచుట.
15. బ్రహ్మచారి యని చెప్పుట, దురాచార ప్రవృత్తిలో నుండుట.
16. నిష్కామి యని చెప్పుట, కామపరవశుడై తిరుగుట.
17. నిష్ఠగలవాడని చెప్పుట, కష్టములను సహింపలేకుండుట.
18. అచలుడని చెప్పుట, చపలత విడువకుండ నుండుట.
19. పురుషుడని చెప్పుట, పౌరుషము లేకుండ నుండుట.
20. సోఽహంపరుడని చెప్పుట, మోసపు వర్తనము గల్గి వర్తించుట.
21. నిర్గుణియని చెప్పుట, దుర్గుణము గలిగి యుండుట.
22. అమనస్కుడని చెప్పుట, మనోనిగ్రహము గలుగక యుండుట.
23. పరమహంస యని చెప్పుట, పరహింసచే జీవించుట.

24. ధ్యానయోగియని చెప్పుట, కాని పనులు చేయుట.
25. సంయమి యని చెప్పుట, నియమనిష్ఠలు లేకయుండుట.
26. విదేహి యని చెప్పుట, దేహభావము గల్గియుండుట.
27. మఠములో నుండువాడని చెప్పుట, ఘటగుణము గల్గియుండుట.
28. సిద్ధుడని చెప్పుట, శుద్ధిలేక వర్తించుట.
29. శాస్త్రి యని చెప్పుట, విశ్రాంతి యెరుంగక యుండుట.
30. నిర్వికల్పుడని చెప్పుట, వికల్పము గల్గియుండుట.
31. పావనుడని చెప్పుట, పవిత్రుడు గాక వర్తించుట.
32. త్యాగి యని చెప్పుట, యోగసాధనలను జేయకపోవుట.
33. యోగి యని చెప్పుట, వియోగము గల్గియుండుట.
34. ముద్రభావి యని చెప్పుట, భద్రముగ నిలువక పోవుట.
35. లక్ష్యము గలవాడని చెప్పుట, లక్షణము లేకపోవుట.
36. అక్షినిష్ఠ గలవాడని చెప్పుట, కుక్షింభరుడై యుండుట.
37. మతకర్త యని చెప్పుట, మతవర్తనము గల్గియుండుట.
38. హంసయోగులని చెప్పుట, సంశయనివృత్తి గలుగక యుండుట.
39. పరమార్థులని చెప్పుట, పార్థివగుణము గలిగి వర్తించుట.
40. ప్రాణాయామి యని చెప్పుట, ప్రణయవేదన గల్గియుండుట.
41. ఏకాంతులని చెప్పుట, అనేక గుణములు గల్గి వర్తించుట.
42. పరోపకారులని చెప్పుట, పరమ కరుణ లేక వర్తించుట.
43. లోకసేవకులని చెప్పుట, కాలము నెరుంగక వర్తించుట.
44. నిస్సంగులని చెప్పుట, సత్సంగము చేయక పోవుట.
46. హఠయోగులని చెప్పుట, శఠుల వృత్తి కలిగియుండుట.
47. తారక మంత్రము జపించుట, కరుణ గలుగక యుండుట.

48. హంస మంత్రము జపించుట, సంసారము విడువ నొల్లకుండుట.
49. హెచ్చు గౌరవము గావలయునని కోరుట,
తుచ్ఛగుణములు గల్గి వర్తించుట.
50. పంచీకరణము నేర్చియుండుట, వంచకపు పని మానకుండుట.
51. సన్న్యాసము గావలెనని కోరుట, పన్నాగములను విడువకుండుట.
52. మంచి సౌఖ్యము గలుగవలెనని గోరుట,
కొంచమైన పని చేయకుండుట.
53. పరులు తనకుపకారము చేయవలెనని తలంచుట,
పరుల కుపకారము చేయకపోవుట.
54. తారకయోగి యని తలంచుట, కారణగురుని భజింపకపోవుట.
55. అందరును తనకివ్వవలెనని కోరుట,
కొందరికైన తానివ్వకుండజూచుట.
56. విచారణ మాత్రము చేయుచుండుట,
ఆచరణ మాత్రము లేకుండుట.
57. శిష్టుడు గావలెనని తలంచుట, నిష్ఠ ఏమియు చేయకపోవుట.
58. ప్రాప్తి లేదని చెప్పుట, ప్రార్థన చేయనొల్లకుండుట.
59. భవరోగ నివృత్తి కోరుట, భగవత్స్మరణ చేయకుండుట.
60. భావాతీతము గలుగవలెనని కోరుట,
భవరోగులతో సదా కలసియుండుట.
61. తాపసులమని చెప్పుట, తామసవృత్తి గలిగియుండుట.
62. శిష్టులమని తలంచుట, దుష్టగుణము గల్గియుండుట.
63. గురువులమని చెప్పుట, గురుతులో నిలకడ లేకపోవుట.
64. వేదాంతులమని చెప్పుట, మదాంధులై యుండుట.
65. హంసయోగులమని చెప్పుట, మాంసభక్షణము గల్గియుండుట.

66. పరమ హంసలమని చెప్పుట,
పరమాత్మలో నిలకడ కలుగక యుండుట.
67. సంచార యోగులమని చెప్పుట, గంజాయి పరులై యుండుట.
68. నిర్వృత్తి గలుగకోరుట, వ్రతనిష్ఠలు గలుగకయుండుట.
69. అతీతమార్గులమని చెప్పుట, మతినతిక్రమింపజాలక యుండుట.
70. ప్రణవోపాసకులమని చెప్పుట,
ప్రాణికోట్లలో కరుణలేక యుండుట.
71. నిర్వాణులమని చెప్పుట, నిర్వాణము పొందక యుండుట.
72. ఆసన పరులై యుండుట,
మానసము నిర్మలముగ నుండక పోవుట.
73. సారాసార విచారము చేయుట,
సారాయి పానము మాత్రము మానకుండుట.
74. పీఠాధిపతులమని చెప్పుట, పాడుగుణములు గల్గియుండుట.
75. సమాధి నిష్ఠులమని చెప్పుట, శమాది గుణములు లేకపోవుట.
76. దిగంబరులమని చెప్పుట,
త్వగంబరునిలో నైక్యము చెందక యుండుట.
77. పరమ యోగులమని చెప్పుట,
పరుల నడిగి తినమరిగి యుండుట.
78. సద్వంశీయులమని చెప్పుట, అసద్విషయములు గల్గియుండుట.
79. నిరతిశయానందము గలుగ గోరుట,
నిరంతరమును ధ్యానముచేయక పోవుట.
80. అంతర్దృష్టి గలవారివలె నటించుట,
అంతరాత్మలో నిలకడ గలుగకపోవుట.
81. సంధ్యవార్చుకొను చుండుట, సంధి తెలిసికొనక యుండుట.

82. కృతార్థు లగుటకు తలంచుట, కృతకృత్యులు గాకపోవుట.

83. గమ్యము చేరవలెనని తలంచుట,
గమనము చేయనొల్లక యుండుట.

84. ఈశ్వరకృప గలుగవలెనని కోరుట,
ఐశ్వర్యములో గల కోరిక విడువకుండుట.

85. సర్వేశ్వరునిలో ఐక్యము గలుగగోరుట,
సర్వమున్ను విడువనొల్లక యుండుట.

86. సమాధిస్థితి గలుగ లేదని కలత నొందుట,
సమయమంతయు నిష్ఠలో గడుపక పోవుట.

87. స్మరణ మాత్రము గల్గియుండుట,
కరుణ మాత్రము గలుగక యుండుట.

88. భక్తిమాత్రము గల్గియుండుట,
విరక్తి మాత్రము గలుగక పోవుట.

89. సదా సమాధిలో నుండగోరుట,
సతతము ధ్యానములో నిలువక పోవుట.

90. విద్వాంసుడని తలంచి మొఱగుట,
అవిద్యలో పడి ముఱిగి పోవుట.

91. గ్రంధములను మాత్రము జదువుట,
గ్రంథులను రహిత మొనర్చక పోవుట,

92. విదేహ కైవల్యమును కోరుట,
సదేహ విలాసమును మరువక యుండుట.

93. అంతర్యామిలో నిలకడ గలుగగోరుట,
అంతరంగశుద్ధి గలుగచేసికొన కుండుట.

94. దైవాకారములో నిలకడ గలుగకోరుట,
దయ్యపు ఆకార గుణముల విడువక పోవుట.

95. గురువులు గాగోరుట, దుర్గుణములు చాల గల్గియుండుట.
96. తురీయాశ్రమస్థులమని యుచ్చరించుట,
మరిగిన దృశ్యములో పడి మునిగి పోవుట.
97. వేషములు చాల వేయుట, విషయములు రహితము గాకపోవుట.
98. వేదములు చాల జదువుట, ఆదిమూలమును గనుగొనక పోవుట.
99. బంధముక్తి గలుగ కోరుట,
ద్వంద్వముల కడత్రోవ జాలకుండుట.
100. శంకర వేషధారులై దిరుగుట, భంగులు త్రాగి మునిగిపోవుట.
101. క్రతువులు చాలచేయుట, వ్రతనిష్ఠలు లేక పోవుట.
102. సంస్కృతము మాత్రము చదువుట,
సంస్కార మాత్మకు గలుగక యుండుట.
103. అపథ్యము మాత్రము తెలిసికొని యుండుట,
పథ్యము తెలిసికొనక పోవుట.
104. తాను తరించవలెనని తలంచుట,
అన్యుల తరింపజేయ దలంపక పోవుట.
105. సర్వేశ్వరకరుణకై కన్నీరు గార్చుట, సర్వప్రాణులపై కరుణ
గలిగి మనస్సు కరిగి కన్నీరుగార్చక పోవుట.
106. దృక్కులో రమింపగోరుట, దృశ్యము రహితము చేయకపోవుట.
107. ఈశ్వరజ్ఞానము గలుగ కోరుటయు,
యీశ, జీవ, జగత్తులు ఏకమను జ్ఞానము గలుగక పోవుటయు.
108. జ్ఞేయములో నిలకడ గలుగ గోరుట, మాయలేని జ్ఞాతృ జ్ఞాన
జ్ఞేయము లేక మను స్థితి గలుగక పోవుట.

ఓమ్ తత్ సత్.



# జ్ఞానాటంకము

ఆత్మజ్ఞానమునకు దేహమాటంకముగా నున్నది. ఆత్మజ్ఞానమునకే గాక పుణ్యమునకున్ను, విద్యకును గూడ ఇది అడ్డు తగులుచున్నది. దీనిని తొలగించిన మీకు ముఖ్యమైన ప్రతిబంధము తొలగును. ఇట్టి అడ్డు తగులు చున్న దానినే దేహాభిమానమని విజ్ఞులు చెప్పినను అది సరిగా గోచరము గాదు. దేహాభిమానము అనుపదముయొక్క అర్థము చాలా లోతునకు దిగి చూచిన మాత్రమే యధార్థముగా గనుగొననగును. దేహాభిమానము తొలగునని తలంచి కొందరు సన్న్యసింతురు. కొందరు భోగములను తగ్గించెదరు. కొందరు వైరాగ్యమును బూనుదురు. మరికొందరు ఏకాంత ప్రదేశము నాశ్ర యింతురు. అయితే ఇవియన్నియు కొంతవరకు దేహాభిమానమును తొల గించవచ్చునుగాని దీనివలన మిాజ్ఞాన దీపమునకు అడ్డుగానుండు గోడ తొలగి పోదు.

పైన వివరించిన వానిలో కొన్ని యుపయోగము కర్థములేగాని, సన్న్య సించువారిలో కొందరకు అభిమానము మరింత పెరుగుచునేయుండును. ఇది వారు తెలిసికొన జాలకనే యున్నారు. సన్న్యసించిన కారణముచేత తనకంటె నెన్నియో రెట్లు సుగుణములున్ను, జ్ఞానమున్ను, యోగ్యతయున్ను గలవారు గృహస్థాశ్రమములోనుండినను తానే శ్రేష్ఠుడనియు, అందరున్ను తననే పూజింపవలెననియు తలంచుచుందురు. అంతటితో పూర్తిగాక వారంద రున్ను, బద్ధులనియు, నికృష్టస్థితిలో నుండు వారనిగూడ తలంచువారు గలరు. జ్ఞానజ్యోతికి దేహమను గోడ అడ్డుగానున్నదని తలంచి దానిని పడ గొట్టదలంచినను, అది ఈ పృధివీ సంబంధపు గోడవంటిది గాదు. ఏలన? ఎట్టి దృఢమైన రాతిగోడయైనను ఒక్కసారి తొలగించిన మరల నుత్పత్తి గాదు. ఇది అటువంటిది గాదు. ఒకసారి తీవ్ర వైరాగ్య మవలంబించి ధ్వంస మొనర్చి నను మరల మరల నిమిష నిమిషమునకు ఆవిర్భవించుచునే యుండును. ఆవిర్భ వించునని చెప్పిన జాలదు. అభివృద్ధిని పొందుచుండుననియే చెప్ప వలయును. ఇది ఇంద్రజాలకారుని సృష్టివలె నుద్భవించుచుండును. ఇది యేలాగున అడ్డు తగులుచున్నదో చాల జాగ్రత్తతో యోచించిన కనుపించును.

సాధారణముగా ఇది యెల్లప్పుడున్ను, ఆత్మ సుఖమునకు (జ్ఞాన సుఖమునకు) ప్రయత్నము చేయనీయక తనయొక్క (దేహము యొక్క) సుఖమునకు మానవులను వెనుకకు లాగుచుండును. అనగా నెల్లప్పుడున్ను దేహసౌఖ్యమునకే మనుజులను మరలించుచుండును. ముందుకు ఒక అడుగైన సాగనివ్వదు. అనగా నేలాటి శ్రమను చేయనివ్వదు. మంచికార్యము చేయుట కొరకు ఎండలోనికి రానివ్వదు. వర్షమును సహింపదు. మంచు నోర్వదు. వీని యన్నిటికి మనుజుడు భయపడి యుండిన సత్కర్మలు ఏలాగున చేయుటకు సాధ్యమగును? వ్రతము లెట్లు సలుపును? లేక అగాధనిష్ఠలో పోదలంచినను పోనీయక అడ్డు తగులుచుండును. ఈశ్వరప్రాప్తికొరకు కఠిన సాధనలు చేయుటకుగాని, ప్రాణాయామాది యోగముల ననుష్ఠించుటకుగాని ముందుకు పోనీయక శత్రువువలె నడ్డుపడుచుండును. ఈలాగున భయపడి యుండిన మానవుండు ఏలాగున మంచిస్థితికి రాగలుగును. పోనీ, శరీర మదములను తగ్గించి తనకు (ఆత్మకు) స్వాధీనపడియుండుట కొఱకైన దుష్ట రసములను త్యజించి సాత్త్వికాహారమును భుజింపజూచినను, ఆయ్యో పాపము! అదియున్ను ఒప్పునది లేదు.

ఇక దేహాభిమాన మను కోటలోపలనుండి యేలాగున మనుజుడు బయట పడగలడు? స్కాంతము ఏలాగున ఇనుమును లాగుకొనుచుండునో దేహమాలాగున నెల్లప్పుడును ఆత్మాభివృద్ధికి దేహిని పోనీయక తనయొక్క సుఖమునకు ఆకర్షించుచుండును. ఇది కొంచెము మనోనిర్మలతయు, సూక్ష్మ బుద్ధియున్ను గలవారికిన్ని గోచరము గాగలదు. కావున ముముక్షువులు, జిజ్ఞాసులు దేహముయొక్క యీదుశ్చేష్టలను కనిపెట్టి యీ పిశాచమునుండి విముక్తి గలుగచేసికొనవలయును. కనుకనే అష్టావక్రగీతయందు జనకుని కొరకు ఇట్లుపదేశించినది.

**దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక! ।**
**బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్య సుఖీభవ ॥**

ఓ నాయనా! దేహాభిమానమనెడు పాశముచే చిరకాలమునుండి

అజ్ఞానములో కట్టుబడియున్నావు. ఇప్పుడు ఆత్మబోధమనెడు సుతీక్ష్ణమైన ఖడ్గముచే అట్టి పాశబంధమును ఛేదించి సుఖివగుము.

దేహాభిమానమనెడు నీ యాకర్షణ శక్తి సామాన్యము గాదు సుమీ! భూమి యేలాగున సమస్తవస్తువులను సదా కాలము ఆకర్షించు స్వభావము గలదియై యున్నదో, ఆలాగున దేహము తనయొక్క సౌఖ్యము కొరకు నెల్లప్పుడున్ను మానసేంద్రియముల ద్వారా సర్వసుఖములను తనలోనికి లాగుకొనుచుండును. ఇది స్థూలదేహముయొక్క స్వభావము. ఇది మొదటిదైనదేగాక ముఖ్యమైనదని గూడ గ్రహించుకొనవలయును. దీనియందు ఎక్కువ భాగము తమోగుణముతో గూడియుండును. ఏదోయొక విధమగు వైరాగ్యము నవలంబించియో, జిజ్ఞాస గలిగియో, శాస్త్రశ్రవణము చేసియో, లేక మహాపురుషుల భావము హృదయములోనికి తెచ్చుకొనియో, లేక అవియన్నియు ఆత్మప్రతి బంధములను జ్ఞానము గలిగియో, లేక వీనివలన మనము ఈశ్వరసన్నిధిలోనికి చేరక యున్నామని తలంచి భక్తివైరాగ్యములు గలిగియో, కొంతవరకు దూరముగా బలాత్కారముగా నెట్టి తొలగించినను, వెంటనే మరల నీటిపై యుండు నాచును (పాచిని) తొలగించిన అది మరల వెంటనే వచ్చి జలమును మూసివేయులాగున దేహములోనికి వచ్చి చేరుకొని ఆత్మను మరుగుపరచి మామూలు ప్రకారము తన దేహసుఖమునే కోరుచుండును.

ఒకవేళ ప్రౌఢవైరాగ్యము నాశ్రయించి ఎవరేమి చెప్పినను మనయొక్క మనస్సు నిర్మలముగా నుండిన చాలునని దృఢపరచి యీదేహేంద్రియముల బారినుండి తప్పించుకొనదలచినను, మరల వెంటనే మాంత్రికుని సహాయముచే కొన్ని దుష్టగ్రహములు తొలగిపోయినను సమయమును నిరీక్షించి యుండి దేహములోనికి వచ్చి ప్రవేశించి యాడించినట్లు ఈ దేహాభిమాన పిశాచము మానవులపై నధికారము వహించి వారిని లోబరచుకొని నర్తనము చేయుచుండును. ఓహెూ! దీనియొక్క విచిత్రమేమని చెప్పవచ్చును! దీనియొక్క ఇంద్రజాలములో నెందరో భక్తులు, యోగులు, జ్ఞానులు, తపోవంతులు మొదలగు పుణ్యజీవులనుగూడ ఫడవేసుకొనుచున్నదే? దీనియొక్క

మోసమునకు వశపడిపోయినచో వలలో చిక్కుకొనిన చేపయొక్క గతియే మనుజునికి గలుగును. ఓహో! యెందరో పరిశుద్ధ జీవులనుగూడ నీ పెను భూతము తనయొక్క కడుపులో పెట్టుకొనుచున్నది. దీనియొక్క మహిమనేమని చెప్పవచ్చును !

**ముక్తిం దదాతి వైరాగ్యం రాగో యచ్ఛతి బంధతామ్ ।**
**మతం వై సర్వశాస్త్రాణాం యథేచ్ఛసి తథా కురు ॥**

దేహేంద్రియాది సంఘాతములో గల విరక్తి యొక్కటియే ముక్తిని గలుగచేయును. శారీరేంద్రియాది సమూహములలో గల సుఖము ఆత్మను సంసారములో బంధించును. ఇది సమస్త శాస్త్రములయొక్కయు, సమస్త మహర్షులయొక్కయు సిద్ధాంతమని గ్రహింపుము. ఈ రెండింటిలోను చక్కగ యోచించుకొని మీ యిష్టమేలాగో యాలాగున చేయుడు.

**మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః ।**
**ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు ॥**

సమస్తవిషయ వాసనలనుండి విడుదల పొందుట యేది గలదో అదియే మోక్షమని గ్రహింపుము. విషయవాసనలో తగులుకొని యుండుటయే సంసార బంధమని తెలిసికొనుము. ఇదే సమస్త శాస్త్రములచేతను, సర్వమహాత్ముల చేతను, నీయొక్క నిర్మలబుద్ధిచేతను తెలిసికొనదగిన జ్ఞానమని మరువకుము. తరువాత నీ యిష్టమేలాగో యాలాగున చేసికొనుము అని అష్టావక్ర మునీంద్రుడు జనకునికొర కుపదేశించెను.

**యథాఽయం కమఠోఽంగాని సంకోచయతి సర్వతః ।**
**విషయేభ్య స్తథా ఖాని సంకుచేద్యోగతత్పరః ॥**

కూర్మమేలాగున కరచరణాది సర్వేంద్రియములను లోనికి ముడుచుకొనునో యాలాగున ఏ ధ్యానయోగి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయములనుండి ఇంద్రియములను ఆత్మలో నిమిడించుకొనునో అట్టి సంయమి (జ్ఞాని) మాత్రమే ప్రకృతినుండి విముక్తి నొందగల్గును అని గణేశగీత. పైజెప్పిన

దేహసుఖబుద్ధి యేది గలదో అదిమిక్కిలి తమోగుణ స్వరూపముతో గూడినది. దీనినే స్థూలప్రతిబంధమని గ్రహించవలయును. ఈ విషయమై శ్రీకృష్ణ భగవానుడు గీత మూడవ అధ్యాయమున చెప్పినది చూడుడు.

**ఇంద్రియస్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ ।**
**తయోర్న వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥**

ఇంద్రియమునకు ఇంద్రియార్థ విషయములలో ప్రవేశించిన రాగ ద్వేషములు గలుగుచుండును. కావున దానికి వశపడకుండ చూచుచుండవలెను. అనగా దానిని వెంబడింపవలదు. అట్టి రాగద్వేషములే మీయొక్క యాత్మ జ్ఞానమునకు గొప్ప శత్రువులనియు తెలిసికొనవలెను. అయితే ఇట్టి బంధములనుండి విముక్తి గలుగుటకు మార్గమొకటి గలదు. అదేమన నీ దేహముయొక్క ఆద్యంతములను విచారించిన చాలును. అప్పుడు శరీరమునఆవేశించి నాట్యము చేయుచుండు అభిమానము మంచి మంత్రవేత్తను చూచిన వెంటనే పిశాచము ఆగిపోవునట్లు శమించిపోవును. లేక దొంగలు ఏలాగున సాయుధులగు పోలీసుభటులను చూచిన పారిపోవుదురో, ఆలాగున ఈ దేహముయొక్క పూర్వోత్తరస్థితిగతులను తెలిసికొనిన మరల మటుమాయమై పోవును. కనుకనే ఆత్మానాత్మ విచారణమవశ్యముగా చేయవలెనని శ్రుతి తెలుపుచున్నది.

ఈ దేహముయొక్క పుట్టుకను విస్తరించి చెప్పవలసియుండిన కాల విలంబనమగును.అది దేహోత్పత్తిని గురించిగాని, పంచీకరణిని గురించిగాని, ఘటశోధకమును గురించిగాని చెప్పిన భాగములో గ్రహించుకొనవచ్చును. కావున సంగ్రహముగా తెలిపెద. ఈ దేహనిర్మాణము అతిహేయములగు స్త్రీ పురుషుల శుక్లశోణితములచే నేర్పడినది. పదిమాసములవరకు మల మూత్రములకు స్థానమగు గర్భములో కేవలము రక్తములోనుండి జఠరాగ్ని వలన క్రాగుచుండినది. అత్తరి తన స్నేహితులు అసంఖ్యాకములగు క్రిమికీటకాదులు. అది విచారించిన మలమూత్రములకు నేర్పడిన మరుగుదొడ్డి

వంటిదే యగును. అట్టి మరుగుదొడ్డిని గూడ దీనికి సదృశముగా చెప్పరాదు. ఏలన మరుగుదొడ్డిని శుద్ధపరచిన మరల దుర్వాసన యుండదు. ఇదో యెంత శుద్ధపరచినను, తనయొక్క నైజగుణమగు మాలిన్యము శమింపదు. కనుకనే శాస్త్రమీలాగున చెప్పినది.

**ధాతుబద్ధం మహారోగం పాపమందిరమధ్రువమ్ ।**
**వికారాకార విస్తీర్ణం స్పృష్ట్వా స్నానం విధీయతే ॥**

అస్థి, మాంస, మజ్జ, మేధస్సు మొదలగు సప్తధాతువులచే నిర్మిత మున్ను, అనేక రోగములకు నిలయమున్ను, పాపమందిరమున్ను, వికారము లగు ఆకారములతో విస్తరింపబడినదియునగు నీ దేహమున అభిమానము గలిగిన స్నానము చేయదగినది.

**నవద్వారమలస్రావం సదాకాలే స్వభావజమ్ ।**
**దుర్గంధం దుర్మలోపేతం స్పృష్ట్వా స్నానం విధీయతే ॥**

నిరంతరము తొమ్మిది ద్వారములద్వారా మలమును వెడలజేయునదియు, నైజముగ దుర్మలముతో గూడినదియు, దుర్వాసనలకు ఆటపట్టయిన దియు నగు ఈ దేహమున అభిమానము గలిగిన స్నానమాచరింప దగినది.

**జాతం మృత మిదం దేహం మాతాపితృమలాత్మకమ్ ।**
**సుఖదుఃఖాలయామేధ్యం స్పృష్ట్వా స్నానం విధీయతే ॥**

మరియు ఈ దేహమెటువంటి దనగా తల్లిదండ్రుల శుక్లశోణితము లగు మాలిన్యములచే నేర్పడినదిన్ని, పుట్టుట, చచ్చుటయను స్వభావము గలిగినదియు, సుఖదుఃఖములకు హేతువైనదియు, అమేధ్యముచే నిండి నదియు, చాలరోజులనుండి చెడిన మలములో నుండుటచే దుర్వాసన గలది యునగు ఈ దేహమున నభిమానము గలిగిన స్నానమాచరింపవలయును.

**మాతృసూతక సంబంధం సూతకే సహజాయతే ।**
**మృతసూతకజం దేహం స్పృష్ట్వా స్నానం విధీయతే ॥**

మఱియు ఈ దేహ మేలాగున నున్నదనగా మూడు సూతకములతో గూడినది. ఒక్క సూతకముండిన మాత్రముచే అట్టి వారిని స్పృశించుటగాని, వారితో భోజనాది కార్యముల చేయుటయుగాని లేదు. ఈ దేహమో, స్త్రీలకు ఋతుకాలమున నేర్పడిన దగుటచే రజస్వలా దోషమున్ను, ప్రసవించు కాలమున నేర్పడు అశౌచముండుటచే ద్వితీయమున్ను, మరణించు స్వభావ మగుటచే మృతసూతకమున్ను గలిగి యున్నది. అనగా గర్భోత్పత్తి యైనప్పుడు గల సూతక మొకటి, ప్రసవించినపుడు గల సూతకము రెండు, మృతి నొందినపుడు గల సూతకము మూడు. అనగా అది మధ్యాంతములుగూడ సూతకముతో గూడినదిన్ని, అగ్నిలో దహించి పోవునదగుటచే దేహమను పేరు గలిగినదియు, మట్టిలో జీర్ణమై పోవుటచే శరీరమను నామధేయము గలిగినది యునగు ఈ దేహమున నభిమానము గలిగిన స్నాన మాచరింపదగినది అని మైత్రేయ్యుపనిషత్.

విషయాసక్తులగు పామరజనులకు స్త్రీపురుషాది దేహములలో గల భ్రాంతి తొలగుటకొరకు నీలాగున చెప్పబడినది. ఒకపాత్రయొక్క లోభాగము నుండి బయలుపడు పదార్థమును జూచిన దానియందుగల వస్తువు గోచరము గాగలదు. మాయ యను దేహము దీనిని కప్పిపెట్టి యున్నది. చూడుడు! మనుష్యులకు నోరుగదా గొప్పదని తలంచుచున్నారు. దానినుండి బయలుపడు నెంగిలి (ఉమ్మి నీరు) ఒక్కరిపై బడినచో అతడెంత యసహ్య పడును. ఎంగిలి తగిలిన నెంతమంచి వస్తువునైనను పారవేయుదురు. ఎవరై నను తననోటినుండి ఉమ్మివేయబడిన దానిని ముట్టుటకు వారే యసహ్య పడుదురు. రెండవది ముక్కు. నిదియు పైజెప్పినలాగుననే యున్నది. నాసిక నుండి వచ్చెడి చీమిడియు పై జెప్పిన ఉమ్మివంటిదే. మూడవది నేత్రముల నుండి వచ్చెడు పుసియున్ను, పైజెప్పిన రీతిగానే యుండును. నాల్గవది కర్ణములనుండి యుత్పత్తియగు గుబిలియు పైదానితో సమానమే. 5 మూత్రము, 6 మలము, 7 పురుషశుక్లము, స్త్రీయైన ఋతుకాలమున గలుగు రుధిరము, 8 సర్వాంగములనుండి యేర్పడు చెమట వీనికే అష్టమలములని

పేరు. శరీరమునుండి యుత్పత్తియగు నీయష్టమలములను కొంచెము యోచించుకొనిన వీనియందు గలుగునభిమానము చాలవరకు తొలగిపోవును.

మరియొక విశేషముగూడ దీనియందు గలదు. అదేమన నీ దినము దుర్వాసన కలిగియుండు మలముగాని, మూత్రముగాని నిన్నటిదినము ఎంతో మనోహరమై పావనమై సువాసన గలిగియుండు పండ్లో లేక మంచి ఫల హారమో (పిండివంటలో) లేక పుణ్యమగు దేవతారాధన చేయబడిన క్షీరా న్నమో, పంచామృతమో, నైవేద్యమో, పూజార్హవస్తువులుగానో యయి యుం డును గదా! ఆలాగున మూత్రము నిన్నటి దినము దేవతానైవేద్యము పెట్టినది గాని, అభిషేకము చేసినదిగాని యగు గోక్షీరమో, పుణ్యతీర్థమో, లేక ఉత్తమములైన పండ్లరసమో యై యుండును గదా! లేక సుగంధ వస్తువులచే మంత్రపూతముగా చేసిన దేవతాభిషేకయోగ్యమగు గంగాతీర్థమో యైయుండ వచ్చునుగదా!

ఓహో! ఒక్కరాత్రి కాలము ఈ పాడుఘటములో నుండినంత మాత్రమున పైజెప్పిన వస్తువులయొక్క సుగంధము, పుణ్యము ఎట్లంతర్ధానమై పోయినవో! ఈ నీచత్వమున్ను, దుర్గంధమున్ను ఏలాగున వచ్చినవో! నిన్నటి దినము సేవ్యమైనది ఈ దినమున హేయమగుటకు కారణము విచారించిన నాలుగుఝాముల కాలము ఉదరములో ఉండినందుచే అట్టిదోషము సం ప్రాప్తమై యుండగా సదా దోషరూపముగానే యుండు దేహముయొక్క మాహా త్మ్యమును, మాయయొక్క మహిమను మీరు తెలిసికొనవచ్చును.

ఇకను తెలిసికొనవలసి యుండిన శరీరములో నెచ్చటనైన చీము కారు చున్నప్పుడు గూడ చూడవచ్చును. అపుడు మీకే యీ రహస్యము గోచరము గాగలదు. లేనిచో చనిపోయిన తరువాత దహనము చేయకగాని, పూడ్చివేయక గాని పారవేసి యుండు శవము నాలుగైదు రోజులు పోయిన తరువాత కుళ్ళి పడియున్నప్పుడు చూచిన త్వరలో తెలిసికొనవచ్చును. మరల మీకు ఈ విషయమై సాక్షులుగాని, శాస్త్రములుగాని యవసర ముండదు.

ఇప్పుడు ఈ దేహముయొక్క ఆదియు, మధ్యమును తెలిసికొన్నాము. ఇక అంత్యావస్థను చూచెదము. దీనిని నిప్పులో కాల్చివేయుటగాని, మట్టిలో పూడ్చివేయుటగాని చేయు విషయము అందరి కెరుకై యున్నది. ఇట్టి దానికి లోబడియా మనము దైవమునకు దూరులమగుట! మోక్షమును పోగొట్టు కొనుట! కరుణామూర్తియగు భగవంతుని దూరము చేసికొనుట! ఇది యెటు వంటిదన బియ్యమును పారవేసి పొట్టును మూటగట్టుకొన్నట్లుండును. తోలు యొక్క రంగును జూచి లోభాగమున గల గుజ్జును పారవేయునట్లున్నది. మన యొక్క మౌఢ్యము! దీనియొక్క దుంపను త్రెంచుటకు శ్రీవిద్యారణ్య స్వాములు "పంచదశి"యందొక కథ వ్రాసి యున్నారు. అయితే అది మనకు చెప్పుటకుయోగ్యత కానప్పటికిన్ని, సామాన్య పామరజనులకు త్వరలో గోచర మగుటకున్ను, మహనీయులు చెప్పినందుచేతను ఇచ్చట వ్రాయవలసివచ్చి నది. అదేమన మనయొక్క మహిమయు, దానియొక్క చేష్టయు తెలిసికొనిన ఆ మాయ మాయమైపోవును.

ఉపస్థప్రదేశములో దారుణమైన కుష్ఠువ్యాధి (స్త్రీ రోగము) గల ఒక వేశ్యాస్త్రీ సంధ్యాకాలమున మంచి వస్త్రాభరణములున్ను, సుగంధ ద్రవ్యము లున్ను, సువాసన పుష్పములున్ను అలంకరించుకొని విటపురుషులను తన యొక్క విలాసమహిమచే మోహమనెడు పాపపు వలలోనికి వశపరచుకొను చుండెను. ఆ మహామాయావేషమున్ను, ముఖనేత్రముల విలాసములనున్ను చూచి యనేకులు మోహనిర్మిత మన్మథజాలములలోనికి వశపడుచుండిరి. ఒక్క రోజు అస్తమయకాలమున తనయొక్క వేషమును వేసికొని, భావమును ప్రకటనచేయుచు గృహద్వారాంతర్భాగమున నిలిచియుండు సమయమున తనలో గల గొప్పదారుణ వ్యాధి నెరింగిన యొక పురుషుడు ఆ మార్గమున పోవుచుండుట చూచి సిగ్గుపడి వెంటనే యింటిలోపలికి వెళ్ళిపోయెను.

ఈలాగున దేహముయొక్క స్థితిగతులను తెలిసికొన్నచో మీ దగ్గర అది తనయొక్క మోసపు మహిమను ప్రదర్శింపదు. ఈ యుపాయము తప్ప దానిని జయింప మీకు సాధ్యము గాదు. అప్పుడు మాత్రమే అది తనయొక్క

గర్వమును ముడుచుకొనును. కనుకనే ఘటశోధన యవశ్యమని చెప్పిరి. అప్పుడు మీకే సిగ్గు గలుగును. అప్పుడు పైజెప్పిన వేవియు మీకడ్డము రాజాలవు. ప్రయాసము లేకయే మోక్షద్వారములో ప్రవేశింపవచ్చును. పుణ్య కర్మలు చేయవచ్చును. ఈశ్వరధ్యాన మొనర్పవచ్చును. అప్పుడొక జన్మమును దాటిన వారమగుదుము. అనగా ద్విజత్వము వచ్చినది. ద్విజత్వ మనగా రెండవ జన్మమనిభావము. స్థూలదేహము పంచీకరణ మహాభూత సంభవము.

**పంచీకృతమహాభూత సంభవం కర్మసంచితమ్ ।**
**శరీరం సుఖదుఃఖానాం భోగాయతనముచ్యతే ॥**

విచిత్రశక్తి గల కర్మమువల్ల గలిగెడి యీ శరీరము పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అను పంచమహాభూతములయొక్క అన్యోన్య మేళనమువల్ల నేర్పరుపబడినదై శుభాశుభముల నెరవేర్చుటకు స్థానముగా నున్నది. గృహమువలె సుఖదుఃఖములను అనుభవించుటకు స్థానముగా నున్నదనుట.

ఇంతవరకు చెప్పినదంతయు విని శరీరమున లక్ష్యముంచక చెరుపవలె నని యర్థము గాదు. మమత్వముమాత్రము గలుగనీయక చూచుచుండ వలెను. మమకారమే బంధమును గలుగచేయును. నిర్మమత్వము బంధ విముక్తి నొనగూర్చును. కావున శరీరమునందుండు అత్యాసక్తిని విడిపించి బ్రహ్మనిష్ఠచేయుట కనుకూలమగు రీతిలోనుంచి తరించవలయును. పైజెప్పిన విషయము లన్నిటిని తెలిసికొనిన స్థూలదేహముయొక్క స్థితి తెలిసికొన వచ్చును. ముముక్షువులు దీనిని తెలిసికొనినచో దైవసన్నిధిలో ప్రవేశించుటకు గల యాటంకములు చాలవరకు తొలగిపోవును.

ఇక రెండవ ప్రతిబంధమగు సూక్ష్మదేహము చేయు పనినిగూడ తెలిసి కొనవలసి యుండును. దీనికి విక్షేపమని పేరు. ఇది రజోగుణముతో గూడి యుండును. సూక్ష్మదేహమునుగూర్చి చెప్పునప్పుడు పందొమ్మిది ఇంద్రియ ములతో గూడినదని చెప్పుదురు. బుద్ధియందు చిత్తమున్ను, మనస్సునంద

హంకారమున్ను ఇమిడియుండును. కొన్ని స్థలములలో నీసూక్ష్మదేహమును వర్ణించునప్పుడు పదునొకండింద్రియములనిగూడ సంక్షిప్తముగా జెప్పుట గలదు. అప్పుడు అంతఃకరణ చతుష్టయము ఒక్క మనస్సులోనే యణగి యుండునట్లు తెలిసికొనవలయును.

**పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్ ।**
**అపంచీకృతభూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్ ॥**

ఆత్మయందు లేని సుఖదుఃఖములను తోపజేయడమునకుగాను పంచ ప్రాణములతోడను, దశేంద్రియములతోడను, మనోబుద్ధులతోడను కూడు కొనియుండు సూక్ష్మదేహము ముఖ్యకారణమైయున్నది. ఈ సూక్ష్మదేహము నకే పరలోక గమనము గల్గుచుండును. స్వర్గనరకలోకములను ఈ సూక్ష్మ దేహముతో గూడియే జీవుడనుభవించుచుండును. స్థూలదేహమువలె అగ్ని యందిది దహింపబడదు. ఇది జ్ఞానాగ్నియందు మాత్రమే దహించును. అనగా బ్రహ్మజ్ఞానాగ్నిలో మాత్రమే నశించును. అంతవఱకు లెక్కలేని జన్మములను ఇది గలుగజేయుచుండును. ఇది ఏతముయొక్క కుండవలె పుణ్యాపాపముల ననుసరించి ఉచ్చనీచావస్థల కనుకూలమగు దేహమును ధరించి ఇహపరము లకు తిరుగుచుండును. ఆయాకర్మానుగుణమగు దేహము వచ్చునప్పుడు దానికనుగుణమగు బుద్ధియున్ను, జ్ఞానమున్ను, గుణములున్ను మాత్రమే గలుగును అని పతంజలి మహర్షి యోగసూత్ర భాష్యములో తెలిపియున్నారు.

**సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః॥**

అనాదికాల సంచిత కర్మపరిపాకమువలన జాతి, ఆయువు, భోగము అనునవి యేర్పడుచున్నవి.

అవిద్యాది దోషములు నశించువఱకు ఆ పుణ్య పాప మిశ్రకర్మల పరిపాకఫలమగు జన్మము, జీవితము భాగ్యభోగ్యములు గలుగుచుండును.

**తతస్తద్విపాకాను గుణానామేవాభివ్యక్తిర్వాసనానామ్ ॥**

ఆకర్మమువలన ఆయా జాతిదేహముల పరిపాకములకు అనుకూలించు నట్టివిగా నుండు సంస్కారములయొక్క ఆవిర్భావము గలుగుచున్నది. అనగా నేదేహము వచ్చునప్పుడు దానికనుగుణమగు ఇంద్రియములు, దేహము, మనస్సు, బుద్ధి, మేధ మొదలైనవి యేర్పడునో, అపుడు వానికనుగుణమగు జ్ఞానమున్ను, బుద్ధియును, శక్తియును, గుణమున్ను మాత్రమే గలుగును. ఒకరికి మంచి విజ్ఞానానుగుణ జన్మభోగములు గలిగినను అప్పుడు చేయు కర్మను బట్టి మరల నే జన్మము వచ్చునో అప్పుడు దాని కనుగుణమైన జ్ఞానాదులు గలుగునేగాని పూర్వముండినవి కలుగవు.

అనగా ఒక జన్మములో పుణ్యాత్ముడై యుండినప్పుడు గల తెలివియు, విజ్ఞానమున్ను మరియొక జన్మలో నీ జీవుడే పాపము గల జన్మము ధరించినచో ఉండవు. ఈ పాపజన్మమునకు తగిన యోగ్యతమాత్రమే గలుగును. కొందరికి ఒక జన్మములో కొంతకాలము మంచి తెలివితేటలు గలిగియుండినను కొన్ని జడములైన వ్యాధులు వచ్చిన నతడు మరల ఏమియు తెలియని కేవలము జడప్రాయునివంటి వాడగుట కానుపించుట లేదా? ఇదే దీనికి తార్కాణము.

కొందరు శాస్త్రపరిచము లేనివారును, గురుపరంపరగా విద్య నభ్యసింపని వారున్ను, "ఈ దేహముతోనే సుఖదుఃఖములు నశించి పోవును. మరల స్వర్గనరకము లుండవు. ఎందుకనగా, సుఖదుఃఖముల ననుభవించుటకు దేహము కావలయును గదా! అట్టి దేహము ఇచ్చుటనే నశించిపోవుచున్నది" అని తమ యవివేక ప్రజ్ఞను ప్రకటించెదరు. వీరికి స్వప్నములో సుఖదుఃఖములు కలుగుచున్నవా? లేదా?యని తమలో తామూహించుకొనిన నీ సందేహము తీరిపోవును. నిద్రలో తాను స్వగృహములో నుండినవాడైనను దేశాంతరములలో, గ్రామాంతరములలో, లోకాంతరములలో అనేక విధములగు చిత్రవిచిత్రములైన వస్తువులను జూచుటయు, సుఖదుఃఖముల ననుభవించుటయు గలుగుట లేదా? ఇదే దీనికి తార్కాణము.

అయితే స్వర్గనరకలోకములు ఈలాటి పంచభూతవస్తువులచే నిర్మించినవిగా నుండునని వారు తలంచి యుందురు. అవి యట్లు గావు. పంచీకృతముగాని పంచభూతములయొక్క అపంచీకృత సూక్ష్మవస్తువులచే కల్పితములు. దీనికి సంకల్పలోకమనియు, కల్పిత లోకమనియు, మనోనిర్మిత లోకమనియు పేర్లు గలవు. ఇట్టిదానినే స్వప్నకల్పితమని సాధారణముగా జెప్పు దురు. అయితే కల్పితములని తలంచి సుఖదుఃఖములు, ఉచ్చ నీచ జన్మములు లేవని మాత్రము చెప్పరాదు. ఏలన స్వప్నము కల్పితమైనను నిద్రావస్థలో ప్రత్యక్షముగా సుఖదుఃఖములు గలుగుచున్నవి గదా! కనుక అవియు వాస్తవములనియే గ్రహించవలయును. వేదాంత శాస్త్రములో వాస్తవ ముగా జగత్తు లేదనియు, అది అవిద్యాకల్పితమనియు, పారమార్థికస్థితి వచ్చు వరకు గానుపించుననియు, మరల బ్రహ్మమున కభిన్నముగానే కనుబడు ననియు చెప్పునప్పుడు ప్రస్తుతావస్థలో ప్రపంచముగాని, ప్రపంచసంబంధ సుఖదుఃఖములుగాని లేవని చెప్పవచ్చునా? పైజెప్పిన స్వర్గనరక లోకముల యొక్క స్థితియు నీలాగుననే యుండును.

**సంసారః స్వప్నతుల్యో హి రాగద్వేషాది సంకులః ।**
**స్వకాలే సత్యవద్భాతి ప్రబోధేఽసత్యవద్భవేత్ ॥**

స్వప్నమున ఎంతకాలమువరకు నిద్రావస్థ యనుభవింపబడుచున్నదో అంతదనుక తాను మిక్కిలి యసత్యమైనను సత్యమువలెనే గనబడుచుండి నిద్రనుండి బోధగలిగిన పిమ్మట మిక్కిలి యసత్తుగా ఏ ప్రకారము గనబడు చున్నదో, ఆలాగే సంసారమును తనకు కారణభూతమైన అజ్ఞానదశ యుండు నంతవరకు సత్యమైనదిగాను, జ్ఞానోదయమైన పిమ్మట లేనిదిగాను అగు చున్నది.

ఈ సంకల్పదేహము లేక కామమయ దేహముయొక్క స్వభావము ఏకాంతమున గూర్చుండి ధ్యానములోనికి ప్రవేశించినపుడు స్పష్టముగ గను గొనదగును. ఇది సూక్ష్మశరీర మగుటచే సూక్ష్మబుద్ధి గలవారికి మాత్రమే

గోచరమగును. ఈశ్వరవిషయములో లేక ధ్యానములో లేకసమాధిలో ఆత్మను ప్రవేశింపనీయక బహిర్ముఖముగా జేయుచుండును. అనగా చిత్తైకాగ్రత గలుగ నీయక అనేకములగు వృత్తులు వచ్చి అడ్డు గలుగ జేయుచుండును. జ్ఞేయ వస్తువులో నిలకడ గలుగనీయక బాహ్యవృత్తిలోనికి మనస్సు అతి వేగముగ బోవుచుండును.

ఇట్టి చంచలమైన మనస్సుయొక్క నిగ్రహముకొరకు యోగశాస్త్ర మేర్పడినది. కనుకనే శ్రీ పతంజలి మహర్షియొక్క యోగదర్శనమందు మొట్ట మొదటనే "యోగశ్చిత్తవృత్తినిరోధః" అని వ్రాసియున్నారు. ఈ మనో లయము కొరకే యుపాసన యేర్పడినది. ఈ యుపాసన యనేకవిధములు. ఈశ్వరానుసంధానమున్ను, స్వరూపానుసంధానమున్ను ముఖ్యములు. ఈ సంకల్పము నరికట్టుటకు ప్రాణాయామము కొంత సహాయపడును. అయితే అందిరికిన్ని అక్కర లేదు. చిత్తశుద్ధిగలవారికి, ఈశ్వరభక్తి గలవారికి, స్వరూపా నుసంధానమున్ను, ఉపరతి సిద్ధించిన వారికి, నిర్విషయము గలగిన వారికి, శాంతము, విరక్తి, కరుణ గలవారికి యవసరము లేదు. వీరికి తీవ్రమైన భక్తి యోగముగాని, ధ్యానయోగముగాని, స్వరూప విచారణగాని యుండిన చాలును. యోగశాస్త్రజ్ఞుల యభిప్రాయ మిదియే. ఈ సూక్ష్మదేహము ప్రాకృత సంకల్పరూపమై పరిణమించి ఆత్మసాక్షాత్కారమునకు అడ్డుగలుగు చుండునని యిప్పుడు మనము గ్రహించడమైనది.

ఇంతేగాక మరియొక్క విధముగాను ఇది నిరోధము గలుగజేయు చుండును. అది పైజెప్పిన లోకసంకల్పములకే గాక బాహ్యమునకు సంబం ధించిన యభిమానముగా నుండును. ఇదిన్ని రజోగుణముతో చేరినదే. ఏదైన పుణ్యకార్యము చేయుటకున్ను, పుణ్యపురుషులను సేవించుటకును ఇది గొప్ప యాటంకమును గలుగజేయును. అదెట్లన విద్యాభిమానముచేతను, ధనాభి మానముచేతను, కులాభిమానముచేతను, అధికారాభిమానముచేతను, ముందుకు పోనీయక యీ యాత్మ నవరోధపరచుచుండును. అనగా తాము విద్వాంసులమనియు, శ్రీమంతులమనియు, అగ్రకులజులమనియు, ఉన్నతో

ద్యోగులమనియు, యతీశ్వరులమనియు, యోగులమనియు అభిమానము గలిగినందుచే దానిని విడిపించి యేకార్యమును చేయనొల్లక ఊరక చెడిపో వలసి వచ్చుచున్నది. ఇవి యన్నియు సూక్ష్మదేహము చేయు దోషములని గ్రహించుకొనవలయును. కనుకనే అభిమానమును గలుగనీయక చూడవలె నని విజ్ఞులు చెప్పు రహస్యము.

అయితే ధనము ఎందుకు గలిగినదో! యని యోచించిన సత్కర్మ ముల కుపయోగపరచి తరించుటకని గోచరమగును. విద్యచే గలుగు నుప యోగమేమన శాస్త్రములచే నాత్మను సంస్కరించి జ్ఞానమును సంపాదించి ముక్తి నొందుటకొరకే. శ్రేష్ఠకులము గలిగినది ఉత్కృష్ట కార్యములను జేసి మోక్షము నొందుటకొఱకే. అధికారము ఎందుకనగా అందరిని సన్మార్గములో నడిపి సంరక్షించుటకొరకే. యత్యాశ్రమముగాని, యోగముగాని దేనికన సర్వ బంధములనుండి విముక్తి చేసికొని నిర్వికల్ప సమాధిలో బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమును గలుగజేసుకొనుటకున్ను, ధర్మరహస్యములను, జ్ఞానసారములను నిరాటంకముగాను, నిర్మలముగాను జనుల కుపదేశించుట కొరకే అను ఈ సంగతులను అందరు మరచి పోవుచున్నారు. కనుకనే

**పరోపదేశపాండిత్యే శిష్టాస్సర్వే భవంతి వై ।**
**విస్మరంతీహ శిష్టత్వం స్వకార్యే సముపస్థితే ॥**

పరులకు నుపదేశించు విషయములో అందరు పండితులే. నిపుణులే. తమయొక్క యాచరణకాల మాసన్న మైనప్పుడు ఇతరులకు చెప్పిన వేవియో వాటిని మరచిపోవుచున్నారు.

**యస్య నాస్తి వివేకస్తు కేవలం యో బహుశ్రుతః ।**
**స న జానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసానివ ॥**

ఎవండు అనేకశాస్త్రములను జదివిన వాడైనను, ఆచరణయందు యోగ్యత లేనివాడై యుండునో యతడు శాస్త్రములయొక్క నిజమైన యర్థ మును తెలియజాలడు. ఎట్లన అనేక విధములగు రసయుక్తములైన పక్వా

న్నాదులలో గరిట తిరుగుచుండినను వానియొక్క రుచుల నేలాగున తెలిసి కొనజాలకయు, అనుభవించి సుఖింపకయు నుండునో ఆలాగున నుండునని భావము.

**ఆచారప్రభవో ధర్మో నృణాం శ్రేయస్కరో మహాన్ ।**
**ఇహ లోకే పరా కీర్తిః పరత్ర పరమం సుఖమ్ ॥**

మనుజులకు ఆచరణవల్లనే ధర్మరహస్య ముదయించును. అదే గొప్పదైన శ్రేయస్సును గలుగజేయును. అట్టి యున్నతమైన యనుష్ఠానము ఇహమందు కీర్తియు, పరమందు మోక్షసుఖమును గలుగజేయును. ఇప్పుడు సూక్ష్మదేహము చేయుప్రతిబంధములను కొంతవరకు గ్రహించుకొనడమైనది.

ఇక కారణదేహము చేయు ప్రతిరోధమును గూడ గ్రహించుకొనవలయును. స్థూలమునకున్ను, సూక్ష్మమునకున్ను ఇది కారణమగుట వలననే దీనికి కారణదేహమని పేరు వచ్చినది. ఇది మరింత సూక్ష్మమైనదేగాక రహస్యమైనదిగాను నుండును. దీనికే మూలావిద్యయని పేరు. లేక యజ్ఞానమనియు, ఆవరణమనియు, ప్రకృతియనియు, ప్రధానమనియు పేర్లు గలవు. ఇది గురు వాక్యములచేత మాత్రమే తొలగిపోవును. అనగా గురూపదేశము లేనిచో నశించదని తాత్పర్యము. వృక్షముయొక్క కొమ్మలనుగాని, మొదలునుగాని, నరికివేసినను మూలముండిన ఏలాగున అంకురించునో, ఆలాగున నీ మూలావిద్యను వ్రేళ్ళతో తీసివేయనిచో ప్రకృతియను వృక్షము మరల నంకురించును. ఇచ్చట గురూపదేశము ఒక మంత్రమో, ఒక చిహ్నమో, ఒక పేరో, ఒక వేషమో, యంత్రమో, మహిమయో, లేక సిద్ధియో యని తలంపరాదు. అది శమద మాదులతోగూడ తనయొక్క నిజస్వరూపమును తెలుపుటయు, శిష్యుడు తెలిసికొనుటయు నగును. ఇది సామాన్యమైన పని యని తలంపరాదు. మతములయొక్కయు, జాతులయొక్కయు, వర్ణములయొక్కయు, ఆశ్రమములయొక్కయు, ఈశ్వరునియొక్కయు, జీవునియొక్కయు రహస్యములన్నియు నిచ్చట గలవు.

ఈ కట్టులను విడిపించనిచో నాత్మయొక్క స్వభావమును తెలిసికొన జాలము. దీనికే హృదయగ్రంథి యని పేరు. దీనినుండి ముక్తి గలిగిన మాత్రముననే మీకు నిజమైన మోక్షము లభించును. అదే ముక్తి యనియు కైవల్యమనియు, పరమపదప్రాప్తి యనియు, నిర్వాణమనియు, సమాధి యనియు, జీవేశ్వరుల యైక్యమనియు తెలిసికొనవలెను. దీనియొక్క నిలకడ అతివిచిత్రమై యున్నది. యధార్థముగా నది శుద్ధబ్రహ్మమయి యుండినను, అవిద్యయొక్క మహిమ విశేషమే జీవుడుగాను, హీనుడుగాను, మలినుడు గాను, పాపిగాను, జ్ఞానము లేనివాడుగాను నుండేలాగున శుద్ధాత్ముడగు తన్ను చేయును. ఇట్టిదే పంచభ్రమ యని అన్నపూర్ణోపనిషత్తులో దెలుపబడినది. ఈ భ్రమనుండి నివృత్తి గావలసి యుండిన వేదాంత వాక్యములను సాధన చతుష్టయ సంపన్నులై బాగుగా శ్రవణమనన నిదిధ్యాసనములు చేయవలెను. అప్పుడు దివ్యరసాయనము నిశ్చితపథ్యముతో నుపయోగపరచు రోగియొక్క వ్యాధి నశించునట్లు భవరోగమునుండి యీ జీవుడు ముక్తుడగును.

**ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా ।**
**హరత్యవిద్యావిక్షేపాన్ రోగానివ రసాయనమ్ ॥**

దీని యర్థము పైతెలిపినదే. అయితే యెంత శ్రేష్ఠమైన యౌషధమైనను పథ్యము సరిగా లేనిచో నేలాగున రోగమును శమింపజేయు శక్తి దానికుండదో, యాలాగున మహామంత్రము మహనీయులగు గురువులచే నుపదేశము నొందినను ఆచరణ సరిగా లేనిచో భవరోగమును నశింపజేయదని మాత్రము ముముక్షువులు జ్ఞప్తిలో నుంచుకొనవలెను. ఇప్పుడు భారతదేశమున గలిగిన దోషమిదియే. యథార్థముగా జెప్పిన మీయొక్క యుపాసనాదైవముగాని, యోగముగాని, తపస్సుగాని, మంత్రజపముగాని, భజన, కీర్తన, పారాయణ, పూజా, హోమాదులుగాని మిమ్ము నుద్ధరించునని సదా నమ్మకము గలిగి వర్తింపుడు. ఇది ఒకటి గలిగియుండిన పైజెప్పిన దేవత మొదలగు యావ త్తున్ను మీకనుకూలముగా నుండును. ఈ విషయమై యెన్నియో చరిత్ర

ములు గలవు. ముఖ్యముగా రావణాదుల జీవితములను గమనింపుడు. పంచ భ్రమలను గురించి సంగ్రహముగా వ్రాసెద. ఇంతవరకు విపులముగా వ్రాయబడియున్నది.

**1. జీవేశ్వరౌ భిన్నరూపావితి ప్రాథమికో భ్రమః ।**

జీవేశ్వరులు భిన్నులని కలుగునది మొదటి భ్రమ యగును. ఇది యంతయు మాయవల్లనే గలుగుచున్నది.

**2. ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వా ద్వితీయకః ।**

ఆత్మయందు కర్తృత్వ బుద్ధి వాస్తవమని కలుగునది రెండవ భ్రమ యగును.

**3. శరీరత్రయ సంయుక్త జీవ స్సంగీ తృతీయకః ।**

శరీరత్రయముతో గూడి సంగము గలవాడే జీవుడని కలుగునది మూడవ భ్రమ యగును.

**4. జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః ।**

జగత్కారణ రూపుడగు పరబ్రహ్మమునకు వికారము గలదని తోచుట నాల్గవ భ్రమ యనబడును.

**5. కారణాద్భిన్నజగతః సత్యత్వం పంచమో భ్రమః ।**

జగత్కారణ రూపుడగు పరమేశ్వరునుండి గలిగిన యీ కార్యరూపమగు జగత్తు పరమేశ్వరుని కన్యముగా దోచుట యైదవభ్రమ యనంబడును.

ఈ పంచభ్రమలయొక్క నివృత్తియు నీ యుపనిషత్తులోనే చెప్పబడి యున్నది. ఈ యుపనిషత్తు ఋభు, నిదాఘ సంవాద రూపముగా నున్నది. వీరు గొప్ప మహర్షులు.

**1. బింబప్రతిబింబ దర్శనేన భేదభ్రమో నివృత్తః ।**

సూర్యబింబమున కున్ను, ప్రతిబింబమునకున్ను గల యభేదమును తెలిసికొనిన మొదటి భ్రమ నివృత్తి యగును.

**2.స్ఫటికలోహిత దర్శనేన పారమార్థిక కర్తృత్వభ్రమో నివృత్తః ।**

స్ఫటిక మణికి నీల, రక్త, వర్ణములతో గూడిన సంబంధమును గ్రహించుకొనిన కర్తృత్వ బుద్ధియను రెండవ భ్రమ క్షయించును.

**3. ఘటమఠాకాశ దర్శనేన సంగీతి భ్రమో నివృత్తః ।**

ఘటాకాశ, మఠాకాశ, మహాకాశముల విచారణజ్ఞానముచేత నిస్సంగు డగు నాత్మ సంగము గల వాడని తోచెడి మూడవ భ్రమ నివృత్తి యగును.

**4. కనకరుచక దర్శనేన వికారిత్వభ్రమో నివృత్తః ।**

సువర్ణమునకున్ను, ఆభరణములకున్ను గల విమర్శజ్ఞానము గలిగిన వికారభ్రమ యను నాల్గవది లయము నొందును.

**5. రజ్జుసర్ప దర్శనేన కారణాద్భిన్న జగతః సత్యత్వభ్రమో నివృత్తః ॥**

రజ్జుసర్పముల విచక్షణాజ్ఞానముచే కారణమునకు భిన్నముగా జగత్తు గలదను నైదవ భ్రమయు నివృత్తి యగును. సంస్కారములోను, జ్ఞానము లోను ఉత్తముడైన గురువుదగ్గఱ విచారణ చేయనిచో పైజెప్పిన కల్పిత దోష ములు నివృత్తి గాజాలవు.

ఇదే దీనిలో గల మర్మము. దీనియొక్క నిజార్థమును తెలిసికొనిన మీరు బోనునుండి బయటపడిన సింహమువలె నాత్మశక్తి గలవారగుదురు. లేక శూద్రగ్రహము పట్టిన బ్రాహ్మణుడు గ్రహవిమోచన కాలమున తన యొక్క బ్రాహ్మణత్వము నేలాగున తెలిసికొనగలడో, అట్లు మీ స్వరూప మును తెలిసికొనగలరు. లేక సుషుప్తిలో నుండి మేల్కొన్న పండితునివలెను, యతీశ్వరునివలెను, చక్రవర్తివలెను మీరు జడత్వము వదలి నిజస్వరూపు

లుగా మారగలరు. పైజెప్పిన వారలు నిద్రలో నుండు నప్పుడు తమ్ము తాము దెలిసికొనజాలరు.మేల్కొనిన తరువాత స్వయముగా నేలాగున తమ్ము తాము తెలిసికొనుచుందురో ఇదిన్ని యాలాగున నుండును. కనుకనే, "యథా స్వప్న ప్రబోధవత్" అని చెప్పిరి. ఇందువల్లనే అజ్ఞానసుషుప్తి నుండి మేల్కొనవలెనని శాస్త్రము చెప్పెడు రహస్యము. ఇచట మీ యంత రాత్మయొక్క యోగ్యతను జూడక, మీరు పుట్టిన దేశమో, కులమో వీటిపై మాత్రము ఆధారపడి మీకు అధికారమును నిర్ణయించు వారు మనుష్యులై యుండు మిమ్ములను మృగములుగా చేయువారని మాత్రము తప్పక నమ్మ వలయును.

మీరు ఏ దేశీయులుగాని, యేవర్ణస్థులుగాని, స్త్రీలుగాని, పురుషులు గాని యైయుండినను మీయొక్క హృదయము ఏయవస్థలో నుండునో దానిని గనిపెట్టి మీకధికారమును నిశ్చయించువాడే నిజమైన గురువని తలంచ వలయును. ఈమహాత్ముడు మనుష్యులమని తలంచుకొని యుండు మిమ్ములను దైవసదృశులనుగా చేయగలుగును. ఇదే దీనియందు గల రహస్యము.

ఇట్టి బోధకులు లేకపోయినందుచేతనే పరమ పావనులైన మహా పురుషుల పాదధూళిచే పునీతమైన యీభారత దేశమునకు ఇంత యధోగతి గలిగినది. జాతికాధిక్య మిచ్చు శ్లోకములుగాని, శాస్త్రములుగాని అనేకములు గలవు. గుణమున కాధిక్యమిచ్చు విషయములో వాదించు వారికిన్ని కావలసి నన్ని ప్రమాణములు గలవు. ఇది న్యాయవాదుల కోర్టులో గల వాదమువంటిదే గాని మరియొకటి గానేరదు. కనుకనే అత్మజ్ఞుడై, కరుణాళుడై ప్రకృతిదోషము లేశమైనను లేని జ్ఞానియగు గురుని ఆశ్రయించవలెనని శాస్త్రము చెప్పు రహస్యము. ఆకాశమునుండి కురియుచుండు వాననీరు అంతట శుద్ధముగాను, నుండినను నేలపైబడి అశుద్ధముగాను, తీపిగాను, చేదుగాను, పులుపుగాను, ఉప్పుగాను, తెల్లగాను, నల్లగాను, పచ్చగాను, ఊదాగాను, సుగంధముగాను, దుర్గంధముగాను మారులాగున ఆత్మచైతన్యము శుద్ధజ్ఞానమ్మై యుండినను జనుల యొక్క అంతఃకరణస్వభావము ననుసరించి వారు వారు చేయు పను

లున్ను, చెప్పు మాటలున్ను, సంకల్పములున్ను మారుచుండును. ప్రకృతి గుణములు నశించిన గురుని సంపాదించుకొనవలెనని వేదము తెలుపుటలో రహస్యమిదియే.

మరియు శుక్ల, కృష్ణ, పీతవర్ణములు గల దర్పణములద్వారా జూచు వారికి ప్రపంచములో గల తెలుపు, నలుపు, పసుపు, రంగులు గల వస్తువు లన్నియు తనయొక్క అద్ద మేరీతిగా నుండునో యాలాగుననే గనుపించును. ఇదే మతకలహమునకున్ను, జాతిద్వేషమునకున్ను కారణముగాని మరి యొకటి గాదు. దీనికి మాయయొక్క మహిమ యని పేరు. శుద్ధమైన దర్ప ణముద్వారా జూచువారికి వస్తువుయొక్క యథార్థజ్ఞానము గలుగును. ఆలాగున వాసనాక్షయము, మనోనాశము, ఆత్మజ్ఞానోదయము గలిగిన పుణ్యా జీవులకు మాత్రమే ఆత్మయొక్క యధార్థజ్ఞానము గోచరమగును. అట్టి ఆత్మ యొక్క నిజమైన దైవతబోధ గలుగనిచో మీరున్నతస్థితిలోనికి వెళ్ళజాలరు. వెళ్ళుట గూడ పాపమని తెలుపు కృత్రిమబుద్ధి గలవారుగూడ గలరు. అయితే మీరు దేనిపై లక్ష్యముంచి వెళ్లదలంచి యున్నారో దానికి సరియైన గుణము లున్ను, వర్తనమున్ను చక్కగ గలిగియున్నవా! యని యెల్లప్పుడు మీ యాత్మలో జూచుకొనవలసి యుండును. ఇది లేనిచో పైజెప్పినవారి వాక్యము వలె దేశమునకున్ను, కులమునకున్ను స్త్రీపురుషాది జన్మములను బట్టియు ఆధిక్యము కలుగుట నిక్కము అని మరువకూడదు. కావున నెల్లప్పుడు అంతరాత్మయొక్క స్వభావమును మరువక ధ్యానము చేయవలెను. అది నిజమైన ఈశ్వరపూజ యనియు, ఆత్మచింతనమనియు, ధ్యానమనియు, నిదిధ్యాసమనియు గ్రహించదగినది. ఇట్టి జీవేశ్వరుల యైక్యసంధానముకంటె పుణ్యమైన పని మరియొకటి మూడు లోకములయందును లేదు. కనుకనే శ్రీకృష్ణభగవానులు "న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే'' అని సెల విచ్చిరి.

ఆత్మసోదరీ సోదరులారా! ఇప్పుడు చెప్పిన యీమూడు ప్రతి బంధములను తొలగించిన వారలైనచో ధన్యాత్ములే, కృతకృత్యులే, ముక్తులే,

అమృతులే, దైవాత్మస్వరూపులే సంశయము లేదు. ఎప్పుడున్ను మీరు శుద్ధులనియు, జ్ఞానస్వరూపులనియు, విజ్ఞానఘనులనియు, చిన్మయజ్ఞాన స్వరూపులనియు, అఖండదైవశక్తి గలవారనియు, ప్రకృతిదోషము లేని వారనియు, చరాచరములలో వెలుగుచుండు చైతన్యజ్ఞాన స్వరూపులనియు భావన చేసికొనవలయును. అది మిమ్ములను ప్రకృతినుండి విముక్తులను జేయును. సమస్త దైవగుణములు గలిగియుండేలాగున సదా చూచుచుండవలెను. అప్పుడు దైవసాక్షాత్కార జ్ఞానము గలుగును.





# ప్రేమ

ప్రేమకు దయ అనియు, కరుణ అనియు నామాంతరములు గలవు. అయితే దయకును, కరుణకును కొంత ఆధిక్యము కలదు. ఈ ప్రేమ అనేక రకములుగా నుండినను వానిని సంక్షిప్తముగ విభజించి చెప్పే విషయములో మూడుగా చెప్పవచ్చును. అది మృగప్రేమ యనియు, మనుష్యప్రేమ యనియు, దైవప్రేమ యనియు తెలియవలయును. ఈ మృగప్రేమలో అసుర ప్రేమయనియు, రాక్షసప్రేమయనియు, రెండుభాగములు గలవు. ఆలాగున మనుష్యప్రేమలోను కొన్ని అవాంతర భాగములు గలవు. దైవప్రేమలో స్వర్గలోకప్రాప్తి గలుగించు దేవతాప్రేమ, బ్రహ్మాది లోకప్రాప్తి గలిగించు ఉపాసనాపరమగు నిష్టదైవత ప్రేమ గూడ గలవు. అయితే యివి యన్నియు పైజెప్పిన మూడు ప్రేమలలో అంతర్భూతములే యగును.

1. మృగప్రేమయనగా :- శరీరసౌఖ్యములను మాత్రము లక్ష్యములో నుంచి అన్నపానవస్త్రాది దేహసౌఖ్యములను సమకూర్చుటలో గలప్రీతి యని

గ్రహించవలయును. దీనిని మృగప్రేమయని చెప్పుటకు కారణమేమన పశు పక్ష్యాదులుగూడ తమతమ బిడ్డలను పోషించుటలో అపరిమితమగు ప్రేమను చూపునట్లు మనకు కనుపించుచున్నది. ఈలాగున కొందరు తమయొక్క బిడ్డలనుగాని, గురువులైన శిష్యులనుగాని పరిశ్రమలు చేయనీయక విద్యాభ్యాసముతో మంచిశిక్షణము నొసంగకయు, దూరదేశములకు పంపి మంచి విద్యలను నేర్పకయును, స్నానసంధ్యాద్యనుష్ఠానములను వ్రతనియ మములను పాటింపనీయకయు; ఎండ, గాలి, వాన, మంచు, మొదలగు వానికి భయపడి నియతములగు కార్యములను చేయనీయకయు, పుణ్యకర్మల నాచరింప నీయకయు దగ్గర కనుపెట్టి సంరక్షించు ప్రేమ మృగప్రేమ యన దగును. లేక మాయామోహ ప్రేమయనియు, మమత్వ ప్రేమయనియు, మమకారమనియు చెప్పవచ్చును. ఇట్టి ప్రేమయే భారతదేశములో నెక్కువ కనుపించుచున్నది. కావుననే ఈ దేశము ఇంత అధోగతికి జారిపోవుటకు కారణమగుచున్నది.

ఇట్లు ప్రేమించుట గొప్ప దయ యని గాని, కరుణ యని గాని దూర దృష్టి లేనివారు తలంతురు. వివేకజ్ఞానములేని వారును, విశాలమైన లోక జ్ఞానముగలుగని వారును ఆలాగుననే తలంతురు. దీర్ఘదర్శకులగు మహర్షుల యొక్క ఆశయము తెలియని వారును, ఉపనిషచ్ఛాస్త్రములయొక్క అంతః ప్రవాహమగు జ్ఞానామృతమును రుచిచూడని వారును, పైనజెప్పిన లాగుననే తలంతురు. ఇది పరమఋషుల సంతానములగు భారతీయులకు కడుంగడు శోచనీయము. ఏలన అయిదు సంవత్సరము లారంభించునపుడు గురుకులమునకు బంపి వేదశాస్త్రపారంగతులగువరకు తల్లిదండ్రులతోగాని, కుటుంబముతోగాని యేలాంటి సంబంధము గలుగజేయనీయక అచ్చటనే యుండి తరువాత స్వగృహమునకు తిరిగి వచ్చుట లేక నిర్జనప్రదేశములో, దండకారణ్యములో, పర్వతగుహలలో, పుణ్యనదీ తీరములోగాని, తపస్సుచేసి సర్వేశ్వరుని కృపసంపాదించుకొనిన తరువాత మాత్రముననే గదా స్వగృహము నకు తిరిగివచ్చెడు స్వభావము తగును! మార్కండేయాది ఋషి పుత్రుల

యొక్క చరిత్రము ప్రతివారికిని తెలిసినది గదా! ఇట్టి యుదార చరితులగు భారతీయుల స్థితి నేటికి ఎంత హీనస్థితికి వచ్చినది? పై జెప్పిన మృగప్రేమలో అంతర్భూతములై అసుర, రాక్షస, పైశాచిక ప్రేమలుగూడ గలవు. ఇట్టి ప్రేమ సంతానములుగాని, అంతేవాసులుగాని చేయు దుష్కృత్యములకు తల్లి దండ్రులుగాని, గురువులుగాని సంతోషించుచుందురు. మరియు జారత్వము, చోరత్వము, జూదము, సురాపానము మొదలగు వాటికి సహాయ మొనర్చు టయు, వానిని నిరసింపకుండ నుండుటయు, హింసాది పాపకృత్యములలోను, పరులకు నుపద్రవము చేయుటలోను ప్రీతి గలిగియుండుటయు పైశాచికాది ప్రేమలో చేరినవి యగును.

2. మనుష్యప్రేమ :- ఇది విద్యాభ్యాసము చేయుటలోను, సత్య, ధర్మ, దయాద్యనుష్ఠానములోను, వ్రతానుష్ఠానములోను పరోపకారములకు పాటుపడుటలోను గలుగజేసెడు ప్రీతియగును. ఇట్టి సుగుణములకు సహాయము చేయుటయు, శిష్యులుగాని, పుత్రులుగాని యీలాంటి పుణ్యకార్య ములలో ప్రవేశించుట చూచి సంతోషించు నదిగా నుండును. ఇది లోకములో గొప్పయశస్సునకున్ను, ఇహములోగల సాత్త్వికసౌఖ్యమునకున్ను, గొప్ప యుద్యోగాది పదవులకున్ను చేరినదిగా నుండును. దీని నుత్తమమనుష్య ప్రేమ యని చెప్పవచ్చును.

3. దైవప్రేమ :- దీనియందు యజ్ఞాది క్రతువులచే గలిగెడు స్వర్గ లోకప్రాప్తియు, నుపాసనా వ్రతయోగాదులచే గలిగెడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వ రాదుల లోకప్రాప్తియు గల్గియుండును. అయితే స్వర్గలోకప్రాప్తికి హేతువగు యజ్ఞాది క్రతువులకును, ఈశ్వరలోకప్రాప్తికి కారణములగు నుపాసనా యోగాదులకున్ను కోట్లకొలది రెట్లు తారతమ్యము గలదు. విష్ణ్వాది లోకప్రాప్తి యెక్కువ అధికమైనది. అధికపుణ్యముతో గూడినది. బహుకాల సౌఖ్యము గలుగజేయునది. పరిశుద్ధతయు, జ్ఞానమున్ను, అధికము గలిగినదని మరువ కూడదు. తపస్సు, యోగము, జపము, వ్రతము మొదలగున వన్నియు దీనిలో చేరినవే. ఇట్టి కార్యములకు ప్రేరేపింప జేయుటయు, ప్రవర్తించువారికి సహాయ

మొనర్చుటయు అట్టి కార్యములను చేయువారి నమితముగ ప్రేమించు టయు దైవప్రేమలో చేరినవే యగును. అయితే వీటిలో దేనివల్లను నీ లోకములో జీవించి యుండునపుడు అపరోక్ష దైవసాక్షాత్కారజ్ఞానమున్ను, నిరతిశయానంద నిత్యసౌఖ్యమున్ను, జీవన్ముక్తి సుఖమున్ను గలుగవు. పరోక్ష జ్ఞానమున్ను, పరిమితి పొందిన సౌఖ్యమున్ను మాత్రమే పొందును.

అపరోక్ష సాక్షాత్కారజ్ఞానమున్ను, నిరావరణ నిరతిశయానంద దైవ సౌఖ్యమున్ను గలుగుటకు బ్రహ్మసాక్షాత్కార జ్ఞానము గలుగవలయును. అది జ్ఞానయోగముచేతను, దాని కనుగుణమగు తపస్సు చేతను, నిస్సంగుడై చేయు ధ్యానముచేతను మాత్రమే గలుగును. తక్కిన సౌఖ్యము లన్నిటికిన్ని, పదవులన్నిటికిన్ని పునరావృత్తి కలదు. అది ఒకటిమాత్రమే అనంత సుఖమును గలుగజేసి ఆవృత్తి రాహిత్యము నొనగూర్చునది. ఇది ఒకటి మాత్రమే జననమరణ రహితమగు ముక్తిని గలుగజేసి అమృతత్వము నొనగూర్చునది. ఇట్టిదానిని ప్రేమించుటయు, ఇట్టి విషయములో సంతానములను, శిష్యులను ప్రేరణచేయుటయు, ఇట్టి విషయములలో నుండువారిని ప్రేమించు టయు వారికి సహాయము చేయుటయు నిజమైన ప్రేమ యగును.

గురువులైన శిష్యులను, తల్లిదండ్రులైన బిడ్డలను నీలాటి శాశ్వత సౌఖ్యమునకు తయారు చేయుటయే నిజమైన ప్రేమయగును. దీనివల్లనే వారు కృతార్థు లగుదురు. మీరున్ను కృతకృత్యు లగుదురు. పితృఋణములను వారు నివృత్తి చేయుదురు. అంతేగాక వారు దైవఋణములను, ఋషి ఋణములను గూడ నివృత్తి జేయగలరు. అంతేగాక తనయొక్క వంశమును గూడ పావన మొనర్చగలరు. ఇట్టి సర్వోన్నతమగు ప్రేమయే బిడ్డలపైన, శిష్యులపై తల్లిదండ్రులకున్ను, గురువులకున్ను నుండవలయును. ఒకవేళ సుకృత విశేషము పైజెప్పిన దానికి లేకపోయినను, మనుష్యప్రేమయైన సంతానములపై జూపవలయును. అట్లు చేయక మృగప్రాయులై దేహసౌఖ్యమును మాత్రము ప్రేమించువారు మృగాధిక స్వభావులు గాజాలరు. అట్టి వారి జీవితము తమకున్ను, సంతానములకున్ను, భూమికిని భారమే. యగును.

అంతేగాక తమ ఆత్మలకును, పరుల ఆత్మలకును అది హానికరమే అగును. వీరి వంశమును, ఆత్మశక్తియును క్రమ క్రమముగ హీనదశకు వచ్చిచేరును. కావున మనుష్యప్రేమకైన తగిన విద్యకు, సౌశీల్యమునకు, వ్రతనియమ నిష్ఠలకును, శాంతదయాదులకును, దైవభక్తివిరక్తులకును అనుకూలమగు రీతినైన మాతాపితరులు తమ సంతానములను, గురువులు తమ శిష్యులను సిద్ధపరచు నియమములలో ప్రేమ గలిగి యుండవలెను. దీనివలన మీరు పుత్రులను కనినందులకును, శిష్యులను సంపాదించినందులకును సార్థకత గలవారగుదురు. లోకమును క్షేమములోనికి తెచ్చిన వారగుదురు. ఇట్టి సద్బుద్ధి, దూరదృష్టి, సహనశక్తియు, ధీరత్వము గలుగునప్పుడే మన దేశమును దుఃఖసాగరమునుండి యుద్ధరింప గలుగుదుము.

మరియు విషయ సౌఖ్యములపై నాధారపడి స్త్రీ పురుషులు పరస్పరము ప్రేమించుట నీచమైన మృగప్రేమయే యగును. మృగప్రేమలన్నియు దేహముతో సంబంధించినవే. ఇట్టి ప్రేమస్వభావము గలవారు మృగావస్థ నుండి యొక మెట్టయిన పైకి వెళ్ళనివారుగా నుందురు. మరియు దేహాత్మ బుద్ధినుండి ఒక యడుగైన నున్నతస్థితికి ప్రవేశింపనివారని తెలిసికొన వలయును. వీరింకను గమ్యస్థానము చేరవలసియుండిన దేహమును, ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని దాటి ప్రత్యగాత్మలోనికి ప్రవేశించ వలయును. అట్టి సాక్షిచైతన్యమగు ప్రత్యగాత్మలో నిలకడ గలిగి యచ్చట నుంచి పరమాత్మను దర్శింపవలయును. అప్పుడుమాత్రమే జన్మ సాఫల్యము గలుగును. అనగా ప్రత్యగాత్మ పరమాత్మల యేకత్వము గనుగొనవలయును. అప్పుడు మాత్రమే యనర్గళ దైవసుఖము గల్గును.



# కర్మ రహస్యము

**అద్వైతాయ హ్యాఖండాయ దేశికాయ పరాత్మనే ।**
**అఖండానంద బోధాయ గురవే బ్రహ్మణే నమః ॥**

ఓ సత్యస్వరూపుడవైన సర్వేశ్వరా! నీకు నమస్కారము. ఓ ధర్మస్వరూపుడవైన జగదీశ్వరా! నీకు నమస్కారము. జ్ఞానస్వరూపుడవై సర్వ చరాచర ప్రాణి కోట్లయందును, నాయందును వెల్గుచుండెడు చిన్మయాకారైకమూర్తీ! మీకు నమస్కారము.

సత్యాత్ములగు సోదరమానవులారా! ధర్మాత్ములగు జ్ఞానైకస్వరూపులారా! ఈ ప్రకరణము కర్మయొక్క రహస్యమును దెలుపునది. కనుక దీనికి "కర్మరహస్య"మనుపేరు పెట్టబడినది. ఇక్కాలమున బహుజనములున్ను స్వకర్మ అనగా స్వధర్మదూరులుగనే గన్పడుచున్నారు. ఎవరో కొద్దిమంది మాత్రమే కర్మరహస్య మెరింగి ధర్మదూరులుగాక వర్తించుచున్నారు. అట్టి వారు ధర్మదేవతలవలె నిత్యసుఖస్వరూపులై యుండుటయేగాక దేవతలవలె వారిని అందరును పూజించుచున్నారు. కర్మరహస్యము తెలియక ధర్మ దూరులై వర్తించువారు దుఃఖితులై కన్పట్టుచున్నారు. అంతియేగాక వారిని జూచి ఇతర జనులు గూడ కర్మధర్మముల యుచ్చభావమునుండి జారిపడుచున్నారు. అంతేగాక యధార్థమగు కర్మధర్మముల రహస్యముతెలియక జనులు భ్రమలో పడిపోవుచున్నారు. ఇచ్చట ముఖ్యముగ ప్రతిపాదింపదలంచిన విషయము బ్రహ్మనిష్ఠులను గురించి మాత్రమేగాని, కర్మకాండమును గురించిగాని, కర్మ కాండ నిరతులగు గృహస్థులను గురించిగాని చెప్పుట లేదు. దీనివల్ల వీరిని కర్మ ధర్మములనుండి తొలగింపబడిన వారని తలంపనక్కర లేదు. కర్మధర్మముల ఫలము అందరికిన్ని ఒకే విధముగ గల్గుచునే యుండును. కర్మకాండములో నుండి బ్రహ్మవిచారము చేయువారికిన్ని, గృహస్థాశ్రమాది నాల్గు ఆశ్రమములలో నుండి బ్రహ్మనిష్ఠ చేయువారికిన్ని ఇది సంబంధించి యుండును.



అయితే కర్మధర్మములు గృహస్థులకేగాని సన్న్యాసులకున్ను జ్ఞానులకున్ను లేవని కొందరు తలంచవచ్చును. దీనిలోఁగల నిగూఢ రహస్యము..

తెలియక పోవుటయే అట్టి భ్రమకు కారణమగుచున్నది. యతులకును, జ్ఞానులకున్ను, గృహస్థాశ్రమ సంబంధ ధర్మకర్మలు లేవనవచ్చునేగాని పరమ పావనమగు యతిధర్మమున్ను, అత్యంతపుణ్యమగు జ్ఞానియొక్క ధర్మమున్ను లేదనిభావము గాదు. ఇదియే దీనిలోగల కీలకము. అట్లు గానిచో యతిధర్మమున్ను, జ్ఞానియొక్క లక్షణమున్ను శాస్త్రము విధించి యుండదు. ఇట్టి ధర్మసూక్ష్మమును తెలియుటకొరకే యీ ప్రకరణము ప్రారంభింపబడినది. కావున అట్టి ధర్మము వెనుక చెప్పబడును.

సాధారణముగా చాలమంది యేదో యొక గురువాక్యమును గ్రహించిన మరల నతనికి కర్మముగాని, ధర్మముగాని, వానియొక్క ఫలములగు పుణ్యములుగాని, పాపములుగాని లేవని తలంచి దుష్కర్మములలో నిర్భయులుగా తిరుగుచున్నారు. నిర్విషయస్థితి నొంది, పుణ్యాపాపకర్మములు నశించి, బ్రహ్మసాక్షాత్కారము గల్గిన యాత్మజ్ఞానికి కర్మ ధర్మములతో సంబంధము లేదని ఒక విధముగా శాస్త్రము చెప్పియున్నను అట్టి బ్రహ్మైక్య స్వరూపుడైన జ్ఞాని యొక్క లక్షణముగూడ అలాటి గ్రంథములలో నిరూపించకపోలేదు.

ముఖ్యముగా దైవాత్మజ్ఞానము పూర్ణముగ గల్గిన యోగికి ద్వంద్వాతీతావస్థ గల్గియుండవలయును. అనగా రుచి యరుచులు, సుఖదుఃఖములు, శీతోష్ణములు, స్తుతినిందలు, శత్రుమిత్రులు, స్వపరములు, దృగ్దృశ్యములు, ధ్యాతృధ్యేయములు, హేయాహేయములు, స్త్రీపురుషులు, విషామృతములు, దేహదేహులు మొదలైన సర్వద్వంద్వములు లేనివారికి మాత్రమే అది చెల్లును గాని, వీనిలో దేనియందుగాని భేదముగలవారికి చెప్పినదికాదు. ఇట్టి విషయములో నిప్పుడు పుణ్యాపాపములు లేవని చెప్పువారు వారి వారి యంతరాత్మలో లోతుగ దిగి యోచించుకొనిన తనయొక్కస్థితి యెంతవరకుండునోయని వారే గ్రహించుకొనగలరు. ఇట్టి విషయమై శుకబ్రహ్మర్షి చెప్పిన వాక్యము చూడుడు.

**భేదాభేదౌ సపది గళితౌ పుణ్యపాపే విశీర్ణే**
**మాయా మోహౌ క్షయముపగతౌ నష్టసందేహ వృత్తిః ।**

**శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్య తత్త్వావబోధం**
**నిస్త్రైగుణ్యే పథి విచరతాం కో విధిః కో నిషేధః ॥**

భేదాభేదములు వదలిపోయినవాడును, పుణ్యాపాపములు జీర్ణించి పోయినవాడును, మాయయు మాయాసంబధ మోహమున్ను క్షయము నొందినవాడును, సమస్త సందేహములు నివృత్తి యైనవాడును, శబ్దము నతిక్ర మించినవాడును, సత్వరజస్తమో గుణములనెడు త్రిగుణములు లేనివాడును, పరతత్త్వమగు పరబ్రహ్మజ్ఞానము గలవాడును, గుణత్రయాతీతమగు నిర్గుణ పరబ్రహ్మమందు సదా విహరించువాడు నగు యోగిమాత్రమే విధినిషేధము లను అతిక్రమింపవచ్చును.

అనగా అట్టి మహాత్మునికి ద్వంద్వము గనుపింపదు. ఇదిన్ని బోధక మార్గములో చేరిన మహాఋషులకు సంబంధించినది గాదు. వారు అట్టి స్థితి గలవారైనను, లోకసంరక్షణలో తలంపు గలవారగుటచే ధర్మమార్గములోనే ప్రవర్తింతురు. అది లేని అవధూతవృత్తిలో నుండువారికే యీవిధి చెల్లును. అట్లుగాక జనులకు జ్ఞానము బోధించుచు ఇంద్రియ సౌఖ్యములను విడిచిపెట్ట శక్తిలేనివారు కర్మధర్మముల నతిక్రమించుట యన్యాయము. వీరు స్వరూప జ్ఞానములో జాగ్రత్త గల్గి ప్రపంచకార్యములలో సుషుప్తి గలవారై యుందురు. కావున నిట్టి యధికారము గల్గినవారే ఆలాగున నుండవలయును. ఈ మహా త్ముని కర్మలన్నియు నశించిపోయినవి. ఈయన తైలము నశించిన దీపము వలె దృశ్యవృత్తి లేనివాడై యుండును. కుమ్మరి కుండలు చేయునప్పుడు త్రిప్పుచుండెడు చక్రమేలాగున ఘట నిర్మాణకార్యము పూర్తియైన తర్వాత గూడ కొంతవరకు తిరిగి నిలిచిపోవుచుండునో, ఆలాగుననే కర్మధర్మము లున్ను, వాసనలున్ను, మనస్సున్ను పరిపక్వదశ నొంది బ్రహ్మీభూతుడైన మహా జ్ఞానికిమాత్రము నివృత్తి గల్గియుండును. వీరు లోకాతీతులు. వీరికి నుపదేశ క్రమముగూడ లేదు.

ఇట్టి జ్ఞానము గల్గి ఉపదేష్టలై యుండు బోధకులు అనగా ఆత్మ జ్ఞానులు ధర్మము నతిక్రమించుటకు వీలులేదు. వారు తమకొరకేర్పడిన వారు

కారు. లోకము కొరకేర్పడిన వారే. కనుక ధర్మనిరతులై యుండవలయును. ఇదే కర్మముయొక్కయు, ధర్మముయొక్కయు పరమరహస్యము. అట్లు చేయక వర్తించువారు ఆత్మవంచకులే యగుదురు.

**అన్యథా సంతమాత్మానం యోఽన్యథా ప్రతిపద్యతే ।**
**కిం తేన న కృతం పాపం చోరేణాత్మాపహారిణా ॥**

సత్పురుషులు ఏ ధర్మమును ఆచరించుచున్నారో దానికి విరుద్ధముగా ఆచరించువానిని, తాను చెప్పునదొకటి చేయునది మరియొకటి గలవానిని ఆత్మవంచకుడనందగును. ఇతనికి ఆత్మద్రోహి యనికూడ పేరు గలదు. అట్టి వాడు చేయని పాపము గలదా? అనగా సమస్త పాపములు చేయువాడని భావము. ఇక నీ విషయమై భర్తృహరి చెప్పినది చూడుడు.

**నమస్యామో దేవాన్నను హతవిధేస్తేఽపి వశగాః**
**విధిర్వంద్యః సోఽపి ప్రతినియత కర్మైకఫలదః ।**
**ఫలం కర్మాయత్తం కి మమరగణైః కిం చ విధినా**
**సమస్తత్కర్మభ్యో విధిరపి న యేభ్యః ప్రభవతి ॥**

దేవతలకు నమస్కరించుచున్నాను. అయినను వారు సైతము కాలమునకు లోబడిన దైవమునకు అధీనులు సుమా! కాబట్టి దైవము కొని యాడదగినది. కాని ఆ దైవము సయితము నిర్ణయింపబడిన కర్మముయొక్క ముఖ్యమైన ఫలము నిచ్చునది. ఫలము కర్మకు అధీనమైనది. కావున దేవతా సమూహములతో నేమి? దైవముతో సహా పనియేమి? కాబట్టి యే కర్మము లపై దైవము సైతము చాలదో ఆ కర్మములకు నమస్కారము. అనగా దైవము గూడ కర్మననుసరించియే ఫలము నిచ్చుచుండునని భావము. ఈ శ్లోక మందు గల విధిశబ్దమునకు చతుర్ముఖబ్రహ్మ యని అర్థము గ్రహించవలెను. అంతే గాని పరబ్రహ్మవాచకమగు పరమాత్మ గాదు.

**బ్రహ్మా యేన కులాలవన్నియమితో బ్రహ్మాండభాండోదరే**
**విష్ణుర్యేన దశావతార గహనే క్షిప్తో మహాసంకటే ।**

**రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం సేవతే**
**సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే ॥**

బ్రహ్మ దేనిచేత బ్రహ్మాండమధ్యమున కుండలు చేయుటలో కుమ్మరి వలె వస్తు నిర్మాణకర్మయందు నియోగింపబడెనో, దేనిచేత విష్ణువు పదియవ తారము లెత్తుట యను కష్టమునకు బాల్పడెనో, రుద్రుడు దేనిచేత పుఱ్ఱెను పాత్రగా గొని బిచ్చగాడై తిరిగెనో, దేనిచేత సూర్యుడు ఆకాశమున సర్వదా తిరుగుచుండెనో అట్టికర్మకు నమస్కారము. ఈ త్రిమూర్తులుగూడ కర్మము నకు వశపడి యుండువారని శాస్త్రము చెప్పుచుండగా నింద్రియపరవశులై నట్టి సామాన్యజనులా కర్మ రహితులని చెప్పుటకెట్లు అర్హులు? కనుక నీ క్రింది విధముగా కర్మశుద్ధికొరకు ప్రయ త్నించి నిర్మలులు గావలయును.

**యా సాధూంశ్చ ఖలాన్ కరోతి విదుషో మూర్ఖాన్ హితాన్ ద్వేషిణః**
**ప్రత్యక్షం కురుతే పరోక్షమమృతం హాలాహలం తత్ క్షణాత్**
**తామారాధయ సత్క్రియాం భగవతీం భోక్తుం ఫలం వాఞ్ఛితం**
**హే సాధో వ్యసనైర్గుణేషు విపులేష్వాస్థాం వృథా మాకృథాః ॥**

ఓయి బుద్ధిశాలీ, నీవు కోరిన కోర్కెలను బొందదలచితివేని, అనగా ఉత్తమగతి పొందగోర్కె గలవాడవేని దుర్జనులను సజ్జనులుగను, మూర్ఖుని విద్వాంసునిగను, శత్రువులను మిత్రులుగను, ఇంద్రియాగోచరమును గోచరిం చుదానిగాను, విషము నమృతముగను చేయజాలిన సత్కర్మము నారాధిం పుము. అనగా ధర్మమార్గములో నుండి పుణ్యకర్మముల చేయుచుండుము. ఇతర విషయములకై పాటుపడకుము.

ఇప్పుడు సర్వజనులకున్ను, సర్వమతములకున్ను దైవతములగు బ్రహ్మ విష్ణు శివాది త్రిమూర్తులుగూడ కర్మకు వశపడిన వారలై యుండగా నరులను గురించి మరల చెప్పవలయునా? సమస్త వేద వేదాంత యోగ జ్ఞానాది శాస్త్రము లన్నియు నీ త్రిమూర్తులే దేవతలకున్ను, ఋషులకున్ను, యోగులకున్ను, సిద్ధులకున్ను ఉపదేశించినట్లు శాస్త్రములలో గనుపించు

చున్నది. ఇక నీ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల నతిక్రమించియుండు పరతత్త్వ మగు పరబ్రహ్మనుండియే యీ త్రిమూర్తు లుద్భవించినట్లు చెప్పెడి కొన్ని శాస్త్రములు గలవు. అయితే అట్టి వాక్యమును శైవవైష్ణవాది మతస్థ లంగీకరిం పరు. వారిలో ఆ పరతత్త్వమగు పరబ్రహ్మమే శివుడని శైవులున్ను, విష్ణుడని వైష్ణవులున్ను చెప్పుదురు. ఈ శివవిష్ణుమూర్తులే యితర దేవతల నుద్భవింప జేసిన వారని వారు తలంచి యున్నారు. ఇట్టి యభిప్రాయము గలవారలే ప్రపంచములో గల జనసంఖ్యలో అధిక సంఖ్యాకులుగా నున్నారు. ఇదే ప్రకా రము క్రైస్తవ మహమ్మదీయ మతస్థులుకూడ తలంచుచున్నారు. ఆర్య బ్రాహ్మ మతస్థులున్ను అట్లే తలంచుచున్నారు. వారు ఇట్టి పరతత్త్వమునే పరమేశ్వరు డనియు, పరబ్రహ్మమనియు, సర్వేశ్వరుడనియు తలంపు గల్గియున్నారు. ఆ మహాపురుషుని నుండియే వేద మేర్పడి యున్నదనియు తలంతురు.

అయితే ఆ దివ్యపురుషుడు శైవవైష్ణవులు చెప్పేలాగున అవతారము లెత్తుటగాని, కర్మలచే బంధము నొందుటగాని యుండదని పలుకుదురు. అద్వైతమతస్థులు మాత్రము ఆ పరతత్త్వమే పరబ్రహ్మమనియు, పరమాత్మ యనియు నమ్మకము గల్గియున్నారు. అయితే శైవ, వైష్ణవులు చెప్పెడు శ్రీ శివ, శ్రీ విష్ణుమూర్తులు గూడ అట్టి బ్రహ్మములో గలవారలే. వారిలోను, అందరి లోను ఆ పరబ్రహ్మము అంతరాత్మయై యున్నదనియు, నీ త్రిమూర్తులకు గూడ వారు గ్రహించుచుండు దివ్యశరీరాదులకు గూడను కాలాంతరమున విలయము గలదనియు, ఇవి వారు లోకరక్షణకొఱకు భక్తుల ప్రార్థనలచే వారిపై వాత్సల్యము గలవారై యెత్తిన దివ్యశరీరములేగాని మరియొక్కటి కాదనియు తెలుపుదురు.

అయితే ఆ మూర్తులు మనుష్యుల శరీరాదులవంటివి గావనియు, వారికి ప్రకృతి వశపడియుండుననియు, మానవులు ప్రకృతికి వశపడినవారనియు, వారి జ్ఞానమున కావరణము లేదనియు, మనుజుల జ్ఞానము ఆవరణముతో గూడినదనియు, వారు సర్వశక్తులనియు, సర్వజ్ఞులనియు, సర్వవ్యాపకుల నియు, సృష్టిస్థితిలయములకు కర్తలనియు, ప్రకృతివిముక్తు లనియు బలుకు

దురు. మనుజుల శరీరము పంచభూతాత్మకమనియు, వీరి జ్ఞానము ఆవరణము గల్గి యుండుననియు వీరు కించిద్జ్ఞులనియు, మితశక్తిగల వారనియు, ఏకదేశీయులనియు, సృష్టి, స్థితి, లయములకు శక్తి లేనివారనియు, ప్రకృతిచే బంధింపబడిన వారనియు వచింతురు. అయితే భక్తి, జ్ఞాన, వైరాగ్య, యోగాది సాధనలచే ప్రకృతినుండి విముక్తి గల్గి నిత్యచిన్మయజ్ఞానమూర్తులై దైవప్రాప్తిని గలుగచేసుకొనవచ్చుననియు నుపదేశింతురు. అప్పుడు జీవులు ముక్తులై పరమాత్మజ్ఞానముగలవారలై శాశ్వతసుఖమగు మోక్షమును బొందుదురని తెల్పుచుందురు. అయితే యిట్టి విషయము మనయొక్క ప్రస్తుతకార్యమునకు సంబంధించినది కాదు. కనుక దానిని విడిచి మనయొక్క కార్యములోనికి ప్రవేశింతము.

మనవిషయము ఎట్టివారికైన కర్మ యలంఘనీయమని మాత్రము తెలుపుటయే యగును. సాక్షాత్ వైకుంఠవాసియగు శ్రీమన్నారాయణమూర్తి కర్మవశముచేతనే శ్రీరామాద్యవతారములెత్తి యరణ్యావాసములో కష్టపడెనని యోగవాసిష్ఠము చెప్పినది చూడుడు.

## (వైరాగ్య ప్రకరణమ్)

**శాపవ్యాజవశాదేవ రామవేషధరో హరిః ।**
**ఆహృతాజ్ఞానసంపన్నః కించిజ్ఞో౽సావభూత్ప్రభుః ॥**

శాపవ్యాజవశముచే శ్రీ విష్ణువు శ్రీరామవేషము ధరించి భూలోకములో నవతరించెను. అప్పుడు స్వీకరించిన అజ్ఞానము గలవాడై గలవాడై కించిద్జ్ఞుడగు మానవునివలె ఆయెను.

రాజోవాచ :-

**చిదానందస్వరూపే హి రామే చైతన్య విగ్రహే ।**
**శాపస్య కారణం బ్రూహి కః శప్తా చేతి మే వద ॥**

రాజు పలుకుచున్నాడు :-

చైతన్య స్వరూపియై, సచ్చిదానంద విగ్రహుడగు రామచంద్రమూర్తికి శాపము గల్గుటకు కారణమేమి? ఎవరు శపించిరి? ఇవి విశదముగ తెలియ గోరుచున్నాను.

వాల్మీకి రువాచ :-

**సనత్కుమారో నిష్కామో హ్యావసద్బ్రహ్మ సద్మని ।**
**వైకుంఠా దాగతో విష్ణుస్త్రైలోక్యాధిపతిః ప్రభుః ॥**

**బ్రహ్మణాపూజిత స్తత్ర సత్యలోకనివాసిభిః ।**
**వినా కుమారం తం దృష్ట్వా హ్యువాచ ప్రభురీశ్వరః ॥**

**సనత్కుమార స్తబ్ధో ఽసి నిష్కామో గర్వచేష్టయా ।**
**అతస్త్వం భవ కామార్తః శరజన్మేతి నామతః ॥**

**తేనాపి శాపితో విష్ణుః సర్వజ్ఞత్వం తవాస్తి యత్ ।**
**కించిత్కాలం హి తత్త్యక్త్వా త్వమజ్ఞానీ భవిష్యసి ॥**

వాల్మీకి పలుకుచున్నాడు : -

కామరహితుడైన సనత్కుమారుడు బ్రహ్మసభలో నుండగా త్రైలోకాధిపతియగు శ్రీ విష్ణుభగవానుడు శ్రీ వైకుంఠము నుండి అచ్చటికి విజయము చేసెను. అప్పుడు ఆ సభలో నుండిన సర్వదేవతలున్ను, ఋషులున్ను లేచి శ్రీమన్నారాయణుని నమస్కరించి పూజించిరి. సనత్కుమార ఋషిమాత్రము నిశ్చేష్టుడై కూర్చుండెనేగాని యేమియు చేయలేదు. దీనిని చూచిన శ్రీవైకుంఠ వాసియగు భగవంతుడిట్లు చెప్పెను. "ఓ సనత్కుమారా! నీవు నిష్కామివను గర్వముతో స్తబ్ధుడవైయున్నావు. దీనివల్ల గర్వివైయున్నావు. కావున నీవు కించిత్‌జ్ఞుడవై నరజన్మ అనగా కార్తికేయస్వామిగా భూలోకమున పుట్టుదువు గాక"యని శపించెను. అప్పుడు సనత్కుమారుడు విష్ణుభగవానుని "నీవు సర్వజ్ఞుడనను గర్వము గలవాడవై నిష్కారణముగ నన్ను శపించితివి. కావున నీవున్ను కించిత్‌జ్ఞుడవై కొంతకాలము భూలోకములో మానవుడవై జన్మమెత్త

గలవు''అని శపించెను. ఇది యొక కారణము. మరియు,

**భృగుర్భార్యాం హతాం దృష్ట్వోత్యువాచ క్రోధమూర్ఛితః ।**
**విష్ణో తవాపి భార్యయా వియోగో హి భవిష్యతి ॥**

**వృందయా శాపితో విష్ణుశ్ఛలం యత్త్వయా కృతమ్ ।**
**అతస్త్వం స్త్రీవియోగం తు వచనాన్మమ యాస్యసి ॥**

**భార్యా హి దేవదత్తస్య పయోష్ణీ తీరసంస్థితా ।**
**నృసింహ వేషధృగ్విష్ణుం దృష్ట్వా పంచత్వమాగతా ॥**

**తేన శప్తో హి నృహరిర్దుఃఖార్తః స్త్రీవియోగతః ।**
**తవాపి భార్యయా సార్థం వియోగో హి భవిష్యతి ॥**

మరల భృగు శాపమొకటి. తన భార్యను వధించిన కారణముచే, "ఓ విష్ణుమూర్తీ! నీవున్ను భార్యా వియోగముచే మానవవేషధారివై తపింతువుగాక'' అని గలదు. మరియు, వృందశాప మొకటి గలదు. ఇది పద్మపురాణములో గల కార్తిక మాహాత్మ్యమున గనందగును. కపటవేషధారివై, మాయనుపన్ని వృందను పదచ్యుతను చేసినందుచే, నీలాగున శపించెను.. "నీవు కించిత్ జ్ఞుడవై మానవ దేహము ధరించి అరణ్యములో భార్యా వియోగము గల్గి దుఃఖితుడ వగుదువు గాక'' అని శపించెను. మరియు, దేవదత్తుడను బ్రాహ్మణుని భార్య పయోష్ణీతీరమున నుండగా విష్ణుభగవానుడు నృసింహావతార వేషముతో సంచరించుచుండ జూచి భయపడి ఆమె మృతి నొందెను. అందువల్ల దేవశర్మ యను పేరుగల ఋషి "నీవు ఆత్మజ్ఞానము మరుగుపడిన వాడవై మానవ జన్మమెత్తి దండకారణ్యములో భార్యావియోగము గల్గి విలపింతువుగాక'' యని శపించెను.

**భృగుణైవం కుమారేణ శాపితో దేవశర్మణా ।**
**వృందయా శాపితో విష్ణు స్తేన మానుష్యతాం గతః ॥**

**ఏతత్తే కథితం సర్వం శాపవ్యాజస్య కారణమ్ ।**
**ఇదానీం వచ్మి తత్పూర్వం సావధానమతిః శృణు ॥**

ఈ ప్రకారముగా భృగువుచేతను, సనత్కుమారునిచేతను, దేవశర్మ చేతను, వృందచేతను శపించబడిన కారణముచే శ్రీ విష్ణుభగవానుడు మనుష్య జన్మ మెత్తెను. దానివల్ల స్వరూపజ్ఞాన మావరణముగల్గి అరణ్యాదులలో సీతాదేవి వియోగముచే సంకట మనుభవించెను. భగవానుడు సర్వజ్ఞుడయ్యు, సర్వశక్తుడయ్యు, ఋషుల యొక్క వాక్యములను సంరక్షించు నిమిత్తమై స్వమాయచే వ్యాజరూపముగా శ్రీరామావతారమున అట్టి కార్యములన్నియు చేయడమైనదేగాని మరియొకటి గాదు. ఇదియే శాపమునకు కారణము. ఇది భక్తవత్సలుడైన భగవంతునియొక్క లీల యని జనులు గ్రహింతురుగాక! ఇచ్చట మనము గ్రహించవలసిన దేమనగా అట్టి భగవానుడుగూడ కర్మమునకు బద్ధుడై యుండగా అల్పజ్ఞులగు సాధారణ జనుల విషయము మరల చెప్పవలయునా?

అదే రీతిగా నీశ్వరుండు బ్రహ్మహత్యాదోషముచే బాధింపబడినవాడై బ్రహ్మకపాలమును చేతిలో నెత్తుకొని బిక్షమెత్తెను. అట్టి బ్రహ్మహత్యాదోషమునకు కారణము -

**ఉపేక్షా నోచేత్కిం న హరసి భవద్ధ్యాన విముఖాం**
**దురాశాభూయిష్ఠాం విధిలిపి మశక్తో యది భవాన్ ।**
**శిరస్తద్వైధాత్రం న నఖలు సువృత్తం పశుపతే**
**కథం వా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్ ॥**

సర్వలోకాధీశ్వరా! (నన్ను రక్షించుట యందు నీ కుపేక్ష కలదేమో)అట్లుపేక్షలేనిచో, దుష్టములైన తలంపులతో నిండినదియు, నీ ధ్యానమునుండి పరాఙ్ముఖమైనదియునగు నా ముఖము మీది బ్రహ్మవ్రాతను ఎందుకు తుడిచివేయవు? నీవశక్తుడవేని, గోటితో త్రుంచ నలవిగాని ఆ మిక్కిలి దృఢమైన బ్రహ్మసంబంధమైన ఐదవ శిరస్సు ప్రయత్న మక్కరలేకుండ చేతిగోటి కొన చేతనే ఎట్లు త్రుంచివేయబడినది? ఈ కథ పురాణ ప్రసిద్ధము. ఇచ్చట సంగ్రహముగ చెప్పబడును.

"పంచాననం పద్మజం"అన్నట్లు విధాతయగు బ్రహ్మదేవునికి పూర్వము ఐదు శిరస్సులుండెను. అసత్యము చెప్పుటచే ఒక శిరస్సు నీశ్వరుండు త్రుంచి పారవేసెను. అప్పటి నుండి చతుర్ముఖ బ్రహ్మయని వ్యవహారము వచ్చినది. ఆ కారణము వలననే బ్రహ్మదేవునికి ప్రపంచములో క్షేత్రములుగాని, పూజలు గాని లేవు. అట్లు గానిచో శివకేశవాదులకు ఇన్ని దేవాలయములును, పూజలు నుండగా ప్రాణికోట్ల సృష్టికర్తయగు బ్రహ్మకు దేవాలయముగాని, పూజగాని లేకపోవునా? జనులారా! అసత్యవాక్కుయొక్క మహిమ తెలిసికొన్నారా! ఒక అబద్ధపుమాటచే గదా బ్రహ్మదేవుని కిట్టి దురవస్థ గలిగినది!

బ్రహ్మను గురించి ఒక నోమైన లేకపోయినది గదా? కారణమేమన- ఒక కాలమున విష్ణుమూర్తికిన్ని, బ్రహ్మదేవునికిన్ని ఒక వాదము గలిగెను. సృష్టి కర్త యగుటచే తానే గొప్పవాడనని బ్రహ్మయు, పోషణకర్త యగుటచే తానే గొప్పయని శ్రీమన్నారాయణమూర్తియు వాదులాడుకొనిరట! దీనిని పరిష్క రించుటకు నీశ్వరుని దగ్గరకు ఉభయులు వెళ్ళినట్లున్ను, అప్పుడు పరమ శివుండు మీలో ఒకడు నాయొక్క శిరస్సును, మరియొకడు నాయొక్క పాదమున్ను చూచి ముందుగా నెవరు వత్తురో వారే గొప్పవారని వచించెను. బ్రహ్మ హంసవాహనారూఢుడై భూర్భువస్స్వర్గాది ఊర్ధ్వలోకములు దాటి మరల అనేక వర్షములు ఊర్ధ్వగామియై పోయినను, పరమేశ్వరుని శిరముయొక్క అంత్యము గనబడక పోయెను. ఒకటే జ్యోతిర్మయము అనంతముగ వ్యాపించి ప్రకాశించుచున్నట్లు బ్రహ్మదేవునికి గనుపించెను.

అప్పటికి తనయొక్క వాహనమైన హంస యీకలు అంతయు రాలి పోయి పైకెగయుటకు శక్తిలేక విషమస్థితిలో నుండగా, ఊర్ధ్వలోకము నుండి ఒక గోవున్ను ఒక మొగలిపువ్వును దిగివచ్చుచు కనుపించెను. వానిని బ్రహ్మ విచారంచగా ఆ గోవు ఈశ్వరశిరస్సులో క్షీరాభిషేకము చేయుచున్నదనియు, కేతకీ పుష్పము పరమేశ్వర మస్తకములో పూజింపబడినదనియు, అవి ఈశ్వర శిరస్సు నుండి భూలోకమునకు వచ్చుటలో ఇప్పటికనేక యుగములు జరిగి పోయినవనియు తెలిపెను. అవి బ్రహ్మదేవునితో మీరు వెళ్ళజాలరని చెప్పిన

ట్లున్ను,బ్రహ్మగూడ సాధ్యము కాదని తలంచి గోవుతోను, కేతకీపుష్పముతోను తనకు సహాయముగా సాక్ష్యము చెప్పవలెనని కోరినట్టున్ను, అవి అంగీకరించిన ట్లున్ను చరిత్రలో గలదు. బ్రహ్మ, విష్ణువు ఎంతదూరము వెళ్ళినను పాదమస్తక ములు కనుపించుటకు సాధ్యము కాదని తలంపుగల్గి భూలోకమునకు వచ్చిన చాలునని తలంచిన ఆ క్షణముననే భూలోకములో వచ్చి చేరునట్లు పరమేశ్వర వరము గలదు.

ఇది మనములో నిడుకొని విధాత గోవుతో “నీవు భూలోకము వచ్చిచేరు టకు నికయెన్నియెూ వేల సంవత్సరములు పట్టును. అయితే నా కొరకు నీవు సాక్ష్యము చెప్పినచో, నిన్ను ఈ క్షణములోనే భూలోకమునకు తీసుకవెళ్ళెదను. లేనిచో జలతృణాదులు దొరకక చాల కష్టపడుదు”వని చెప్పినందుచే ఆవు అబద్ధమున కంగీకరించెను. అప్పుడు బ్రహ్మదేవుడు ఈశ్వర శిరస్సు కనుపిం చుట సాధ్యము గాదనియు, భూలోకమునకు వచ్చిన చాలుననియుతలంచెను. వెంటనే గోవున్ను, కేతకీపుష్పమున్ను, బ్రహ్మయు, భూలోకములో వచ్చి చేరిరి. ఈ లోపల విష్ణుమూర్తి శ్వేతవరాహావతారము గ్రహించి అతల వితల తలాతల మహాతల పాతాళాది లోకములన్నియు దాటిపోయినను, పరమ శివునియొక్క పాదము జ్వాలాకృతి అనంతముగ గానుపించుట చేతను, వరాహభగవానుని ముఖము కోరలు శిథిలమై పోవుట చేతను, సాధ్యము గాదని తలంచి భూలోక మునకు వచ్చిన చాలునని అనుకొనిన వెంటనే బ్రహ్మదేవుడు వచ్చుటకు ముందుగా నీశ్వరసన్నిధిలో సౌఖ్యముగా వచ్చి కూర్చుండియుండెను.

అప్పుడు పరమ శివుడు ఉభయుల విచారింప, విష్ణు భగవానుడు అనేక విధములుగా ఈశ్వరుని స్తోత్రము చేసి, ‘మీయొక్క పాదమనంతము, మీయొక్క మహిమ గనుగొన నెవరికిని సాధ్యము గాదు. నా శక్తికొలది ప్రయ త్నించితిని. అంతము గనుపించదు. ఓప్రభో! నీవు సాక్షాత్పరంజ్యోతి స్వరూపు’ డవని స్తవము చేసి కూర్చుండెను. మరల బ్రహ్మదేవుని విచారించగా తాను హంసవాహనమెక్కి సత్యలోకాదులన్నియు దాటి వెళ్ళి శివుని శిరస్సును చూచితినని చెప్పెను. దీనికి సాక్షులెవరైన గలరా? యని పరమశివుండు

ప్రశ్నింపగా, ఈ గోవున్ను, కేతకీపుష్పమున్ను సాక్షులని పలికెను. అప్పుడు సత్యస్వరూపుడైన, పరంజ్యోతి స్వరూపుడైన, దివ్యజ్ఞానస్వరూపుడైన ఈశ్వరుడు కోపించి బ్రహ్మదేవుని అయిదు ముఖములలో నేశిరస్సు అసత్యము చెప్పెనో దానిని గోటితో త్రుంచిపారవేసెను. అంతేగాక నీకు ప్రపంచములో ఆలయముగాని, పూజలుగాని, నోములుగాని లేక పోవుగాక యని శపించెను.

గోవు విషయములో ఒక ఆశ్చర్యము గలదు. అదేమన వాక్కుతో అసత్య సాక్ష్యముచెప్పినపుడు దానియొక్క తోక లేనట్లు ఊగించెను. అప్పుడు, గోవుయొక్క ముఖముతో మలము తినులాగుననున్ను, జ్యేష్ఠాదేవి నివాసముండేలాగునను శాపమిచ్చెను. గోవుయొక్క పృష్ఠభాగమునకున్ను, పుచ్ఛమునకున్ను సమస్త పూజలు గలిగేలాగునను లక్ష్మీదేవికి వాసముగ నుండేలాగునను అనుగ్రహించెను. కనుకనే యిప్పుడు గోపూజ చేయునప్పుడు పుచ్ఛమునకు పృష్ఠమునకు చేయుదురు. గోదాన కాలమున సమస్త పూజలు తోకకే చేయుచుందురు. ఆ తోకను పట్టియే దానమిచ్చుచుందురు. తోకక్రింది గుదోపస్థముల సదా తగిలియుండుట చేతనే గోమయ గోమూత్రముల కంత మహిమ గలిగినది. బ్రహ్మహత్యాది పంచమహాపాతకములను గూడ రహిత మొనర్చెడు శక్తి పంచగవ్య ప్రాశనమునకు గల్గుటకున్ను యిదే కారణము. ఎటువంటి పాపమునకైన ప్రాయశ్చిత్తము పంచగవ్యము చేతనే జరుగుచుండును. ఏలాటి పాపము విమోచనము గల్గుటకున్ను, ఈ గోమూత్ర గోమయములే ఉపయోగపరచుచున్నారు. యజ్ఞ, పూజా, హెూమాది సమస్త కార్యములు చేయుటకు ముందుగా గోమూత్ర గోమయములచే ఆ స్థలము శుద్ధపరచవలెననియు, అట్లయిన నేలాంటి దోషము లేదనియు చెప్పుట కిదే కారణము.

జనులారా! ఆహా! సత్యము యొక్క మహిమయు, అసత్యము యొక్క కష్టమున్ను తెలిసికొంటిరా! ఇప్పుడు గూడ ప్రాతః కాలములోగాని, ప్రయాణ కాలములోగాని ఒకవేళ ముందుగా గోముఖమును చూచినను వెంటనే పృష్ఠ భాగము దర్శించవలెనని చెప్పుట కిదే కారణము. దానియొక్క మలమూత్రముల కింత మాహాత్మ్యము గల్గుటకు ఈశ్వర వరమే హేతువైనది. మరల

కేతకీ పుష్పమును నీవు ఈశ్వర సంబంధమైన యే పూజలకున్ను ఉపయోగము లేక వేశ్యాస్త్రీల కేశములలో నుందువుగాక యని శపించెను. కాబట్టియే మొగిలిపువ్వు ఈశ్వర సంబంధములైన యే పూజలకున్ను ఉపయోగపడక పోవుట. దీనిని సాధారణముగా విషయలోలతగల స్త్రీలు శిరస్సులలో ధరింతురు. ఈ శాపముచేతనే మొగిలిచెట్టు పెద్దకాయ కాచినను, దేనికిని ఉపయోగపడకపోవుట. కోతికైన అది ఉపయోగపడదు. ఇది గ్రహించిన సత్యము యొక్క మాహాత్మ్యమున్ను, అసత్యముయొక్క ఘోరతమమగు క్రూరత్వమున్ను తెలిసి కొనవచ్చును. శ్రీ విష్ణుభగవానులు సత్యము చెప్పినందుచేత సమస్త యజ్ఞముల కధిపతియై యుండేలాగునను, సమస్త యజ్ఞములు విష్ణుమూర్తికి సమర్పించు లాగునను నీశ్వరుడు వరము ననుగ్రహించెను. కనుకనే యజ్ఞాదిక్రతువులన్నియు శ్రీమహావిష్ణువున కర్పింప బడుచున్నవి. మరియు, శ్రీవిష్ణుక్షేత్రములో నైవేద్య, ప్రసాద, పుష్ప, తీర్థాదులన్నియు పావనములై, పాపహరములై, సర్వకాలములలోను ఉపయోగపరచుట జరుగుచున్నది. ఓహో! సత్యము యొక్క మహిమ యేమని చెప్పవచ్చును? ముముక్షువులకు దీనికన్న సత్యాసత్యముల విషయమై గ్రహించవలసిన విషయమేమి గలదు?

ఇది శైవ పురాణములో విస్తారముగ గనందగును. పరమ శివుండు జ్యోతిర్మయాకార రూపము ధరించిన రోజుననే అరుణాచలములో ఉత్సవము జరుగుచుండును. ఈ దినమందే కార్తిక దీపము జరుగును. కనుకనే కార్తిక మాసమంతయు జనులు నోములు నోచి దీపములు పెట్టి దీపదర్శనమైన తర్వాత భోజనము చేయుదురు. ఆలాగున చేయువారికి గొప్ప పుణ్యమున్ను, ఈశ్వరానుగ్రహమున్ను గల్గును. ఈ కార్తిక దీపమునకే జ్వాలాతోరణమని పేరు గల్గినది. తిరువణ్ణామలైలో జ్యోతి వెలిగించుట, ఉత్సవమున్ను ఇందువల్లనే ఏర్పడినవి. బ్రహ్మదేవునియొక్క శిరస్సు ద్రుంచివేసినందుచే ఆ బ్రహ్మహత్యా దోషము ఈశ్వరుని గూడ బాధించెను. ఓహో! కర్మ మహిమ యెటువంటిదో ఊహింప నలవి కాదు.

**స్వయం మహేశః శ్వశురో నగేశః సఖా ధనేశస్తనయో గణేశః ।**

**తథాఽపి భిక్షాటనమేవ శంభోర్భలీయసీ కేవల మీశ్వరేచ్ఛా ॥**

ఓహో! బ్రహ్మ పుఱ్ఱెను పట్టుకొని బ్రహ్మహత్యా దోష బాధితుడై, ఆ పరమ శివుండు భిక్షమెత్తవలసి వచ్చెను! ఈశ్వరు డెటువంటి వాడనగా:- స్వయముగానే మహేశ్వరుడు. ఈశ్వరు లందరికంటె నెక్కువైనవాడు. అంతేగాక తనయొక్క మామ హిమవంతుడు, మిత్రుడు కుచేలుడు, తన కుమారుడు గణేశుడు, సహధర్మచారిణి సాక్షాత్ పరాశక్తి స్వరూపిణియగు శ్రీ పార్వతీదేవి. తనయొక్క నివాసస్థలమన్ననో సువర్ణగిరియగు మేరుస్థానము. తనయొక్క భక్తులలో అగ్రగణ్యుడు బ్రహ్మనిష్ఠాగరిష్ఠుడగు నందికేశ్వరుడు. ఓహో? వీటి నన్నిటిని గలిగియుండియు కర్మమును తప్పించి పోజాలక శంకరుడు భిక్షమెత్తి తిరుగుచున్నాడు. చూచితిరా! ఆహా కర్మము యొక్క బల మపారమైనది.

**అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ ।**
**కృతకర్మక్షయో నాస్తి కల్పకోటిశతైరపి ॥**

తాను చేసిన కర్మ నశించునది కాదు. కోటి కల్పములకైనను అది పుణ్యముగాని, పాపముగాని యనుభవించియే తీరవలెను. తప్పించి పోవ తరము గాదు.

**త్రిభిర్వర్షైస్త్రిభిర్మాసైస్త్రిభిః పక్షైస్త్రిభిర్దినైః ।**
**అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే ॥**

మనుజుడు చేయు పుణ్య కర్మమైనను, పాపకర్మమైనను ఇహములో ననుభవించియే తీరవలెను. అది మూడువర్షములలోగాని, మూడు మాసముల లోగాని, మూడు పక్షములలోగాని, మూడు దినములలోగాని తప్పక కల్గు చుండును.

ఇప్పుడు మనము బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడనెడు త్రిమూర్తులను గురించి గ్రహించితిమి. వీరు సైతము కర్మ పాశములచే బద్ధులైనట్లు కను గొంటిమి. తాను నడచునప్పుడు, తనయొక్క నీడను నిలబెట్టి పోవుట కేలా

గున శక్తి లేదో ఆలాగున కర్మమును వదలి పోవ వీలుగాదు. అది ఎచ్చట పోయినను, వానిని వెంబడించుచుండును. నీడను నిలబెట్టి పోవశక్తిగల వారుండిన వారిని మాత్రము కర్మము బంధించుటలేదని తెలిసికొనవలెను. యోగశక్తి గల సిద్ధపురుషులకు నీడలేక సంచరింపశక్తి గలదు. ఇది వర్తమానయుగములో వడలూరు శ్రీరామలింగస్వామి వారిని దర్శించిన వారికందఱికిని తెలిసిన విషయమే. మఱియు, తానే విత్తనము పెట్టునో, అదియేగదా వృక్షమై ఫలము నిచ్చును. తాను పెట్టు బీజమును ఇంకొక వృక్షముగ చేసి మఱియొక ఫలమును పండింప శక్తిగల్గినచో తనకు కర్మము లేదని చెప్పుట నిజమగును. ఇది వేమన యోగీశ్వరుడు చేసి చూపినట్లు వారు జీవిత చరిత్రములో గలదు. అతడు వెఱ్ఱిపుచ్చ విత్తనము పెట్టి బంగారు రవ్వలు పండించినట్లు లోక విదితము. ఈలాగున నేమితిన్నను దోషములేదని చెప్పువారు విషపదార్థమును భుజించి కూడ బాధను పొందనిచో అది నమ్మవచ్చును. జాలంధర యోగీశ్వరునకు కాలకూటవిషము, పాషాణము మొదలగు అతిఘోరవిషముల నిచ్చినట్లున్ను, అతనినవి ఏమియు చేయనట్లును మైనావతీ చరిత్రములో గలదు. ఆలాగున, కరిగిన కంచును పంచదారను గలిపి క్షీరమువలె శ్రీసదానందయోగీశ్వరులు పానముచేసినట్లు వారి చరిత్రములో గనుపించుచున్నది.

ఇక నీలాటి చరిత్ర లెన్నియో గలవు. బుద్ధి గ్రహణము గల వారికి ఇంతే చాలును గదా! కర్మయొక్క రహస్యము తెలిసికొనుట యతి గహనమని, అనగా ఎట్టి సూక్ష్మబుద్ధిగలవారికైనను ప్రయాసమని శ్రీకృష్ణభగవానులు గీతయందుపదేశించియున్నారు. గహనశబ్దమునకు ఆకాశమును తెలిసికొనుట యెంత దుస్సాధ్యమో, ఆలాగున కర్మయొక్క రహస్యమునందు బుద్ధిప్రవేశించుట గూడ అంత దుస్తరమని భావము. కనుకనే భగవానుడు "గహనా కర్మణో గతిః" అని వచించిరి.

**కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।**
**తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥**

కర్మయెట్టిది? అకర్మ యెట్టిది? అను నీకర్మాకర్మ విషయమున మహా కవులు గూడ మోహమును జెందియున్నారు. ఏ కర్మాకర్మముల రహస్యమును తెలిసికొని (అనుష్ఠించి) సంసార సంబంధమగు బంధమునుండి విడుదలను పొందగలవో (ముక్తుడవు కాగలవో) అకర్మాకర్మములను నీతో లెస్సగా చెప్పెదను. కర్మయొక్కయు, అకర్మయొక్కయు అనగా చేయదగినదేది తగనిదేది అను విషయములో పూర్వీకులగు గ్రంథకర్తలే సందేహము గల్గి యున్నారు. అట్టి సంశయమే యిప్పటికిన్ని ముముక్షువులను బాధించుచున్నది.

**కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః ।**
**అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥**

చేయందగిన కర్మయొక్క యథార్థ రూపమున్ను తెలియదగినది. చేయకూడదని వేదములచే నిషేధింపబడిన కర్మముల యొక్క యథార్థ స్వరూపమున్ను తెలియదగినది. అనగా న్యాయాధిపతి తీర్పు చేయుటకు వాది ప్రతివాదుల యొక్క సత్యాసత్యముల నరయవలసి యుండునుగదా! కనుక ముముక్షువులు, ముక్తులు ఏలాగున నుండవలెనో, యెట్లాచరించవలెనో అట్టి విషయము సద్గురు సచ్ఛాస్త్రములచే తెలియదగినదని భావము. కర్మరహితావస్థ యొక్క పరమార్థతత్వమున్ను తెలిసికొనందగినది. ఏలయనగా (కర్మము, వికర్మము, అకర్మము అని మూడు విదములైన) కర్మము యొక్క నిజమైన స్వరూపము సామాన్యజనులకు తెలియ నశక్యమైనది. ఈ కర్మత్రయమున నిషిద్ధకర్మము, విహితకర్మము, నిష్కామకర్మము, పుణ్యాకర్మము, మిశ్రమకర్మము లీనములై యున్నవి. అంతేగాక భగవానులు కర్మరహితావస్థయగు జ్ఞానియొక్క నిలుకడను గూడ తెలిపియున్నారు.

ఈ విషయము ఎట్టి మేధాసంపత్తి గలవారికిన్ని స్వబుద్ధిచే కనుగొనవలవి కాదు. ఏలన బుద్ధి సంస్కారము ననుసరించి ఒక్కొక్కనికిన్ని బుద్ధి వేరు వేరుగానే గల్గియుండును. అట్టి బుద్ధికి హితమగునది సరిగా నుండునని బోధ గలిగెడు ఒక మహిమాతిశయశక్తి మాయయందు గలదు. మఱియు శాస్త్ర

ముల పరిశోధించినను ఇట్టి లోపమే గానుపించుచున్నది. శాస్త్రమున కనంత ముఖములు. అన్నిటికిన్ని శాస్త్రములు గలవు. అచ్చటను మనకు నిలుకడ కలుగదు. ఇక చేయవలసిన దొకటి మిగిలియున్నది. అదేమనగా బ్రహ్మనిష్ఠు లగు మహాత్ముల మార్గమును కనుగొనుట. వీరుకూడ వివిధ ప్రకారముల నున్నారు. అచ్చటను నిలుకడ కనుపించుట లేదు.

ఇక చేయవలసినదేమి? ఈ మూడింటియొక్క సమన్వయమే. ధర్మ ప్రవర్తనమున్ను, సత్య నిష్ఠయున్ను, యింద్రియజయమున్ను గలుగని వారు మహాత్ములు కాజాలరు. అట్టి మహనీయులను మాత్రము మనము ఆదర్శప్రా యులనుగా గ్రహించుటయు, సత్య ధర్మశాంత కరుణాదులు గల్గియుండవలె నని చెప్పెడు పవిత్ర ఉపనిషద్వాక్యముల నంగీకరించుటయు, బుద్ధికి సాక్షిగా నుండు ధ్యేయాకారమగు ఆత్మను గైకొనుటయు నొనర్చుకొనిన మనసమస్య పరిష్కారమగును. ఈపైజెప్పిన మూడింటికి భిన్నమైన అవస్థగలవారి నెవరును మహాత్ములనిగాని, జ్ఞానులనిగాని అంగీకరించుట లేదు. ఇట్టి విచక్షణాస్వ భావము లేనందుచేతనే బ్రహ్మనిష్ఠకు (ఆత్మజ్ఞానమునకు) నింత పతనము గలిగినది. ఇట్టి దివ్యజ్ఞానముయొక్క క్షయముతో సహా, ప్రాణము గోల్పోయిన దేహము పతన మొందునట్లు దేశముగూడ దుఃఖసాగరములో క్రుంగిపోయెను.

వీటి కన్నిటికిన్ని రెండు దోషములు గలవు. 1. బ్రహ్మనిష్ఠులకు సరియైన తపస్సున్ను, యోగ బలమున్ను. దానికి సంబంధించిన యింద్రియ నిగ్రహ, శమ దమాది గుణములున్ను లేకపోవుట మొదటి కారణము.

2. ఎవరో కొందఱు కొంతవఱకైన బ్రహ్మవిచారముగాని, తపస్సుగాని, యోగనిష్ఠగాని చేయువారుండిన, నిశ్శేషవాసనారహితావస్థ గలుగుటకు ముందుగా నింద్రియములకు వృత్తులు స్వభావములనియు, అంతఃకరణ ములో గల విషయాదులు రహితముగాక పోయినను సాక్షియగు ఆత్మకవి యంటవనియు, ప్రపంచములో గల సర్వమాలిన్యములతోను సంబంధము గల్గియున్నను, సూర్యుని అవి అటంకయున్నట్లు, ఆత్మకున్ను ఆ విషయము

లచే లోపము గలుగదనియు బోధించెడు శుష్కవేదాంతము మహాపరాధమగు ద్వితీయకారణ మగుచున్నది.

ఈ రెండు సంగతులను నిర్దుష్టములుగ నొనర్చిన మాత్రమే స్వరాజ్య స్వారాజ్య రథము గమ్యస్థానము చేరగల్గును. అంతవఱకు, శిథిలములైన చక్రములతోగూడిన రథగమన మెటువంటిదో, వీరియొక్క మోక్షస్థాన గమనమటు వంటిదే. కావున ప్రస్తుతము లోకములో గల ముముక్షువులందఱున్ను తమ యొక్క ఆచరణ, అనుష్ఠానములనెడు రథచక్రములను చక్కబఱచుటకొఱకు చూచుచుండవలెను. అట్లైన మాత్రే వారి గమనము సుగమ మగును. లేనిచో దుర్గమమే యగును. వేదాంత శాస్త్రములన్నియు నిశ్శేషవాసనా రాహిత్యము గల్గువఱకున్ను, నిర్వృతి సిద్ధించువఱకున్ను, కరతలామలకమువలె బ్రహ్మ సాక్షాత్కార జ్ఞానము గల్గువఱకున్ను నిష్ఠను నిలుపక అనుష్ఠించుచుండవలె ననియే చెప్పుచున్నవి.

**అహంబ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।**
**శమాదిసహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥**

మహావాక్యార్థ విచార జనితమగు బ్రహ్మసాక్షాత్కారమను ఆకారము గల అపరోక్ష జ్ఞానము ఎప్పటికి దృఢత్వము గలదగునో, అంతపర్యంతము ముముక్షువైనవాడు శమ, దమ, ఉపరతి, తితీక్షా, సమాధాన, శ్రద్ధలను శమాది గుణములతో గూడినవాడై, వేదాంతార్థ శ్రవణమనన నిదిధ్యాసముల నభ్యసింపవలెనని శ్రీశంకరాచార్యులు చెప్పిరి. వేదాంతశాస్త్రము లన్నియు నీలాగే చెప్పు చున్నవి. పూర్వాచార్యులగు ఋషులున్ను ఈలాగే పలికిరి. అందుచేతనే గదా పూర్వకాలపు బ్రహ్మనిష్ఠులు లోకోన్నత పదవి నలంకరింపగల్గిరి. ఎప్పటి నుండి శుష్కవేదాంతము ప్రారంభించడమైనదో అప్పటి నుండి బ్రహ్మనిష్ఠులకు పతనము గలిగెను. ఆయుర్వేదము పూర్ణారోగ్యము గల్గువఱకు పథ్యౌషధము లతో గూడియుండవలెనని చెప్పునేగాని, రోగములు, బాధలు దేహములవే గాని, ఆత్మవి గావని చెప్పునా! అట్లైన రోగి గతి యేమి? దుర్గతియే, కానిచో,

సద్గతియే గల్గును. మంచి వాచానైపుణ్యము గలవాడు అనేక రుచికరములగు పదార్థములపేర్లను, పద్యములను, శ్లోకములను వల్లించి ప్రసంగించిన శ్రోతల కున్ను తనకున్ను, ఎంతతృప్తియు, రుచియుగల్గునో, పూర్ణజ్ఞానము గలుగని వారి యొక్కయు, సంపూర్ణవాసనాక్షయ వృత్తిరహితత్వములు చెందనివారి యొక్కయు వాక్యములును అంతే ఫలము గలుగజేయును.

**యావద్ జ్ఞానోదయస్తావ ద్వేదాంతార్థం నిరూపయేత్ ।**
**నాస్తి జ్ఞానాత్పరం కించిత్పాపకాంతారదాహకమ్ ॥**

సాధకునకు జ్ఞానముదయమగునంతవరకు శమదమాదులతో గూడి వేదాంతార్థమగు బ్రహ్మము నిరంతర ధ్యానము చేయందగినది. అట్టి ఆత్మజ్ఞానము గల్గిన పాపమగు నజ్ఞానారణ్యమును కాల్చివేయుటకు దానికి సదృశమైనది మఱియొకటి లేదు అని సూత సంహిత.

**గురుశుశ్రూషయా నిత్యమాత్మజ్ఞానం సమభ్యసేత్ ।**
**స్నానం శౌచమభిధ్యానం సత్యం చానృతవర్జనమ్ ।**
**లోభమోహపరిత్యాగం దంభదర్పాదివర్జనమ్ ॥**

బ్రహ్మ విచారము చేయువాడు గురుశుశ్రూషానిరతుడై, నిత్యమున్ను ఆత్మజ్ఞానాభ్యాసము చేయవలెను. స్నానము, శౌచము, ధ్యానము, సత్యవర్త నము, అసత్యవర్జనము, లోభమోహముల పరిత్యాగముగల్గి దంభము, దర్పము మొదలైన దురభిమానములన్నిటిని విడిచి సద్గురుసన్నిధిలో వేదాంత విచారణ చేయుచుండవలెనని శాస్త్రముద్ఘోషించుచున్నది. మఱియు బ్రహ్మనిష్ఠుల పతనమునకు రెండు కారణములు గలవు. అయితే, అట్టి దోషము శ్రేష్ఠ పురు షులలో నుండదు. సామాన్య గురువులలో రహస్యముగ నట్టి మహాదోషము గానుపించుచున్నది. అదేమన ప్రారబ్ధము అనుభవించియే తీరవలయు ననియు, ఏదైన విషయ వాసన గల్గిన అది యీ జన్మములోనే అనుభవించి నివృత్తి చేసి కొనవలెననియు, నిలుకడగా మిగిలియుండిన పునర్జన్మము గలుగుననియు బోధించుట వారి ప్రథమాపరాధ మగుచున్నది.

మరల అంతఃకరణములో దృశ్యవృత్తులుగాని, విషయ సంకల్పములు గాని యుండుటచే బ్రహ్మ సాక్షాత్కారజ్ఞానమునకున్ను, నిర్విషయధ్యానమున కున్ను అడ్డు గల్గుచుండుననియు, అవి అనుభవించి రహితమైన నిరంతరము మేఘము వదలిన సూర్యునివలె ఆత్మజ్ఞానబోధము గల్గియుం డుననియు, గ్రహణకాలములో రాహుముఖమునుండి విముక్తినొందిన పూర్ణిమ చంద్రునివలె ధ్యానము నిరంతరము గల్గియుండుననియు చెప్పెడు మోసపు వాక్యము ద్వితీయ దారుణ మహాపరాధ మగుచున్నది.

పుణ్యాత్ములగు సోదరీమణులారా! సోదరోత్తములారా! ఇవి చెడు హృద యము గల దుష్ట ఊహలేగాని మంచివికావు. ప్రపంచ విషయము, విషయవృత్తి గల్గియుండు వఱకు మనుజుడు శుద్ధాత్ముడు కాజాలడు. అనుష్ఠానపరుడుగా నుండవచ్చును. అట్టి ప్రపంచ వృత్తులు, విషయ వాసనలు నశించిన తర్వాత మాత్రమే ఆత్మజ్ఞానము కల్గును.

మబ్బులోనున్నప్పుడు, రాహుగ్రస్తులగు కాలములోను సూర్యచంద్రులు ప్రకాశింపరుగదా! మఱియు, చెడు వ్యాధి దేనివల్ల గల్గెనో, ఆ కార్యమే మరల చేయుచుండిన రోగము వృద్ధి నొందునేగాని శమింపదు గదా! విషయ వాసన అణుమాత్రముగ నుండినను విషయభోగములచే నది అంతకంతకు పెరుగు చుండునేగాని శమింపదు. అగ్నియొక్క మిణుగురుండినను, దానికి కట్టెలు దొఱకునప్పుడేలాగున ప్రజ్వలించి వనమంతయు కాల్చివేయునో, విషయా గ్నియు నాలాగున భోగముచే ప్రజ్వలించి హృదయములో గల శాంతి, దయ, కరుణ, భక్తి, విరక్తి మొదలగు కల్పవృక్షముల వంటి సుగుణములను గూడ కాల్చి వేయును. కారుచిచ్చు రగులునప్పుడు, ఫలపుష్పలతాదులతో గూడిన యెంతో మంచి వృక్షములును, తీగలును గూడ తగులబడుట లేదా? దీనినొక్క దానినే మీరు చక్కగా గ్రహించిన ధన్యాత్ములు కాగలరు. ఋషుల యొక్క పేర్లను మీరు భరత ఖండములో ప్రతిష్ఠింపగలరు. మఱియు శరీరములో కొంచమైన విషదోషముండిన అది విరిగెడు మందు తినిన బాగుపడునేగాని, విషమునే మరల అనుభవించుచుండిన నెట్లు సౌఖ్యమును

బొందగల్గును?

**తావన్మహత్త్వం పాండిత్యం కులీనత్వం వివేకితా ।**
**యావజ్జ్వలతి నాంగేషు హతః పంచేషుపావకః ॥**

ఎంతకాలమువఱకు దేహములో పాడైన మన్మథాగ్ని-ప్రజ్వలింపలేదో, అంతవఱకే బ్రహ్మనిష్ఠునియొక్క మహిమయు (కీర్తియు), పాండిత్యము, శ్రేష్ఠత్వము, వివేక జ్ఞానము నిలుచును. అనేక చిత్ర విచిత్రములతో మహా సుందరముగా బహుశోభాయమానముగా, మంచి మంచి పనితనముగల కొయ్యలతోను, అనేక వర్ణములతోను, ప్రకాశమానమైయుండు ఇల్లు అగ్నిచే దహించబడు వఱకు మాత్రమేగదా నిలుచును. తర్వాత అంతయు భస్మమై పోవును గదా! ఆలాగున ఏ స్త్రీగాని, పురుషుడుగాని బ్రహ్మనిష్ఠులై యున్నను, వారియొక్క శరీరేంద్రియములలో నెంతవఱకు మన్మథాగ్ని రగులదో, అంత వఱకే వారి మహిమలు, జ్ఞానములు, పూజ్యతలు, యశస్సులు, యోగములు, తపస్సులు, భక్తి వైరాగ్యములు, విజ్ఞానములన్నియు ప్రకాశించుచుండును అని భర్తృహరి యుపదేశించెను.

**విహితస్యాననుష్ఠానా న్నిషిద్ధస్య చ సేవనాత్ ।**
**అనిగ్రహాచ్చేంద్రియాణాం నరః పతన మృచ్ఛతి ॥**

మనుజుడు విహితమైన అనుష్ఠానము చేయక పోవుటచేతను, నిషిద్ధమైన యాచరణలో ప్రవేశించుట చేతను, ఇంద్రియముల యొక్క నియమము చక్కగా జేయక పోవుటచేతను పతనమును బొందుచున్నాడు.

**ఇంధనేన యథా వహ్ని ర్వర్ధతే ఉత్తరోత్తరమ్ ।**
**భోగేన కామరూపాగ్ని ర్వర్ధతే ఉత్తరోత్తరమ్ ॥**

సమిధలచేత అగ్ని హోత్రుడేలాగున ఉత్తరోత్తరము వృద్ధినొందుచుండునో, ఆలాగున విషయభోగములచేత అంతకంతకు కామరూపమగు అగ్ని ప్రజ్వలించునే గాని శమింపదు.

మరల అంతఃకరణములో దృశ్యవృత్తులుగాని, విషయ సంకల్పములు గాని యుండుటచే బ్రహ్మ సాక్షాత్కారజ్ఞానమునకున్ను, నిర్విషయధ్యానమున కున్ను అడ్డు గల్గుచుండుననియు, అవి అనుభవించి రహితమైన నిరంతరము మేఘము వదలిన సూర్యునివలె ఆత్మజ్ఞానబోధము గల్గియుం డుననియు, గ్రహణకాలములో రాహుముఖమునుండి విముక్తినొందిన పూర్ణిమ చంద్రునివలె ధ్యానము నిరంతరము గల్గియుండుననియు చెప్పెడు మోసపు వాక్యము ద్వితీయ దారుణ మహాపరాధ మగుచున్నది.

పుణ్యాత్ములగు సోదరీమణులారా! సోదరోత్తములారా! ఇవి చెడు హృద యము గల దుష్ట ఊహలేగాని మంచివికావు. ప్రపంచ విషయము, విషయవృత్తి గల్గియుండు వఱకు మనుజుడు శుద్ధాత్ముడు కాజాలడు. అనుష్ఠానపరుడుగా నుండవచ్చును. అట్టి ప్రపంచ వృత్తులు, విషయ వాసనలు నశించిన తర్వాత మాత్రమే ఆత్మజ్ఞానము కల్గును.

మబ్బులోనున్నప్పుడు, రాహుగ్రస్తులగు కాలములోను సూర్యచంద్రులు ప్రకాశింపరుగదా! మఱియు, చెడు వ్యాధి దేనివల్ల గల్గెనో, ఆ కార్యమే మరల చేయుచుండిన రోగము వృద్ధి నొందునేగాని శమింపదు గదా! విషయ వాసన అణుమాత్రముగ నుండినను విషయభోగములచే నది అంతకంతకు పెరుగు చుండునేగాని శమింపదు. అగ్నియొక్క మిణుగురుండినను, దానికి కట్టెలు దొఱకునప్పుడేలాగున ప్రజ్వలించి వనమంతయు కాల్చివేయునో, విషయా గ్నియు నాలాగున భోగముచే ప్రజ్వలించి హృదయములో గల శాంతి, దయ, కరుణ, భక్తి, విరక్తి మొదలగు కల్పవృక్షముల వంటి సుగుణములను గూడ కాల్చి వేయును. కారుచిచ్చు రగులునప్పుడు, ఫలపుష్పలతాదులతో గూడిన యెంతో మంచి వృక్షములును, తీగలును గూడ తగులబడుట లేదా? దీనినొక్క దానినే మీరు చక్కగా గ్రహించిన ధన్యాత్ములు కాగలరు. ఋషుల యొక్క పేర్లను మీరు భరత ఖండములో ప్రతిష్ఠింపగలరు. మఱియు శరీరములో కొంచమైన విషదోషముండిన అది విరిగెడు మందు తినిన బాగుపడునేగాని, విషమునే మరల అనుభవించుచుండిన నెట్లు సౌఖ్యమును

అదులదు ప్రాణము లదలిన
గదలదు సర్వాంగకములు గదలుచు నుండన్
వదలదు బిగువులు వదలిన
తుది లేదీ తృష్ణ దీని ద్రుంపగవలయున్.

వెయ్యేండ్లయ్యెను నీతో
గ్రయ్యంబడి యున్నవాడ గామసుఖములం
గ్రుయ్యదొకయించు కైన
న్డయ్యదు కొనలిడియె దృష్ణ నవపద్మముఖీ !

ముదిసెను దంతావళియును
ముదిసెను గేశములు దనువు ముదిసెం దనకున్
ముదియనివి రెండు సిక్కెను
బ్రదికెడి తీపియును విషయపక్షస్పృహయున్.

కడలే దాశాలతకుం
గడజూడగ గానరాదు కడ గనిరేనిన్
గడుముదమున సంసారము
గడ గందురు తత్త్వవిదులు గమలదళాక్షీ !

మండన హాటక పశువే
దండాశ్వవధూదుకూల ధాన్యాదులు పె
క్కుండియు నాశాపాశము
ఖండింపగ లేవు మఱియు గడమయ చుమ్మీ !

కామోపభోగసుఖములు
వేమారును బురుషు డనుభవించుచు నున్నం
గామంబు శాంతి బొందదు
ధూమధ్వజాడాజ్యవృష్టి ద్రుంగుడు పడునే.

**అక్క తల్లి చెల్లె లాత్మజ యెక్కిన**
**పానుపెక్క జనదు పద్మనయన**
**పరమ యోగికైన బలిమిని నింద్రియ**
**గ్రామ మధికపీడ గలుగజేయు.**

**వెంగలి విత్తై తిరుగుచు**
**గంగార్రై చెడక ముక్తి గాంక్షించు నతం**
**డంగనలతోడ విడువని**
**సంగడములు వదలవలయు జలజాతముఖీ.**

ఆదిగావున నేడు మొదలు తృష్ణాఖండనంబుచేసి నిర్విషయుండనై యహంకారంబు విడిచి మృగంబులంగలసి వనంబున సంచరించెద. పర బ్రహ్మంబునందు చిత్తంబు సేర్చెద. బ్రహ్మనిష్ఠ మనుష్యులకు నాశానివారిణి యగుటంజేసి యేనందు దత్పరుండనై యాహారనిద్రాది యోగంబులం బరిహరించెద. నాత్మవిదుండై సంసార నాశంబుల దలంచినవాడే విద్వాం సుడని పలికి పూరుని యౌవనం బతనికిచ్చి ముదిమి దానుగైకొని విగతలో భుండై వనంబునకు నరిగె.

** ** ** ** **

**మిక్కిలి సుజ్ఞానంబున**
**జిక్కగ దెగనడిచి వైరి షడ్వర్గంబున్**
**రెక్కలు వచ్చిన విహగము**
**గ్రక్కున నీడంబు విడుచు కరుణినుదితుడై.**

**కారుణికోత్తముడగు హరి**
**కారుణ్యము కతన నతడు ఘనుడై గెలిచెం**
**గ్రూరములగు విషయంబుల**
**నూరక గెలువంగ శక్తుడొక్కడు గలడే.**

ఇవి తెలుగు పద్యములగుటచే తాత్పర్యము వ్రాయలేదు.

యయాతి వెయ్యి సంవత్సరములు సమస్త రాజ్య భోగములు ఇష్టాను సారముగ ననుభవించినను, వాని విషయ వాంఛ శమింప లేదు. తనయొక్క యౌవన సుఖము పూర్తిగా అనుభవించుటయేగాక కుమారునియొక్క యౌవనమున్ను తాను గ్రహించి విషయముల ననుభవించినను వానికి కామ శాంతి గాలేదు. అప్పుడు పూర్వపుణ్యముచే అతనికి ఆత్మయందు జ్ఞానము గల్గి వైరాగ్య మవలంబించి రమ్యమగు నేకాంత ప్రదేశమున బ్రహ్మ నిష్ఠ చేయుటకు బుద్ధి గల్గినది. ఇందువల్ల వైరాగ్య మొక్కదానిచేమాత్రము కామాగ్ని చల్లారునేగాని అనుభవించిన శాంతి గలుగనేరదు. యయాతి సార్వభౌముడై సమస్తైశ్వర్యములుగల్గి, అనుభవించినను వానికి శాంతి గలుగ నప్పుడు ఇక సామాన్య జనులను గుఱించి మరల చెప్పవలయునా?

**సర్పిషా కాష్ఠభారేణ వర్ధతేఽగ్ని శిఖా యథా ।**
**ఉపభోగేన కామేన హ్యాశా చోపరి వర్ధతే ॥**

అగ్నిహోత్రుడు కట్టెలచేతను, నెయ్యి చేతను, నేలాగున వృద్ధినొందు చుండునో, ఆలాగున ప్రపంచ భోగముల చేత ఆశ మరల మరల వృద్ధి యగునే గాని శాంతినొందదు. అగ్నిహోత్రుడు శాంతి నొందుటకు సమిధ లున్ను హవిస్సున్ను హోమము చేయకయుండవలయును, అప్పుడు మాత్రమే ఆ యగ్ని స్వయముగ చల్లారిపోవును. ఆలాగున విరక్తినవలంబించి, ఉపరతి స్థితినొంది దైవనిష్ఠలో ప్రవేశించిన మాత్రమే నిర్విషయస్థితి గల్గునే గాని వేఱు మార్గము లేదు. ఇక దేవతలందఱిలోను దేవేంద్రుడు ముఖ్యుడనియు, బ్రహ్మజ్ఞానముకల వాడనియు, శాస్త్రములలో గనుపించుచున్నది. అట్టి బ్రహ్మ వేత్తయు త్రిలోకాధి పతియునగు, దేవేంద్రునకును కర్మము తప్పినది కాదు. చూడుడు - ముని పత్నియు, పతివ్రతయు, తపస్వినియునగు నహల్యను మోహించుటచే గల్గిన యాపత్తు!

**గోదావరీ పుణ్యతటే దక్షిణే గౌతమాస్పదమ్ ।**
**యత్ర శప్తః పురా శక్రో గౌతమేన స్మరాతురః ॥**

**అహల్యా జారదోషేణ సహస్రభగలాంఛనః ।**
**అహల్యాఽపి శిలా భూతా యత్ర శప్తా నరోత్తమ! ॥**

గోదావరీ నదియొక్క దక్షిణపు గట్టున పుణ్యక్షేత్రమగు గౌతమాశ్రమమున్నది. ఆ యాశ్రమమునందు పూర్వము ఇంద్రుడు అహల్యతో జారత్వము చేసినందువల్ల ఆయింద్రునకు దేహమంతయు సహస్రయోనులుగా గలిగియుండేలాగునను, అహల్య రాయియై పోవులాగునను గౌతమ మహాముని వారిని శపించెను.

పుణ్యాత్ములారా! వింటిరా! కొందరు ఉపనిషత్తులలో గల కొన్ని వాక్యములను ఇంద్రుడు చెప్పినట్లు బ్రహ్మజ్ఞానికి కర్మము లేదని తెలుపుటకొఱకు చెప్పుచుందురు. ఇంద్రుని ప్రమాణముగా నిరూపింతురు. ఇంద్రుడు చేసిన అధర్మముయొక్క ఫలితముగా వాని దేహమంతయు సహస్రభగములుగా నేర్పడెను. దీనివల్ల ఇంద్రునికిగూడ కర్మ ఫలము గలుగ లేదని చెప్పుకు మనవారెట్లు సాహసించిరో దురూహ్యముగ నున్నది. ఇంద్రుడు తనకు గల్గిన మహాహేయమగు వికృతా కారమునకు సిగ్గుపడి దేవలోకములకు వెళ్ళక, దేవ గురువగు బృహస్పతిని గూర్చి తపస్సుచేసి బృహస్పతి యనుగ్రహము వల్లను, పశ్చాత్తాపతప్తుడై గౌతమ మహర్షిని వేడుకొనుటవల్లను ఇతరులకు సహస్రనేత్రములుగా కనుపించులాగునను, తనకుమాత్రము యోనులుగా గోచరించులాగునను, శాపమునకు కొంతపరిహారము గలుగజేయించుకొనెను. ఇట్లుండగా నింద్రియ నిగ్రహమేమియో ఎఱుంగని విషయలోలురై యుండు వాచావేదాంతులకా కర్మము లేకపోవుట! పైకథ పద్మ పురాణములో గలదు.

**ధర్మేణ గమన మూర్ధ్వం గమన మధస్తాద్భవత్యధర్మేణ ।**
**జ్ఞానేన చాపవర్గో విపర్యయాదిష్యతే బంధః ॥**

అని సాంఖ్య సూత్రకర్తయగు కపిల మహర్షి నుడివెను.

ధర్మాచరణము వలన జీవుడు ఊర్ధ్వగతిని బొందుచుండును. అధర్మ ప్రవర్తనవల్ల మనుజుడధోగతికిజారిపోవును. దైవజ్ఞానమువల్ల జనులు మోక్షము

పొందుచుందురు. అజ్ఞానములో నుండుటచే మానవులకు బంధమే గల్గును.

**అమృతం చైవ మృత్యుశ్చ ద్వయం దేహే ప్రతిష్ఠితమ్ ।**
**మృషా హి సాధ్యతే మృత్యుః సత్యేన సాధ్యతేఽమృతమ్ ॥**

మానవదేహమందు అమృతమున్ను, విషమున్ను ప్రతిష్ఠితములై యున్నవి. అధర్మ, అసత్యాది ప్రవర్తనలు గలవారు విషప్రాప్తి నొంది మృత్యువునకు బాల్పడుదురు. సత్య, ధర్మనిరతులగువారు అమృతమును బానము చేసిన వారై ముక్తినొందెదరు.

**నహి దుఃఖప్రదం వస్తు సుఖం దాతుం సమర్థ్వతి ।**
**కిం విషం పిబతో జంతోరమృతత్వం ప్రయచ్ఛతి ॥**

దుఃఖమును గలుగజేసెడు అధర్మ ప్రవర్తనము సుఖమును గలుగ జేయదు. అది దుఃఖమునే గలుగజేయును. విషపానము చేయు జంతువులకు అమృత ప్రాప్తి యెట్లు గల్గును? మృత్యుప్రాప్తియే సిద్ధించును.

**న ప్రమాదోఽత్ర కర్తవ్యో విదూషా మోక్ష మిచ్ఛతా ।**
**ప్రమాదే జృంభతే మాయా సూర్యాపాయే తమో యథా ॥**

కావున మోక్షేచ్ఛగల ముముక్షులారా! మీయొక్క వర్తనములో నెప్పటి కిన్ని ప్రమాదము నొందకుడు. అనగా తప్పు కార్యము చేయకుడు. తప్పు కార్యము చేసినచో, సూర్యుడస్తమించినప్పుడు ప్రపంచమేలాగున చీకటిచే గ్రమ్మబడునో, ఆలాగున మీ హృదయములో గల తెలివియు, భక్తియు, విరక్తియు, మాయమై పోయి అజ్ఞానముచే అంతఃకరణ మావరింపబడును.

**అకర్తవ్యం న కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి ।**
**కర్తవ్యమేవ కర్తవ్యమేష ధర్మ స్సనాతనః ॥**

నిర్మలజ్ఞానమును పొందతలంపుగల సోదరులారా! సోదరీమణులారా! మీరెంత గొప్పవారైనను సనాతనమగు దైవధర్మమును విడువరాదు. చేయందగని కార్యమును ప్రాణములు కంఠగతములగు విపత్తుగల్గినను చేయ

రాదు. ఎంత ఆపత్తుగల్గినను, తనయొక్క కర్తవ్యకార్యమును మాత్రమే చేయ వలయును. ఇదియే సనాతన ధర్మమగును. ఇచ్చట సనాతన శబ్దమునకు, ప్రస్తుతము పూర్వాచారపరాయణులు దేహమును గుఱించి చెప్పుచుండు నర్థము కాదు. సనాతనము, శాశ్వతమగు దైవమునుగుఱించి అనగా ఆత్మను గుఱించి, జ్ఞానమును గుఱించి చెప్పెడు పావన వాక్యమని తెలిసికొనవలెను.

**నాన్యో విముక్తయే పంథా ముక్త్వాఽఽశ్రమవిధం స్వకమ్ ।**
**తస్మాత్తదేవ కుర్వీత తుష్టయే పరమాత్మనః ॥**

ఎవరెవరు ఏ యే అనుష్ఠానములతో గూడిన ధర్మముగలవారై యున్నారో, వారి వారికి దానికి సంబంధించిన అనుష్ఠానము తప్ప ముక్తి కొఱకు వేఱు మార్గము లేదు. అందువల్ల పరమాత్మయొక్క ప్రీతి కొఱకున్ను, జ్ఞానముగల్గుట కొఱకున్ను వారి వారి యనుష్ఠానములను తప్పక చేయు చుండవలయును.

**జ్ఞానే మమోదితే భోగాః కిం కుర్వంతీతి యే విదుః ।**
**భోగే సంగం మతేర్భంగం జ్ఞానశైథిల్యమాప్నుయుః ॥**

ఆత్మజ్ఞానులకు నెన్ని విధములగు భోగము లనుభవించినను నేమియు చెరుపు లేదని మూఢవేదాంతులు తెలిసికొనియున్నారు. భోగముయొక్క సంగముచే మతిభంగము గల్గును. అనగా భ్రష్టత్వము జెందును. అంతేగాక ఝుంఝూమారుతముచే కొట్టబడిన మేఘమెట్లు శిథిలమై పోవునో, వీరియొక్క జ్ఞానము కూడ అట్లే విలయము నొందును. మఱియు కర్మ ఫలముయొక్క యనివార్య ప్రాప్తిని గుఱించి శ్రీమద్రామాయణమున చెప్పబడిన శ్రీసీతాదేవి జీవితమును దిలకించిన తెలిసికొనగలరు.

**మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా ।**
**యది సీతా హి దుఃఖార్తా కాలో హి దురతిక్రమః ॥**

ఆ సీతాదేవి యెటువంటి వారనగా, సాక్షాత్ విదేహముక్తుడని బిరుదు గాంచిన జనకమహారాజుయొక్క కూతురు. అయోనిజురాలు, దివ్యదేహము

గల్గినవారేగాని పాంచభౌతిక కాయము గల్గిన వారు కారు, మఱియు, సాక్షాత్ లక్ష్మీదేవి. అంతేగాక శ్రీరామచంద్రుల ధర్మపత్ని. అయోధ్యాభూమండలము నకు పట్టమహిషి. వసిష్ఠ మహర్షియొక్క శిష్యురాలు. దశరథమహారాజు యొక్క కోడలు. ఇవియన్నియుగాక శ్రీలక్ష్మణస్వామికి వదినగారు. కన్నతల్లికన్న ఎక్కువ వెయ్యిరెట్లు వదినగారిపై మాతృభక్తి లక్ష్మణస్వామికి గల్గియున్నది. ఇవియన్నియు నుండియు వనవాసములోను, రావణహరణములోను, లంకా పట్టణమున అశోకవనముననుండు నప్పుడును ఆమెకు గల్గిన దుఃఖములు ఎవరికైన చెప్పనలవియగునా? ఓహో! కర్మము దురతిక్రమము. కనుక అతిక్ర మింప వీలుగానిది.

**వహ్నౌ విశుద్ధా మతిజానకీం తాం**
**జహౌ వనాం తే కిల రామచంద్రః ।**
**సా కిం న శుద్ధా స చ కిం న వేత్తా**
**బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా ॥**

పై జెప్పిన కష్టములన్నియు ననుభవించుటయేగాక, మరల గర్భిణియై యుండు కాలమున మహారణ్యములో విడిచి పెట్టబడెను. లంకలో అగ్ని ప్రవేశము చేసి శుద్ధాత్మురాలని ప్రసిద్ధి కెక్కియున్నను రామచంద్రుడామెను లోకాపవాదముచే వనాంతముననే విడిచి పెట్టెను, ఏమి? సీతాదేవి శుద్ధురాలు కాదా? రాంచంద్రున కీతత్త్వము తెలియదా? ఓహో! కర్మము యొక్క శక్తి యపారమైనది. "బలీయసీ కేవల మీశ్వరేచ్ఛా"-ఈశ్వర సంకల్పమున్నదే అది బలవత్తరమైనది.

ఇక కర్మ పరతంత్రతను గుఱించి చెప్పనక్కరలేదు. ఏమి? శ్రీసీతా దేవి బ్రహ్మజ్ఞానురాలు కాదా? సీతారామాంజనేయసంవాదమున ఆంజనేయు లకమనస్క సాక్షాత్కార జ్ఞానముపదేశించినది యీ మహాతల్లిగదా! ఇట్టి వారిని గూడ కర్మము విడువలేదే! రామచంద్రుడు పట్టాభిషిక్తుడైన తర్వాతగూడ భార్యావియోగ శోకము పొందవలెనని తారయొక్క శాపము గలదు. వాలి

అకారణముగా వధింపబడినందుచే తానేలాగున భర్తృవియోగశోకము నొందు చున్నదో, రామచంద్రుని భార్యగూడ శోక మనుభవించుగాక యని ఆమె శాప మిచ్చెను. అది ఆలాగుననే పరిణమించెను.

మఱియు, ఒక అత్యద్భుతమగు కథను చెప్పెద. అది వినిన విస్మయము గల్గును. మనశ్శాంతి సిద్ధించును. కర్మ శక్తియొక్క మహిమ గోచరించును. అది యేమన - శ్రీ ఆంజనేయస్వాములను గురించిన చరిత్రయే. అంజనా సుతునకు గూడ స్వబోధమున్ను, తనయొక్క బలమున్ను తెలియకుండ నుండేలాగున శాపము కలదు. ఇది ఉత్తర రామాయణమున గనందగును, ఆంజనేయు లెటువంటివారు? అస్ఖలిత బ్రహ్మచర్య వ్రతమును సలిపిన వారు. నవవిధ వ్యాకరణములను సూర్యునిదగ్గఱ పఠించిన వారు. నిర్వికల్పసమాధి నొందిన వారు. అమనస్కసాక్షాత్కారామృతమును గ్రోలిన వారు. శ్రీరామచం ద్రుల యనుగ్రహము బడసిన వారు. శ్రీ సీతాదేవి కరుణకు పాత్రులైనవారు. ఈశ్వరాంశ సంభూతులైన వారు. మహాయోగబలము, జ్ఞాన బలమున్ను గల్గిన వారు.

చిన్న కాలములోనే పరమేశ్వరుని వల్లను, బ్రహ్మదేవునివల్లను, ఇంద్రుని వల్లను, సూర్యుని వల్లను, అగ్నివల్లను, వాయువు వల్లను, వరుణుని వల్లను, వరమును పొందిన వారు. ఇవన్నియు గల్గియు కర్మఫలమగు తనయొక్క శాపమును తప్పించుకొనుటకు శక్తిలేకపోయినది. ఆ శాపమెద్దియన - తన యొక్క బలమును మఱియొకరు చెప్పనిచో స్వయముగ తెలిసికొనజాలక పోవుటయే. కనుకనే సీతాన్వేషణములోగాని, రాక్షస యుద్ధములోగాని, సంజీవి తెచ్చుటలోగాని, సుగ్రీవుడైనను, జాంబవంతుడైనను, సుషేణుడైనను, అంగదు డైనను, మఱియెవరైనను వాని బలమును గూర్చి చెప్పవలసి వచ్చినది. చెప్పి నప్పుడు మాత్రమెట్టి మహాకార్యమైన చేయగల్గును. అప్పుడు మాత్రమే తన యొక్క స్వరూపజ్ఞానమున్ను స్వశక్తియు గోచరించును. ఆ పనియైనచో మరల మఱచి పోవుచుండును. ఆహా! రాహువుచే మహాప్రకాశముగల సూర్యుడు గ్రహింపబడినట్లున్ను, మేఘముచే ప్రచండ భాస్కర ప్రకాశము ఆవృతమైన

ట్లున్ను అట్టి హనుమంతుని దివ్యజ్ఞానము కూడ మరుగు పడిపోయినదే! ఓహో! కర్మయొక్క శక్తియేమని చెప్పవచ్చును.

మఱియు, కర్మ రహస్య విషయమై యింకొక గాథలోనికి ప్రవేశించ వలసియున్నది. అది యేమన - ధర్మరాజాదుల విషయమే, సాక్షాత్ శ్రీమన్నారాయణమూర్తి, మానవ దేహధారియై పాండవులకు ఆత్మప్రియుండై యుండు తరుణమున ధర్మరాజాదులు అరణ్య వాసమున్ను, అజ్ఞానతవాసమున్ను చేసిన విషయము మనకు మఱపురాని కర్మరహస్యము నుపదేశించుచున్నది. యుధిష్ఠిరుడు సాక్షాత్ ధర్మదేవత యొక్క అంశము. భీముడు వాయ్వంశము, అర్జునుడు దేవేంద్రుని యంశము, నకులసహదేవులు అశ్వినీ దేవతల యంశులైయుండియు పండ్రెండు సంవత్సరములు అరణ్యావాసము చేయుటయు, మరల విరాట మహారాజు వద్ద సేవకవృత్తి చేయుటయు, ఈ మొదలైన కష్టములకు బాల్పడినది తలంచిన నెట్టి రాతివంటిహృదయమైన గరుగకపోవునా? దీనికన్న యిక కర్మఫల రహస్య విషయమై మనము గ్రహించ వలసినది మఱియొకటి గలదా? ఎట్టివారైనను ఎంత బలపరాక్రమశాలురైనను, అధర్మముచే మొదలు నఱకబడిన మహావృక్షమువలె నేలగూలుదురు.

దుర్యోధనుని జూడుడు! ఏకచ్ఛత్రాదిపతియై యుండి నూర్గురు సోదరులలో నక్షత్రమండలమున వెల్గుచుండు చంద్రునివలె ప్రకాశించు చుండెడివాడు. బంధువులైన రాజశేఖరు లెందరినో గల్గియుండిన వాడు. శ్రీపరశురాముని యుద్ధములో ఓడించినట్టియు, అఖండ బ్రహ్మచర్య వ్రత మును సలిపినట్టియు, బ్రహ్మజ్ఞానమును గల భీష్మాచార్యుడు సేనాపతియై యుండిన కాలమయ్యు, ధనుర్విద్యానిధియగు శ్రీద్రోణాచార్యులు యుద్ధము నకు సన్నద్ధులైయుండు కాలమున, సూర్యపుత్రుడగు కర్ణుడు సహాయమునకు గని పెట్టియుండు తరుణమున, సర్వైశ్వర్యములతోను, సమస్త విద్యలతోను, చతురంగ బలము సమృద్ధిగగల్గి, లోకము పుష్కలమై ఫలించియుండు కాలమున, ధర్మ దూరు డైనందుచేతను, అధర్మ నిరతుడై నందుచేతను, దుర్యోధనుడు వంశముతో సహ వినాశనము నొందెను గదా! మట్టిపాలై

పోయెను గదా! బలమున్ను, ధనమున్ను, సమస్త ఐశ్వర్యములున్ను, ధర్మమునా ధారపడి యుండువరకే నిలుచును. అవియన్నియు అధర్మములో ప్రవేశించెడు కాలము గల్గునప్పుడు శిశిర ఋతువు ప్రవేశించునప్పుడు వృక్షములలోగల సమస్తపత్రములు పండిరాలునట్లు అధర్మాత్ముని విడిచి వెళ్ళిపోవును.

సరోవరములో జలముండువరకు గదా! హంసపక్షులు అచ్చట నివసించి యుండును! తామరపువ్వులతో శోభించుచుండును. నీరమయి పోయిన వెంటనే అవియన్నియు సరస్సును విడిచి పెట్టి యేలాగున లేచి పోవునో, కమలములు శుష్కించి పోవునో, ఆలాగున నెవరి హృదయములో దయ, సత్యము, ధర్మము ఉండునో, అంతవరకే వాని వద్ద జ్ఞానముగాని, జయముగాని, ధర్మదేవతగాని యుండును. అంతవరకే అతనిని ధర్మదేవత సంరక్షించును. తనయొక్క ధర్మము చెడిన, మొదలు చెడిన వృక్షమేలాగున తనయందుగల ఫల, పల్లవ, పుష్ప, పత్రాదులన్నియు రాలిపోయి జీర్ణించి యుండునో, ఆలాగున వీనియొక్క సుగుణములన్నియు నితనినుండి అంతర్ధానములగును.

ఇక అధర్మ విషయమై మరియొక యుదంతము మనము గ్రహించవలసి యుండును. అది లంకాధీశ్వరుడగు రావణబ్రహ్మకు సంబంధించినదే. దశకంఠుడు వెయ్యి సంవత్సరములు కఠినమైన తపస్సు చేసి బ్రహ్మదేవుని ప్రత్యక్షము చేసుకొని కాలసిన సమస్త వరములను బొందినవాడైనను, ఇంద్రుని జయించిన కుమారుడు గల్గిన వాడైనను, కుంభకర్ణాది తమ్ములుండిన వాడైనను, ప్రహస్తుడు, మారీచుడు మొదలగు మంత్రులుగల్గిన వాడైనను, లంకా పురమునకు సముద్రమే కోటగా గల్గియుండిన వాడైనను అధర్మములో ప్రవేశించి నందుచేతగదా! వంశముతో సహ నశించవలసి వచ్చినది! కైలాసగిరి యందు వెయ్యేండ్లు తపమొనర్చి యీశ్వరుని యనుగ్రహము సంపాదించిన వాడైనను, అష్టదిక్పాలకుల నోడించిన వాడైనను, అధర్మ కాలమున నేమియు చేయజాలక నిస్తేజస్కుడై పోవలసివచ్చినది గదా! ఆహా! అధర్మ ప్రవృత్తియొక్క ఘోరమును చూచితిరా? కర్మయొక్క రహస్యము నెవరు తెలిసికొన గలరో

వారే ధన్యాత్ములు.

**అవ్యుత్పన్నమనా యావత్ భవానజ్ఞాతతత్పదః ।**
**గురుశాస్త్ర ప్రమాణైస్తు నిర్ణీతం తావ దాచర ॥**

ఎంతవరకు ఆత్మతత్వజ్ఞాన మవగాహము గాలేదో మనస్సు శుద్ధమై, దైవ జ్ఞానమును తెలిసికొనలేదో అంతదాకా గురువుల చేతను, వేదాంత శాస్త్రముల చేతను, సత్ప్రమాణములచేతను, స్వప్రత్య బ్రహ్మనిష్ఠ చేతను, తత్త్వస్వరూపమును నిర్ణయపరచు కొనవలెను. అనగా మనోనిర్మలత గల్గి శుద్ధ జ్ఞానోదయము గలుగువరకు శాస్త్రము చెప్పినట్లున్ను, గురువు బోధించి నట్లున్ను అనుష్ఠానము తప్పక గల్గియుండవలెను (సూత సంహిత).

## దశరథుని కర్మఫలానుభవము

**(భాస్కర రామాయణము - అయోధ్యా కాండము)**

ఈకథ సంగ్రహముగా నిచ్చట వ్రాయబడును. దశరథుడు బ్రహ్మ జ్ఞాని యనియే జ్ఞానవాసిష్ఠములో శ్రీవసిష్ఠులు రామచంద్రునికి ఉపదేశించిరి. శ్రీరామచంద్రులు తీర్ద యాత్రానంతరము పుణ్యాశ్రమములను, పుణ్య తీర్థములను, పుణ్యక్షేత్రములను, ఋషులను దర్శించి మనో నిర్మలత గలిగి, గృహస్థాశ్రమము, రాజ్య భారము నిర్వహించ జాలననియు, ఏకాంత వనవాసముచే ఋషుల వలెనే నిర్మల జీవితము గడిపెదననియు శ్రీవసిష్ఠ దశ రథాదులకు తెలుపుచు సంసారములోగల కష్టములను వివరించుచు విషయములచేత గలిగెడు దారుణ సంకటములను చెప్పుచుండు తరుణమున రాములవారితో శ్రీ వసిష్ఠమునీంద్రులు దశరథుడు ఆత్మజ్ఞానము గలిగిన వాడనియు, జ్ఞాన రహస్యము నెరింగిన సంసారములో నుండియే బంధము నొందక ముక్తిసుఖమును అనుభవింప వచ్చుననియు తెలిపెడు వైరాగ్య ప్రకరణమున నీ విషయము విస్తారముగా గనందగును. ఇచ్చట మనకు కావల సినదేమన - దశరథుడు బ్రహ్మజ్ఞానియయ్యు సాక్షాత్ శ్రీమన్నారాయణ మూర్తియే రామచంద్రుడై పుత్రుడుగా నుండియు కర్మమును తప్పించుకొన జాలక పోయెను.

"అని పలికిన దశరథుడును, సుమంత్రుని వీడ్కొలిపి రామచంద్రుని బేర్కొని బహు ప్రకారంబుల శోకింప, కౌసల్యాదేవి యన్నరేంద్రు గనుంగొని-

**మదిలేని శోకంబు మనుజేశ నీవునా**
**యెదుర నటించెద వెరుగనట్లు**
**బహుకాల తపమున బడసిన సుతు రామ**
**చంద్రుని లోకంబు సడికినోర్చి**
**కడుబూన్కి పట్టంబు గట్టెదనని యెల్ల**
**నృపతులు విన నాడి నిజముపోలె**
**నొక మహాసంభ్రమ మొనరించి యటబోయి**
**కైకేయితో గూడి కపటవృత్తి**

**నక్కుమారు బిలిచి యడవుల కనుపగ**
**జాలినట్టి పరమ సాహసునకు**
**నేటి? కరుణ నీకు నెక్కడి పరలోక?**
**మేటి సూనృతంబు? నేటి తగవు?**

**నావుడు నన్నియు గలవే**
**నా వలనం బరుష భాషణము లింకేలా?**
**జీవం బేగతి నిలువదు**
**పోవదు తన కర్మఫలము బొందక తప్పి!**

అది యెట్లంటేనియుం జెప్పెద నాకర్ణింపుము.

**నాపిన్న నాడొకనా డేను నడురేయి**
**సరయూతటంబున జండచాప**
**ధరుడనై కాపుండి దంతావళి క్రోడ**
**భల్లూక మహిషాది బహుమృగంబు**
**లుదకంబు లయ్యేట నొగి ద్రావగా వాని**
**చప్పుడు లక్షించి శబ్దవేధు**

లగు సాయకము లేసి యందంద హింసించు
    నెడ నొక్క మహితాత్ము డేగుదెంచి

కుండ నీరు ముంప ఘుమఘుమ ధ్వని విని
కుంభినినదబుద్ధి గోలదొడగి
కడిమినేయ జిత్తమదలింప వీతెంచె
'హా! నమశ్శివాయ' యను నెలుంగు.

అది విని భీతినొంది వెరగందుచు వెండియు వింటి నొంటినే
నది కడకేగుదెంచి కఠిన ప్రదరాహతి నొచ్చితిం గదే
యిది గడుపాతకం బనక నెవ్వడొకో యిటులేసె నేగతిన్
వెదకెదరింక నన్ను నతివృద్ధులు నంధులు నైన మద్గురుల్.

విపినంబుల ఫలమూలము
లుపవాసము లుండి తినుచు నొగి బితృసేవా
నిపుణత నుండెడివలెనే
యపరాధము జేసినాడ నాయుధ మృతికిన్.

ముని కుమారుడైన ముగ్ధ నన్నిటు నేసి
కాంచు లాభమేమి గలుగవలచి
బాణమేసినాడు ప్రాణంబులకు నేను
వగవ దల్లిదండ్రు లగతు లగుట.

    కన్నులు లేవను నెవ్వగ
    నెన్నడు మది తోపకుండ నిమ్ముల నేనే
    కన్నులమారై యుండితి
    నెన్ని విధములందు నింక నెయ్యది గతియో !

జలములు దెమ్మన్న జనుదెంచి యిచ్చోట
    బడితినే నిష్ఠుర బాణనిహతి,

నెరుగరు మద్గురులీ ఘోరదురవస్థ
దడసె వీడను భీతి దగిలి నన్ను
నెంత గోపింతురో యేమని వగతురో
ధృతి నెట్లు దూలిరో దిక్కుమాలి
రింకెవ్వ రుదకంబు లిచ్చెద రెవ్వ రె
ట్లరసెద రేనిట్టు లైనవార్త
వినిన యపుడ ప్రాణంబుల విడువ గలరు
ముప్పురము గూడ నీశిలీముఖమునందు
దెగితిమేమని దైవంబు తెంపు జెప్ప
నకట! హా తల్లి! హా తండ్రి! యనుచు నడలె.

అడలగ నీతడొక్కముని యక్కట పాపము జేసితిం గదే
తొడిబడ బాణ మేయుటయు దూరగ నాటెనె యెప్పు డీతమం
బెడలునొ చూడ నయ్యెడకు నెప్పుడు బోదునొ నాగ జంద్రుడ
ప్పుడ పొడతెంచె నా మనను పోల్కి బయోజము లుబ్బడంగగన్.

ఏన'త్తరంగిణి దాటి తత్తీరంబున.

విరిసిన యజ్జటాభరము విన్నని మోము దురంత వేదనం
బొరల ధరాపరాగమున బ్రుంగిన యంగము గల్గి యమ్మహా
శరమటు దూర దుస్సహదశం గలశంబున నొత్తగిల్లి నె
త్తురు దొరగంగ నాతురత దూలుచు నున్న మునీంద్రనందునున్.

కనుగొని యుల్లము ఝల్లన
ధనువును బాణములు వైచి తడయక జలముల్
గొనివచ్చి మోము దుడువగ
గనుగవ దెరచుటయు జూచి గడు భీతుడనై.

అనఘ యెరుంగ నేను మృగయా పరతంత్రుడనై విధాతృశా
సనమున నింత గంటి నిది సాహసకర్మము సంభవించె నా

**ఘన తిమిరంబు నప్పు డుదకంబుల నీవిట కుండ ముంప నా**
**నినదము హస్తి నాదమని నెట్టన నేసితి దప్పు సేసితిన్.**

అనిన నమ్ముని కుమారుండు హీనస్వరమున నిట్లనియె.

**అడవిం దాపసవృత్తినున్న నను నేయం గారణంబేమి? నీ**
**యెడ నే యెగ్గొనరించి నాడ నది దానట్లుండె నీవార్తకుం**
**గొడుకొక్కండును బోయెనే యనుచు నాక్రోశించుచుం జిత్తుర**
**క్కడ నయ్యంధులు, మూడు పాతకము లింక న్నిన్ను బొందెంగదే.**

అయినను నెరుంగమిజేసి యేసితంతియ కాదు. పశ్చాత్తాపంబునుం గలదు. కావున నిమ్మహాపాతకంబు నీకుంగాక యుండుననుచు బలికి పదంపడి.

**బాణవ్యథచే మేనం**
**బ్రాణంబులు నిలువలేవు బాణముతోడం**
**బ్రాణములు విడువ జనదో**
**క్షోణీశ్వర! దీని బెఱుకు కొంకకు మింకన్ !**

**మహిత సమాధి యోగమున మద్గురు లిత్తెఱ గెల్లగాంచి దు**
**స్సహమగుచున్న శోకమున జాల దపించి శపించి రేని యా**
**గ్రహపటు రోషవహ్ని గొని కాల్చు భవత్కుల మన్మహాటవిన్**
**దహనము పేర్చునర్చుల నుదగ్రత గానన మేర్చు చాడ్పునన్.**

**అదిగాన మునుముట్ట నచటికి నీకుండ**
**నుదకంబు కొనిపోయి మొదలవారి**
**తృషదీర్చి యిబ్బంగి దెగియె మీ కొడుకిట్టి**
**దప్పు చేసితినని చెప్పుమింక**
**నీ గతోదక బంధమేటికి? బోనిమ్ము**
**కడచన్న దానికి నడలవలవ**

దను మాటలకు నేను నా ఘోర సాయక
　　మతిభీతి బెఱుక నయ్యతిసుతుండు
మేనుదొఱగె నతని మృతికేను శోకించి
కుండతోడ నీరు గొనుచు దపసు
లున్న వనము చేర నొగిబోయి సుతురాక
గోరుచున్నయట్టి వారిగంటి.

అక్షివిహీనుల వృద్ధుల
నక్షముల దృషాతురులను నగతుల ధాత్రిం
బక్షములు విరిగి యొరిగిన
పక్షులగతి నున్న వారి బరమ వ్రతులన్.

కని యల్లన గదియగ న
య్యనఘులు నాకాలి చప్పు డాలించుచు నో
తనయుడ నీవిటు తడయం
జనునే యీ యున్న యేటి సలిలంబులకున్.

ఏలరాడొ యనుచు నేను మీ తల్లియు
గలగబడితి మెచట నిలిచి తకట!
మధ్యరాత్రి మిట్లు మసలుదురే? మాకు
గన్నులన్న నీవ గతియు నీవ.

జలతృష్ణ నీదు రాకయ
తలపోయుచు నుండె నింక దల్లికి నుదకం
బులు వోయు బుద్ధి చెప్పిన
నలిగిన యట్లేల పలుక వని పల్కుటయున్.

దేహము దాహముం బొరయ దెంపున జెప్పదలంచి పుత్రు పై
స్నేహము జూచి చెప్పనని చెప్పక పోదని నిశ్చయంబుతో

**సాహస బుద్ధిజేసి, మునిసత్తమ! మీతనయుండగా న్మహా**
**ద్రోహగరిష్ఠుడన్ దశరథుండను పేరిటి పాపకర్ముడన్.**

**ఎక్కడ జూడ చెప్పనిటు లెవ్వరు జేయని యట్టి పాపమే**
**నొక్కడ జేసి మీకడకు నోడక వచ్చితి నేమి చెప్ప నీ**
**యెక్కుడు చీకటిం జలము లిమ్ముగ ద్రావు రవంబు నిక్కకుం**
**దెక్కలి తూపు లేయుచు మదించు మృగంబుల జంపుచున్నెడన్ !**

మీతనయుండును సరయువునం గుండముంప నాచప్పు డాలించి విధివశంబున

**అంజక తత్తటమున నొక**
**కుంజంబున బొంచి యుండి కుంభధ్వనికిం**
**కుంజర మని యేసితి ముని**
**కుంజర నీకొడుకు నేలగూలం గూలెన్.**

అప్పు డక్కుమారుండు

**బాణహతి నెలుగు సేసిన**
**బ్రాణంబులు గలగబాఱి బాణము వెఱుకం**
**బ్రాణములు విడిచె ననవుడు**
**బ్రాణంబులు ఝల్లనంగ బడి మూర్ఛిల్లెన్.**

**ఏమని చెప్పుదు నిట్లను**
**నా మాటయు దెగకమున్నె హా! పుత్రా! యం**
**చా మునిపత్నియు నప్పుడ**
**భూమినిం బడియుండె రిత్త బొందియ పోలెన్.**

ఇత్తెఱంగున మూర్ఛాపరవశులై యున్న యత్తపస్వుల జూచి చిత్తంబు గలంగి యేనల్లన బోధింప నెట్ట కేనియుం దెప్పిరి వారు నా దెసకు దీన వదనంబు లెత్తి నోళ్లు దెరచుచుం బెదవులు దడుపుచు డగ్గుత్తికలు పెట్టుచు

నెలుంగు రాల్పడ నిట్లనిరి.

ఏమయ్య మాపట్టినింత పాపము సేసి
    తేమి చేసిన జావ నేసితయ్య?
తగునయ్య వనమున దపసులమై యుండ
    దయమాలి యీ తెంపు దలతురయ్య
చీకులు వట్టిన చేకోల యది పోయె
    జీవుల మెచ్చోట జేరువార
మప్పుణ్య నేసిన యమ్మున మమ్మల
    బడనేసి దీవన వడయవయ్య

నీదు నిష్ఠుర బాణంబు నెరకు దూర
గాడి పరవశుడై వ్రాలు కతన నపుడు
తండ్రి నేమని యెలుగిచ్చె దల్లడంబు
జెంది తల్లి నేమని పిల్చె జెప్పుమయ్య.

ఆగురుభక్తితత్పరత నా పరమవ్రత నిష్ఠ నాతపో
యోగ విభూతి నొప్పెడు గుణోన్నతు డుత్తమచర్య డమ్మహా
భాగుడు పుణ్యగర్వీత విపద్దశకర్హుడె? యట్టివానికి
ట్లీగతి సంభవించెనట యేమని పొక్కుదు మింక నక్కటా!
మతిదలప నొడలనిత్యము
మృతుడవు కాకేమి మరి నిమిత్తము లేదే
యతి సుతుడట నిర్ఘాతా
యతభీకర బాణ పాతమట బాపు విధీ!

అనుచు బెక్కు తెఱంగుల శోకించుచు నప్పుడత్తపోధనుండు నన్ను నుద్దేశించి.

వానప్రస్థుని జంపి యెుక్కవడితో స్వర్నాథుడుం ద్రుంగు ధా
త్రీనాథుండిల నెంతవాడట విచారింపంగ నీ కెంతనే

ర్పేనింబోవు శిరంబు వ్రక్కలయి తప్పెన్ దప్పెనీ కృత్య మ
జ్ఞానంబున్ గడునోడి చెప్పితివి పశ్చాత్తాప తప్తుండవై.

కావున నిన్నేమన నిది
దైవాధీనంబ యింక ధరణీశ! మమున్
వేవేగ నచటికిం గొని
పోవుట పురుషార్థ మనుడు బొగులుచు వారిన్.

ఏనక్కుమారుండున్న యెడకుంగొనిపోయి వీడె మీతనూజుండను టయు దడబాటు చేతులతోడ ధరదడవి కొడుకు మీదంబడి మూర్ఛిల్లి కొంత దడవునకుం దెలిపి విలపింప దొడంగి రంత, నత్తల్లి యుల్లం బెరియ నెలుంగెత్తి, హాయజ్ఞదత్తా యనుచుం దనూజుం బేర్కొని -

అక్కట నాతోడ నలిగినట్లున్నాడ
వెన్ని చీరిన బల్క వేలపుత్ర?
ప్రాణమై యుండియు బాసిపోయితి వీవు
ప్రాణంబు నన్నేల పాయదనఘ
యంధులమగు మాకు నాధార మగుచున్న
నిన్నేల యేసె నీ నృపుడు వత్స
కడలేని దైవంబు కన్నుల కిదియును
ఘనమయ్యె నేమనంగలదు తండ్రి !

కూన యెట్లు నీదు గుణములు మఱతు నిం
కేమి సేయుదాన నెందుజొత్తు
నిపువు నాటు నప్పుడెంత భీతాత్ముండ
వైతొ పాపజాతి నయితి దనయ.

అప్పు డత్తపోధనుండును నన్ను నుద్దేశించి యేము నిదే మాపుత్రుం గూడ బోవుచున్నారము. నీవును బుత్ర వియోగంబున మృతి బొందగల వాడవని నాకు శాపంబిచ్చి పత్నీ సమేతుండై ప్రాణంబులు విడిచె. నేనత్తప

స్వుల సంస్కరించి చింతాక్రాంతుడనై యయోధ్య కేతెంచితి. తత్ఫలంబు నేడాసన్నంబయ్యె! నెట్లంటేని :॥

**కన్నుల చీకటి గప్పుచు**
**నున్నది వినరాదు పలుకు లుల్లమదర జొ**
**చ్చె న్నిలువదు మే నెలుగును**
**సన్నంబై వచ్చె నెఱుక సాలదు నాకున్.**

**దురవస్థన్ బ్రాణంబులు**
**తిరుగుడు వడజొచ్చె రామదేవుని లీలా**
**దరహాస వికాస శ్రీ**
**కరముఖ కమలంబు జూడ గానను గంటే!**

అని పలికి,

**హా కులవర్ధన! హా కరు**
**ణాకర! హా ధర్మలోల! హా గుణనిధి! హా**
**శ్రీకర! హా జయవరల**
**క్ష్మీకర! హా రామ! యనుచు మేను దొఱంగెన్.**

మహాజనులారా! కర్మశక్తిని తెలిసికొంటిరా? అది యెవరినిన్ని విడుచునది కాదు. ఇక శ్రీ సీతాదేవి విషయమై తలంచిన నెట్టివారి మనస్సుగూడ నీరుగా కరుగక పోవునా? సాక్షాత్ శ్రీరామమూర్తియొక్క ధర్మపత్నియు, అనేక దాసీజనులచే సేవింపబడునట్టిది యునై అంతఃపురములో సర్వసుఖముల ననుభవించి నిండుచూలాలైయుండు తరుణమున మహారణ్యములో రామచంద్రుని ఆజ్ఞచే లక్ష్మణస్వామి త్రోసివేసిన తరుణములో, ఆపట్టపు దేవి యొక్క దుఃఖము, విలాపము తలంచిన శరీరము కంపించుచున్నది. ఇట్టి మాతనుగూడ కర్మము విడువలేదు. అట్టి నిర్జనారణ్యములో దుష్టజంతు సంకీర్ణమగు ప్రదేశమున పరితపించుటకున్ను, భార్యావియోగముచే శ్రీరామ

చంద్రులు దుఃఖించుటకున్ను భృగుమహర్షియొక్క శాపమే కారణము. ఈ కథ ఉత్తర రామాయణములో విస్తారముగ గనందగును. అరణ్యములో సీతాదేవియొక్క రోదనము విని శ్రీ వాల్మీకి మహర్షియొక్క శిష్యులు పోయి చెప్పగా ఋషివచ్చి తీసుకొనిపోయి తన ఆశ్రమములో నిలబెట్టి, ఆ తల్లిని ఓదార్చి ఆత్మశాంతిగలుగజేసెను. ఇట్టి సంగతి చరిత్రములో వినియు నింద్రియ పరవశులగు భోగులు తమకు కర్మము లేదని చెప్పుట యెంత భయంకరము!

కర్మముయొక్క విచిత్రతను గురించి దుర్వాస మహర్షియొక్క యీ చరిత్రము తెలియందగినది. ఈయన గొప్ప బ్రహ్మజ్ఞానియు, మహా తపస్వియు, అతీంద్రియ జ్ఞానియు ననువిషయము అందరికిని తెలిపినదే. అట్టి వారే కర్మను తప్పించుకొనజాలక బ్రహ్మాదిదేవతలను వేడుకొనియు గతి కనుపించక యేలాగున కర్మఫలము అనుభవించవలసివచ్చినదో యీ చరిత్రముచే విజ్ఞులు తెలిసికొనగలరు. ఇది విస్తారముగ చూడంగలవారు శ్రీమద్భాగవతమున కనుగొనవచ్చును.

## అంబరీషోపాఖ్యానము

**(భాగవతము - నవమస్కంధము)**

ఇచ్చట సంగ్రహముగా కథ వ్రాయడమైనది.

"అని ధర్మసందేహంబు వాపిన నారాజర్షి శ్రేష్ఠుండును మనంబున హరి దలంచి నీరు పారణంబుచేసి జలంబుల మునింగిన తపసి రాక కెదురు చూచుచున్న సమయంబున -

**యమునలో గృతకృత్యుడై వచ్చి రాజుచే**
**సేవితుండై రాజు చేష్టితంబు**
**బుద్ధిలో నూహించి బొమముడి మొగముతో**
**నదరెడి మేనితో నాగ్రహించి**

రెట్టించి యాకలిగొట్టు మిట్టాడంగ
నీ సంపదున్మత్తు నీ నృశంసు
నీ దురహంకారు నిందరు గంటిరే
విష్ణుభక్తుడు గాడు వీడు నన్ను
గుడువ రమ్మని మునుముట్ట గుడిచినాడు
ధర్మభంగంబు సేసి దుష్కర్ముడయ్యె
నయిన నిప్పుడు సూపెద నన్ని దిశల
నేను గోపింప మాన్పువా డెవ్వడనుచు.

పెట పెట పండ్లు గీటుచును భీకరుడై కనుగ్రేవ నిప్పుకల్
పొటపొట రాల, గండములు పొంగ మునీంద్రుడు హుంకరించుచున్
జట మొదలంటగా బెఱికి చక్కన దానన కృత్య నాయుధో
త్కట వలమాన హస్తయుతగా నొనరించి నయించె రాజుపైన్.

అంత

కాలానల సన్నిభయై శూలాయుధ హస్తయగుచు నుఱునుఱు ద్రుక్కన్
నేల బదంబులు ద్రొక్కుచు వాలి మహాకృత్య మనుజవల్లభు జేరెన్.

ఆప్రకార మెరిగి హరి విశ్వరూపుడు
వెట్టి తపసి సేయు వేడ్పంబు
జిక్కు పెట్టు మనుచు జక్రంబు పంచిన
వచ్చెనదియు బ్రళయ వహ్నిపగిది

వచ్చి మునిసేసిన కృత్యను దహించి తనివి సనక ముని వెంటంబడిన మునియును మేరు గుహ సొచ్చిన నదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబున దోన చొచ్చి మరియును,

భువిదూఱన్ భువిదూఱు నబ్ధిజొర నబ్ధుల్ సొచ్చు నుద్వేగియై
దివి బ్రాకన్ దివి బ్రాకు దిక్కులకు పో దిగ్వీధులంబోవు జి

క్కి వెసంగ్రుంగిన గ్రుంగు నిల్వ నిలుచుం గ్రేడింప గ్రేడించు నొ
క్కవడిన్ దాపసు వెంటనంటి హరిచక్రం బన్య దుర్వక్రమై.

ఏలోకంబునకైన వెంటబడి తానేతెంచు చక్రానల
జ్వాలల్ మానుపు వారు లేమి జని దేవజ్యేష్ఠు లోకేశు వా
డాలోకించి విధాత విశ్వజనన వ్యాపార పారీణరే
ఖాలీలేక్షణ చూడవే కరుణ జక్రంబున్ నివారింపవే.

అనిన బ్రహ్మ యిట్లనియె

కరమర్థిన్ ద్విపరార్ధ సంజ్ఞగల యీకాలంబు గాలాత్ముడై
సొరిదిన్ నిండగ జేసి లోకములు నాచోటున్ విభుండెవ్వడో
పరిపూర్తిన్ గనుగ్రేవ గెంపు గదురన్ భస్మంబుగా జేయునా
హరిచక్రానలకీల కన్యుడొకరుం డడ్డంబు గానేర్చునే?

ఏను భవుడు దక్షుడింద్రాదులును బ్రజా
పతులు భృగుడు భూతపతులు శిరము
లందు దాల్తుమతని యాజ్ఞ జగద్ధితం
బంచు భూరి కార్యమతుల మనుచు.

కావున సుదర్శనానల నివారణంబునకు నోపనని విరించి పలికిన దుర్వాసుండు గైలాసంబునకు జనుదెంచి శర్వునాలోకించి చక్రానలంబు తెఱంగెఱింగించిన నమ్మహాదేవుండిట్లనియె.

వినవయ్య తండ్రి యే విశ్వేశ్వరునియందు
 జతురాస్య జీవకోశములు పెక్కు
వేల సంఖ్యలు గూడి వేళతో నిబ్బంగి
 నగుచుండు జనుచుండు నదియు గాక
యెవ్వాని భ్రాంతిచే నేమందు చున్నార
 మేను దేవలుడసురేంద్ర సుతుడు

**నారదు డజాడు సనత్కుమారుడు ధర్ము**
**డా కపిలుడు మరీచ్యాదు లన్య**
**పారవిదులు సిద్ధపతులు నెవ్వనిమాయ**
**నెఱుగలేము దాన నింతవడుదు**
**మట్టి నిఖిలనాథు నాయుధ శ్రేష్ఠంబు**
**దొలగజేయ మాకు దుర్లభంబు.**

మునీంద్రా! నీవు నమ్మహాత్ముని శరణంబువేడు మతండు మేలు సేయంగలవాడని పలికిన నీశ్వరునివలన నిరాశుండై దుర్వాసుండు వైకుంఠ నగరంబునకుం జని.

**ఆ వైకుంఠములోని భర్మమణి సౌధాగ్రంబుపై లచ్చి దా**
**గ్రేవన్ మెల్లన నర్మభాషణములం గ్రీడించు పుణ్యున్ హరిన్**
**దేవాధీశ్వరు గాంచి యో వరద! యో దేవేశ! యో భక్తర**
**క్షా! విద్యాపరతంత్ర! మానుపగదే చక్రానల జ్వాలలన్.**

**నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుగంగ లేక నీ**
**ప్రేమకు వచ్చు దాసులకు క్రించుతనంబున నెగ్గు సేసితిన్**
**నా మఱువుం సహింపు మట నారకుడైన మనంబులో భవ**
**న్నామము చింత చేసిన ననంత సుఖస్థితి నొందకుండునే.**

అని పలికి పాదకమలంబులకు మ్రొక్కి లేవకయున్న దుర్వాసునింగని హరి యిట్లనియె -

**చలమున బుద్ధిమంతులగు సాధులు నా హృదయంబు లీల దొం**
**గిలికొని పోవుచుండుదు రకిల్బిష భక్తి లతాచయంబులన్**
**నిలువగబట్టి కట్టుదురు నేరుపుతో మదకుంభికై వడిన్**
**వలలకు జిక్కి భక్తజనవత్సలతం జనుచుందు దాపసా.**

**నాకు మేలు గోర నా భక్తులక కాని భక్తజనుల కేన పరమగతియు,**
**భక్తుడెందు జనిన బఱితెంతు వెనువెంట గోవువెంట దగులు కోడెభంగి**

అదియును గాక.

తనువు మనువు విడిచి తనయుల జూట్టాల నాలి విడిచి సంపదాలివిడిచి
నన్నుగాని యన్య మెన్నడు నెఱుగని వారివిడువ నెట్టి వారినైన.

పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబునందు వరమతులు ప్రతి
ష్ఠించి వహింతురు నన్నును
మంచి పతిం బుణ్యసతులు మరగిన భంగిన్.

సాధుల హృదయము నాయది
సాధుల హృదయంబు నేను జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధులెరుంగుదురు నాదు చరితము విప్రా.

ధారుణీసురులకు దపము విద్యయు రెండు
ముక్తి సేయుచుండు ముదముతోడ,
దుర్వినీతు లగుచు దుర్జనులగు వారి
కివియె గీడు సేయ కేలయుండు?

నా తేజము సాధులలో
నాతతమై యుండు వారి నలచు జనులకున్
హేతిక్రియ భీతి నిచ్చుం
జేతోమోదంబు జెఱుచు సిద్ధము సుమ్మా.

అదె పో బ్రాహ్మణ నీకును
సదయుడు నాభాగసుతుడ జనవినుతగుణా
స్పదు డిచ్చు నభయ మాతని
మది సంతసపఱచి వేడుమా శరణంబున్.

**అని శ్రీవల్లభు డానతిచ్చిన మహోదార్యచ్చక్ర కీలావళి**
**జనితాయాసుడు నిర్వికాసు డుదితశ్వాసుండు దుర్వాసుడ**
**ల్లన యేతెంచి సుభక్తిగాంచె గరుణాలావణ్యవేషున్ విదో**
**షున యోదార మనీషు మంజుమిత భాషున్నంబరీషన్ వెసన్.**

కని, దుఃఖితుడయి యమ్మహీవల్లభు పాదంబులు వట్టి విడువకున్న, నా నరేంద్ర చంద్రుడు చరణస్పర్శనంబునకు నోడుచు కరుణారస భరిత హృదయుండై, హరి చక్రంబు నిట్లని స్తుతియించె''

ఈ గాధచే నిప్పుడు కోపిష్ఠులైయుండు కొందఱు తపస్వుల యొక్కయు, యోగులయొక్కయు, రాజయోగులమని చెప్పి యింద్రియ పర వశులై వర్తించువారియొక్కయు గతి జనులు దెలిసికొనవచ్చును. వీరున్ను ఈలాటి దివ్యచరిత్రముల చదివియో, వినియో నిర్మలమార్గము నవలంబించి తామున్ను తరించి యితరులును తరించేలాగున వర్తించిన లోకమునకు నెంతో మేలు గల్గియుండును. ఆత్మసాక్షాత్కారము గల్గువరకును దృశ్య విషయములు నశించువరకున్ను బ్రహ్మనిష్ఠ చేయకపోవుటయే అనేకమంది సాధకులు చెడిపోవుటకు కారణమగుచున్నది. ఈ విషయమై అప్పయదీక్షితుల యొక్క అభిప్రాయము జూడుడు.

**బ్రహ్మాత్మైక్యస్య విజ్ఞానాన్మనోనాశో న జాయతే ।**
**అస్మాత్తూపాసనాత్సిద్ధ్యేత్ప్రాణస్యేంద్రియస్య చ ॥**

బ్రహ్మాత్మైకజ్ఞాన శ్రవణముచేత మనోలయము గాదు. అయ్యది దైవో పాసనవలన మాత్రమే గల్గును. అనగా నిదిధ్యాసన సాక్షాత్కార పర్యంతము అనుష్ఠించిన వారికి మాత్రమే గల్గునని భావము.

**శృణ్వంతు శతశో వాక్యం తత్త్వమస్యాదికం మహత్ ।**
**మన్యంతాం వా తథా తీవ్రం వినోపాసం న మోచనమ్ ॥**

"తత్త్వమసి'' లోనగు మహావాక్యములను, నూర్లకొలదులు శ్రవణము చేయుదురుగాక! తీవ్రముగా మననము చేయుదురుగాక! బ్రహ్మోపాసన

శమదమాది గుణ సహితుడై చేయనిచో మోక్షము గలుగదు.

**శ్రుతిస్మృతిశతైః ప్రోక్తం బ్రహ్మధ్యానమనుత్తమమ్ ।**
**ఉపేక్ష్య వాదమాత్రేణ బ్రహ్మ సాక్షాత్కథం భవేత్ ॥**

నూర్లకొలది శ్రుతిస్మృతి వాక్యములు బ్రహ్మధ్యానము మిగుల శ్రేష్ఠమని చెప్పుచున్నవి. వాని నలక్ష్యము చేసి వాదము మాత్రము చేసిన బ్రహ్మసాక్షాత్కార మెట్లు గల్గును? అనగా బ్రహ్మధ్యానము చేయక వేదాంత వాక్యములను వినుటచేతను, పఠించుటచేతను, ఇతరులకు చెప్పుటకు చక్కగనేర్చుకొనుట చేతను దైవజ్ఞానమెట్లు గల్గును? కలుగనే కలుగదని భావము. ఈ తత్త్వము తెలియకనే ధ్యానమవసరము లేదనియు, నిష్ఠ పని లేదనియు, బోధ వినుచున్న చాలుననియు చెప్పువారి వాక్యములు విని కొందరుభక్తులు చెడిపోవుచున్నారు.

**అహో మౌర్ఖ్యం మనుష్యాణాం శ్రుత్యంతేషు స్థితేష్వపి ।**
**ఉపాస్త్యైకప్రధానేషు జనా బోధైకవాదినః ॥**

ఉపాసనము ముఖ్యమని చెప్పు వేదాంత వాక్యము లెఱిగియు, బోధ వినుచుండిన మాత్రమున చాలుననియు, అదే ప్రధానమనియు వాదించు మనుష్యులయ్యో యెంత మూర్ఖులో? సంస్కృతములో "అహో" అని ప్రయోగించుట మహావిపత్తులోను, అత్యాశ్చర్యముననను, మహాదుఃఖములోను మాత్రమే చేయుదురు. పై జెప్పిన వారు అయ్యో యెంత మూర్ఖులో యని పశ్చాత్తాపముతో ప్రయోగించిరి.

**ఉపాసనమిదం నానా విక్షేపావృత్తినాశనమ్**
**అనేనైవ మనోనాశో జీవన్ముక్తిశ్చ నేతరైః ॥**

ఈ దైవోపాసనమే మనస్సులో గల యనేక విధములగు విక్షేపవృత్తుల నాశము చేయగల్గును. మనోలయము, జీవన్ముక్తి దీనివలననే గల్గును. ఇతరములవలన గలుగదు. అంతఃకరణములో మల, విక్షేప, ఆవరణము లనెడు మూడు దోషములు గలవు. నిష్కామ పుణ్యకర్మానుష్ఠానముచే మల

నాశమున్ను, చిత్తైకాగ్రతాపమగు దైవోపాసనచే విక్షేపనాశమున్ను, మహాత్ము లగు గురువుల బోధచే ఆవరణ నివృత్తియు గలుగవలెననియే వేదాంత శాస్త్రము విధించుచున్నది. విక్షేపము రజోగుణముతో గూడినది. దీనికి మనో నిశ్చలత గలుగక దృశ్యవృత్తిలోనికి పరుగెత్తుటయే స్వభావముగ నుండును. (అనగా ధ్యానములో ధ్యేయాకారములో నిలకడ గలుగక దృశ్యవృత్తులు గల్గుచుండుటే గురుతు) ఇట్టి వారు వైరాగ్య మవలంబించి యీశ్వరోపాసన అనగా, బ్రహ్మో పాసన చేయుచుండవలయును.

**ఇతి విజ్ఞానవంతోఽపి జనాః కేచన మోహితాః ।**
**జ్ఞానోదయాత్పరం కార్యం నేత్యాహుః కించిదప్యహౌ ॥**

ఈజ్ఞానముగలవారు కూడా కొందరు మోహవశమున వివేకజ్ఞానోదయ మైన పిమ్మట చేయవలసిన కార్యమేదియు లేదనుచున్నారు. ఆహా! యేమి యాశ్చర్యము. అనగా తత్త్వజ్ఞానమున్ను, పదార్థజ్ఞానమున్ను తెలిసికొన్న చాలు ననియు, అనుష్ఠించి సిద్ధి గలుగచేసుకొన నక్కరలేదనియు చెప్పువారు కొందరు గలరనుట! వారెంత మోహపరవశులో చెప్పజాలనని భావము. రోగముయొక్క జ్ఞానమున్ను, దానికి తగిన ఔషధముయొక్క జ్ఞానమున్ను గలిగిన మాత్రముననే ఆరోగ్యము గల్గునా? కల్గునని చెప్పిన అది భ్రమకారణ మని చెప్పక మరియేమని చెప్పగలరు? కనుక సాక్షాత్ జ్ఞానము గల్గువరకు ఉపాసన విడువరాదు.

**ఉపాసనం వినా జ్ఞానా త్కేవలాచ్చేద్విముక్తతా ।**
**కన్యాం వినా వివాహః స్యాత్కేవలేన వరేణ హి ॥**

ఉపాసనము లేక యొక్క శ్రవణజ్ఞానముచేతనే మోక్షము వచ్చుననుట కన్య లేక వరుడు వివాహమాడినాడనుట వంటిదే యగును.

ముముక్షువులారా! సచ్ఛాస్త్రము ఈలాగున నుద్ఘోషించు చుండియు నాచరణలో పెట్టక పోవుట దుష్కర్మ బలమేగాని మరియేమని చెప్పవచ్చును? అందుచేతనే భారతదేశమున కింత పతనము గల్గినది. పూర్విక ఋషులు

తపస్సంపన్నులై, యోగనిష్ఠులై యుండిన కారణముచే భారతదేశ మత్యున్నత స్థితిలో నుండెను. అప్పుడు ప్రజలకున్ను, ప్రభువులకున్ను మహాపురుషులపై విశ్వాసభక్తులు గల్గియుండుటచే ఆ మహనీయులగు ఋషుల ఆశయము ననుసరించి జనులు వర్తించుచుండిరి. ఇప్పుడు అదేమి యదృష్ట దోషమోగాని, యోగముగాని, తపస్సుగాని, వైరాగ్యముగాని, భక్తిగాని అవసరము లేదనియు, కనీసము మనుజులు భుజించెడు ఆహార నియమమైనను అవసరము లేదనియు, రాక్షసులు, క్రూరమృగములు దినెడు నీచాహారములను దినుచు గూడ వేదాంత వాక్యములు వినుచున్న మాత్రముననే మోక్షము గల్గునని చెప్పెడు పాతకోపదేశము వ్యాపకత్వమునకు వచ్చినప్పటినుండియే ఋషుల సంతానములగు నీ మానవుల కేశక్తియు లేకపోవుట సంభవించినది. కేవలము జడప్రాయులై, నిద్రాహారాది విషయములలో మగ్నులై, జిహ్వేంద్రియ గుహ్యేంద్రియములనైన మంచిస్థితిలో నుంచుటకు శక్తిలేనివారై, వాచావేదాంతులై కాలము గడుపు స్థితిగల్గినది. ఇట్టి కుమార్గముల దూరీకరించి సన్మార్గములను బ్రతిష్ఠించి తపోధ్యానయోగాదుల నాచరించు కాలము వచ్చునప్పుడే యీ లోక మున్నతస్థితికి రాగల్గును.

**సంసారజ సుఖాసక్తం బ్రహ్మజ్ఞోఽస్మీతి వాదినమ్ ।**
**కర్మబ్రహ్మోభయభ్రష్టం తం త్యజేదంత్యజం యథా ॥**

దృశ్యసంబంధమైన సుఖములలో అసక్తుడై, వానివల్ల బద్ధుడై యుండియు తాను బ్రహ్మజ్ఞాని నని యితరులతో చెప్పువాడు కర్మమార్గము నుండియు, జ్ఞానమార్గము నుండియు పతితుడని గ్రహించవలెను. ఏలాగున చండాలుని యజ్ఞాద్యుత్కృష్ట కర్మలనుండి త్యజింతురో, ఉభయభ్రష్టుడైన యితనిని గూడ బ్రహ్మవేత్తల సంఘమునుండి తొలగించవలయును. ఉభయ భ్రష్టుడనగా? జ్ఞానములో నిలకడ గల్గుటకు ముందుగా సత్కర్మానుష్ఠానము విడిచినవాడు. ఇది వృక్షము నారోహించునపుడు ఒక శాఖనుండి మరియొక శాఖలోనికి పాదము పెట్టి నిలకడ గల్గుటకు ముందుగా వెనుక పాదము ఎత్తిన వాని గతివంటిదని భావము. అనగా క్రింద పడిపోవునని యర్థము.

**అకృత్వా వృత్తివిలయ మజ్ఞాత్వా బ్రహ్మ కేవలమ్ ।**
**అహం బ్రహ్మేతి యో బ్రూతే తస్య జిహ్వాం వికర్తయేత్ ॥**

దృశ్యవృత్తుల విలయము నొందింపకయు, బ్రహ్మైక్యైకజ్ఞానబోధ సాక్షాత్కారము గలుగకయు నెవండు తాను బ్రహ్మమని పలుకునో యతని జిహ్వాచ్ఛేదనము చేసినను పాతకము లేదని శాస్త్రము చెప్పుచున్నది.

**శరీరపోషణార్థీసన్ య ఆత్మానం దిదృక్షతి ।**
**గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి ॥**

ఎవండు శరీరాభిమానము గల్గి దానియొక్క పోషణయే ముఖ్యమని తలంచి ఆత్మజ్ఞానమును దర్శించుటకై ప్రయత్నించెడు వానివలె నుండునో, అట్టివాడు పెద్ద మొసలిని మ్రానుగా తలంచి నదిని దాటుకు ప్రయత్నించెడు వానివలె నగునని భావము. మకరిని కొయ్యగా తలంచి దానిపై ఎక్క జూచిన అది వీనిని మ్రింగివేయును. వీరి గతి యాలాగుననే యుండునని గ్రహించ వలెను.

**లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమీష ద్బహిర్ముఖం సన్నిపతేత్తతస్తతః ।**
**ప్రమాదతః ప్రచ్యుతకేళి కందుకః సోపాన పంక్తౌ పతితో యథా తథా॥**

సాధకునికి లక్ష్యమునుండి చిత్తము కొంచెము మాత్రమైన చలించెనేని, క్రమక్రమముగ వృత్తిలోనికి జారిపోయి విషయములలో బడిపోవును. అదెట్లన? ఉన్నత ప్రదేశములలో నున్నవానియొక్క చేతినుండి జారిన చెండు ఒక్కొక్క మెట్టు పైబడి భూమి మీదకెట్లు వచ్చి చేరునో ఆలాగుననే యుండునని గ్రహించుకొనవలయును.

**న శాస్త్రపాఠమాత్రేణ యోగసిద్ధిః ప్రజాయతే ।**
**న వేషధారణం సిద్ధేః కారణం న చ తత్కథా ॥**

స్వరూపసాక్షాత్కారజ్ఞానము శాస్త్రపఠనమాత్రముచే సిద్ధింపదు. అట్టి జ్ఞానసిద్ధి వేషధారణముచేతను గలుగదు. అట్టి ఆత్మసాక్షాత్కారము వేదాంత

వాక్యములను చెప్పుటచేతనుగూడ గలుగదు. అది యాచరణ గల వానికే లభించును.

**ఆత్మాక్షేత్రజ్ఞ సంజ్ఞోఽయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తైరేవ విగతఃశుద్ధః పరమాత్మా నిగద్యతే ॥**

ఈ ఆత్మకు ప్రాకృతములైన ప్రకృతిగుణము లుండువరకే జీవు డనియు, బద్ధుడనియు, శరీరసాక్షి యనియు పేరు గల్గియుండును. అట్టి విషయ గుణములనుండి విముక్తి గల్గునప్పుడు శుద్ధాత్ముడై పరమాత్మను పొందగల్గును. అనగా పరమాత్మ యని చెప్పబడును.

**అనిష్కల్మష చిత్తస్య సర్వ తీర్థేషు మజ్జనమ్ ।**
**వరస్యాంగారక స్యేవ సదా క్షీరాభిషేచనమ్ ॥**

నిష్కల్మషము అనగా నిర్మలమగు హృదయము లేనివాడు సర్వ తీర్థములలో స్నానమాచరించినను, సర్వవ్రతముల ననుష్ఠించినను శుద్ధుడు గాజాలడు. ఏలన? మంచి గోక్షీరములో బొగ్గును సదా కడిగినను, దానియొక్క నలుపు పోయి తెలుపు గలుగదు గదా?

**స ఆత్మా స హి విజ్ఞేయః సర్వైరపి ముముక్షుభిః ।**
**తుర్యాత్మజ్ఞానహీనానాం న ముక్తి స్స్యాత్కదాచన ॥**

సమస్త ముముక్షువులచేతను, తనయొక్క ఆత్మ శుద్ధమైనదిగాను, జ్ఞానమయ మైనదిగాను తెలిసికొనందగినది. అట్టి తురీయజ్ఞానము గలుగని వానికి నెన్ని జన్మములకైనను ముక్తి గలుగదు. అనగా ఆత్మశుద్ధి గలుగని వారికి మోక్షము లేదని భావము.

**అధర్మాజ్జాయతేఽజ్ఞానం యథేష్టాచరణం తతః ।**
**ధర్మకార్యం కథం తత్స్యాద్యత్ర ధర్మోఽపి నశ్యతి ॥**

అధర్మప్రవర్తముచేత జ్ఞానము నశించి అజ్ఞానము వృద్ధి యగును. అట్టి యజ్ఞానము వృద్ధి యగుటవల్ల యథేష్టాచరణము అనగా, స్వేచ్ఛా ప్రవర్తనము

గల్గును. ఎచ్చట ధర్మము నశించునో, అచ్చట ధర్మమేలాగున నిలవగలుగను? అనగా నిలువజాలదనుట. ఎచ్చట పులులు సంచరించుచుండునో, యచ్చట గోవులుండవుగదా? ఎచ్చట గరుత్మంతుడు నివసించుచుండునో, అచ్చట సర్పము లుండవుగదా? ఎచ్చట మార్జాలము నివసించునో, అచ్చట మూషికములు చేరవుగదా? ఎచ్చట నిప్పు మండుచుండునో, అచ్చోట నీళ్ళు లేవుగదా? ఎచ్చట అసురులుందురో, అచ్చట దేవతలు లేరుగదా? ఎచ్చట చీకటిగా నుండునో, అచ్చట వెలుతురుండి యుండదుగదా? ఆలాగున నెవరి హృదయములో అధర్మ ప్రవర్తనములగు వృత్తులు, గుణములు గలవో అచ్చట ధర్మముండదు. ధర్మము లేనప్పుడు గల్గునదేమి? అధర్మమే! దీని యొక్క ఫలము దుఃఖము. కావున ఎంత జ్ఞానియైనను అధర్మ ప్రవర్తన గల్గియుండరాదు. దానియొక్క ఫల మనుభవించియే తీరవలసి యుండును.

**పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః ।**
**న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః ॥**

సామాన్య జనులు పుణ్యముయొక్క ఫలమగు సుఖమునే కోరుచుందురు. అయితే పుణ్యకార్యము చేయరు. పాపముయొక్క ఫలమగు దుఃఖమును కోరరు. కాని పాపకార్యమే సదా చేయుచుందురు. ఇది విష బీజము నాటి అమృత ఫలముకొరకు నిరీక్షించినట్లుండును. అది యెట్లయిన గల్గునా? అందరున్ను ఉన్నతపదవి పొందవలెనని కోరిక గలవారై యుందురు గాని అట్టి యుత్కృష్ట స్థానమును పుణ్యపురుషులెట్లు ఆరోహణము చేసిరో అది మాత్రముచూడరు. అట్టి వారు ఏలాగున శ్రేష్ఠపదవిని పొందగలరు? కావున శిష్టాచరణపరులు ఏ విశిష్టస్థితిని పొందిరో వారేలాగున నాచరించిరో ఆలాగున అను ష్ఠించువారికిమాత్రమే అది లభించును. కాని వాచావేదాంతులకు లభింపజాలదు.

ఇప్పుడు కర్మవిషయమై మరియొక రహస్యము తెలిపెద. దీనివల్ల ఎవరికైనను కర్మఫలము అనుభవించే తీరవలయునని గోచరము కాగలదు. ఇంతవరకు చెప్పిన విషయములచే స్వప్రయత్నమువల్ల కర్మము అలంఘ

నీయమని తెలిసికొంటిమి. ఇప్పుడు పరప్రయత్నమువల్ల కర్మను తొలగించుట కును శక్తిలేదని తెలుపుటకే యీ విషయము వ్రాయడమైనది. దీనివల్ల కర్మ నివృత్తికొరకు ప్రయత్నించుట అక్కరలేదని కాదు. కర్మను రహితమొనర్చు టకు సదా ప్రతివారున్ను ప్రయత్నపరులైయుండవలయును. అయితే పై చెప్పిన గాథలచే కర్మ స్వప్రయత్నము వల్లనైనను తొలగదనియు, అనుభవించి తీర వలయుననియు, శ్రుతియుక్తి అనుభవములచే సిద్ధాంతీకరించియుండగా, మరల కర్మనివృత్తి విషయమై యేల ప్రయత్నించవలయును? ప్రయత్నించి నను నిష్ఫలమేగదా అని తలంపరాదు. దీనిలోగల రహస్య మేమన :- అధర్మ కార్యములోను, పాపకార్యములోను మనస్సును చొరనీయక యుండేలాగున ప్రతిమానవుడున్ను ప్రయత్నపరుడై, దృఢసంకల్పము గలవాడై యుండ వలయుననియే గ్రహించవలయును.

అయితే యింతవరకు చేసియుండిన కర్మ యెట్లు నశించునని సంశయము గలుగవచ్చును. దానికి సమాధానమేమన - అట్టి కర్మఫలము ననుభవించుకొని అలాటి కర్మలు చేయక పరిశుద్ధాత్ములై, దృఢవ్రతులై, యుండవలయుననియే శాస్త్రము తెలుపుచున్నది. అట్లయిన నిప్పుడనుభవిం చుచుండు కర్మము నశించిన వెంటనే అనుష్ఠించుచుండెడు పుణ్యకర్మము, ధర్మనిష్ఠ రాత్ర్యంతమున భాస్కరోదయ మౌనట్లు, హృదయాకాశములో సత్య ధర్మానుష్ఠానములవల్ల గలిగిన నిర్మలసుఖము ఆవిర్భవించును. పవిత్ర భావన గలుగును. అప్పుడు బ్రహ్మనిష్ఠకుఅన్నివిధములలోను అనుకూలత గలుగును. దేహేంద్రియ మనోబుద్ధులుగూడ శుద్ధము లగును. మరల అన్ని యింద్రియ ములున్ను సత్యధర్మములలో ప్రవర్తించునేగాని, మరియొక విధముగ మార్పు గలుగదు. అట్లుగాక కర్మమనుభవించే తీరవలయుననియు, ప్రయత్న మవసరము లేదనియు తలంచియుండిన నింతవరకు ఏ చెడు కర్మలు గలవో అవి బీజాంకుర న్యాయములుగా, మరలమరల వృద్ధియై జీవుని అజ్ఞానాంధ కారములోనికి లాగివేయును. ఏ వృక్షముయొక్క బీజములు అదేరీతి వృక్షము లగునట్లు జీవునియొక్క హీనగుణములు వృద్ధియగుచుండునేగాని క్షయిం

పవు. పురుష ప్రయత్నముచే కట్వాదికంటక వృక్షములను వ్రేళ్ళతో పెళ్ళగించి యెండలో నెండించి కాల్చి భస్మముచేసిన మరల యేలాగున ఆ జాతియుం డదో, యింతవరకు నుండిన స్థలమును శుద్ధపరచి పరిశుద్ధఫల పుష్పముల నిచ్చెడు నిర్మలమైన చెట్లునాటిన నేలాగున మనోహరముగా నుండునో, ప్రయ త్నముయొక్క ఫలము అట్లుండునని ముముక్షువులు గ్రహించవలయును. మరియు నివృత్తి మార్గమునందు నిరంతరము ప్రయత్నపరులై భగవద్ధ్యానము చేయువారికి కొన్నికొన్ని దుర్బలకర్మలు నశించిపోవును. ప్రబలములై, కఠినము లైన కొన్ని ప్రారబ్ధకర్మలు మాత్రము అనుభవింపవలసి వచ్చును.

ఇక నీకర్మవిషయమైన విచారణ చేయబడును. ఇప్పుడు శ్రీమద్భాగవత ములో గల పరీక్షిత్తు మహారాజుయొక్క కథ మనము గ్రహించవలసియున్నది. ఆయన దేహము తెలియక చచ్చిపడియుండు సర్పమును సమాధి నిష్ఠలో నుండు శమీకమహర్షియొక్క గళములో వేసియుండునది ఆ ఋషి కుమారుడగు శృంగి యెరింగి రాజుయొక్క గర్వమునకు కోపము గలవాడై ఏడు రోజులలో పాముకాటుచే మృతిపొందేలాగున శపించెను. శాపవిమోచన విషయమై క్రింద పేర్కొనిన మహర్షులందరు ఏమియు చేయజాలక నోయిరి. ఓహెూ! కర్మయొక్క మహిమ యేమని చెప్పవచ్చును! అట్లుండగా, బ్రహ్మనిష్ఠ యేమియో యని తెలియక కొంచెమున్ను, ఆచరణయైన చేయక శిశ్నోదర పోషణ పరాయణులై యుండి వేదాంతవాక్యములు మాత్రము చిలుకపలుకుల వలె చెప్పుచుండు కుయోగుల విషయమై మరల యేమని చెప్పవలయును? ఇట్లు చెప్పుటచే ఒక్కరిని నిందించవలయునని తలంపు కాదు. నీటికి స్వయ ముగా క్రిందికి జారిపోవు స్వభావము కలిగినట్లు, సామాన్యజనుల మనస్సు విషయసుఖముల వైపు దిగిపోవుచుండును. నీళ్లు పారుచుండునప్పుడు, ఎచ్చటనైన చెర్వుకట్టలు మొదలయినవి యెవరో పుణ్యాత్ములు కట్టి యుండు నవి తెగకొట్టివేయుట యెంత పాపకార్యమో, ఆలాగుననే కొందఱు పుణ్య పురుషులు ఏర్పరచి యుండు ధర్మపు కట్టుదిట్టములను కట్టలనుగూడ తెగ గొట్టుటంత ఘోరపాతకము గూడ అగును. అందువల్ల ఈలాగున వ్రాయ వలసి వచ్చినదేగాని, మరియొక విధము కాదని మనవి చేయుచున్నాను.

# పరీక్షిద్వృత్తాంతము

(శ్రీమద్భాగవతము - ప్రథమస్కంధము)

ఇట్లు పాండవ పౌత్రుండు ముకుంద చరణారవింద వందనానంద కందాయమాన మానసుండై విష్ణునదీ తీరంబునం బ్రాయోపవేశంబున నుండుట విని, సకలలోకపావనమూర్తులు మహానుభావులు నగుచు తీర్థం బులకుం దీర్థత్వంబు లొసంగ సమర్థులైన యత్రి, విశ్వామిత్ర, మైత్రేయ, భృగు, వసిష్ఠ, పరాశర, చ్యవన, భరద్వాజ, పరశురామ, దేవల, కశ్యప, కవష, కణ్వ, కలశసంభవ, వ్యాస, నారద ప్రముఖులైన బ్రహ్మర్షి, దేవర్షి, రాజర్షి పుంగవులును, గాండర్షులయిన యరుణాదులను, మరియు నానాగోత్ర సంజాతులైన ఋషులును శిష్యప్రశిష్యసమేతులై చనుదెంచిన, వారలకు బ్రత్యుత్థానంబు సేసి పూజించి దండప్రణామంబు లాచరించి కూర్చుండ నియోగించి

**క్రమ్మఱ నమ్ము నివిభులకు**
**నమ్మనుజేంద్రుడు మ్రొక్కి హర్షాశ్రుతతుల్**
**గ్రమ్మగ ముకుళితకరుడై**
**సమ్మతముగ జెప్పె నాత్మ సంచారంబున్.**

**ఓపిక లేక చచ్చిన మహోరగముం గొని వచ్చి కోపినై**
**తాపసు మూపుపై నిడిన దారుణ చిత్తుడ మత్తుడన్ మహా**
**పాపుడ మీరు పాపతృణ పావకు లుత్తము లయ్యలార ! నా**
**పాపము వాయు మార్గము గృపాపరులార విధించి చెప్పరే.**

**భూసుర పాదరేణువులు పుణ్యుల జేయు నరేంద్రులన్ ధరిత్రీ**
**సురులార! మీ చరణ రేణుకణంబులు మేను సోకి నా**
**చేసిన పాపమంతయు నశించె గృతార్థుడ నైతి, నెద్ది యే**
**జేసిన ముక్తి పద్ధతికి జెచ్చెర బోవగ వచ్చు జెప్పరే.**

** ** ** ** **

గేహంబు వెడలి పుణ్యతీర్థ జలావగాహంబు సేయుచు నేకాంత శుచి ప్రదేశంబున విధివ్రత ప్రకారంబునం గుశాజిన చేలంబులతోడం గల్పితాస నుండై మానసంబున నిఖిల జగత్పవిత్రీకరణ సమర్థంబై యకారాది త్రివర్ణకలితంబై బ్రహ్మబీజంబైన ప్రణవంబు సంస్మరించుచు."

ఇది సంక్షిప్తముగ వ్రాయడమయినది. మిగిలిన భాగము శ్రీమద్భాగవత మున గనందగును. ఇచ్చట ఒక ముఖ్య విషయము గ్రహించవలసియున్నది. పరీక్షిత్తు మహారాజు కూడ కుశాజినచేలంబుతో గూడిన ఆసనములో ఉత్తరాభి ముఖుడై అకార, ఉకార, మకారాత్మకమగు పరబ్రహ్మ వాచకమైన ప్రణవమునే స్మరించెనని చెప్పుటలో ప్రణవమే పరమపవిత్రమనియు, పాపకాంతార దాహక మనియు, ముక్తిప్రదాయకమనియు గ్రహించవచ్చును. అంతేగాక ముముక్షువు లందరున్ను అట్టి ఓంకారమునే ధ్యానము చేయందగినదనియు గోచర మగుచున్నది.

ఇప్పుడు మైత్రేయ్యుపనిషత్తులో గల కొన్ని ధర్మవాక్యములు దెలిపెద. ఇవి మైత్రేయ ఋషికి పరమశివుండు కైలాసమునం దుపదేశించినవి. ముము క్షువులు, విరక్తులు, సన్న్యాసులు మొదలుగా గల నివృత్తి మార్గస్థు లందరున్ను గ్రహించదగినవి.

**అహంకారసుతం విత్త భ్రాతరం మోహమందిరమ్ ।**
**ఆశాపత్నీం త్యజేద్యావత్తావన్ముక్తో న సంశయః ॥**

దీనివల్ల బాహ్యములైన సంసార బంధముల నన్నిటిని విడిచిన చాలదనియు, అంతస్సంసారము విడచినమాత్రమే ముక్తి గల్గుననియు తెలి యందగినది. అహంకారమను పుత్రుని, విత్తమను భ్రాతను, మోహమను గృహమును ఆశయను భార్యను నెంతవరకు త్యజింపలేదో అంతవరకు ముక్తుడు గాజాలడు. సంశయము లేదు.

**కర్మత్యాగాన్న సన్న్యాసో న ప్రేషోచ్చారణేన తు ।**
**సంధౌ జీవాత్మనోరైక్యం సన్న్యాసః పరికీర్తితః ॥**

కర్మములను విడుచుటవలన సన్న్యాసము గలుగజాలదు. ప్రేషోచ్చారణముచేతను సన్న్యాసము గలుగదు. (ప్రేషోచ్చారణ : సన్న్యసించెడు కాలమున దేహమనోవాక్కులు చేయు కర్మల నన్నిటిని విడచుచున్నాను. లేక భూర్భువస్స్వర్లోకములతో సంబంధించిన కర్మల నన్నిటిని త్యజించుచున్నానని తెలిపెడు కొన్ని మంత్ర వాక్యములు పఠించుట గలదు. దానికి ప్రేషోచ్చారణ మనిపేరు) జీవాత్మ పరమాత్మలయొక్క యైక్యానుసంధానమే సన్న్యాసమని ఋషులచే కీర్తింపబడుచున్నది. అనగా ప్రసిద్ధముగా నున్నది.

**వమనాహార వద్యస్య భాతి సర్వేషణాదిషు ।**
**తస్యాధికారః సన్న్యాసే త్యక్తదేహాభిమానినః ॥**

వమనము చేసిన అన్నాది పదార్థములను మరల నేలాగున గ్రహింపజాలరో, ఆలాగున దృశ్యాది విషయములగు నీషణత్రయముల నన్నిటిని విడచిన వాడెవడో ఆలాగున దేహమునకు సంబంధించిన సమస్త అభిమానములను విడిచిపెట్టిన వానికే సన్న్యాసమునం దధికారము గలదు.

**యదా మనసి వైరాగ్యం జాతం సర్వేషు వస్తుషు ।**
**తదైవ సన్న్యసేద్విద్వా నన్యథా పతితో భవేత్ ॥**

ఎప్పుడు అనగా నే అవస్థయందు సమస్త దృశ్యవిషయములలో విరక్తి గల్గునో అనగా నిరాశ పొడమునో, అట్టి తరుణముననే సన్న్యసించవలయును. మనస్సులో నట్టి వైరాగ్యము గల్గుటకు ముందుగా సన్న్యసించినచో పతితుడగును.

**ద్రవ్యార్థమన్న వస్త్రార్థం యః ప్రతిష్ఠార్థ మేవ వా ।**
**సన్న్యసే దుభయ భ్రష్టః స ముక్తిం నాప్తు మర్హతి ॥**

అట్లుగాక ప్రతిష్ఠ కొరకుగాని, ధనార్జన నిమిత్తమైగాని, అన్నార్థియై గాని, వస్త్రాభిలాషియైగాని, మరియేదైన నొక లాభము నుద్దేశించి సన్న్యసించుచో నతడు ఉభయభ్రష్టుడగును. అంతేగాక ముక్తి కర్హుడు గాజాలడు.

**అనుభూతిం వినా మూఢో వృథా బ్రహ్మణి మోదతే ।**
**ప్రతిబింబితశాఖాగ్రఫలాస్వాదనమోదవత్ ॥**

ఆత్మనిష్ఠాపరుడై ఆత్మానుభవము గలుగక యితరులు చూచుట కొరకు తాను బ్రహ్మానందము గలవానివలె నటించెడి వాని స్థితి యెటువంటి దనగా, తటాక తీరస్థవృక్షాగ్ర ఫలములు నీటిలో ప్రతిబింబించుట జూచి, చెట్టెక్కి వానిని కోసి తినుటకు చూడక జలములో దిగి పండ్లను పట్టుకొన నభి లషించెడు మూఢుని యవస్థ వంటిది యగును. అనగా విరక్తులై, బ్రహ్మనిష్ఠ చేసి యీశ్వర సాక్షాత్కారస్థితిని బొందజూడక వాచావేదాంతముచే తృప్తి నొందువారి స్థితియు నీలాగున నుండునని భావము.

**న త్యజేచ్చేద్యతిర్ముక్తో యో మాధుకరమాతరమ్ ।**
**వైరాగ్య జనకం శ్రద్ధాకళత్రం జ్ఞాననందనమ్ ॥**

ఏ యతి మాధుకరమను తల్లిని, వైరాగ్యమను తండ్రిని, శ్రద్ధ యను భార్యను, జ్ఞానమను పుత్రుని విడిచి పెట్టడో అతడు ముక్తుడే. సందేహము లేదు. వీనిని విడిచి పెట్టినవాడు బద్ధుడే. సంశయము లేదు.

**శుద్ధశౌచ మితిప్రోక్తం మృజ్జలాభ్యాం తు లౌకికమ్ ।**
**చిత్తశుద్ధికరం శౌచం వాసనాత్రయనాశనమ్ ।**
**జ్ఞానవైరాగ్యమృత్తోయైః క్షాళనాచ్ఛౌచ ముచ్యతే ॥**

శుద్ధమృత్తికచేతను, నిర్మలజలముచేతను నేలాగున బాహ్యశౌచము విధింపబడినదో ఆలాగున జ్ఞానమనెడు జలముతోను, వైరాగ్యమనెడు మట్టి తోను నెవడు ఆత్మశుద్ధి చేసికొనునో, అతడే శుద్ధాత్ముడగును. అట్లు చేయక జలమృత్తికాదులచే దేహశుద్ధిమాత్రము చేసికొని ఆత్మశుద్ధి చేయనిచో, పాత్రముయొక్క బాహ్యముమాత్రము కడిగి అంతరమున కడుగనట్లుండును. లోకవాసన, దేహవాసన, శాస్త్రవాసనలను విషయవాసనలను శుద్ధపరచుటయే శౌచమనంబడును. ఇదే చిత్తశుద్ధిని గలుగచేయును. ఇదే శుద్ధమైన శౌచ మనియు మృజ్జలములచే చేయునది మలినశౌచమనియు, మహర్షులచే చెప్ప

బడెను. ఇచ్చట శాస్త్రవాసన యనగా బాహ్యావిషయములను గలుగజేసెడి దుష్ట శాస్త్రములని భావమే. కాని, ఉపనిషత్తులు భగవద్గీత మొదలగు వేదాంత శాస్త్రములు గావు. ఏలన? అవి నిరంతరము విషయ వాసనారహిత పరమగు నిర్వాసనాస్థితినే బోధించుచుండును. నవలలు, నాటకములు మొదలైనవి విషయవాసనలను వృద్ధి పరచుచుండును. కావున కూడదు. దీనిని మాత్రమే శాస్త్రవాసనయని గ్రహించవలెను.

**ఆలస్యమనృతం శాఠ్యం జాడ్యం నిందాஉ ప్యనుద్యమః ।**
**షడేతే మంత్రిణస్తస్య జ్ఞానద్వారవిరోధినః ॥**

1. ఆలస్యము (సోమరితనము), 2. అసత్యము, 3. మూర్ఖత్వము (మోసము), 4. రోగము, 5. పరులను నిందించుట, 6. స్వప్రయత్న రహితుడై యుండుట అను నీయారున్ను జ్ఞానద్వారము నడ్డగించెడు అజ్ఞానము యొక్క మంత్రులని గ్రహించవలయును.

కనుక ముముక్షువులు ఇట్టి దోషములను దగ్గర చేరనీయక సదా ప్రయత్నపరులై యుండవలయును.

**బ్రహ్మైక విషయాం వాచం వదేత్సతతమాస్తికాః ।**
**అన్యా వాచస్త్యజేదేష సేతు రేవామృతస్య చ ॥**

ఓ ఆస్తికోత్తములారా! బ్రహ్మైక్య విషయములగు వాక్యములను మాత్రమే సదా ఉచ్చరించుటయు, నితరములగు వాక్కులను విడిచిపెట్టుటయు నేది గలదో అదియే అమృతమునకు సేతువగును. అనగా నిట్టి నియమము గల్గియుండుటయే సంసార సాగరమును దాటుటకు సేతుబంధనము వంటిదగును.

## శ్రీ విష్ణుమూర్తికి భృగు శాపము

(శ్రీమదుత్తర రామాయణము - షష్ఠాశ్వాసము)

దీనియందు శ్రీ విష్ణుమూర్తికి భృగుమహర్షివల్ల శాపము గలుగుటకు

కారణము చెప్పబడుచున్నది. అందువల్లనే మానవజన్మ మెత్తుటయున్ను, తన యొక్క సాక్షాద్విష్ణు స్వరూపము మరుగు పడుటయున్ను, సీతాదేవి వియోగముచే వ్యాకులత నొందుటయున్ను సంభవించినవి. శ్రీసీతాదేవిని కారడవిలో త్రోసివేసి వచ్చునప్పుడు చాల దుఃఖాక్రాంతుడై లక్ష్మణుడు సారథి యగు సుమంత్రునితో మార్గమధ్యమున శ్రీసీతాదేవియొక్క కష్టమును చెప్పు కొని అపరిమితముగా దుఃఖించుచు "ఈ సీతాదేవి జనాపవాదమున కలిగిన దోషముచే అరణ్యములో శ్రీరామభద్రునియాజ్ఞచే త్రోయబడెను. ఈ పాపము శ్రీరామభద్రునికి చెందునా? లేక అపవాదము కల్పించిన జనులకుజెందునా" యని అడిగినప్పుడు సుమంత్రుడు చెప్పుచున్నాడు. ఈ చరిత్రము శ్రీవసిష్ఠాశ్రమమునకు దశరథుడు వెళ్ళియుండు కాలమున దుర్వాసమహర్షిని, శ్రీరామచంద్రుని భవిష్యద్విషయమై అడుగగ, మహర్షి దశరథమహారాజుతో తెలిపిన విషయము సుమంత్రుడు విని యుండెను. అది శ్రీలక్ష్మణస్వామితో చెప్పుచున్నాడు : -

**ధరణీజ న్నెడబాసి రామవసుధాధ్యక్షుండు పెక్కేండ్లు త**
**ద్విరహం బొందెడి కారణంబు గల దావృత్తాంత మేదంటివా**
**పరిపాటిన్ వినుపింతు విన్ము దివిజాల్ భంగించినన్ దైత్యులా**
**తురులై మున్ భృగుపత్ని మర్వుసార నెంతో కూర్మి నక్కాంతయున్.**

**వారి కభయమిచ్చి వైరుల వారింప నసురనై రిచేరి యప్పురంధ్రి**
**శిరము చక్రధార ఛేదించి దైత్యుల సంహరింప భృగువు చాల గినిసి.**

**దేవుడవంచు నిన్ను వినుతింతురు రందరు నింత క్రూరతన్**
**స్త్రీవధ యెట్లు చేసితివి? శ్రీధర యీ కొల చెందకుండగా**
**బోవునె? మానవత్వమున భూమిని నీవిక బుట్టి యాత్మపత్నీ**
**విరహార్తి వందురు మనేక దినంబులటంచు దిట్టినన్.**

**హరి కిచ్చిన యా శాపము**
**పొరసె నతని మరల ఋషుల బోధల నతడా**

**హరి బొ౦గడి మాన్పె శాపము**
**హరికథ లెట్టైన మేలె యది యేల నృపా?**

**ఆ భృగు శాపము వారిజ**
**నాభుడు వహియించి నీకు నందనుడయ్యెన్**
**నీ భాగ్య మెంచ దగునె క**
**దా! భూవర రాముడొందు దత్ఫల మింకన్.**

**హరికైన హరునకైనన్**
**బరమేష్ఠికినైన విప్రభాషల త్రోయన్**
**దరమగునే? యని లీలా**
**హరు డమ్ముని దెలుప నృపతి యద్భుతమందెన్**

**ఈ రహస్యంబు పురి జేరునెడ నృపాలు**
**డానతిచ్చిన నేవింటి నంతె కాని**
**యెవ్వరు నెరుంగ రీవార్తనిపుడు**
**పొగుల ననఘ దెల్పితి... ... ... ... ... ...॥**

ముముక్షువులారా! ధర్మముచే గలుగవలసిన జ్ఞానము అధర్మముచే నెట్లు గల్గును? జ్ఞానముచే నుద్భవించవలసిన విజ్ఞానము అజ్ఞానముచే నెట్లు లభించును? పరిశుద్ధకర్మచే పొందవలసిన నైష్కర్మ్యసిద్ధి మలినకర్మము చేయువారికెట్లు గల్గును? కావున భగవంతుడు గీతలో దైవగుణము గలవారికే దైవప్రాప్తి గల్గుననియు, అసురస్వభావము గలవారికి పైశాచికత్వముగాని, నరకముగాని, దైత్యరాక్షసుల లోకముగాని గల్గునని ఉపదేశించిన విషయ మిచ్చట పొందుపరచెద. ఈ శ్లోకములు ఇంతవరకు వ్రాసియుండు గ్రంథము లచే తెలిపియుండుటచే నిచ్చట సూచనగా నిరూపించడమైనది.

**దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా ॥**

దైవసంబంధములైన సత్త్వగుణములు బంధనివృత్తిని గలుగ జేయున

నియు, అసురసంబంధమైన స్వభావము బంధమును గలుగజేయుననియు నిశ్చయముగ నమ్మవలెనని ఉపదేశించెను. "మతా"అని యుపదేశించుట వలన భగవన్మతమని యభిప్రాయము.

**ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః ।**
**న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే ॥**

అసురస్వభావము గల జనులు ముక్తిమార్గములో ప్రవృత్తి గల్గుట కేకార్యములు చేయవలెనో వానిని తెలిసికొనజాలరు. అనర్థహేతువులు గల్గి బంధము గలుగజేయు నేకార్యము గలదో దానినుండి నివృత్తియు నెరుంగరు. మరల నెట్లుందురన, వారియందు బాహ్యశుద్ధియున్ను ఆత్మశుద్ధియు నుండదు. సదాచార నిష్ఠయు నుండదు. సత్యవాక్యముగూడ నుండదు. ఇట్టి గుణ ములు గలవారలు అసుర స్వభావులని తెలిసికొనవలయును. వీరికి దైవ ప్రాప్తి గలుగదు. మరల నెవరికి నీశ్వరజ్ఞానము గల్గునో వారి లక్షణము భగవం తుడే యీ క్రింది విధముగా నుపదేశించుచున్నాడు.

**అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్ ॥**
**అహింసా సత్య మక్రోధస్త్యాగ శ్శాంతి రపైశునమ్ ।**
**దయా భూతేష్వలోలత్వం మార్దవం హ్రీరచాపలమ్ ॥**
**తేజః క్షమా ధృతిశ్శౌచ మద్రోహో నాతిమానితా ।**
**భవన్తి సంపదం దైవీమభిజాతస్య భారత! ॥**

1. భయము లేకుండుటయు, 2. హృదయశుద్ధి గల్గియుండుట, 3. ఆత్మభావములో నిలకడ గలిగి సుస్థిరముగ నుండుట, 4. దానశీలము గల్గి యుండుట, 5. జ్ఞానేంద్రియ కర్మేంద్రియము లనెడు పదియింద్రియములను నెల్లప్పుడు స్వాధీనతలోనుంచుట, 6. పంచయజ్ఞపరుడై యుండుట వీనిలో ఆత్మధ్యానమున్ను, అతిథి సత్కారములున్ను ముఖ్యములు, 7. ప్రణవాది మంత్రములనుగాని గీతోపనిషదాదులగాని ప్రతిదినమును జపపారాయణ

ములలో నుంచుట, 8. తపస్సుచేయుట, 9. కుటిలత లేకుండుట, 10. హింస చేయకుండుట, 11. సత్యావాక్కు గలిగియుండుట, 12. కోపము గలుగకుండ నుండుట, 13. ఆత్మ కన్యములైన దృశ్యవృత్తుల నన్నిటిని త్యజించుట, 14. శాంతము గల్గియుండుట, 15. ఇతరుల యొక్క దోషములను ప్రకటన చేయ మియును, ఇతరులపై లేనిదోషముల నారోపింపకుండుటయు, 16. ప్రాణి కోట్లలో స్వభావముగా దయగల్గియుండుట, 17. ఇంద్రియచాపల్యము లేకుండుట, 18. మృదుస్వభావము గల్గియుండుట, 19. చేయరాని పనులలో సిగ్గుగల్గి యుండుట, 20. ఇంద్రియముల నన్నిటిని నిశ్చలముగ జేసుకొనుట, 21. బ్రహ్మతేజస్సు గల్గియుండుట లేక శాంత తేజస్సు, కరుణా తేజస్సు, వైరాగ్య తేజస్సు, భక్తి తేజస్సు గల్గియుండుట, 22. ద్వంద్వముల సహించు శక్తి గల్గి యుండుట, ఓర్మి, ధైర్యము గలిగియుండుట, 23. ధారాణాశక్తి గల్గియుండుట, 24. బాహ్యాభ్యంతర శుద్ధి గల్గి యుండుట, వీనిలో అజ్ఞులకు బాహ్యశుద్ధియు, విజ్ఞాన కాత్మశుద్ధియు, నాధిక్యము గల్గి యుండును. 25. ఎవరికిని ద్రోహము చేయకుండుట, 26. అభిమానము లేక యుండుట అనగా నిరభిమానియై జీవించుట అను నీ యిఱువదియాఱున్ను దైవగుణము గల వారికి గల్గియుండును. వీరే దైవప్రాప్తి కర్హులని గ్రహించుకొనవలయును.

ఉన్నతోన్నతములగు నుద్యోగములకు ఉన్నతోన్నత పరీక్షలలో నెట్లు ఉత్తీర్ణులు గావలసియుండునో, ఆలాగున సర్వోన్నతమగు దైవస్థితి గలుగ వలసి యుండిన నిట్టి యున్నత గుణములు గల్గియుండవలయును. తాను చదువుచుండు పాఠములు కొన్నింటిలో నుత్తీర్ణుడై కొన్నింటిలో తప్పిపోయినచో మరు సంవత్సరము తప్పిపోయిన భాగమేలాగున చదువవలసియుండునో, ఆలాగుననే ముముక్షువు లభ్యసించుచుండెడు బ్రహ్మవిద్యలో నీ పై వివరించి నవి చదువవలసిన పాఠములు. అనగా, అనుష్ఠానములో నుండవలసిన నియమములు. వీనిలో నేమేమి కొరత గల్గియుండునో దానిని పూర్తిచేయుటకు నీ విశ్వవిద్యాలయములో మరియొక జన్మమెత్తి యాచరణలోనికి తీసుకరావ లెను. అది యెన్ని జన్మములకు సిద్ధించునో అప్పుడే ముక్తి గల్గును. ఇది

భగవదాశయమని మరునకయుందురుగాక!

ఇక యిదే విషయమై పదమూడవ అధ్యాయమున "జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యం" అని శ్రీకృష్ణభగవాను లుపదేశించుటచే జ్ఞానము గల్గిన పిమ్మటనే జ్ఞేయము గల్గుననియు, అట్టి జ్ఞేయము జ్ఞానగమ్యమనియు ముముక్షువులు గ్రహించందగినది. జ్ఞానశబ్దమునకు దైవజ్ఞానమనియు, వస్తువివేక జ్ఞానమనియు, జ్ఞానికుండవలసిన గుణమనియు అర్థములు గలవు. ఇచ్చట జ్ఞానికుండవలసిన గుణమే చెప్పబడుచున్నది. ఇట్టి గుణము గలవానికే జ్ఞేయమగు దైవసాక్షాత్కార జ్ఞానము గల్గును. దీపపు ప్రకాశము జ్ఞేయముగాను, తైలము, వత్తి, పాత్ర జ్ఞానముగాను గ్రహించవలెను. ఇవిలేనిచో జ్యోతి యేలాగున నిలువజాలదో యాలాగుననే భగవాను లుపదేశించిన ఈ క్రింది గుణములు లేనిచో దైవజ్ఞానము గలుగదని గ్రహించుకొనవలెను.

**అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాంతిరార్జవమ్ ।**
**ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మ వినిగ్రహః ॥**

**ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ ।**
**జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ॥**

**అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు ॥**

**మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ ।**
**వివిక్తదేశసేవిత్వ మరతిర్జనసంసది ॥**

**అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।**
**ఏతత్ జ్ఞాన మితిప్రోక్త మజ్ఞానం యథతోఽ న్యథా ॥**

1. తన్ను స్తోత్రము చేసుకొనుటయు నితరుల నిందించుటయు లేకయుండుట, 2. తాను చేసిన మహాకార్యములను పొగడుకొనకుండుట, 3. అహింసావ్రతము గల్గియుండుట, 4. క్షమ గల్గియుండుట, 5. సన్మార్గ వర్త

నము గల్గియుండుట, 6. గురుశుశ్రూషయందు ప్రీతి గల్గియుండుట, 7. మనశ్శుద్ధియు, దేహశుద్ధియు గల్గియుండుట, 8. తనయొక్క ప్రవృత్తి యందు స్థిరబుద్ధి గల్గియుండుట, 9. ఇంద్రియములు, మనస్సు మొదలైన వానియొక్క నిగ్రహము గల్గియుండుట, 10. ఇంద్రియ విషయములో విరక్తి గల్గియుండుట, 11. అహంకారము లేకుండుట అనగా తాను యోగి, తపస్వి, సన్న్యాసి, బ్రహ్మ చారి, బ్రాహ్మణుడు, సత్కులజాతుడు మొదలగు ననాత్మభావములు గలుగ నీయక చూచుట, 12. జన్మమువల్ల, మరణమువల్ల, ముదిమివల్ల, రోగమువల్ల గలిగెడు దుఃఖములను తెలిసికొని యీలాటి జన్మము మరల గలుగని మోక్షము గలిగేలాగున ప్రయత్నించుట, 13. పుత్రులయందు, భార్యయందు, గృహాదుల యందు ఆసక్తిలేకుండుట, 14. అంతేగాక పైజెప్పిన వారిలో మమ త్వము గలుగనీయక చూచుట, 15. ఇష్టానిష్టములలో సమత్వము గల్గి యుండుట, 16. సర్వేశ్వరుని యందచంచలమైన యేకాంతభక్తి యుండుట, లేక జీవేశ్వరుల ఐక్యానుసంధానము సదా గల్గియుండుట, 17. పరిశుద్ధమైన నిర్జనస్థలములో నుండి బ్రహ్మనిష్ఠ చేయుస్వభావము గల్గియుండుట, 18. ప్రాకృతజనులలో నుండుటకు ప్రీతిలేకపోవుట, 19. ఆత్మజ్ఞానమందు నిలకడ గల్గియుండుట అది యొకటియే శాశ్వతమైన వస్తువని తలంపు గల్గియుం డుట, 20. ఆత్మ సాక్షాత్కార జ్ఞానము గల్గియుండుట.

ఈ యిరువదియు జ్ఞానికి ఉండవలసిన గుణములు. వీని కన్యమైన ప్రాకృత గుణము లుండరాదు. అవి యుండిన అజ్ఞానమే యగును. రసాయన వేత్తలు ఏమేమి పదార్థము భాగానుప్రకారము కలిపిన అది శుద్ధమగునో వానిలో నేదైన తగ్గిపోయిన అది ఏలాగున పని చేయజాలదో, ఆలాగుననే జ్ఞానికి నుండవలసిన యీ గుణములలో నేదైన కొరత గల్గి మరియొక దుర్గు ణము గల్గియుండిన అది మోక్షసిద్ధిని గలుగజేయదు. ఆలాగున వైద్యశాస్త్ర ప్రకారము కషాయముగాని, లేహ్యముగాని, మాత్రలుగాని చేయవలసియుం డిన ఏ యే యోషధులు ఎంతెంత చేర్చి పక్వము చేయవలెనో, ఆలాగున చేసినగదా ఆ మందు రోగమును హరింపచేయును? అట్లు గానిచో ఔషధము

నకు బలము తగ్గినందుచే రోగమేలాగున హరింపబడదో, జ్ఞానియొక్క స్థితియు నాలాగున నుండును. ఇట్టి సుగుణము లన్నియు గల్గినమాత్రమే అజ్ఞానరోగము రహితమై బ్రహ్మజ్ఞానము గల్గును. అట్లు గానందుచేతనే చాల సంవత్సరములు గురుపుత్రులై యుండియు, వేదాంతవిచారణ చేయుచుం డియు జ్ఞానము గలుగక పోవుచున్నది. మరియు క్షీరాన్నముగాని, పిండి వంటలుగాని, చేయవలసియుండిన కొలత ప్రకారము పాలు, చక్కెర, పిండి, బియ్యము మొదలైనవి గల్గియుండి పక్వముగా వండిన మాత్రముగదా రుచి గల్గి యోగ్యములై యుండును? లేనిచో నేలాగున హృద్యములు గావో, ఆలాగుననే జ్ఞానియైన వానికి నిట్టి దైవగుణము లన్నియు గల్గిన మాత్రమే బ్రహ్మామృత పానము గల్గి మోక్షానుభవము గల్గును.

మరియు ఫిరంగి, తుపాకి, బాంబు మొదలైన వానికి మందులు తయారు చేయునప్పుడు గంధకము, పెట్లు ఉప్పు, బొగ్గు, పదును ఇచ్చెడి పదార్థములు అన్నియు సరిగా గల్గియున్నమాత్రమున గదా అది సరియైన కార్యమున కుపయోగపడును? అట్లు గాని యెడల నేలాగున తీవ్రముగా పని చేయజాలదో, ఆలాగుననే యిప్పుడు భగవాను లుపదేశించిన పావనగుణ ములు గల్గియున్న మాత్రముననే అజ్ఞానదుర్గమును ధ్వంసము నొనర్చి ఆత్మా రామ మోక్షసామ్రాజ్యమును స్వాధీనపరచుకొనవచ్చును గాని లేనిచో సాధ్యము కాదు. ఆలాగున విద్యుద్దీపము వెల్గుటకున్ను, ఇంజనులు పనిచేయుటకున్ను, వానికి భాగానుప్రకారము శక్తులు సమకూర్చేలాగున చేసిన మాత్రము గదా యవి తత్త త్కార్యముల జేయు శక్తి గల్గియుండును! ఆలాగున వైరాగ్యబోధ ఉపరత్యాది బ్రహ్మగుణములు గల్గిన మాత్రమే దైవప్రాప్తి గల్గును. లేక దాని కర్హత సిద్ధించును. ఇక నీలాటి దృష్టాంతము లెన్నియో గలవు. అవి జిజ్ఞాసు వులే యూహించుకొనవచ్చును.

ఇక అచంచలమైన బ్రహ్మజ్ఞానము గల యోగియొక్క లక్షణము ద్వితీ యాధ్యాయములో స్థితప్రజ్ఞుని లక్షణనము శ్రీకృష్ణభగవానులుపదేశించి యున్నారు. ఇది 54వ శ్లోకమునుండి అధ్యాయాంతరమువరకు 18 శ్లోకము

లచే శ్రీభగవానులు విస్తారముగ వర్ణించియున్నారు. అది గీతలో చూచుకొన వచ్చును. ఇట్టి నియమములు, ఆచరణలు లేక పోవుటచేతనే బ్రహ్మవేత్తల జ్ఞానశక్తి తగ్గిపోయినది. సమిధలు లేని అగ్నిహోత్రుని స్థితివంటిదైనది. అయితే అది క్షయించినదే గాని నశించలేదు. మరల ప్రజ్వరిల్లజేసిన యథా ప్రకారము రగులుచుండును. ఆలాగున నిప్పటినుండి ముముక్షువులు అను ష్ఠానపరులైయుండిన క్షయించిపోయిన ఋషులయొక్క బ్రహ్మజ్ఞానశక్తిని ప్రకాశములోనికి తీసుకొని రావచ్చును. ఆచరణలేని కారణముచేతను, భక్తి జ్ఞాన వైరాగ్యాదులు తగ్గిపోవుటచేతను బ్రహ్మనిష్ఠ కింత పతనము గల్గినది.

**భక్తి ప్రవాహయోగేన వైరాగ్యేణ బలీయసా ।**
**యుక్తానుష్ఠానయోగేన జ్ఞానేన బ్రహ్మయోగినా ॥**

**విశుద్ధేన తదాత్మానమాత్మనా విశ్వతోముఖః ।**
**స్వానుభూత్వా తిరోభూతమాయాగుణవిశేషణమ్ ।**

**బ్రహ్మణ్యవస్థితమతిర్భగవత్యాత్మ సంశ్రయే ।**
**నివృత్త జీవాపత్తిత్వా ద్వీతక్లేశాత్మ నిర్వృతిః ॥**

**నిత్యారూఢ సమాధిత్వాత్ పరావృత్తగుణభ్రమాత్ ।**
**న సస్మార తదాత్మానం స్వప్నదృష్టమివోత్థితః ॥**

భక్తిప్రవాహముచేతను, బలవంతమగు వైరాగ్యముచేతను, తగినట్లు కర్మల నాచరించుటచేతను, పరమేశ్వరైక్యమును గల్గించు జ్ఞానముచేతను, బ్రహ్మయోగి యగువాడు నిర్మలమగు మనస్సుతో మాయాగుణముల నశింప జేసి, స్వానుభవముతో పరిశుద్ధుడగు నాత్మను గ్రహించి యాత్మరూపుడగు బ్రహ్మమునందు స్థిరచిత్తుడై జీవస్వభావము లేకపోవుటవలన సర్వదుఃఖర హితుడై స్వస్వరూపానందము గలవాడై, పరిపూర్ణసమాధిసిద్ధి గాంచిన వాడగు టచే గుణభ్రాంతిలేని వాడై మేల్కాంచిన వాడు కలలో చూడబడిన వానిని స్మరింపనట్లు తన రూపము స్మరింపలేదు (ఒడలు మరచెననుట) అని ఋషులు వచించిరి. మఱియు పురాణమున నీలాగున గనుపించుచున్నది.

**యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ ।**
**త్వామనుస్మరతస్సా మే హృదయాన్మా పసర్పతు ॥**

ఓ విష్ణుదేవా! ఆత్మజ్ఞానశూన్యులకు స్త్రీ పుష్పాది విషయముల యందు దృఢమైన యేప్రీతి గలదో, ఆ ప్రీతి నాయందు లేనిదై అనగా వానిలో నప్రీతి గల్గి నిన్ను సర్వదా చింతించెడి నామనమునందు మీయందు ఆలాటి ప్రీతి సదా గల్గియుండునుగాక! అనగా పామరజనులకు దృశ్యముల యందెంత ప్రీతి గల్గి యుండునో, జ్ఞానులకు వానియందు అంత విరక్తియు, సర్వేశ్వరుని యందు అనగా ఆత్మయందు ఆలాటి ప్రీతియు సదా గల్గియుండవలెను. ఇదే విరక్తుని యొక్కయు, ముముక్షువు యొక్కయు లక్షణమై యుండును.

ఇక బ్రహ్మచింతనము చేయువారికి ఆహారశుద్ధి లేకపోవుటచేతనే అంతఃకరణశుద్ధి, విజ్ఞానోదయము గలుగక పోయినవని సూతసంహిత యందు చెప్ప బడినది చూడందగును.

## అభక్ష్య నివృత్తిః

శ్రీసూత ఉవాచ : -

**అథాతస్సంప్రవక్ష్యామి మునయస్సం శ్రితవ్రతాః ।**
**అభక్షస్య నివృత్త్యా తు విశుద్ధం హృదయం భవేత్ ॥**

**ఆహార శుద్ధౌ చిత్తస్య విశుద్ధిర్భవతి స్వతః ।**
**చిత్తశుద్ధౌ క్రమాత్ జ్ఞానం జాయతే పారమేశ్వరమ్ ॥**

శ్రీ సూతమహర్షి సనకాదిమహర్షులకు చెప్పుచున్నారు - సునిశ్చిత వ్రత నిష్ఠగల మునులారా! నేను చెప్పుదానిని సావధానచిత్తము గలవారై వినుడు. అభక్ష్యముయొక్క నివృత్తివలన హృదయము ముక్కిలి శుద్ధమగును. ఆహారశుద్ధివలన హృదయమునకు స్వయముగానే విశుద్ధి గల్గును. చిత్తశుద్ధి గలుగగా పరమేశ్వరజ్ఞానము క్రమముగా ఉదయమగును.

అభక్ష్యమనగా, రజస్తమోగుణములతో గూడినదై ప్రాణిహింసాది పరమగు ఆహారము పాపార్జనముచే వచ్చెడు మంచి వస్తువైనను విషము కలిసిన పదార్థము ప్రాణహానికరమగునట్లు పాపమును గలుగజేయును. ఆలాటి పాపపు సొమ్ముచే కొనెడి శుద్ధవస్తువు లైనను పాపము కలిసినందుచే జ్ఞానమును మరుగుపరచి అజ్ఞానమును వృద్ధిచేయును. మలినమగు కిరస నాయిల్‌చే చిమ్నీ యేలాగున త్వరలో పొగనిండినదై ప్రకాశమును మరుగుపరచునో; ఆలాగున పాపమైన, మలినమైన, అధర్మమైన ఆహారమున్ను తమోగుణమును సాధకుని విషయ గుణమును కోపాది దుర్గుణములను వృద్ధిపరచి అంధకారములోనికి పడద్రోయును.

**పారమేశ్వర విజ్ఞానే సతి సంసారహేతవః ।**
**గ్రంథయస్తు వినశ్యంతి న హి సందేహకారణమ్ ॥**

**అభక్ష్యభక్షణాచ్చిత్తమశుద్ధం భవతి స్వతః ।**
**అశుద్ధ్యా భ్రాంతి విజ్ఞానం జాయతే సుదృఢం నృణామ్ ॥**

పరమేశ్వరజ్ఞాన మావిర్భవించు కాలమున సంసారమునకు కారణము లగు హృదయగ్రంథు లన్నియు నశించును. దీనియం దేలాటి సందేహమున్ను లేదు. వృక్షమునకు వేర్లు ఎటువంటివో, అజ్ఞానవృక్షమునకు దృశ్యాది వృత్తుల టువంటివి. ఇవి నశించువరకున్ను జీవునికి ముక్తి లేదు. ఇవియే హృదయ గ్రంథులని గ్రహించవలయును. అశుద్ధాహారమువల్ల చిత్తము స్వయముగ నశుద్ధమగును. అట్టి చిత్తాశుద్ధివల్ల నైజజ్ఞానము మరుగుపడి జనులకు భ్రాంతి జ్ఞానము దృఢముగ గల్గును. ఈభ్రాంతిజ్ఞానమునే విపరీత జ్ఞానమని గ్రహించ వలయును.

**భ్రాంతి విజ్ఞానతః పుంసో నిషిద్ధాచరణే రతిః ।**
**జాయతే తు తయా పాపం కురుతే సర్వదా జనః ॥**

**తేన సంసారవృద్ధిస్స్యాన్న హి ముక్తిః కదాచన ।**
**తస్మాదభక్ష్యం యత్నేన దూరతః పరివర్జయేత్ ॥**

భ్రాంతిజ్ఞానమువలన మనుజులకు నిషిద్ధాచరణమందు ప్రీతి గల్గును. అందువల్ల జనము సదా పాపకార్యమే చేయుచుండును. అట్టి కారణమువలన సంసార దుఃఖమునకు హేతువగు నజ్ఞానము వృద్ధి నొందుచుండును. ఇట్టి వారికి ముక్తి యెుకప్పుడైనను గలుగదు. కావున సూక్ష్మబుద్ధి గలవారు ప్రయత్న పూర్వకముగా నిషిద్ధాహారమును దూరముగ వర్జించవలయును.

**అభక్ష్యం బ్రహ్మవిజ్ఞానవిహీనస్యైవ దేహినః ।**
**న సమ్యక్ జ్ఞానిన స్తస్య స్వరూపం సకలం ఖలు ॥**

అభక్ష్య పదార్థము బ్రహ్మవిజ్ఞాన విహీనులకు మాత్రమే. సమ్యక్ జ్ఞానము గల వానికది తగదు. జ్ఞానికి సమస్తము తన స్వరూపమే కదా!

**తస్మా దభక్ష్యం నైవాస్తి విదుషః పరయోగినః**
**ఆత్మ విజ్ఞాన హీనానాం ఖల్వేవాభక్ష్య మాస్తికాః ॥**

కావున శ్రేష్ఠులైన యోగులు అభక్ష్య భక్షణము చేయరాదు. ఆస్తి కోత్తములగు ఋషులారా! ఆత్మవిజ్ఞాన విహీనులైన వారుమాత్రమే అయోగ్యా హారముల భుజింతురు. ముముక్షువులారా! ఋషులు చెప్పినది వింటిరా?

**తస్మాదభక్ష్యం సంత్యజ్య బ్రాహ్మణో మతిమత్తమః ।**
**చిత్తస్య పరిశుద్ధ్యర్థం భక్ష్యమేవ తు భక్షయేత్ ॥**

**క్షత్రియాణాం చ వైశ్యానాం భక్ష్యమేష్వపి విద్యతే ।**
**తథాపి భక్షణాభావాత్తేషామత్యంతశోభనమ్ ॥**

**శూద్రాదీనాం చ సర్వేషామభక్ష్యం నైవ విద్యతే ।**
**తథాఽ ప్యభక్షణం తేషాం ఫలాయ మహతే భవేత్ ॥**

**భక్షస్య భక్షణాదేవ విశుద్ధహృదయః పుమాన్ ।**
**పారమేశ్వరవిజ్ఞానాన్ముచ్యతే భవబంధనాత్ ॥**

పై జెప్పిన కారణమువల్ల మతిమంతులగు బ్రాహ్మణులు చిత్తము యొుక్క పరిశుద్ధికొఱకు అశుద్ధాహారములను లెస్సగా పరిత్యజించి శుద్ధాహార

మును మాత్రమే భుజించవలెను. ఆలాగున మతిమంతులగు క్షత్రియులున్ను, వైశ్యులున్ను హింసాది పరములగు నీచాహారముల విడిచి శుద్ధాహారములనే భక్షించవలెను. అట్లు అభక్ష్య విసర్జనముచేతను శుద్ధభక్షణము చేయుటచేతను, వారి హృదయము అత్యంత శోభాయమాన మగును. ఆలాగుననే శూద్రాదులున్ను తదితరులున్ను అపవిత్రమును భుజించరాదు. అట్టి శుద్ధాహార భక్షణముచే శూద్రాది తదితరులందరికి మహత్తైన ఫలము గల్గును. శుద్ధాహార భక్షణమువలననే మనుజుడు విశుద్ధ హృదయము గలవాడగును. అట్టి వానికి మాత్రమే పరమేశ్వర సాక్షాత్కార జ్ఞానము గల్గును. అట్టి యీశ్వర సాక్షాత్కార జ్ఞానమువల్ల మాత్రము జీవుడు భవబంధమునుండి విడివడి ముక్తిని బొందును. ఇది యిచ్చట సంగ్రహముగ వ్రాయడమైనది. భక్షాభక్ష్య విషయమై విస్తారముగ గనందలచు వారు సూతసంహిత యందు 34వ అధ్యాయమున గనందగును.

ఒక్కడు పరిశుద్ధాత్ముడై జీవించవలెననియు, పరిశుద్ధ జ్ఞానము గలుగవలెననియు తలంచునేని యీలాగున వర్తించును. పరుల నాశ్రయించి పంచభక్ష్య పరమాన్నాదుల భుజించుటకంటె దైవవశమున తనకు లభించిన అంబలిగాని, గంజిగాని, సంకటిగాని భుజించినను పంచభక్ష్య పరమాన్నముల కన్న నూరురెట్లు ఎక్కువ సుఖముగాను, సంతోషముగా నుండును. ఆలాగున నితరుల నాశ్రయించి పట్టు పీతాంబర శాలువలు మొదలగునవి ధరించుట కన్న యీశ్వరేచ్ఛగా తనకు లభించిన మోటుగుడ్డగాని, గోతముగాని కట్టుకొనిన పైజెప్పినవానికన్న వెయ్యిరెట్లు సౌఖ్యమున్ను, సంతోషమున్ను గలుగును.

ఆలాగున పరులనాశ్రయించి సుందరములగు మతగృహహర్మ్యాదుల నిర్మించి వానిలో నివసించుటకన్న సర్వేశ్వరు డిచ్చిన గుడిసెలో నుండుటలో కోటిరెట్లు సుఖమున్ను, ప్రీతియును గల్గియుండును. ఆలాగున పరుల యాచించి మోటారు, కారు, రైలుబండ్లలో ప్రయాణము చేయుటకన్న నిరాశ్రయుడై సర్వేశ్వరునాశ్రయించి సొంతము పాదచారియై నడచునప్పుడు పైవానికన్న వెయ్యిరెట్లు ఆనందమున్ను, గాంభీర్యమున్ను గల్గియుండును. అదేరీతిగా

నితరుల నాశ్రయించి మధురమైన పాలుత్రాగి తపోయో గాదుల చేయుటకన్న పరాశ్రయము లేక మంచినీళ్ళు త్రాగి, బ్రహ్మనిష్ఠ చేయుటలో కోటిరెట్లు ఫల మధికముగ నుండును.

ఈ అయిదింటిలో, చెప్పవలసిన యితరము లన్నియు నంతర్భూత ములై యున్నవి. అనన్యభక్తి గల్గి పరమేశ్వరసేవ చేయువానికి అనగా, విరక్తి గల్గి బ్రహ్మనిష్ఠ చేయువానికి ఇతరుల నాశ్రయించుటకు మనస్సు గలుగదు. సమయము నుండదు. అదియే దానికి గురుతు. పతివ్రతాధర్మ సంరక్షణ చేయు నారీమణికి పరపురుషుల నాశ్రయించుటకు నెప్పుడైన మనస్సు గల్గునా? అదియే దీనియొక్క లక్షణమని విరక్తుడు, భక్తుడు గుర్తించునప్పుడే అతని జీవితము నిర్మలమగును. అందుచే లోకమున్ను పరిశుద్ధమగును. జనులును ధర్మాత్ము లగుదురు. భక్తియు నభివృద్ధినొందును. ఋషుల జీవిత మిటువంటిదని గ్రహించవలయును. సంసార వృక్షముయొక్క వర్ణన యీ క్రింది శ్లోకములచే వివరింపబడు చున్నది. ఇది దృఢతరమగు వైరాగ్యమను గొడ్డలిచేతమాత్రమే నఱుక సాధ్య పడును.

**అవ్యక్త మూలప్రభవస్తస్యైవానుగ్రహోత్థితః ।**
**బుద్ధిస్కంధమయశ్చైవ ఇంద్రియాన్తరకోటరః ॥**

**మహాభూత ప్రశాఖశ్చ విషయైః పత్రవాం స్తథా ।**
**ధర్మాధర్మసుపుష్పశ్చ సుఖదుఃఖఫలోదయః ॥**

**ఆజీవ్యస్సర్వభూతానాం బ్రహ్మవృక్షస్సనాతనః ।**
**ఏతద్బ్రహ్మవనంచైవ బ్రహ్మ చరతి నిత్యశః ॥**

**ఏతచ్ఛిత్వా చ భిత్వా చ జ్ఞానేన పరమాసినా ।**
**తతశ్చాత్మరతిం ప్రాప్య యస్మాన్నావర్తతే పునః ॥**

అవ్యాకృతము (మూల ప్రకృతి) అనెడు వేరునుండి పుట్టి యావేరు గట్టిదగుటంజేసి క్రమముగా విస్తరించి పెరుగుచున్నదియును, బుద్ధియే స్కంధముగా గల్గినదియును (లోకములో చెట్లకు మ్రానునుండి కొమ్మలు

పెరుగుచున్నట్లు, బుద్ధినుండి సమస్త వికారములు పుట్టును. కాన బుద్ధి ప్రమానుగా జెప్పబడినది). నేత్రేంద్రియాది నవరంధ్రములే తొఱ్ఱలుగా గలదియును, పృథివ్యాదిపంచభూతములే పెద్దకొమ్మలుగా గలదియును, శబ్దాది విషయములే యాకులుగా గలదియును, ధర్మా ధర్మములనెడు మంచిపుష్పములు గలదియును, సుఖదుఃఖములనెడు పండ్లు గలదియును, వృక్షము పక్షులకువలె, సమస్త ప్రాణులకు జీవనాధార మైనదియును, చిర కాలమునకు బ్రహ్మజ్ఞానము గల్గిన పిమ్మట పోవునది యగుటంబట్టి బహు పురాతన మైనదియునగు బ్రహ్మమే యధిష్ఠానముగా గనబడు సంసారమను వృక్షమే పరమాత్మకు విహార స్థానమగు వనమైనది. అనగా బ్రహ్మమే జీవాకారస్థితి (అవిద్యవల్లనే గల్గిన సంసారత్వము) పొందినట్లు తోచుచుండు ననుట. ఇట్టి సంసారవృక్షమును, బ్రహ్మాకారజ్ఞానమను దృఢమైన కత్తిచేత ఛేదించినవాడు ప్రతిబంధకములన్నియు దొలంగుటంచేసి కేవలాత్మనిష్ఠుడై, మరల సంసారబంధము గలుగుటకు వీలు లేని కైవల్య పదమును పొందును అని పురాణములో చెప్పబడెను.

ఇప్పుడు క్రింద వ్రాయబోవు విషయము బ్రహ్మనిష్ఠులందరు చాల జాగరూకత గల్గి గ్రహించందగినది. ఈ చరిత్ర ఉత్తర రామాయణమున గలదు. రావణేశుండు వెయ్యేండ్ల కాలము గొప్పతపస్సు చేసి, పరమేశ్వరుని ప్రత్యక్షము చేసికొని వరము నడిగినప్పుడు పరమకారుణికుడగు నీశ్వరుం డీలాగున నుపదేశించి వరము నిచ్చెను.

**దితిజాధీశ్వర నీవు గోరిన క్రియన్ దీర్ఘాయువున్ నీకు ని**
**చ్చితి నీక్రొవ్వున నీతి జేకొనక దుశ్శీలుండవై మమ్మనా**
**దృతి నొందించితివేని మావరము మమ్మే చేరు బొమ్మన్నచో**
**నత డాశూలికి మ్రొక్కి వీడ్కొని విమానారూఢుడై యుబ్బుచున్.**

భక్తులారా! చూచితిరా! యీశ్వర వాక్యము? తపోబల గర్వముచే దుశ్శీ లుడై దైవమును మరచి ప్రవర్తించిన ఈశ్వరుడిచ్చిన వరము ఈశ్వరుని పొందునని తెలిపిన దానిలో చాల గూఢార్థము గలదు. ఇట్టి దానికే జ్ఞానరక్ష

యని పేరు. ఇప్పుడు కొందరు కొంత శాస్త్రజ్ఞానము గల్గుసరికి కొంత నిష్ఠ, జ్ఞానము అభ్యసించినంతనే కొందరు శిష్యులు తాము చెప్పినదే పరమవాక్య మని తలయూచి మూల్గుట రే:ప్పడినంతనే, తామే సర్వజ్ఞులనియు, తమకు ధర్మకర్మములు లేవనియు, సర్వస్వతంత్రులనియు చెప్పుచు ఒళ్ళు తెలియక ప్రవర్తించునది గనుపించుట లేదా? అట్లు చేయక యెంత కెంతకు భక్తి యున్ను, జ్ఞానమున్ను, పూజ్యతయున్ను గల్గునో అంతకంతకు వినయము, సౌశీల్యము, సత్యధర్మములలో విశ్వాసమున్ను గల్గియుండవలెను. కాయలు పండునప్పుడు, మృదుత్వమున్ను, మాధుర్యమున్ను, సుగంధమున్ను గలుగు నది చూచుటలేదా? మీలో నుత్కృష్టపదవి పొంద కోరిక గలవారు శ్రేష్ఠములైన సుగుణముల నార్జించుకొనవలెను. శ్రేష్ఠపదవిలో నుండువాడైనను నికృష్ట గుణము గలిగిన తప్పక పతితుడగును. చిన్న యుద్యోగములో నుండు వాడైనను ఉన్నత గుణములు, బుద్ధియు గల్గియుండిన ఏలాగున నత్యున్నత పదవిలోనికి వెళ్ళ గల్గుచున్నాడో, ఆలాగున అత్యున్నత పదవిలో నుండు వారికి చెడుబుద్ధి గల్గి తప్పు కార్యములు చేయునప్పుడేలాగున తక్కువ స్థితిలోనికి దిగిపోవుచుందురో యిట్టి లోక దృష్టాంతమును జ్ఞప్తిలో నుంచి వర్తించవలెను. కనుకనే గీతలో భగవాను లీలాగున నుపదేశించిరి.

**యదా సంహరతే చాయం కుర్మోఽఙ్గానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

తాబేలు తన కరచరణాద్యవయవములను అన్ని వైపులను లోపలికి ముడుచుకొనునట్లు, జ్ఞాననిష్ఠా ప్రవర్తకుడు చక్షురాదీంద్రియములను సమస్త మైన దృశ్యాది విషయప్రవృత్తులనుండి యెప్పుడు మరలించుకొనునో అప్పుడు వాని ప్రజ్ఞ (జ్ఞానము) మిక్కిలి స్థిరమైనది యగును. ఇట్టి సంయమమున శక్తి గలుగనిచో దృఢజ్ఞానము గలుగలేదని గ్రహించు కొన వలయును.

**యతతో హ్యాపి కౌంతయ! పురుషస్య విపశ్చితః ।**
**ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః ॥**

ఓ కుంతీపుత్రా! మోక్షముకొరకు ప్రయత్నము చేయుచున్నట్టియు, విద్వాంసుడునైన పురుషునియొక్క మనస్సునుగూడ నింద్రియములు క్షోభింప జేసి ఆకర్షించుచున్నవి (విషయములందు ప్రవర్తింప చేయుచున్నవి) యనుట ప్రసిద్ధము (అనుభవసిద్ధము). విద్వాంసుడై అనుష్ఠానపరుడైన వాని మనస్సునే విషయములు కలతజెందించునని చెప్పునప్పుడు సామాన్యజనులగురించి మరల చెప్పవలెనా! అట్టి భగవద్వాక్యము విచారించునప్పుడు ఏ యనుష్ఠాన మున్ను, ఏ నియమమున్ను అక్కరలేదను వేదాంతుల యాశయమెటువంటిదో యని తెలిసి కొనవచ్చును. ఇది వేదాంతమా? లేక మదాంధమా? అని విజ్ఞులు తెలిసికొందురుగాక!

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

అట్టి క్షోభమును గలుగజేయుటకు కారణభూతములగు చక్షుఃశ్రోత్రా దీంద్రియములను స్వాధీనము చేసుకొని, ధ్యాననిష్ఠ గలవాడుగను పరమేశ్వరై క్యపరుడగును ఉండవలయును. ఎవనియొక్క యింద్రియములు తన యధీ నమందున్నవో, వానియొక్క జ్ఞానముగదా స్థిరతగలదియగును! అట్లు చేయని వాని జ్ఞానము చపల జ్ఞానమేగాని నిశ్చల జ్ఞానము గాజాలదు.

**ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।**
**తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి ॥**

విషయములందు ప్రవర్తించుచున్న ఇంద్రియముల లోపల నే యింద్రి యము మనస్సు ననుసరించి వర్తించుచున్నదో అట్టి మనస్సుతో విషయో న్ముఖమైన యింద్రియము ఈ బ్రహ్మనిష్ఠునియొక్క ప్రజ్ఞను (జ్ఞానమును) సముద్రమునందు ఓడను తుపానువలె ముంచి వేయుచున్నది. లేక మార్గము తప్పించుచున్నది.

బ్రహ్మనిష్ఠులారా! స్థితప్రజ్ఞుని లక్షణమందు భగవాను లీలాగు నుప దేశించుట జ్ఞానరక్ష యని గ్రహించవలెను. ఒకరికి ధనమెట్లో లభింపవచ్చును.

లేక సంపాదించుకొనవచ్చును. అది గొప్పకార్యముగాదు. దానిని సంరక్షించుట లోను, సరిగ వినియోగపరచుటలోను నెక్కువ మేధాశక్తి యుండవలెను. అప్పుడే అది సార్థకమగును. ఆలాగున నేదో సంస్కారబలముచే జ్ఞానము గలుగవచ్చును. లేక సంపాదించుకొనవచ్చును. దానిని చక్కని స్థితిలో నుంచి లోకమునకు బోధించుటలో గొప్పదైవకృపయు, విజ్ఞానశక్తియు గల్గియుండ వలయును. అది లేనందుచేతనే కొందరు కొంత జ్ఞానము గల్గినను, పెడ మార్గమున వర్తించుచున్నారు.

**కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥**

ఈ కామమే అనగా విషయాభిలాషయే క్రోధమై పరిణమించుచున్నది. అనగా తాను కోరిన విషయమునకు అడ్డు గలుగజేసిన వారిపై అది కోపమై పరిణమించును. వీరుభయులు నన్నదమ్ములే. వీరజ్ఞానముయొక్క బిడ్డలు, ఇది (కోపము) రజోగుణముచేత గలిగినది. ఇది మనుష్యుని ఆత్మజ్ఞానమును మరుగు పరచును. ఇది మహాశనుడు అనగా అగ్నివంటిది. అగ్నిహోత్రము సమిధలచేతను, హవిస్సుచేతను, ఘృతముచేతను నంతకంతకు పెరుగునే గాని శమింపదు. మరియు అగ్ని ఉత్కృష్ట నికృష్ట వస్తువులను భేదములేక అన్ని టిని తినివేయునట్లు ఈ విషయాసక్తియును రజోగుణ స్వభావము గలవారికి మంచిచెడుగులు, పుణ్యాపాపములు, శుద్ధాశుద్ధములు తెలియనీదు. ఎద్ది దొరికి నను వారు స్వాధీనము చేసికొందురు. (అనగా అనుభవింతురు) కావున నిది మహాపాపస్వరూప మైనది. కనుక దీనిని నీయొక్క ఆత్మజ్ఞానమునకు పరమశత్రువునుగా తెలిసికొనుము.

**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ।**
**కామరూపేణ కౌంతేయ ! దుష్పూరేణానలేన చ ॥**

ఓ యర్జునా! నింపింప నశక్యమైనదియు (సముద్రము వంటిది యని యర్థము. సముద్రములోనికి అసంఖ్యాక నదుల ద్వారా జలము చేరినను నెట్లు

నిండకయున్నదో యీ కోర్కెయు నటువంటిది) ఎన్ని కట్టెలు వేయుచున్నను తృప్తిబొందని యగ్ని వంటిదియును, ఆశాస్వరూప మైనదియు, ముందు చెప్పబడిన రజోగుణ స్వరూపమునగు నీ కామరూపముచే బ్రహ్మనిష్ఠుని ఆత్మ జ్ఞానము కప్పబడియున్నది. ఇది జ్ఞానికి నిత్యశత్రువగును. అనగా నిది శత్రువు వలె జ్ఞానిని బాధించుచుండును. కావున దీనియొక్క నిశ్శేషనాశము చేసికొన వలెను.

**ఇంద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠాన ముచ్యతే ।**
**ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్ ॥**

చక్షుఃశ్రవణాదీంద్రియములును, మనస్సును, బుద్ధియును ఈ కామ మునకు ఆశ్రయమని చెప్పబడును. ఈ కామము ఈ యింద్రియాదుల చేత ఆత్మజ్ఞానమును కప్పి స్వరూపజ్ఞానమును అనగా ఆత్మను, నానా విధము లుగా విషయమోహములో భ్రమింపజేయుచున్నది. ఇది రజోగుణముతో కూడినది. మనస్సు మొదలైన యింద్రియముల కన్నిటికిన్ని బుద్ధి ఆధారమని చెప్పబడెను. ఆ బుద్ధి శుద్ధము గాక రజస్తమోగుణములు గల్గి యుండును. పువ్వులు, ఆకులు, కాయలు, చిన్నకొమ్మలు చెట్టును భూమి నుండి క్రుంగుటి వ్రేళ్ళతో పెళ్ళగించి పారవేసిన పైనజెప్పిన పుష్పలతాదులు శుష్కించిపోవును. ఆలాగుననే ఆత్మనుండి రజస్తమోగుణములను, సమూలముగ తీసిపారవేయ వలెను. కార్యకరణన్యాయ మనుసరించి గుణి నుండియే గుణములు గల్గు చుండును. కావున నిట్టి గుణములను అంతఃకరణమునుండి తీసి దూరముగా పారవేయవలెను.

**తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥**

కాబట్టి ఓ యర్జునా! నీవు బ్రహ్మనిష్ఠలో ప్రవేశించుటకు తలంపు గల్గు నప్పుడే దశేంద్రియములను అంతరింద్రియములను స్వాధీనము చేసికొని, శాస్త్రములచే గ్రహించిన జ్ఞానమున్ను తనయొక్క వివేకజ్ఞానముచే గల్గిన

జ్ఞానమున్ను, లేక పరోక్ష జ్ఞానమున్ను, అపరోక్ష జ్ఞానమునునగు నీ రెంటిని లేకుండ చేయునదియును, పాపస్వరూపమునగు నీ విషయవాంఛను ప్రయత్న పూర్వకముగా విడువుము. వేదస్వరూపమే మూర్తీభవించిన గీతాచార్యులగు శ్రీకృష్ణభగవానులు బ్రహ్మనిష్ఠలో ప్రవేశించుటకు ప్రారంభించినప్పుడే యీ దృశ్యవృత్తులగు దుర్గుణములను నెంత ప్రయత్నము చేసియైనను విడువవలె నని చెప్పియుండగా, యాత్మజ్ఞానులమని చెప్పుకొనువారు జ్ఞానులకు వృత్తులతో గుణములతో నేమి సంబంధమని చెప్పి అమాయకుల వశపరచు కొనుట జూచిన నెంత సంతాపకరము!

**ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।**
**నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ॥**

ఎవ్వరియొక్క మనస్సు జీవేశ్వరుల ఐక్యభావమందు స్థిరముగ నుండునో వారిచేత నీ శరీరముతో నుండునప్పుడే (జీవించియుండునప్పుడే) జనన మరణ రూపమగు ప్రకృతి జయింపబడినది. అనగా జీవించి యుండు నప్పుడే ప్రకృతి రాహిత్యము గల్గి ముక్తి పొందవలసినదేగాని, శరీర పతనానంత రము గలుగునని తలంచి కాలమును వ్యర్థపరచుట భ్రమయే యగును. బ్రహ్మమేలాగున నిర్దోషమై అనగా ప్రకృతి రహితమైయుండునో, సర్వమునను సమముగ నుండునో అట్టి యవస్థ జీవించి యుండునప్పుడే యీ జీవికి గలుగ వలెను. అట్టి జీవులు పరబ్రహ్మమందు సదా స్థిరతగలవారై యుందురు.

**శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్ ।**
**కామక్రోధోద్భవం వేగం సయుక్తస్స సుఖీ నరః ॥**

కామమువలనను, కోపమువలనను గల్గిన మనోవేగమును అనగా మనో విజృంభణమును, ఇచ్చటనే అనగా దేహముతో గూడియుండగనే (శరీరము వీడిపోవుటకు ముందుగా) అణచుటకు అనగా రహిత మొనర్చుటకు ఏ మనుష్యుడు సమర్థు డగుచున్నాడో వాడు యోగియును, ఆత్మానుభవము గల జ్ఞానియు నగుచున్నాడు. ఈ పై జెప్పిన యవస్థ మనుష్యమాత్రులలో

నెవరికైనను గల్గినచో వాడే బంధవిముక్తి గల్గినవాడగును. వానికిమాత్రమే ప్రకృతిరహిత ప్రబోధానంద ప్రవాహ మనర్గళముగా గల్గుచుండును.

**అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।**
**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥**

అభ్యాస వైరాగ్యములచే స్వాధీనపఱచుకొనబడని మనస్సు గలవాని చేత ధ్యానయోగము పొందబడుట అసాధ్యమని నా నిశ్చయము. అనగా వైరాగ్యానుష్ఠానము లేనివానికి నీశ్వర సాక్షాత్కార జ్ఞానము గలుగజేసికొనుట సాధ్యము గాదనియే శ్రీకృష్ణభగవానుల యాశయము. ఇట్లు భగవద్వచనముండగా పరిశుద్ధాచరణానుష్ఠానముగూడ అక్కర లేదని చెప్పేవారి జ్ఞానమెట్టిదో భక్తులూహించుకొనుట మంచిది. మరల నెట్లు లభ్యమగు ననగా? అనుష్ఠానముచే స్వాధీనమైన మనస్సు గలవానిచే, వైరాగ్యము ఎడతెగని అభ్యాసము మొదలగు నుపాయములవలన పొందుటకు సాధ్యమైనదని గ్రహించవలెను. అనగా శ్రమయని తలంచక ఆత్మవిశ్రాంతి యను గమ్యస్థానము చేరువరకు తీవ్రతమప్రయత్నము గలవానికి నీ జన్మములో దైవసాక్షాత్కార జ్ఞానము కలుగునని భావము.

**ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వన్ద్వమోహేన భారత! ।**
**సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరన్తప ॥**

ఓ భారతా! జన్మించు కాలమందు దృశ్యమగు కోరికచేతను, అనిష్ట ప్రాప్తిచే గల్గిన ద్వేషమనెడు సుఖదుఃఖ హేతువైన వివేక శూన్యతచేతను సమస్త ప్రాణులును మిక్కిలి విషయమోహమును పొందుచున్నవి. అనగా నిచ్ఛాద్వేషములచేత జీవకోట్లు యథార్థజ్ఞానము తెలిసికొనక మోహపరశము అజ్ఞానమునకు వశపడి చెడిపోవుచున్నవని భావము. ఇట్టి అంతఃకరణమున గల భ్రాంతి దోష మెట్లు నశించునో క్రింది శ్లోకములచే చెప్పడుచున్నది.

**యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ ।**
**తే ద్వంద్వమోహనిర్ముక్తా భజన్తే మాం దృఢవ్రతాః ॥**

ఏ జనులయొక్క పాపము చిత్తశుద్ధి కరములగు పుణ్యకర్మానుష్ఠానములచే నశించినదో, అట్టి వారు ద్వంద్వ మోహమునకు హేతువైన యిచ్ఛా ద్వేషములనెడు దోషములనుండి విడువబడినవారలై నిశ్చయమైన నియమ నిష్ఠగలవారలయి నన్ను సేవించుచున్నారు. (పరమాత్మనిష్ఠ చేయుచున్నారు) అనగా ధర్మానుష్ఠానముచే అంతఃకరణ దోషము నశించిన వారికే దృఢ వ్రతము గల్గును. అనగా తన ధర్మమును ఎట్టి విపత్తు గల్గినను చెరచకుండ చూడవలెనన్న మనోనిశ్చయము గల్గును. అట్లు గానందుచేతనే వ్రతభ్రష్టులై స్వరూపజ్ఞానమునుండి పతితు లగుచున్నారు.

**యతన్తో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితమ్ ।**
**యతన్తోఽప్యకృతాత్మానో నైనం పశ్యన్త్యచేతనః ॥**

ధ్యాన నిష్ఠాదులచే బ్రహ్మసాక్షాత్కార జ్ఞానమును గలుగ చేసికొనుటకు ప్రయత్నము చేయుచున్న ధ్యానయోగులు, (యోగనిష్ఠాపరులు) బుద్ధిగుహ యందున్న యీ యాత్మను ఈశ్వర స్వరూపముగా తెలిసికొనుచున్నారు. ఆలాగున అనుష్ఠానాదులలో ప్రయత్నము చేయువారైనను, ఇంద్రియ వ్యాపార ములనుండి మనస్సును మరలించుకొననివారున్ను, సత్యధర్మాను ష్ఠానము లలో నిష్ఠలేనివారును, మనోనిర్మలతకొరకు సరియైన ప్రయత్నము చేయని వారున్ను అగు కొందఱు తనలో గల యాత్మను దర్శింప జాలకయున్నారు. అనగా సత్య ధర్మానుష్ఠానములలో నచంచలమైన వ్రతనిష్ఠ లేనివారెన్ని జప, ధ్యాన, తపశ్చర్యాదులు చేసినను వారికి జ్ఞానము గలుగదని భావము. వీరియొక్క ప్రయత్నము లన్నియు నూషరక్షేత్రములో చేయు కర్షకుని ప్రయత్నమువలె వ్యర్థమై పోవును. ఈ విషయమై యితర గ్రంథములలో ఋషులు తెలిపిన యాశయము జూడుడు.

**మనోరథానాం న సమాప్తిరస్తి వర్షాయుతైరప్యథవాఽపి లక్షైః ।**
**పూర్ణేషు పూర్ణేషు పునర్నవానాముత్పత్తయస్సంతి మనోరథానామ్ ॥**

**పద్భ్యాం గతా యౌవనతశ్చ జాతా దారైశ్చ సంయోగమితాః ప్రసూతాః ।**
**దృష్టాస్సుతాస్తత్తనయప్రసూతిం ద్రష్టుం పునర్వాంఛతి మేఽన్తరాత్మా ॥**
**యజ్జీవతో నైవ మనోరథానా మన్తోఽస్తి విజ్ఞాత మిదం మయాఽద్య ।**
**మనోరథాసక్తి పరస్య చిత్తే న జాయతే వై పరమార్థ సంగతిః ॥**

పదివేల సంవత్సరములకైనను, లక్షసంవత్సరములకైనను మనోరథ ములు ముగియవు. ఏలయనిన మొదట పుట్టినవి, నెఱవేఱ నెఱవేఱ, మఱల మఱల మనోరథములు పుట్టుచుండును. కాళ్ళచే నడక వచ్చినది. యౌవనము వచ్చినది. భార్యలతో సమాగమము గల్గినది. సంతానములు గలిగి నవి. అట్టి సంతానముల కండ్లాఱ చూచుటయైనది. ఇట్లన్ని మనోరథములు తీరినను నా మనస్సులో మనుమల పుట్టుకను జూచుటకు మనోరథములు గల్గుచున్నవి. బ్రతికి యుండగా మనోరథముల కంతము గలుగదను నంశము నేనిప్పుడు దెలిసికొంటిని. మనోరథముల యందాసక్తి గలవాని చిత్త మెన్నటికిని పరమార్థమునందు ఆసక్తి గలది కానేరదు.

కనుకనే "శాంతే సముద్రకల్లోలే స్నానమిచ్ఛతి దుర్మతిః"- సముద్ర స్నానమునకు వెళ్ళిన వారు, అలలు శాంత మొందిన తర్వాత స్నానము చేసి కొనదలంచిన జీవితాంత్యమువరకు నేలాగునసాధ్యముగాదో, ఆలాగున సంసా రములో గల కోర్కెలన్నియు పూర్తియైన తర్వాత జ్ఞానము సంపాదించుకొన తలంచిన ఎన్నికోట్ల జన్మములకైన నలవి కాజాలదు. సముద్రములో పుట్టిన యలలు శాంత మొందినప్పుడు నూతనముగ అలలు పుట్టినట్లు మనుజుల హృదయములో పుట్టిన కోర్కెలకు తృప్తిచేసిన క్రొత్త కోరికలు పుట్టుచుండును.

**దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశ భయాత్త్యజేత్ ।**
**స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥**

ఎవండు తనయొక్క సత్యధర్మానుష్ఠాననిష్ఠలో అనగా సుకృతములో నిలుకడ గల్గి ప్రయత్నించుటచే లోకమువలన బాధయున్ను, శరీరక్లేశమున్ను, గలుగునని తలంచి స్వధర్మనిష్ఠను విడుచుచున్నాడో, వాడు రజోగుణ త్యాగ

మును చేసినవాడే గాని, సత్త్వగుణత్యాగము నొనర్చిన వాడు గానందుచే నిర్మలజ్ఞానులు పొందెడు మోక్ష సుఖమును బొందజాలడు. సత్త్వగుణ త్యాగ మనగా స్వధర్మనిష్ఠలో నిలకడ గల్గి కార్యము నిర్వహించునప్పుడు లోకముచే గలుగు సుఖదుఃఖముల విడుచుటయే యగును. ఇదే శ్రీకృష్ణభగవానులు గీతలో ఉపదేశించిన సారమనియు ముముక్షువులు గ్రహించుకొనవలెను. ఇక నీ విషయమై వ్రాయవలసిన గీతాప్రమాణ మెంతయో గలదు. గ్రంథబాహుళ్య ముచే సంగ్రహముగ చెప్పడమైనది.

**ప్రశ్న :-** "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అని శ్రుతిస్మృతులున్ను, అనుభవ జ్ఞులగు మహాత్ములు నుద్ఘోషించుచుండగా కర్మములనుండి తద్గత గుణ ముల నుండి నివృత్తి గలుగ జేసికొనవలెనని మీరెట్లు చెప్పుచున్నారు?

**ఉత్తరము :-** నిర్మలాత్ములై, జిజ్ఞాసువులైన ఆత్మసోదరులారా! వేదాంత విషయముల కన్నిటికిన్ని ఇచ్చటనే కీలకము గలదు. బ్రహ్మజ్ఞాన రథముయొక్క కీలకము దీనియందే నిలకడ గల్గియున్నది. ఈ కీలకమునే కర్మరహస్యమని గీత నాల్గవ అధ్యాయములో భగవంతు డుపదేశించినది యిదివరకే తెలపడమైనది. దీనియొక్క మర్మము తెలిసినందుచేతనే పూర్వ కాలమున సర్వగ్రామములలోను, పల్లెటూర్లలోను, నగరములలోను, మఠముల లోను, ఆశ్రమములలోను, కొండగుహలలోను, పర్వతమస్తకములలోను, పుణ్య నదీ తీరములలోను, పుణ్యక్షేత్రములలోను బ్రహ్మరథము నిరాటంకముగ తిరుగుచుండెను. అప్పుడు ముముక్షువులందరున్ను, జ్ఞానులందరున్ను దానిలో సౌఖ్యముగ ప్రయాణము నొనర్చి ముక్తిధామమును బొందుచుండిరి. ఇప్పుడు దాని మరత్రిప్పెడు కీలకము తెలియక పోవుటచేతనే ముముక్షువులు బ్రహ్మ రథమెక్కి మోక్ష మార్గములో సంచరింప జాలక యున్నారు. అంతేకాక అట్టి బ్రహ్మజ్ఞానరథము ఒక అడుగైన ముందుకు పోజాలక నిలిచిన నిలకడ లోనే క్రుంగిపోవుటయేగాక, చెదలు తిని శిథిలమై పోవుచున్నది. బ్రహ్మనిష్ఠుల పతనము లన్నిటికిన్ని ఇదే కారణము. వైరాగ్య బోధోపరతులు గల్గిన గురువుల

దగ్గర శ్రవణము చేయకపోవుట చేతనే యింతహీనగతి జిజ్ఞాసువులకు గల్గినది.

నాయనా! దీనియొక్క పరమ రహస్యము నీకిపుడు దెల్పెద. అదేమన, సాక్షాదపరోక్ష జ్ఞానము గల్గినవారికే అనగా, నిర్వికల్ప సమాధి పొందిన వారికే, ఆరూఢజ్ఞానము గలవారికే ప్రారబ్ధకర్మ మొక్కటి గలదని తలంచుట కర్హత గలదు గాని, ముముక్షువులకు గాని, అభ్యాసులకు గాని, జిజ్ఞాసువులకుగాని దాని కధికారము లేదు. వీరెల్లప్పుడున్ను ప్రవృత్తి మార్గమునుండి నివృత్తి మార్గములోనికి చేరేలాగున ప్రయత్నపరులై యుండవలెననియే యుత్తమ శాస్త్రము చెప్పుచున్నది. వీరు తమయొక్క వ్రతనిష్ఠలో చలనము గలుగనీయక అనుష్ఠించవలయుననియే వేదాంత శాస్త్రముద్బోధించుచున్నది. పతనము గలుగునప్పు డంతయు నికను అంతఃకరణ శుద్ధి సిద్ధింపలేదే? ఈశ్వర కరుణ గలుగలేదే? శ్రీ గురుకృప రాలేదే! మనఃపరిశుద్ధి సిద్ధింపలేదే? అని పరితపించుచు ప్రాయశ్చిత్తము చేసికొని మరల అట్టి దోషము గలుగనీయక జాగ్రతతో చూచుచుండవలెననియే యుత్కృష్ట శాస్త్రము లుపదేశించుచున్నవి.

ఈ విషయమై యింతవరకనేక శాస్త్రములు ఉపదేశించడమైనది. మఱియు ప్రారబ్ధమనగా! జన్మాంతరములో గల సంచితమునుండి యిప్పుడనుభవించుట కేర్పడినదాని పేరు. అది అనివార్యము. అది సుఖదుఃఖ రూపముగా పరిణమించి భోగరూపముగ జ్ఞానికి గల్గియుండును. ఇది భోగము చేత మాత్రమే నశించునని అందరు నంగీకరింపగలరు. అది యింతవరకు చెప్పబడిన సుఖదుఃఖములు, మానావమానములు, స్తుతినిందలు, రోగారోగ్యములు ధన దారిద్ర్యములుగా నుండునేగాని వర్తమాన క్రియమాణము గాదు. క్రియమాణ మాగామియై పరిణమించుననియే యోగశాస్త్ర సిద్ధాంతము.

ఈ పైజెప్పినవి బంధవిముక్తి గల్గి కృతకృత్యులై, సమస్త క్రియలు నశించిన వారలై, దృగ్దృశ్యములు నశించిన మహాజ్ఞానులకే చెల్లును. వీరిలో కొందరవధూతవృత్తిలోగూడ నుండవచ్చును. ఇట్టి లోకాతీతజ్ఞానులయొక్క స్థితిని తెలుపుచుండెడు అత్యుత్కృష్టజ్ఞానశ్లోక పద్య వాక్యములు లోకజ్ఞానము

చక్కగ తెలియని యజ్ఞులు ఆచరణలోనికి తెచ్చినప్పటి నుండియే జ్ఞానము నకు పతనము గల్గినది. వీరేదైన ఒక్క గురువాక్యమును శ్రవణము చేసి యుండవచ్చును. సాధువేషము మాత్రము బాగుగ వేసియుందురు. ఇట్టివారికి సత్య ధర్మములుగాని, దయా వైరాగ్యములుగాని, శుద్ధాశుద్ధములుగాని, ఆత్మానాత్మ విచారణ జ్ఞానముగాని బొత్తిగ దెలిసియుండదు.

అట్టివారే విదేహముక్తులై యుండు మహనీయుల యవస్థను చెప్పి స్వదేహ పోషణతత్పరులై యుండ బ్రహ్మజ్ఞానము నశింపక పోవునా? చంద్రిక లేని రాత్రియందు కనులెట్లు గనుపించును? కావున నిప్పుడు వేదాంత విషయమై మరల సంస్కరించవలసివచ్చినది. ఇంద్రియాతీత జ్ఞానము గలవారి స్థితిని ఇంద్రియ పరవశులై యుండువారు ఆచరణలోనికి తెచ్చునప్పుడు తగిన యేర్పాటు గావలసినదిగదా! ఉన్నతోద్యోగియొక్క చిహ్నములు అనుద్యోగి ధరించి విహరించుచు అధికారము చలాయించుచుండ, ప్రభు త్వమువారు సరియైన చర్య తీసికొననిచో ప్రజలకు గలిగెడు అపాయమపా రము గదా? అంతఃకరణములో వృత్తులుగాని గుణములుగాని, దృశ్యవిషయ సంకల్పములుగాని గల్గియుండి తదనుగుణమగు వర్తనము గల వారందరు నజ్ఞులే. విజ్ఞులు గాజాలరు.

ఒకవేళ పరోక్షజ్ఞానము గలిగియుండవచ్చును. అదిన్ని నమ్మదగినది గాదు. ఏలన? విశుద్ధాంతఃకరణము గల్గునపుడే బ్రహ్మజిజ్ఞాస గల్గును. అశు ద్ధాంతః కరణము కలవారికి అది గలుగట కవకాశము లేదు. అట్లుండగా, నికృష్టగుణ పూరితులై యుండు వారికి బ్రహ్మజిజ్ఞాస యెట్లు గల్గును? ఇదే యీ గ్రంథము యొక్క చర్చనీయవిషయము.

ఈ విషయమై యీలాటి ప్రశ్న కొందరు వేసెదరు - ప్రారబ్ధము భోగమువలననే నశించునని మీరంగీకరించితిరి గదా! అట్లయిన నికృష్ట గుణములు, దుష్టవృత్తులు, హింసాది శోకకార్యములు, అధర్మాది ప్రవర్తనలు గూడ ప్రారబ్ధములుగా నేల అంగీకరింప రాదు? ఈ ప్రశ్నకే మనము సరియైన

సమాధానము శాస్త్రయుక్త్యనుభవములచే వారికి తెలిపి, పొరబాటులను వారి చేతనే అంగీకరింప చేసేలాగున చేసి వారిని పవిత్రుల నొనర్చి పరమప్రాప్తికి అర్హులుగా చేయవలెను. ఇది ధర్మబోధకు లందరియొక్క కృత్యమై యున్నది. అప్పుడు వారే తమయొక్క ప్రమాదమును తెలిసికొని అప్రమత్తులై ప్రవర్తించి ప్రబోధజ్ఞానము గలుగజేసికొనుటకు ప్రయత్నించుదురు. మరల వారే లోకము నకు సత్యధర్మములను, భక్తిజ్ఞాన వైరాగ్యములను జాటగలరు. ప్రతిప్రవక్తయు, ప్రబోధకుడున్ను ఆలాగుననే చేసియున్నారు.

పాపము సామాన్య జనులకున్ను, చాలమంది స్త్రీలకున్ను ఎక్కువ శాస్త్ర జ్ఞానమున్ను, ఎక్కువమంది గొప్పబ్రహ్మనిష్ఠులయొక్క సంసర్గముండదు. అందువల్లనే యిట్టి లోపము గల్గుట కవకాశము గల్గుచున్నది. రోగులైన వారు ఏ ప్రకారమైనను బాధానివృత్తి గల్గిన చాలునను బుద్ధితోడనే వైద్యుడు చెప్పే లాగున ఔషధాహార పథ్యములు గల్గియుందురు. ఆలాగున సంసారబాద నుండి తప్పించుకొని దైవసుఖము గలుగ జేసికొనవలెనను తలంపుతోనే గురు పుత్రులై, పుత్రికలై గురువుల నాశ్రయించియున్నారు. గురువులు చెప్పేలాగున వర్తించుచున్నారు.

కావున భక్తులపై నెక్కువ దోషమేమియు లేదు. కుతర్కులై యుక్తిపూరి తులగు గురువులుగా నుండు కొందరియందే యిట్టి దోషము గలదు. అయితే గురువుబిడ్డలు గూడ గురులక్షణమును కొంతవరకైన పరిశీలించుకొనుట ధర్మయుక్తమై యున్నది. దైవకృపచే అట్టి గురువుల కాలము దాటిపోయినదని చెప్పవచ్చును. అయినను అచ్చటచ్చట మూలలలో, సందులలో నింకను కొందరు నిలిచియున్నారనే చెప్పవచ్చును. కాని సత్యధర్మములతో గూడిన జ్ఞానభాస్కరుడుదయించెను. ఇక చీకటి నిలుచుట కవకాశముండదు. త్వరలోనే అనేక బ్రహ్మనిష్ఠులేర్పడి లోకమును పవిత్రము చేయగలరు. ఇప్పటికే చాలవరకు చేసిరి. శ్రీరామకృష్ణపరమహంస, శ్రీ వివేకానంద, శ్రీరామ తీర్థ, శ్రీనారాయణగురుస్వాములు మొదలగు వారవతరించి లోకమంతటను జ్ఞాన విత్తనముల చల్లివేసిరి. ఇక అవి వృక్షములై ఫలముల నివ్వగలవు. అప్పుడు

లోకము దుఃఖరహితమగు పూర్ణానంద జ్ఞానసుఖము ననుభవించును. సత్య, ధర్మ, జ్ఞాన, కరుణ, విరక్త్యాదులు ప్రబలము గాగలవు.

ఇప్పుడు మన మనుకొన్న భాగములోనికి తిరిగి వెళ్ళి లోకమునకు కర్మ రహస్యమును తెలుప ప్రయత్నింతము. ఇవన్నియు సంగ్రహముగానే చెప్పెదను. లేనిచో గ్రంథము పెరిగి పోవును.

1. జీవకోట్లకు పుణ్యసంస్కారబలము గల్గి పాపము నశించి అంతఃకరణ శుద్ధి గల్గునప్పుడే బ్రహ్మజిజ్ఞాస గల్గును, 2. అప్పుడు నిషిద్ధకర్మముల నన్నిటిని పరిత్యజించి విహిత కర్మలలో ప్రయత్న పరులై యుందురు, 3. అట్టి విహిత కర్మముగూడ ఫలాపేక్ష లేక నిష్కామముగా నీశ్వరార్పణ బుద్ధితో కొంతకాలము చేయునప్పుడే శుద్ధజిజ్ఞాస బలపడును, 4. పాపము బలపడి యున్నప్పుడు ఎవరికిన్ని శుభేచ్ఛ గలుగదు, 5. తమోగుణముతోగాని, రజోగుణముతోగాని గూడియుండు కాలమున శుభేచ్ఛ గలుగదు, 6. ఈశ్వరార్పణ బుద్ధితో సత్కర్మము చేయుచు రాగా రాగా తమోగుణము నశించి, రజోగుణమున్ను నశించి, సత్త్వగుణము గల్గునప్పుడే జ్ఞానేచ్ఛగల్గును, 7. అయినను విశుద్ధతత్త్వము సంపూర్తిగ గలుగనిచో దైవసాక్షాత్కార జ్ఞానము గలుగదు, 8. తమోరజస్సత్త్వ విశుద్ధాది గుణములు గల్గియున్నప్పుడు సర్వేంద్రియములద్వారా అట్టి స్వభావమే జీవకోట్లకు గల్గియుండును. ఇవి ముఖ్యమైన సంగతులు, 9. ఏలన, కారణమున కన్యముగా కార్యముండదు. ఇట్టి న్యాయమనుసరించియే యింతవరకు చెప్పినదంతయు ఉండునని గ్రహించవలెను, 10. కేవలము శుద్ధబ్రహ్మసాక్షాత్కారావస్థలో అంతయు శివమయము, ఆనందమయము, అమృతమయముగా నుండును. చంద్రుని నుండి వేడిమియు, సూర్యునినుండి చల్లదనమున్ను, చక్కెరనుండి చేదున్ను, ముష్టికాయనుండి తీపిన్ని ఎట్లు గలుగదో ఆలాగు ననే శుద్ధవిజ్ఞానస్వరూపులై, ధర్మమూర్తులై యుండువారినుండి అజ్ఞాన జనితములైన దుర్గుణములున్ను అధర్మస్వభావము గల చెడు విషయములున్ను ఎట్లుకల్గును? కల్గుట కవకాశములేదు. ఇదియే పరమమహర్షులగు మహాత్ముల వేదాంత సిద్ధాంతము.

మఱియు వేదాంత దివ్యసౌధము పడిపోవుటకు మరియొక కారణము గలదు. అదేమన, ఆత్మయొక్క యథార్థ స్వరూపము బోధపడకపోవుటే. ఆ బోధ గల్గినచో నిట్టి దృశ్యవిషయాది గుణము లేవియు నాత్మలో లేవనియు, అవి అంతఃకరణేంద్రియ దేహాదులు శుద్ధములు గానందుచే. గల్గియున్న వనియు గ్రహింపగలరు. అప్పుడు రగులుచుండు అగ్నిలో నేలాగున తృణము గాని, ధాన్యముగాని, కట్టెలుగాని నిలువజాలక దహించిపోవునో, ఆలాగుననే ప్రజ్వలించుచుండెడు జ్ఞానాగ్నియొక్క ప్రభావముచే వృత్తులన్నియు నశించును. అప్పుడు తనయొక్క ఆత్మకు జ్ఞానమే నైజగుణమని బోధ గల్గును. అది కలుగకపోవుటచేతను, దేహభ్రాంతి వీడిపోవక యుండుటచేతను ఇట్టి యనర్థము లన్నియు గల్గుచుండును. ఇప్పుడొక్కొక్కరు తాము స్త్రీలనియు, పురుషులనియు, శూద్రులనియు, వైశ్యులనియు, క్షత్రియులనియు, బ్రాహ్మణులనియు, బ్రహ్మచారులనియు, గృహస్థులనియు, వానప్రస్థులనియు, సన్న్యాసులనియు, కురూపులనియు, సురూపులనియు, చపలులనియు, నిశ్చలులనియు ఈరీతిగాననేకములగు దేహభావము లన్నియు గల్గియుండుటచే నివి యన్నియు తమయొక్క నైజగుణములని తలంచి వానినుండి నివృత్తి గలుగజేసికొనుటకు ప్రయత్నము చేయకయున్నారు.

ఇది జన్మాంతరములనుండి ఘనమైన దృఢవాసన గలిగినదగుటవలన అంత త్వరలో నశింపదు. అస్థిగతమైన కొన్ని దీర్ఘవ్యాధు లేలాగున ఔషధసేవ చేయుచున్నను త్వరలో నశింపక యెక్కువ కాలము ఔషధసేవా పథ్యాదులు గల్గియుండవలెనో,యిదియు ఆలాగున నుండును. పైజెప్పిన యీ రెండు ప్రతిబంధములే బ్రహ్మనిష్ఠుల పురోగమనమునకు గొప్ప అడ్డు గల్గించుచున్నవి. అయితే యీ గొప్ప పెనుభూతమును దొలగించుటకు కొందరు శుద్ధాత్ములు ప్రయత్నించుచుండినను, దానిని నిలబెట్టుటకు చూచువారు వేలకొలది మంది యున్నారు. అదిన్ని గొప్ప ధర్మసంకటమైనది. వీరొక్కరుండిన, వారు సహస్ర సంఖ్య గలవారై యున్నారు. అయినను సత్య మనివారణముగ ప్రకాశించునదగుటచేతను, తనయొక్క తేజస్సున కధిగవేగగమనము గలదగుట చేతను,

సర్వత్ర ప్రవేశించుటకు శక్తిగలదగుటచేతను త్వరలోనే లోకము పావనము గాగల్గును.

గిల్టు నగ మంచి బంగారను భావము ఎంతదనుక నుండునో, అజ్ఞులయొక్క బూటకములు, పన్నాగములు అంతదాక లోకమున నిలకడ గల్గియుండును. నిజమెప్పుడు గోచరమగునో అప్పుడు జనులయొక్క యంధ విశ్వాసము లన్నియు తొలగిపోవును. మరల దానిని నిలబెట్టుట యెట్టి వారి కైనను తరము గాదు. దీపముయొక్క దగ్గరకు చీకటిని తీసికొనివచ్చుట కేప్ర యత్నము చేసినను, అది రాజాలనట్లు మోసకృత్యము లేమియు మరల జరుగ జాలవు. అయితే యీ జీవిత మంతయు గురువుయొక్క ఆజ్ఞానిర్వహణము కొరకు సమర్పించిన ధీశాలురగు నారీమణులున్ను, ధైర్యశాలురగు పురుష సత్తములున్ను మనకు కావలసియుండును. గురువునకు సమర్పించిన వారు గురుస్వరూపులే యగుదురు. అగ్నికి సమర్పించిన కర్పూరము అగ్నిగాక మరియేమైయుండును? ఇట్టి నమ్మకము గలవారు ధన్యాత్ములగుదురు. కృతకృత్యు లగుదురు. జీవన్ముక్తు లగుదురు. అయితే మహాభాగ్యవంతులకు మాత్రమే అది లభించును.

**ఆరురుక్షోర్మునే ర్యోగం కర్మ కారణముచ్యతే ।**

యోగం = జ్ఞానయోగమును - ధ్యానయోగాభ్యాసదశను, ఆరురు క్షోః= ఎక్క నిచ్ఛించిన, మునేః = యోగికి, ముముక్షువునకు, కర్మ = నిష్కామ కర్మ యోగము, నిష్కళంకమైన యనుష్ఠానము, కారణం = సాధనమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

**ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్ ॥**

తనచేతనే (వివేకముగల మనస్సుచేత) విషయములం దాసక్తి లేని పరిశుద్ధ మనస్సుచేత సంసార సాగరమందు మగ్నులైన తమ్ము ఉద్ధరించుకొన వలయును. (గట్టున చేర్చుకొనవలసినది) అని శ్రీకృష్ణభగవానులు అభ్యాసి విషయమై, ముముక్షువిషయమై, జిజ్ఞాసువిషయమై ఉపదేశించిన యీ దివ్య

ములైన రెండు వాక్యములు ఆస్తికబుద్ధి గలవారికి చాలును. దీనిననుసరిం చియే యింతవరకు చెప్పినదంతయు నని గ్రహించుకొనవలెను. ఇదే మీకు దివ్యదృష్టి కలుగజేయునది. గుణముల విషయమై పదునాల్గవ యధ్యాయమున ఉపదేశించినది చూడుడు. ఇక ఇవి యన్నియు సంగ్రహముగానే చెప్పబడును.

**సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సమ్భవాః ।**
**నిబధ్నన్తి మహాబాహో దేహే దేహినమవ్యయమ్ ॥**

ఓ యర్జునా! ప్రకృతివలన పుట్టుక గల సత్త్వము, రజస్సు, తమస్సు అనెడి గుణములు దేహమునందుండు నాశరహితుడైన ఆత్మను బంధించు చున్నవి.

అనగా ఒక పశువు దాని కొమ్ములను, ముందు పాదములను వెనుక పాదములను మూడుత్రాళ్ళచే కట్టియుంచిన నెట్లుండునో, ఆలాగుననే ప్రకృతి వలనగల్గిన ఈ మూడు గుణములు నాశరహితమై శుద్ధమైన ఆత్మను మలినము గావించి ప్రపంచముతో బంధించుచున్నవి. వీని యొక్కొక్క దాని లక్షణము ఈ అధ్యాయములో విస్తారముగా గనందగును.

**రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత ।**
**రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా ॥**

రజస్తమో గుణముల నణంచి సత్త్వమభివృద్ధమై అట్టి రజస్తమస్సుల యొక్క తిరోధానదశయందు స్వజన్యములగు జ్ఞానసుఖాదులను గలుగ జేయును. తమస్సత్త్వముల నడంచి రజస్సు వృద్ధి జెందినదై స్వజన్యములగు కర్మములను గలిగించును. రజస్సత్త్వముల నడంచి తమస్సు వృద్ధిబొందినదై స్వజన్యములును జ్ఞానాపహారకంబులునగు ప్రమాదాలస్యాదులను గల్గించును.

ఇచ్చట మనము గ్రహించవలసిన దేమన? సత్త్వగుణము గల్గియున్న ప్పుడు రజస్తమోగుణములు లయము నొందుననియు, సత్త్వగుణ సంబంధ జ్ఞానాదులే గల్గియుండుననియు, ఆలాగున రజోగుణముగాని, తమోగుణము గాని గల్గియున్నప్పుడు తదనుగుణవృత్తులు గల్గుననియు తెలిసికొనడమైనది.

ఇదే మనము ఇచట తేల్చవలసిన విషయము. ఇప్పుడు కొందరు గురువులు సత్త్వగుణముచే గలుగవలసిన జ్ఞానము గలవారమని చెప్పుచు రజస్తమము లగు గుణములు గల్గి వర్తించుచున్నారు గదా! ఇది యెట్లు సమన్వయము చేయనగును? ఇందువలన మనము గ్రహించవలసినదేమన! వీరు వాక్కుతో మాత్రము సత్త్వగుణముచే గల్గిన జ్ఞానము గలవారివలె చెప్పుచున్నారేగాని, యథార్థములో తమోగుణములోగాని, రజోగుణములోగాని యుండువారని గ్రహించకొనవలయును.

అయితే శ్రవణము చేయుచుండవచ్చును. అనుష్ఠాన మాచరణలో నుండేలాగున చూచుకొనుచుండవలయును. వసంతఋతువు సంప్రాప్తమగు నప్పుడు, వనమంతయు పుష్పపల్లవ లతాదులచే శోభాయమానమై సుగంధమయమై, మనోహరమై యుండవలసినదిగదా! వసంతఋతువని చెప్పుచు హేమంత శిశిరఋతువులవలె వనమంతయు పుష్పలతాపల్లవ శూన్యమై వికారరూపము గల్గియుండవచ్చునా? ఆలాగున జ్ఞానము గలవారు సత్య శాంత దయా ధర్మాది గుణములచే సర్వజన హృదయాహ్లాదకరులై యుండవలసినదే గాని దుర్గుణ దురాచార దుష్టకృత్యములు గల్గి చూచెడు వారి కందరికి భయంకరులై యుండుట తగునా?

**సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశ ఉపజాయతే ।**
**జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత ॥**

ఈ శరీరమందుండు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణాదు లగు జ్ఞానేంద్రియములున్ను, కర్మేంద్రియములు మనస్సు మొదలగు అంతరింద్రియము లను సమస్త ద్వారములయందును ప్రకాశమగు నిర్మలజ్ఞానము ఎప్పుడు గల్గు చుండునో అప్పుడుసత్త్వగుణము వృద్ధి నొందియున్నదని గ్రహించుకొనవలెను.

ఈ శ్లోకముగూడ బ్రహ్మనిష్ఠులకు ప్రాణము వంటిది. సత్త్వగుణము గల్గునప్పుడు సర్వేంద్రియములు శుద్ధములై యుండుననియే భగవానులుపదే శించిరి. ఒక యింద్రియము రజోగుణము, ఒక యింద్రియము తమో

గుణము, ఒక యింద్రియము సత్త్వగుణము గల్గి యుండుట కవకాశము లేదు. స్థాలీపులాక న్యాయ మనుసరించి ఆ యా గుణములు గల్గునప్పుడన్ని యింద్రియములున్ను ఆగుణముల కనుకూలములుగానే యుండును.

స్థాలీపులాకన్యాయమనగా స్థాలియన తపెలయనియు, పులాక మనగా పులగమనియు, అనగా పొంగలి యనియు గ్రహించవలెను. ఒకేపాత్రలో ఒకే రకం బియ్యము అంతట సమముగా నిప్పున్ను జలమున్ను గల్గి వండునపుడు బియ్యమంత ఒకే విధముగా నేలాగున ఉడుకునో, ఆలాగున సత్త్వగుణము గల్గునపుడు అతని సమస్తవృత్తులు సమస్తగుణములు సత్త్వగుణమయ్యే యుండును. అనగా ఆహారమును, వర్తనమున్ను, వాక్కున్ను, సంకల్పమున్ను అంతయు సత్త్వగుణముగానే యుండవలయును. కొందఱు గురువులలో అట్లు గనిపించుట లేదు. కొన్ని విషయములు తమోగుణముతో సంబంధించినవిన్ని, కొన్ని రజోగుణముతో సంబంధించినవిన్ని గనుపించుటచే వీరికి సత్త్వగుణము గల్గి జ్ఞానోదయము గాలేదని గ్రహించుకొనవలయును. ఎందుకనగా?

**సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ ।**
**ప్రమోదమోహౌ తమసో భవతోఽజ్ఞాన మేవ చ ॥**

సత్త్వగుణము గల్గునప్పుడు జ్ఞానముదయమగును. రజోగుణము గల్గునప్పుడు పేరాశయు, లోభితనమున్ను గల్గును. తమోగుణము గల్గియుం డునప్పుడు ప్రమాదము, అజాగ్రత్తయు, ఒకటి చేయుదానికి మరియొకటి చేయుటయు, అన్నిటికి విపరీతార్థము చేయుటయు గల్గుచుండును. ముఖ్యముగా తమోగుణము జ్ఞానమును గలుగజేయక అజ్ఞానకార్యమునే చేయించుచుండును. అయితే యిప్పుడు భగవద్భక్తులు, బ్రహ్మనిష్ఠులు చేయవలసిన కార్యమేమి? యను విషయము ఈ క్రింది శ్లోకముచే కృష్ణ భగవాను లుపదేశించుచున్నారు.

**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మ మృత్యు జరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే ॥**

ఆత్మ (జీవుడు) దేహమువలన బుట్టిన మూడైన యీసత్త్వరజస్తమో గుణములను దాటి (పోగొట్టుకొని) పుట్టుక, చావు, ముదిమి, దుఃఖములు అనువాని నుండి విముక్తుడై మోక్షమును, దైవసాక్షాత్కార జ్ఞానమును పొందు చున్నాడు.

ఓ పరిశుద్ధాత్ములగు సోదరులారా! సోదరీమణులారా! శ్రీభగవద్వాక్య మును వింటిరా? సత్త్వగుణము గల్గినప్పుడే జిజ్ఞాస గలుగుననియు చెప్పుచుండగా నిప్పుడు వేదాంతమును బోధించు వారికి సత్త్వగుణమైనను లేక పోవుట ఆశ్చర్యకరము గదా? అశుద్ధగుణములను, శుద్ధగుణమును విశుద్ధ గుణముచే తొలగించిన మాత్రమే గుణముల నతిక్రమించి యుండు కేవలా త్మైకస్థితి గల్గును. మూడు గుణముల నుపదేశించిన తర్వాత గుణత్రయాతీ తుని లక్షణము ఈ అధ్యాయముననే ఉపదేశించియున్నారు. దీనివల్ల గుణ త్రయముల కతీతమే సాక్షాన్ముక్తి యని తెలిసికొనవలయును.

**ఉదాసీనవదాసీనో గుణైర్యో న విచాల్యతే ।**
**గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేఙ్గతే ॥**

సంగము లేక సాక్షివలె నుండువాడై, ఎవడు సత్త్వరజస్తమో గుణాదుల చేత స్వరూపజ్ఞానమునుండి చలింపజేయబడడో కార్య కారణ విషయములుగా నుండు ఋణములుండుట చేతనే తదనుగుణ్యములగు గుణములు (విషయములు) ప్రవర్తించుచున్నవి యని ఏ బ్రహ్మనిష్ఠుడు (వివేకజ్ఞాని) తెలిసికొనుచున్నాడో, ఎవ్వడు గుణముల వృత్తులచే చలిం పడో అతడు ప్రకృతి గుణములు లేని జ్ఞాని యని తెలిసికొనవలెను.

ఇప్పుడు మనము ప్రారంభించిన విషయమును యుత్కృష్టములగు శాస్త్రయుక్త్యనుభవములచే లోకమునకు తెలుపడమైనది. ఇక నీ మూడు గుణ ముల లక్షణములు 'ఒక్కొక్క శ్లోకముచే మనుస్మృతిలో విశదీకరింపబడిన

వానిని ఈ క్రింద తెలిపెద. పంచీకరణము, సాంఖ్యము విచారణ చేయువారు ఈ మూడు గుణములను విచారణ చేయకపోవుట చాల పొరపాటు. అందు వలననే ప్రకృతిగుణములనుండి విముక్తి గలుగక యున్నారు.

## మనుస్మృతి అధ్యాయము - 12

**యో యద్యైషాం గుణో దేహే సాకల్యేనాతిరిచ్యతే ।**
**స తదా తద్గుణప్రాయం తం కరోతి శరీరిణమ్ ॥**

ఈ త్రిగుణములన్ని దేహులకున్నను ఏ దేహమునం దీమూడు గుణ ములలో నేగుణమెప్పుడు పూర్తిగా నధికరించి యుండునో అప్పు డాదేహిని ఆ గుణము గలవానినిగా నెఱుగవలయును.

**సత్త్వం జ్ఞానం తమో౽జ్ఞానం రాగ ద్వేషౌ రజస్స్మృతమ్ ।**
**ఏతద్వ్యాప్తిమదేతేషాం సర్వభూతాశ్రితం వపుః ॥**

సత్త్వాదిగుణముల లక్షణము చెప్పబడుచున్నది : - సత్త్వగుణమునకు జ్ఞానమే లక్షణము, తమోగుణమునకు అట్టి జ్ఞానమునకు విరుద్ధమగు నజ్ఞా నము గల్గియుండుట లక్షణము. రజోగుణమునకు దృశ్యవిషయములలో ప్రీతియు, తన యభిప్రాయమునకు భిన్నులైన వారిపై ద్వేషము గల్గియుండుట లక్షణము. సత్త్వగుణమునకు సదా సంతుష్టియు, రజోగుణమునకు ఎల్లప్పు డసంతుష్టియు, తమోగుణమునకు సంతతము విషాదమున్ను లక్షణములుగా నుండును.

**త్రయాణా మపి చైతేషాం గుణానాం యః ఫలోదయః ।**
**అగ్ర్యో మధ్యో జఘన్యశ్చ తం ప్రవక్ష్యామ్యశేషతః ॥**

ఈ సత్త్వాది గుణములు మూటిలో వరుసగా నుత్తమమధ్యమాధమ రూపమైన ఫలము గలిగించు నట్టి దానిని ముఖ్యముగా జెప్పెదను.

**వేదాభ్యాస స్తపో జ్ఞానం శౌచమింద్రియనిగ్రహః ।**
**ధర్మ క్రియాఽఽత్మచింతా చ సాత్త్వికం గుణలక్షణమ్ ॥**

వేదాధ్యయనము, (దీనియందుపనిషత్తు భగవద్గీతాది పఠనము శ్రవణ నారాయణాది మంత్రజపము గల్గియుండును) తపస్సు చేయుట, జ్ఞానాభ్యాసము గల్గియుండుట, బాహ్యాభ్యంతర శుద్ధి గల్గియుండుట, ఇంద్రియములన్నిటిని స్వాధీనములో నుంచుట, సత్కర్మానుష్ఠానపరుడై యుండుట, ఆత్మజ్ఞానమునందాసక్తి గల్గియుండుట-ఇవి సత్త్వగుణముయొక్క కార్యములు.

**ఆరంభరుచితాఽధైర్య మసత్కార పరిగ్రహః ।**
**విషయోపసేవాచాజస్రం రాజసం గుణలక్షణమ్ ॥**

ఫలమును గోరి కర్మల చేయుట, స్వల్పకార్యమందైన నధైర్యపడుట, కానిపని జేయబూనుట, అనగా నిర్వహింపశక్తి లేని కార్యములలో ప్రవేశించుట, అసంభవ కార్యములు చేయుట, ఎల్లప్పుడు శబ్దస్పర్శ రూప రస గంధాది విషయముల ననుభవించే లాగున నుండుటయు-ఇవి రజోగుణవంతుని కార్యములు.

**లోభః స్వప్నోఽధృతిః క్రౌర్యం నాస్తిక్యం భిన్నవృత్తితా ।**
**యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణమ్ ॥**

పేరాశ (ఉన్న దానిలో శక్తికొలది దానధర్మములు చేయకుండుట) ఎక్కువ నిద్ర, అధైర్యము (భయము గల్గి యుండుట), క్రూరస్వభావము గల్గి యుండుట, గురుదైవ శాస్త్రములలో విశ్వాసములేక యుండుట, సదాచార రాహిత్యము, యాచించు స్వభావము, కలిమియు వసతి యున్నను ధర్మమందాసక్తి లేమి (చేయవలసినది సరిగా చేయకపోవుట)- యివి తామస గుణము కలవాని కార్యములు.

**తమసో లక్షణం కామో రజసస్త్వర్థ ఉచ్యతే ।**
**సత్త్వస్య లక్షణం ధర్మః శ్రైష్ఠ్యమేషాం యథోత్తరమ్ ॥**

తమంబునకు కామమే ప్రధానముగా గల్గియుండుట లక్షణము, స్వార్థ పరత్వమే రజోగుణ లక్షణము. ధర్మమందు ప్రీతియు, ధర్మానుష్ఠానమున్ను సత్త్వగుణ లక్షణము. ఈ కామాదులలో మీది మీదిది మేలైనది.

**దేవత్వం సాత్త్వికా యాంతి మనుష్యత్వం చ రాజసాః ।**
**తిర్యక్త్వం తామసా నిత్యమిత్యేషా త్రివిధా గతిః ॥**

ఎవరు సత్త్వగుణమునందు నిలకడ కల్గియుందురో, వారు దేవత్వ మును బొందుదురు. ఎవరు రజోగుణమునందు నిలకడ గలవారో, వారు మానవత్వమును పొందుదురు. ఎవరు తమోగుణము గలవారలో వారు భూత ప్రేతపిశాచములుగాగాని, క్రూరములగుమృగపక్ష్యాదులుగా గాని జన్మింతురు.

**ఇంద్రియాణాం ప్రసంగేన ధర్మస్యాసేవనేన చ ।**
**పాపాన్ సంయాంతి సంసారమవిద్వాంసో నరాధమాః ॥**

ఇంద్రియములను విషయములందు ప్రవేశింపజేయుటబట్టియు, ఆకార్య కార్యములను చేయుటంబట్టియు, పాపకార్యములు ఒకవేళ చేసినను వానికి సరియైన ప్రాయశ్చిత్తాది ధర్మములం జేయమింబట్టియు మూఢ మానవులు హీనస్థితిని బొందుదురు.

కావున ఒకవేళ ప్రమాదముచే తప్పు కార్యములలో పడిపోయినో వెంటనే ప్రాయశ్చిత్తోపవాసాన్నదానాదులజేసి శుద్ధుడు గావలయును. ఇక గుణ త్రయమును గురించి యీ అధ్యాయములో విస్తారముగ గనందగును. ప్రాయ శ్చిత్తము లన్నిటిలోను నీ క్రింద జెప్పు విధము అత్యుత్కృష్ట మైనదని సూత సంహితయందు జెప్పబడెను.

**అన్నపానాదిభిర్భక్త్యా బ్రహ్మనిష్ఠం సమర్పయేత్ ।**
**సర్వపాపవినిర్ముక్తశ్శంకరం యాతి మానవః ॥**

అన్న పానాదులను భక్తిశ్రద్ధలతో బ్రహ్మనిష్ఠగల వానికి సమర్పించెనేని సర్వపాపములనుండి విముక్తి గల్గి మానవుడు సర్వేశ్వరుని పొందగల్గును.

మఱియు భర్తృహరి పతన విషయమై యీలాగున తెలిపియున్నారు.

**యథా కందుకపాతేనోత్పతత్యార్యః పతన్నపి ।**
**తథాత్వనార్యః పతతి మృత్పిండపతనం యథా ॥**

సజ్జనుడు ప్రమాదవశముచే హీనస్థితి జెందినను రబ్బరు చెండు క్రింద బడినను వెంటనే పైకి లేచునట్లు లేచును. ఉత్నతస్థితియందుండి దుర్జనుడు హీనస్థితి నొందిన మట్టిముద్ద క్రిందపడిన నట్లే యుండునట్లు విషయములలో నుండి (పతనకారణమునుండి) విముక్తి నొంద నిచ్ఛింపడు.

ఇక బ్రహ్మనిష్ఠులు, భగవద్భక్తులు పతితులగుటకు మరియొక కారణము గలదు. ఇదియు చాల జాగరూకతతో విచారణలో నుంచదగిన విషయము. అదేమన, కొందరు భక్తులున్ను, భక్తురాండ్రున్ను భజనాది కార్యములు చేయునప్పుడు, ఒక్కొక్కరు భుజముల మీద చేతులు వేసికొనుటయు, ఆలింగనముల జేసికొనుటయు గలదు. అయితే అది పరమ పవిత్రప్రేమభావముతో గూడిన దైనను అందరికి నట్టి భావము గల్గుట దుస్తరము. అనగా ఆలాటి కార్యములలో ప్రవర్తింపకుండుటయే మంచిది. ప్రేమకు భ్రమయై పరిణమించు స్వభావమొకటి గలదు. కావున శ్రేష్ఠులైన వారందరున్ను లోకహితముగ ప్రవర్తించు వారగుటచే నిట్టి కార్యములలో జాగ్రత గల్గి వర్తించుట మంచిది. మఱి కొందరు గుర్వారాధన కాలములో గురుపుత్రులైనవారిని మాత్రము ఏకాంత స్థలములో చేర్చుకొని తక్కిన వారి నెవరిని రానివ్వక గురుప్రసాదమును స్వీకరించి స్త్రీ పురుషులందరున్ను ఒక్కొక్కరు ఎంగిలి చేసికొని యింకొకరి నోటిలో పెట్టుటయు, వారెంగిలి చేసి వీరి నోటిలో పెట్టుటయుజరుగుచున్నది. ఇక అభేదభావన యని తలంచి ఒకరి నోటిలో గల యెంగిలి మరియొకరి నోటిలో నుమియుటయు గల్గుచున్నది. దీనియందు స్త్రీ పురుషులు ఒక్కొక్కరికి నీలాగు చేయుటచే చాల అపాయ మునకు హేతువగుచున్నది. ఈలాగున చేయుట అభేదజ్ఞానమని చెప్పుదురు. ఎవరైన వివేకజ్ఞానులు ఇట్లు తగదని తెలిపినచో వారికి భేదము పోలేదనియు,

సాధుగోష్ఠిలో నుండుట కర్హత గలుగలేదనియు చెప్పి నిందింతురు. ఈలాటి కార్యము లన్నియు వివేక వంతులు చేయందగినవి గావు.

ఇంకను ఎన్నియో చెప్పరాని, చేయరాని కార్యములు జరుగుచుండును. సారాయి, మాంసము మొదలైన రాక్షసాహారములను హీనభావముతో ఒక్కొక్కరున్ను వాడెదరు. అది యంతయు జూచిన పైశాచిక కృత్యమునకన్న ఎక్కువ యేమియు కాదని వివేకులకు దోచును. ఇకనిండా హేయమైన పదార్థములను సారాయిలోగాని పంచామృతములోగాని కలిపి సేవింతురు. దానిలో చతురక్షరి, అష్టాక్షరి మొదలగు పరమపవిత్రమైన పేర్లతో అపవిత్రవస్తువుల గల్పుదురు. ఇది యంతయుజూచిన అది సూకర వేదాంతమేగాని, సూరిజనుల జ్ఞానము గాదని తెలియగలదు. ఇట్టి వాక్యము లన్నియు పరిశుద్ధవాణి గల వారు చెప్పందగినవి గావు.

అయితే యిట్టి తరుణములో గూడ లోకమిట్టి గాఢాంధకారముతో గూడి యున్నదని వినునప్పుడెంతయో మనఃపరితాపము గల్గుచున్నది. మఱి కొందరు గురుపుత్ర పుత్రికలు మాకు భేదము లేదని యేకశయ్యారోహులై యుండువారు గూడ గలరు. వీనికన్నిటికి కారణమడిగిన మాకు భేదము లేదనియే తెలుపుదురు. ఇట్టి వారిలో అనేకులకు బాధ గల్గినట్లు మనము విను చున్నాము. ఇదంతయు అభేదజ్ఞానముగాని, అద్వైతజ్ఞానముగాని భేదము లేని పని గాని కాదు. ఇది అవివేకమూఢాంధమోహమేగాని మరి యొకటి గాదు.

ప్రకృతియందు (దృశ్యములో) అభేదము గలుగదు. అట్టి అభేద జ్ఞానము ఆత్మలో మాత్రమే గల్గును. కనుకనే ధీమంతులు అభేద జ్ఞానమును హృదయములో పెట్టి సంరక్షించిరి. కనుకనే అద్వైతమును భావములో నుంచ వలెనుగాని క్రియలోనికి తీసుకొనిరాకూడదని శంకరు లుపదేశించిరి. "భావాద్వైతం సదా కుర్యాన్నాద్వైతం గురుసన్నిధౌ"అని యుపదేశించుటకు కారణ మిదియే. ఎవరైన మహాసిద్ధ పురుషులు దృశ్యమును తన యిష్టానుసారము మార్ప శక్తిగల్గిన అట్టి వారుమాత్రమే బాహ్యకృత్యమున పైజెప్పిన యభేదవర్తన

గల్గి యుండవచ్చును. లేనిచో దానివల్ల బాధయే గల్గును. అనేకులకు గల్గి యున్నది. కల్గుచున్నది, కలుగగలదు. దృశ్యములో ఏకత్వ మెవరి చేతనున్ను చేయ సాధ్యము కాదు. సూర్యుని చంద్రునివలె చల్లదనముగాను, చంద్రుని సూర్యుని వలె ఉష్ణముగాను చేయ శక్తిగలవారికే అది సాధ్యపడును. అగ్నిలో గూర్చున్న ఎవరికి కాలదో, విషము త్రాగిన యెవని కషాయము గలుగదో అట్టివారే యీలాటి కార్యములు చేయవలెను. ఎవరు గోవుకున్ను పెద్దపులికిన్ని ఐక్యము చేయగలరో, ఎవరు పిల్లికిన్ని ఎలుకకున్ను ఐకమత్యము చేయగలరో, ఎవరు గరుత్మంతునికి పాముకున్ను సమత్వము చేయగలరో, ఎవరు జింకను, సింహమును ఏకము చేయగల్గుదురో, ఎవరు తననున్ను, జగత్తును ఇచ్ఛానురూపముగ మార్చశక్తిగలవారో-అట్టివారు మాత్రమే యీలాటి కార్యమున ప్రవేశింపవలెను. తక్కి వారందరును ప్రేమయు, భేదరహితజ్ఞానమున్ను హృదయములో నుంచి వర్తించిన చాలును, ధన్యాత్ములుగా గలరు.

పైజెప్పిన కృత్యములలో కొన్నిటిని యోగమహిమ గలవారు చేయగల వారుగాని అది అప్పుడే యుండును. మరల నుండదు. అట్లుండగూడదు. రూపుచేయు వస్తు వెల్లప్పుడు నాలాగుండిన మాత్రమే అది మారుదల పొందిన దానికి గురుతగును. అయినను పిచ్చుకపై బ్రహ్మాస్త్రము ప్రయోగింప దలంచినట్లు గొప్పజ్ఞానవంతులగు మహాపురుషులకు ఒకవేళ కొంతశక్తి గల్గియున్నను వారు దానిని దుర్వినియోగ పరచరు. ఎందుకనగా, వారి యొక్క యాచరణ జూచియే యితరు లాచరింపగలరని వారికి తెలియును. కనుకనే శ్రీకృష్ణభగవానులు గీతయం దీలాగున నుపదేశించిరి.

**యద్యదాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥**

బుద్ధి, జ్ఞానము, యోగ్యత గలవాడు ఏ యే కర్మము నాచరించు చున్నాడో ఆ యా కర్మమునే పామరులైన తక్కిన జనులున్ను ఆచరించు చున్నారు. ఆ గొప్పవాడు ఏ శాస్త్రములను ప్రమాణములుగా దలంచు

చున్నాడో, పామరజనులు ఆ శాస్త్రపద్ధతులనే ఆచరించుచున్నారు అని భగవానులుపదేశించిన సంగతి జ్ఞాపకములో నుంచవలెను.

కనుకనే జ్ఞానులు తమకు కర్మధర్మములు అవసరము లేనప్పటికిన్ని ఇతరుల క్షేమముకొరకు ధర్మబద్ధులై వర్తించుచున్నారు. ఇంతవరకు చెప్పినది ప్రేమభావమునుండి జనులను వేరుపరచ దలంపుచేగాని, సోదరీ సోదర భావములనుండి పరుల దొలగించుటకు తలంపు గల్గిగాని, అభేద జ్ఞానము గలుగక భేదజ్ఞానము గల్గియుండుట చేతగాని చెప్పినది కాదు. పూర్వీక పుణ్యపురుషులట్టి నిర్మల ప్రేమభావములలో మునిగియున్నను నిప్పుడుండే వారిలో ఆలాటివారు చాల అరుదుగా నున్నారని మాత్రమిది వ్రాయడమైనది.

అద్వైతాచార్యులున్ను, జగద్గురువులున్ను, మోక్షసామ్రాజ్యపట్టాభిషిక్తులనగు శ్రీశంకరులు శుద్ధాద్వైతజ్ఞానము గలవారైనను లోకములో నేలాగున వర్తించిరో నాలాగున నుండవలెననియే తలంపు గలదు గాని మరియేమియు గాదు. ఆలాగున బుద్ధ భగవానునికన్న ప్రేమమూర్తి యిక భూలోకమున పుట్టెనా? అట్టి వారుగూడ స్త్రీ పురుషుల ప్రవర్తనయం దెట్లుపదేశించిరో చూడందగును. ఆలాగున దైవపుత్రుడై ప్రపంచమున అవతరించిన శ్రీ యేసు క్రీస్తు ఎట్టి నిర్మలధర్మము ఉపదేశించిరో ఆలాగున నుండవలెననియే యాశయము. అట్లే శ్రీమహమ్మదునబి మహాప్రవక్తయయ్యు స్త్రీ పురుషుల కెట్టి కట్టుబాట్లేర్పరచిరో వారి ఘోషా సంప్రదాయమే దానికి తార్కాణము. సమస్తావతార సారసంగ్రహమై భూలోకమున వర్తమానములో నవతరించిన భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస పరస్త్రీల వస్త్రముగూడ ముట్టకూడదని యుపదేశించలేదా? ఏమి? ఈ మహాపురుషునకు బేదజ్ఞానము తొలగలేదా! జీవకోట్లపై ప్రేమ లేదా? అభేదజ్ఞానము కలుగలేదా? ఇవి యన్నియున్ను ముముక్షువులు యోచించు కొనందగినవి.

**పొలతి దావవహ్ని పురుషుడాజ్య ఘటంబు**
**కరగకుండరాదు కదిసెనేని**

అని నారదుండు ధర్మరాజునకుపదేశించెను.

**వ్రతము మానదగదు వడుగు కుఱ్ఱనికిని,**
**గ్రియలు మానదగదు గృహగతునికి,**
**తపసి కూరనుండ దగదు సన్న్యాసికి,**
**తరుణితోడ పొత్తు దగదు తగదు.** అని భాగవతము.

**అగ్ని కుండ సమా నారీ ఘృతకుంభసమో నరః ।**
**సంసర్గేణ విలీయేత తస్మా త్తాం పరివర్జయేత్ ॥**

-- అని దత్తాత్రేయులుపదేశించిరి.

స్త్రీ అగ్నికుండకు సమానయనియు, పురుషుడు నేతికుండతో సదృశు డనియు అగ్నికుండ దగ్గర నేతికుండ నుంచిన నెట్లు కరుగక యుండదో, ఆలాగుననే మనస్సును మార్పుచేసెడు మహాశక్తి ప్రకృతియొక్క సృష్టిలో నున్నది కావున జాగ్రత్తగ వర్తించవలెనని శ్రీదత్తాత్రేయు లుపదేశించిరి. దత్తా త్రేయు లవధూతవృత్తిలో నున్నవారు. లోకాతీతజ్ఞానము గలవారయ్యు ఈలాగున నెందుకు చెప్పవలసివచ్చినదనగా, తనకు లేనప్పటికిన్ని వారు బ్రహ్మజ్ఞాను లగుటచే లోకముయొక్క సృష్టిలో గల స్థితిగతుల జూచియే చెప్పిరి. ఇట్లు చెప్పినందుచే మన సన్న్యాసులు, స్వాములు, గురువులుగూడ భగవత్స్వరూపులగు దత్తాత్రేయులకు గూడ భేదజ్ఞానము బోలేదని గూడ చెప్పుదు రేమో యని సందేహ మగుచున్నది.

**మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్ ।**
**బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ॥**

అని శ్రీభగవత్స్వరూపులగు వ్యాసులవారివాక్యము వ్రతనిష్ఠ గలవాడు తల్లితోగాని, తోడబుట్టువుతోగాని, పుత్రికలతోగాని, యేకాంత స్థలములో నుండరాదు. ఎందుకన నింద్రియ సమూహముయొక్క బల మపారమైనది. అది జ్ఞానియైనవాని మనస్సును గూడ శోషింపచేయును. అనగా విషయము లలోనికి ఆకర్షించును. ఈ శ్లోకము మనుస్మృతియందు నాల్గవ పాదమందు "మాత్రా స్వస్రా దుహిత్రా వా నైకశయ్యాసనో భవేత్"అని మార్చబడియున్నది.

అచట ఒక ఆసనమునగాని పడకలో నుండకూడదని భావము. ఆలాగున వ్రతనిష్ఠగల స్త్రీలు గూడ తండ్రి, అన్నదమ్ములు, పుత్రుడు మొదలగు వారితో గూడనైన ఒక ఏకాంతస్థలమున నుండరాదు. ఏ సమయముననెట్లు జరుగునో యని భయము గల్గి అట్లు చెప్పడమైనది.

ప్రకృతియొక్క శక్తి అట్టి అపారమహిమ గలదని గ్రహించుకొనవల యును. ఆలాగున తల్లి, తోడబుట్టువు, కుమార్తెతో పురుషుడున్ను, తండ్రి, కొడుకు, అన్నదమ్ములతో స్త్రీయు నుండరాదని చెప్పునప్పుడు తదితరులతో కలసి ఒకే స్థలమున నుండుటయు, తాకుటయు, పురుషులు - స్త్రీల నోటి లోను, స్త్రీలు పురుషుల నోటిలోను నెంగిలి కలిపి పరస్పరము పెట్టించుటయు, తినుటయు, నెంత అపాయకరమో, యెంత లోకనిందయో యిప్పటికిన్ని తెలిసికొనక యుండుట ఆశ్చర్యముగ నున్నది. ఇందువల్ల గుర్వారాధన చేయు ప్రసాదము పుచ్చుకొనకూడదనిగాని, మహాపురుషుల హస్తముతో ప్రసాదము స్వీకరింపకూడదనిగాని దలంచరాదు. అట్లు చేయుట లోకనింద్యము గాదు. వంద్యమే యగును. తక్కిన చేష్టలన్నియు కుచేష్టలు గాని మంచివి గావు. ముఖ్యముగా నెచ్చట రహస్యము గలదో అచ్చట నేదైన మోసము గలదు. లేనిచో రహస్యముండదు.

ఇప్పుడు శుద్ధాద్వైత బోధకులు, లోకాచార్యులగు శ్రీశంకరభగవత్పాదా చార్యులు వివేకచూడామణిలో నుపదేశించిన సంగతులు చూడుడు. దీని వల్లనే భేదజ్ఞానముయొక్కయు, అభేదజ్ఞానముయొక్కయు స్థితి మీరు ఎరుంగ గలరు.

**అకృత్వా శత్రుసంహారమగత్వాఽఖిలభూశ్రియమ్ ।**
**రాజాఽహ మితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి ।**

రణరంగమున శత్రుసంహారము జేయక, సకల మహీమండలాధి పత్యము నొందక, "నేను రాజును, నేను రాజు"నను నంతనె రాజౌనా? కాదు. అలా సాక్షాత్కారస్థితి నొందక రాజయోగినని చెప్పినంత మాత్రముననే

యుత్కృష్టపదవి లభింపదు.

**శ్రుతి ప్రమాణైకమతేస్స్వధర్మనిష్ఠాతయైవాత్మవిశుద్ధిరస్య ।**
**విశుద్ధబుద్ధేః పరమాత్మవేదనం తేనైవ సంసార సమూలనాశః ॥**

ఓ జిజ్ఞాసగల సోదరుడా! శాస్త్రప్రమాణమందు ముఖ్యముగ నమ్మిక గల వానికి తనయొక్క అనుష్ఠానమందు నిష్ఠ గల్గియుండును. అట్టి నిష్ఠగల వానికే మనస్సు పరిశుద్ధమగును. అట్లు విశుద్ధబుద్ధి గలవానికే పరమాత్మ జ్ఞాన మలవడును. ఆ యాత్మజ్ఞానము గల్గుటచేతనే సంసారదుఃఖము దుంపతో కూడ నశించును.

**మనోనామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు ।**
**చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః ॥**

ఓ సాధకుడా! ఈదృశ్యవిషయములగు శబ్దస్పర్శరూపరస గంధాదు లను కాననసీమలందు మనస్సను బెబ్బులి తిరుగాడుచున్నది. కావున మోక్షేచ్ఛ గల సాధుజను లాసీమలకు బోకుండెదరుగాక!

**దేహాత్మనా సంస్థిత ఏవ కామీ విలక్షణః కామయితా కథం స్యాత్ ।**
**అతోఽర్థ సంధాన పరత్వమేన భేదప్రసక్త్యా భవబంధహేతుః ॥**

విషయాది దోషములతో గూడిన దేహమే తానని తలంచుటచేతనే కామాదిదోషము లావిర్భవించుచున్నవి. వేఱువిధమువాడు కాముకుడెలా గగును?కాడనుట. కావున తనయొక్క దైవస్వరూపము మరచి దేహేంద్రి యాది విషయములతో గూడిన జీవుడే తానని తలంచుటయే యీ సంసార పాశములో జిక్కికొనుటకు కారణము. కావున విషయాశ విడువవలయును. ఇదే యింత వరకు చెప్పిన దానియొక్క రహస్యము.

**యథాఽప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి ।**
**ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞంఽవాపి పరాఙ్ముఖమ్ ॥**

పాచి (నాచు) కొంచెమైనను నేలాగున తానుండెడు జలాశయము

నతిత్వరలో వ్యాపించునో, ప్రక్కకు నెట్టినను మరల క్రమ్ముకొనునో, ఆలాగున పండితుడైనను, బ్రహ్మనిష్ఠాభ్యాసము చేయువాడైనను ఏమఱుపాటు నొంది యుండినచో బహిర్దృష్టి గల వానినిచేసి మాయ క్షణకాలములో గ్రమ్ము కొనును. అనగా జ్ఞానము నావరించును.

**క్రియాన్తరాసక్తిమపాస్య కీటకో ధ్యాయన్యథాలిం హ్యలిభావమృచ్ఛతి ।**
**తథైవ యోగీ పరమాత్మతత్త్వం ధ్యాత్వా సమాయాతి తదేకనిష్ఠయా ॥**

కీటకము వేఱు క్రియలం దాసక్తిని విడచి, తుమ్మెదను చింతించుచు నెట్లు తుమ్మెదయే యగుచున్నదో అట్లు యోగి పరమాత్మ స్వరూపమును జింతించుచు, తదేకధ్యానముతో నుండుటచే నా పరమాత్మయే యగు చున్నాడు.

**యథాసువర్ణం పుటపాకశోధితం**
**త్యక్త్వాఽమలం స్వాత్మగుణం సమృచ్ఛతి ।**
**తథా మనస్సత్త్వ రజస్తమోఽమలం**
**ధ్యానేన సంత్యజ్య సమేతి తత్త్వమ్ ॥**

మలిన బంగారము బాగుగా పుటమువేయబడి ముఱికిని బాసి, తన మేలిమి గుణమును బొందునట్లు యోగి పరబ్రహ్మధ్యానముచే మనస్సున సత్త్వరజస్తమో గుణములవలన బుట్టిన మలినతను బాసి నిత్యమైన స్వరూప మును బొందుచున్నాడు.

**వైరాగ్య బోధౌ పురుషస్య పక్షివత్ పక్షౌ విజానీహి విచక్షణ త్వమ్**
**విముక్తి సౌధాగ్రలతాధిరోహణం తాభ్యాం వినా నాన్యతరేణ సిధ్యతి ॥**

ఓ సాధకుడా! పక్షికి ఆకాశమున సంచరించుటకు రెండు పక్షము లెటు వంటివో, యోగికి బ్రహ్మవిచారమున విహరించుటకు వైరాగ్యమున్ను, దృఢ మైన ఆత్మచింతయు నటువంటివని యెరుంగుము. ఱెక్కలు లేని పక్షివలె పురుషుడు వైరాగ్యము లేనియెడల మోక్షమనెడు మేడపైనుండు తీగె కొన నెక్క

జాలడు. అవి రెండును తప్ప తక్కినవి యేవియు ముక్తిజెందుటకు మార్గ ములు గావు.

**వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలమ్ ।**
**స్వానందానుభవాచ్ఛాంతిరేషైవోపరతేః ఫలమ్ ॥**

వైరాగ్యమునకు యధార్థమైన బోధమే ఫలమగును. జ్ఞానమునకు ఉపరతిస్థితి నొందియుండుట, అనగా దైవభావములో నిలకడ గల్గి యుండుట ఫలమగును. బ్రహ్మానందానుభవమువలన నంతరింద్రియ నిగ్రహము ఏర్పడును. ఈ శాంతియే యీ యుపరతికిని ఫలము.

**విద్యాఫలం స్యాదసతో నివృత్తిః ప్రవృత్తిరజ్ఞాన ఫలం తదీక్షితమ్ ।**
**తద్జ్ఞాజ్ఞయోర్యన్మృ గతృష్ణికాదౌ నో చేద్విదో దృష్టఫలం కిమస్మాత్ ॥**

జ్ఞానము గలుగుటకు ఫలమేమనిన అనిత్యమైన ప్రపంచమునుండి మనస్సు మరలుటయే. అజ్ఞానమునకు ఫలమేమనిన అనిత్యమైన ప్రపంచము నందు ప్రవేశించుటయే. ఎండమావులను జూచునప్పుడు తెలిసిన వారికి ఇది నీరు కాదు, ఎండమావులని నివృత్తి గల్గును. తెలియని వారికి నీరను భ్రాంతిచే ప్రవృత్తి గల్గును. జ్ఞానాజ్ఞానముల కింతకంటె ప్రత్యక్ష ఫలమేమి కావల యును?

**విజ్ఞాతబ్రహ్మతత్త్వస్య యథా పూర్వం న సంసృతిః ।**
**అస్తిచేన్న స విజ్ఞాతబ్రహ్మభావో బహిర్ముఖః ॥**

పరమాత్మ స్వరూపమును గనిన వానికి ముందటివలెనే విషయ వాస నాదు లుండవు. అట్లు విషయవృత్తులు గలవేని అతడు ప్రపంచమునందు దృష్టిగలవాడేగాని, పరమాత్మ స్వరూపమును గనినవాడు గాడు. అనగా ప్రకృతి రహిత జ్ఞానము గలుగలేదని తెలిసికొనవచ్చును.

**ప్రారబ్ధం సిద్ధ్యతి తదా యదా దేహాత్మనా స్థితిః ।**
**దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధం త్యజ్యతా మతః ॥**

ఎప్పుడు దేహము తానను తలంపుతో నుండునో అప్పుడు ప్రారబ్ధము వచ్చును. అనిత్యమైన దేహమే తానని తలంచుట సమ్మతము గాదు. కావున ప్రారబ్ధమును విడువవలయును. ముముక్షువులారా! ఆత్మజ్ఞానబోధము గల వారు చెప్పినది చూచితిరా? ఎప్పుడు కర్మ గలవాడని తలంచునో, అప్పుడు కరణ కళేబరములతో గూడినవాడే తానను బుద్ధి తప్పక గల్గును. అప్పుడు ఆత్మశక్తి హతమై పోవును. కావున అట్టి కర్మభావన చేయరాదు.

**తటస్థితా బోధయన్తి గురవః శ్రుతయో యథా ।**
**ప్రజ్ఞయైవ తరేద్విద్వానీశ్వరానుగృహీతయా ॥**

గురువులు వేదముల మాడ్కి, కారణమాత్రులై, సంసారబంధము నుండి విడుదల బొందుటకు బోధింతురు. వారెంతగా బోధించినను, విద్వాంసులు భగవంతు డొసగిన ప్రజ్ఞాబలముచేతనే యీ సంసారమును దాటవలెను. ఆరోగ్యమును బొందుట కభిలాష లేని రోగికి శ్రేష్ఠుడైన వైద్యుడెంత ప్రయత్నించినను సౌఖ్యము గలుగదు. గురుశిష్యుల దర్మము ఈలాగున నుండును.

ఇంతవరకు వ్రాసిన దానివల్ల వైరాగ్య బోధోపరతుల లక్షణమున్ను, సత్త్వరజస్తమోగుణ లక్షణమున్ను తెలిసికొనడమైనది. ఇప్పుడు విశుద్ధతత్త్వ లక్షణము చెప్పబడుచున్నది. ఇదియే గుణత్రయాతీత జ్ఞానము గలవాని యొక్క స్వభావముగ నుండును. ఈ మహాపురుషునియందు ప్రకృతి లేదు. కనుక ముక్తుడే యగును.

**విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదస్స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః ।**
**తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా యయా సదానందరసం సమృచ్ఛతి ॥**

మనోనైర్మల్యము, స్వాత్మానుభవము, మహోత్కృష్టమగు శాంతి, నిత్య తృప్తి, అత్యంత హర్షము, ఎల్లప్పుడు నాత్మానంద రసమును గలుగజేయు పరమాత్మనిష్ఠయు ఇవి విశుద్ధసత్త్వము గల బ్రహ్మజ్ఞానికి గల్గియుండునే గాని రజస్తమస్సత్త్వగుణ సంబంధములైన గుణము లేమియు నుండవు. ఇది

ప్రకృతిరహిత శుద్ధాత్ములయొక్క స్వభావమని గ్రహించందగినది. విశుద్ధ తత్త్వము గల యోగి యెల్లపుడు చిన్మయాకారజ్ఞాన స్వరూపి యగుటచే అట్టి స్వభావమే గల్గియుండును.

శ్రీ సీతారామాంజనేయ సంవాదములో గల యీ క్రింది పద్యమును పఠించుచు నిజార్థము నరయక కొందరు ఆత్మజ్ఞానియైన తర్వాత సంసార విషయములలో నున్నను బాధకము లేదని బల్కుదురు.

**శివజీవైక్య సమాధియందు విలసచ్చిన్మాత్రతత్త్వంబు దా**
**నవలీలంగని పూర్ణుడై పిదప మాయాసంసృతిం జెందినం**
**దవులన్నేర్చునె యోగి పాలు పెరుగై ద్రచ్చంగ వేఱైన యా**
**నవనీతంబిక జల్లలో గలయునే నానా ప్రకారంబులన్ ॥**

జీవబ్రహ్మైక్యమును తెలిసికొని సర్వపరిపూర్ణుడై, యోగారూఢుండై యున్న మహాత్ముడు కల్పితసంసారమున నుండినను వానికి వికారము లంటవు. పాలను పెరుగుజేసి దానిని మధించి తీయబడిన వెన్న ఆ పాల కంటె వేఱే యగును. కాని యెప్పటికైన దానియందు గలియునా? కలియదు కదా! అట్లే బ్రహ్మజ్ఞానియు దేనితోను సంబంధపడడు.

దీని తాత్పర్య మీలాగుండగా విషయపరవశులైనవారు ఇట్టి పవిత్రాశయమునకు నెంత అపవిత్రార్థమును జెప్పుచున్నారో, ఆశ్చర్యముగా నున్నది.

వారు జెప్పే యర్థమేమన? జ్ఞాని విషయపరవశుడై విషయములో జిక్కుకొని విషయలోలుడై విషయముల ననుభవించుచుండినను, బంధకము లేదనియు, మాయతో సంబంధించుట లేదనియు చెప్పుదురు. ఇది వీరి కల్పితార్థమేగాని యీపద్యమున అట్లు ఎచ్చటను గనుపించుట లేదు. పెరుగును తరచి యేర్పరచిన వెన్న మరల మజ్జిగలో కలియదు కదా! ఆలాగున జ్ఞానియొక్క ప్రారబ్దసంస్కారము ననుసరించి గృహస్థాశ్రమమున నుండినను, లేక లోకోద్ధారములగు ప్రపంచకార్యములలో పని చేయువాడై యున్నను దృశ్య విషయములలో ప్రవృత్తి గలుగదనియు, ప్రాకృతగుణము లుండవనియు,

నిర్విషయుడై, నిస్సంగుడై, నిత్యశుద్ధజ్ఞాన స్వరూపుడై యుండుననియు నర్థమే గాని మరియొకటి గాదు.

ఎందుకనగా? వికారము గలుగక విషయములలో ప్రవృత్తి గలుగదు. వికారము గల్గినచో, నవనీతము చల్లలో కలిసినట్లగును. అప్పుడది విరుద్ధ ధర్మము గదా! ఇచ్చట గ్రంథకర్త యభిప్రాయము జన్మాంతర సంస్కారము ప్రారబ్ధరూపముగ నుండుటచే కొందఱు గృహస్థాశ్రమములోను, కొందఱు సన్న్యాసాశ్రమములోను, కొందఱు వానప్రస్థములోను, కొందరు బ్రహ్మచర్యాశ్రమములోను, కొందరతి వర్ణాశ్రమములోనుండవచ్చునను భావము దెలుపుట కొఱ కీ పద్య మేర్పడియుండును. ఈ విషయమై అమనస్కమున గల కొన్ని పద్యము లిచ్చుట పొందుపరచెద. సామాన్యముగ నర్థము గ్రాహ్యమగుటచే తాత్పర్యము వ్రాయలేదు.

**ఆత్మతేజంబు వీక్షించు నతని మాన**
**సేంద్రియంబుల చేష్టల నెడల విడచి,**
**యొదిగి బెదరక కదలక యూరకుండు**
**సింగముల గన్న గజముల భంగిననఘ !**

**కొందరాత్మతత్త్వము నెఱుంగుదు మటంచు**
**గర్వులై నిక్కి చిత్తనిగ్రహము లేమి**
**నుపరతి సుఖంబుగానక విపుల విషయ**
**రాగలోలత జెడుదు రూరక మహాత్మ !**

**జ్ఞాన విజ్ఞాన యుతుడయ్యు సంతతంబు**
**నాత్మ భావన లేకున్న యతని యింద్రి**
**యంబులు మనంబు తమకు వశంబు జేసి**
**విషయసుఖముల చవి జూపి వెతలబెట్టు॥**

**చిత్తేంద్రియోపరమము మ**
**హత్తర మిది యెల్లవారి కబ్బదు వినుమా**

**యుత్తమ దశ గలిగిన వి**
**ద్వత్తము డతిదుర్లభుడు సదా మన్మయుడున్.**

**ఒకవేళ దనయందు సకల ప్రపంచంబు**
**కల్పితంబని యెంచి కాంచినవ్వు**
**నొకవేళ సర్వభూతోపాధి తతియందు**
**దనుజూచి మిగుల సంతసముజెందు**
**నొకవేళ దేహాదు లొప్పుగా విహరింప**
**సర్వసాక్షి నటంచు సంభ్రమించు**
**నొకవేళ నన్యమించుక లేదొకండనే**
**నని నిర్వికల్ప సమాధినొందు**

**నతుల వైరాగ్యబోధోపరతుల గలుగు**
**నతని మహిమలు గణుతించి యభినుతింప**
**హరిహర హిరణ్యా గర్భులకైన దరమె**
**యపరిమిత సద్గుణ నికాయ! యాంజనేయ!**

ఇక జనకుల గుఱించియు, శ్రీకృష్ణభగవానుని గుఱించియు జనులనేక విధముల దలంతురు. వారెట్టివారో? యెట్టి మహిమ గలవారో? వారిస్థితి యేమిటో? చక్కగా తెలిసికొనక పోవుటచేతనే యట్టి ప్రమాదము సంభవించుచున్నది.

**కృష్ణో భోగీ శుకస్త్యాగీ నృపౌ జనకరాఘవౌ ।**
**వసిష్ఠః కర్మనిరతః పంచైతే జ్ఞానసమ్మతాః ॥**

శ్రీకృష్ణుడు పదునారు వేల భార్యలలో గూడియుండినను అస్ఖలిత బ్రహ్మచారియని పేరు వహించెను. శ్రీకృష్ణభగవానుని పరీక్షించుటకొరకు నారద మహర్షి యొకదినమున ప్రతిభార్య యింటిలో రాత్రికాలమున చూచుటకు వెళ్లునప్పుడు ప్రతియింటిలోను నేకకాలమున శ్రీభగవాను డుండెను.

ఆలాగున నిప్పుడుండువారెవరైన చేయగలరా! గోవర్ధన పర్వతమును చిటికెన వ్రేలితో నెత్తెను. గోకులమున నెన్ని గోవులు కలవో యెందరు గోపాలురు గలరో, వానినన్నిటిని సంకల్పమున సృష్టించెను. సముద్రమధ్యమున ద్వారకాపురమును నిర్మించెను. ఇక నెన్నియో అమోఘములగు నమానుష కృత్యములను చేసెను.

ఋషులలో కొందఱు అవతారపురుషులును నిగ్రహానుగ్రహ శక్తిగలవారలు. అంతేగాక వారు కారణపురుషులని గ్రహించవలయును. ఇప్పుడుండువారికి నిగ్రహశక్తి గలదుగాని, అనుగ్రహశక్తి లేనందుచే వారాలాటి కార్యములలో ప్రవేశింపరాదు. ఒకనితండ్రి చాలామందికి డబ్బుచ్చి బాండ్లు వ్రాయించికొనియుండెను. మఱికొందరికి ఋణస్థుడై బాండ్లు వ్రాసియిచ్చి యుండెను. తండ్రియొక్క మరణానంతరము కొడుకు మంచి యుక్తిశాలియై ఋణము తనకు తెలియదనియు అది తండ్రి చేసినది కాదనియు, రావలసినది తనకిచ్చి తీరవలయుననియు, అది మాతండ్రి ధనమనియు చెప్పిన చెల్లునా? ఆలాగున నున్నది ప్రస్తుతము జ్ఞానులని చెప్పువారిలో కొందరి యవస్థ. శుకమహర్షి పరమత్యాగియయ్యు పరీక్షిత్తుమహారాజుకు భాగవత మనేక రసములతో నుపదేశించెను. శ్రీరామచంద్రులున్ను, జనకమహారాజున్ను రాజ్యపరిపాలనము చేసియుండిరి. వసిష్ఠమహర్షి కర్మకాండ నిరతుడైయుండెను. అయినను వీరైదుగురును మహాబ్రహ్మజ్ఞానులనియే శాస్త్ర సమ్మతము.

రామచంద్రులయొక్క త్యాగము నిండు గర్భిణిగానుండు సీతాదేవిని లోకాపవాదముచే అడవిలో విడచిపెట్టుటచేతను, సత్యవాక్సంరక్షణ విషయమై తన యాత్మకన్న అధికముగ ప్రేమించెడు శ్రీ లక్ష్మణస్వామి నుపేక్షించుట చేతను దెలిసికొనదగును. ఈ చరిత్ర ఉత్తరరామాయణమున గనందగును. ఆలాగున జనకునియొక్క జ్ఞానమెటువంటిదో శుకబ్రహ్మకైవల్యమున చూడ వచ్చును. వసిష్ఠభగవానునియొక్క బ్రహ్మసాక్షాత్కారము జ్ఞానవాసిష్ఠమున గనందగును. ఈ పైశ్లోకభావమేమన? సంస్కారము ననుసరించి కొందఱు త్యాగులుగాను, కొందఱు భోగులుగాను, కొందఱు ప్రభువులుగాను,

కొందఱు ప్రజలుగాను, కొందఱు కర్మనిరతులుగాను, కొందఱు కర్మరహితులుగా నుండవచ్చును. అయితే యిది అందరికిన్ని చెప్పిన విషయము గాదు. కావుననే బోధాయన మహర్షి యీలాగున నుపదేశించెను.

**అనుష్ఠితం తు యద్దేవైర్మునిభిర్యదనుష్ఠితమ్ ।**
**నానుష్ఠేయం మనుష్యైస్తదుక్తం కర్మ సమాచరేత్ ॥**

దేవతలున్ను కారణపురుషులగు మునులున్ను చేసినట్లు సామాన్య మనుష్యులు చేయరాదు. వారెట్లాచరించే లాగున చెప్పుదురో ఆలాగున చేయవలయును.

**ధర్మవ్యతికరో దృష్టో మహతాం సాహసం తథా ।**
**తదన్వీక్ష్య ప్రయుంజానః సంసీదత్యవరోఽబలః ॥** (మనుస్మృతి)

గొప్పవారియందు ధర్మవైరుద్ధ్యము గానవచ్చుచున్నది. అది సాహస కృత్యము. దానిని జూచి బలహీనులగు నితరులు చేసిరేని దుఃఖములపాలగుదురు.

**తేజోమయాని పూర్వేషాం శరీరాణీంద్రియాణి చ ।**
**దోషైస్తైర్నోపలిప్యంతే పద్మపత్ర మివాంభసా ॥**

ఆకారణ ఋషుల శరీరములు, ఇంద్రియములు తేజోమయములు. తామరాకును నీళ్లంటనట్లు వారిని బాపము లంటవు.

**తద్యథైషీకా తూలమగ్నౌ ప్రోతం ప్రదూయేత్ ।**
**ఏవగ్ంహాస్య సర్వే పాప్మానః ప్రదూయంత ॥** (శ్రుతి)

ఎట్లు గడ్డిపోచలు నిప్పులో బడి కాలిపోవునో, యట్టులే వీరి పాపము లన్నియు దగ్ధమైపోవును.

**కర్మణా మనసా వాచా యత్నాద్ధర్మం సమాచరేత్ ।**
**అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మమప్యాచరేన్న తు ॥** (యాజ్ఞవల్క్యుడు)

మనోవాక్కాయములచే ప్రయత్నించియైన ధర్మకార్యమే చేయవలెను. ధర్మయుక్తమైనను, పుణ్యలోకహానికరము, లోకనిందాకరమునైన దానిని జేయరాదు.

ఋషులలో గల సాహసకృత్య మేమన? వసిష్ఠులు కర్మకాండపరు లైనను, యోగశక్తిచే విశ్వామిత్రుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముల నన్నిటిని, మ్రింగగల శక్తి ఆయన యోగదండమున కుండెను. కామధేనువును దగ్గర నుంచుకొను శక్తి గల్గియుండెను. రామచంద్రులు రాయి నీళ్ళలో మునగక యుండునట్లు సముద్రమున వారధిని కట్టిరి. పరశురాముడు పితృవాక్యముచే తల్లిని వధించెను. అయినను వెంటనే తల్లిని సోదరులను బ్రతికింపజేసెను. విశ్వామిత్రు లొక తరుణమున కుక్కమాంసము తినిరి. అయితే బ్రహ్మకు సదృశమైన సృష్టిని చేసిరి. అగస్త్యులు ఒక స్థితిలో మాంసము భుజించిరి. అయితే సముద్రజలమును ఆపోశనము గావించిరి. వింధ్యపర్వతమును భూమిలో అణగద్రొక్కిరి. ఈ మహాతత్త్వము దెలియక ఇప్పుడుండువారు పూర్వులలో కొందరు సంసారములలో నుండిరనియు, మాంసము భక్షించి రనియు మాత్రము చెప్పుదురు గాని, వారు చేసిన ఘనకార్యముల నాలోచింప నైన ఆలోచింపరు. కనుక ఋషులు చేసినట్లు చేయవలదనియు, చెప్పినట్లు చేసిన చాలుననియు శాస్త్రము చెప్పెడు రహస్యము.

ఆలాగున శ్రీ శంకరచార్యులవారు పరకాయప్రవేశము చేసిరి. నర్మదా ప్రవాహవేగమును కమండలములోని కాకర్షించిరి. ఆలాటి కార్యములిప్పు డుండు వారికి చేయశక్తి గల్గియున్నదా? కనుక మహనీయులచరిత్ర యమోఘ మగుటచే అందరికి నాచరణీయము గాదు. వారనుగ్రహించిన ధర్మము నాచ రించుటే ముముక్షువుల ధర్మమైయున్నది. ఇక విస్తారముగా వ్రాసి పుటలను పెంచదలంచుట లేదు. కర్మరహస్య మంతయు దీనివల్ల తెలసికొనగలరు.

**శాంతిదాంత్యాదయో ధర్మా జ్ఞానస్యాంగాని సువ్రతాః ।**

అని బ్రహ్మగీతయందు కలదు. శమదమాదులు సత్యధర్మాదులు

జ్ఞానమున కంగములు. ఒకవేళ కొందఱికి జ్ఞానము గల్గియున్నను, జ్ఞానాంగ ములగు ధర్మములు లేనిచో అది నిష్ప్రయోజనము. ఎట్లన? ప్రాణముమాత్ర ముండియు కర చరణ నేత్ర కర్ణ జిహ్వా ఘ్రాణాదీంద్రియములు లేనిచో వట్టి మొండిదేహ మెటువంటిదో, ఆలాగున అట్టి జ్ఞానముగూడ నిరుపయోగము. ఇక గ్రహించవలసిన సార మొకటి గలదు. ప్రారబ్ధకర్మమని తలంచి అంతః కరణశుద్ధిలేనివారు, విరక్తిలేనివారు, పుణ్యము లేనివారు, జ్ఞానులుగా నటించి చేయు దుష్కృత్యములు సరియైనవిగావు. ఏలన? అట్టి నికృష్టములైన పాప గుణములు గలిగిన జ్ఞానము గలుగదని యింతవరకే చెప్పబడెను. ఆ విషయమై సూతసంహితయందు చెప్పినది చూడుడు.

**ప్రారబ్ధకర్మపర్యంతం కదాచిత్ పరమార్థవిత్ ।**
**జగజ్జీవాతిగం వేద కదాచిన్నైవ వేద తత్ ॥**

పాపసంబంధములగు కర్మలుగూడ ప్రారబ్ధ కర్మమైనను పుణ్యాకర్మ లచే అట్టి దురితము నశింపక అంతఃకరణశుద్ధి కలుగదు. హృదయశుద్ధి గలుగనిచో జ్ఞానమెప్పటికిని గలుగదు. దీనికన్న ప్రబలప్రమాణ మింకేమికావల యును? వసంతఋతువు గలదిగా వనమును వర్ణించునప్పుడే హేమంత శిశిర ఋతువు లందువలె అరణ్యము శూన్యముగ నుండందగునా? శరత్కాలము వచ్చునప్పుడు ఆకాశము శుభ్రమై మార్గములో గల బురదలు ఎండి జలము స్వచ్ఛమగునట్లు హృదయశుద్ధి గల్గి సత్త్వగుణజ్ఞాన ముదయ మగునప్పుడు మనోనిర్మలతయు, పాపపంకక్షయమున్ను, జ్ఞానావిర్భావమున్ను గలుగవలయును. శరత్కాల పూర్ణిమరాత్రిని గురించి చెప్పునప్పుడు అయ్యది వర్షాకాల అమావాస్య అర్ధరాత్రిగా నుండవచ్చునా? వార్ధక్యదశను ప్రతిపాదించు నపుడు బాల్యావస్థలోన చేష్టలు గలుగవచ్చునా? ఆలాగున జ్ఞానియొక్క లక్షణము నిర్ణయించునప్పు డజ్ఞానియొక్క గుణము గల్గియుండరాదు.

దేవతలను గుఱించి నిరూపించునప్పుడు రాక్షసులయొక్క స్వభావము గల్గియుండవచ్చునా? ఆలాగున పుణ్యోత్కర్షపరమగు జ్ఞానమును చెప్పు

నప్పుడు నికృష్ట పాపస్వభావము తగునా? ధర్మానుష్ఠానముచే వెలయు ధర్మాత్ముని తెలుపునప్పుడు అధర్మాత్ముని చర్య గానుపింపవచ్చునా! ప్రకాశమునకున్ను చీకటికి నెంతభేదము గలదో పుణ్యమునకును, పాపమునకును, జ్ఞానమునకున్ను, అజ్ఞానమునకున్ను, ధర్మమునకున్ను, అధర్మమునకున్ను నట్టి భేదముగలదని ముముక్షువులు గ్రహించి పరిశుద్ధాచరణ గలవారై పరమాత్మజ్ఞానమున కర్హులై తరించేలాగున ప్రయత్నింతురు గాక!

కర్మముయొక్క రహస్యము ఈ క్రింద జెప్పబడు వాక్యములలో నిగూఢమై యున్నది. 1. ఇతరులకొఱకు మీరేది చేసెదరో, అదియే మీ కొఱకు మరియొకరు చేయుదురు, 2. ఇతరుల విషయమై మీరేమి చెప్పెదరో, మీ విషయమై దానిని మరియొకరు చెప్పెదరు, 3. ఇతరులకు మీరేమి యిచ్చెదరో, మీకు దానిని మరియొకరు ఇచ్చెదరు, 4. ఇతరుల విషయమై మీరేమి తలంచెదరో, అద్దానినే మీ విషయమై మరియొకరు తలంతురు. దీనిని మీరు సదా హృదయములో నుంచి వర్తింతురేని మీకు మరల నెచ్చటను సౌఖ్యమే గల్గును.

ఇప్పుడు పంచదశిలో శ్రీవిద్యారణ్యగురుడు తెలిపిన విషయమును నిరూపించెద. వీరు వేదాంతశాస్త్ర సార్వభౌములని లోకవిదితము. వీరి తీర్మానమును అద్వైతనిష్ఠగల వేదాంతు లెవరున్ను తిరస్కరింపజాలరు. అది న్యాయముల కన్నిటికిన్ని అగ్రస్థానకేంద్రపు తీర్మానము వంటిది. అనగా పార్లమెంటు జడ్జిమెంటు వంటిది.

**బోధా దూర్ధ్వం చ తద్దేయం జీవన్ముక్తి ప్రసిద్ధయే ।**
**కామాది క్లేశబంధేన యుక్తస్య న హి ముక్తతా ॥**

జీవన్ముక్తి సిద్ధికొఱకు జ్ఞానోదయము గల్గిన పిమ్మటగూడను పచ్ఛాస్త్రమునకు సద్ధర్మమునకు భిన్నములైన వాసనావృత్తులు అంతఃకరణములో నుండిన తప్పక విడువందగినవి. కామక్రోధాదిక్లేశమైన బంధముతో కూడియున్న వానికి జీవన్ముక్త భావము గలుగనే గలుగదు. ఈ విషయమునే

మనమిప్పుడు గ్రహించవలసినది. ఇప్పుడు బ్రహ్మవిచారము చేయు వారిలో కొందరికి తత్త్వబోధము గల్గియున్నను వాసనాక్షయము గలుగనందుచే నిర్మల బ్రహ్మనిష్ఠులు గాకయున్నారు. దానిని రహితము చేయవలెననియే మహర్షుల యాశయము. నవీన వేదాంతు లది దృశ్యమని తలంచి యూరకుండుటచే అప విత్రు లగుచున్నారు.

**తత్త్వం బుద్ధ్వాఽపి కామాదీన్ న నిశ్శేషం జహాసి చేత్ ।**
**యథేష్టాచరణం తే స్యాత్కర్మశాస్త్రాతిలంఘినః ॥**

పరతత్త్వము నెరిగియు, కామాది దోషములను, శేషము లేనట్లుగా విడువకుంటివేని, ధర్మశాస్త్రము నతిక్రమించిన నీకు స్వేచ్ఛాచరణము అనగా, తన యిష్ట ప్రకారము ప్రర్తించుట సంభవించును. ఇప్పుడు ఇదే రీతిగానే చాలా మంది బ్రహ్మవిచారణ పరులున్నారు. ఏదో ఒక విధముగా పరోక్షముగాగాని, అపరోక్షముగాగాని వారికిని జ్ఞానము ఉండవచ్చును. అయితే ధర్మశాస్త్రము నతిక్రమించి స్వేచ్ఛాప్రవర్తకు లగుటచే పతితు లగుచున్నారు.

**శక్యం జేతుం మనోరాజ్యం నిర్వికల్ప సమాధితః**
**సుసంపాద్యః క్రమాత్సోఽపి సవికల్ప సమాధినా ॥**

నిర్వికల్ప సమాధివల్ల మనోరాజ్యమును (వృత్తులను) జయించుటకు సాధ్యమగును. ఆనిర్వకల్ప సమాధియు, క్రమముగా సవికల్ప సమాధిచేత (ప్రత్యాహార ధ్యానధారణాదులచేత) అనాయాసముగ సంపాదింపదగిన దగును.

**బుద్ధతత్త్వేన ధీదోషశూన్యేనైకాంతవాసినా ।**
**దీర్ఘం ప్రణవముచ్చార్య మనోరాజ్యం విజీయతే ॥**

బోధము గలిగి బ్రహ్మాత్మైక్య లక్షణము గల్గినట్టియు, బుద్ధియందుగల దృశ్యవాసనా విషయాది దోషముల రహిత మొనర్చినట్టియు, ఏకాంతవాసము చేయుచు, నిరంతర బ్రహ్మచింతన చేసెడి పురుషునిచేత షడ్ద్వాదశమాత్ర యుక్తమైన ఓంకారము బ్రహ్మభావముతో నుచ్చరింపబడి మానసరాజ్యము

(సంకల్ప లోకము) జయింపబడుచున్నది. ఈ మాత్రలనియమము ఓంకార గ్రంథమున గనందగును.

**దోషదృష్టి ర్జిహాసా చ పునర్భోగేష్వదీనతా ।**
**అసాధారణ హేత్వాద్యా వైరాగ్యస్య త్రయోఽప్యమీ ॥**

వైరాగ్యమునకు బాల్య యౌవన వార్ధక్యము లనియు ఆదిమధ్యాంతము లనియు చెప్పబడు హేతువు, స్వరూపము, కార్యము అని మూడవస్థలు గలవు. అప్పుడు పూర్ణవైరాగ్యము సిద్ధించును. విషయములలో తత్త్వాపాయత్వ దోష దర్శనమే హేతువు. భోగత్యాగేచ్ఛయే వైరాగ్యస్వరూప మగును. మరల భోగేచ్ఛ గలుగమియే వైరాగ్యముయొక్క కార్యమగును.

**శ్రవణాదిత్రయం తద్వత్తత్త్వ మిథ్యా వివేచనమ్ ।**
**పునర్గ్రంథేరనుదయో బోధస్యైతే త్రయో మతాః ॥**

పై వైరాగ్యమునకు చెప్పినట్లు మూడవస్థలు జ్ఞానమునకు కూడ గలవు. మరియు ఓ సాధకుడా! ఆత్మయే చూడందగినదియు, వినదగినదియు, ఎరుగ దగినదియు ధ్యానింపదగినదియునని బృహదారణ్యకశ్రుతి. 'ఆత్మావారేద్ర ష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః'. ఈ ఉపనిషత్తు దశోపనిషత్తులలో ముఖ్యమైనది. ఇది యాజ్ఞవల్క్య మహర్షి బ్రహ్మనిష్ఠురాలగు తనయొక్క ధర్మపత్ని కుపదేశించినది. ఇందువల్ల స్త్రీలకు బ్రహ్మవిచారమున కర్తృత లేదనియు, మోక్షము గలుగదనియు చెప్పెడు మానవాకృతులైన జడకఠిన హృదయులగు పురుషులు దెలిసికొందురుగాక! పైశ్రుతి ప్రకారము వేదాంతార్థ శ్రవణ మనన నిదిధ్యాసములు మూడును జ్ఞానమునకు హేతువులగును. అనగా ఆత్మదర్శనమునకు సాధనముగా శ్రవణాదులను చేయవలెనని చెప్పబడుటచేత శ్రవణ మనన నిదిధ్యాసములు మూడున్ను హేతు, స్వరూప కార్యములని తెలియవలెను. జ్ఞానమునకవి బాల్య, యౌవన, వార్ధక్యములని గ్రహించేది. మరియు సహంకారాదులకంటె కూటస్థాత్మను భిన్నముగా జూచెడి జ్ఞానమే బోధస్వరూప మగును. అన్యోన్యాధ్యాస రూపమగు హృదయ

గ్రంథి మరల నుదయింపమియే బోధయొక్క కార్యమగునని తెలియవలెను.

ఇప్పుడు యోగ మార్గక్రమము చెప్పబడుచున్నది. ఇదిన్ని పైచెప్పినట్లు హేతుస్వరూప కార్యములను ఆది, మధ్యాంతములు లేదా బాల్య, యౌవన, వార్ధక్యములని గ్రహించవలెను.

**యమాది ధీనిరోధశ్చ వ్యవహారస్య సంక్షయః ।**
**సుహేత్వాద్యా ఉపరతే రిత్యసంకర ఈరితః ॥**

యమనియమాదికంబును, బుద్ధియొక్క నిరోధలక్షణ యోగంబును, వ్యవహారముయొక్క నాశంబును ఉపరతియొక్క హేతుస్వరూప కార్యములు అగుచున్నవి: ఈ విధముగ నిస్సంగయోగముయొక్క లక్షణము చెప్పబడెను. ఈ యమనియమాదులు ఉపరతికి హేతువులగును. చిత్తనిరోధలక్షణము గల యోగము ఉపరతియొక్క స్వరూపమగును. సర్వదృశ్యవ్యవహార (దృశ్యవాసన) సంక్షయము ఉపరతియొక్క కార్యమగును.

**తత్త్వబోధః ప్రధానం స్యాత్సాక్షాన్మోక్ష ప్రదత్వతః ।**
**బోధోపకారిణావేతౌ వైరాగ్యోపరమావుభౌ ॥**

తత్త్వజ్ఞానము ప్రత్యక్షముగా ముక్తినిచ్చుటవల్ల ముఖ్యమైనది యగును. ఈరెండైన విరక్తియు, ఉపరతియు తత్త్వజ్ఞానమునకు సహాయము చేయునవి యగును.

**అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।**
**శమాదిసహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥**

బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారజ్ఞానము దృఢముగ గలుగువరకు శమదమాది ధర్మములతో గూడినవారై వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసములను బ్రహ్మ నిష్ఠులు తప్పక అభ్యసింపవలెను. నిశ్శేషరోగరాహిత్యము గలుగువరకు ఔషధానుపానాది పథ్యము లుండవలయు గదా? అట్లుగాక కొంచెము సౌఖ్యము గల్గిన వెంటనే నిలుపుదల చేసిన మరల రోగమారంభ మగునట్లు

బ్రహ్మవిచారముగూడ అట్లే యుండునని ముముక్షులు గ్రహించవలెను. ఇప్పుడు లోకములోగల స్థితి యీలాగుననే యున్నది. కనుకనే యోగపరులై యుండియు, రాగరోగముచే బాధపడుచుందురు. రాగమొకటి గల్గునప్పుడు తన యనుయాయులగు ద్వేష కామక్రోధాదులు వెంటనుండునని గ్రహించేది. ఓహో! వేదాంతశాస్త్రము తల్లి పిల్లల కుపదేశించునట్లు ఉదేశించుచున్నదే! ఉత్తమగురుడు అంతరంగ శిష్యునికి నుపదేశించునట్లు పల్కుచున్నదే!

**రాగో లింగమబోధస్య చిత్తవ్యాయామభూమిషు ।**
**కుతశ్శాద్వలతా తస్య యస్యాగ్నిః కోటరే తరోః ॥**

ఆత్మబోధము గలుగనివానికి శబ్ద స్పర్శ రూప రస గంధాది విషయము లలో ప్రీతి గలుగుటయే గురుతుగ నుండును. ఆత్మజ్ఞానోదయము గలవానికి అట్టి శబ్దాది విషయములలో ప్రీతి గల్గియుండదు. అదే దానికి గురుతు. ఎట్లన? వృక్షముయొక్క తొఱ్ఱలో నిప్పు రగులుచుండిన ఫల, పల్లవ, పుష్ప, పత్రాదులు గల్గియుండవు. అగ్ని లేనిదైనచో పుష్కలముగా శోభాయమానమై యుండును గదా!

**ఆత్మధీరేవ విద్యేతి యది తర్హి సుఖీ భవ ।**
**దుష్టచిత్తం నిరుంధ్యాచ్చే న్నిరుంధి త్వం యథాసుఖమ్ ॥**

ఓ సాధకుడా! ఆత్మబుద్ధియే(ఆత్మజ్ఞానమే) విద్యయొక్క స్వరూపమని యెరింగితివేని నిత్యసుఖము గల్గును. దుష్టచిత్తమును నిరోధనము చేసెడి వాడవైతివేని సుఖము గలుగునట్లుగా నీవు నిరోధము చేయుము.

**వైరాగ్యబోధోపరమాస్సహాయాస్తే పరస్పరమ్ ।**
**ప్రాయేణ సహ వర్తంతే వియుజ్యంతే క్వచిత్క్వచిత్ ॥**

విరక్తియు, జ్ఞానంబును, ఉపరతియు నివి మూడును అన్యోన్యముగా సహాయము లగును. సాధారణముగా అవిమూడును కూడి వర్తించుచుం డును. ఒకానొక పురుషుని యందొకానొకటి లేక పోవుటయుం గలదు.

ఈ వైరాగ్యబోధోపరతులు మూడును శుద్ధములై యుండువాడే యుత్కృష్ట బ్రహ్మనిష్ఠుడ గును. ఈ మూడింటిలో కొందరికి వైరాగ్య ముండిన బోధ ముండదు. ఇది రెండునున్నను ఉపరతి యుండదు. ఉపరతి యుండిన, పైజెప్పిన వానిలో వైరాగ్యముగాని, జ్ఞానబోధగాని లేకపోవచ్చును. అట్టివారికి సుకృతవిశేషము చాలదనియే తలంచవలెను. క్షీరాన్నమునకు పాలు, చక్కెర, రవ్వ మూడును సరిగానుండిన మాత్రము గదా రుచి యుండును. మూడింటి లో నేదైన యొకటిగాని, రెండుగాని లేనిచో నేలాగున రుచిని గలుగజేయదో మఱియు దీపము నిలుచుటకు ప్రమిద, వత్తి, తైలము మూడుసరిగా నున్న గదా! ఆరకుండ వెలుగుచుండును. ఆ మూడింటిలో ఒకటిగాని, రెండుగాని, లేక కొరత గల్గినను, ఏలాగున దీపము నిలువక ఆరిపోవునో, జ్ఞానముయొక్క స్థితియు నాలాగుననుండునని గ్రహించవలయును.

మఱియు భూమియు, విత్తనము, జలమున్ను పరిపక్వముగానున్న మాత్రమే గదా చెట్లుగాని, పైర్లుగాని, పుష్కలముగా ఫలించును! ఈ మూడిం టిలో నేదైన ఒకటిగాని, రెండుగాని జబ్బుగా నుండిన నేలాగున మంచి ఫలము గలుగదో బ్రహ్మనిష్ఠుని స్థితియు నాలాగుననుండును. ఆలాగున ఒక యంత్రము చక్కగ పని చేయవలసియుండిన నిప్పున్ను, నీళ్ళున్ను, ఇంజ నున్ను చక్కనిస్థితిలో నుండిన గదా నిర్దిష్టకార్యము చేయగల్గును! ఈ మూడింటిలో ఒకటిగాని, రెండుగాని సరియైన స్థితిలో లేనిచో ఇంజను ఏలా గున పనిచేయజాలదో బ్రహ్మనిష్ఠునియొక్క ఊర్ధ్వగతియు, జ్ఞానప్రాప్తియు నీలాగుండునని గ్రహించవలెను. కావున నీ వైరాగ్యబోధోపరతులు మూడున్ను ఒకదానికొకటి సంబంధించియే యుండును. వీనిలో కొరత గల్గుటచేతనే ఇప్పుడుండు బ్రహ్మనిష్ఠులు, పూర్వీక ఋషుల రీతిగా గాని, యోగుల రీతిగా గాని, భక్తుల రీతిగాగాని ఉన్నత స్థితికి రాజాలక యున్నారు.

**త్రయోఽప్యత్యంత పక్వాశ్చేన్మహత స్తపసః ఫలమ్ ।**
**దురితేన క్వచిత్కించిత్కదాచిత్ప్రతిబధ్యతే ॥**

వైరాగ్యబోధోపరతులు మూడును మిక్కిలి పరిపక్వములైన యెడల అధికమైన అనగా ననేకజన్మములయందు సంపాదింపబడిన పుణ్యరాశి రూప మగు తపస్సుయొక్క ఫలమగును. పాపముచేత ఒకానొక పురుషుని యందు ఒకానొకనప్పుడు వైరాగ్యబోధోపరతులలో నొకానొకటి లేకపోవు చున్నది.

**వైరాగ్యోపరతీ పూర్ణే బోధస్తు ప్రతిబధ్యతే ।**
**యస్య తస్య న మోక్షోఽస్తి పుణ్యలోక స్తపోబలాత్ ॥**

మఱియు ఏ బ్రహ్మనిష్ఠునికి వైరాగ్యోపరతులు రెండును, సంపూర్ణము గా నుండి తత్త్వజ్ఞానము మాత్రము లేకపోవునో, అట్టి పురుషునకు మోక్షము గలుగదు. మరియేమి గలుగుననగా? వైరాగ్యోపరతులు అత్యంతపుణ్యము గలవగుటచేతను, గొప్ప తపోబలముచే సిద్ధించిన వగుటచేతను పుణ్యలోక ప్రాప్తి గల్గును. ఇట్టి వారికి కామ్యకర్మపరులకొఱకేర్పడు విషయసుఖము లనుభవించుట కేర్పడిన స్వర్గలోకము గాదు. దానికి సువర్లోకమని పేరు. పుణ్యోత్కర్షము ననుసరించి మహర్లోక, జనలోక, సత్యలోకాది అత్యంత నిర్మలలోకముల బొందుదురేగాని విషయాసక్తులై యజ్ఞదానకర్మాదులు చేయువారి లోకముల పొందరు.

**పూర్ణే బోధే తదన్యౌ ద్వౌ ప్రతిబద్ధౌ యదా తదా ।**
**మోక్షో వినిశ్చితః కిం తు దృష్టదుఃఖం న నశ్యతి ॥**

మఱియు తత్త్వజ్ఞానము పూర్ణముగ నున్నదగుచు వైరాగ్యోపరతులు రెండును చక్కగా లేనియెడల అట్టి పురుషునకు వైరాగ్యోపరతులు రెండును లేమిచేత ప్రారబ్ధ కర్మవశమువల్ల గలిగెడు దుఃఖము నశింపదు. మోక్షము నిశ్చితమే.

అనగా జ్ఞానముచేత దేహానంతరము మోక్షము గల్గినను వైరాగ్యోపర తులు రెండును లేమివల్ల జీవించియుండగా ముక్తిసుఖము లభింపకపోవు టయేగాక, బహువిధ శోకములకు వశవర్తుడై యుండవలసివచ్చును. ఇది గొప్ప ప్రభువైనవాడు మహావ్యాధిగ్రస్తుడైనచో నెట్లుండునో, ఆలాగున నుండును.

వైరాగ్యబోధోపరతులు గల్గి ఆత్మసాక్షాత్కారజ్ఞానము గల్గుటకు వర్తమాన కాలమున నేమేమి ప్రతిబంధములు గల్గియుండునో అట్టి లోపములు గలుగని యుత్కృష్టమైన జన్మము మరుజన్మములో గల్గును. అనగా కొందఱికి భక్తి వైరాగ్యములు గల్గియుండియు, రోగబాధచేతను, దారిద్ర్యబాధచేతను, బుద్ధి మాంద్యముచేతను, ఏకాంతవాసము లభింపక పోవుటచేతను, సద్గురువుల బోధ గలుగక పోవుటచేతను, ధారణాధ్యానశక్తి లేకపోవుట చేతను, నిర్విషయత గలుగకపోవుటచేతను, జ్ఞానప్రతిబంధము గల్గినను జాత్యాదినిమ్నావస్థ గల్గుట మొదలుగాగల లోపము లేమియు గలుగని యుత్కృష్టజన్మము తప్పక గల్గును. అప్పుడు బ్రహ్మచర్యాద్యనుష్ఠానములు చేయుటచే బ్రహ్మసాక్షాత్కారమున కర్హత గల్గును.

ఈ విషయమై భగవద్గీతలో శ్రీకృష్ణభగవానులు ఆరవ అధ్యాయమున నుపదేశించియున్నారు. అయితే మన సోదరీమణులలో కొందఱు పురుషులై పుట్టనందుచే ఆత్మస్వాతంత్ర్యము లేదనియు, మరల నిట్టి పాడు జన్మమగు స్త్రీజన్మము గలుగక పురుషజన్మము గలుగవలయుననియు కోరికగలవారు గలరు. అట్లు తలంపరాదు. పురుషజన్మము వచ్చిన మరల స్త్రీలపై కరుణ గల్గునో లేదో తెలియదు. ఇప్పుడుండు పురుషులవలె స్త్రీలను అణగద్రొక్కు బుద్ధిపుట్టునో యేమో, కావున మరల జన్మము వచ్చిన మైత్రేయి, గార్గి, చూడాల, సులభ మొదలగు స్త్రీరత్నములుగ జన్మమెత్తవలె ననియే తలంప వలెను. ఇన్ని కోట్ల నారీమణులు దుఃఖములో నుండగా మనము మాత్రము పురుషజన్మమెత్తిగాని, జన్మరహితమైన మోక్షము పొందిగాని, సుఖముగ నుండదగునా? ఇదియా? సోదరీ భావము. వీరి కందరికిన్ని మోక్షార్హత గల్గు వరకు మనకున్ను ముక్తి యవసరము లేదనియే దైవముతో వాదము చేయ వలెను. ధర్మరాజు స్వర్గారోహణ సమయమున తనతో గూడ వచ్చిన కుక్కకు కూడ స్వర్గమివ్వనిచో తనకున్ను అక్కఱలేదని ఎట్లు హఠవాదము చేసెనో, మనము నాలాగే యుండవలయును. ఆలాగున బ్రాహ్మణేతరులగు వారు బ్రాహ్మణులై పుట్ట తలంపరాదు. అట్లయిన మాత్రమే బ్రాహ్మణేతర లోక

ముద్ధరింపబడగల్గును. ఇప్పుడు వైర్యాగ్యాదుల కవధిని జూపుచున్నాడు.

**బ్రహ్మలోకతృణీకారో వైరాగ్యస్యావధిర్మతః ।**
**దేహాత్మవత్పరాత్మత్వే దార్ఢ్యే బోధ స్సమాప్యతే ॥**

మఱియు బ్రహ్మలోక పర్యంతము గల సమస్తమును గడ్డిపరకను వలె నిష్ప్రయోజనముగ దలంచుటయే వైరాగ్యమున కవధి యగును. మఱియు దేహమే నేననెడి జ్ఞానమువలె నేను నిత్యశుద్ధస్వయంప్రకాశ బ్రహ్మైక్య జ్ఞాన స్వరూపుడ ననెడి దృఢజ్ఞానము గల్గుచుండగా, బోధ పరిపూర్ణత్వమును బొందును. అనగా నదియే బోధకు అవధి యని యభిప్రాయము.

ఈ శ్లోకములో వైరాగ్యముయొక్క అవధియు జ్ఞానముయొక్క అవధియు జెప్పబడెను. ఇది ముముక్షువు లందరున్ను చాల జాగరూకత గల్గి విచారించందగినది.

**సుప్తివద్విస్మృతిస్సీమా భవేదుపరమస్య హి ।**
**ధియా స్వయా వినిశ్చేయం తారతమ్య మవాంతరమ్ ॥**

మరియు సుషుప్తియందువలె విషయవిస్మృతి గల్గియుండుటయే ఉపరతికవధి యగును. సుషుప్తిలో నేలాగున సర్వవిషయములు సమీపములో నుండినను వానివల్ల వికారము గలుగదో, ఆలాగున జాగ్రదవస్థలో నుండియు, విషయవృత్తులు స్ఫురింపని యవస్థ గల్గిన ఉపరతియొక్క యవధి యగును. తనకు వైరాగ్య బోధోపరతు లుండెడు పరిమాణమును బట్టి ఇంతమాత్రపు వైరాగ్య బోధోపరతులు తనకు గలవని తన బుద్ధిచే తెలిసికొన వలయును. ఇది యుపరతియొక్క అవధినిగురించి చెప్పబడినది. అనేక జన్మములలో చేసిన పుణ్యాకర్మానుష్ఠానము, వ్రతనిష్ఠ, గురుభక్తి, దైవభక్తి అన్నియు గల్గి పుణ్యామే మూర్తీభవించినప్పుడు ఆలాటి జన్మము గల్గును. అప్పుడు సంపూర్ణ శోకశాంతియు, ననర్గళానందప్రాప్తియు, నిరావరణజ్ఞానబోధమున్ను గల్గి యుండును.

కర్మరహస్య విషయమై మరియొక పరమాశ్చర్య కధ గలదు. ఇది వినిన

పరమభక్తులు చాలా దుఃఖము నొందుదురు. విచారణ పురుషులు చింతా మగ్నులై స్తంభీభూతు లగుదురు. జ్ఞానులు మాయయొక్క మహిమయని తలంచి నిశ్చేష్టులగుదురు. యోగులు పరమాత్మయొక్క విలాసమని యెఱింగి ఆనందభరితు లగుదురు, తత్త్వవేత్తలు కర్మమెవరైనను ననుభవించియే తీరవలయునని తలంచి యీశ్వరరహస్యమును కొనియాడుదురు. సిద్ధులు సర్వేశ్వరునియొక్క యోగమహిమ నెఱింగిన వారగుటవలన ఆనందముచే తాండవము చేయగలరు. సాంఖ్యులు జగదీశ్వరియొక్క యింద్రజాలమని ఆత్మలో దలంచి నిశ్చింతగలవారై యుందురు. ఋషులు సర్వకారణ పురుషుని గనుగొనియైన ఇతరులు తరించవలసియుండుటచే నీలాగున ప్రవర్తించు చున్నారేగాని మరియొకటి గాదని తెలిసికొని యూరకుందురు. ఇకను పెక్కు విధములుగా వారి వారి యూహ ననుసరించి యుండగలరు. ఏవిధమైనను భగవద్భకులు భగవంతునియందుగల అధికప్రేమచే భక్తిపరవశులై దుఃఖము గలవారే యగుదురు. భక్తిపరమగు దుఃఖములకున్ను, ఇతరములగు దుఖ ములకున్ను బేధము గలదు. భక్తిపరమైనది యానంద బాష్పముగాను, ఇత రము క్లేశపూరితముగాను నుండును. భక్తిపరమైనది హృదయమును కడిగి శుద్ధము చేయును. క్లేశరూపమైనది శోకమును గలుగజేసి మలిన మొనర్చును. ఇది విషవృష్టికిన్ని, అమృతవృష్టికిన్ని గల తారతమ్యము గలిగి యుండును. ఒకటి జీవుని ముక్తునిగా జేయును. రెండవది యీ జీవాత్మకు శోకముతో గూడిన బంధమును గలుగజేసి దానిని దృశ్యము (సంసారము)లో బడ ద్రోయును.

ఇట్టి యాకర్మరహస్య మేదియనగా శ్రీకృష్ణభగవానునియొక్కయు, తన సంఘమగు యాదవ సముదాయముయొక్కయు అంత్యకాలగాథ యగును. ఏ పరమాత్మను స్మరించు వారియొక్క కర్మములన్నియు నశించి ముక్తులగు దురని ఋషులున్ను, యోగులున్ను, జ్ఞానులున్ను, భక్తులున్ను, వెయ్యేల వేదముగూడ వేయినోళ్ళతో గొనియాడుచుండునో అట్టి శ్రీకృష్ణభగవానులు గూడ కర్మమునకు బద్ధులయ్యే అంత్యకాలమును గడపిరి. యాదవకులము

క్షయించెను. పరమపామరుడగు బోయవానియొక్క తీక్ష్ణమగు శరనిహతిచే శ్రీభగవానుడు దేహమును విడువవలసి వచ్చెను. ఓహో! కర్మయొక్క మహిమ నేమని చెప్పవచ్చును? అట్టి శ్రీహరికిగూడ కర్మము తప్పినది గాదు గదా! ఇట్లుండగా సామాన్య జనులనుగూర్చి మరల జెప్పవలయునా? ఏ విధమైనను ఈ కథ భక్తులకు దుఃఖమును గలుగజేయకమానదు. శ్రీయుధిష్ఠిరార్జునులే దీనికి తార్కాణము. శ్రీమద్భాగవత ప్రథమస్కంధమున అర్జునుండు ద్వారక నుండి వచ్చి కృష్ణనిర్యాణంబు దెల్పు ఘట్టములోని దిది.

**ఖేదమున నింద్రసూనుడు**
**యాదవపురినుండి వచ్చి యగ్రజు గని త**
**త్పాదముల నయనసలిలో**
**త్పాదకుడై పడియె దీను భంగి నరేంద్రా।**

**పల్లటిలిన యుల్లముతో**
**దల్లడపడుచున్న పిన్నతమ్ముని గని వె**
**ల్వెల్లనగు మొగముతో జను**
**లెల్లను విన ధర్మపుత్రు డిట్లని పలికెన్.**

ఈ యతిపావన చరిత్రము భాగవతములోను, భారతములోను విస్తారముగా వ్రాయబడియున్నది. ఋషుల శాపము యాదవ సమూహముతో గూడిన సాంబుని వల్లను, గాంధారి శాపము పాండవ పక్షపాతియై ధార్తరాష్ట్ర కులమును నశింపజేయుటవల్లను గలిగెను. అనగా శ్రీకృష్ణ భగవానులకు రెండు శాపములు గలవు. ఒకటి ఋషులది, రెండవది గాంధారిది. ఈ రెండు శాపాగ్నులే యాదవ కులమంతరించుటకున్ను, శ్రీకృష్ణభగవానులు పాంచభౌతిక దేహమును విడుచుటకున్ను కారణమైనవి. ఓహో! ఈ కథ వలన నెంతో ధర్మరహస్యమును దెలిసికొనవచ్చును.

లోకగతి యిట్లుండగా మన శుష్కవేదాంతులు పాపకృత్యములను జేసి తమకు ధర్మముగాని, కర్మముగాని లేదని చెప్పునప్పుడు వివేకము గల వారి

నెవరికి ఆశ్చర్యము గలుగకుండును? నిప్పులోగాలనివస్తువు ఎండలో దగ్ధమగు నని చెప్పిన నెట్లుండును? సూర్యునిచే ప్రకాశింపబడని స్థలము మిణుగురు పురుగుచే ప్రకాశింపజేయబడుచున్నదని వచింప నెట్లుండును? సముద్రములో మునుగని వస్తువు నూతిలో మునిగెనని చెప్పిన నెట్లుండును? వజ్రాయుధ ముచే తెగని వస్తువు కత్తితో నఱకబడెనని చెప్పుమాట లెట్లుండును? వీరి యొక్క యాలాపములున్ను యాలాగుననే యుండును. జిజ్ఞాసువులారా! భక్తు లారా! ముముక్షువులారా! ఈలాటి కర్మరహస్యము లన్నియు దెలిసికొని నిర్మల జీవితమును గడుప చూడుడు.

మీరు బ్రహ్మజ్ఞానమును తెలిసికొనుటకు ప్రారంభించుటకు ముందుగా మీయొక్క జీవితమును (ఆచరణము)శుద్ధపరచుటకు జూడుడు. సత్యముగా విచారించిన మీ పవిత్రాచరణమే మిమ్ముల తరింపజేయును. మీ యోగముకాని, సాంఖ్యము, మంత్రము, ముద్ర మొదలైనవి యుద్ధరింప జాలవు. ఆత్మశుద్ధి లేకపోయినచో నవియన్నియు నూషర క్షేత్రములో జేసిన కృషివలె వ్యర్థము లగునని మరువకుడు. "శుభం బీజమివోషరే"అని మనువు వచించెను. యోగవాసిష్ఠమున జెప్పినది జూడుడు:- "స్వధర్మత్యాగినో యే తుతే వినాశానలేన్ధనమ్"। ఎవరు తమ యనుష్ఠానమును విడిచి వర్తించుచున్నారో వారు తమ వినాశమను నగ్ని జ్వాలకు కట్టెలగు చున్నారు. మఱియు ధర్మశాస్త్ర రహస్య మీలాగున్నది. "నాస్తి నాస్త్యేవ నాస్త్యేవ స్వధర్మత్యాగినాం గతిః"- తన యనుష్ఠానమును విడిచిన వానికి సద్గతి లేనేలేదు. లేనే లేదు. యాదవకుల వినాశమునకు ఋషుల శాపకారణము శ్రీమద్భాగవతమున ఏకాదశస్కంధ మున నిట్లు వర్ణింపబడి యున్నది. విశ్వామిత్ర వశిష్ఠనారదాది మహర్షులు శ్రీమ ద్ద్వారకాపురమునకు వచ్చి శ్రీకృష్ణభగవానుల దర్శించి యరుగుచు ద్వారకా నగరంబున కనతి దూరంబున నుండు పిండారకంబను నొక్క పుణ్యతీర్థం బున కరిగి రంత.

**దర్పించి యాదవులు తమ**
**నేర్పున గొమరారు సాంబు నెలతుక రూపం**

బేర్పడ శృంగారించియు
గర్పూరసుగంధిపోల్కి గావించి యొగిన్.

మూకలు గూడి యాదవులు ముందట బెట్టుక యార్చి నవ్వుచుం
బోకల బోవుచున్ ముని సమూహము కొయ్యన సాగి మ్రొక్కుచుం
బ్రాకటమైన యీసుదతి భారపు గర్భమునందు బుత్రుడో
యేకతమందు బాలికయొ యేర్పడ జెప్పుడటన్న నుగ్రులై.

యదుడింభకులను గనుగొని
మదయుతులై వచ్చిరనుచు మదిలో రోషం
బొదవ గనుగొనల నిప్పులు
సెదరగ హాస్యంబు సనునె చేయగ ననుచున్.

వాలాయము యదుకులని
ర్మూలకరంబైన యట్టి ముసలంబొక టీ
బాలిక కుదయించును బొం
డాలస్యము లేదటంచు నట బల్కుటయున్.

మదోద్రేకులైన యాదవబాలకులు మునిశాపభీతులై వడ వడ వడం కుచు సాంబకుక్షినిబద్ధచేల గ్రంథివిమోచనంబు సేయుసమయంబున ముసలంబొక్కటి భూతలపతితంబయిన విస్మయంబు నొంది దానింగొని చని దేవకీనందను సన్నిధానంబునం బెట్టి యెఱింగించిన నతండాత్మకల్పిత మాయారూపంబగుట యెఱింగియు నెఱుంగని తెఱంగున వారలం జూచి యిట్లనియె.

మది సెడి కన్నులు గానక
మదయుతులై మునుల గల్లమాటల జెనయం
గదిసి కులక్షయ కారణ
విదితంబగు శాపమొందు వెఱ్ఱులు గలరే.

** ** ** **

ఈ విషయము ఏకాదశస్కంధమున విస్తారముగా గనందగును.

అంత ... ... ... నీలాబరుం డొక్క త్రోవంబోయి యోగమార్గంబున ననంతుం గలసె. అప్పరమేశ్వరుండు మరియొక మార్గంబునంజని యొక్క నికుంజపుంజంబు చాటున విశ్రమించుటంజేసి చరణంబు వేఱొక చరణంబు మీద సంఘటించి యోగారూఢుడై వినోదంబుసలుపు సమయంబున నొక్కలుబ్ధకుండు మృగ యార్థంబుగా వచ్చి దిక్కులు నిక్కి నిరీక్షించుచుండ వృక్షంబు చాటున నప్పరమపురుషుని చరణకమలంబు హరికర్ణంబు (జింక చెవి)గాబోలునని దానిం గని శరంబు శరాసనంబునందు సంధానంబు సేసి యేసిన, నతండా హారవంబునం గదలుచుండ నప్పరమేశ్వరుని సన్నిధానంబు నకు వచ్చి జగన్నాథుంగా దెలిసి భయంబున మహాపరాధుండను, బాపచిత్తుం డను, గుటిలప్రచారుండనని యనేకవిధ దీనాలాపంబులం బలుకుచు బాష్ప జల ధారాసిక్త వదనుండైన సరోజనేత్రుండు వానిం గరుణించి యిట్లనియె. నీవేల జాలింబడెదువు. పూర్వజన్మకర్మంబులెంత వారికైనను నముభావ్యంబుల గుంగాన యూరక పోవనేరవు. నీవు నిమిత్తమాత్రుండ వింతియకాని యని వానికిం దెలిపె" ఓం శ్రీకృష్ణ

## గాంధారిశాపమునకు కారణము

(శ్రీమద్భారత స్త్రీపర్వము)

రణరంగములో నిహతులైన వారందఱి కగ్నిసంస్కారోదకక్రియలు చేయుట కొరకు ధృతరాష్ట్ర గాంధారీ ధర్మరాజులు పురోహితులు సయితము యుద్ధ భూమికి వెళ్ళి మృతులైన వారిని చూచుచు వారి యొక్కొక్కరి విశేషముల బొగడుచు దుర్యోధనుడు పడియుండు స్థలమునకు వెళ్ళగా గాంధారికి బట్టరాని దుఃఖమున్ను, కోపమున్ను గలిగి శ్రీకృష్ణుని శపించెను. స్త్రీయైన యీమెకు ఇట్టి మహాశక్తి పాతివ్రత్య మహిమచేతనే గలిగెను. దీనివలన పతివ్రతా మాహాత్మ్యమును తెలిసికొనవచ్చును. పతివ్రతా ధర్మమును చక్కగా నాచరించిన దానివలన మహత్తరమగు మహిమ గలుగునని యీ గాథవలన

దెలిసి కొనవచ్చును. ఈ పాతివ్రత్యమువలన గలిగిన మహిమ లనేకములు గలవు. ఈ భారతదేశము నందే తాపసోత్తముడగు కౌశిక బ్రాహ్మణుని యొక్కయు, గృహస్థయగు నారీమణియొక్క చరిత్ర చదివిన జాలును.

**"కురురాజా మొదలైన కొడుకుల నెల్ల గోల్పోవు టిప్పుడు గోవింద గలిగె**
**నరిగితి సంధి సేయగరాక యున్న నట యెప్డు నీ చెప్పుటైనదికాదె ?**
**పరమహితంబుగ బలికిరి గంగపట్టియు విదురుండు పాటించి పెక్కు**
**వెరవుల నొత్తిన వినవైతి నా వివేకుల చూపేల వృథవోవ నేర్చు ॥**

అనిపలికి పశ్చాత్తాపదుఃఖంబు పెల్లున నొల్లంబోయి తెలిసి చిత్తస్థాయి యైన పుత్రశోకంబడరి యలతిగాని యలతబెట్ట నూరకుండి యక్కౌరవరాజ పత్ని పద్మనాభు దెస గనుంగొని కోపోద్దీపితయై

**ధృతరాష్ట్ర పాండుభూపతుల కుమారులు**
**తమలోన నీసున సమరమునకు**
**దొడగిన నీవడ్డపడనైతి తగుచాలు**
**మానిసుల్ గలిగియు మాననీయ**
**వాక్యుండవయ్యును శక్యసమస్తకా**
**ర్యుండన బేర్కొనియును నుపేక్ష**
**చేసితి కురురాజు జెరుపన తిరిగితి**
**నిఖిల రాజుల దదనీకములను**
**నామమడిచి తెల్లభూములు బాడయ్యె**
**నంతవట్టు ఫలము ననుభవింపు**
**మేపడంగ నిన్ను శాపానలజ్వాల**
**దగ్ధమూర్తి జేయుదాన వినుము.**
**పూని పాతివ్రత్య పుణ్య ఫలంబున**
**సంపాదితంబైన సారతపము**
**బలిమి సాధనముగా బలికెద నుత్తమ**
**జ్ఞాతుల దమలోన సంగరమున**

**బొలియజేసితి గాన పొలియుదు రన్యోన్య**
**ఘాతకులై భవత్ జ్ఞాతిజనులు**
**నీవును దప్పక నేడాదిగా ముప్ప**
**దాఱగునేడైన యద్దినమున**

**నరయ దిక్కెవ్వరును లేని యగ్గలంపు**
**గుత్సితంపు దెఱంగున గూలువాడ**
**విట్లు మీవధూజనములు నేడ్చువారు**
**పతుల సుతులను బంధుల బనివి పనివి.**

**అని ఘోరంబుగ బలికిన**
**విని విపులమనస్కుడైన విష్ణుడు చిఱున**
**వ్వున నాననమొప్పగ న**
**వ్వనితకు నిట్లనియె గౌరవస్తుత్యముగన్.**

**మున్న కాదె యాదవులకు మునివరేణ్య**
**కలిత దారుణ శాపంబు గలదు నీకు**
**నేల చర్విత చర్వణమిట్లు సేయ**
**దీన నీవేమి త్రవ్వితి దానిజెపుమ?"**

నిర్మలాత్ములారా! యిట్టి భగవద్విషయమును దలంచియైన సన్మార్గ నిష్ఠలు గండు. పవిత్రమైన వర్తనమున్ను, నిర్మలమైన భక్తియున్ను, శుద్ధమైన కరుణయున్ను, స్వచ్ఛమైన శాంతియున్ను, నిశ్చలమైన సంయమమున్ను, దైవ సాక్షాత్కారమగు జ్ఞానమున్ను గలుగని వేదాంత వాక్యములు, ధర్మోపన్యాస ములు మొదలయినవన్నియు వ్యర్థములు. చిత్రములో గానుపించు పండ్లను జూచి యానందించిన ఎంత మాధుర్యమున్ను, తృప్తియున్ను, క్షుద్బాధ నివృత్తియున్ను గల్గునో అనుష్ఠానము లేనిదే గ్రంథములను మాత్రము జదివి చెప్పెడు వారి వాక్యములును ఆలాగుననే యుండునని యెల్లప్పుడు మరువ కుందురేని మీరు ధన్యాత్ములు గాగలరు. సంశయము లేదు.

కర్మరహస్యవిషయమై మఱియొక రహస్యమునుగూడ చెప్పెద. ఓహో! కర్మమహిమ నేమని చెప్పవచ్చును. ఇప్పుడు చెప్పబోవు గాథ యెట్టి వారినైన పరమాశ్చర్యములో ముంచివేయును. ఇది యత్యద్భుతమైనదేగాక కర్మ విషయమై యతినిగూఢసారమును గూడ తెలియజేయును. దీనియొక్క తత్త్వ మును చక్కగగ్రహించిన మఱల కర్మవిషయమై యెట్టివారికైనను సందేహము గలుగదు. ఈ కథ భారతముయొక్క యాదిపర్వమున విశదముగా గనంబడ గును. ఇది పరమమునీంద్రులున్ను, ఋషిసత్తములునగు మాండవ్యమహర్షు లను గురించినది. ఇట్టి ఋషిసత్తముని, యోగిపుంగవుని, బ్రహ్మనిష్ఠాగరిష్ఠుని గూడ కర్మము విడిచిపెట్టలేదే! ఇట్లుండగా నింద్రియపరవశులై యేలాటి మనో నిగ్రహములేని యీ వాచావేదాంతులనా కర్మమంటక యుండును!

మాండవ్యమహర్షికి గలిగిన కర్మవంటిదే ప్రారబ్ధమని తెలిసికొనవలెను. ప్రారబ్ధమనగా నప్రయత్నముగా వచ్చెడు సుఖదుఃఖములు, మానావమానము లని గ్రహించుకొనవలయును. అంతియకాని యాత్మశుద్ధిలేనివారలై తత్త్వ బోధము గలుగనివారలై, యింద్రియములకు మనస్సునకును నిర్మలత్వము లేని వారలై చెడుకార్యములో ప్రవేశించిన కలుగుచుండు దోషములన్నియు ప్రారబ్ధము గాదు. ఇది గురువాక్యములో విశ్వాసము లేకపోవుటచేతను, శాస్త్రానుసార మాచరించకపోవుటచేతను, ఈశ్వరునియందు భక్తి విశ్వాస ములు లేకపోవుటచేతను, అంతఃకరణములో గల పాపసంస్కారములు బ్రహ్మ నిష్ఠ చేతను, సద్గురుసేవచేతను, తపస్సుచేతను, పుణ్యకర్మానుష్ఠానముల చేతను (అనగా ఆచరింపమిచేత) నశింపకపోవుటచేతను తనకు గలిగెడు చిత్తదోషమేగాని మఱియొకటి గాదని తలంచి సత్యబుద్ధితో నమ్మువారు ధన్యాత్ము లగుదురు. మాండవ్య మహర్షికి వచ్చిన ఇట్టి ఘోరశిక్షకు కారణమా యన కేమియు దెలియదు. తపోవనములో నిర్జనప్రదేశమున కుటీరము నందు బ్రహ్మధ్యాననిష్ఠలో వీరుండగా రాజగృహములో చోరులు దొంగిలించి పారి పోయిరి. ఈ సంగతిని తెలిసికొని రాజభటులు వెంబడించి పట్టుకొనబోవగా నా చోరులు ఋష్యాశ్రమములో దూరి, ధనమంతయు దానియందు బడవైచి

రహస్యమార్గమున వెళ్ళిపోయిరి. రాజభటులు తస్కరులు కుటీరములో ప్రవేశించినది మాత్రమే చూచిరిగాని గుప్తమార్గముద్వారా యడవిలోనికి పారిపోయినది చూడరైరి. ఈ వ్రాసిన దానికిని భారతమున గలదానికిని చోరుల విషయమై కొంత భావభేదము గలదు.

## మాండవ్య మహర్షి చరిత్ర

(ఆదిపర్వము)

**"సకల జీవరాశి సుకృత దుష్కృత**
**ఫలమెఱిగి నడుపుచున్న యిట్టి ధర్మ**
**డొంద శూద్రయోనియందు మాండవ్యుచే**
**శప్తుడై యదేల సంభవించె?**

అని యడిగిన వానికి వైశంపాయనుడిట్లని చెప్పె :- మాండవ్యుడను బ్రహ్మర్షి దొల్లి మహీవలయంబునంగల తీర్థంబులెల్ల నేకచారియయి సేవించి, యొక్క నగరంబున కెడగలుగు నడవిలో నాశ్రమంబు గావించి తద్ద్వార వృక్ష మూలంబున నూర్ధ్వబాహుండయి మౌనవ్రతంబునం దపంబు చేయుచున్న నన్నగరంబు రాజు నర్థంబు ముచ్చిలికొన్న ముచ్చులారెకులచేత ననుధావ్యమానులై మాండవ్యు సమీపంబునంబారి యయ్యాశ్రమంబులో డాగిన, వారి వెనుదగిలి వచ్చిన యారెకు లమ్మునింగని రాజధనాపహారులయిన చోరులు నీయొద్దనపాఱి రెటవోయి రెఱుంగుదేవి చెప్పుమనిన నమ్ముని మౌనవ్రతుండు గావున బలుకకున్నం గినిసి, యయ్యాశ్రమంబులో జొచ్చి వెదకి ధనంబుతోడ నాముచ్చులం బట్టికొని,

**తాన చోరులకును దాపికాడై వేష**
**ధారి మిన్న కేని తపము సేయు**
**చున్న యట్లు పలుకకున్నాడనుచు నెగ్గు**
**లాడి యారెకులు నయంబు లేక.**

మాండవ్యు నా గ్రుచ్చులతోన కట్టుకొనివచ్చి రాజునకుం జూపి ధనం బొప్పించిన రాజు నా గ్రుచ్చులం జంపించి తపోవేషంబున నున్న గ్రుచ్చుని యమ్మాండవ్యుని బురంబు వెలి శూలప్రోతుం జేయించిన.

**మునివరు డట్లుండియు దన**
**మనమున నతిశాంతుడయి సమత్వమున దప**
**మ్మొనరించె ననశనుండ**
**య్యును బహుకాలంబు ప్రాణయుక్తుం డగుచున్.**

ఇట్లు శరీరదుఃఖంబు దలంపక తపంబు సేయుచున్న యమ్ముని తపంబు పేర్మికి మెచ్చి మహామునులు పక్షులయి రాత్రి వచ్చి మునీంద్రా! యిట్టి మహాతపస్వివైన నీకిట్టి దుఃఖంబు గావించిన వారెవ్వరని యడిగిన వారికి నమ్మాండవ్యుం డిట్లనియె.

**ఎఱిఁగి యెఱిఁగి నన్నడుగంగ నేల దీని**
**సుఖము దుఃఖంబు బ్రాప్తించుచోట నరుడు**
**దగిలి తన కర్మవశమున దనకు దాన**
**కర్త గా కన్యులకు నేమి కారణంబు?**

అని యమ్మహామునులతో మాండవ్యుండు పలికిన పలుకు లన్నగర రక్షకులు విని వచ్చి రాజున కెఱింగించిన రాజునుం బఱతెంచి శూలప్రోతుం డయియున్న మాండవ్యునకు నమస్కరించి నాచేసిన యజ్ఞానంబు సహించి నాకుంబ్రసాదించవలయునని శూలంబువలన నమ్మునిం బాచుచో నది పుచ్చ రాకున్న దాని మొదలు మెత్తన తునిమించిన దత్కంఠ పార్శ్వంబునందు శూల శేషంబంతర్గతంబై యుండె. దానంజేసి మాండవ్యుండు నాబరగుచు నమ్మహా ముని ఘోరతపంబు సేసి యెల్లలోకంబులు గమించి యొక్కనాడు యముని పురంబునకుం జని ధర్మరాజున కిట్లనియె.

**దండధర యిట్టి దారుణ**
**దండమునకు నేమి దుష్కృతము జేసితి ను**

**గ్రుండవయి తగని దండము**
**దండింపగ బ్రాహ్మణుండ దగునే నన్నున్.**

అనిన మాండవ్యునకు ధర్మరాజిట్లనియె

**పొలయక తూనిగలం గొ**
**ఱ్ఱుల బెట్టితి నీవు సిచిఱుత కాలము త**
**త్ఫలమిప్పు డనుభవించితి**
**తొలగునె హింసాపరులకు దుఃఖ ప్రాప్తుల్ ?"**

ఈ తత్త్వము తెలిసికొనిన ఇప్పుడు శుష్కవేదాంతులు చెప్పెడు ధర్మా ధర్మములు జనులకు బోధ గాగలవు. హింసించు వారెవరు, హింసపొందున దెద్ది అని చెప్పెడు మాటల సారము తెలిసికొనవచ్చును.

మఱియు కర్మయొక్క పరమరహస్యమును సంగ్రహముగా చెప్పెద.

ఓ ప్రియసాధకులారా, కర్మరహస్యముయొక్క కీలకమును నిప్పుడు చెప్పుచున్నాను. ఇచ్చట జాగ్రతపడుడు. లేనిచో, పాడు కర్మకూపములోనికి దిగి పోగలరు. వేదాంత శాస్త్రములన్నియు నీ రహస్యమునే చెప్పుచున్నవి. వీటికి మాత్రమే యింతశక్తి గల్గియున్నది. తక్కిన యే శాస్త్రములకును ఇంత దివ్య మహిమ గల్గియుండలేదు. ఇది యొకటి మాత్రము జీవుని జననమరణదుఃఖ సాగరమునుండి దరి జేర్చుచున్నది. కనుకనే దీనికి వేదముయొక్క అంత్య సందేశమగు వేదాంతమను పేరు వచ్చినది. అందువల్లనే శ్రుతిశిరస్సని దివ్య నామధేయము దీనికి గల్గియున్నది. ఇప్పుడు జాగ్రత గల్గియుండుడు. ఇది సంధికాలము, మీరు దేహేంద్రియములకు సాక్షిచైతన్యస్వరూపులు. కర్మల న్నిటికిని విలక్షణ జ్ఞానస్వరూపులు, మీరు కర్మలను ఏకాలమునను చేసిన వారు కారు. అది బుద్ధియొక్క భ్రమమాత్రమే. మీరు నిష్కర్ములు. పుట్టు గిట్టుటలు మికు లేవు. సదా చిన్మయజ్ఞానజ్యోతిస్వరూపులు.

ఇచ్చట మీరు బుద్ధ్యాది దేహేంద్రియములలోనికి జారిపోయిన నరక

కూపమున బడగలరు. ఇచ్చోట మెరక రోడ్డుపైకి నెక్కించు భారముతో గూడిన బండి జారుచున్నప్పు డేలాగున యెద్దులను మరింత పురికొల్పి తోలుచు, వెనుక భాగమున జనులచే నెట్టించుచుందురో, ఆలాగుననే మీరును స్వరూపములోనికి నెక్కుచుండవలయును. లేనిచో క్రిందికి జారిపోయిన బండి రీతిగా దేహభావమగు లోయలోనికి దిగి పోగలరు. ఇచ్చట మీరు క్రిందికి జారుచుండు మోటారుకార్లకు బ్రేక్ వేసి మరింత బలముతో యంత్రములను నడుపునట్లు దేహభావమునుండి దైవభావములోనికి తిన్నగా, ప్రాకుచుండ వలయును. ఇచ్చట మీరు సముద్రప్రవాహవేగములోనికి లాగుచున్న పడవలను నావికులు తెడ్లచేతను, కర్రలచేతను, అందరును చేరి నడుపునట్లు బ్రహ్మభావము లోనికి చేరవలయును. లేనిచో సముద్రములో పడిపోయిన పడవచందమున భవసాగరమున పడిపోయెదరు.

అదిగో మీరు ఆజ్ఞేయచక్రమువరకు వచ్చితిరి. ఇక ఒక మెట్టు మాత్రమే గలదు. బ్రహ్మరంధ్రములోనికి ప్రవేశింపుడు. ఇచ్చట మీరు స్కాంత పర్వతముచే నాకర్షింపబడుచుండు నావను నావికులు మామూలు యంత్రములు గాక మరింత శక్తిగల యింజనుల సహాయముతో నేలాగున తీవ్రముగా నడిపి ఆకర్షణనుండి తప్పించుకొనుచుందురో ఆలాగున కర్మల ఆకర్షణ నుండి ప్రయత్న పూర్వకముగా తప్పించుకొనవలయును. చిరకాల సంస్కారమగు దేహభావము మిమ్ములను కర్మలోనికి లాగుచున్నది. ఆకర్షణకు లోబడిన పొగయోడ యైనచో నేలాగున తుక్కుతుక్కులై పోవునో, ఆలాగున కర్మ భావములోనికి నాకర్షింపబడినచో మీరు దుఃఖములో పడి పోవుదురు. ఇచ్చట మీరు సైన్యములను యశఃపూరిత శౌర్యాదులచే పురి కొల్పెడు సేనాధిపతివలె బుద్ధ్యాదులను పురిగొల్పవలయును. లేనిచో శత్రువు లచే సైన్యము హతమగునట్లు క్షయము నొందగలరు. ఇచ్చట దీనత్వము పనికి రాదు. ధీరత్వమే కావలెను.

మీరార్యులు. ఋషిసంతతిలో చేరిన వారలు. మీరు జన్మించినది అనేక పుణ్య పురుషులుదయించిన భరత క్షేత్రములో. మీరక్తమంతయు

వేదాధ్యయన తపస్సంపన్నులగు పరమర్షులది యని గ్రహించవలయును. మీ దేహ మందొక్కటైనను అశుద్ధమైనది లేదు. ఒక రోమమైన నపవిత్రమైనది లేదు. అంతయు పవిత్రమైనదే. మీ ఉచ్ఛ్వాస నిశ్వాసములు కొలిమితిత్తిలో గల వట్టిగాలి వంటివిగావు. అది సోఽహం సోఽహమను పరమపావనమగు జీవేశ్వరుల యేకత్వమును బోధించు అజపాగాయత్రి దివ్యమంత్రమని మీ రెరుగవలెను.

దీనిని భరతఖండఋషులుమాత్రమే భూలోకములో నేటి వఱకుప దేశించిన వారు. మీరు బ్రహ్మనిష్ఠులగు మహాపురుషుల శిష్యులు. ఇచ్చట దీన త్వము గలిగినచో సైన్యములు శూరులగు నాయకులను స్మరించునట్లు మీ వంశమును, మీ గురువులను, మీ గోత్రమును మీ యీశ్వరభావమును జ్ఞప్తిలోనికి తీసుకరావలెను. దైన్యము నొందిన సేవలను నెపోలియన్ ఏలాగున ధైర్యవంతముల చేసెనో, లోకము నేలాగున జయించెనో, ఆలాటి కథలను మీరు జ్ఞాపకములోనికి తీసికొనిరావలెను. తురుష్క పటాలముపై శివాజి యేలాగున మహారాష్ట్రసేనల నడిపెనో, ఆలాటి బోధము మీకు గల్గియుండ వలయును. గురుగోవిందసింగు ఏలాగున సిక్కులను పఠానులపై కలయ చేసెనో, అట్టి ధీరత్వమును మీరు ఇంద్రియములపై గలుగజేసికొనవల యును. ఇది సంధికాలము. మరల నిట్టి కాలము దొరకదు.

ఈ కర్మభావమునుండి పైకెక్కనిచో నిప్పులో పడిపోయిన మిడుతల చందమున మీరు నిక్కముగా కర్మాగ్నిలో కాలగలరు. ఈ కర్మసుడుల నుండి మీరుత్తీర్ణులు గానిచో, సుడిలో పడిన నావచందమున దుఃఖ సాగర ములో మునుగగలరు. ఈ కర్మకీలకము తెలియకపోయినచో, సంసార చక్రములో చిక్కుకొని నలుగగలరు. ఈ కర్మముయొక్క మర్మ మనుభవము లోనికి రాకపోయిన నీటిలో పడిపోయిన నిప్పువలె మీరు నశింపగలరు. ఈ కర్మముయొక్క మర్మమును మీరెఱుంగక పోయినచో, జలములో పడి పోయిన లవణము లాగున మాయలో లయించగలరు. ఈ కర్మతంత్రము

మీారెరుంగనిచో, బోనులో పడిపోయిన సింహము మాడ్కి హతులగుదురు. ఈ కర్మ జాలమును తెలిసికొనకపోయిన వలలోచిక్కుకొనిన చేపలవలె మీారు క్షయము నొందగలరు. ఈ కర్మమహిమను మీారు గ్రహించుకొనజాలక పోయిన వలలో చిక్కుకొనిన పక్షులవలె హింసింపబడగలరు. ఈ కర్మకీలక మును మీారు గ్రహింపజాలక పోయినచో కారుచిచ్చులో పడిపోయిన పురుగులవలె సంసారదారుణాగ్నిలో మడియగలరు. ఈ మాయారహస్య కర్మలను మీారవగాహనము చేసికొనకపోయిన అగ్నిలో పడిపోయిన శుష్కతృణముల రీతి మాయామోహాగ్నిలో దహించి పోగలరు. కావున మీాయొక్క జీవభావ మును తొలగించి యీశ్వర భావములోనికి త్వరలో ప్రవేశించవలెను.

ఇచ్చట మీారు జాగరూకత జెందనిచో బురదలో దిగిపోయిన గజముల చందమున సంసార పంకములో గూలగలరు. ఇచ్చట మీారు వ్రతనిష్ఠ గలవారై యుండనిచో ఏడంతస్థులుగా గట్టిన మహలు పునాది క్రుంగిన కూలునట్లు తపోధ్యాన యోగాదులలో నున్నతస్థితిని బొందినను పతితులు గాగలరు. ఇచ్చట మీారు దృఢభావన చేయకపోయినచో, తైలము నశించిన యంత్రము వలె నిలిచిపోగలరు. ఇచ్చట మీారు బ్రహ్మదృష్టినుండి మరలినచో గ్యాసు నశించిన లైటు ఆరిపోవుటేగాక చీకటిచే క్రమ్మబడునట్లు స్వబోధజ్ఞానము నశించుటేగాక తమస్సుచే ఆవరింపబడగలరు.

ఇచ్చట మీా మనస్సు కర్మభావములోనికి దిగుచుండిన బ్రహ్మభావము లోనికి ప్రవేశించేలాగున చేయవలయును. అదిగో యెక్కినది, ఇక కొంచెము మాత్రమే. ఒక బారెడు స్థలమే యెక్కినది. అదిగో యెక్కినది. సమస్తమగు సమరసజ్ఞానములోనికి నెక్కినది. అధికభారము గల యెద్దులబండ్లు అపాయములలోనికి దిగిపోవునప్పుడు క్రిందికి జారకుండ చక్రముల కడ్డుకట్టి జనులసహాయముచేతను, ఎద్దుల సహాయముచేత నేలాగున పైకి ఎక్కిం తురో, యేలాగున మనోధైర్యము గల్గుటకు జయవాక్యములు చెప్పుచుందురో, ఆలాగుననే ప్రయత్నపరులై యుండుడు. బ్రహ్మరంధ్రమువరకు వచ్చినది. సహస్రారములోనికి ప్రవేశించినది, పట్టుడు, పట్టుడు, బుద్ధ్యాది రూపములైన

యెద్దులను త్రోలుడు, ఇక మూరెడు దూరమే గలదు. సమభూమిలోనికి ప్రవేశింపచేసినట్లు బుద్ధి నెక్కించుడు. కర్మను త్రోయుడు. ప్రకృతిని తొలగించుకొనుడు. బ్రహ్మభావములో నిలకడ గలిగేలాగున చేసికొనుడు. జీవేశ్వరుల యేకభావమే సమమైన భూస్థలము. ఓహో! హాయి గల్గినది. ఆహా! శ్రమలన్నియు నశించినవి. ఎచ్చట జూచినను ఆనందమయమే. శివమే, దైవమే, నిష్క్రియత్వమే, నిష్కర్మత్వమే, నిర్మలమే, శుద్ధమే, అమృతమే, ఈశ్వరమయమే!

ఇక నీవిషయమై అపరోక్షానుభూతిలో శ్రీశంకరభగవత్పాదులు తెలిపిన సంగతిని తెలిసికొనిన మనకు సందేహము గలుగదు.

**ఆత్మానం సతతం జానన్ కాలం నయ మహామతే ।**
**ప్రారబ్ధమఖిలం భుంజన్ నోద్వేగం కర్తుమర్హసి ॥**

ఓ మహామతీ! నీవు ఆత్మను నిరంతరమును దెలిసికొనుచు, (అనుభవములో నుంచుకొని) కాలమును గడుపుచుందువుగాక! అనంతరము ప్రారబ్ధమంతయు ననుభవించువాడవై చిత్త క్షోభమును పొందకుండుము.

మహామతి యనెడు విశేషణమువలన జ్ఞానము నొందుటకు తగిన సాధన సంపత్తి గలవాడని భావము. అనగా, కామాది కర్మలను జయించిన వాడని తాత్పర్యము.

**ఉత్పన్నేఽప్యాత్మవిజ్ఞానే ప్రారబ్ధం నైవ ముఞ్చతి ।**
**ఇతి యచ్ఛ్రూయతే శాస్త్రే తన్నిరాక్రియతేఽధునా ॥**

ఆత్మజ్ఞానము గల్గినను, ప్రారబ్ధము విడుచుట లేదని శాస్త్రములందెయ్యది వినబడుచున్నదో, అది యిప్పుడు నిరాకరింపబడుచున్నది.

**తత్త్వజ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే ।**
**దేహాదీనామసత్త్వాత్తు యథా స్వప్నో విబోధతః ॥**

మేలుకొనిన తర్వాత కలలో గన్నది లేనియట్లు తత్త్వజ్ఞానోదయమైన

తరువాత దేహాదు లసత్తగుట వలన ప్రారబ్ధము లేదు.

ప్రజ్వలించుచుండు అగ్నిలోగల సమస్త వస్తువులున్ను అగ్ని మయమై కన్పించునట్లు జ్ఞానాగ్ని ప్రజ్వలించు దశలో చిన్మయాకార భావము దప్ప మరి యేమియు గనుపింపదు.

**కర్మ జన్మాంతరీయం యత్ప్రారబ్ధమితి కీర్తితమ్ ।**
**తత్తు జన్మాంతరాభావాత్ పుంసో నైవాస్తి కర్హిచిత్ ॥**

జన్మాంతరకర్మ మెయ్యదియో అది ప్రారబ్ధ మన బడును. ఆత్మకు జన్మాంతరము లేనందున అది కొంచెమైనను లేదు.

కర్తృత్వ ముండువరకే కర్మ గలదని భావము గల్గును. అది బుద్ధి వృత్తియే గాని శుద్ధమై యవినాశియగు నాత్మకు లేదు.

**ఉపాదానం ప్రపంచస్య మృద్భాండస్యేవ కథ్యతే ।**
**అజ్ఞానం చైవ వేదాంతై స్తస్మిన్నష్టే క్వ విశ్వతా ॥**

భాండమునకు మృత్తికవలె ప్రపంచమునకు అజ్ఞానము ఉపాదానమని వేదాంతులచేత చెప్పబడుచున్నది. అజ్ఞానమే నశించిన యెడల ప్రపంచత్వ మెక్కడిది? (అనగా లేదని భావము)

"యతోవా ఇమాని భూతాని జాయంతే"- దేని నుండి యీ జగత్తు గల్గి నదో - అనెడి శ్రుతి ప్రమాణము ననుసరించి బ్రహ్మమే ఉపాదానమని తాత్పర్యము.

**యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వై భ్రమాత్ ।**
**తద్వత్సత్యమవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః ॥**

రజ్జువును విడచి భ్రమచేత సర్పమును గ్రహించునట్లు మూఢబుద్ధి గలవాడు సత్యస్వరూపమగు బ్రహ్మము నెఱుంగనేరక జగత్తును జూచు చున్నాడు.

**రజ్జురూపే పరిజ్ఞాతే సర్పఖండం న తిష్ఠతి ।**
**అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపంచః శూన్యతాం గతః ॥**

త్రాటియొక్క (వాస్తవ) స్వరూపమును జూచినప్పుడు సర్పము లేదు. అట్లే అధిష్ఠానమగు బ్రహ్మమును తెలిసికొన్నప్పుడు జగత్తు గూడ బ్రహ్మమున కన్యముగా గనుపించదు.

**దేహస్యాపి ప్రపంచత్వాత్ ప్రారబ్ధావస్థితిః కుతః ।**
**అజ్ఞానిజనబోధార్థం ప్రారబ్ధం వక్తి వై శ్రుతిః ॥**

శరీరముగూడ ప్రపంచమగుట వలన ప్రారబ్ధస్థితి యెక్కడిది? అజ్ఞానులకు బోధించుట కొఱకు ప్రారబ్ధమును శ్రుతి జెప్పుచున్నది.

**క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ।**
**బహుత్వం తన్నిషేధార్థం శ్రుత్యా గీతం చ యత్ స్ఫుటమ్ ॥**

ఆ పరావరమును తెలిసికొనిన పిదప నీ మనుష్యుని యొక్క కర్మములు నశించుచున్నవని శ్రుతిచేత స్పష్టముగా చెప్పబడిన కర్మ బహుత్వ మెద్దియో, యది దానిని (పారబ్ధమును) నిషేధించు నిమిత్తమే యగును.

**భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యన్తే సర్వసంశయాః ।**
**క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥**

ఆ పరావరమును (ప్రత్యగభిన్న పరబ్రహ్మమును) తెలిసికొనినంతనే హృదయగ్రంథులు వీడిపోవుచున్నవి. సకల సంశయములున్ను నివృత్తియగుచున్నవి. వీని కర్మములున్ను క్షయించుచున్నవి అనిశ్రుతి.

శ్రీ భగవద్వాక్యమును ఆలాగుననే యున్నది, - గీత.

**యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున ।**
**జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥**

ఓ యర్జునా! లెస్సగా మండుచున్న యగ్నిహోత్రుడు నవవిధ

సమిధలను, నవధాన్యములను హవిస్సు మొదలగు నన్నిటిని సంపూర్ణముగా నేలాగున భస్మము చేయునో, ఆలాగున జ్ఞానమనెడి యగ్ని సమస్త కర్మలను సంపూర్ణముగా భస్మము చేయును. "సర్వకర్మాణి"యని భగవంతుడు ప్రయోగించుటచే సంచితాగామి ప్రారబ్ధకర్మ లేమియు మిగిలియుండవని చక్కగా గ్రహించవలెను.

**యే హి వృత్తిం విజానన్తి జ్ఞాత్వా సంవర్ధయన్తి యే ।**
**తే వై సత్పురుషా ధన్యా వన్ద్యాస్తే భువనత్రయే ॥**

ఎవ్వరు ఈ వృత్తిని (బ్రహ్మవృత్తిని) తెలియుచున్నారో, ఎవరు ఈ వృత్తిని తెలిసికొని వృద్ధిచేయుచున్నారో వారే సత్పురుషులు. త్రిలోకముల యందు పూజింపబడువారు.

"సంవర్ధయన్తి యే" అని యుపదేశించుటచే బ్రహ్మజ్ఞానమును లోకములో వృద్ధిపరచుట మహాపురుషుల ధర్మమని యొక అర్థము లేక తనలో బ్రహ్మజ్ఞానము వర్ధిల్లే లాగున చేయవలెనని రెండవ అర్థముగూడ గలదు. "వంద్యాస్తే భువనత్రయే" వారు మూడు లోకములో పూజింపబడువారగుదురు అని యుపదేశించుటచే బ్రహ్మవిద్యను వృద్ధిపరచుట భూలోకవాసులకును, స్వర్గలోక నివాసులకును, బ్రహ్మలోక వాసులకును మహాప్రీతి కరమైన కార్యమని తెలిసికొనవలయును.

**యేషాం వృత్తిః సమా వృద్ధా పరిపక్వా చ సా పునః ।**
**తే వై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే బ్రహ్మవాదినః ॥**

ఎవరి వృత్తి బ్రహ్మాకార సమానావస్థను పొందినదిగాను, వృద్ధి పొందినదిగా నున్నదో వారే సత్తయైన బ్రహ్మమును బొందిన వారు. వాచా వేదాంతులైన ఇతరులు పొందినవారు కారు. లేక శాస్త్రము మాత్రము పఠించి ఆచరణ లేని వారు పొందినవారు కారు.

**భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా ।**
**పుమాంస్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥**

నిశ్చయబుద్ధి గలవానిచేత నేవస్తువు తీవ్రవేగముచేత రేయింబవళ్ళు భావింపబడుచున్నదో ఆజ్ఞేయవస్తువుగా అపరోక్షముగా తెలియదగిన బ్రహ్మముగా నట్టివాడు భ్రమరకీటము వలె అగుచున్నాడు.

**అనేనైవ ప్రకారేణ వృత్తిర్బ్రహ్మాత్మికా భవేత్ ।**
**ఉదేతి శుద్ధచిత్తానాం వృత్తిజ్ఞానం తతః పరమ్ ॥**

ఈ ప్రకారముచేత (ఆత్మానుసంధానముచేత) వృత్తి బ్రహ్మస్వరూపమగుచున్నది. అనంతరము శుద్ధ చిత్తము గలవారలకు బ్రహ్మాకారవృత్తి జ్ఞానము గల్గుచున్నది.

పుణ్యాత్ములారా! సాధువులై, బ్రహ్మనిష్ఠులై, జ్ఞానులై యుండు వారికి సత్య ధర్మ దయాదులు, జ్ఞాన వైరాగ్యాది దైవగుణములు లేనిచో ప్రపంచములో నేలాగున మంచి స్థితిలో నుండగల్గుదురు? ఇట్టి పురుషులకు సత్య ధర్మజ్ఞాన నిష్ఠలు లేనిచో ప్రపంచమే కూలిపోవును గదా!

ఎప్పుడు బ్రహ్మనిష్ఠులకు సత్య జ్ఞాన నిష్ఠాదులు లేక పోవునో, అప్పుడు మొదలు చెడిన వృక్షము శిథిలమగునట్లు లోకము క్షయము నొందును. ఎప్పుడు బ్రహ్మనిష్ఠులకు సత్య ధర్మనిష్ఠలు చెడునో, అప్పుడు సముద్రమునకు కట్టిన వంతెన పడిపోయినట్లు, దైవలోకమును పొందవలసిన సేతువు తెగిపోవును. ఎప్పుడు బ్రహ్మనిష్ఠులకు సత్య ధర్మ నిష్ఠలు లేకపోవునో, అప్పుడు చుక్కాను ఊడిపోయిన పొగయోడ చందమున లోకము దైవసన్నిధిలో చేరక దుఃఖసాగరములో మునుగును. ఎప్పుడు జ్ఞాన నిష్ఠులకు సత్య ధర్మ నిష్ఠలు తగ్గిపోవునో అప్పుడు సౌధమునకు కట్టిన సోపానము విరిగి పడిపోవునట్లు లోకముయొక్క ముక్తి యను సుఖ సౌధమును లోకము ఎక్కజాలక క్రిందికి జారిపడిపోవును.

లోకముయొక్క సత్తంతయు బ్రహ్మనిష్ఠుల హృదయములో నిలకడ గల్గియుండును. వీరల యందది యెప్పుడు క్షీణించునో యప్పుడు తైలము నశించిన యంత్ర గమనమువలె లోకముయొక్క ఉన్నత గమనమాగి పోవును.

ఎప్పుడు సాధువుల హృదయములో దయాధర్మములు లేకపోవునో, అప్పుడు వర్షములులేని దేశమువలె లోకము తపించును. ఇట్టి మహిమాతిశయము లన్నియు సాధువులలో, బ్రహ్మనిష్ఠులలో, సన్న్యాసులలో, జ్ఞానమార్గ ప్రవర్తకు లలో నుండినందుచే, పూర్వకాలమున సర్వజనులున్ను, రాజాధిరాజులున్ను, సార్వభౌములున్ను అట్టి పుణ్యాత్ములను శరణుపొందియుండిరి. వారియొక్క వచనముకొఱకు వేచియుండిరి. అప్పుడు సార్వభౌములు, రాజులు, ప్రజలంద రును వారిపై తమ ప్రాణమును నిలుపుకొనియుండిరి. ఎప్పుడు బ్రహ్మనిష్ఠుల కట్టి యున్నతగుణములు లేకపోయెనో, అప్పుడు దొంతులుగా నమర్చి యుండు మట్టి పాత్రలయొక్క అడుగుపాత్రము పగిలిపోయిన తక్కిన వన్నియు క్రిందపడి తుక్కులై పోవునట్లు ప్రపంచమంత యునప్పుడే ధ్వంసమై పోయెను.

పునాది తగ్గిన యేడంతస్థులు గల హర్మ్యమేలాగున పడిపోవునో, అట్లే తపోనిష్ఠుల యోగనిష్ఠుల శక్తి యెప్పుడు తగ్గిపోయెనో అప్పుడు లోకమంతయు పతితమైపోయెను. కాన బ్రహ్మనిష్ఠులు వృద్ధియై, జ్ఞానమావిర్భవించి తపోధ్యాన, జ్ఞానయోగ నిష్ఠాదులు వృద్ధి నొందునప్పుడు మాత్రమే యీ లోక ముద్ధరింప బడును. అట్టి బ్రహ్మనిష్ఠులకు మనమాధిక్య మివ్వవలెను. వారి యాత్మశక్తి చేతనే లోకము చైతన్యవంతము గావలసి యున్నది. అట్టి తదేక ధ్యాననిష్ఠులు ప్రపంచములో నేకార్యమును చేయనక్కర లేదు.

ఇప్పుడు బహిర్దృష్టి గలవారు బ్రహ్మనిష్ఠయొక్క సారము నెరుగని వారు బ్రహ్మనిష్ఠుల గుఱించి చులకనగా పలుకుదురు. వారి యభిప్రాయమేమన? వీరు లోకసేవ చేయుట లేదే? పరోపకార మొనర్చుట లేదే? విద్యాప్రచారము గావించుట లేదే? జనుల యారోగ్యము కొరకు ఔషధముల నిచ్చుట లేదే? భోజనసామగ్రి సమకూర్చి బీదలకు పెట్టుట లేదే? ఏ కష్టమైన పనియు జేయక యితరుల యాహారముపై నాధార పడి జీవించుచున్నారే? అని చెప్పుదురు. అయితే వీరు చెప్పు వాక్యములలో బొత్తిగా సత్యము లేదని యెవరును చెప్పజాలరు. వీరు చెప్పేలాగున నుండువారుగూడ ప్రపంచములో చాలమంది

గలరు. కాని అందరు నాలాగే యున్నారని తలంచుట చాల పొరబాటు: యంత్రాలయములో గల చక్రము లన్నియు, మిషనులన్నియు పని చేయు చున్నను, దానియొక్క మూలస్థాన మగు ష్టీము (శక్తి) ఎచ్చట నేర్పడుచుం డునో, ఆ స్థలము నిశ్చలముగానే యుండును. అయితే అట్టి మహాపురుషులు ప్రపంచములో ప్రస్తుతమరుదుగనున్నారు. కనుకనే యిట్టి వాక్కులు బైలుదేరి నవి. నిజముగా విచారించిన ఋషులందరు యోగులందరు వీరు చెప్పేలాగువ లోకసేవ లోకోపకారము చేసికొని తిరిగెడి వారుకారు.

అయితే వారి జీవితమంతయు లోకసేవకొరకే వినియోగపరిచిరి. వారి యాత్మశక్తిచేతనే అప్పుడు లోకము చైతన్యము గలదై యుండెను. వారి యాజ్ఞకు బద్ధులయ్యే ప్రభువులున్ను, ప్రజలున్ను వర్తించుచుండిరి. లోకోద్ధారక మహాపురుషు లందరును సాధుమూర్తులే. శ్రీక్రీస్తు, మహమ్మదు, శ్రీబుద్ధ, శ్రీశంకరాచార్య, శ్రీగురునానక్ మొదలైన మహాపురుషులు గదా! లోకోద్ధారకు లైరి! అట్టి పని ప్రపంచములో మరియెవరు చేయగలరు? ఏ సంఘములో, యే మతములో, యే దేశములో బ్రహ్మనిష్ఠుల కాధిక్యము గలుగ చేయబడదో ఆ సంఘము, ఆ మతము, ఆ దేశ మచిరకాలముననే ప్రాణము లేని శవము వంటిదగును. దీనివల్ల బ్రహ్మనిష్ఠులకు లోకసేవా పరోపకార విద్యా ప్రదానాదు లవసరము లేదనిగాని, అది వారియొక్క పని కాదనిగాని తలంపరాదు. కాని యివి యన్నియు సామాన్యజనులు జేయగలరు. ఈశ్వరసాక్షాత్కార పర్యం తము బ్రహ్మనిష్ఠలోనుండి జ్ఞానప్రవాహమును ప్రపంచములోనికి ప్రవ హింపచేయుట కందరికిని తరము గాదు. అది చాలసుకృతజీవులకు మాత్రమే సాధ్యమగును. అయితే యీ సంఘములో సోమరులకు చోటివ్వనీయక తత్త్వ ప్రవర్తకులు జాగరూకులై యుండవలయును.

అట్లు గావందుచేతనే యిప్పుడు లోకము జడావస్థ నొందినది. శ్రీభగ వాన్ రామకృష్ణ పరమహంసలు చేసిన లోకసేవను ఈ దినము కోట్ల కొలది జనులు చేయగలరా? ఆయన యే లోకసేవ చేసెనో అట్టిసేవ చేయువారే మన కిపుడు కావలసినది. వీరికి విద్యతోగాని, జాతితోగాని, వయస్సుతోగాని, ఆశ్ర

మముతోగాని గల సంబంధమేమియు నక్కరలేదు. నిర్విషయనిష్ఠలో నిరంతర ముండిన చాలును. అట్టివారు ప్రస్తుతము ఏ లోకోపకారము చేయకపోయినను వారి నిష్ఠ పరిపక్వావస్థకు వచ్చునప్పుడు వారి దేహములో నెన్ని రోమములు గలవో యంతమంది యప్పుడు లోకోపకారము చేయగలరు. అయితే యిప్పుడు సాధువులును, సన్న్యాసులును, బ్రాహ్మణులలో కొందరును, పూర్వ కాలము రాజుల సహాయముండుటచే వీరికనుకూల ముండెననియు, నిప్పుడా లాగున ప్రభువుల సహాయము లేనందున బ్రహ్మవిద్య వృద్ధికి రాజాలకున్న దనియు చెప్పుదురు.

ఇది కొంతవరకు సత్యమైనను పూర్ణముగా నిజమని నమ్మందగదు. ఏలన? బ్రహ్మనిష్ఠ, యోగము, తపస్సు, ఆత్మజ్ఞానము మొదలగునవి త్యాగ ముచే గల్గునవియే గాని భోగముచే గల్గునవి కావు. త్యాగమునకు రాజుల యొక్కయు, ధనవంతులయొక్కయు సహాయమెందుకో! యూహింప జాలరు. ఈలాటి మాటలన్నియు సోమరిదేవత నుపాసించువారివేగాని సోఽ హం పరమగు పరమదైవము నుపాసించువారివి గావు. వారికి కావలసినదేమి? ఏకాంత ప్రదేశము, స్వల్పమైన భిక్షాహారము. దానికి మనభరత ఖండములో ఆర్యసంతతి గల్గి యుండు వఱకును కొరత గలుగదు. ఇప్పటికిని మన దేశములో దాతలు లేకపోలేదు. దానార్హులు మాత్రము తగ్గిపోయిరి. అనగా ఇచ్చేవారున్నారు. పుచ్చుకొనువారరుదైరి. పాత్రులు తగ్గియపాత్రులు మెండైరి. దానము పుచ్చుకొనునప్పుడు ఎవరి నేత్రముల నుండి ధారధారగా నీరు కారునో వారే సత్పాత్రులు. ఈ ధనము నెట్లు వినియోగపరచిన దాతలును తామును తరింపగలరో యని యెవరికి భయము గలుగునో, దుఃఖము నొందుదురో వారే పాత్రులు. మరియు నెవరైననిప్పుడుగూడ బ్రహ్మనిష్ఠ చేయుచుండినచో వారి నాదరించుటకు కోట్లకొలది జనులు గనిపెట్టుకొని యున్నారు. వారికేలాటి కొరతయు గలుగదు.

రాజ్యము పాలించు ప్రభువు ఒకవేళ సహాయము చేయకపోయినను మన పుణ్యక్షేత్రమగు భారతదేశములో ఎందరో రాజులును, శ్రీమంతులును

గల్గియున్నారుగదా? కనుక విరక్తి నవలంబించి బ్రహ్మనిష్ఠ చేయజాలక, యీలాటి మాటలనుజెప్పి తప్పించుకొన జూచుచున్నారు. అంతే వీరి వాక్యములో గల సత్యము గాని మరియొకటి గాదు. పూర్వకాలమునగూడ బ్రహ్మనిష్ఠులకు మాత్రమే ప్రభువులు సహాయము చేయుచుండిరిగాని, ప్రకృతి నిష్ఠులకు నెవరును సహాయమొనర్చి యుండలేదు.

అట్టి బ్రహ్మనిష్ఠులకు నేటికిన్ని కొరత గలుగదు. అయితే లోకసహాయ మెక్కువ లేనందుచే వారనుకొనేలాగున విశేషముగా విస్తారముగా వారి ధర్మ మును ప్రచారము చేయక యుండవచ్చునేగాని మరియేమియు కొరత లేదు. ఈశ్వరుడు వారిని సదా కనిపెట్టి రక్షించుచుండును.

**విపరీతార్థ ధీర్యావన్న నిశ్శేషం నివర్తతే ।**
**స్వరూపస్ఫురణం యావన్న ప్రసిద్ధ్యత్యనర్గళమ్ ।**
**తావత్సమాధిషట్కేన నయేత్కాలం నిరంతరమ్ ॥**

బ్రహ్మనిష్ఠ చేయువారి బుద్ధియొక్క విపరీతభావము నిశ్శేషముగా నెంతవరకు నివృత్తి కాలేదో, స్వరూప జ్ఞానమెంతవరకు స్పష్టముగా ప్రకాశింప లేదో, యెంతవరకు జ్ఞానమనర్గళముగా ప్రవహింపలేదో, అంతవరకు కాలము నిరంతరము ధారణాధ్యాన సమాధులగు షడంగములతో గడుపవలెను.

**వేదాస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ ।**
**నైవాజితేంద్రియస్యేహ సిద్ధిం గచ్ఛన్తి కర్హిచిత్ ॥**

వేదముల కడవరకు చదివినను, సన్న్యాసాశ్రమము స్వీకరించినను, యజ్ఞము లనేకములు చేసినను, యమనియమాదులు గల్గియున్నను, కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సు చేసినను, నెవనికింద్రియముల నిగ్రహము గలుగదో (హృదయ శుద్ధి గలుగలేదో) అట్టి వారికి పై జెప్పినవన్నియు, నొకానొకప్పు డైనను సిద్ధిని గలుగజేయవు. అనగా ఫలము నివ్వజాలవు.

**సర్వేషామాశ్రమాణాం చ స్వధర్మశ్చ యశః పరమ్ ।**
**స్వధర్మహీనా నరకే పతంతి మూఢచేతసః ॥**

సమస్త ఆశ్రమస్థులకున్ను వారి వారి యాశ్రమమునకు విధింపబడిన ధర్మవిధి యెద్దిగలదో, వారికి అది యిహ మందున్ను, పరమందును యశస్సును గలుగచేయు సుఖము నిచ్చును. మలిన మనస్సు గలవారై, వారి వారి యవస్థకు తగిన యాచరణ లేని మూఢులు నరకబద్ధు లగుదురు.

**గృహకర్మసమాసక్త మహంబ్రహ్మేతి వాదినమ్ ।**
**కర్మ బ్రహ్మోభయభ్రష్టం తం త్యజేదంత్యజం యథా ॥**

దృశ్యవాసనా విషయములో నాసక్తి గల చిత్తము గలవాడై, నేను మహావాక్యోద్బోధితమగు బ్రహ్మమైతినని చెప్పువాడు కర్మబ్రహ్మ ఉభయముల నుండి భ్రష్టుడైనవాడు. అంత్యజునివలె అతడు సత్కర్మములనుండి త్యజింపదగినవాడు.

**అహింసా సత్య మస్తేయం బ్రహ్మచర్యం తపో వ్రతమ్ ।**
**క్షమా దయా చ సంతోషో వ్రతాన్యస్య విశేషతః ॥**

విరక్తులై, బ్రహ్మ నిష్ఠచేయు సాధువుల ధర్మ మీశ్లోకముచే చెప్పబడుచున్నది. ఇదియే వారియొక్క వ్రతమని తలంచుకొనవలెను. అది యేమన? 1. అహింస, 2. సత్యము, 3. పరవస్తువు నపహరింపకుండుట, 4. బ్రహ్మచర్యము, 5. దేహమనోవాక్కుల తపస్సు, 6. తనయొక్క వ్రతమును సంరక్షించుట, 7. ఓర్మి, 8 భూతదయ, 9. ఎల్లప్పుడు సంతోషము గల్గి యుండుట యని గ్రహించుకొనవలెను. ఇక యెక్కువ వ్రాసి యీ గ్రంథమును పెంచదలంచుట లేదు.

**అబ్ధివద్ధృతమర్యాదా భవంతి విగతాశయాః ।**
**నియతిం న విముంచంతి మహాన్తో భాస్కరా ఇవ ॥**

మహాపురుషులు ఎంత మహిమ గలవారైనను తమయొక్క సత్యధర్మమార్గముల నుండి ఒక అడుగైనను తప్పి సంచరించరు. ఒక వాక్యము నైనను అధర్మముగ పలుకరు. సత్యధర్మభిన్నమైన యొక సంకల్పముగూడ చేయరు. సూర్యుడు ఇంత ప్రకాశవంతుడైనను తమయొక్క జ్యోతిశ్చక్రరేఖ నుండి

యెట్లు చలింపకయున్నాడో, సముద్ర మపార మైనదైనను తనహద్దు దాటి ప్రపంచమున నెట్లు ప్రవేశింపకుండునో, మహాపురుషుల చర్యయు నీలాగున నుండెనని వాసిష్ఠములో వసిష్ఠ భగవానులు శ్రీరామచంద్రుల కుపదేశించిరి.

**ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి పౌరుషం ద్వివిధం స్మృతమ్ ।**
**తత్రోచ్ఛాస్త్రమనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్ ॥**

పురుషునియొక్క ప్రయత్నము శాస్త్రీయమనియు, అశాస్త్రీయమనియు నిరు తెగలుగ నుండును. దానియందు శాస్త్రనిషిద్ధముగా నాచరించువారు అనర్థమునకు కారణు లగుదురు. శాస్త్రీయ ప్రకార మాచరించెడి పుణ్య పురుషులు పరమార్థమగు పరమ పదవిని బొందగలరు.

కావున ఋషిసంతతిలో చేరిన పుణ్యజీవులారా! మీరు అట్టి పరమ పురుషులయొక్క చర్యను మరువక ఆచరించి ప్రపంచోద్ధారకులై ముక్తి పదమగు పరమధామమును పొందగల్గుదురుగాక! శ్రీ యేసుక్రీస్తు ఏ సేవ చేసినందుచే నిప్పుడు కోట్లకొలది జనులు వారి పవిత్రనామ ముచ్చరించి లోకసేవ జేయుచున్నారో అది కనుగొనవలయును. అట్లయిన వారు ఈశ్వర సేవయే చేయుచుండినట్లు గోచరము గాగల్గును. శ్రీ మహమ్మదునబి యే సేవ చేసినందుచే నిప్పు డామహాపురుషుని పావననామ ముచ్చరించి కోట్ల కొలది జనులు ఇస్లాంమతము పేరట ప్రపంచసేవ జేయుచున్నారో, యది కనుగొనుటకు ప్రారంభించిన మహమ్మదుగారు పరమేశ్వర సేవయే చేసినట్లు గోచరించును. అందువల్లనే వారికి నీశ్వరశక్తి గల్గి లోకమునకు నీశ్వరజ్ఞాన మును బోధింపగల్గిరి.

శ్రీబుద్ధదేవుని పరమపావనదివ్యనామము నుచ్చరించి కోట్లకొలది బౌద్ధులు బౌద్ధ మతము పేరిటనే లోకసేవ చేయుచున్నారు. అదిన్ని దీర్ఘముగా విచారించిన శ్రీబుద్ధదేవుడు బ్రహ్మచింతనము చేయుటచే గల్గిన ఆత్మశుద్ధి పరమగు మహాశక్తియని జనులు తెలిసికొనగలరు. ఆలాగున శ్రీగురునానక్ యొక్క నిర్మలనామము నుచ్చరించి కోట్లకొలది సిక్కులున్ను, ఉదాసీను

లున్ను, నిర్మలులున్ను లోకోపకారమెట్లు చేయుచున్నారో, అదిన్ని లోతుగా దిగి విచారించిన నానక్‌గారి తపస్సువలన గల్గిన ఆత్మశక్తి ప్రభావమని జను లెరుంగ గలరు. కావున దైవధ్యానములో లయమొందనిచో, తపస్సుచే నాత్మ శుద్ధి గానిచో, యోగనిష్ఠచే ఆత్మప్రబోధము గలుగనిచో, బ్రహ్మనిష్ఠచే హృద యము శుద్ధమై కరుణారసము పొంగి ప్రవహింపనిచో నెవరును లోకమున నే కార్యమును చేయజాలరు. అయితే యిది మతముయొక్క మూలసూత్రమె నను వాడిగల కత్తిపై సామువంటిది. ఇట్టి నిష్ఠగలవారుగూడ వీరికి మార్గదర్శకు లుగా అప్పుడప్పుడు లోకసేవ చేసి చూచుచుండవలయును.

పుష్పము వికసించునపుడు తుమ్మెదల బిలువనక్కర లేదు. అవియే స్వయముగ వచ్చి మధుపానము చేయుచుండును. ఆలాగున మీ హృదయము వికసించి జ్ఞానము గల్గునప్పుడు కోట్లకొలది జనులు రేయిం బవళ్ళు మీ పాదముల వద్ద పడియుండి ధర్మబోధను వినుచు ఆనందామృత పానము చేసి తదేక మగ్నులై యుందురు. కాయ పండునప్పుడే మాధుర్యము గల్గును. దానినే జనులు భుజింతురు గాని, పచ్చిదానిని తినజాలరు. ఆలాగున మీ హృదయమునకు జ్ఞాననిష్ఠలో పరిపక్వము గలుగనిండు! తొందరపడ నక్కర లేదు. అధికారము గల వాక్యములకే విలువ గలదు. తక్కిన వారి వచనములు గాలివంటివి. ఎంతోకాలము చదివి జడ్జి, కలెక్టరు, గవర్నరు, వైస్రాయి యెట్లగుచున్నారో, ఆలాగున మీరున్ను బ్రహ్మవిద్యలో చాల పాఠ ములను జదివి యుత్తీర్ణులు గావలసి యుండును. అధికారము వచ్చువరకు మీ వాక్యములకు విలువ యుండదు. అంతవరకు మీ గంభీరోపన్యాసములు, మందుమాత్రమువేసి గుండు లేని ఫిరంగిశబ్దమువలె నుండును. "దాన మిచ్చుటకు ప్రయాసము లేదు. సామగ్రి సమకూర్చుటకు యత్నము చేయుము." ఇత్యాది ధర్మవాక్యములను అనుభవజ్ఞుల యుపదేశ వాక్యము లను చాల జాగరూకతతో గ్రహించుకొనుడు. బ్రహ్మనిష్ఠలోను, తపస్సులోను, జ్ఞానములోను మీయాత్మ పరిశుద్ధము గానిండు. అప్పుడు మీకు కొద్ది కాలముననే యమోఘమగు లోకోపకారము జేయ శక్తి గల్గును.

విద్యుచ్ఛక్తి యంత్రము ఒకే స్థలములోనే నుండును. దానియందు శక్తి యుండిన ఎన్నియో మైళ్ళ దూరమున దీపములు ప్రకాశించుచు యంత్ర ములు పనిచేయుచుండును. ఆలాగున దైవశక్తి గలవాడవు గమ్ము. అప్పుడు తలంచుకొనిన లోకమున ననేకకోట్ల జనులు లోకోపకారము చేయగలరు. రేడియో యంత్రముతో శబ్దమును ఆకాసమందు కలుపుటచే ఒకే సమయ ములో ప్రపంచములో ననేకకోట్లయంత్రములు మాట్లాడగల్గుట జూచుటలేదా?

ఆలాగున మీ మనస్సు శుద్ధమై ఆకాశమువలె వికసించి వ్యాపకము గానిండు. అప్పుడు ప్రపంచమున ననేకకోట్లజనుల హృదయముల యందది వ్యాపించి మీ సంకల్ప ప్రకారమది పని చేయగలదు. మీ యాత్మను సర్వేశ్వ రునిలో నైక్యమొనర్చి ఏకాకారస్థితి గలిగేలాగున చేయుడు. అప్పుడు ఈశ్వరుడు ఎక్కడెక్కడ వ్యాపించి యుండునో, అచ్చట మీ సంకల్పమున్ను వ్యాపించి పనిచేయగల్గును. పూర్విక ఋషులు సిద్ధపురుషులు ఇటువంటి స్థితి గలవారై యుండిరి. కనుకనే వారి సంకల్పప్రకారము లోకమున జరుగుచుం డెను. అట్టి మహాకార్యమెద్దియో దాని కొరకు యత్నింపుడు. అట్టివారే మనకు నిక్కాలమున గావలసిన వారలు, వారివలన లోకోద్ధారణము గాగల్గును. వట్టి వాక్కులు చెప్పుచుండిన ప్రయోజన మేమియును లేదు. కాన కార్యరంగమున ప్రవేశించి చేయవలసిన కార్యమెద్దియో దానిని చేయుము. అయితే, నేను చేయుచున్నానని సంకల్పము గలుగజేసికొనకుము. నీవు సర్వేశ్వరుని చేతిలో పిల్లనగ్రోవివలె ఆ పరమపురుషుని యాశయమును లోకమున నుపదేశించు టకు పాత్రుడవు గమ్ము. అంతఃకరణము సంపూర్ణముగ శుద్ధమయ్యేలాగున చేసికొమ్ము. అప్పుడు దానిలో గల్గెడు శక్తి కంతము లేదు. అది మహాశ్చర్యకర మైనది. అప్పుడు మీకే అది అత్యద్భుతముగా గోచరము గాగలదు.

శ్రీకృష్ణభగవానులు గీతయందుపదేశించిన పరమప్రమాణ వాక్యమును మీ సన్నిధిలో తెలిపి యీ వ్యాసమును పూర్తి చేయ దలంచుచున్నాను.

**యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః ।**
**న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥**

ఏ మానవుడు శాస్త్రోక్తమైన విధిని అతిక్రమించి తన యిష్టప్రకారము ప్రవర్తించుచుండునో వాడు పురుషార్థమును పొందడు. ఇహలోకమందైన సుఖమును పొందడు. పరలోకమున మోక్షగతి నొందజాలడు. ఇది చేయ వచ్చును, ఇది చేయకూడదు, అని శాసించు నదగుటచే శాస్త్రమని పేరు వచ్చినది. దీని నతిక్రమించి ప్రవర్తించువారు అసురస్వభావు లగుదురు. సత్య ధర్మములతో గూడిన రాజ శాసన ముల్లంఘించిన వారికి దండన తప్పదు. ఆలాగున సత్యస్వరూపుడై ధర్మమూర్తియగు నీశ్వరుని శాసనము నతిక్రమించి స్వేచ్ఛాప్రవృత్తిగల్గి వర్తించువాని కీశ్వరకరుణ యెట్లు గల్గును? వానికి మోక్షము గల్గుట కవకాశము లేదు.

**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।**
**జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥**

అట్టి ఈశ్వరాదేశము సచ్ఛాస్త్రమగుటవలన నీకు చేయగూడిన వానిని, చేయరాని వానిని వేర్పఱచుటయందు శాస్త్రమే ప్రమాణమగును. అట్టి యుత్కృష్ట ప్రమాణమునందు చెప్పబడినదానిని (స్వబుద్ధిచేతను, మహాపురుషుల వాక్యములచేతను) తెలిసికొని, యీ లోకములో (ఈ శరీరముతో నున్నప్పుడు) ఎవరెవరు ఏ నిష్ఠలో, అనుష్ఠానములో వర్తనము గల్గియుండ దగునో దానికి తగిన యాచరణ గలవాడవై యుండుము. అట్లయిన సజ్జన ప్రీతియు, ఋషుల యనుగ్రహమున్ను, ఈశ్వరకృపయున్ను గల్గి ఆత్మలోగల అన్ని దోషములును నశించి విజ్ఞానోదయముగల్గి జ్ఞానమూర్తివి గాగలుగుదువు.

కర్మరహస్య విషయమై పరమాశ్చర్యమగు నొక గాథ గలదు. దీని యందు మనస్సుంచి విచారించిన నెట్టివారికైన భీతి గలుగకమానదు. అంతే గాక హృదయము గభిలుమనును. ఇది మహాతపస్వియగు మాండవ్యఋషిని గురించి నది. భారతము ఆదిపర్వమున గనందగును. బాల్యకాలములో అతి స్వల్పమగు హింసచే నిట్టి మహర్షిసత్తముడు దానియొక్క ఫలమగు గొప్పబాధ ననుభ వింపవలసివచ్చెను. ఇది జూచిన నిప్పుడు నిర్భయులై పాపభీతిలేని

రాతివంటి కఠినుల హృదయముగూడ కరుగకపోవునా! దయాపరులై, ధర్మ బోధకులై, జ్ఞానస్వరూపులై యుండవలసిన గురువులలో కొందరు, గురు పూజలు, గురూపదేశ కాలమున, గురువు వచ్చినప్పుడు ఆరాధన జరుపుట మొదలగు నన్నిటిలోను హింసారూపములగు కార్యముల జేయుచున్నారే? కనుకనే శాస్త్రములో కొన్ని స్థలములలో "తక్కువ జాతిలోనుండు వారిని గురువుగా వరించరాదని"చెప్పినట్లు తోచుచున్నది. మాండవ్యముని చరిత్రము పఠించుడు.

ఇట్టి ఋషియే అట్టి స్వల్పకర్మమును తప్పించుకొన జాలకుండగా నింద్రియ పరవశులై యుండెడు నిట్టి గురువులా కర్మధర్మముల నతిక్రమించు వారలు?

ఇక కర్మరహస్యమును గురించి పద్మపురాణమున చెప్పినది జాడుడు. భృగు విద్యాధరసంవాదము.

## భృగు మహర్షి వాక్యము

**శృణు విద్యాధర శ్రేష్ఠ విచిత్రం కర్మణః ఫలమ్ ।**
**ప్రాప్య ప్రజ్ఞాన ముహ్యంతి ముహ్యంతి జ్ఞానచేతసః ॥**

**మక్షికాపాదమాత్రం తు యథా హి విషమం విషమ్।**
**క్రియా తు విహితాఽల్పాపి విపాకే దారుణా భవేత్ ॥**

**అణుమాత్రం విషం యత్తద్గ్రాహ కాలే లవాగ్నివత్ ।**
**తథైవానుభవే లోకే మహాపీడాం కరోతి హి ॥**

**తథైవ పాతకం కర్మ క్రియాకాలేఽల్పమేవ యత్ ।**
**తద్భోగసమయే కర్తుర్విపాకే మేరుతాం వ్రజేత్ ॥**

ఓ విద్యాధరోత్తమా! కర్మఫలము మిగుల విచిత్రమైనది. చెప్పెద వినుము. మిగుల తెలివిగలవారు గూడ కర్మకు లోబడి కష్టపడుచున్నారు.

ఈగకాలుమాత్రము మిగుల స్వల్పమైనను విషము మిగుల చెడ్డది. పనులు చేయునపుడు స్వల్పముగా నున్నప్పటికిన్ని అవి అనుభవ కాలమప్పటికి మిగుల దారుణము లగును. విషము అణుమాత్రము పుచ్చుకొనిన అనుభవ కాలము నకు స్వల్పమగు అగ్నివిశేషముగ ప్రజ్వలించునట్లు విశేషబాధను కలిగంచును. అదేరీతిగా పాపకార్యము చేయునప్పుడు మిగుల స్వల్పముగ నున్నప్పటికిన్ని అనుభవకాలము వచ్చునప్పటికి మేరుపర్వతమువలె మిగుల గొప్పది యగును. మరియు మఱ్ఱివిత్తనము సన్నగా నున్నప్పటికిన్ని వృక్షమగునపు డెంత గొప్పగా పరిణమించునో, పాపకర్మము నటువంటిదే. అది చేయునప్పుడు కొంచెముగ గనుపించినను ఫలానుభవమునకు వచ్చునప్పుడు మహత్తుగా పరిణమించు నని మరువకుడు.

ఉపనిషత్తులలో బ్రహ్మనిష్ఠులగు ఋషులు ఏలాగున ప్రార్థనచేసి కొన్నారో యే గుణములు తమకుండరాదో, యే గుణము లుండవలసిన వియో, అవి యీ శాంతిమంత్రముచే ముముక్షువులు, బ్రహ్మనిష్ఠులు తెలుసు కొనగలరు.

**ఓమ్ ఆప్యాయంతు మమాఙ్గాని, వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్ర**
**మథో బలమింద్రియాణి చ సర్వాణి, సర్వం బ్రహ్మోపనిషదం,**
**మాహం బ్రహ్మనిరాకుర్యాం మా మా బ్రహ్మనిరాకరో దనిరా**
**కరణ మస్త్వనిరాకరణం మే అస్తు తదాత్మని నిరతే, య ఉపనిషత్సు**
**ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు.**

**ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.**

మమ = నాయొక్క, అంగాని = అవయవములును, వాక్ = వాక్కును, ప్రాణః = ప్రాణమును, చక్షుః = నేత్రమును, శ్రోత్రం = చెవియును, అథో బలం=మనోబుద్ధి, చిత్తాహంకారములతో గూడిన అంతరింద్రియములున్ను, సర్వాణి = అన్ని, ఇంద్రియాణి చ = ఇంద్రియములును, ఆప్యా యంతు = తృప్తిని బొందునుగాక (ఈ సర్వేంద్రియములున్ను అవయవములున్ను దైవ

ప్రీతికరములై ధర్మయుక్తములగు కార్యములలో ప్రవర్తించి పరిశుద్ధములై సంతుష్టి గలవై యుండునుగాక), ఉపనిషదం = వేదాంత ప్రతిపాద్యమైన బ్రహ్మస్వరూపము, సర్వం = సకలమగును. (పై చెప్పేలాగున యింద్రియ ములు శుద్ధములైనచో నిదియంతయు బ్రహ్మమయమను జ్ఞానము గల్గును) అహం = నేను, బ్రహ్మ = పరబ్రహ్మమును, మా నిరాకుర్యాం = నిరాకరించ కుందును గాక. (పరమాత్మను విడిచి యుండకుందును గాక), మా = నన్ను, బ్రహ్మ = పరబ్రహ్మము, (పరమాత్మ) మా నిరాకరోత్ = నిరాకరించక యుండును గాక! అనిరాకరణం = ఆదరము, అస్తు = గల్గుగాక, మే = నాకు, అనిరాకరణం = విశ్వాసము, అస్తు = అగుగాక, తత్ = ఆ, ఆత్మని = బ్రహ్మ మందు, నిరతే = నిరంతరాసక్తి గల, మయి = నా యందు, యే = ఏ, ఉపనిషత్సు = ఉపనిషత్తులలో చెప్పబడిన, ధర్మాః = భక్తిజ్ఞాన వైరాగ్య బోధోపరతులుగలవో, తే = అవి, మయి = నా యందు, సంతు = (ఎల్లప్పుడు) గల్గియుండుగాక, ఓమ్ = ప్రణవస్వరూపమగు పరబ్రహ్మమా! శాంతి శ్శాంతి శ్శాంతిః = బాహ్యవిఘ్నములు, అంతరంగ విఘ్నములు, ఆత్మైక జ్ఞాన విఘ్నములగు మూడింటిని పరిహరింతువుగాక. (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక ఆధిదైవిక దుఃఖములను శమింపచేయుదువుగాక!) స్థూల సూక్ష్మ కారణ దేహములయొక్క దోషములను రహితమొనర్తువుగాక! మనోవాక్కాయకర్మల మాలిన్యములను తొలగింతువు గాక!

**లోకాస్సమస్తా స్సుఖినో భవంతు**

**ఓం తత్సత్, ఓమ్.**

